# మహాభారతం

## వ్యాసప్రోక్తం

### ఆరో సంపుటం — ఉద్యోగపర్వం

వాడుకభాష

## శ్రీ శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి



ప్రకాశకులు: అద్దేపల్లి అండ్ కో
సరస్వతీ పవర్ ప్రెస్
రాజమహేంద్రవరము

# ప్రకాశకుల మనవి

మహాభారతం భారతీయుల పంచమవేదం; విజ్ఞానసర్వస్వం. వ్యాస ప్రోక్తమైన ఈ మహాగ్రంథం సంస్కృతం నుంచి శ్రీ శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రిగారు సరళమయిన చక్కని వ్యావహారికాంధ్రంలో అనువదించారు.

ఆంధ్రజాతిని ఉజ్జీవింపజేయడం కోసమే నన్నయభట్టారకుడు వ్యాసభారతం తెలుగుచేశాడు. అదే మహాశయంతో శాస్త్రిగారున్నూ ఇది వ్యావహారికంలో రాశారు. ఇది ప్రకటించి ఆంధ్ర సోదరుల కందించడానికి మాకున్నూ ఈ ఆశయమే ప్రోత్సాహం కలిగించింది.

విరాటపర్వంతో మహాభారత ప్రచురణ ప్రారంభించాము. [illegible] ఉద్యోగపర్వం. క్రమంగా ఆది సభా పర్వాలూ, తక్కిన పర్వాలూ సంపుటాలుగా ప్రచురిస్తున్నాము. ఆంధ్రుల ప్రత్యేకాభిమాన గ్రంథమయిన మహాభారతం ఆంధ్ర ప్రజానీకం ఆదరించి మాకు ప్రోత్సాహం కలిగిస్తుందని ఆశిస్తున్నాము.

**రాజమహేంద్రవరం**
1958 జూలై

అడ్డేపల్లి నాగేశ్వరరావు
ప్రకాశకుడు

---

తరువాత, ఆదిపర్వం, సభాపర్వం వరుసగా వెలువడుతాయి.

# మహాభారతం

## ఉద్యోగపర్వం

నారాయణం నమస్కృత్యం నర చైవ నరోత్తమమ్
దేవీం సరస్వతీం చైవ తతో జయ ముదీరయేత్ ॥

శ్రద్ధగా వినమని, వైశంపాయనుడు, జనమేజయునకిలా చెప్పసాగ వచ్చాడు.

అభిమన్యుని వివాహం దేవేంద్రవైభవంగా జరిగింది. పాండవులూ వారి బంధువులూ మిక్కిలి ఆనందించారు.

ఆరాత్రంతా బాగా విశ్రమించి, మర్నాటి పొద్దున్న విరటరాజు సభకు వచ్చారు వారందరూ. సభాభవనం అంతా గొప్పగొప్ప ఆసనాలు నిండివున్నాయి. మరెక్కడా కనపడని గొప్పగొప్ప చిత్రపటాలున్నూ ఎన్నో వున్నాయక్కడ. రత్నాల జాలరులతోనూ, పూల దండలతోనూ చాలా రమ్యంగా వుందా సభాభవనం. రకరకాల పువ్వుల పరిమళంతోనూ, అత్తరుల ఘుమఘుమలతోనూ చక్కగా గుబాళిస్తూ వుందది. యాదవులూ పాండవులూ వారి బంధులున్నూ మాత్రమే కాక, ఉభయపక్షులకూ చెందిన రాజులున్నూ చేరివున్నారక్కడ.

అందరికీ ముందుగా విరటరాజూ ద్రుపదమహారాజూ మంచిమంచి ఉన్నతాసనాలమీద కూచున్నారు. వసుదేవుడున్నూ ఆవరసలోనే వున్నాడు, వారికి దగ్గిరగా. వారిలో ద్రుపదమహారాజు దగ్గిరగా సాత్యకితో బలరాముడూ, విరటరాజు దగ్గిరగా ధర్మరాజుతో శ్రీకృష్ణుడూ

---

తరువాత, ఆదిపర్వం, సభాపర్వం వరుసగా వెలువడుతాయి.

# మహాభారతం

## ఉద్యోగపర్వం

నారాయణం నమస్కృత్యం నర చైవ నరోత్తమమ్
దేవీం సరస్వతీం చైవ తతో జయ ముదీరయేత్ ॥

శ్రద్ధగా వినమని, వైశంపాయనుడు, జనమేజయునకిలా చెప్పుకు వచ్చాడు.

అభిమన్యుని వివాహం దేవేంద్రవైభవంగా జరిగింది. పాండవులూ వారి బంధువులూ మిక్కిలీ ఆనందించారు.

ఆరాత్రంతా బాగా విశ్రమించి, మర్నాటి పొద్దున్న విరటరాజు సభకు వచ్చారు వారంతానూ. సభాభవనం అంతా గొప్పగొప్ప ఆసనాలు నిండివున్నాయి. మరెక్కడా కనపడని గొప్పగొప్ప చిత్రపటాలున్నూ ఎన్నో వున్నాయక్కడ. రత్నాల జాలరులతోనూ, పూలదండలతోనూ చాలా రమ్యంగా వుందా సభాభవనం. రకరకాల పువ్వుల పరిమళంతోనూ, అత్తరుల భుగభుగలతోనూ చక్కగా గుబాళిస్తూ వుందది. యాదవులూ పాండవులూ వారి బంధులున్నూ మాత్రమే కాక, ఉభయపక్షులకూ చెందిన రాజులున్నూ చేరివున్నారక్కడ.

అందరికీ ముందుగా విరటరాజూ ద్రుపదమహారాజూ మంచిమంచి ఉన్నతాసనాలమీద కూచున్నారు. వసుదేవుడున్నూ ఆవరసలోనే వున్నాడు, వారికి దగ్గిరగా. వారిలో ద్రుపదమహారాజు దగ్గిరగా సాత్యకితో బలరాముడూ, విరటరాజు దగ్గిరగా ధర్మరాజుతో శ్రీకృష్ణుడూ

కూచున్నారు. రూపంలోనూ బలంలోనూ పరాక్రమంలోనూ తమతమ తండ్రులతో సమానులూ, మహావీరులూ అయిన భీమార్జుననకులసహదేవులూ, ద్రుపదపుత్రులూ, ప్రద్యుమ్నుడూ, సాంబుడూ, గదుడూ— విరాటుని కొడుకులతోపాటు అభిమన్యుడూ, ద్రౌపది కొడుకులు కూడా గొప్పగొప్ప ఆసనా లలంకరించివున్నారు.

వారందరూ ఎన్నెన్నో రత్నాల సొమ్ములు ధరించివున్నారు. వారు కట్టిన బట్టలన్నీ జలతారు ముద్దలు. అంచేత గొప్ప గ్రహతారలతో నిండివుండిన నీలాకాశం లా వుందా సభాభవనం.

కొంతసేపు వారంతా ప్రీతిగా మాట్లాడుకున్నారు. చిత్రవిచిత్రాలయిన కథలున్నూ చెప్పుకున్నారెన్నో. తరవాత, శ్రీకృష్ణుడికేసి చూస్తూ మాట్లాడకుండా కూచున్నారు.

శ్రీకృష్ణుడు మెల్లిగా అందుకున్నా డప్పుడు.

"మనమందరమూ పాండవుల సంగతి ఆలోచించడాని కిప్పుడిక్క డ సమావేశం అయినాము. శకుని, ధర్మరాజుకీ దుర్యోధనుడికీ నడుమ జూదం కల్పించాడు. అందులో మోసమున్నూ చేశాడెంతో. అంచేత తనే మిక్కిలీ నేర్పు కలవాడయ్యుండిన్నీ, ధర్మరాజు, తనకున్న దంతా ఓడిపోయా డందులో. అయితే, ఎంతెంతలేసివాళ్ళనీ కూడా నాశనం చేసెయ్యగల శక్తి వుందతనికి; కాని అధర్మాన్ని కొడిగట్టనే డతను. కనకనే, పన్నెండేళ్ళరణ్యవాసమూ, ఒకయే డజ్ఞాతవాసమూ కూడా పూర్తిచేసుకున్నా డతను, మాట తప్పకుండానూ, నిశ్చింతగానూ. ఇదంతా మీ కందరికీ తెలిసిన సంగతే.

అరణ్యాల్లో తిరుగుతున్నప్పుడూ, అజ్ఞాతవాసం పూర్తిచేసుకునే టప్పుడూ గూడా ఎన్నో చిక్కులు వచ్చాయి వారికి. ఎంతెంతలేసి బాధలో కలిగాయి. అయినా, మాట తప్పించుకోలేదు వారు.

మరి, యిక జరగవలసిం దేమిటి? కౌరవరాజ్యం యిప్పు డింత పెరిగి వుండడాని క్కారణం, ఆదిలో, పాండురాజూ, తరవాత అతని కొడుకు లున్నూ. ఇ దెవరూ కాదన లేరు. కాగా, పాండవులు తమ భాగం తామేలుకోవా లని నిశ్చయించుకున్నా రిప్పుడు. ఇదిన్నీ యెవరూ అధర్మం అన లేరు. పోతే, ఇక మీ రందరూ చెయ్యాలసిన పని ధర్మరాజుకీ దుర్యోధనుసికీ శ్రేయస్కర మైన వొక పద్ధతి యేర్పాటు చెయ్యడం. అది ధర్మబద్ధంగా వుండా లి, అం తే.

ధర్మరాజుకి ధర్మం అంటే యెంత యిష్టమో, అది తప్పకూడ దని అత నెంత దృఢంగా వ్రతంపట్టివున్నా డో, అది విడిచిపెట్టకుండా యెంత నిక్కచ్చిగానున్నూ అతను నడుచుకుంటున్నా డో— ఇవన్నీ మీ కందరికీ బాగా తెలుసు, నేను వివరించి చెప్పనక్కరలేదు. అధర్మంగా స్వర్గ రాజ్యం లభించినా అంగీకరించ డతను. ధర్మం తప్పకుండా వొక్క గ్రామమే తనకి లభ్యం అయినా మనస్ఫూర్తిగా తృప్తిపడతాడు కూడా. ఈవిషయమై యెవరికీ సందేహం అక్కర్లేదు. అయి తే, ఈసం దర్భంలో కూడా మళ్లీ మోసమూ, వంచనా — ఇలాంటివి తటస్థపడి తే మాత్రం యిక సహించడు. ఇది అందరూ గుర్తించుకోవాలి, బాగా.

దుర్యోధనాదులు మొదణ్ణుంచీ పాండుపుత్రుల నెన్నో విధాల పీడిం చారు. చంపడానికిన్నీ ప్రయత్నాలు చేశారు వారు. ఇదిన్నీ మీకు పూర్తిగా తెలుసు. కనక, దుర్యోధనుని రాజ్యలోభమూ, ధర్మరాజు ధర్మనిరతీ, వారి ఉభయులతోనూ బంధుత్వం వుండడంవల్ల ఇప్పుడు మనమీద పడివుండిన బాధ్యతా — ఇవి మీరు బాగా జ్ఞాపకం వుంచు కోవాలి. ఈదృష్టితో యోచించాలి మన మిప్పుడు కార్యక్రమం. ఇది సుఖసుఖాల విడిపోయే సమస్య కాదు. మన మందరమూ యెవరికి వారుగానూ, అంతా కలిసి వొక్కటిగానూ ఆలోచించి పరిష్కరించ వలసిన విషయం యిది.

# 2

## బలరాముడు

“తమ్ముడు చెప్పింది మీరంతా విన్నారు బాగా. అది మిక్కిలి ధర్మంగానూ వుంది, వ్యవహారం సరళంగా పరిష్కారం కావడాని కనువుగానూ వుంది. ఇటు ధర్మరాజు కెంత శ్రేయస్కరమో అటు దుర్యోధనునికీ అంత శ్రేయస్కరమే తమ్ముడు చెప్పింది. పాండుపుత్రులు సగం రాజ్యం వదులుకుంటున్నారు. తక్కిన సగంతోనే తృప్తిపడ్డానికి సిద్ధపడుతున్నారు వారు. చాలా గొప్పవిషయం యిది. మనం బాగా గమనించవలసిందిన్నీ. దుర్యోధనుడున్నూ, మంచిచెడ్డలూ కష్టసుఖాలూ లాభనష్టాలూ బాగా ఆలోచించుకుని వారి సగమూ వారికిచ్చెయ్యడమే మంచిది. అందువల్ల అతనూ పాండుపుత్రులున్నూ మాత్రమే కాదు, మనమున్నూ సుఖపడతాము.

ఇలాగ, వారూ వీరూ కూడా సగంసగం రాజ్యాలతో తృప్తిపడి, వొకరితో వొకరు కలిసిమెలిసివుంటే జనులకున్నూ శాంతీ సుఖమూ ఆనందమూ కలుగుతాయి. ఇది నిజంగా, ఉభయతారకమైన మార్గం. కనక, యిప్పుడక్కడి కొక దూత వెళ్లడం మిక్కిలీ అగత్యమే, సందేహం లేదు.

అయితే, అక్కడికి వెళ్లినమనిషి చాలా జాగ్రత్తగా మాట్లాడాలి. ముందు కురువృద్ధుడైన భీష్ముణ్ణి మంచిమాటచేసుకోవాలి. కౌరవ సభలో ధృతరాష్ట్రుణ్ణీ, ద్రోణాచార్యుణ్ణీ, అశ్వత్థామనీ, విదురుణ్ణీ, కృపాచార్యుణ్ణీ, శకునినీ, కర్ణుణ్ణీ ఆకట్టుకోవాలి. ధృతరాష్ట్రుని కొడుకులు దుర్యోధనుడూ, దుశ్శాసనుడూ మొదలైనవా రందరూ మహావీరులు. రాజనీతిన్నీ బాగా తెలిసినవారు. ఇంకా యెందరో కూడా వున్నారు పెద్ద లక్కడ. అంచేత, ఆ వెళ్లినవాడు, వారందరూ నిండివున్న కౌరవ

బాగా జ్ఞాపకంచేసుకోండి మళ్లీ వొకమాటు. పాండవు లెప్పుడూ సత్యం విడిచిపెట్టలేదు. ధర్మమున్నూ తప్పలేదు. పందెం ప్రకారం తూచాలు తప్పకుండా నడుచుకున్నారు కూడా. కనక, ధృతరాష్ట్రుని కొడుకు లిప్పుడున్నూ అక్రమంగా పవర్తిస్తారా, చాలాచాలా చిక్కులు వస్తాయి. పాండుపుత్రులు అన్యాయమే కాదు, ఆలస్యమున్నూ సహించలేరిక. ముక్కుకి సూటిగా వ్యవహారం పరిష్కారం అవుతుందా, సంతోషమే. లేదూ? వరసబెట్టి అందరినీ సంహరించివేస్తారు వారు, ఒక్కరినీ విడిచిపెట్టరు. వారసహాయశూరులు గాని అసహాయులు కారు. ఎందరో స్నేహితులున్నారు వారికిన్నీ. ఆస్నేహితులున్నూ మహాశూరులు. పాండవులకోసం ప్రాణాలున్నూ సంతోషంగా విడిచిపెట్టడానికి సిద్ధంగా వున్నవారు వారు. ధర్మరాజు సెలవయిందా, కార్చిచ్చులా విజృంభించి, దుర్యోధనాదులనే కాదు, తమ కడ్డంవచ్చేవా రెవరైనా సరే బుగ్గి చేసేస్తారు వారు, నిమిషంలో.

ఇంతకీ, — దుర్యోధనుని ఆలోచన యేమిటో మన కెవ్వరికీ తెలియదు. ఎదటివారి వుద్దేశాలు తెలుసుకోకుండా ఎటు సాహసించడానికీ వీలు లేదు కదా? కనక, మన మిప్పు డొక దూతని అతని దగ్గిరికి పంపడం మంచి దనుకుంటా న్నేను. ఆదూత, ధర్మశీలీ, శుచీ, కులీనుడూ, సమర్థుడూ అయివుండాలి. మిక్కిలీ జాగ్రత్త గలవాడున్నూ అయి వుండా లతను. అతను వెళ్ళి చెయ్యవలసినపని దుర్యోధనాదులను మంచి దారికి తీసుకురావడం. పాండవుల కర్ధరాజ్యం లభించేటట్టులున్నూ చెయ్యడం”

ఇదంతా విన్నా రందరూ. ఇది ధర్మబద్ధంగానే కనపడింది బలరామునికి. ఎవరి యెడలా పక్షపాతదృష్టి లేనట్టు కనపడిం దతని కిందులో. దీనిమీద మెల్లిగా అందుకున్నా డతను.

# 2

## బలరాముడు

“కృష్ణుడు చెప్పింది మీరంతా విన్నారు బాగా. అది మిక్కిలి ధర్మంగానూ వుంది, వ్యవహారం సరళంగా పరిష్కారం కావడానికనువుగానూ వుంది. ఇటు ధర్మరాజు కెంత శ్రేయస్కరమో అటు దుర్యోధనునికీ అంత శ్రేయస్కరమే కృష్ణుడు చెప్పింది. పాండుపుత్రులు సగం రాజ్యం వదులుకుంటున్నారు. తక్కిన సగంతోనే తృప్తిపడ్డానికి సిద్ధపడుతున్నారు వారు. చాలా గొప్పవిషయం యిది. మనం బాగా గమనించవలసిందిన్నీ. దుర్యోధనుడున్నూ, మంచిచెడ్డలూ కష్టసుఖాలూ లాభనష్టాలూ బాగా ఆలోచించుకుని వారి సగమూ వారికిచ్చెయ్యడమే మంచిది. అందువల్ల అతనూ పాండుపుత్రులున్నూ మాత్రమే కాదు, మనమున్నూ సుఖపడతాము.

ఇలాగ, వారూ వీరూ కూడా సగంసగం రాజ్యాలతో తృప్తిపడి, వొకరితో వొకరు కలిసిమెలిసివుంటే జనులకున్నూ శాంతీ సుఖమూ ఆనందమూ కలుగుతాయి. ఇది నిజంగా, ఉభయతారకమైన మార్గం. కనక, యిప్పు డక్కడికి కొక దూత వెళ్లడం మిక్కిలీ అగత్యమే, సందేహం లేదు.

అయితే, అక్కడికి వెళ్లినమనిషి చాలా జాగ్రత్తగా మాట్లాడాలి. ముందు కురువృద్ధుడైన భీష్ముణ్ణి మంచిమాటచేసుకోవాలి. కౌరవ సభలో ధృతరాష్ట్రుణ్ణీ, ద్రోణాచార్యుణ్ణీ, అశ్వత్థామనీ, విదురుణ్ణీ, కృపాచార్యుణ్ణీ, శకునినీ, కర్ణుణ్ణీ ఆకట్టుకోవాలి. ధృతరాష్ట్రుని కొడుకులు దుర్యోధనుడూ, దుశ్శాసనుడూ మొదలైనవా రందరూ మహావీరులు. రాజనీతినిన్నీ బాగా తెలిసినవారు. ఇంకా యెందరో కూడా వున్నారు పెద్ద లక్కడ. అంచేత, ఆ వెళ్లినవాడు, వారందరూ నిండివున్న కౌరవ

సభలో చాలా వినయంగా మాట్లాడాలి. పాండుపుత్రుల కార్యం సాధించడమే ప్రధానంగా చూసుకోవాలి; గాని మరోవిధంగా మసులుకోరాదు. ఏవిధంగానూ వారికి కోపం రాకుండా చూసుకోవాలి. ఏమంటే? సర్వమూ వారికి స్వాధీనభుక్తాల్లో వుంది. జూదంలో నేర్పుచాలక ధర్మరాజు తన రాజ్యం వోడిపోయాడు. మర్యోధ నుణ్ణి పెద్దలు వారించారు. సహజంగా, అతనికిన్నీ జూదంలో నేర్పు చాలదు. అంచేత, తన పక్షంగా ఆడమని శకునిని కోరుకున్నా డతను. అక్కడ మరికొందరున్నూ నిపుణు లున్నారు. అయినా వారి నందరిని విడిచి, ధర్మరాజున్నూ ఆటకి రమ్మని శకునినే పిలిచాడు. చివరికి తని చేతిలో తనకున్న దంతా వోడిపోయాడు. అంతకంతకు స్థితి విష మిస్తూ వుండినా వెనుదియ్యలే దతను. మళ్లీమళ్లీ వొడ్డాడు. సర్వమూ కోల్పోయాడు.

ఇందులో శకుని తప్పేం వుంది? కనకనే అక్కడికి వెళ్లినవాడు ధృతరాష్ట్రునితో బహూ వినయంగా మాట్లాడా లనడం నేను. వారధర్మపరు లని సూచనగా అయినా అనరాదు. యుద్ధంవల్ల ఏమీ ప్రయోజనం లేదు. ఇప్పుడు పాండుపుత్రులకు సామోపాయం తప్ప మరేమీ పనికిరాదు. అది తప్పిస్తే ఉన్న గోడు కూడా చెడుతుంది"

బలరాము డిలా చెప్పాటప్పటికి సాత్యకి మండిపడిపోయాడు. గభీమని లేచి "అలా పనికిరా" దంటూనూ ప్రారంభించాడు, దురుసుగా.

## 3

### సాత్యకి

"అన్నా, బలరామా! తన అంతరాత్మ యెలాంటిదో అలాంటి మాట లాడతా డెవ డయినా. నువ్వున్నూ యిప్పుడు సరిగా అలాగే మాట్లాడావు. పురుషుల్లో కొందరు శూరులూ వున్నారు, కొందరు

పేడివాళ్ళూ వున్నారు. ఒక చెట్టుకొమ్మల్లోనే వొకటి కాస్తుంది, వొకటి గొడ్డుపోతుంది. అలాగే కొందరు శూరులుగానూ, మరికొందరు పేడివాళ్లుగానూ వొక్క కుటుంబంలోనే పుట్టవచ్చు, మళ్ళీ. నిజంగా, నువ్విలా అన్నందు గ్గాదు, వీరందరూ నీమాటలు విన్నందుకు మంటగా వుంది నాకు. నిర్దోషి అయిన ధర్మరాజు విషయమై ఇలా అనడానికి నీకీ పరిషత్తులో అవకాశం దొరకడం యేమీ బాగాలేదు.

దుర్యోధనాదు లేమో జూదం మర్మాలన్నీ బాగా తెలిసినవారు. సమర్థులు కూడాను. మరి, ధర్మరాజు? సరదా వుందే గాని సామర్థ్యం లే దతనికి. మర్మా లసలే యెరగడు. శ్రద్ధకూడా లేదతనికి కావలసినంతా. అలాంటివాణ్ణి పడగొడితే అది దుర్యోధనునికి ధర్మజయం అవుతుందా? తమ్ములతో గూడా అతను తన యింట్లో వుండినప్పుడు వెళ్ళి వా రాజూదం ఆడివుండవలసింది. అప్పుడు జయించుకుంటే అది ధర్మజయం అయివుండేది. ధర్మరాజు క్షత్రియధర్మం తప్పనివాడు. దుర్యోధనుడు మోసం చేశాడు. దగా చేశాడు. అక్రమాలు చేసి జయించాడు. ఆ జయమూ వొక జయమేనా?

మాట తప్పకుండా అరణ్యవాసమూ అజ్ఞాతవాసమూ పూర్తి చేసుకు వచ్చారు పాండుపుత్రులు. తమ తండ్రి సంపాదించిన రాజ్యం పందెం ప్రకారం స్వాధీనపరుచుకుంటారుగాని చేతులు కట్టుకుని వొకళ్లొందుకు యాచిస్తారూ వారు? అజ్ఞాతవాసం చేశాటప్పుడు వారి నెవరూ గుర్తించలేకపోయారు. ద్రోణుడు చెప్పాడు. విదురుడు చెప్పాడు. తుదకు భీష్ముడున్నూ చెప్పాడు. దుర్యోధనాదులు విన్నారా? పాండవుల రాజ్యం పాండవులకిచ్చారా?

కనక, వరసపెట్టి చితగ్గొట్టి వారి నందరినీ ధర్మరాజు కాళ్ళమీద పడేస్తా న్నేను. అప్పుడున్నూ వారు ధర్మమార్గం తొక్కరు. తమ మంత్రులతోగూడా యమలోకానికి దయచేస్తారు. వజ్రవేగం కంటేనూ

యెక్కువది నాఖడ్గవేగం. దుర్యోధనాదుల్లో వొక్కడున్నా దానికి తట్టుకోలేరు. గాండీవం చేతపట్టాడంటే అర్జునుడూ, చక్రం చేతపట్టాడంటే జనార్దనుడూ, గద చేత పట్టాడంటే భీమసేనుడూ కూడ వొక్కొక్కరే వారి నందరినీ నాశనం చెయ్యగలరు. వారి దాకా యెందుకూ? యముణ్ణీ కాలుణ్ణీ పోలిన నకులుణ్ణీ సహదేవుణ్ణీ యెవ రెదిరించగలరూ? అలాంటివారే విరటుడూ ద్రుపదుడూను, వారిని మాత్రం యెదిరించి యెవరు నిలవగలరూ? ధృష్టద్యుమ్నుణ్ణి తేరిచూడ్డం మాత్రం యెవరికి శక్యమూ?

ఇక ద్రౌపది కొడుకు లున్నారు. వారందరూ ఆమె కీర్తికి పతాకలు తమతమ తండ్రుల కెందునా తీసిపోనివారు. తమలో తామున్నా సమానులు. బలవీర్యపరాక్రమాలలోనూ శౌర్యధైర్యాలలోనూ కూడా వారు సమానులు. వారేకాదు, దేవతలున్నా యెదిరించలేని అభిమన్యు డున్నాడు. కాలుణ్ణి మించే గదుడూ, సూర్యుణ్ణి మించే ప్రద్యుమ్నుడూ, అగ్నిని మించే సాంబుడూ వున్నారు. మేమందరమూ దుర్యోధనుణ్ణి నిమషంలో సంహరించేస్తాం. శకునినీ కర్ణుణ్ణీ మట్టుపెట్టేస్తాం. వెంటనే పట్టాభిషిక్తుణ్ణిచేసి యీవిశాలరాజ్యం అంతా ధర్మరాజుకి స్వాధీన పరుస్తాంకూడా.

ధర్మం తప్పిన శత్రువులను సంహరిస్తే లేశమూ దోషం అంటదు. కాక, శత్రువులను దేవురించడం అపకీర్తికరమూ అధర్మమూ కూడాను. కనక మన మందరమూ బాగా కనుగలిగివుండా లిప్పుడు. ధర్మనందనుని కోరిక ఏమిటో అదితప్పకుండా తీర్చాలి. ఒక్కమాట చెబుతాను చివరికి. దుర్యోధనుడు ధర్మరాజుకి అర్ధరాజ్యం అయినా యివ్వాలి, లేకపోతే, నాచేతిలో సర్వనాశనం అయినా పొందాలి, మరో దారి లేదతనికి.

# 4

## ద్రుపదుడు

"అలాగే జరుగుతుంది చివరికిది" అంటూ ప్రారంభించాడు, సాత్యకి మాటమీద ద్రుపదుడు.

" దుర్యోధనుడు మంచిమాటలతో దారికి రాడు. మెత్తమెత్తగా మాట్లాడితే రాజ్యమూ ఇవ్వడు. పోనీ, ధృతరాష్ట్రుణ్ణి చూదామా అంటే కొడుక్కి అడ్డుచెప్పలేడతను. దుర్యోధనుని అన్నం తింటు న్నారు కనక, భీష్ముడూ ద్రోణుడూ కూడా అతని కెదురాడలేరు. కర్ణుడూ శకునీ పరమమూర్ఖులు. కనక, వాళ్ళూ అతని కెదురుచెప్పరు. అంచేత బలరాముడు చెప్పింది నాకేమీ నచ్చలేదు. మనం అక్కడికి దూతని పంపవలసిందే, ఒప్పుకుంటాను; కాని వెళ్ళినవాడు మెత్త మెత్తగా మాట్లాడగూడదు, బింకంగానే మాట్లాడాలి.

ఏమంటే ? దుర్యోధనుడు పాపబుద్ధి. గాడిదల విషయమై మెత్తగా వుండాలనడం యెలాంటిదో, ఆవులవిషయమై కఠినంగా వుండాలనడ మున్నూ యెలాంటిదో, దుర్యోధనుని విషయమై మృదువుగా వుండా లనడమూ అలాంటిదే. మృదువుగా మాట్లాడితే, అతగాడు, చేతగానివా ళ్ళనుకుంటాడు. అది తనకి జయం అనిన్నీ అనుకుంటాడు.

కనక, మనం వెంటనే సన్నాహాలు చేసుకోవాలి. క్షణం అయినా ఆలస్యంచెయ్యకుండా రాజులకందరికీ రాయబారాలున్నూ పంపాలి మనం. దుర్యోధను డిప్పటికే యిది ప్రారంభించివుంటాడేమో కొంప తీసి. ముందు కోరినవారికి సాయంచెయ్యడం సత్పురుషుల పద్ధతి. కనక, మనం త్వరపడాలి.

ఇది పెద్దకార్యం. పెద్దయెత్తున ప్రయత్నాలు సాగిస్తేగాని సాధ్య పడేది కాదు. శల్యుడూ, ధృష్టకేతువూ, జయత్సేనుడూ, కేకయుడూ,

ఎక్కువది నాఖడ్గవేగం. దుర్యోధనాదుల్లో వొక్కడున్నా దానికి తట్టుకోలేరు. గాండీవం చేతపట్టాడంటే అర్జునుడూ, చక్రం చేతపట్టాడంటే జనార్దనుడూ, గద చేత పట్టాడంటే భీమసేనుడూ కూడా వొక్కొక్కరే వారి నందరినీ నాశనం చెయ్యగలరు. వారి దాకా యెందుకూ? యముణ్ణీ కాలుణ్ణీ పోలిన నకులుణ్ణీ సహదేవుణ్ణీ యెవరెదిరించగలరూ? అలాంటివారే విరటుడూ ద్రుపదుడూను, వారిని మాత్రం యెదిరించి యెవరు నిలవగలరూ? ధృష్టద్యుమ్నుణ్ణి తేరిచూడ్డం మాత్రం యెవరికి శక్యమూ?

ఇక ద్రౌపది కొడుకు లున్నారు. వారందరూ [illegible] లు తమతమ తండ్రుల కెందునా తీసిపోనివారు. రూపంలో [illegible] సమానులు. బలవీర్యపరాక్రమాలలోనూ శౌర్యధైర్యాలలోనూ కూడా వారు సమానులు. వారేకాదు, దేవతలున్నా [illegible] అభిమన్యుడున్నాడు. కాలుణ్ణి మించే గదుడూ, సూర్యుణ్ణి మించే ప్రద్యుమ్నుడూ, అగ్నిని మించే సాంబుడూ వున్నారు. మేమందరమూ దుర్యోధనుణ్ణి నిమషంలో సంహరించేస్తాం. శకునినీ కర్ణుణ్ణీ మట్టుపెట్టేస్తాం. వెంటనే పట్టాభిషిక్తుణ్ణిచేసి [illegible] ధర్మరాజుకి స్వాధీన పరుస్తాంకూడా.

ధర్మం తప్పిన శత్రువులను సంహరిస్తే లేశమూ దోషం అంటదు. కాక, శత్రువులను దేవురించడం అపకీర్తికరమూ అధర్మమూ కూడాను. కనక మన మందరమూ బాగా కనుగలిగివుండా లిప్పుడు. ధర్మనందనుని కోరిక ఏమిటో అదితప్పకుండా తీర్చాలి. ఒక్కమాట చెబుతాను చివరికి. దుర్యోధనుడు ధర్మరాజుకి అర్థరాజ్యం అయినా యివ్వాలి, లేకపోతే, నాచేతిలో సర్వనాశనం అయినా పొందాలి, మరో దారి లేదతనికి.

# 4

## ద్రు ప దు డు

"అలాగే జరుగుతుంది చివరి కిది" అంటూ ప్రారంభించాడు, సాత్యకి మాటమీాద ద్రుపదుడు.

" దుర్యోధనుడు మంచిమాటలతో దారికి రాడు. మెత్తమెత్తగా మాట్లాడితే రాజ్యమూ ఇవ్వడు. పోనీ, ధృతరాష్ట్రుణ్ణి చూదామా అంటే కొడుక్కి అడ్డుచెప్పలేడతను. దుర్యోధనుని అన్నం తింటున్నారు కనక, భీష్ముడూ ద్రోణుడూ కూడా అతని కెదురాడలేరు. కర్ణుడూ శకునీ పరమమూర్ఖులు. కనక, వాళ్లూ అతని కెదురుచెప్పరు. అంచేత బలరాముడు చెప్పింది నాకేమీా నచ్చలేదు. మనం అక్కడికి దూతని పంపవలసిందే, వొప్పుకుంటాను; కాని వెళ్ళినవాడు మెత్త మెత్తగా మాట్లాడగూడదు, బింకంగానే మాట్లాడాలి.

ఏమంటే? దుర్యోధనుడు పాపబుద్ధి. గాడిదల విషయమై మెత్తగా వుండాలనడం యెలాంటిదో, ఆవులవిషయమై కఠినంగా వుండాలనడమున్నూ యెలాంటిదో, దుర్యోధనుని విషయమై మృదువుగా వుండా లనడమూ అలాంటిదే. మృదువుగా మాట్లాడితే, అతగాడు, [illegible] ళ్ళనుకుంటాడు. అది తనకి జయం అనిన్నీ అనుకుంటాడు.

కనక, మనం వెంటనే సన్నాహాలు చేసుకోవాలి. క్షణం అయినా ఆలస్యంచెయ్యకుండా రాజుల కందరికీ రాయబారాలున్నూ పంపాలి మనం. దుర్యోధను డిప్పటికే యిది ప్రారంభించివుంటాడేమో కొంప తీసి. ముందు కోరినవారికి సాయంచెయ్యడం సత్పురుషుల పద్ధతి. కనక, మనం త్వరపడాలి.

ఇది పెద్దకార్యం. పెద్దయెత్తున ప్రయత్నాలు సాగిస్తేగాని సాధ్యపడేది కాదు. శల్యుడూ, ధృష్టకేతువూ, జయత్సేనుడూ, కేకయుడూ,

భగదత్తుడూ, కృతవర్మా, ఉగ్రుడూ, దీర్ఘప్రజ్ఞుడూ, రోచమానుడూ, బృహంతుడూ, సేనాబిందువూ, సేనజిత్తూ, ప్రతివింధ్యుడూ, చిత్రవర్మా, సువాస్తుకుడూ, బాహ్లీకుడూ, ముంజకేశుడూ, చైద్యుడూ, సుపార్శ్వుడూ, సుబాహుడూ, పౌరవుడూ, శకపహ్లవదరదరాజులూ, నీలుడూ, దుర్జయుడూ, దండవక్త్రుడూ, రుక్మి, జనమేజయుడూ, వాయువేగుడూ, దేవకుడూ, ఏకలవ్యుడూ, కారూషకరాజులూ, పాంశురాష్ట్రాధిపతీ, క్షేమధూర్తి, కాంభోజుడూ, ఋషికుడూ, పశ్చిమదేశరాజులూ, పాంచాలరాజులూ, మర్ధపుడూ, పార్వతీయరాజులూ, దండధారుడూ, బృహద్బలుడూ, బృహత్సేనుడూ, సముద్రసేనుడూ, ఉద్భవుడూ, క్షేమకుడూ, శ్రుతాయువూ, దృఢాయువూ, కళింగాధిపతీ — ఇంకా యిలాంటివారూ చాలామంది వున్నారు. వారందరూ గొప్ప యోధులు. సాయం రావలసిందని వెంటనే వారి నందరినీ ప్రార్థించాలి దూతనుపంపి.

ఈ బ్రాహ్మణోత్తముడు నా పురోహితుడు. గొప్పవిద్వాంసుడినను. ఇతణ్ణి ధృతరాష్ట్రుడి దగ్గిరికి పంపుదాం. దుర్యోధనునితో ఏమి చెప్పాలో, భీష్ముడితోనూ ధృతరాష్ట్రుడితోనూ, ద్రోణుడితోనూ ఏమేమి చెప్పాలో అన్నీ వివరంగానూ స్పష్టంగానూ చెప్పి మరీ పంపుదాం.”

## 5

“సోమకులధురంధరుడవు నువ్వు చెప్పింది చాలా బాగుంది” అంటూ శ్రీకృష్ణుడు ద్రుపదుణ్ణి మిక్కిలీ ప్రశంసించాడు. “పాండుపుత్రులకు దీనివల్ల తప్పకుండా ఉపకారం జరుగుతుంది” అనిన్నీ దృఢపరిచి యిలా అన్నాడతను.

“మనం నీతి తప్పకుండా నడుచుకుంటున్నాం. కనక, ముందు మనం చెయ్యవలసిం దిదే. మరో విధంగా చేస్తే మనం అవివేకులం అనిపించు

కుంటాం. పాండవు లెంత దగ్గిర బంధువులో మాకు కౌరవులూ అంత దగ్గిర బంధువులే. మేమందరమూ అభిమన్యుడి పెళ్ళికోసం వచ్చాం మిక్కిలి. చూసి చాలా ఆనందించాము. నువ్వున్నూ అందుకే వచ్చావు. ఇక మేము వెళ్ళిపోతాం. ఈరాజు లందరికంటే వయస్సులోనూ బుద్ధిలోనూ గూడా నువ్వు చాలా పెద్దవాడవు. మేమందరమూ నీకు శిష్యులమై నడుచుకుంటాము.

కాక,—ధృతరాష్ట్రుడికి నువ్వంటే గౌరవాదరాలు మిక్కిలి హెచ్చు. ద్రోణాచార్యుడికీ కృపాచార్యుడికీ నువ్వు సఖుడవుకూడాను. కనక, పాండవులకు శ్రేయస్సు కలిగేటట్టు నువ్వు రాయబారం నడిపించు. నువ్వు చేసేది మాకందరికీ యిష్టమే. నీమాట విని శాంతం అవలంబించి దుర్యోధనుడు న్యాయంగా నడుచుకుంటే పాండవులకే కాదు, తనకూ చాలా మేలుచేసుకున్నవా డవుతాడు. అలాకాక,—గర్వించి, నీమాట త్రోసేస్తాడా, తక్కినవారి కందరికీ ముందు పంపించి, తరవాతే మాకు పంపించు వార్త. దానివల్ల దుర్యోధనునికే నష్టం. అర్జునుడు కత్తిక్రోధుడంటే, పుత్రమిత్రాదులనూ, బంధువులనూ, మంత్రులనూ క్షణంలో పోగొట్టుకుంటా డతను. స్వయంగా తానున్నూ సర్వనాశం పొందుతాడు''.

ఇదయిన తరవాత విరటుడు కృష్ణుణ్ణీ యాదవుల నందరినీ చాలా ఘనంగా సత్కరించాడు. వా రందరూ వెంటనే ద్వారకానగరానికి వెళ్ళిపోయారు. అప్పుడు విరటుడూ, ధర్మనందనుడూ, ద్రుపదుడూ మరికొందరూ కలిసి బాగా ఆలోచించి తమకు సాయం రావలసిందని రాజుల కెందరికో వేడికోళ్ళు పంపించారు. ఇది తెలిసి అక్కడ దుర్యోధనుడున్నూ అలాగే చేశాడు.

పాండవుల యీపిలుపు నందుకుని యెందరో రాజులు వచ్చారు. ఎందరో రాజులు దుర్యోధనుడి పిలుపు నందుకునినీ బయలుదేరాడు

పాండవులూ కౌరవులూ కారణంగా ఆరాజుల చతురంగబలాలతోనూ భూమి అంతా నిండిపోయింది. దద్దరిల్లిపోయింది. అప్పుడు ద్రుపదుడు దుర్యోధనుడి దగ్గిరికి విద్యలోనూ, వయస్సులోనూ వృద్ధుడైన తన పురోహితుణ్ణి పంపించాడు.

## 6

## ద్రుపదరాజు నీతివిభవం

ద్రుపదుడు పురోహితునితో యిలా చెప్పాడు.

"మహానుభావా! నీకు తెలియదని కాదు. సకలభూతాల్లోనూ ప్రాణులు శ్రేష్ఠాలు. ప్రాణుల్లో బుద్ధిమంతులు ఉత్తములు. బుద్ధిమంతుల్లో మనుష్యులు గొప్పవారు. మనుష్యుల్లో ద్విజులు శ్రేష్ఠులు. ద్విజులైనా అందరూ కాదు, సకలసిద్ధాంతాలూ తెలిసినవారు ఉత్తములు. వారిలో కూడా కార్యకర్తలు గొప్పవారు. ఆకార్యకర్తల్లో బ్రహ్మవాదులు శ్రేష్ఠులు. ఆబ్రహ్మవాదులందరిలోనూ నువ్వు ఒక్కడివే గొప్పవాడవు. గొప్పవాడవు మాత్రమే కాదు, ముఖ్యుడవున్నూ-ఇంతే కాదు, కులంలోనూ, వయస్సులోనూ, విద్యలోనూ, ప్రజ్ఞలోనూ, శుక్రాచార్యునితో సాటి అయినవాడవు నువ్వు.

దుర్యోధనుని స్వభావం నీకు బాగా తెలుసు. కుంతీపుత్రుడైన ధర్మరాజు స్వభావమున్నూ నీకు బాగా తెలుసు. పాండవులకు మోసం జరిగింది. ఇది ధృతరాష్ట్రునికి పూర్తిగా తెలుసు. విదురుడున్నూ ఎప్పటికప్పుడు చెబుతూనే వున్నాడు; కాని కొడుకును కాదనలేడతను.

ధర్మరాజు జూదంలో నేర్పు లేనివాడు. క్షత్రియధర్మం తప్పనివాడున్నూ. మాయాజూదంలో చాతుర్యం గల శకుని అక్రమాలు చేసి అతణ్ణి వోడించాడు. కనక, దుర్యోధనాదులు ధర్మరాజు

కోపట్టాన రాజ్యం యివ్వరు. మరి, నువ్వక్కడికి వెళ్ళి చెయ్యవలిసిం దేమిటంటావా? జరిగిం దంతా ధృతరాష్ట్రునికి విడమర్చి చెప్పు. దాంతో వారి యోధులకు మనస్సు తిరిగిపోతుంది. విదురుడు నీమాటలే బలపరుస్తాడు. భీష్ముడికీ ద్రోణుడికీ కృపుడికీ గూడా అతను భేదభావం పుట్టిస్తాడు. అంటే, విదురుడు వారికి మన పాండపుత్రులమీద అభి మానం కలిగేటట్టు చేస్తాడు. ఇలాగ అమాత్యులు మారుతోవ తొక్కడంవల్లా, యోధులు మనసు మార్చుకోడంవల్లా దుర్యోధనుడు మళ్ళీ వారి నందరినీ వొకతాటిమీదికి తెచ్చుకోవలసినవా డవుతాడు. అది వోపట్టాన సాధ్యంకా దతనికి. అసలుసాధ్యం కాకేపోవచ్చు కూడా.

దీనివల్ల మనకి వచ్చే లాభం యేమిటంటావా? వారలా కిందా మీదా పడుతూవుంటారు, మనవాళ్ళు దేశంలో వున్న రాజుల సందర్శి కూడగట్టుకుంటారు. సాధనసామగ్రి కూడా దండిగా సమకూర్చు కుంటారు. దుర్యోధనుని కంతఃకలహాలతోనే సరిపోతుంది. సన్నా హాల కవకాశమే వుండదు.

ఇదిలా వుండగా, ధృతరాష్ట్రుడు నీమాటమీద ధర్మంగా నడుచు కున్నా నడుచుకోవచ్చు. అంటే, తన కొడుకులకు నచ్చజెప్పి మన వాళ్ళ కర్థరాజ్యం యిప్పిస్తే యిప్పించనేవచ్చు. వారిలో దయగల వారు కొంద రున్నారు. వారిదగ్గిర పాండుపుత్రులు పడ్డపా ట్లన్నీ యేకరువుపెట్టు. వృద్ధు లున్నారు. వారిదగ్గిర కులధర్మాలు వివ రించి చెప్పు. ఈవిధంగా నువ్వు వారిలో వారికి భేదభావాలు పుట్టిం చగలవు. ఇందులో నాకు లేశమూ సందేహంలేదు.

దీనివల్ల నీకేమీ అపాయం కలగదు, నమ్ము. దుర్యోధనుడు ని న్నేమీ చెయ్యడు. ఎందుచేతనంటే? అసలు నువ్వు బ్రాహ్మడవు. వేద వేదాంగాలు నేర్చినవాడవు. ముఖ్యంగా రాయబారివి. విశేషించి వృద్ధుడవు. కనక, పుష్యనక్షత్రయుక్తమైన జయముహూర్తాన

హస్తినాపురానికి బయలుదేరి వెళ్ళు. బాగా జ్ఞాపకం పెట్టుకో. నువ్వు సాధించవలసింది పాండుపుత్రుల కర్ధరాజ్యం. మరిచిపోకు ”

ద్రుపదుడు ఇలా వివరంగా చెప్పగా పురోహితుడు బయలుదేరాడు. ఎలాగయినా పాండుపుత్రులకు మేలు చెయ్యా లన్న దీక్షతో శిష్యు లను వెంటబెట్టుకుని ప్రయాణం సాగించా డతను.

# 7

## కృష్ణసారథ్యం

ఇలాగ ద్రుపదపురోహితుణ్ణి హస్తినాపురం పంపించి, పాండవులు, తరవాత రాజు లందరిదగ్గిరికీ దూతలను పంపించారు. ద్వారకానగరా నికి మాత్రం అర్జునుడే బయలుదేరాడు స్వయంగా. ఉపప్లావ్య పురం చేరుకున్నాక, కృష్ణుడు, వృష్ణులనూ అంధకులనూ భోజులనూ పిలిచి పాండుపుత్రుల సంగతిసందర్భా లన్నీ చెప్పి పంపించాడు.

విరటనగరంనుంచి కృష్ణుడు వెళ్లిపోయిన సంగతి దూతలవల్ల తెలు సుకుని దుర్యోధనుడు కొద్దిపాటి చతురంగబలంతో ద్వారకానగరానికి బయలుదేరాడు. సరిగా, అర్జునుడు కూడా ఆవేళే అక్కడికి చేరు కున్నాడు. వారిద్దరూ కూడా అంతఃపురంలోకి వెళ్లాటప్పటికి కృష్ణుడు నిద్రపోతున్నాడు. అయినా, వారిద్దరూ గదిలోకి వెళ్లారు. ఆ గదిలో దుర్యోధనుడు ముందు వెళ్లి తల్లింపుదిక్కున కూచున్నాడు, సదర్పంగా, తరవాత వెళ్ళి అర్జునుడు కాళ్ళదిక్కున కూర్చున్నాడు, సవినయంగా.

కొంతసేపటికి కృష్ణుడు మేలుకున్నాడు. ముందర్జునుణ్ణే తరవాత దుర్యోధనుణ్ణే చూశాడు. స్వాగతం మాత్రం యిద్దరికీ వొకక్కనూ చే చెప్పి “ ఏం యిలా వచ్చా ” రనడిగాడు.

వెంటనే అందుకుని, దుర్యోధనుడు "ఈయుద్ధంలో నువ్వు నాకు సాయం చెయ్యాలి. నాయెడలా అర్జునుడియెడలా బంధుత్వమూ స్నేహమూ నీకు సమానమే. అయితే, నీదగ్గిరికి ముందు నేను వచ్చాను. సంప్రదాయం తెలిసిన పెద్దలు ముందు వచ్చినవారిని ముందాదరిస్తారు. నువ్వు సకలమూ తెలిసినవాడవు, కనక, ఆప్రకారమే చెయ్యాలి" అన్నాడు, చిరునవ్వు నవ్వుతూ.

"నువ్వే ముందు వచ్చావంటే, అందుకు నాకేమీ సందేహం లేదోయీ" అన్నాడు కృష్ణుడందుకు. "కాని నేను ముందర్జునుణ్ణి చూశా" నన్నాడు. "ఇలాగ నువ్వు ముందు రావడంవల్లా అర్జునుడు నాకు ముందు కనపడ్డంవల్లా నే నిద్దరికీ సాయం చేస్తాను, సమంగా. అయితే, యేమిచ్చినా ముందు చిన్నవాళ్లకివ్వాలని చెబుతోంది వేదం కనక, తన కేమి కావాలో అది ముందర్జునుడు కోరుకుంటా" డన్నాడు చివరికి.

అర్జునుణ్ణి బాగా విన మన్నాడు. "నారాయణులన్న పేరుగల యాదవులున్నారు, నువ్వెరుగుదువు. యుద్ధవిద్యలో మిక్కిలీ సమర్థులు వారు. ఎలాంటి వీరులూ కూడా వారి నేమీ చెయ్యలేరు. నన్ను కూడా ఆడుతూపాడుతూ పడగొట్టగలరు వారు. అర్బుదం సంఖ్యతో వారొక వైపూ, వొంటరిగా నే నొక వైపున్నూ. ఒంటరిని మాత్రమే కాదు నేను, నేనాయుధం పట్టను. యుద్ధం కూడా చెయ్యను. మరి యాదవులు కావాలా నేను కావాలా నీకు" అనడిగాడు, చివరికి.

కృష్ణుడు మాట పూర్తిచేశా డంతే "నాకు నువ్వే కావా" లన్నా డర్జునుడు. కృష్ణుడు సాక్షాత్తుగా పరబ్రహ్మ అని అతనికి బాగా తెలుసు. క్షత్రియులలోనూ దేవదానవుల్లోనూ యెలాంటివాణ్ణే కూడా అతను సంహరించగల డనిన్నీ తెలుసు. అంచేత, అర్జును డతణ్ణే కోరుకున్నాడు. దుర్యోధనుడు తనకు సైన్యమే కావా లని కోరుకున్నాడు.

"ఒట్టి చేతులతో కృష్ణుడేమి చెయ్యగలడూ ?" అనుకుని మిక్కిలి పొంగిపోయా డతను.

ఇలా అనుకుంటూ బలరాముని దగ్గిరికి వెళ్లా డతను. తానెందుకు వచ్చిందీ వివరంగానున్నూ చెప్పాడు. దానిమీద బలరాము డిలా చెప్పాడు. "దుర్యోధనా, అభిమన్యుని వివాహం సందర్భంలో నేనేమి చెప్పానో అదే జరుగుతుంది అక్షరాలా. అప్పుడు చుట్టరికం పురస్క-రించుకుని చాలా జాగ్రత్తగా మాట్లాడా న్నేను. అనంతా నీకోసం చెప్పాను. కాని అక్కడివా రెవరూ నామాట వినిపించుకోలేదు. కృష్ణుడున్నూ అందు కంగీకరించలేదు. నేను కృష్ణుణ్ణి విడిచి క్షణమైనా వుండలేను, కనక, నీకూ అర్జునుడికీ గూడా సాయం చెయ్యగూడ దని నిశ్చయించుకున్నా న్నేను. వసుదేవుని మొగం చూసి నే నిలా స్థిర పరుచుకోవలసివచ్చింది. ఇక నేను చెప్పే దేమిటంటే ? రాజుల కందరికీ మిక్కిలీ పూజ్య మైన వంశం మీది. అలాంటి వంశంలో పుట్టావు నువ్వు. కనక, క్షత్రియధర్మం తప్పకుండా ధర్మయుద్ధం చెయ్యి, వెళ్లిపో"

ఇది విని దుర్యోధనుడు బలరాముణ్ణి గట్టిగా కౌగిలించుకున్నా డు. కృష్ణుని పని అయిపోయిం దనీ, తనకి జయం తప్ప దనీ భావించు కున్నాడు. వెంటనే కృతవర్మ దగ్గిరి కివెళ్లాడు. కృతవర్మ అతని కొక్క-అక్షౌహిణి సేన యిచ్చాడు. అక్కడ కృష్ణు డిచ్చిన సేనా, యిక్కడ కృతవర్మ యిచ్చిన సేనా వెంటబెట్టుకుని దుర్యోధనుడు హాస్తినాపురం వెళ్లిపోయాడు. జరిగిం దంతా విని అక్కడివా రందరూ మిక్కిలీ ఆనం దించారు.

"నే నస్త్రం పట్ట ననీ, యుద్ధం అసలేచెయ్య ననీ కచ్చితంగా చెప్పాను గదా, మరి, నన్నే నువ్వెందు కోరుకున్నావూ ?" అనల గాడు, దుర్యోధనుడు వెళ్లిపోయాక కృష్ణుడు. "దాని కారణం వుం" దంటూ ప్రారంభించా డర్జునుడు. "బావా, మా శత్రువుడి

నందరినీ నువ్వొక్కడవే సంహరించగలవు. నేనున్నూ వొంటరిగానే ఆపని చెయ్యగల ననుకో. అయితే, నువ్వు మిక్కిలీ కీర్తిగలవాడవు. ఎక్కడుంటే అక్కడే నీకు కీర్తివస్తుంది. నాకూ కావాలి మరి, కీర్తి. అంచేత నిన్ను కోరుకున్నా న్నేను. నువ్వు నాకు సారథిగా వుండు, చాలు. ఎన్నాళ్లనుంచో వుంది నాకీ కోరిక. నువ్వు నాకీ వుపకారం చెయ్యి" అంటూ వివరాలున్నూ చెప్పి ప్రార్థించా డతను.

"బాగుం" దన్నాడు కృష్ణుడు. "నీ కోరికతీరుస్తాను. నీకు సారథ్యమే చేస్తాను, తక్కువేం ?" అని కూడా అన్నా డతను. ఇందుకు మిక్కిలీ సంతోషించి, కృష్ణుణ్ణి వెంటబెట్టుకుని ధర్మరాజుదగ్గిరికి వెళ్లిపోయా డర్జునుడు.



## శల్యతంత్రం

దూతల ముఖాన పాండవు లంపిన పిలు పంగీకరించి, శల్యుడు, తన కున్న సేన అంతా వెంటబెట్టుకుని బయలుదేరాడు. పూర్తిగా వొక్క అక్షౌహిణి సేన అది. అర్థయోజనంమేర కమ్ముకుని వుందది. మహారథులైన తన కొడుకులను కూడా వెంటబెట్టుకుని బయలుదేరా డతను. వీరుల్లోనూ, ధీరుల్లోనూ, సాహసికుల్లోనూ మంచిపే రున్నవా డతను.

ఆమూకలో లక్షమంది సేనాధిపతులే వున్నారు. వారందరూ విచిత్రాలైన బట్టలు కట్టుకుని విచిత్రాలైన కవచాలు తొడుక్కుని, విచిత్రాభరణాలు ధరించి, విచిత్రాలైన పూలదండలు వేసుకుని, విచిత్రాలైన జెండాలూ, ధనుస్సులూ పుచ్చుకుని, విచిత్రాలైన రథాలూ వాహనాలూ యెక్కి బయలుదేరారు.

పాండవులను కలుసుకుందామని బయలుదేరాడు శల్యుడు. అతని సేన ముందుకి సాగుతూవుంటే భూమి జవజవలాడిపోతోంది. ప్రాణి

కోటి అంతా బేజారయిపోతోంది. ఇదేమీ లెక్క చెయ్యకుండా అక్క డక్కడ మకాములు చేస్తూ మెల్లిగా కదులుతోం దది.

ఇదంతా విన్నాడు దుర్యోధనుడు. శల్యుణ్ణి తన పక్షానికి తిప్పేసు కోవా లనుకున్నాడు. వెంటనే మంత్రులను పిలిచి "మద్ర దేశాధిపతి శల్యమహారాజు తాను వెళ్ళదలచినచోటికి వెళ్ళే మార్గాన ఎక్కడె క్కడ ఆగవలసివుంటుందో బాగా పరిశీలించి అక్కడక్కడే మంచి యేర్పాట్లు చేయించండి. చాలా చక్కని మందిరాలు నిర్మించా లక్కడ. అవన్నీ రత్నాలతో అలంకరించాలి. వింతవింత ఆటలున్నూ అక్కడ జరగాలి. అందుకోసమున్నూ అనువైన ఏర్పాట్లు చెయ్యాలి. మంచి భక్ష్యాలూ, మంచి మాంసాలూ, మంచిపానీయాలూ అక్కడ సిద్ధంచేయించాలి. రకరకాల దిగుడుబావులూ, నూతులూ సిద్ధం చేయించాలి. జలయంత్రాలూ, ధారాగృహాలూ కూడా నిర్మించాలి" అని ఆజ్ఞాపించాడు. శల్యుని పరివారంలో ఎవరికీ తెలియకుండా తానున్నూ తనవారితో బయలుదేరాడు.

శల్యుడు తానాగినచోటల్లా కనీవినీ యెరగని ఏర్పాట్లు చూశాడు. మహేంద్రుడు కూడా తనకు తీసిక ట్టనుకున్నాడు. వెంటనే ఆ యేర్పాటు చేయిస్తున్నవారిని పిలిపించి, ఇదంతా ధర్మనందనుడే చేయి స్తున్నా డన్న నమ్మకంతో "ఈనిర్మాణాలు చేస్తున్న శిల్పులను తీసుకు రండి. వారిన్నేను సత్కరిస్తాను. యుధిష్ఠిరుణ్ణి కూడా నా యెదటికి తీసుకురండి" అని చెప్పాడు.

ఇదంతా దుర్యోధనుడికి తెలిసింది. వెంటనే తానే శల్యుడి యెదుటికి వెళ్ళాడు. అది చూసి ఆశ్చర్యపడి, ముందతణ్ణి గట్టిగా కౌగలించుకొని "నాయనా, నీకేమి కావాలో కోరుకో, ఇస్తా" నన్నాడు, వీపుతట్టుతూ.

"ఆమాటమీాద నిలు" అన్నాడు ముందు దుర్యోధనుడు. "నాపక్షాన సర్వసేనాధిపతివై అంతా నువ్వే నడిపించాలి" అని కోరాడు తరవాత. "తప్పకుండా నీకోరిక తీరుస్తా" అన్నాడు శల్యుడు. "ఇంకేమి కావాలో అడగ" మన్నాడు. దుర్యోధను డందుకూ బాగా తృప్తిపడి "నువ్వంతా చేసినట్టే లెక్క" అన్నాడు, మళ్ళీమళ్ళీ.

"నాయనా, ఇక నువ్వు నీపట్నానికి వెళ్ళిపో. నేను వెళ్ళి యుధిష్ఠిరుణ్ణి చూడాలి. అతణ్ణి చూసి వెంటనే నీదగ్గిరికి వచ్చేస్తాను. అతణ్ణి చూడకతప్పదు, మరి" అన్నాడు శల్యుడు. "చాలా సంతోషం. నువ్వు పాండవులను చూసే రా, తప్పేం? అయితే, నాసర్వస్వమూ నీగుప్పిట్లో వుంది. నువ్వు నాకిచ్చినమాట మరిచిపోకు" అని మళ్ళీ మళ్ళీ కోరాడు, దుర్యోధనుడు.

ఇద్దరూ కౌగిలించుకున్నారు. దుర్యోధనుణ్ణి పంపివేసి, శల్యుడు, ముందుకి సాగిపోయాడు. అప్పటికి ఉపప్లావ్యంలో వున్నారు పాండవులు. అదిన్నీ విరటరాజు నగరమే, విరటనగరాని కానుకునే వుంది. విరటనగరభాగమే అన్నా అనవచ్చు అది. ఇక్కడ జరిగిందంతా వారితో చెప్పడానికి వెళ్ళాడు శల్యుడు.

పాండవు లతణ్ణి అర్ఘ్యమూ పాద్యమూ వొంక గోవూ యిచ్చి మిక్కిలీ ఆదరించారు. శల్యుడు, ముందు, యుధిష్ఠిరుణ్ణి కౌగిలించుకుని క్షేమం అడిగాడు. తరవాత భీముణ్ణీ, అర్జునుణ్ణీ, చివరికి తన మేనల్లుళ్ళయిన నకుల సహదేవులనూ కూడా కౌగిలించుకుని క్షేమం అడిగాడు.

ఇందతా అయాక వారు చూపించిన ఉన్నతాసనంమీాద కూచుని ధర్మరాజుని చూసి "రాజేంద్రా! అదృష్టవశాన నువ్వరణ్యావాసం పూర్తిచేసుకువచ్చావు. జనసంచారం లేని అరణ్యాల్లో తిరగడం చాలా కష్టం. ఈ తమ్ములనూ ద్రౌపదినీ వెంటబెట్టుకువెళ్ళి అజ్ఞాతవాసమున్నూ పూర్తిచేసుకు వచ్చావు. అదృష్టం అంటే దీన్నే చెప్పాలి.

ఇది సామాన్య మైన పని కాదు. మొత్తానికి నువ్వు చాలా కష్టపడ్డావు. రాజ్యంపోయినవాళ్ళకి సుఖం యెక్కడిదీ మరీ ? ఇదంతా మీకు ధృతరాష్ట్రుని కొడుకులు చేశారు. అయితే లే, శత్రువుల సంహరించి నాశనం చేసి నువ్వికసకలసుఖాలూ అనుభవిస్తావు. నీకు లోకతంత్రం బాగా తెలుసు. అంచేత యెందులోనూ నువ్వు లోపం రానియ్యవు. ఇకనుంచీ కూడా వెనకటి రాజర్షుల మార్గం తప్పకుండా నడుచుకుంటూ, స్థిరంగా దానాలు చేస్తూ, తపస్సున్నూ చేసుకుంటూ, సత్యమే పలుకుతూ వుండాలి నువ్వు. క్షమా, దమమూ, సత్యమూ, అహింసా — ఇవి నీకన్నీ వున్నాయి. చాలా మృదువైన స్వభావం నీది. మిక్కిలి చక్కగా మాట్లాడతావు. నువ్వు బ్రహ్మణ్యుడవు. నీవంటి దాత మరి లేడు. సత్యం తప్పవు నువ్వు. ధర్మా లన్నీ తెలుసు నీకు. ఈ జగత్తున్నూ పూర్తిగా తెలుసు నీకు. అదృష్టవశాన కష్టా లన్నీ దాటావు నువ్వు. అదృష్ట వశానే నేనున్నూ నిన్ను చూడగలిగాను ” అన్నాడు మిక్కిలి ప్రీతిగా.

తరవాత, దుర్యోధనుడు, మార్గంమధ్య తనకు సకలసుఖాలూ సమకూర్చడమూ, అతణ్ణి రక్షించుకుని తాను మాట్లాడ్డమూ, తానతనికి మాట యివ్వడమూ—ఇదిన్నీ వివరంగా చెప్పాడు.

“ చాలా మంచిపని చేశా ” వన్నాడు ధర్మరాజదివిని. “మహారాజా! నువ్వు దుర్యోధనుని కిచ్చిన మాట బాగానే వుంది. అయితే, నువ్వు మాకోపని చేసిపెట్టాలి. అది మంచిదా చెడ్డదా అన్న ఆలోచనే వద్దు నీకు. మాకు సాయంచెయ్యడమే పెట్టుకోవాలి నువ్వు. అది చేయుటంటావా ? యుద్ధరంగంలో కృష్ణు డెటూ నువ్వటూను. అంతే, కృష్ణు డెంతటివాడో నువ్వంతటవాడవు. కర్ణుడికీ అర్జునుడికీ కలహం తప్పదు. అప్పుడు నువ్వు కర్ణుడికి సారథివిగా వుండవలసివస్తుంది, సందేహం లేదు. నువ్వు మాకు చెయ్యవలసిన సాయం అక్కడే. అంటే, నువ్వర్జునుణ్ణి కాపాడాలి. నా శ్రేయస్సు కోరానంటే నీకిది తప్పదు.

ఇందుకోసం నువ్వు చెయ్యవలసిం దల్లా వికటంగా మాట్లాడి కర్ణుడి ఉత్సాహం చెడగొట్టడం. నువ్విలా చేస్తే ఎంత పట్టుదలవుండినా అతనికి కాలూ చెయ్యీ ఆడదు. దాంతో మాకు జయం కలుగుతుంది. ఇది మంచిపని కాదంటావా? అయినా సరే, మాకోసం చెయ్యాలి" అనిన్నీ కోరా డతను మళ్ళీ.

"సరే" అన్నాడు శల్యుడు. "రాజేంద్రా! బాగా విను. నేను కర్ణునికి సారథిని కావడం నువ్వన్నట్టు తప్పనిసరి. ఏమంటావా? మీరు కృష్ణుణ్ణెంత నమ్ముకుని వున్నారో నన్నంత నమ్ముకుని వున్నాడు కర్ణుడు. కనక, యుద్ధరంగలో పుల్లవిరుపుమాట లని అతని మనస్సంతా పాడు చేసేస్తాను. అతని దర్పం అంతా చెడగొడతాను. అతణ్ణి సులభంగా చంపడానికి సర్వవిధాలా వీళ్ళు కలిగిస్తా నేనర్జునుడికి, నమ్ము. చేతనైన దంతా చేస్తా నీకోసం. జూదంసమయంలో కర్ణుడు నోటికి వచ్చినట్లల్లా మిమ్ము దుర్భాష లాడ్డమూ దానివల్లనే నీకూ ద్రౌపదికీ దుఃఖాలు కలగడమూ నాకు తెలుసు. జటాసురునివల్లా కీచకునివల్లా ద్రౌపదికి ఇక్కట్లు రావడం నే నెరగనూ? నిజంగా, వెనకటికి దమయంతి పడ్డ కష్టా లన్నీ పడింది ద్రౌపది. అయితే, ఆదుఃఖం అంతా మీకిక సుఖంగా మారిపోతుంది, సందేహంలేదు. నీకు కోపంవద్దు, దైవయోగం వల్లనే అదంతా అలా జరిగింది. దైవాని కడ్డేమిటి? కాక, మహాత్ము లకే ఆపదలు సంభవిస్తాయి. దేవతలున్నూ ఎన్నో కష్టా లనుభ వించారు. చివరకింద్రుడున్నూ తనభార్యతో ఎన్నో కష్టా లనుభ వించాడు" అని చెప్పాడు.

## 9

### వృత్రాసురుడు

"అదేమిటి? తానొక్కడే కాక భార్యతో కూడా ఘోరకష్టా లనుభ వించాడా దేవేంద్రుడు? ఇది వినాలి" అన్నాడు ధర్మరాజు. "ఇది

మిక్కిలీ వెనకటి కథ, చెబుతా విను" అంటూ ప్రారంభించాడు శల్యుడు.

"త్వష్ట అని వొక ప్రజాపతి. దేవతల్లో చాలా గొప్పవా డతను. మహాతపశ్శాలి. ఇంద్రు డొకప్పు డతనికి ద్రోహం చేశాడు. అందుకు బదులు తీర్చుకోవా లని ఆత్వష్ట విశ్వరూపు డని వొక కొడుకుని సృష్టించుకున్నాడు.

ఆ విశ్వరూపునికి మూడుతలలు. అతని మొగాలు మూడున్నూ. వాటిలో వొకటి సూర్యుడులాగా, మరొకటి చంద్రుడులాగా, ఇంకొ కటి అగ్నిహోత్రం లాగా వుంటుంది. వాటిలో వొకదాంతో అతను వేదాలు చదువుకున్నాడు. మరోదాంతో యెప్పుడూ మద్యం పుచ్చు కుంటూ వుంటాడు. ఇంకోదాంతో లోకా లన్నీ తాగేస్తానన్నట్టు చూస్తూవుంటాడు.

ఆ విశ్వరూపుడు చాలా మంచివాడు. దాంతుడు. ఎప్పుడూ ధర్మం తప్పడు. తపస్సు కూడా యెప్పుడూ మానడు. అయితే, తాను ఇంద్రుడు కావా లనుకున్నా డతను. అందుకోసం చాలా ఉగ్రమైన తపస్సు మొదలు పెట్టాడు.

ఇంద్రునికి తెలిసిం దిది. అతను మిక్కిలీ సత్యవంతుడు కావడమూ, అతని తపస్సున్నూ చాలా గొప్పది కావడమూ చూసి ఇంద్రుడు చాలా భయపడ్డాడు. చాలా విచారించాడు. బెంగ పెట్టుకున్నాడు కూడా. తనపదవి తనకే వుండా లనుకున్నాడు. "అతను తపస్సు మానుకో వాలి. సంసారలంపటుడై జనసామాన్యంలో వొక డయిపోవాలి. మనం యేమాత్రం అశ్రద్ధచేసినా మిక్కిలీ వృద్ధిపొంది మూడులోకాలూ ఆక్రమించేస్తాడు. దీని కేమిటి దారి ?" అంటూ బాగా ఆలోచించాడు.

వెంటనే అప్సరసలను పిలిపించాడతను. "ఆవిశ్వరూపుడు మీవలలో పడాలి. మీతో భోగా లనుభవిస్తూ వుండిపోవాలి. చక్కగా అలంక

రించుకోండి. మంచిమంచి హారాలు ధరించండి. చాలా అందమైన వాళ్లే బయలు దేరండి. రకరకాల శృంగారచేష్టలుచెయ్యండి. ఏమయినా చెయ్యండి. అతణ్ణి మీావైపు తిప్పేసుకోవా లంతే నా క్కావలసింది. నాభయం పోగొట్టాలి మీరు. నా మనసు మనసులో లేదు. చాలా బాధపడిపోతునా న్నేను. ఇది పోగొట్టాలి మీారు" అని గట్టిగా చెప్పాడు వాళ్లకి.

"సరే అదెంత?" అన్నారు వాళ్ళు, "ఇంద్రా! ఏమి చేస్తే నీభయం పోతుందో అదంతా చేస్తాము మేము. లోకా లన్నీ బుగ్గిచేసేసే టట్టు చూస్తున్నా డతను. అయినా మేమతణ్ణి లొంగదీసేస్తాం. మేమంతా కలిసేవెడతాం" అని ధైర్యంచెప్పి జట్టుగా బయలుదేరారు వాళ్ళు.

విశ్వరూపుని దగ్గిర రకరకాల వేషాలు మొదలుపెట్టారు వాళ్ళు. ఆడారు. పాడారు. తమకు చేతనైన విలాసా లన్నీ చూపించారు. చివరికి తమ శరీరసౌందర్యం కూడా అంతా చూపించారు వాళ్ళు. అయినా లాభంలేకపోయింది. విశ్వరూపుడు లొంగలేదు. కొంచెం అయినా చలించలే దతను. అసలు, వాళ్ళకేసే చూడలే దతను. సిగ్గుపడిపోయారు వాళ్ళందరూ. ఇక లాభంలేదనుకుని వచ్చిన దారినే వెనక్కిమళ్ళారు.

ఇంద్రుని దగ్గిరికి వెళ్ళారు వాళ్ళు, "ప్రభూ! మేము చెయ్యని ప్రయత్నం లేదు. కాని యేమి చేసినా లాభం లేకపోయింది. తూర్పు సముద్రం లాగ నిశ్చలంగా వుండి పోయా డతను. కొంచమున్నా కదపలేకపోయాం మేము" అంటూ వంగివంగి దండాలు పెట్టి విన్న వించుకున్నారు. "ఇక మావల్ల యేమీా కాదు. నీదారేదో నువ్వే చూసుకో" అని కూడా చెప్పేశారు స్పష్టంగా.

చివరకి లాభం లేకపోయినా, చాలాచాలా కష్టపడ్డారు కనక, బాగా సత్కరించాడు దేవేంద్రుడు వాళ్ళని. ఎన్నెన్నో బహుమతులు

కూడా ఇచ్చాడు. "పొండి" అని వాళ్ళని పంపేసి ఆలోచన ప్రారంభించాడు మళ్ళీ. అతణ్ణి చంపెయ్యడం తప్ప మరో వుపాయం తట్టలేదతనికి. "వజ్రాయుధం వేసేస్తాను. దాంతో నాశనం అయిపోతాడు వాడు. "శత్రువు ఎంత సామాన్యుడయినా వాణ్ణి మిగల్చకూడదని శాస్త్రం చెబుతోంది మరి" అని నిశ్చయించుకున్నాడు.

వెంటనే వెళ్ళి విరూపాక్షునిమీద వజ్రాయుధం వేశాడింద్రుడు. అగ్నిహోత్రం లాగ మండిపోతూ మహాభయంకరంగా వెళ్ళిపడిందది. ఆదెబ్బకి పర్వతశిఖరంలాగ పడిపోయాడు విరూపాక్షుడు; కాని అప్పటికీ పర్వతంలాగే వున్నాడతను. జాజ్వల్యమానంగా వెలిగిపోతూనే వుందతని తేజస్సు. వజ్రాయుధం దెబ్బతినీ కూడా బతికివుండినట్టే వున్నాడు విరూపాక్షుడు. అతని శిరస్సులున్నూ వెనకటిలాగే వున్నాయి. అది చూసి మిక్కిలీ భయపడిపోయాడింద్రుడు. గడగడ వణికిపోసాగాడు కూడా.

బుజాన గండ్రగొడ్డలి వేసుకుని సరిగా ఆసమయానికి తక్షుడు వచ్చాడక్కడికి. అతణ్ణి చూశాడింద్రుడు. వెంటనే దగ్గిరికి వెళ్ళి "నరుకు. నేనాజ్ఞాపిస్తున్నాను ఆగండ్రగొడ్డలితో వీడితలకాయ లెగరగొట్టు" అంటూ తొందరపెట్టాడతను. దానిమీద తక్షుడు "ఇంత క్రూరకర్మ చేస్తున్నావే, నువ్వెవడవయ్యా? ముందిది చెప్పవయ్యా నాకు?" అనడిగాడు.

"నేను దేవేంద్రుణ్ణి. దేవతలకు రాజుని. ఆలోచించవద్దు. నేను చెప్పినట్టు చెయ్యి" అని మళ్ళీ తొందరపెట్టాడింద్రుడు. "ఏమిటీ? ఋషికుమారుణ్ణి ఇంత ఘోరంగా చంపుతున్నావే నువ్వు, సిగ్గు లేదూ నీకూ?" అనడిగాడు తక్షుడు. బ్రహ్మహత్య చేస్తున్నావు నువ్వు. ఈపాపం చుట్టుకోదూ నీకు? అందు కయినా భయం లేదా నీకు?" అనిన్నీ అడిగాడతను, నిక్కచ్చిగా.

"అదంతా తరవాత చూసుకుంటా" నన్నా డింద్రుడు. "ఇది పాపమే. అయితే, దీనికి నింపాదిగా చూసుకోవచ్చు విరుగుడు. వీడు నాకు గర్భశత్రువు. చాలాబలవంతుడు. నేను వజ్రాయుధంతో కొట్టినా లాభం లేకపోయింది. తక్షుడా, వీణ్ణి చూస్తే నా కిప్పటికీ భయంగానే వుంది. నావొళ్లింకా వొణికిపోతూనే వుంది చూశావా? కనక, నరుకు. వీడితలకాయలు డుల్లక్కొట్టు. నీకిందుకు మంచి వుపకారం చేస్తా న్నేను. అదేమి టంటావా? బ్రాహ్మలు యజ్ఞాల్లో పశువులను వేస్తారు కదూ? వాటి భాగం — అంటే, వారిచేత నీకా తల లిప్పించే యేర్పాటుచేస్తా న్నేను. ఇంతకంటే నీ కేం కావాలీ? కనక, నామాట విను. నరికెయ్యి వీణ్ణి" అని మళ్లీమళ్లీ తొందరపెట్టాడు.

ఈవాగ్దానం విన్నాడు, తనకి నచ్చింది, వెంటనే తన గండ్రగొడ్డలి విసిరి, తక్షుడు, వొక్క దెబ్బతో విరూపాక్షుడి మూడుతలలూ యెగర గొట్టాడు. ఆశిరస్సులు కిందపడ్డాయి. అంతే, వాటిలోనుంచి అండజాలైన నల్లతిత్తిరిపక్షులూ, తిత్తిరిపక్షులూ, పిచికలూ బయలుదేరాయి. విశేషం యేమిటంటే? ఏ మొగంతో వేదాలు చదువుకుని విరూపాక్షుడు సోమపానం చేశాడో, ఆ మొగంలోనుంచి నల్లతిత్తిరిపక్షులు పుట్టుకువచ్చాయి. అతనే మొగంతో లోకా లన్నీ తాగేస్తున్నట్టు చూసేవాడో దాన్లోనుంచి తిత్తిరిపక్షులు బయటికి వచ్చాయి. ఏ మొగాన అతను సురాపానం చేసేవాడో అందులోనుంచి పిచికలూ, డేగలూ బయటికి వచ్చాయి.

విరూపాక్షుని తలలు మూడూ ఇలా నుల్లిపోగా, భయంతీరి ఇంద్రుడు స్వర్గానికి వెళ్ళిపోయాడు. తాను "కృతార్థు ణ్ణయినా" ననుకుంటున్నూ పొంగిపోయా డతను. తక్షుడున్నూ తన యింటికి వెళ్ళిపోయాడు.

ఇదంతా విన్నాడు త్వష్ట. వినడం తడవుగా మండిపడిపోయా డతను. "నాకొడుకు మిక్కిలీ దాంతుడు. క్షమగలవాడు. ఇంద్రియాలున్నూ

జయించినవాడు. శ్రద్ధగా తపస్సు చేసుకుంటున్నాడు. మరో చూపే లేదతనికి. అలాంటివాణ్ణి క్రూరుడై ఘోరంగా చంపేశాడింద్రుడు. కనక, ఆయింద్రుణ్ణి నాశనం చెయ్యడానికదిగో నేను వృత్రుణ్ణి సృష్టిస్తున్నాను. లోకాలన్నీ నాసత్తా, నాతపోబలమూ తెలుసుకుంటాయిప్పుడు. ఇంద్రుడు దురాత్ముడు. మహాపాపి. వాడున్నూ ఇది తెలుసుకుంటాడిప్పుడు" అంటూ నిశ్చయించుకున్నాడు. ఆచమనం చేశాడు. హోమాలున్నూ చేశాడు. వృత్రుణ్ణి సృష్టించేశాడు. "ఓయింద్రశత్రూ! నాతపోబలంవల్ల నువ్వు చల్లగా వర్ధిల్లు" అని ఆశీర్వచనమున్నూ చేశాడు.

చూస్తుండగా, సూర్యుడు లాగ, అగ్నిహోత్రం లా వృద్ధిపొందాడు వృత్రుడు. "మహాత్మా, నాకేమి సెలవు? నేను చెయ్యవలసిందేమిటి?" అనికూడా అడిగాడు. "ఇంద్రుణ్ణి చంపెయ్యి" అని వొక్కటే మాట చెప్పాడు త్వష్ట.

వెంటనే స్వర్గంమీద పడ్డాడు వృత్రుడు. ఇంద్రుడెదిరించాడు. ఇద్దరికీ ఘోరమైన యుద్ధం జరిగింది. కొంతసేపటికి నోరు తెరుచుకుని వృత్రుడు ఇంద్రుణ్ణి మింగేశాడు.

అది చూసి దేవతలందరూ బేజారయిపోయారు; కాని, కొంత సేపటికి నిలవతొక్కుని బాగా ఆలోచించి వృత్రునికి ఆవులింత కల్పించారు. అది నిగ్రహించుకోలేక వృత్రుడు నోరు తెరవగా, తన శరీరం బాగా కుంచించుకుని ఇందుడివతలికి వచ్చేశాడు. అది మొదలు సోమరులను పట్టుకుంది, ఆవులింత.

ఇంద్రుడు బతికిబట్టడం చూసి దేవతలు నిక్కలీ సంతోషించారు; కాని వృత్రుడు మళ్ళీ చెలరేగాడు. కళ్ళు మూసుకుని ఇంద్రునిమీద పడ్డాడు మళ్ళీ. మళ్ళీ చాలా ఘోరంగా జరిగింది యుద్ధం. చాలాకాలమున్నూ జరిగిం దది. వృత్రుడి ధాటి తాగలేక చివరి కింద్రుడు పారిపోయాడు. దేవతలందరూ మళ్ళీ దుఃఖితులయిపోయారు.

"వృత్రుడు చాలా బలవంతు డయివున్నాడు. త్వష్ట ఆశీర్వాదబల మున్నూ వుంది వాడికి. ఏమిటి వాణ్ణి చంపడాని కుపాయం ?" అని ఆలోచించారు దేవతలు. మహర్షులు కూడా కలిశారు. వారితో అందరూ మందరపర్వతం చేరుకుని శ్రీమన్నారాయణుని ధ్యానించసాగారు.

# 10

## వృత్రాసురవధ

ఇంద్రు డప్పుడు వారి నందరినీ చూసి "దేవత లంతా వినండి. వృత్రాసురుడు జగత్తంతా ఆక్రమించివున్నాడు. వాణ్ణి సంహారించడాని కుపాయం మాత్రం కనపడ్డంలే దేమిన్నీ. వెనకటిదినా లయితే నిమిషంలో వాణ్ణి సంహారించివుందు న్నేను. ఇప్పు డేమీ చెయ్యలేను. వాడెవడికీ లొంగేవాడు కాడు. యుద్ధరంగంలో వురికా డంటే, అంతటి ధైర్య సాహసాలూ, అంతటి బలపరాక్రమాలూ చూపెంచగలవాడున్నూ మరొకడు లేడు. మిక్కిలి తేజస్సు గలవాడు. మహాత్ముడు. దేవతలూ అసురులూ, మనుష్యులూ నిండివున్న యీమూడు లోకాలూ కూడా మింగెయ్యగలడు వాడు. నాకొకటి తోస్తోంది. మన మందరమూ వెళ్లి శ్రీమహావిష్ణువు నాశ్రయిద్దాం. మన కష్టా లన్నీ చెప్పుకుంటే ఆమహాత్ముడే చెబుతా డేమయినా వుపాయం" అన్నాడు.

"బాగుం దంటే బాగుం" దనుకున్నా రందరూ. మహర్షులను కూడా వెంటబెట్టుకువెళ్లి శ్రీమన్నారాయణుని శరణుపొందారు దేవతలు. లోకాల కన్నిటికీ శరణ్యం అత నొక్కడే మరి. అంతటి బలశాలి కూడా మరొకడు లేడు. వెళ్ళీవెళ్ళడంతోనే శ్రీహరీ అంటూ ప్రారంభించారు వారు.

"వెనకటికి త్రివిక్రమావతారం యెత్తి నువ్వు త్రిలోకాలూ ఆక్రమించుకున్నావు. అమృతం లాక్కొని రాక్షసులను కూడా సంహారిం

చావు. బలిచక్రవర్తిని పాతాళానికి తొక్కేసి ఇంద్రుణ్ణి దేవతలకు రాజుని చేశావు. దేవతల కందరికీ నువ్వే గతి. జగత్తంతా నిండి వున్నావు నువ్వు. సమస్తలోకాలూ నమస్కరించతగ్గ దేవదేవుడవు నువ్వే. వృత్రాసురుడిప్పుడు జగత్తంతా ఆక్రమించుకుని వున్నాడు. ఇంద్రునికీ మాకూ గూడా వాణ్ణి వధించడానికి వుపాయం చెప్పాలి నువ్వు" అంటూ ప్రార్థించారు చివరికి.

"మీరంతా నాకు కావలసినవారే" అంటూ ప్రారంభించాడు శ్రీహరి. "కనక, వృత్రాసురుణ్ణి చంపడాని కుపాయం చెబుతాను వినండి. ఈమహర్షులను వెంటబెట్టుకుని ముందు వాడిదగ్గిరకే వెళ్ళండి మీరు. వెంటనే మీరు వాడితో సంధిచేసుకోండి. నాఅనుగ్రహం వల్ల ముందుముందు ఇంద్రుడికే విజయం కలుగుతుంది. సమయం వచ్చి నప్పుడు అదృశ్యుణ్ణయి ఇంద్రుడి వజ్రాయుధంలో వుంటాను. ముందు ఇంద్రునికీ వృత్రునికీ సంధిమాత్రం చెయ్యండి మీరు. ఈమహర్షులూ, ఈగంధర్వులూ మీరూ కలిసే వెళ్ళాలి వాడిదగ్గిరకి" అని చెప్పాడు.

వెంటనే ఇంద్రుణ్ణి వెంటబెట్టుకుని వారందరూ వృత్రుడున్నచోటికి వెళ్ళారు. తన అఖండతేజస్సుతో వాడు దిక్కులన్నీ వెలిగిస్తున్నాడు. సూర్యుడు లాగా చంద్రుడు లాగా తానూ వెలిగిపోతున్నాడు. దీంతో లోకాలన్నీ మింగేస్తున్నట్టున్నాడు.

మహర్షులు ప్రారంభించారు. మెల్లిగా "వృత్రా ! నిన్నెవరూ గెలవ లేరు. నీ తేజస్సు మూడులోకాలూ నిండిపోయివుంది. నువ్వు మిక్కిలి బలవంతుడవే ; కాని యింద్రుణ్ణి గెలవలేవు. మీరిద్దరూ కూడా చాలా కాలం వ్యర్థంగా గడిపేసుకున్నారు. దేవతలూ, అసురులూ, మానవులూ కూడా ఈయుద్ధంతో చాలా నలిగిపోయారు. కనక, ఇంద్రుడూ నువ్వూకూడా శాశ్వతంగా సఖ్యం చేసుకోడం మంచిది. దానివల్ల నువ్వూ బాగుపడతా, వింద్రుడూ బాగుపడతాడు. లోకాలను కూడా

శాశ్వతంగా సుఖపెట్టినవాళ్ళున్నూ అవుతారు మీరు" అని తేల్చారు చివరికి.

ఇది విన్నాడు వృత్రుడు. శిరస్సు వంచి మహర్షుల కందరికీ నమస్కారాలు చేశాడు. "అయ్యా, మీరూ గంధర్వులూ కూడా మహానుభావులు. మీరందరూ చెప్పింది నేను బాగా విన్నాను. ఇక నామాట కూడా మీరు వినండి. నాకూ ఇంద్రునికీ సంధిజరగడం సాధ్యమా? రెండు తేజస్సు లొకచోట యిముడుతాయా మరి?" అనడిగాడు, మెల్లిగా.

"అలా కాదయ్యా" అన్నారు మహర్షులు. "సజ్జనులు స్నేహంగా వుండడం మంచిది. తరవాత యేమి జరగవలసివుంటే అది జరుగుతుంది. పెద్దలు పూనుకుని సంధిచేస్తా మంటే వద్దనగూడదు. సజ్జనుల స్నేహం కోరతగ్గది. అది స్థిరంగా వుంటుంది. చిక్కులు వచ్చినప్పుడు ధీరుడైనవాడు ఖడ్గవాదం చెయ్యగూడదు. కార్యవాదం విడిచిపెట్టనూ గూడదు. సజ్జనులతో సహవాసం మిక్కిలీ మేలుచేస్తుంది. కనక, సజ్జనులయినవారి నెప్పుడూ హింసించగూడదు. ఇంద్రుడు సజ్జనులకు మిక్కిలీ యిష్టుడు. మహాత్ముల కతను నివాసం. ఎప్పుడూ సత్యమే పలుకుతాడు. చెడ్డపనులు చెయ్యనే చెయ్యడు. ధర్మా లన్నీ బాగా తెలిసినవాడు. ఏది యెలా చెయ్యాలో అతిసూక్ష్మంగా చెప్పగలవాడు. చెయ్యనూ గలడు. కనక, అతనితో నీకు శాశ్వతంగా సంధి కావాలి. నువ్విందు కంగీకరించాలి. నువ్వీసందర్భంలో మరోవిధంగా అనుకోడానికి వల్లకా దయ్యా" అని గట్టిగా చెప్పారు వారు, చివరికి.

వృత్రు డందు కంగీకరించాడు. "మహాతపశ్శాలులు మీరు. నాకు మిక్కిలీ పూజ్యులున్నూ, దేవతలు నేను చెప్పినట్లు చేస్తా మంటే నేను వివరాలు చెబుతాను. మీరు చెప్పినట్టున్నూ చేస్తాను. అదేమిటంటారా? ఇంద్రుడు నన్నెప్పుడూ ఎండినదాంతోనూ, పచ్చిదాంతోనూ,

రాళ్లతోనూ, కర్రలతోనూ, శస్త్రాలతోనూ, అస్త్రాలతోనూ కొట్ట గూడదు. ఇంతే కాదు. పగలూ రాత్రీ కూడా నన్ను కొట్టగూడదు. వారిందు కంగీకరిస్తా రేమో చూసుకోండి. ఇలా అయితే, సంధిచేసు కోడానికి నాకేమీ అభ్యంతరం లేదు" అని కచ్చితంగా చెప్పా డతను.

మహర్షు లందు కంగీకరించారు. అందుకు వృత్రుడున్నూ చాలా సంతోషించాడు. ఇంద్రు డందరికంటేనూ యెక్కువగా సంతోషిం చాడు; కాని వృత్రుణ్ణి చంపడాని కతను వుపాయాలాలోచిస్తూనే వున్నాడు. వృత్రుని లోపాలే కనిపెడుతూ ఎప్పటికప్పుడు తొందరపడి పోతూనూ వున్నాడు.

ఇలా వుండగా, ఇంద్రు డొకనాడు సముద్రపువొడ్డుకు వెళ్లాడు. సరిగ్గా అదే సమయాన వృత్రుడూ వచ్చా డక్కడికి. అది సాయంకాలం. అంటే, పగలు గడిచిపోయింది. రాత్రి యింకా రాలేదు. వృత్రుడు జాగ్రత్తపడని ఘోర మైన సమయం అది.

అప్పు డింద్రుడు బాగా ఆలోచించాడు. శ్రీమన్నారాయణమూర్తి వాగ్దానం కూడా జ్ఞాపకంచేసుకున్నా డతను. "ఇది పగలూ కాదు, రాత్రీ కాదు. సంధ్యాసమయం కనక, నాసర్వస్వమూ హరించిన వృత్రు ణ్ణిప్పుడు చంపితీరాలి. వీడు మహాబలవంతుడు. దృఢ మైన మహాశరీరం కలవాడు. వంచన చేసయినా వీణ్ణి చంపకపోతే చాలా చిక్కులున్నాయి నాకు" అనినీ్న నిశ్చయించుకున్నాడు.

వెంటనే అతను శ్రీహరిని తలుచుకున్నాడు. సరిగా ఆసమయాన, సముద్రంలో కొండంత నురగ కనపడిం దతనికి. "చాలా బాగుంది. ఇది యెండినదీ కాదు,పచ్చిదీ కాదు. శస్త్రం కానే కాదు. దీంతోకొడతాను, క్షణంలో చచ్చివూరుకుంటాడు వృత్రుడు" అనుకున్నా డు. వెంటనే వజ్రా యుధం అభిమంత్రించి ఆనురగతో కొట్టాడు వాణ్ణి. ఆనురగలో శ్రీహరి ప్రవేశించివున్నాడు, కనక, ఆదెబ్బతో వృత్రుడు చచ్చిపోయాడు.

ఇలాగ వృత్రుడు నశించిపోగా దిక్కులు తెల్లవారాయి. చల్లగా విసిరింది గాలి. జను లందరూ సంతోషించారు. మహర్షులూ, గంధర్వులూ, దేవతలూ, యక్షులూ, నాగులూ—అందరూ అనేకవిధాల ఇంద్రుణ్ణి కొనియాడారు. ఇంద్రుడున్నూ అందరూ తనకి సమస్కారాలు చెయ్యగా అందరినీ సంతృప్తిపరిచాడు.

ఇంద్రుడు ధర్మం తెలిసినవాడు. కనక, వృత్రుడు చచ్చిపోయినందుకు చాలా సంతోషించి దేవత లందరితోనూ కలిసి శ్రీ హరినిపూజించాడు.

కాని, నిజానికి ఇంద్రు డబద్ధా లాడాడు. విశ్వరూపుణ్ణి చంపాడు. అంతకి ముందున్నూ బ్రహ్మహత్య చేసివున్నాడు. అప్పటి కప్పుడే పాపా లన్నీ అతణ్ణి చుట్టుకున్నాయి. దాంతో, అతని తెలివి నశించిపోయింది. చైతన్యమున్నూ లోపించింది. వెంటనే నీళ్లలో వురికి పాములాగ కదలసాగాడు.

ఇంద్రు డిలా అయిపోయాటప్పటికి భూమిమీంది చెట్లన్నీ పడిపోయాయి. అడవు లన్నీ యెండిపోయాయి. నదులు తీసిపోయాయి. సరస్సుల్లో నీళ్ళింకిపోయాయి. వానలు వెనకబట్టాయి. దాంతో, జగత్తంతా క్షోభించిపోయింది. మహర్షులూ దేవతలూ కూడా భయపడిపోయారు. లోకా లన్నీ అరాజకం అయిపోయాయి. రకరకాల ఉపద్రవాలు ప్రారంభం అయినాయి. "మనకు రా జేడీ ?" అని మహర్షులూ దేవతలూ కూడా కంగారుపడిపోయారు. "ఈస్వర్గ రాజ్యం పాలించే వా డెవరు ?" అని దేవర్షులున్నూ కుతకుతలాడిపోసాగారు.

## 11

### "అత్యాచ్ఛయః"

మహర్షులూ దేవతలూ బాగా ఆలోచించి "ఇదిగో, యీనహుషు డున్నాడు చూడండీ, ఇతను మిక్కిలీ తేజస్సు గలవాడు. కీర్తి కూడా

చాలా యెక్కువగా వుందితనికి. ధర్మా లన్నీ బాగా తెలిసినవాడూ, ఎప్పుడూ వాటి ననుసరించి నడుచుకుంటున్న వాడూను, ఇతను. కనక, ఇతణ్ణి రాజుగా చేసుకుందాం మనం" అని కూడబలుక్కున్నారు.

వెంటనే వారందరూ వెళ్ళి "రాజా, నువ్వు మాకు రాజువై వుండాలి" అని కోరారు; కాని అత నందు కంగీకరించు లేదు. "అయ్యా, నేను బహూ దుర్బలుణ్ణి. మిమ్మల్నేలడానికి లేశమూ శక్తిలేదు నాకు. రాజయినవాడు బాగా బలవంతుడయివుండాలి. ఇంద్రు డలాంటి బలశాలి కనక మిమ్మల్నేలగలిగాడు" అని చెప్పేశాడు, తను మేలు కోరుకుని.

అయినా "కాదు, కా" దన్నారు వారు. "నువ్వే మాకు రాజువై వుండాలి, తప్ప" దన్నారు. "మేమందరమూ చాలాచాలా తపస్సు చేశాము. మాతపశ్శక్తి నీకిస్తాము. కనక, నిశ్చింతగా, నువ్వీ స్వర్గ రాజ్యం ఏలుకో. మాలోమాకు సమ్మతం లేదు. ఎప్పుడూ, వొకళ్ళని చూసి వొకళ్లం భయపడుతూ వుంటాము. ఇది సత్యం. కనక, నువ్వు పట్టాభిషేకం చేసుకో. దేవతలూ, దానవులూ, యక్షులూ, మహర్షులూ, రాక్షసులూ, పితృదేవతలూ, గంధర్వులూ—ఈనకింవారి అందరి తేజస్సూ నీకు సంక్రమిస్తుంది. దాంతో, నువ్వు మిక్కిలీ బలవంతుడ వయిపోతావు. ధర్మం తప్పకుండా లోకాలన్నీ యేలుకో. ఈబ్రహ్మర్షులనూ, దేవతలనూ కాపాడు" అని బలవంతం చేశారు, చాలా.

నహుషు డందుకంగీకరించాడు. దేవరాజ్యానికి పట్టాభిషేకం మున్నూ చేసుకున్నాడు. వరప్రసాదంవల్ల ధర్మం తప్పకుండా అతను సమర్థంగానే పరిపాలన ప్రారంభించాడు; కాని మొదట ఎంత ధర్మ చింతతో వ్యవహారం ప్రారంభించాడో అంత కామమోహితు డయి పోయాడు, చివరకి.

అది మొదలు - దేవతల ఉద్యానవనాలూ, ఇంద్రుని నందన వనమూ, కైలాసపర్వతమూ, హిమవత్పర్వతంమీాది అందమైన ప్రదే

శాలూ, మందరపర్వతమూ, శ్వేతపర్వతమూ, సహ్యాపర్వతమూ, మహేంద్రపర్వతమూ, మలయపర్వతమూ, సముద్రతీరాలూ, నదుల తీరాలూ అతనివే అయిపోయాయి.

పాటా, వీణా, వేణువూ మొదలైన వాద్యాలూ, వినడమూ, వినసొంపైన కథలు చెప్పించుకోడమూ, మొదలుపెట్టాడు. నారదుడూ, విశ్వావసువూ, గంధర్వులూ ఎప్పుడూ తన యెదట పాడుతూ వుండేటట్టు చేసుకున్నాడు. వసంతాది ఆరు ఋతువులూ మూర్తిమంతులై అతణ్ణి సేవించుకోసాగాయి. ఈసామాగ్రితోనూ, యీస్థలాల్లోనూ, అతను, దేవకన్యలతోనూ, అప్సరసలతోనూ శృంగారచేష్టల్లో మునిగిపోయాడు.

ఇలా వుండగా, వొకనాడు, ఇంద్రుని భార్య అయిన శచీదేవి అతని కళ్లబడింది. వెంటనే సభాసదులను పిలిచి అతను " సకలలోకాలకూ నేను రాజును. దేవతల కందరికీ ఇంద్రుణ్ణి కూడా అయినానుగదా, మరి, యింద్రునిభార్య శచీదేవి నన్నెందుకు చెట్టబట్టదూ? ఇదేమీ పనికిరాదు, వెంటనే మీ రామెను నాకప్పగించవలసిందే " అని గట్టిగా చెప్పాడు.

ఇది తెలిసింది శచీదేవికి. చాలా భయపడిపోయిందామె. వెంటనే బృహస్పతిదగ్గిరికి పరుగెత్తింది. " శరణు శరణు " అంటూ అతని కాళ్ళమీద పడింది. " ఓబ్రహ్మణ్యమూర్తీ! నువ్వే నాకిప్పుడు గతి. నహుషు డిప్పుడు నన్ను చెరచాలని చూస్తున్నాడు. ఉత్తమస్త్రీల కుండవలసిన లక్షణా లన్నీ నాదగ్గిర వున్నా యన్నావు నువ్వు. ఇంద్రుడి ప్రియభార్యను నేను. సుఖాలు తప్ప నేనేమి యెరగ నింతవరకూ. నాకు వైధవ్యం రాదు. నేనేకపత్నిని. పతివ్రతను. ఎన్నోమాట్లివన్నీ నువ్వన్నమాటలు. నాయెడల నీకెప్పుడూ ఇలాంటి అనుగ్రహామే వుంది. వెనక, నువ్వే అన్న మాట లేవీ కూడా పొల్లు

కాకూడదు. కనక, నువ్వే రక్షించాలి నన్ను. నీమాటలు నిజమయేటట్టు చూడు" అనిన్నీ ప్రార్థించింది.

"దేవీ, భయపడ" కన్నాడు బృహస్పతి. "ఇంతకి ముందు నే నేమి చెప్పివున్నానో అదంతా అలాగే జరుగుతుంది, భయపడకు. ఇంద్రు డిక్కడికి త్వరలోనే వస్తాడు. నువ్వతణ్ణి తప్పకుండా కలుసుకుంటావు. నహుషునివల్ల నీకేదో అపాయం కలుగుతుం దని భయ మెంత మాత్రమూ వద్దు. కొద్దిరోజుల్లో నే ఇంద్రుణ్ణీ నిన్నూ నేను కూరుస్తాను. ఇందుకు తిరుగు లేదు" అని బాగా ధైర్యమున్నా చెప్పా డామెకి.

శచీదేవి బృహస్పతి నిలా శరణు చొచ్చిందని విన్నాడు నహుషుడు. "ఆ," అంటూ వెంటనే అతనిమీద మండిపడిపోతున్నాడు.

## 12

## పొద్దు వాలింది

చాలా కోపంగా వున్నాడు నహుషుడు. భయంకరంగా కూడా వున్నాడు. అది చూసి "దేవరాజా, కోపం వద్దు" అంటూ ప్రాధేయపడ్డారు దేవతలూ మహర్షులూను.

"ప్రభూ, నువ్వు కోపిస్తే దేవతలూ, అసురులూ, గంధర్వులూ, నాగులూ, కిన్నరులూ — అందరూ — జగత్తే వాణికిపోతుంది. నీవంటి సాధుజను లెవరూ ఇలా కోప్పడరు. శచీదేవి నీకు పరస్త్రీ. ఆమె యెడల అనుగ్రహం చూపించు. పరస్త్రీలను కోరడం మహాపాపం. కనక, అలాంటి సంకల్పం నువ్వు విడిచిపెట్టు. నువ్వు సామాన్యుడివి కావు, దేవరాజవు, ధర్మమార్గం తప్పకుండా ప్రజలను పరిపాలించాలి నువ్వు" అని చాలా ప్రార్థించారు వారు.

అయినా, నహుషుడు వారి మాటలు వినిపించుకోలేదు. పై పెచ్చు "అహల్య సంగతి ఎవరెరగనిదీ ? గొప్ప మహర్షి భార్య ఆమె. చాలా యశస్సు కలది. భర్త బతికే వుండగా మీ ఇంద్రుడామెను చెరిచాడు. ఏంచేశారు మీరతణ్ణి ? అనేకమందిని పీడించాడతను. బ్రహ్మహత్యలు చేశాడు. మోసాలు చేశాడు. మీరేం చేశారతణ్ణి ? మీరెంతో చేశారు చాలా. అయినా, అతణ్ణి నివారించలేదేం మీరు? లాభం లేదు. శచీదేవి నాదగ్గిరికి రావలసిందే. నన్ను చెట్టపట్టవలసిందే. అలా అయితేనే ఆమెకి శ్రేయస్సు కలుగుతుంది. ఆమెని తీసుకువస్తేనే మీరు క్షేమంగా వుంటారు" అంటూ చాలా నిక్కచ్చిచేశాడతను.

"అయితే, సరే" అన్నారు వారు మరి గతిలేక. "శచీదేవిని తీసుకువస్తాము, మరి, కోపం విడిచిపెట్టు. దయవుంచు" అనికూడా కోరారు. శచీదేవి కీఅమంగళవాక్యం చెప్పడానికి బృహస్పతి దగ్గిరకి వెళ్లారు వారు వెంటనే.

"మహానుభావా, గురువర్యా, శచీదేవి నిన్ను శరణుపొందిందనీ, నీరక్షణలో వుందనీ మాకు తెలుసు. ఈదేవతలూ, ఈగంధర్వులూ, ఈమహర్షులూ – మేమందరమూ వేడుకుంటున్నాము, ఆమెని నహుషుని కిచ్చెయ్యి. అతను చాలా తేజస్సు గలవాడు. ఇంద్రుడికంటే చాలా గొప్పవాడు. విశేషించి మన కిప్పుడతనే రాజు. కనక, శచీదేవి ఇప్పుడతణ్ణి భర్తగా అంగీకరించాలి" అని చెప్పారు.

ఇది విని, గొల్లుమంది శచి. కంటికీ మంటికీ ఏకధారగా ఏడ్చేసింది కూడా. "దేవగురూ, మహానుభావా, నేను నీకు శరణుచొచ్చివున్నాను. నువ్వున్నూ నాకభయం ఇచ్చివున్నావు. నన్ను విడిచిపెట్టకు. నన్ను రక్షించు. నేను నహుషుణ్ణి భర్తగా స్వీకరించలేను" అంటూ మిక్కిలీ దీనంగానున్నూ వేడుకుంది బృహస్పతిని.

"విడిచిపెట్టను నిన్ను" అన్నాడు ముందు బృహస్పతి, దృఢంగా. "నిన్నే కాదు, శరణుచొచ్చినవారి నెవరినీ విడిచిపెట్టన్నేను. ఇది నాదృఢ వ్రతం. నువ్వు ధర్మాలన్నీ బాగా తెలిసినదానవు. సత్యమే మాట్లాడ తావు నువ్వెప్పుడూ. నిన్ను విడిచిపెట్టడం అన్నది నాదగ్గిర లేనేలేదు" అంటూ ఆమెకి ధైర్యం చెప్పాడు. "అయ్యా, దేవతల్లారా! నేను ధర్మాలన్నీ విన్నవాణ్ణి. సత్యమే నావ్రతం. ధర్మాలెలా ఆచరం చాలో, వాటి నెలా కాపాడాలో అదిన్నీ బాగా తెలిసినవాణ్ణి. విశే షించి బ్రాహ్మణ్ణి. కనక, చెయ్యగూడని పని యేదీ గూడా చెయ్య న్నేను. మీకోరిక యెంతమాత్రమూ నేను కొనసాగించను. పొండి, వచ్చినదారినే వెళ్లిపొండి. తనని శరణుచొచ్చినవారిని భయపడి యెవడు వారి శత్రువుల కప్పగిస్తాడో వాడు చల్లే విత్తనాలు మొల కెత్తవు. వాడి చేలల్లో వానలు కురియవు. కష్టాలు వచ్చినప్పుడు వాణ్ణె వరూ రక్షించ రెంత ప్రాధేయపడ్డా. తనని శరణుచొచ్చినవారి నెవడు వారి శత్రువుల చేతిలో పెడతాడో వాడిఅన్నం చెడిపోతుంది. వాడి మనస్సు కలుషితం అయిపోతుంది. వాడికి స్వర్గం రానేరాదు. అంతకి ముందు చేసుకున్న మంచికార్యాలవల్ల అది లభించినా వెంటనే భ్రష్టుడై కిందపడిపోతాడు. వాడు యజ్ఞాలు చేస్తే దేవతలు వాడి హవిర్భాగాలు పుచ్చుకోరు. వేరే గతిలేక తన అండచేరినవారి నెవడు వారి శత్రువుల అధీనం చేస్తాడో వాడిబిడ్డలు అకాలమరణం పొందు తారు. తల్లిదండ్రులు దుర్భాష లాడి వాణ్ణి విడిచిపెట్టేస్తారు. ఇంద్రుడు వజ్రాయుధంతో వాణ్ణి చంపేస్తాడు. నామాటలు కావివి. వెనకటి కొకమాటు బ్రహ్మ చెప్పాడివి తెలుసా? ఇదంతా తెలిసివున్న నేను శచీదేవిని నహుషుని కెలా అప్పగిస్తానూ? ఈమె ఇంద్రుని పట్టమహిషి. ఈమె అంటే అతను ప్రాణాలిచ్చేస్తాడు. ఇది లోకాని కంతకూ తెలి సిందే, రహస్యం కాదు. అయితే, మీరొక టాలోచించండి. ఈమె

భద్రంగా వుండాలి. నాకున్నూ హితంగా వుండాలి. అలాంటి వుపాయ మేమయినా వుందేమో చూడండి. నహుషునికి నేనీమె నివ్వను గాక యివ్వను" అని ఖండితంగా చెప్పేశాడు.

దేవతలూ మహర్షులూ అందు కానందించారు; కాని "మాక లాంటి దారేమీ కనపడ్డంలే" దన్నారు. "ఏమి చేస్తే బాగుంటుందో అది నువ్వే ఆలోచించి చెప్పు" అని కోరారు. దానిమీద బృహస్పతి చాలా ఆలోచించాడు. "శచీదేవి నహుషుని యెదటికి వెళ్ళడం అగ త్యమే, వొప్పుకుంటాను. అయితే, ఆమె చెయ్యావలసింకల్లా సంగమా నికి కొంతకాలం వ్యవధి యిమ్మని అడగడం. దీంతో ఆమే కృతకృ త్యురా లవుతుంది. మనకూ మంచి జరుగుతుంది. ఎంచేత నంటారా? కాలం విఘ్నాలు తీసుకువస్తుంది. కాలం దినాలు గడిపేస్తుంది. నహు షుడు వరగర్వంతో కిందూ మీదూ తెలియకుండా వున్నాడు కనక, వాడి కేదో వొక కీడూ కలిగిస్తుంది" అని చెప్పాడు.

వారందరూ సంతోషించా రిది విని. "ఆచార్యా, అపాయం లేని వుపాయం చెప్పావు నువ్వు. దేవతల కందరికీ యిది మిక్కిలీ క్షేమకరం అవుతుంది. శచీదేవి కూడా యిందులో వున్న కిటుకు గుర్తించిమమ్మను గ్రహిస్తుం దనే ఆశిస్తున్నా" మని మిక్కిలీ మెచ్చుకున్నారువారు.

అగ్ని ముందూ, తరవాత తామున్నూగా దేవతలూ మహర్షులూ శచీదేవి దగ్గిరికి వెళ్ళారు. "దేవీ, సమస్తమూ నీకు తెలుసు. స్థావర జంగమాత్మక మైన యీజగత్తంతా నీస్వాధీనంలో వుంది. నువ్వు ఏకపత్నివి. నిత్యసత్యం యిది. అయితే, నువ్వు నహుషుని దగ్గిరికి రావాలి. పాపాత్ము డతను. కనక తప్పకుండా నశిస్తాడు. త్వరలోనే నశిస్తాడు. నువ్వు మన బృహస్పతి చెప్పిన ట్టంటే చాలు. ఇంద్రుడు త్వరలోనే వస్తాడు. మళ్ళీ తన ఐశ్వర్యమూ అనుభవిస్తాడు, సందేహం లేదు" అనిచెప్పి ఆమెని వేడుకున్నారు.

శచీదేవి కూడా ఇంతకంటే మరోమార్గం లేదని గుర్తించి వారితో బయలుదేరింది. కాముకుడయి వున్నా డతను. అంచేత, సాటిలేని అందకత్తె శచీదేవిని చూసి చాలా ఆనందించాడు నహుషుడు.

# 13

## "నందో రాజా భవిష్యతి"

నహుషుడు, ఆసంతోషంతో "ఓశచీ, మూడు లోకాల కూ నేనే ఇంద్రుణ్ణి. కనక, భార్య వయి నన్ను సుఖపెట్టు" అని కోరా డామెని. ఇది విని, శచి, సుడిగాలి కరటిచె ట్టూగిపోయేటట్టు వొణికిపోయింది. ఒక్కమాటు బ్రహ్మను తలుచుకుని తలవంచివొక్కనమస్కారం పెట్టింది. "సురేశ్వరా" అని పిలిచి "నీతో కలియడాని కొంచెం వ్యవధి కావాలి నాకు. ఏమంటే? ఇంద్రు డెక్కడున్నాడో, తిరగీ వస్తాడో రాడో యిప్పటికీ తెలియకుండా వుంది. ఆసంగతి ముందు తేలాలి. ఇంద్రుడు రాడూ? తప్పకుండా నేనప్పుడు నీదాన్నవుతాను" అని బదులుచెప్పేసింది.

"అలాగే కానియ్యి" మన్నాడు నహుషుడు. "శచీ, ఇంద్రుని సంగతి అటో యిటో తెల్చుకునే రా. ఆమాటమీద మాత్రం వుండు" అనిన్నీ సెలవిచ్చేశా డామెకి. అది తలుచుకుని తలుచుకుని చాలా సంతోషించా డతను.

వెంటనే బృహస్పతి యింటికి వెళ్లిపోయింది శచి. ఆమె చెప్పగా జరిగిం దంతా విని "ఇంద్రు డెక్కడ దొరుకుతాడూ?" అని ఆలోచించారు దేవతలు. తిన్నగా విష్ణుమూర్తి దగ్గిరికి వెళ్లారు, ఉపాయం కనపడక. "పురుషోత్తమా! ఇంద్రుడు బ్రహ్మహత్యచేసి ఆపాపంలో మునిగిపోయాడు. ఈప్రాణికోటి నంతటినీ రక్షించడం కోసమే, నువ్వు, అంతటా నిండి "విష్ణు" వయినావు. కనక, మాకిప్పుడు నువ్వే గతి.

వృత్రుణ్ణి నువ్వు సంహరించావు. బ్రహ్మహత్యాపాతక మేమో ఇంద్రుణ్ణి చుట్టబెట్టుకుంది. అతణ్ణి రక్షించు. అతని కాపాపం లేకుండా చెయ్యి" అని ప్రార్థించారు వారు.

అదంతా విన్నాడు శ్రీమహావిష్ణువు, వారి భక్తి కానందించాడు. 'తొందరపడకండి" అంటూ వూరడించాడు. "ఎంతో అక్కరలేదు, కొద్దికాలమే వోపికపట్టండి. తాను చేసిన పాడుపనులవల్లనే నహుషుడు నాశనం అయిపోతాడు. అయితే, నన్నే వుద్దేశించి ఇంద్రుడిప్పుడశ్వమేధయాగం చెయ్యడం మంచిది. అలా చేస్తే వెంటనే పరిశుద్ధుడవుతాడతను. మీకందరికీ మళ్లీ ప్రభువూ అవుతాడు. దీని కెంతో కాలం అక్కరలేదు" అని చెప్పి వారిని పంపేశాడు.

దేవతల కిది సత్యం అనీ, జరిగితీరే మాట అనీ తెలుసు. అంచేత వారి కిది అమృతమే అయింది. వెంటనే మహర్షులనూ ఋత్విక్కులనూ వెంటబెట్టుకుని ఇంద్రుడున్నచోటికి వెళ్ళి, శ్రీహరి యెలా చెయ్యమన్నాడో అశ్వమేధయాగం అలా చేశారు. చాలా గొప్పగానున్నా చేశారది యింద్రునికోసం.

ఇంద్రుడు పాపవిముక్తుడై వెంటనే బయటపడ్డాడు. ఆబ్రహ్మహత్యాపాతకం మొదట అత నయిదుభాగాలుగా చేశాడు. ఒకభాగం వృక్షాలయందూ, ఒకభాగం నదులయందూ, వొకభాగం పర్వతాలయందూ, మరోభాగం భూమియందూ, ఇంకోభాగం స్త్రీలయందూ ఉంచేశాడు. ఇలా చెయ్యడంవల్ల అతనిపాపం అంతా నశించింది. అతను మళ్ళీ స్వస్వరూపం పొందాడు; కాని నహుషుణ్ణి చూశాడతను. తన స్థానంలోనే వున్నాడు నహుషుడు, కదలకుండా. చూసీచూడ్డంతోనే ఎలాంటివారి తేజస్సూకూడా హరించేస్తున్నాడతను. దేవతలూ మహర్షులూ ఇచ్చిన వరంవల్ల యెవరికీ లొంగని స్థితిలోనూ వున్నాడు. దాంతో భయపడి ఇంద్రుడు మళ్ళీ మాయమయి పోయాడు.

అది చూసి శచీదేవి మళ్లీ దుఃఖసముద్రంలో మునిగిపోయింది. చాలా సేపు, చాలాచాలా ఏడ్చింది. "మనస్ఫూర్తిగా నేను దానధర్మాలేమయినా చేసివుండినట్టయితే, యథాశాస్త్రంగా హోమాలు చేసి నేను అగ్ని దేవుణ్ణి తృప్తిపరిచివుండినట్లయితే, నాప్రవర్తన గురువులకున్నూ ప్రీతి కలిగించివుంటే, నాదగ్గిర సత్యమే వుండినట్టయితే నేను ఏకపత్నినే కావాలి. ఇది ఉత్తరాయణం. కనక, ఈనిశాదేవిని నేను మొక్కుకుంటున్నాను. నాకోరిక ఫలించితీరాలి" అంటూ శపథం చేసుకుందామె.

ఈశపథంతో ఆమె ఉపశ్రుతి దేవినిన్నీ పూజించింది. "అమ్మా, ఉపశ్రుతీ, నన్నునుగ్రహించి నాకు కనపడు. నాకోరిక తీర్చు. నాభర్తను మళ్లీ స్వర్గపట్నంలో ప్రవేశపెట్టు. ఓ దివావసూ! పగటికి సూర్యుడే సకలధనమున్నూ. ఆసూర్యునిలాగే నువ్వూ చీకటిలో వున్న వస్తువు స్పష్టంగా చూపించగలవు" అనిన్నీ ప్రార్థించింది.

## 14

## అంతరాంతరాల్లో

ఉపశ్రుతీదేవి వెంటనే సాక్షాత్కరించింది. మంచి యౌవనంలో వుందామె. చాలాఅందంగానూ వుంది. మిక్కిలీ సౌమ్యంగా కూడా వుంది. ఆమెని శచీదేవి చాలాగౌరవంగా చూసింది. భక్తితో పూజించింది. "దేవీ, నువ్వెవరవమ్మా" అనడిగింది చివరికి. అందుకామె "శచీ! నేనుపశ్రుతీ దేవిని. నువ్వు సత్యవ్రతురాలవు. పతివ్రతవు. యమనియమాలున్నూ కలదానవు. అంచేత నీకు కనపడ్డాన్నేను. నీయింద్రుణ్ణి నీకు చూపిస్తాను, వెంటనే నావెంటరా" అని బదులుచెప్పింది.

"సరే, పద" అంది శచీదేవి. ఇద్దరూ బయలుదేరారు. వారు, దేవతలు మాత్రమే తిరిగే అరణ్యాలెన్నో దాటారు. పర్వతాలు

దాటారు. హిమవత్పర్వతమున్నూ దాటి దాని ఉత్తరప్రుతట్టు చేరుకు న్నారు. అక్కడ వొక సముద్రం తగిలింది. అనేక వేల లక్షల ఆమడల సముద్రం అది. అందులో వొక పెద్ద ద్వీపం వుంది. అక్కడ రకరకాల చెట్లూ, ఎన్నో జాతుల తీగలూ వున్నాయి. ఆద్వీపంలో మళ్లీ వొక సరస్సుంది. ఎటు చూసినా నూరు ఆమడల విశాలంగా వుందది. అందులో మరెక్కడా కనపడని పక్షిజాతు లెన్నో వున్నాయి. చక్కగా కూస్తున్నా యవి. దాల్లో అయిదురంగుల తామరపువ్వు లున్నాయి. వేలకొద్దీ – లక్షలకొద్దీ – చక్కగా విచ్చి మిక్కిలీ చూడ ముచ్చటగా వున్నా యవి. వాటిమీద వాలి మకరందం పానం చేస్తూ తుమ్మెద లెంతో కమ్మగా ఝుంకారం చేస్తున్నాయి.

ఆపద్మాల మధ్యగా వొక పెద్దపద్మం వుంది. దాని కాడ గౌర వర్ణంగా వుంది. చాలా పొడుగ్గా వున్నాయి దాని రేకులు. ఉపశ్రుతి దాని కాడ తుంచి శచీదేవితో అందులో ప్రవేశించింది. చూడగా ఆతామరతూటిలో, సన్నని పోగుల మధ్య నక్కి వున్నా డింద్రుడు, ముడుచుకుపోయి.

ఉపశ్రుతి మిక్కిలీ సూక్ష్మరూపం ధరించింది. వెంటనే శచీదేవి ఇంద్రుణ్ణి అనేకవిధాల స్తోత్రంచేసింది. అందు కానందించి అతను "నువ్వి క్కడి కెందుకు వచ్చావూ? అసలు, నేనిక్క డున్నా నని యెలా తెలుసు కున్నావూ?" అనడిగాడు. అందుకు, జరిగిం దంతా చెప్పిం దామె, మొదట. తరవాత నహుషుడి సంగతి యెత్తుకుంది. "వాడిప్పుడు మూడులోకాలకూ ఇంద్రు డయి వున్నాడు. మిక్కిలీ బలవంతుడున్నూ అయివున్నాడు. వాడి దర్పం చెప్పశక్యం కాకుండా వుంది. తనని పెళ్లాడ మంటాడు నన్ను. అందు క్కొంత వ్యవధిన్నీ యిచ్చాడు. ప్రభూ, నువ్వు నన్ను రక్షించాలి. లేకపోతే, బలవంతాన వాడు నన్ను

ఆక్రమించుకుంటాడు. ఈకారణం వల్ల నీకోసం నేను పరుగెత్తుకుంటూ వచ్చాను. వాడు మహాపాపాత్ముడు. అనేక ఘోరాలు చేస్తున్నాడు. కనక, వెంటనే వచ్చి నువ్వు వాణ్ణి నరికెయ్యి. నీ తేజస్సు నువ్వు పొంది మళ్లీ దేవరాజ్యం సుఖంగా ఏలుకో" అంటూ ప్రార్థించిం దామె.

## 15

### అందలం

ఇదంతా విని ఇంద్రుడు "పరాక్రమం చూపించడాని కిది సమయం కాదు" అన్నాడు. "స్వయంగానే నహుషుడు చాలా బలవంతుడు. మహర్షు లిచ్చిన హావ్యకవ్యాలతో వాడు మరీ మత్తెక్కి వున్నా" డన్నాడు. "కనక, తిరుగులేని పన్నాగం వొకటి చెబుతా విను. ఏమీ అనుమానం పెట్టుకోక నువ్వలా చెయ్యి. నువ్వది మిక్కిలీ గోప్యంగా వుంచుకోవాలి. ఎక్కడా బైటపెట్టగూడదు. అదేమిటంటే? నువ్వు నహుషుని దగ్గిరికి వెళ్లు. ఏకాంతంగా వాడితో మాట్లాడు. 'జగదీశ్వరా! మహర్షి యానం యెక్కి మాయింటికి రా' అని చెప్పు. 'ఇలా చేస్తే సంతోషంగా నేను నీవశం అవుతా' నని ఆశపెట్టు" అని వుపాయం చెప్పాడు చివరికి.

"అలాగే చేస్తా" నని బయలుదేరి, శచీదేవి నహుషుని దగ్గిరికి వెళ్లింది. ఆమెని చూసి ముందు చిరునవ్వు నవ్వుకున్నాడు నహుషుడు. "వరారోహా, నీకిదే స్వాగతం విన్నవించుకుంటున్నాను. నన్నేం చెయ్యామంటావో చెప్పు. నేను నీభక్తుణ్ణి. నన్ను సంతోషపెట్టు. నువ్వేమి చెయ్యా లన్నా చేసేస్తా న్నేను నా మాట నమ్ము. సిగ్గుపడకు. సత్యంమీద వొట్టు, ఆజ్ఞాపించు" అని చెప్పాడు.

దానిమీద శచి అందుకుంది. "నువ్వు నాకు వ్యవధి యిచ్చావు. అది ముగిసింది, అంటే, కొంచేమే మిగిలివుంది. నువ్వే నాకు భర్తవు,

సందేహం లేదు" అని చెప్పింది ముందు. "అయితే, నాకో కోరిక వుంది. అది నువ్వు నెరవేర్చాలి. నీ మీద ప్రేమతో చెబుతున్నా నీ మాట" అంటూ ముద్దూ మురిపెమూ చూపించింది తరవాత. "అదేమిటంటావా? ఇంద్రునికి గుర్రా లున్నాయి. ఏనుగు లున్నాయి. రథా లున్నాయి; కాని అవన్నీ పాతబడిపోయాయి. అపూర్వ మైన వాహనం వుండాలి నీకు. విష్ణుమూర్తికి లేనిదీ – శివునికిన్నీ లేనిదీ – రాక్షసుల కసలే లేనిదిగా వుండా లా వాహనం. అదేమిటంటావా? మహర్షులూ బ్రహ్మర్షులూ కలిసి పాలకి మొయ్యాలి. నువ్వా పాలకీ యెక్కి రావాలి నా యింటికి. ఇదీ నాకు ఘనత. దేవతల్లోనూ దానవుల్లోనూ కూడా అప్పుడు నీకు సాటి అయినవా డుండడు. ఎదటబడితే యెలాంటి తేజస్సూ కూడా హరించేస్తావు నువ్వు. ఎలాంటివాడూ నీ యెదట నిలవలేడు" అని చెప్పేసింది చివరికి.

"ఓహోహో, చాలా గొప్పమాట చెప్పా" వంటూ నహుషుడు పొంగిపోయా డిది విని. "సుందరీ, నువ్వు చెప్పిన వాహనం చాలా గొప్పది, సందేహం లేదు. నాకున్నూ చాలా నచ్చిం దది. ఇక నేను నీకు భృత్యు ణ్ణయిపోయా ననుకో; మిక్కిలీ ఘనత కలిగించే వాహనం నాకది. మహర్షి వాహనం మీద వచ్చేవాడు సామాన్యు డయివుంటాడా మరి? నేను మహాతపశ్శాలిని. చాలా బలవంతుణ్ణి. భూతానికీ, వార్తమానానికీ, భవిష్యత్తుకీ కూడా నేనే ప్రభువుని. నేను కోప్పడ్డా నంటే జగత్తంతా—లేనేలేదన్నమాట. సర్వమూ నాచేతిలో వుంది. దేవతలూ, దానవులూ, గంధర్వులూ, కిన్నరులూ నాగులూ, రాక్షసులూ—వీరే అన్నమా టేమిటి. నేను కళ్ళెర్రజేశా నంటే మూడులోకాలూ నాకు చాలలేవు. ఎలాంటివాణ్ణయినా సరే, నేను కళ్ళు విప్పి చూశా నంటే వాడి తేజస్సంతా నాకు సంక్రమించే స్తుంది. కనక, నీకోరిక తప్పకుండా తీరుస్తా న్నేను. సప్తమహర్షులూ

బ్రహ్మర్షులూ కూడా కలిసే నా పాలకీ మోస్తారు, చూసుకో" అంటూ తాండవమే చేశా డతను.

ఇలా చెప్పి శచీదేవిని పంపేశాడు నహుషుడు. వెంటనే సప్తమహా మునులకూ బ్రహ్మర్షులకూ రమ్మని వర్తమానం పంపేశాడు. కామోద్రేకంతో కళ్ళు మూసుకుపోయి వున్నాడు కనక, "మొయ్యండి" అంటూ పాలకీ యెక్కి కూచున్నాడు తాను. ఊరేగడమున్నూ ప్రారంభించాడు దర్పంగా.

ఆవెళ్ళడం వెళ్ళడం తిన్నగా బృహస్పతి దగ్గిరికి వెళ్ళింది శచీదేవి. "మహాత్మా, నహుషుడిచ్చిన గడువు ఇక కొంచెమే వుంది. కనక, నువ్వింద్రుణ్ణి వెతకాలి. నీపాదా లాశ్రయించుకుని వున్నా న్నేను. నామీద అనుగ్రహం వుంచు" అనిన్నీ కోరిందామె.

"నీకు వచ్చిన భయ మేమీ లేదు" అన్నా డందుకు బృహస్పతి. "నహుషు డేదో చేస్తా డని లేశమూ నువ్వు భయపడవద్దు. వాడిక మన్నడు. అయిపోయింది వాడిపని. అసలే ధర్మం తెలియనివాడు వాడు. పై పెచ్చు, తన పాలకీ మహర్షులచేత మోయించుకుంటు న్నాడు కూడాను. ఆదురాత్ముడు నాశనం అయిపోడానికి నేనొక యిష్టి కూడా చేస్తాను. నువ్వింక భయపడకు. ఇంద్రుణ్ణి నేను తీసుకు వస్తాను. నీకు శుభం కలుగుతుంది" అని గట్టిగా చెప్పా డతను.

వెంటనే అగ్నిహోత్రం దగ్గిర కూచున్నాడు బృహస్పతి. ఇంద్రుడు సుఖంగా రావడానికి హోమాలు చేశాడు శ్రద్ధగా. "వెళ్ళి ను వ్వింద్రుణ్ణి తీసుకురా వెతికి" అని చెప్పా డగ్ని దేవుడికి.

ఈమాటమీద, అగ్ని దేవుడు, అద్భుతం అయిన స్త్రీవేషం వేసుకు వచ్చి అప్పటికప్పుడే మాయం అయిపోయాడు.

అతను దిక్కులూ విదిక్కులూ వెతికాడు. పర్వతాలూ, అరణ్యాలూ గాలించాడు. మనోవేగంతో భూమీ ఆకాశమూ కూడా తిరి

గేశాడు. నిమిషంలో మళ్ళీ బృహస్పతి దగ్గిరికి వచ్చి "మహాత్మా, ఇంద్రుడు నా కెక్కడా కనపడలేదు. ఒక్క నీళ్ళుతప్ప నేను వెతకని చోటు లేదు. నీళ్ళలో దిగడం మాత్రం నాకిష్టం లేదు. నే నందులో యేమీ చెయ్యలేను, మరి. అది కాక, మ రేమి చెయ్యమంటావో చెప్పు" అనడిగాడు.

కాని బృహస్పతి అందుకంగీకరించలేదు. "నువ్వు నీళ్ళలో దిగవలసిందే, అక్కడ కూడా వెతకవలసిందే, మరి కాదనడానికి వల్లకాదు" అంటూ చాలా గట్టిగా నిర్బంధించా డతను. అయినా, "నావల్లకా" దన్నా డగ్నిహోత్రుడు. "నేను నీళ్ళవల్ల పుట్టాను. క్షత్రియులు బ్రాహ్మలవల్లపుట్టారు, రాళ్ళవల్ల లోహాలు పుట్టాయి. ఎక్కడికి వెళ్ళినా మాకడ్డులేదు; నీళ్ళదగ్గిర నా తేజస్సూ, బ్రాహ్మలదగ్గిర క్షత్రియుల దర్పమూ, రాళ్ళదగ్గిర లోహాలశక్తీ ఆరి పోతాయి" అని వినయంగా చెప్పుకున్నా డతను.

## 16

### పం ప కా లు

అయినా, బృహస్పతి వొక టే పట్టుపట్టాడు. "అగ్నీ, దేవతల కందరికీ నువ్వే ప్రముఖుడవు. సర్వభూతాలకూ నువ్వు అంతరాంతరాల్లో సంచరిస్తూవుంటావు. కవులు, ముందు నువ్వొక్కడవే అనీ, తరవాత మూడు రూపాలు ధరిస్తా వనీ చెబుతారు. వాటిలో మొదటిది జఠర రూపం. తరవాతివి గార్హపత్యమూ, దక్షిణమూ, ఆహవనీయమూ అన్నవి. నువ్వీలోకాలు విడిచిపెట్టేశా వంటే క్షణంలో నాశనం అయి పోతా యవి. నీకు నమస్కారాలు సమర్పించుకుని, బ్రాహ్మలు, తమ భార్యలతోనూ పుత్రులతోనూ కర్మపరతంత్రులై తాము సంపాదించుకున్న ఉత్తమలోకాలు పొందుతారు. హవ్యాలు తీసుకువచ్చి నువ్వే

దేవతల కందరికీ యిస్తావు. అసలు, హవిస్సే నువ్వు. సత్రయాగాల్లో బ్రాహ్మలు నిన్నే పూజిస్తారు. ఈమూడు లోకలూ నువ్వే సృష్టించి కాలం బాగా పక్వం అయాక, మళ్ళీ నువ్వే అంతం చేస్తావు. వాటికి రక్షకుడవున్నూ నువ్వే. పండితులు నువ్వే మేఘం అనీ, మెరుపున్నూ నువ్వే అనీ చెబుతారు. నీవెలుగే సర్వభూతాలనూ నిలుపుతుంది. నీరు నీలోనే వుంది. ఈమూడు లోకాల్లోనూ నీకు తెలియందేమీ లేదు. కనక, భయపడకు. అనుమానం విడిచిపెట్టి నీళ్ళలో దిగు. పుట్టినిల్లు ఎవరూ విడిచిపెట్టరు. ఇంతకీ—బ్రాహ్మమంత్రాలతో నీకు పుష్టి కలిగిస్తా న్నేను" అంటూ స్తుతిచేసి మళ్ళీ తొందరపెట్టాడు బృహస్పతి.

దీంతో పొంగిపోయాడగ్ని దేవుడు. "ఇదిగో నేను వెడుతున్నాను. ఎలాగో వొకలాగ నీ కింద్రుణ్ణి చూపిస్తాను. సందేహంలే" అంటూ వెళ్ళి నీళ్ళలో నున్నూ ప్రవేశించాడు. సముద్రాలన్నీ వెతికాడు. నదులూ సరస్సులూ కూడా వెతికాడు. చివరికి, తామరకాడలో సన్నని పోగుల్లో అణుమాత్రుడై నక్కివున్న ఇంద్రుణ్ణి పట్టుకున్నాడు. ఒక సరస్సులో వున్న పద్మాలన్నీ బాగా గాలించి "ఇదుగో నయ్యా నీయింద్రుడు" అంటూ బృహస్పతికిన్నీ చూపించాడు, తుదకి.

దేవతలనూ, దేవర్షులనూ, గంధర్వులనూ, మహర్షులనూ వెంట బెట్టుకువెళ్ళాడు బృహస్పతి. "ఇంద్రా! ఎవరూ చెయ్యలేని వెన్నో చేశావు నువ్వు. దారుణా లనేకాలు చేసిన మహాసురుడు నముచి నీ చేతిలో చచ్చాడు. శంబరీ బలీ కూడా మహాపరాక్రమవంతులు. ఎన్నో ఘోరాలు చేసినవాళ్ళు. వాళ్ళున్నూ నీ చేతిలో నాశనంఅయి పోయారు. ఓ శతక్రతూ! వర్ధిల్లవయ్యా! మిగిలిన శత్రువులను కూడా సంహరించవయ్యా! దేవర్షులూ గంధర్వులూ మొదలైనవారు వచ్చి వున్నారు లే. నీ కోసం కనిపెట్టుకుని వున్నారు. నా రిలా చూడ

వయ్యా! ఎందరినో దానవులను సంహరించి మూడులోకాలూ కాపాడావు నువ్వు. శ్రీ మహావిష్ణువు అఖండ తేజస్సుతో నిండివున్న నురగ పుచ్చుకొట్టి వృత్రాసురుణ్ణి సంహరించావు నువ్వు. సకలభూతాలకూ నువ్వే శరణ్యం. సర్వభూతాల్లోనూ శరణుపొందతగ్గవాడవున్నూ నువ్వొక్కడవే. నీకు సాటిఅయినవాడు మరొకడు లేడు. సర్వభూతాలకూ నువ్వే ఆధారం. దేవతలకు నీ వల్లనే ఘనత వచ్చింది. లే, లే, బలంకూర్చుకో. లోకాలు కాపాడు" అంటూ మిక్కిలీ స్తుతించాడు. చెయ్యవలసిం దంతా చెప్పి "అనుగ్రహించు" అని కోరాడు.

దీంతో అణుమాత్రంగా వున్న వా డల్లా, ఇంద్రుడు' మెల్లిమెల్లిగా, కొంచెంకొంచెం వృద్ధి అయి, చివరికి యధారూపం పొందాడు. "గురూత్తమా! విశ్వరూపుడు నాశనం అయిపోయాడు. మహాకాయుడైన వృత్రాసురుడున్నూ బుగ్గిఅయిపోయాడు. ఇంకేమిటి తరవాయి?" అనడిగాడు బృహస్పతిని.

దానికి బృహస్పతి "నహుషు డని వొక మానవుడు. వాడు రాజు. మహర్షుల అనుగ్రహంవల్ల వాడు దేవతలకు రాజయినాడు. అయి మమ్మల్ని దారుణంగా పీడిస్తున్నాడు" అని బదులుచెప్పాడు.

"అయితే, దేవతల రాజ్యం అంటే యెలాంటివాళ్లకీ గూడా దుర్లభం కదా? ఆమనిషి అది యెలా ఆక్రమించుకోగలిగాడూ? వాడేమాత్రం తపస్సు చేశాడూ? వాడి పరాక్రమమున్నూ యెలాంటిదీ?" అని మళ్లీ అడిగా డింద్రుడు.

"ఇంద్రా! నువ్వు దేవరాజ్యం విడిచిపెట్టేశావు. దాంతో, దేవతలందరూ దిక్కులేనివాళ్లయిపోయారు. భయభ్రాంతులున్నూ అయి "నువ్వు మాకు రాజుగా వుండ" మని వాణ్ణి వేడుకున్నారు. దేవతలొక్కళ్లేకాదు, పితృదేవతలూ, మహర్షులూ, గంధర్వులూ — ఇలాంటివా రింకా యెందరో కట్టకట్టుకువెళ్లారు, వాడి దగ్గిరికి. "నువ్వు మాకు

రాజుగా వుండి, లోకా లన్నీ యేలుకో” అని ప్రార్థించారు. అయితే, వాడు తానందుకు సమర్థుణ్ణి కానని చెప్పుకున్నాడు మొదట. మీ తపస్సు నాకు ధారపొయ్యండి. మీ తేజస్సు నాకు ధారాదత్తం చెయ్యండి. ఈవిధంగా మీరు నాకు యోగ్యతా అర్హతా కలిగించండి.” అని వేడుకున్నాడు వాడు

“సరే” అన్నారువారు. అని వాడు కోరిన వన్నీ కోరినట్టే చేశారు. దాంతో వాడు పురెక్కాడు. దేవరాజున్నా అనిపించుకు నాడు. అంతే కాదు, సప్తమహర్షులచేతా దేవర్షులచేతా పాలకీ మోయించుకుంటూ మూడు లోకాలూ తిరుగుతున్నా డిప్పుడు. ఎప్పు డయినా వాణ్ణి చూశావు సుమా నువ్వు. వాడి కళ్లల్లో విషం వుంది. చూశా డంటే యెలాంటివాళ్ల తేజస్సూ కూడా నిమిషంలో హరించే స్తాడు వాడు. మిక్కిలీ ఘోరమైన చిత్తవృత్తి వాడిది. సందుల్లోనూ గొందుల్లోనూ పడి దేవతలు కూడా వాణ్ణి తప్పించుకుని తిరుగుతు న్నారు” అని వివరా లన్నీ చెప్పాడు బృహస్పతి.

సరిగా బృహస్పతి యిలా చెబుతున్న సమయాన కుబేరుడూ యముడూ వరుణుడూ వచ్చా రక్కడికి. వచ్చి వారందరూ “అదృష్ట వశాన విశ్వరూపుడూ, వృత్రాసుడూ చచ్చిపోయారు. అదృష్టంవల్లనే నువ్వు కుశలంగా వున్నావు. అదృష్టంవల్లనే మేము నిన్ను చూడగలి గాము” అంటూ యింద్రుణ్ణి మెచ్చుకుని తమ ఆనందం వెల్లడించారు. దానిమీద ఇంద్రుడు “నహుషు డిప్పుడు దేవరా జయివున్నాడు. వాణ్ణి కడతేర్చాలి. ఇందులో మీరు సాయంచెయ్యాలి నాకు” అని వారిని కోరాడు.

“అందు కడ్డేం వుందీ?” అన్నారు వారు. అయితే, నహుషుడు ఘోర కృత్యాలు చేసే మనిషి. వాడి చూపులో విషం వుంది. అంచేత మేము వాడి యెదట పడ్డానికి భయపడుతున్నాము. కనక, ముందు

నువ్వు వాణ్ణి కడ తేర్చితివట్టాయినా మనం తరవాత హవిర్భాగాలు నిర్ణయించుకోవచ్చు " ననీ చెప్పారు.

"అలా కా " దన్నా డింద్రుడు. "యముడికీ వరుణునికీ, కుబేరు నికీ నే నభిషేకం చేస్తాను. మన మందరమూ కలిసి వాణ్ణి సంహ రిద్దాం" అన్నా డతను. అప్పు డగ్ని దేవుడు "మునపటికంటే నా కెక్కువభాగం యిస్తే నేనూ మీకు సాయంచేస్తా" నన్నాడు. "బాగుం" దన్నా డింద్రుడు. నీకూ నాకూ ఒక్కొక్క భాగం. "ఐంద్రాగ్నం" అని దానికి పేరు. కనక, నువ్వు సాయం చెయ్యా " లన్నాడు. యక్షాధిపతి అయిన కుబేరునికీ, పితృలోకాధిపతి అయిన యమునికీ, జలాధిపతి అయిన వరుణునికీ గూడా భాగా లేర్పరిచా డతను.

# 17

## "కా గ ల కా ర్యం"

ఇంద్రుడూ, వరుణుడూ, యముడూ, కుబేరుడూ కూచున్నా రొకచోట. దేవతలున్నూ వున్నా రక్కడ. "నహుషుణ్ణి కడ తేర్చడం యెలాగా ?" అని ఆలోచించుకుంటున్నారు వారు. మహాతపశ్శాలి అయిన అగస్త్యమహర్షి చక్కావచ్చా డప్పు డక్కడికి. వచ్చాడు, ఇంద్రుడి యెదటికి వెళ్ళి, విధివిధానంగా అతణ్ణి పూజించి "అదృష్టంవల్ల నువ్వు బాగున్నావు. అదృష్టంవల్ల విశ్వరూపుడూ, వృత్రాసురుడూ కూడా నశించి పోయారు. అదృష్టంవల్ల నహుషుడు కూడా దేవరాజ్యంనుంచి భ్రష్టుడై భూమ్మీద పడిపోయాడు. నువ్విప్పుడు శత్రువులు లేనివాడ వైనావు, అదృష్టంవల్ల నిన్నిప్పుడు చూడగలిగాను " అంటూ మిక్కిలీ కొనియాడా డతను.

ఇంద్రుడున్నూ అగస్త్యమహర్షికి వెంటనే స్వాగతం విన్నవించు కున్నాడు. "నీరాక నాకు చాలా సంతోషం కలిగించింది " అంటూ

అర్ఘ్యం యిచ్చాడు. పాద్యం యిచ్చాడు. ఆచమనీయం యిచ్చాడు. ఒక ఆవునూ యిచ్చాడు. యథావిధిగా ఇలాగ పూజలు పూర్తిచేసి ఆసనం యిచ్చాడు. "బ్రాహ్మణోత్తమా, నహుషుడు పాపాత్ముడు. పాపాలోచనలే చేస్తాడు వాడెప్పుడూ. వాడు స్వర్గంనుంచి భ్రష్టు డెలా అయినాడో వివరంగా సెలవిప్పించు" అనిన్నీ ప్రార్థించాడు, చాలా సంబరపడుతూ అతను.

"మహేంద్రా! జరిగిందంతా పూర్తిగా చెబుతా విను". అంటూ అందుకున్నా డగస్త్యుడు. "వాడిబుద్ధి మంచిది కాదయ్యా. వా డెప్పుడూ చెడ్డపనులే చేశాడు. పాపాలే మూటగట్టుకున్నాడు. బల దర్పంతో కిందూ మీదూ చూసుకోకుండా ప్రవర్తించాడు. వాడు పాలకీ యెక్కి కూచుంటే, బ్రహ్మర్షులూ, దేవర్షులూ, మహర్షులూ కూడా మోసిమోసి చాలా ఆయాసపడిపోయారు. ఇక వుండలేక వా రప్పుడు "ఓయీ, పూర్వం గోసంప్రోక్షణసందర్భంగా బ్రహ్మ కొన్ని మంత్రాలు చెప్పి వున్నాడుగదా? అవి నీకు సమ్మతాలవునా కాదా?" అనడిగారు. తామసం పెరిగిపోయి వుంది వాడికి. దాంతో మూఢు డున్నూ అయిపోయివున్నాడు వాడు. అంచేత "నాకిష్టం లేదవి. నేను సమ్మతించ" నన్నాడు, దురుసుగా. "తప్పుతు" న్నారు మహర్షులు. "ధర్మం తప్పి నడుస్తున్నావు నువ్వు. ధర్మం గుర్తించ డమే లే దసలు నువ్వు. మహర్షులు 'మా కివి ప్రమాణాలు' అని యెప్పుడో చెప్పివున్నారు". అంటూ వాదించారు చాలాసేపు. నేనూ గట్టిగా వాదించా నూరుకోలేక. అది సహించలేకపోయాడు వాడు. కాలితోద్దీ తన్నాడు నాతలమీద. దాంతో నాకు వాళ్ళు మండి పోయింది. "రాజా, పూర్వం బ్రహ్మర్షులు చెప్పారు. వారలా నడుచు కున్నారు కూడా. నీకు అర్థం కాలే దది. నువ్వది అంగీకరించక పోడమే కాదు, దూషిస్తున్నావు. చూడగా బ్రహ్మర్షు లంటే

యేమిటో అనుకుంటున్నట్టుంది నువ్వు. బ్రహ్మతో సమానులు వారు. తేరిచూడ శక్యంకానివారున్నూ వారు. అలాంటి బ్రహ్మణ్యులచేత నీ పాలకీ మోయించుకున్నావు. అంతటితో నైనా ఆగలేదు నువ్వు. నాతల తన్నావు కాలితో. కనక, నీతేజస్సంతా నశించిపోయింది. నీపుణ్యం అంతా బుగ్గయిపోయింది. నువ్విక్కడ వుండతగ్గవాడవు కావు, భూమ్మీద పడిపో. పదివేల సంవత్సరా లక్కడ పామువయి పడివుండు. తరవాత మళ్ళీ స్వర్గానికి వస్తావులే, ముందు పడిపో" అని శపించేశా న్నేను. వెంటనే వాడు భూమ్మీద పడిపోయాడు".

"ఇంద్రా, బ్రాహ్మలను బాధపెట్టాడు, నశించిపోయాడు నహుషుడు. మన కిబ్బంది లేదిక. అభ్యుదయే కాని మన కిక చిక్కుల్లేవు. స్వర్గానికి వెళ్లిపోదాం రావయ్యా. కామక్రోధా ల్లేకుండా, శత్రువు అన్న పేరయినా లేకుండా — చేసుకుని నువ్విక లోకాలన్నీ యేలుకో. మహర్షులు మెచ్చుకునేటట్టు మసులుకో" అని దీవించాడు చివరి కతను, చెప్పి చెప్పి.

అందరు దేవర్షులూ, మహర్షులూ, దేవతలూ నిక్కిలీ సంతోషించారు. పితృదేవతలూ, యక్షులూ, నాగులూ, రాక్షసులూ, గంధర్వులూ, దేవకన్యలూ, అప్సరసలూ కూడా చాలా చాలా సంబర పడ్డారు. సరస్సులూ, నదులూ, పర్వతాలూ, సముద్రాలూ మూర్తిమంతా లయివచ్చి "ఇంద్రా, మన అదృష్టంవల్ల నహుషుడు అగస్త్య మహర్షి చేతిలో బుగ్గి అయిపోయాడు. పామున్నూ అయి భూమ్మీద పడిపోయాడు. ఇక నువ్వు చల్లగా వర్ధిల్లాలి" అంటూ తమ సంబరం కనబరిచాయి.

## 18

### నిప్పు మాట

సకల శుభలక్షణాలతోనూ వొప్పుతున్న తన పట్టపుయేనుగు ఐరావతం యెక్కి బయలుదేరా డింద్రుడు. అప్సరస లాడీ, గంధర్వులు పాడీ

మిక్కిలీ స్తుతించా రతణ్ణి. అగ్నిదేవుడూ, బృహస్పతీ, యముడూ, వరుణుడూ, కుబేరుడూ వెంటబయలుదేరాగు.

శచీదేవీ యింద్రుడూ కలుసుకున్నారు. సకలసుఖాలూ అనుభవిస్తూ ఇంద్రుడు మళ్లీ త్రిలోకాలూ ఏలుకో సాగాడు.

అంగిరసు డనే మహర్షి వచ్చా డొకనాడు స్వర్గానికి. అధర్వణవేద మంత్రా లుచ్చరిస్తూ చాలా చక్కగా పూజించా డింద్రు ణ్ణతను. అందుకు చాలా సంతోషించా డింద్రుడు. "ఇక నువ్వు అధర్వాంగిరసుడ వని ప్రఖ్యాతిపొందుతావు. యజ్ఞాల్లో నీకు హవిర్భాగాలు దొరుకుతాయి" అనిచెబుతూ పంపేశా డత ణ్ణింద్రుడు. దేవతలనూ, తపోధను లయిన మహర్షులనూ కూడా అత నసేకవిధాల ఆదరించీ పూజించీ ఆనందపెట్టి పరిపాలనం సాగించాడు.

ఇదంతా చాలా వివరంగా చెప్పాడు శల్యుడు. "ధర్మనందనా" అంటూ సంబోధించి మళ్లీ అందుకున్నా డతను.

"ఇంద్రు డిలా బాధపడ్డాడు. అత నొక్కడే కాదు, అతని భార్య శచీదేవి కూడా ఇలా బాధపడింది. అజ్ఞాతవాసమున్నూ చేశా డతను. అదంతా శత్రువులను సంహరించేద్దా మన్న దీక్షతో అనుభవించా డతను.

ఇంద్రు డెలా బాధపడ్డాడో నువ్వూ అలాగే బాధపడ్డావు. నీత మ్ములు సామాన్యులు కారు, మహానుభావులు. ద్రౌపదికూడా ఉత్తమురాయిల్లాలు. వారితో కూడా అరణ్యాల్లో నువ్వెన్నో కష్టా లనుభవించావు. అజ్ఞాతవాసమున్నూ చేశావు, నిజమే; కాని నువ్వందుకోసం పడవద్దు. వృత్రాసురుణ్ణి చంపి ఇంద్రుడు తన స్వర్గరాజ్యం యెలా స్వాధీనంచేసుకున్నాడో, నువ్వూ అలాగే శత్రువుల నందరినీ నాశనం చేసేసి నీరాజ్యం స్వాధీనం చేసుకుంటావు. నహుషుడు దురాచారా లెన్నో చేశాడు. బ్రహ్మద్వేషి. పాపాలున్నూ యెన్నో చేశాడు;

కాని అగస్త్యమహర్షి శాపంతో శాశ్వతంగా పామయిపోయాడు వాడు. నీశత్రువు లయిన కర్ణుడూ, దుర్యోధనుడూ తక్కినవాళ్ళూ ఆనహుషుని వంటివారే. మిక్కిలీ దుర్మార్గులు వారు. వారందరూ నీచేతిలో నాశనం అయిపోతారు. మరి తరవాత ? ద్రౌపదీదేవితోనూ తమ్ములతోనూ సకలవైభవాలూ అనుభవిస్తూ నాలుగు సముద్రాలకూ మధ్యస్థం అయిన భూమండలం అంతా నువ్వేలుకుంటావు" అనిన్నీ చెప్పాడు.

"ధర్మనందనా, ఇది వేదంతో సమాన మైన ఉపాఖ్యానం. యుద్ధాల్లో తమకు జయం కలగా లని కోరుకునే రాజు లందరూ విన వలసిం దిది. అంచేతనే నీకు చెప్పా న్నేను. ప్రజల స్తుతులూ దీవనలూ పొందుతూ మీ వాళ్ళందరితోనూ చల్లగా వర్ధిల్లుతావు నువ్వు. దుర్యోధనుడు చేసిన అపరాధాలకూ, భీమార్జునులు చూపించే బల పరాక్రమాలకూ ఫలితంగా యీ భూమండలంలో వున్న క్షత్రియు లనేకులు నశించిపోతారు. ఈ వుపాఖ్యానం విన్న వారికి పాపాలున్నా అంటవు. చివరికి స్వర్గమున్నా లభిస్తుంది. ఇహలోకంలోనూ పరలోకం లోనూ కూడా చాలా సుఖపడతారు వారు. వారి కాపద లంటవు. దీర్ఘాయుష్కు లవుతారు. ఎందులోకి వెళ్ళినా జయంమీద జయమే. గాని వారి కపజయాలు రావు" అనీన్నీ చెప్పాడు శల్యుడు.

ధర్మరాజు శల్యుణ్ణి చాలా ఆదరించాడు. బాగా పూజించాడు. ఇదంతా విని "మద్రరాజా, నువ్వు కర్ణుడికి సారథివి కావడం తప్పదు. మరిచిపోకు. అర్జునుడికి జయం కలిగేటట్టు కర్ణుణ్ణి దిగగుంజెయ్యాలి నువ్వప్పుడు" అని మళ్ళీ కోరాడు ధర్మరాజు. "అలాగే" అన్నాడు శల్యుడు. "నువ్వు చెప్పినట్టే చేస్తాను తప్పకుండా" అని గట్టిగా మాట యిచ్చాడు. "ఇంతే కాదు. ఏది యేమయినా మీకే జయం కలగాలి. కనక, యేమయినా చేస్తా" నని కూడా చెప్పాడతను.

తరవాత ధర్మనందనుడు సాగనంపగా దుర్యోధనుణ్ణి కలుసుకోడానికి వెళ్ళిపోయాడతను.

# 19

## స న్నా హా లు

గొప్పసైన్యం వెంటబెట్టుకుని ధర్మరాజుకి సాయంగా సాత్యకి వచ్చాడు తరవాత. అతని సైన్యంలో నానా దేశాలవారూ వున్నారు. రకరకాల ఆయుధాలు వాడేవా రున్నారు. అంతూ పంతూ లేని బలపరాక్రమాలున్నవా రున్నారు. అన్ని రకాల యోధులతోనూ ఎంతో చూడముచ్చటగా వుందా సైన్యం. వారిదగ్గిర పరశ్వధా లున్నాయి. భిందివాలా లున్నాయి. శూలాలూ తోమరాలూ ముద్గరాలూ ధనుస్సులూ బాణాలూ — ఇంకా అనేకాలూ వున్నాయి. నూనెపట్టించిన వాటి కన్నిటికీ చమురుపట్టించివున్నారు. ఆ సైన్యం నల్లని మేఘంలా వుండగా, ఆ యోధులు ధరించిన ఆయుధాలూ బంగారు ఆభరణాలూ ఆ మేఘంలో వున్న మెరుపుతీగల్లా వున్నాయి. అక్షౌహిణి సేన అది. ధర్మరాజు సేనలో అది వచ్చిచేరడం. సముద్రంలో పిల్లకాలవ కలిసిన ట్టుంది.

తరవాత చేదిరాజయిన ధృష్టకేతువు వచ్చాడు. అతనూ అక్షౌహిణి సేన వెంటబెట్టుకు వచ్చాడు. మగధదేశప్రరాజయిన జయత్సేను డొక అక్షౌహిణి సేనతో వచ్చాడు. జరాసంధుని కొడుకు అతను. తరవాత పాండ్యరాజు వచ్చాడు. అతనూ అక్షౌహిణి సేన తీసుకు వచ్చాడు. ఆసేనలో సముద్రప్రాంతాలవారు రకరకాలవా రున్నారు. వారి వేషాలు చూడ సొంపుగా వున్నాయి.

తరవాత ద్రుపదమహారాజు సేన వచ్చింది. అతని కొడుకు లందరూ వున్నా రందులో. సైనికు లెక్కడెక్కణ్ణుంచో వచ్చిచేరినవారు.

వారందరూ అసహాయశూరులు. ద్రుపదుని కొడుకులున్నా మహారథులు. చివరికి మత్స్యదేశాధిపతి అయిన విరటుడు వచ్చాడు. పర్వత ప్రాంతాల రాజు లున్నా రందులో.

ఇలాగ, పాండవులకు సాయంచెయ్యడానికి వచ్చిన సేన యేడక్షౌహిణు లయింది. అందులో యెన్నోవిధాలయిన జెండా లున్నాయి. అదంతా యెలాగయినా కౌరవులను నాశనం చెయ్యా లనీ పాండవులను గెలిపించా లనీ చాలా పట్టుదలగా వుంది.

ఇక్కడ పాండవులకు సాయంచెయ్యడానికి వచ్చినట్టే అక్కడ కౌరవులకు సాయ చెయ్యడానికిన్నీ యెందరో వచ్చారు. వారిలో భగదత్తు డొకడు. అక్షౌహిణి సేన అతనిది. చీనా దేశీయులూ కిరాతులూ వున్నా రెందరో యోధు లాసైన్యంలో. దాన్ని జయించా లంటే చాలా కష్టం యెవరి కయినా. రకరకాల వస్త్రాలూ, రకరకాల ఆభరణాలూ, ధరించివున్న ఆసేన విరగబూసివున్న కొండగోగువనంలా వుంది. తరవాత భూరిశ్రవుడూ శల్యుడూ వొక్కొక్క అక్షౌహిణి సేనతో వచ్చారు.

ఒక అక్షౌహిణి సేనతో కృతవర్మ వచ్చాడు. భోజులూ, అంధకులూ, కుకురులూ, వృష్ణివీరులూ వున్నా రందులో. వారందరూ వనమాలలు—అంటే పాదాలదాకా జీరాడే పూలమాలలు ధరించి వున్నారు. గొప్పవీరులు వారు. అడవుల్లోపడి ఇష్టంవచ్చినట్లల్లా సంచరించే మదగజాల్లా వున్నారు వారు. జయద్రథుడున్నా వొక అక్షౌహిణిసేనతో వచ్చాడు. సింధుసౌవీరదేశీయు లెందరో వున్నా రందులో. అది వస్తూవుంటే మహాపర్వతాలూ అరణ్యాలూ జవజవలాడిపోయాయి. కాంభోజరాజు సుదక్షిణుడున్నా వచ్చాడు. శకులూ యవనులూ కిరాతులూ నిండివున్న అక్షౌహిణిసేనతో వచ్చాడతను. మిడతల దండులా వుంది అతని సైన్యం.

తరవాత, నల్లని ఆయుధాలు ధరించివున్న అక్షౌహిణీ సేనతో మాహిష్మతీపతి అయిన నీలుడూ, వొక అక్షౌహిణి సేనతో అవంతి దేశాధీశ్వరులూ వచ్చారు. ఆవుభయుల సైన్యంలోనూ గొప్పగొప్ప యోధు లెందరో వున్నారు. తరవాత కేకయదేశాధిపతులు వచ్చారు. వా రయిదుగు రన్నదమ్ములు. నిజంగా పులులు వారు. వారి సైన్యమున్నూ వొక్క అక్షౌహిణి వుంది. ఇంకా యెందరో రాజులు వచ్చారు. అందరూ పెద్దపెద్ద సైన్యం వెంటబెట్టుకువచ్చారు. మొత్తం ధుర్యోధనుడి సైన్యం పదకొం డక్షౌహిణు లయింది.

ఇన్ని సైన్యాలకూ, యిందరు రాజులకూ హాస్తినాపురంలో చోటు చాలలేదు. అక్కడ కిక్కిరిసిపోయినవారు కాక, తక్కినవారు, పంచనదంలోనూ, కురుజాంగలంలోనూ, రోహితకారణ్యంలోనూ, మరుభూమిలోనూ, అహిచ్ఛత్రంలోనూ, కాలకూటంలోనూ, గంగవొడ్డునా, వారణావతంలోనూ, వాటధానంలోనూ, యామునపర్వతాల్లోనూ విడిదిచేశారు. విడిదిచేశా రంటే ఆప్రదేశాల్లో కూడా వాళ్ళు కిక్కిరిసి వుండవలసివచ్చింది.

అయితే, ధనధాన్యాలు సమృద్ధిగా సిద్ధంచేసుకుని వుండడంవల్ల దుర్యోధనుడు, ఎవరికీ యేవిధంగానూ లోటు లేకుండా సకలసదుపాయాలూ చేయించగలిగాడు. దూతగా వచ్చివుండిన ద్రుపదమహారాజు పురోహితుడా సైన్యం అంతా చూశాడు.

## 20

### "హ రి ః ఓ మ్"

దుర్యోధనుడు ద్రుపదుని పురోహితుణ్ణి చాలా చాలా గౌరవించాడు. అతనే కాక, భీష్ముడూ విదురుడూ కూడా బాగా ఆదరించా రతణ్ణి.

అతనున్నూ అందరినీ క్షేమం అడిగి, తన ప్రభువుల క్షేమవార్తలూ, పాండవుల యోగక్షేమాలూ విన్నవించాడు.

కొలువుకూటంలో, దేశదేశాలనుంచీ వచ్చిన రాజు లందరూ వున్నా రప్పుడు. సేనాధిపతులూ వున్నా రందరూ. "మీ కందరికీ రాజధర్మా లన్నీ బాగా తెలుసు. అయినా, మనం కలిసి మాట్టాడుకోవలసిందిన్నీ చాలా వుంది కనక, కొంచెం చెబుతా" నంటూ అందుకున్నా డతను.

"ధృతరాష్ట్రుడూ పాండురాజూ వొక్కకడుపున పుట్టిన అన్న దమ్ములు. చరస్థిరరూపంగా స్వార్జితం అయివుండిన సంపద అంతా వారి కిద్దరికీ సమంగా ముట్టవలసిందే, ఇందులో సందేహం యేమీ లేదు; కాని ధృతరాష్ట్రుని కొడుకు లొక్కరే అదంతా స్వాధీనంచేసు కునివున్నారు. పాండురాజు కొడుకుల కందు యేకొంచెమున్నూ భుక్తం కావడంలేదు. అప్పు డదంతా ధృతరాష్ట్రుడి చేతిలో వుండి పోయినందువల్ల అదలా జరిగింది.

అంతటితో వూరుకుంటే దాశే; కాని ధృతరాష్ట్రుని కొడుకులు పాండురాజు కొడుకులను నాశనంచెయ్యడానికి పూనుకున్నారు. చంపిం చెయ్యడానికిన్నీ యెన్నో ప్రయత్నాలు సాగించారు వారు. ఇదిన్నీ అందరికీ తెలిసిందే.

తరవాత, పాండుపుత్రులు తను భుజబలంతో కొంతరాజ్యం సంపా దించుకుని అది వృద్ధిచేసుకున్నారు; కాని మాయచేసి ధృతరాష్ట్రుడి కొడుకు లదిన్నీ కాజేశారు. ఆమాయ అంతా శకునిది. ధృతరాష్ట్రు డదంతా పూర్తిగా యెరుగును. అయినా, కొడుకుని కాదనలేక పోయా డతను.

ఇతని కొడుకులు, సభలో, యెన్నో కానిమాట లన్నారు. ఎంతో క్షోభపెట్టారు. అందుకు సహించడమే కాకుండా పాండుపుత్రులు పన్నెండేళ్లరణ్యాల్లో వాసంచేశారు. చెప్పరాని కష్టా లనుభవించారు.

పదమూడో సంవత్సరం అంతా విరటమహారాజు దగ్గిర అజ్ఞాతవాసం కూడా చేశారు. అప్పుడూ విసరాని హీనదశ అనుభవించారు వారు. వెనకటి జన్మలో చేసుకున్న దానికి ఫలితా లనుకుని అవన్నీ వారు సహించుకున్నారు.

కనక, అవన్నీ వెనక్కి పెట్టుకుని ధృతరాష్ట్రుని కొడుకులతో వారిప్పుడు మంచిమాటగా వ్యవహారం నడిపించుకోడానికే నిశ్చయించుకునివున్నారు. మీరంతా పెద్దలు. ఉభయులకూ కావలసినవారు. ధృతరాష్ట్రుని కొడుకుల ప్రవర్తనా మీకు తెలుసు. పాండురాజు కొడుకుల నడవడీ మీకు తెలుసు. మీరందరూ పూనుకుని యీదుర్యోధనాదులకు బాగా నచ్చచెప్పాలి. యుద్ధం చేద్దా మని పాండుపుత్రుల కేకోశానా లేదు. యుద్ధం చేస్తే ముందు లోకాలన్నీ సలిగిపోతాయి. నశించిపోతాయి. అది వారి కిష్టంలేదు. అందరూ క్షేమంగా వుండాలనే వారి కోరిక. ఇష్టంమీదే తమ వాటా తాము పుచ్చుకోవా లని వారి ప్రయత్నం.

వారు మిక్కిలీ బలవంతులు. అయినా, దుర్యోధనుని లాగ వారు యుద్ధమే చెయ్యా లనుకోడంలేదు. దాపరికం యెందుకూ, వారి సైన్యం యే డక్షౌహిణులు మాత్రమే; కాని యుద్ధంలో యెప్పుడురుకుతామా అని చూస్తున్నారు ఆయేడక్షౌహిణులవారున్నూ. ధర్మరాజు ఆజ్ఞ యెదురుచూస్తున్నారు వారు. ఆసైన్యం మాట అలా వుండగా, అక్కడ, సాత్యకీ, భీమసేనుడూ, నకులసహదేవులూ వున్నారు, వారొక్కొక్కరే వేల అక్షౌహిణులకు దీటయినవారు. ఇక్కడ పదకొండు డక్షౌహిణుల సేన సర్వసిద్ధంగా వుంది, చూశాను; కాని అక్కడ అర్జును డున్నాడు. నిజానికి లెక్కకి, అత నొక్కడే గాని, యెంతమందో అన్నట్టు చెలరేగిపోతాడు, చెయ్యా చెయ్యా కలిసిందంటే ఇక్కడి సేన లన్నీ కలిసినా అతని దొక్కడిదే పై చెయ్యి అయిపోతుంది.

ఇంతకీ, — అత నొక్కడే కాడు, శ్రీకృష్ణు డున్నా డక్కడ, బాగా గుర్తుంచుకోవలసిం దిదీ.

ఇక వొక్కటే చెబుతాను. అక్కడి సైన్యం తక్కువ అనుకోకండి. అర్జునుడి బలపరాక్రమాలు అర్థంచేసుకోండి. శ్రీకృష్ణుని బుద్ధిసూక్ష్మత మరిచిపోకండి. ఇదంతా చూసుకుంటే, యిక యెవడయ్యా, వారితో యుద్ధానికి సిద్ధపడగలవాడు? కనక, బాగా ఆలోచించండి. ధర్మాధర్మాలు విచారణ చెయ్యండి. చేసుకున్న శపథాలు కూడా జ్ఞాపకం చేసుకోండి. సమయం దాటిపోనివ్వకండి. వారి కివ్వవలసిం దేమిటో వారి కిప్పించెయ్యండి" అంటూ తన రాయబారం ముగించా డతను.

## 21

### సంజయ రాయబారం

ఇదంతా విన్నాడు భీష్ముడు. అంతటి ప్రజ్ఞావంతుడు మరిలేడు భూమ్మీద. అంతటి తేజశ్శాలిన్నీ మరి లేడు. యథావిధిగా ద్రుపదపురోహితుణ్ణి పూజించి అందుకున్నా డతను.

"బ్రాహ్మణోత్తమా! పాండుపుత్రులూ శ్రీకృష్ణుడూ కులాసాగా వున్నారా? ధర్మంమీదే దృష్టివుందికదా పాండుపుత్రులకు? సాయంకూడా బాగా వుంది కదా వారికి? వారు సంధే కోరుతున్నారనీ, యుద్ధం చెయ్యడం వారి కిష్టంలే దనీ చెప్పావు. బంధువులున్నూ అందరూ అదే బాగుం దనడం చాలా అదృష్టమే, సందేహం లేదు; కాని నీ మాట మాత్రం బ్రాహ్మల కుచితమైనట్టు లేదు. చాలా దురుసుగా వుంది నీ ధోరణి.

దానికేం గానీ, పిత్రార్జితం అయిన ఆస్తి పాండుపుత్రులు ధర్మం అనుసరించే పొందారు. అయితే, యిక్కడా అరణ్యాల్లోనూ కూడా చాలా చాలా కష్టా లనుభవించారు వారు. అర్జునుడు మిక్కిలీ బలవం

తుడు. అస్త్రవిద్యలో అంతటివాడు మరొకడెవడూ లేడు, అతణ్ణెదిరించి నిలవడం యెవడికీ తరమూ కాదు. వజ్రాయుధం చేతబట్టి వచ్చి యింద్రుడున్నా యేమీ చెయ్యలేడతణ్ణి. ఇక సామాన్యుల సంగతి చెప్పడం యెందుకూ? మూడులోకాల్లోనూ కూడా యుద్ధవిద్యలో అతనొక్కడే సర్వసమర్థుడని నా నమ్మకం"—

భీష్ముడు మాట పూర్తి చెయ్యలేదింకా, నడుమనే గద్దించి కర్ణుడందుకున్నాడొకమాట దుర్యోధనుడికేసి చూసి. "బ్రాహ్మణోత్తమా, ఈ సంగతి లోకంలో యెవడికీ తెలియంది కాదు. మళ్ళీ మళ్ళీ ఆ మాటే చెప్పడంలో సొగసేం వుంది? దుర్యోధనునికోసం తాను జూదమాడాడు శకుని. ఆ జూదంలో పాండవుల నోడించేశాడతను, పూర్తిగా. ఒక సంకేతం పెట్టుకున్నారప్పుడు వారు. దాన్ననుసరించే పాండుపుత్రు లరణ్యాలకు వెళ్ళారు. వెళ్ళారే గాని ఆ సంకేతం అలాగే వుండిపోయింది, పూర్తికాలేదింకా. అంచేత, పిత్రార్జితం అయిన రాజ్యం కావాలని వారడగడానికవకాశం లేదు. ఇది తెలిసీన్నీ, విరటరాజు సాయమూ, ద్రుపదరాజు అండా చూసుకుని మూర్ఖులై దానికోసం అర్రులు చాపుతున్నారు వారు. ఒకరికి భయపడి సగం కాదుగదా, ఆ సగంలో సగమున్నా యిచ్చేవాడు కాడు, దుర్యోధనుడు. ధర్మం వుందా, అవతలివాడు పరమశత్రు వయినా రాజ్యం అంతా యిచ్చేస్తాడతను, ఇష్టాపూర్తిగా.

"ఏమయినా, పాండుపుత్రులకు రాజ్యం యేలుకుందామని ముచ్చటగా వుందంటావా, అయితే, సంకేతం ప్రకారం మళ్ళీ అడవులకు పోయి రమ్మను. ఇక తరవాతా? అప్పుడు నిర్భయంగా దుర్యోధనుని తొడమీదే కూచుని రాజ్యం యేలుకోవచ్చు, నిశ్చింతగా. మూర్ఖులయి ధర్మం తప్పి మాట్లాడారంటే మాత్రం లాభం లేదు, లేశమూ

కూడా. కాదూ కూడదు, వారు యుద్ధానికే, సిద్ధపడతా రంటావా, నామాట అప్పుడు జ్ఞాపకం వస్తుంది వారికి" అన్నాడు బింకంగా.

"ఏమన్నావు రాధేయా?" అంటూ అందుకున్నాడు భీష్ముడు. "ఉత్తరగోగ్రహణకాలంలో మన ఆరుగురి రథాలూ అర్జును డొక్కడే వెనక్కి మళ్ళించాడు, మరిచావా? నీకళ్ళతో నువ్వే చూశావుగా అదంతా? కనక, మనమిప్పుడు ఈపాంచాలబ్రాహ్మడు చెప్పినట్టు చేశామా, సరేసరి, లేకపోతే అర్జునుని చేతిలో మళ్ళీ చావుదెబ్బలు తిని మట్టికొట్టుకుపోవలసిందే మనం" అన్నాడు గట్టిగా నిరసిస్తూ అతను.

ఇది విని కంగారుపడిపోయాడు ధృతరాష్ట్రుడు. దాంతో, మంచి మాటలు చెప్పి ముందు భీష్ముణ్ణి శాంతింపచేసుకున్నా డతను. తరవాత, కర్ణుణ్ణి గట్టిగా మందలించాడు. "భీష్ముడిప్పు డన్నమాట మన హితం కోరి చెప్పింది. మనకే కాదు, పాండుపుత్రులకూ, జగత్తుకున్నూ అంతకూ హితకర మైన మాట అది. ఈవిషయం అంతా బాగా ఆలోచించి పాండుపుత్రుల దగ్గిరికి నేనిప్పుడు సంజయుణ్ణి పంపుతు న్నాను" అని చెప్పాడు చివరికి.

తరవాత ద్రుపదపురోహితుణ్ణి పిలిచి "బ్రాహ్మణోత్తమా, నువ్వింక పాండుపుత్రుల దగ్గిరికి వెళ్ళిపో" అని చెప్పి బాగా సత్కరించి అతణ్ణి పంపేశాడు.

అక్కడ సంజయుణ్ణి పిలిచి అక్కడే యిలా చెప్పాడు.

## 22

## సంజయరాయబారం 2

"సంజయా, పాండుపుత్రులు వచ్చి ఉపప్లావ్యంలో వున్నా రని చెబు తున్నారు, వెళ్ళి నువ్వదేమిటో బాగా తెలుసుకుని రా: వారు వన వాసం చెయ్యతగ్గవారు కారు. అదృష్టంవల్ల వారందరూ తిరిగివచ్చారు.

నువ్విది చెప్పి అజాతశత్రు వయిన ధర్మనందనుణ్ణి ఆదరించి రా. మన మంతా యిక్కడ కుశలంగావున్నా మని చెప్పు. మనవల్ల పొరపాట్లు జరిగాయి. అయినా, వారు పరోపకారపారీణులు కనక మనవిషయమై శాంతంగానే వుంటారు.

వారు కపటంగా ప్రవర్తించడం నేనెప్పుడూ చూడలేదు. వారు, తమ బలపరాక్రమాలతో ఆర్జించుకువచ్చిన సకలసంపదలూ నాకే సమర్పించారు. గర్హించవలసిన దోషం వారిదగ్గిర నాకెప్పుడూ కనపడ లేదు. వారేపనిచేసినా ధర్మబుద్ధితోనూ ఆర్థికదృష్టితోనూ చేశారు. కామానికీ, మోహానికీ వారెప్పుడూ వశు లయిపోలేదు. వారు నిద్రాహారాలు చూసుకోలేదు. క్రోధమూ సంతోషమూ లెక్కచెయ్యలేదు. శీతవాతాతపాలకు జంకలేదు. ప్రమాదాలకు గురికాలేదు. ధైర్యమూ ప్రజ్ఞా-ఇవిమాత్రమే నమ్ముకుని వారెప్పుడూ ధర్మంకోసమేపాటుపడ్డారు.

సమయాసమయాలు గుర్తించి మిత్రుల కెంతెంత డబ్బయినా యిస్తారు వారు. వారితో స్నేహంచేస్తే యెంతకాలాని కయినా అది స్థిరంగానే వుంటుంది, చెడదు. ఎదటి వారి విషయమై వారెప్పుడూ ఎలా నడుచుకోవాలో అలాగేనడుచుకుంటారు. మన దుర్యోధనుడు మందబుద్ధి. పాపాలకు వెరవడు. కపటబుద్ధి విడిచిపెట్టడు. కర్ణుడంటావా, పూర్తిగా క్షుద్రుడు. వీరిద్దరూ తప్ప పాండుపుత్రులను ద్వేషించేవా రెవరూ వుండరు. వారెప్పుడూ కొద్దిపాటి సుఖాలతోనే తృప్తి పడతారు. మన యీకర్ణదుర్యోధను లెప్పుడూ వారికోపంవచ్చేటట్టే ప్రవర్తిస్తారు.

మన దుర్యోధను డున్నాడే, వోట్టి ఉత్థానవీర్యుడు. అంటే, మొదట బింకం చూపిస్తాడేంతో కాని పనివచ్చాటప్పటికి నీళ్లు కారిపోతాడు. ఎప్పుడూ సుఖాలకోసమే చూస్తాడు. చంటిపిల్లవాడికంటేనూ కనికిష్టం. అంచేతనే, పాండుపుత్రులు బతికేవుండగా వారి భాగం హరించడం సుల

భం అనుకుంటున్నాడు. అర్జునుడూ, శ్రీకృష్ణుడూ, భీమసేనుడూ, సాత్యకీ, నకులసహదేవులూ సృంజయులూ — వీరంతా కలిసి యుద్ధానికి సిద్ధపడకముందే అజాతశత్రు వయిన ధర్మనందనునికి భాగంయిచ్చెయ్యడం చాలా మంచిది. గాండీవం చేతబుచ్చుకుని అర్జును డొక్కడే చాలు, రథం యెక్కి బయలుదేరా డంటే భూమండలం అంతా బుగ్గి చేసేస్తాడు. శ్రీకృష్ణుడూ అలాంటివాడే. అతణ్ణి తేరిచూడ్డమే శక్యంకా దెవరకీ. ఆమహాత్ముడు మూడు లోకాలకూ ప్రభువు మరి. భోగా లనుభవించా లన్నా, మోక్షం కావా లన్నా, కామం తీర్చుకోవాలన్నా ఆమహనీయుడొక్కడే ఆశ్రయించతగ్గవాడు, ఎవరికయినా.

మేఘం ఉరుముతున్నట్టు నారి మోగిస్తూ, మిడతలదం డన్నట్టు బాణంమీద బాణం వేసి, ఉత్తరదిక్కూ ఉత్తరకురుదేశాలూ అర్జును డొక్కడే జయించుకువచ్చాడు. రాసులకొద్దీ తెచ్చాడు డబ్బు. అత నొక్కడే, దేవతలనే కాక దేవరా జయిన ఇంద్రుణ్ణి కూడా వోడించి ఖాండవం అగ్నిదేవుని కాహుతి యిచ్చాడు. దాంతో పాండుపుత్రుల కీర్తీ, మానమూ మిక్కిలీ హెచ్చిపోయాయి.

గదాయుద్ధం చేసేవాళ్ళలోనే కాదు, రథం యెక్కి యుద్ధంచేసే వాళ్ళలోనూ, ఏనుగెక్కి యుద్ధంచేసేవాళ్ళలోనూ కూడా భీమసేనునికి సాటివచ్చేవా రెవరూ లేరు. రథయుద్ధంలో అర్జునుడి కేమాత్రమూ తీసిపో డని చెబుతా రతను. ఇక బాహుబలం చూస్తామా, వెయ్యేనుగుల బలం అతనిది. అతని వేగమున్నా చాలా గొప్పది. చక్కని శిక్షణ పొందినవా డతను. దుర్యోధనుడంటే చిన్నప్పణ్ణుంచీ వల్లమాలిన పగే అతనికి. అసలు, మనవాళ్ళ పేరు చెబితేనే మండిపడిపోతా డతను. రెండుకళ్ళూ విప్పి చూస్తే చాలతను, మనవాళ్ళందరూ దుమ్మూ ధూళీ అయిపోతారు. బాహుబలం నమ్ముకుని అతని యెదటపడితే యింద్రుడున్నా యెందుకూ పనికిరాడు. కవల

పిల్ల లున్నా రిక నకులసహదేవులు. మహాబలవంతులు వారు. అర్జునుడిచేతిలో బాగా నలిగివున్నారు. మిక్కిలీ వేగవంతులు. ఎలాంటి పక్షుల నైనా డేగ లెలా మిగల్చవో, అలాగే, యెంతెంత లేసి శత్రువు లనూ కూడా మిగలనివ్వరు వారు.

నిజానికి మన బలం యెక్కువే; కాని వారి బలంముందు మన దెందుకూ చాల దని నా నమ్మకం. వారిలో ధృష్టద్యుమ్నుడి సంగతి వేరే చెప్పాలా? ఇక ద్రుపదున్నాడు. పాండవులకోసం ప్రాణాలు కూడా విడిచిపెట్టడానికి సిద్ధపడివచ్చా డతను. మత్స్యదేశాధిపతి విరటుడి సంగతి చూడండి. పూర్తిగా వొక్క సంవత్సరం పాండు పుత్రులతో కలిసివుండినవా డతను. అన్యోన్యంగా తాను మిక్కిలీ చరితార్థుడయి వారి కెంతో రుణపడివున్నాడు. నూంచి ముమ్మరం లోనూ వున్నాడు. ధర్మనందను డంటే అతనికి చాలాభక్తి అని చెబుతారు. కేకయరాజు తమ్ము లయిదుగురు. రాజు వారిని దేశంనుంచి వెళ్ళగొట్టాడు. అందుకు బదులుగా ఆరాజ్యం ఆక్రమించు కోవా లని వున్నారు. నిన్నటిదాకా వారయిదుగురూ మనపక్షం. కాని యివాళ చూస్తే పాండుపుత్రులతో కలిసిపోయి వున్నారుట. గొప్పవిలుకాళ్ళు వారు. రథికులు.

పాండుపుత్రులకు సాయంచెయ్యడాని కింకా యెందరో రాజులు వచ్చివున్నారు. వారి యోధులు మిక్కిలీ శూరులుట. పాండు పుత్రులంటే వారి కెంతో భక్తిట. ధర్మరాజే తమ గతి అని నమ్మి వున్నారుట వారు. పర్వతవాసులూ, దుర్గాధిపతులూ అయిన మ్లేచ్ఛులున్నూ చాలామంది వచ్చివున్నారుట. రకరకాల ఆయుధా లతో చాలా నేర్పుగా యుద్ధంచేస్తారుట వారు. మంచిగుర్రాలుట వారివి, మంచిజాతులున్నూట.

గొప్పయోధుల నెందరినో వెంటబెట్టుకుని పాండ్యరాజు వచ్చాడుట వారిపక్షంగా. యుద్ధరంగంలో వురికాడంటే ఇంద్రుడికి సాటి అతను. లోకంలోనూ అతనికి సాటిఅయిన యోధులు లేనేలేరు. పాండుసుతులకు సాయంగా వచ్చినవారిలో సాత్యకి వొకడు. ప్రద్యుమ్నునితో సమానం అతను. ద్రోణుడిదగ్గిరా, అర్జునుడిదగ్గిరా, కృష్ణుడిదగ్గిరా, కృపాచార్యుడి దగ్గిరా, భీష్ముడిదగ్గిరా అస్త్రవిద్య నేర్చుకున్నా డనిచెబుతా రతను.

వెనకటికి, పాండుపుత్రుల శ్రేయస్సు కోరి శిశుపాలుణ్ణి సంహరించాడు శ్రీకృష్ణుడు. ఎందరో రాజు లాశిశుపాలుణ్ణి ఆశ్రయించుకుని వుండేవారు. వారందరి మధ్యా సూర్యదేవు డన్నట్టుండేవా డతను. యుద్ధంవస్తే యెవడూ కూడా అతణ్ణెదిరించలేక పోయేవాడు. విలుకాళ్ళలో అంతటివాడు మరొకడు లేడని ప్రసిద్ధి సంపాదించుకున్నా డతను. క్షత్రియుల కందరికీ అతనంటే అమితమైన ఉత్సాహం. అలాంటివాణ్ణి సంహరించేశాడు శ్రీకృష్ణుడు విలాసగా.

శ్రీకృష్ణుడు రథం యెక్కి బయలుదేరితే శిశుపాలుడు తప్ప మరెవరూ అతణ్ణెదిరించలేకపోయేవారు. ఎలాగయినా శ్రీకృష్ణుణ్ణోడించా లని శిశుపాలుని ప్రయత్నం. అలాంటివాడల్లా సుడిగాలికి కొండగోగుచెట్టు కూలిపోయేటట్టు కూలిపోయాడు కృష్ణుని చేతిలో.

అలాంటి కృష్ణుడిప్పుడు పాండవుల పక్షాన వున్నాడు. ఇక వారి నెవడు జయించగలడూ? శ్రీకృష్ణుడు అర్జునునికి సారథ్యం కూడా చేస్తా డని తెలుస్తోంది. దాంతో నాగుండెలు బేజారయిపోతున్నాయి. నాకొడుకు వారి నెదిరించకపోతేనే బతికిపోతాడు. లేకపోతే, వెనకటికి, శ్రీమహావిష్ణువూ ఇంద్రుడూ కలిసి దైత్యసేన లన్నీ నాశనంచేసినట్టు కృష్ణార్జును లిద్దరూ కౌరవుల నందరినీ కాల్చేస్తారు.

నానమ్మకం యేమిటంటావా? అర్జును డింద్రునికి సమానం. శ్రీకృష్ణుడు సాక్షాత్తూ శ్రీమహావిష్ణువే. ధర్మనందనుడు ధర్మారాముడే.

దుర్యోధను డత న్నెంతో బాధించాడు. వంచనచేశాడు. మోసం చేశాడు. అతను జితేంద్రియుడు. అతని కోపం వచ్చిందా, నాకొడుకుల నందరినీ బుగ్గిచేసేస్తాడు. శ్రీకృష్ణు డంటే నాకంతభయం లేదు. అర్జును డన్నా లేదు. భీముడన్నా నకులసహదేవులన్నా కూడా నా కేమంత భయంలేదు. ధర్మనందను డంటే మాత్రం నాకుగుండెలు తాళడంలేదు. అతను మహాతపశ్శాలి. బ్రహ్మచర్యవ్రతనిష్ఠుడు. అత నేమనుకుంటే అది అయితీరుతుంది. క్రోధం వహించి యిప్పు డతను ప్రళయాగ్ని అన్న ట్టున్నాడుట.

సంజయా, కనక, రథం యెక్కి వెంటనే వెళ్లిపో. ధర్మనందనుడితో నేను క్షేమం అడిగా నని చెప్పు. శ్రీకృష్ణునితో కూడా ఈమాట చెప్పు. నేను పాండుపుత్రులతో కలిసి శాంతంగా బతకా లని కోరు కుంటున్నా నినిన్నీ చెప్పు వారితో. శ్రీకృష్ణు డెంత చెబితే అంతే ధర్మనందనునికి. శ్రీకృష్ణుడు పాండవులకు జయం కలిగించడానికి పూను కున్నాడు. సంజయా, చూడకు. వెంటనే వెళ్లిపో. శ్రీకృష్ణునితోనూ, ధర్మనందనునితోనూ, విరటరాజుతోనూ, సృంజయులతోనూ, ద్రౌపది కొడుకులతోనూ నేను క్షేమం అడిగా నని చెప్పు. ద్రుపదునితోగూడా చెప్పాలి సుమా. అక్కడి వీలునుబట్టి నువ్వు యథోచితంగా మాట్లాడు. నీ కొక్కటే చెబుతున్నా న్నేను. భరతకులం క్షేమం వొక్కటే నువ్విప్పుడు చూడవలసింది. కనక, ఏవిధంగానూ వారి కోపం వచ్చేటట్టు మాట్లాడకు ”

# 23

## సంజయరాయబారం 3

ధృతరాష్ట్రు డిలా చెప్పగా ఉపప్లావ్యం వెళ్ళాడు సంజయుడు, పాండవు లను చూడ్డానికి. వెళ్ళీవెళ్ళగానే ముందు ధర్మరాజుకి నమస్కారం చేసి

" రాజేంద్రా! నువ్వు మహేంద్రునితో సాటి అయినవాడవు. ఎందరో రాజులు నీకు సాయం చెయ్యడానికి వచ్చివున్నారు. ఈవిధంగా క్షేమంగా వున్న నిన్ను చూడగలిగానన్నను, ఇదంతా నా అదృష్టం. ముసలిరాజు, ధృతరాష్ట్రుడు మీ క్షేమవార్త లడిగిరమ్మన్నాడు. భీమసేనుడూ, అర్జునుడూ, నకులసహదేవులూ క్షేమంగా వున్నారా? నీధర్మపత్ని ద్రౌపదీదేవి వీరపత్ని. సత్యమే ఆమెకి వ్రతం. కుమాళ్ళ తల్లి. మానవతి. ఆమె యోగక్షేమాలున్నూ తెలుసుకు రమ్మని పంపాడు నన్ను, ముసలిరాజు" అని చెప్పాడు.

"సంజయా, నీకు స్వాగతః" అంటూ అందుకున్నాడు ధర్మరాజు. "నిన్ను చూడ్డం నాకెంతో సంబరంగా వుంది. నీ క్షేమం నీరాకవల్లనే తెలిసింది. నేనూ, నాతమ్ముళ్ళూ, ద్రౌపదీ, మాబిడ్డలూ—మేమంతా క్షేమంగా వున్నాము. చాలా కాలానికి మహారాజు క్షేమం తెలిసింది నాకు. ఇది వినడంవల్లా, నిన్ను చూడ్డంవల్లా మహారాజుని చూసినట్టే వుంది నాకు. వృద్ధుడైన మా తాత భీష్ముడు చాలా పౌరుషం గలవాడు. అంతటి ప్రాజ్ఞుడు భూమ్మీద మరివొకడు లేడు. సకలధర్మాలూ తెలుసు అతనికి. ధర్మమున్నూ తప్ప డతను. ఆ మహాత్ముడు కుశలంగా వున్నాడా? వెనకటిలాగే మాయెడల స్నేహం వుందా అతనికి? మా పెద్దతండ్రి తన నూరుగురుకొడుకులతోనూ సుఖంగా వున్నాడా?

బాహ్లీకుడూ, సోమదత్తుడూ, భూరిశ్రవుడూ సకలమూ తెలిసినవారు. సత్యసంధులు. వారందరూ క్షేమమా? ద్రోణాచార్యుడూ, అశ్వత్థామా, కృపాచార్యుడూ మేటివిలుకాళ్లు. మూడులోకాల్లోనూ వారికి వారే సాటి. కౌరవుల అభ్యుదయమే కోరుతూ ఉంటారు. సర్వతోముఖమైన ప్రజ్ఞ వారిది. సర్వశాస్త్రాలూ వారికొట్టిన పిండి. వారున్నూ క్షేమంగా వున్నారా? రాజాస్థానంలో మునుపటిలాగే వారి కాదరగౌరవాలు జరుగుతున్నాయా? అశ్వత్థామ గొప్ప

శీలసంపన్నుడు. మిక్కిలీదర్శనీయు డతను. గొప్ప విలుకాడు. అతని క్షేమం ముందు చెప్పు నాకు. యుయుత్సుడు రాజపుత్రుడు. అతని తల్లి వైశ్యస్త్రీలలో పేరెన్నిక గన్నది. చాలా తెలిసినవా డతను. అతనున్నూ క్షేమంగా వున్నాడా ?

ముందు కర్ణుడిమాటకూడా చెప్పవయ్యా! దుర్యోధనుడికి మంత్రి అతను. అత నంటే దుర్యోధనుడికి గుడ్డినమ్మకం. అతను కుశలంగా వున్నాడుగదా? భరతవంశపు వృద్ధులూ, స్త్రీలూ, తల్లులూ, కోడళ్లూ, కొడుకులూ, కూతుళ్ళూ, అక్కచెల్లెళ్లూ, మేనల్లుళ్ళూ, మేనగోడళ్ళూ, దౌహిత్రులూ, వంటపనికత్తెలూ, భృత్యుల భార్యలూ, కపటం యెర క్కుండా కులాసాగా వున్నారా ?

వృద్ధరాజు, బ్రాహ్మలకు, మునుపటిలాగే బతుకుదెరువు కల్పిస్తు న్నాడా? బ్రాహ్మలకు వెనక మేమిచ్చిన అగ్రహారాలు తాను లాక్కో కుండా దుర్యోధనుడు వారికి భుక్తపడనిస్తున్నాడా ? బ్రాహ్మలవల్ల యేదయినా పొరపాటు జరిగితే వృద్ధరాజు వారిని బాధించకుండా వున్నాడా ? బ్రాహ్మల నడవడి స్వర్గానికి దారి. రాజు వారి బాగో గులు బాగా కనిపెడుతున్నాడా ? బ్రాహ్మ లంటే యెవరో తెలుసా ? ఈభూలోకంలో తపస్సు — అంటే అజ్ఞానాంధకారం ఆవరించకుండా బ్రహ్మదేవుడు కల్పించిన అఖండజ్యోతిస్వరూపులు వారు. వారియెడల ఏమాత్రం అసందర్భంగా ప్రవర్తించినా కౌరవు లందరూ సమూలంగా నాశనం అయిపోతారుసుమా.

ఇక మంత్రు లున్నారు. వారు సమర్థులే. అయితే, వృద్ధరాజూ, పెద్దకొడుకూ వారిని సగౌరవంగా చూస్తున్నారా? శత్రువుల మాయల్లో పడి ఆమంత్రులు వారి డబ్బు తింటూ వారి పక్షంగా కుట్రలు పన్నడం లేదుగదా యిక్కడ? వారెవరూ మావిషయమై చెడ్డమాటలు చెప్ప డం లేదుగదా రాజుతో ? మహావీరు లైన అశ్వత్థామా, కృపాచా

భీమసేనుణ్ణీ, యెలాంటి మహాయుద్ధంలోనూ కూడా చలించకుండా, బాణవర్షం కురిసే నకులసహదేవులనూ కూడా వారు తలుచుకుంటూనే వుంటారు.

ముందు నిమిషంలో యేమి జరుగుతుందో యెవడూ తెలుసుకో లే డనుకుంటున్నాను. సర్వధర్మాలూ తెలిసినవాడవూ, ఎప్పుడూ ధర్మం తప్పనివాడవూ నువ్వే అలాంటి కష్టా లనుభవించినప్పు డిక చెప్పవలసిన దేమి వుంది? "పాండుపుత్రు లందరూ యింద్రునితో సమానులు. వారెప్పుడూ కామంకోసం ధర్మం విడిచిపెట్టరని లోకం అంతా చెప్పుకుంటోంది. కనకనూ, నువ్వఖండప్రజ్ఞావంతుడవు కన కనూ, ధృతరాష్ట్రుని కొడుకులూ, పాండుపుత్రులైనమీరూ, సృంజ యులూ, తక్కిన రాజులున్నూ అందరూ సుఖంగా బతికేటట్టు ఆయెగుడుదిగుడు లన్నీ నువ్వే సరిదిద్దుకోవాలి"

ఇక నీతండ్రి అయిన వృద్ధరాజు రాత్రి నాకు చెప్పి పంపిం దిప్పుడు చెబుతాను. నీవా రందరితోనూ కలిసి నువ్వది బాగా విను"

# 25

## సంజయ రాయబారం 5

"సంజయా, ఇదే పాండవులూ, సృంజయులూ, శ్రీకృష్ణుడూ, విరటుడూ సావధానంగా వున్నారు, మా తండ్రి మాకు చెప్ప మని నిన్నంపినమాట లేవో చెప్పు" అనడిగాడు ధర్మరాజు.

సంజయు డిలా చెప్పుకునివచ్చాడు.

"అజాతశత్రూ! నువ్వు శ్రద్ధగా విను. భీమసేనుడూ, అర్జునుడూ, నకులసహదేవులూ, శ్రీకృష్ణుడూ, సాత్యకీ, చేకితానుడూ, విరటుడూ, ద్రుపదుడూ, ధృష్టద్యుమ్నుడూ, ద్రౌపదీ — వీరందరూకూడా నామాట లాలకించకోరుతున్నాను. నేను కౌరవుల శ్రేయస్సు కోరేవాణ్ణి.

ఇంతకీ, —సర్వవిధాలా ప్రయత్నించి వారిని యుద్ధం చేసి కూల్చేస్తే తప్ప, మంచిమాటలతో మే మెప్పుడూ సుఖపడలేము, ఇదిమాత్రం నిశ్చయం ”

# 24

## సం జ రా య బా రం 4

ఇదంతా విన్నాడు సంజయుడు. “ నువ్వడిగినవా రందరూ కుశలంగానే వున్నా ” రంటూ మళ్ళీ ప్రారంభించా డతను.

“ ధర్మనందనా, అభిమానధను లైన కురువృద్ధు లందరూ నువ్వడిగినట్టు క్షేమంగానే వున్నారు. దుర్యోధనుని దగ్గిర సాధువు లైన వృద్ధులూ వున్నారు. పాపబుద్ధులూ వున్నారు, దాపరికం యెందుకయ్యా? దేహీ అంటే, దుర్యోధనుడు, శత్రువుల కూడా యేది పడితే అదల్లా యిచ్చేస్తాడు కదా, బ్రాహ్మలకు నువ్విచ్చివుండిన అగ్రహారా లెందుకు లాక్కుంటాడూ? వృద్ధరాజు కొంచెమున్నా మీ యెడల ద్రోహం చెయ్యలేదు. అతనియెడల నువ్విలా క్రౌర్యం చూపించడం ధర్మంకాదు. మీరు పరమ సాధువులు. ధృతరాష్ట్రుడు తన కొడుకుతో కలిసి మిమ్మల్ని ద్వేషించిన ట్టయితే, అతను మిత్ర ద్రోహీ అవుతాడు సందేహం లేదు. కొడుకులు చేసిం దెప్పుడూ అంగీకరించలే దతను. అదలా జరిగినందుకు చాలా పరితపిస్తున్నాడు. మిక్కిలీ దుఃఖిస్తున్నాడు కూడా లోపల్లోపల. మిత్రద్రోహం కంటే మహాపాతకం మరిలే దని అతను బ్రాహ్మలు చెప్పగా వినేవున్నాడెన్నోమాట్లు.

దుందుభులు మోగినప్పుడూ, శంఖా లురిమినప్పుడూ — ఈవిధంగా యుద్ధం ప్రసక్తమైనప్పుడు నిన్నూ, యుద్ధరంగంలో నానాబీభత్సమూ చేసే అర్జునుణ్ణీ తలుచుకుంటూనే వుంటారు వారు. గదాపాణి అయిన

భీమసేనుణ్ణీ, యెలాంటి మహాయుద్ధంలోనూ కూడా చలించకుండా, బాణవర్షం కురిసే నకులసహదేవులనూ కూడా వారు తలుచుకుంటూనే వుంటారు.

ముందు నిమిషంలో యేమి జరుగుతుందో యెవడూ తెలుసుకోలే డనుకుంటున్నాను. సర్వధర్మాలూ తెలిసినవాడవూ, ఎప్పుడూ ధర్మం తప్పనివాడవూ నువ్వే అలాంటి కష్టా లనుభవించినప్పు డిక చెప్పవలసిన దేమి వుంది? "పాండుపుత్రు లందరూ యింద్రునితో సమానులు. వారెప్పుడూ కామంకోసం ధర్మం విడిచిపెట్టరని లోకం అంతా చెప్పుకుంటోంది. కనకనూ, నువ్వాఖండప్రజ్ఞావంతుడవు కనకనూ, ధృతరాష్ట్రుని కొడుకులూ, పాండుపుత్రు లైనమీరూ, సృంజయులూ, తక్కిన రాజులున్నూ అందరూ సుఖంగా బతికేటట్టు ఆయెగుడుదిగుడు లన్నీ నువ్వే సరిదిద్దుకోవాలి"

ఇక నీతండ్రి అయిన వృద్ధరాజు రాత్రి నాకు చెప్పి పంపిం దిప్పుడు చెబుతాను. నీవా రందరితోనూ కలిసి నువ్వది బాగా విను"

## 25

## సంజయ రాయబారం 5

"సంజయా, ఇదే పాండవులూ, సృంజయులూ, శ్రీకృష్ణుడూ, విరటుడూ సావధానంగా వున్నారు, మా తండ్రి మాకు చెప్ప మని నిన్నంపినమాట లేవో చెప్పు" అనడిగాడు ధర్మరాజు.

సంజయు డిలా చెప్పుకునివచ్చాడు.

"అజాతశత్రూ! నువ్వు శ్రద్ధగా విను. భీమసేనుడూ, అర్జునుడూ, నకులసహదేవులూ, శ్రీకృష్ణుడూ, సాత్యకీ, చేకితానుడూ, విరటుడూ, ద్రుపదుడూ, ధృష్టద్యుమ్నుడూ, ద్రౌపదీ — వీరందరూకూడా నామాట లాలకించకోరుతున్నాను. నేను కౌరవుల శ్రేయస్సు కోరేవాణ్ణి.

ధృతరాష్ట్రుడు శాంతి కోరుతూ నన్నిక్కడికి పంపాడు. నాకోసం తానే స్వయంగా రథం సిద్ధంచేయించాడతడు. మీరందరూ సకలశుభాలూ అనుభవించాలని నా ఆశ.

మీరూపం సామాన్యం కాదు. మీదయాస్వభావం లోకప్రసిద్ధం. ముక్కుకి సూటిగా పోయే మీ నడవడి యెరగనివారు లేరు. మీకు సకలధర్మాలూ తెలియనూ తెలుసు, అవి మీరు తప్పడమూ లేదు. ఉన్నతకుటుంబంలో పుట్టినవారు మీరు. కోపం అన్నది యెరగరు మీరు. మీవంటి దాతలు మూడులోకాల్లోనూ లేరు. ఏపని యెప్పుడెలా చెయ్యాలో అది మీకు బాగా తెలుసు. లజ్జావంతులు గాని గర్వితులు కారు మీరు. బహుక్రూరకృత్యం అయిన యుద్ధానికి సిద్ధపడడం మీవంటివారికి తగ్గది కాదు. పరిశుభ్రమైన తెల్లని బట్టమీద కాటుకడాగు పడ్డట్టవుతుంది, మీరలా చేస్తే.

యుద్ధం సమస్తమూ నాశనం చేసేస్తుంది. పాపాలకు కారణం అది. నరకాలకున్నూ మూలం అది. అందులో దిగితే, జయమే కలుగుతుందో, అపజయమే కలుగుతుందో యెవరూ చెప్పలేరు. జయమే కలిగినా అటూ యిటూ సర్వమూ నాశనం అయిపోయాక కలుగుతుందది. తెలిసితెలిసి యెవరలాంటి యుద్ధానికి సిద్ధపడతారూ?

ఆనాడు, ఘోషయాత్రలో మీరు దుర్యోధనాదులను విడిపించడం చాలా గొప్పపని. జ్ఞాతికార్యం అది. జ్ఞాతులకలాంటి సాయంచేసినవారే సోదరులన్నా, పుత్రులన్నా, స్నేహితులన్నా, బంధువులన్నాను. అలా చెయ్యకపోడం మిక్కిలీ నీచమైనది. మీరు దృఢంగా నిశ్చయించుకుని శత్రువులనందరినీ నాశనంచెయ్యడంలో దుర్యోధనాదులను చంపేస్తే అది మీకున్నూ మృత్యువుతో సమానమే అవుతుంది. ఏమంటారా? జ్ఞాతులనందరినీ సంహరించి బతకడం వుందే, అది, యెంతమాత్రమూ మంచిది కాదు.

సర్వవిధాలా పార్థుడు మిమ్మల్ని కంటికి రెప్పలా కాపాడుతున్నాడు. శ్రీకృష్ణుడు మీదగ్గిరే వున్నాడు. చేకితానుడూ, సాత్యకీ– మొదలైనవా రెందరో నీకు బాసట అయివున్నారు. దేవతలనూ యింద్రుణ్ణీ సాయం తెచ్చుకున్నా యెవడూ మిమ్మల్ని గెలవలేడు యుద్ధంలో.

ఇక దుర్యోధనాదుల సంగతి చూశావా? ద్రోణుడూ, భీష్ముడూ, అశ్వత్థామా, కృపుడూ, శల్యుడూ సర్వరక్షకులుగా వున్నారు వారికి. అనేకమంది రాజులూ, స్వయంగా కర్ణుడూ పువ్వుల్లో పెట్టి పూజిస్తున్నారు వారిని. సహజంగా వారి సైన్యమున్నూ అంతూదరీ లేకుండా వుంది. వారి నెదిరించి యుద్ధంలో యెవడు నిలవగలడయ్యా?

కనక, ఓడిపోయినా గెలిచినా నొకటే అవుతుంది మీకు. దానివల్ల ఆవంతకూడా మీకు శ్రేయస్సు కలగదు. నీచకులంలో పుట్టిన హీనుల్లాగ మీరు యుద్ధానికి సిద్ధపడడం కోంచెమున్నూ మంచిది కాదు. ఇదిగో, నేను, శ్రీకృష్ణుడికి సాష్టాంగసమస్కారాలు చెప్పుకుంటున్నాను. ద్రుపదుడికీన్నీ విన్నవించుకుంటున్నాను. చేతులు జోడించుకుని శరణున్నూ వేడుకుంటున్నాను వారిని. మీకూ వారికీ గూడా క్షేమం కోరుతున్నా న్నేను. శ్రీకృష్ణుడూ అర్జునుడూ కూడా నామాట కొట్టెయ్యరనే నేను తలుస్తున్నాను. ఏమంటే? దేహీ అన్నవారికి తమ ప్రాణాలున్నూ యిచ్చెయ్యగలరు వారు. కనక, నేను చెప్పే దేమిటంటే? ఉభయవర్గాలవారూ శాంతంగా బతకడమే ధృతరాష్ట్రుని కోరిక. భీష్మాదివృద్ధుల అభిమతమున్నూ యిదే"

# 26

## సంజయరాయబారం 6

ధర్మరా జందుకున్నాడు.

"సంజయా, యుద్ధం అంటే అంత భయమేం నీకు? కాక, — నా మాటల్లో, నేను యుద్ధమే కోరుతున్నట్టెక్కడ అనిపించిందయ్యా నీకు?

నిజానికి, యుద్ధం చెయ్యడం కంటే చెయ్యకపోవడమే చాలా గొప్ప పని. తన క్కావలసిన పని సానుకూలం అయితే యుద్ధం యెవడు కోరు కుంటాడూ? ఏపనీ చెయ్యకపోయినా తన కోరిక నెరవేరే టట్టయితే, యెవడూ కూడా, యుద్ధమే కాదు, మిక్కిలీ సులువైన మరేపనీ కూడా చెయ్యడు. ఎవడి కయినా యుద్ధం చెయ్యవలసిన అగత్యం యేమి టసలు? సుఖంకోసం ధర్మం విడిచిపెట్టి పాండవు లెప్పుడూ ఏపనీ చెయ్యరు. లోకానికి హితకరం కాని పనిన్నీ చేయరు. చాలా కష్టపడితే గాని కలగని సుఖం, అది ధర్మబద్ధమే అయినా దుఃఖంలోనే లెక్క. ఇంద్రియాలకు లోబడిపోయినవా డెప్పుడూ దుఃఖాలు రాకూడ దనుకుంటాడు. సుఖాలే కలగా లనిన్నీ అనుకుంటాడు.

• అసలు, కోరికలే శరీరానికి బాధ కలిగిస్తాయి. అవి లేనివాడికి దుఃఖాలే రావు. సమిధలు వేసినకొద్దీ అగ్నికి తృప్తి కలుగుతుంది. నెయ్యి పోసిన కొద్దీ అగ్ని మిన్ను ముట్టుతుంది. అలాగే, కోరికలు తీరినకొద్దీ, తృష్ణ—అంటే భోగాలమీద భోగాలనుభవించా లన్న దృష్టి యెక్కు వయిపోతుంది. ధృతరాష్ట్రుడు మహా భోగా లనుభవిస్తున్నా డెన్నో. అయినా, తృప్తిమాత్రం కలగడంలే దతనికి. ఆభోగా లన్నివి, మా అయిదుగురితోనూ కలిసే అనుభవిద్దా మన్న బుద్ధి మాత్రం లేదతనికి.

తనకొడుకులే గొప్పవాళ్ళు మాపెత్తండ్రి దృష్టిలో. మేము కాము. అంచేతనే, మమ్మల్ని కాదని తనకొడుకులతో మాత్రం కలిసి నృత్యగీతా లనుభవిస్తున్నా డతను. మంచిమంచి గంధాలూ, మైపూతలూ అనుభవిస్తున్నాడు. గొప్పగొప్ప రత్నమాలలూ అపురూపా లయిన పూలదండలూ ధరిస్తున్నాడు. చాలావిలవగల బట్టలున్నూ కట్టుకుంటున్నాడు, ఎడతెరపిలేకుండా. బుద్ధిపూర్వకంగా మమ్మల్ని దూరంగా తరిమివేసి మరీ అనుభవిస్తున్నాడు తా నవి అన్నీ. పండితు లయినవారు కోరవలసినవి కావివి. అయినా, మా

హృదయం మిక్కిలీ పరితపిస్తోంది. చివరికి, దీనివల్ల తానే బాధపడి పోతున్నా డతను. అయినా, యిప్పటికీ కర్ణాదులే గొప్పవాళ్ళుగా కనపడుతున్నా రతనికి. మేమిలా వుండిపోయినందుకున్నూ బాధపడు తున్నా డతను. మాసంపద లన్నీ తానే వేసుకుని మేము శాంతించి వూరుకోవా లనడంలో లేమయినా ధర్మంవుందటయ్యా ?

అసలే వేసవికాలం. దానికి సాయం,నిలువెడెత్తు పెరిగిన గడ్డితో పాటు చెట్లన్నీ యెండిపోయివున్న అడివి. అందులో నిప్పురవ్వ పడే శాడు తాను. గాలికి రాజి, రగిలి భగ్గుమని, చివరికి దావాగ్ని అయి పోయిం దది. అది ఆర్పడానికి మాత్రం ఉపాయం ఆలోచించ డతను. దాని క దే చల్లారిపూరుకోవాలి. అతను, మాకు కలిగించిన అవస్థ యిది. మాకిన్ని చేసిన్నీ, అతను, మాకు మేమే శాంతించా లని రాయబారం పంపడం.

భూమండలం అంతా తన కొడుకుచేతిలో వుందిప్పుడు. తాను అఖండైశ్వర్యం అనుభవిస్తున్నాడు. మరెందుకూ అతనికి దుఃఖం? పోనీ అంటే, దుర్యోధనుడు దుర్బుద్ధి కాని సుబుద్ధి కాడు. వంకరపనులే చేస్తా డెప్పుడూ. మూర్ఖుడూ, మూర్ఖుడూను. అంటే, తనకి తోచదు, ఎవరైనా చెబితే వినడు. పైగా, అతని కాలోచనలు చెప్పేవారా, కేవలమూ నీచులు. ఆకొడుకు మాటే యిష్టంగదా ఆవృద్ధరాజుకి?

విదురుడు పూర్తిగా తెలుసునాడు. తమ మేలే కోరతా డెప్పుడూ. అలాంటి ఆత్మీయుణ్ణి దుర్యోధనుడు తిరస్కరించాడు. తమకు విదురుడు ఆప్తుడు కాడని దుర్యోధనుని అభిప్రాయం. వృద్ధరాజుకి ఆదుర్యోధను డేమి చెబితే అంతే కదా? ఆమాటవినగాద అధర్మానికే సిద్ధపడతాడు కదా, యెప్పుడున్నూ ?

నీకు తెలియందా? విదురుడు మహామేధావి. అంత చురుకైన బుద్ధిగలవాళ్ళు లోకంలో బహుతక్కువగా వుంటారు. ఎప్పుడూ వారి

మేలే కోరుతూ వుంటా డతను. చాలావిషయాలు తెలుసు అతనికి. మంచి మాటకారి అతను. అతని శీలం చాలా మంచిది. తన కొడుకు మాటమీద ముసలిరాజున్నూ అతని మాట లెక్క చెయ్యడుకదా యెప్పుడున్నూ ?

పోనీ దుర్యోధనుని సంగతి చూశావా? ఎదటివాళ్ళని చాలా అవమానిస్తా డతను. తానే మహామానవంతు ణ్ణనుకుంటాడు. అసూయాపరుడు. ఎదటిపచ్చ కొంచెమున్నూ సహించలేడు. అర్థమూ ధర్మమూ కూడా లెక్క చెయ్యడు లేశమూ. చాలా తొందరమనిషి. ఎప్పుడూ చెడ్డమాటలే మాట్లాడతాడు. కోపం వస్తే వొళ్లు మరిచిపోతాడు. సర్వమూ తనకే వుండా లనుకుంటాడు. తనకే కావా లనిన్నీ అంటాడు. చెడ్డసహవాసమే చేస్తాడు, వెతికి వెతికి. ఎవరిమాటా వినిపించుకోడు. ఎప్పుడూ యేదో పాపప్పనే చేస్తూ వుంటాడు. ముఖ్యంగా, అభాగ్యుడు. దీర్ఘకోపి. మిత్రద్రోహి. అలాంటి కొడుకంటే పడిచస్తాడు కదూ ముసలిరాజు ? అతనికోసం ధర్మమూ, కామమూ కూడా విడిచిపెట్టేశాడు కదూ ?

అప్పుడే నేననుకున్నాను, కురుకులానికి నాశం తప్ప దని. అన్ని మంచిమాటలు చెప్పిన్నీ విదురుడు ధృతరాష్ట్రునిచేత అవు నని పించుకోలేకపోయాడు. ఆవిదురుని మాట ఎప్పుడు తీసిపారవేశారో అప్పుడే వారి కాపదలు ప్రారంభం అయిపోయాయి. అతనిమాట విన్నంతకాలమూ వారికి ఎంతో పెరిగింది రాజ్యం. అన్నివిధాలా ధనలుబ్ధుడైన దుర్యోధనుడికి మంత్రు లెవరో చూశావా ? దుశ్శాసను డొకడూ, కర్ణుడొకడూ, శకుని వొకడూన్నూ, కదూ ? దుర్యోధను డెంత అవివేకం కలవాడో దీనివల్ల నువ్వు గ్రహించలేవూ ?

తనసంపద లన్నీ చూసుకుని, ముసలిరాజు, మంచిచెడ్డలు బొత్తిగా గుర్తించలేకుండా వున్నాడు. అంచేతనే దూరపుచూపు చూసే విదురు

ణ్ణవమానించా డతను. బాధ్యత అంతా కూడా ఆదృష్టచతుష్టయం మీఁదా వుంచాడు. సంజయా, పాండవుల కయినా కౌరవుల కయినా యిక క్షేమం కలగా లంటే యెలాగయ్యా?

కాస్తయినా వాటా అంటూ యెవరికీ యివ్వకుండా మహారాజ్యం అంతా కొడుకుతో కలిసి తానే యేలుకోవా లని ముసలిరాజు నిశ్చయం; కాని దానివల్ల అతనికి శాంతి కలగడంలేదు: కనక, శాంతి సాధించి నిలపవలసిన బాధ్యత మాత్రం నామీఁద వుంచి మాట్టాడతా డెప్పుడూ.

అర్జునుడు గాండీవం చేతబట్టి యుద్ధానికి బయలుదేరడమే వస్తే అనాయాసంగా తానతణ్ణి వోడించేస్తా ననుకుంటూ మురుస్తున్నాడు కర్ణుడు, కదూ? మరి, యిదివరలో, ఉత్తరగోగ్రహణంవంటియుద్ధాలు జరగనే జరిగాయి కదా, అప్పు డేంచెయ్యగలిగా డయ్యా అతను?

అర్జునుణ్ణి మించిన విలుకాడు మరెక్కడా లే డని నేను చెప్పడం కాదు, అది కర్ణుడికీ తెలుసు, దుర్యోధనుడికీ తెలుసు. ద్రోణుడికీ తెలుసు, మాతాతకీ తెలుసు. శత్రువుల నందరినీ నాశనం చేసెయ్యగల అర్జునుడు లేకపోతేనే దుర్యోధనుడికి రాజ్యం దక్కుతుంది కొన్నాళ్లయినా, ఈసంగతిన్నీ కౌరవులకూ తెలుసు అందరికీ, రాజులకూ తెలుసు వారికి సాయంవచ్చినవారి కందరికీ; కాని నాలుగుచేతుల పొడుగున్న గాండీవంచేతబుచ్చుకుని అర్జునుడే కనక యుద్ధానికి బయలుదేరితే, రాజ్యంలో మావాటా మాకివ్వకుండా దుర్యోధనుడు హరించగలడా? ఆగాండీవజ్యాఘోష తమ కింకా వినపడలేదు కనక ధృతరాష్ట్రుని కొడుకు లింకా బతికివున్నారు. భీమసేనుడు కళ్లెర్రచేయడం తాను స్వయంగా చూసేదాకానే సమస్తమూ తమకు స్వాధీనం అయిపోయివుం దనే అనుకుంటూ వుంటాడు దుర్యోధనుడు.

అయ్యా, నేనొక్కటి చెబుతాను వింటావా? ఎలాంటి కష్టాలయినా సహించగల భీమసేనుడూ, అర్జునుడూ, నకులసహదేవులూ బతికివుండినంతకాలమూ దేవేంద్రుడు కూడా మా ఆస్తి హరించలేడు, తెలుసా? వృద్ధరాజు మాభాగం మాకివ్వకపోతే సర్వనాశనం సంభవిస్తుం దన్న సంగతి తెలుసుకోగలిగినట్టయితేనే దుర్యోధనాదులు మాకోపాగ్నిలో పడి బుగ్గిఅయిపోకుండా వుండగలరు.

మొన్న మొన్నటిదాకా మేమెన్ని కష్టాలనుభవించామో అదంతా నీకు తెలుసు. పసకటికి భీమసేనుణ్ణి కట్టి గంగలో పడదోసినప్పుడూ, లక్కయిల్లు కాల్పించినప్పుడూ, దుర్యోధనుణ్ణి సహించి మేం మెంచుకూరుకున్నామో అదీ నీకు తెలుసు. అయినా, శాంతికోరి నువ్వు సంధి చెయ్యడానికి వచ్చావు కనక, నీమీది ఆదరభావంతో చెబుతున్నాను. నువ్వు చెప్పినట్టు మేము శాంతిస్తాము, నీకనుమానం అక్కర్లేదు. ముసలిరాజుతో చెప్పు గట్టిగా, వెళ్ళి. ఇంద్రప్రస్థం మాకిచ్చెయ్యమను, వెనకటిలాగే అక్కడ వుండి మారాజ్యం మేమేలుకుంటాము. హస్తినాపురంలో వుండి తనరాజ్యం తానేలుకోమను ”

## 27

### సంజయరాయబారం 7

అది విని సంజయు డందుకున్నాడు, చనువుగా.

“ ధర్మనందనా, నువ్వు చేసే దంతా ధర్మబద్ధం అని లోకమూ చెబుతోంది, నాకూ తెలుసు. బతుకు అన్నది వొక ప్రవాహం. దాని వడి చాలా హెచ్చు. దాన్నాపుకోడం యెవరికీ శక్యం కాదు. పోనీ అంటే, శాశ్వతమున్నా కాదది. కనక, బాగా ఆలోచించు. కౌరవులను నాశనం చేద్దా మన్న సంకల్పం మాత్రం విడిచిపెట్టు. యుద్ధం చేస్తే తప్ప, కౌరవులు, రాజ్యంలో మీభాగం మీకివ్వరం

టావా ? అలా అయితే, అంధకవృష్ణిరాజ్యంలోకి పోయి ముష్టెత్తుకుని బతకడం శ్రేయస్కరం కాని, యుద్ధంచేసి రాజ్యం గడించుకోడం కొంచె మున్నా మంచిది కాదు మీకు.

మనిషి బతుకు చాలా స్వల్పకాలం కావడమే కాదు, ఓటికుండ వంటి దది. ఎప్పుడూ దుఃఖాలతో నిండివుంటుం దది. అయినా సరే అనుకుందామా అంటే నిలకడగా వుండదు, బహు చంచలం. యుద్ధం నీకీర్తికి తగ్గది కాదు. కనక, పాపాలకు మూలం అయిన యుద్ధం చెయ్యడం నీకు మంచిది కాదు. ఈకామం అన్నది మాటిమాటికీ యేదో వొక విఘ్నం తెచ్చిపెట్టి ధర్మం నాశనం చేసేస్తుంది. కోరిక పోయినా మనిషి అయినవాణ్ణి అంటిపెట్టుకునే వుంటుం దది. బుద్ధిగలిగి, మనిషి, ఆకామం తగ్గించుకోగలిగితే మిక్కిలీగొప్పకీర్తి కలవాడవుతాడు.

పాండుపుత్రా, ధనాశ మనిషితో కూడాకూడా వుంటుంది. అది గలవాడు ధర్మంగా నడుచుకోలేడు. ఎవడు ధర్మమే ప్రధానంగా చూసుకుంటాడో జ్ఞాని అంటే వాణ్ణే చెప్పాలి. ఎన్ని కోరిక లుంటాయో డబ్బంటే అంత ఆశా వుడుతుంది. ఎలాంటివాణ్ణే కూడా చెరిపేస్తుం దది. ఏపని చెయ్యడాని కయినా ధర్మమే ప్రధానంగా పెట్టుకోవాలి. అలా చేసేవాడు నడిమింటి సూర్యభగవాను డంతటి గొప్ప ప్రతాపం కలవా డవుతాడు. ధర్మం లేనివా డెంతటి మహారా జయినా పాపాలే చేస్తాడు. నశించిపోతాడు, చివరికి, దాంతోనే.

నువ్వు వేదా లన్నీ చదువుకున్నావు. బ్రహ్మచర్యమున్నా వ్రతంగా అనుష్ఠించుకున్నావు. ఎన్నో యజ్ఞాలు చేశావు. అడిగిం దల్లా యిచ్చావు బ్రాహ్మలకు. పరలోకమే ప్రధానం అను కున్నావు. చిరకాలం మంచిమంచి సుఖాలనుభవించావు. ఆలో చించుకో. సుఖాలేకోరి — సుఖాలే మరిగి యోగాభ్యాసం మానుకునే వాడు — అంటే మనస్సు నిలుపుకో లేనివాడు, వున్నడబ్బు కాస్తా

ఆరిపోయాక, మరి, కోరికలు తీరే గతి లేక చివరికి నానావిధాలా భ్రష్టయిపోతాడు.

బ్రహ్మచర్యం మాటే తలపెట్టక, ధర్మం పూర్తిగా విడిచిపెట్టి, పైపెచ్చు, అధర్మాలే చేసేవాడు పరలోకం కోసం ఎంతమాత్రమూ శ్రద్ధచూపించక, ఈశరీరం కాస్తా విడిచిపెట్టాక, నానాదురవస్థలూ అనుభవిస్తాడు నరకంలో. పుణ్యకార్యాలు చేసినా పాపకార్యాలు చేసినా అవి యీలోకంలోనే వుండిపోవు. ఈలోకంలోనే నశించీ పోవు. చేసినవాడికంటే ముందరే పరలోకానికి వెళ్లికూచుంటాయి, వాడికోసమే యెదురుచూస్తూ. అవి చేసినవాడు తరవాతే అక్కడికి వెడతాడు. వెళ్లి అవన్నీ కొంచెమయినా మిగల్చకుండా అనుభవిస్తాడు.

అన్వాహార్యం అనే యజ్ఞంలో, బ్రాహ్మల అన్నం న్యాయార్జితం అయి వుంటుంది. శ్రద్ధగా సిద్ధంచేస్తారు కనక మిక్కిలి పవిత్రం అయి వుంటుంది. ఎంతో సువాసనగానూ, రుచిగానూ వుంటుంది. ఆ అన్నం లాగే నువ్వుచేసిన పను లన్నీ ప్రఖ్యాతి పొంది వున్నాయి.

ఏపని చేసినా యిక్కడే యెన రయినా. పరలోకంలో పని చెయ్యడం అంటూ ఏమీ వుండదు. నువ్వు పరలోకంలో సుఖం కలిగించే పుణ్యకార్యాలే చేశా విక్కడ. ఇది సజ్జనుల కందరికీ తెలుసు. వెయ్యేనోళ్ల, వారెప్పుడూ చెప్పుకుంటూనే వున్నా రిది. ఆలోకంలోకి వెళ్లాక, మనిషి మృత్యువూ, ముదిమీ, భయమూ విడిచిపెట్టేస్తాడు. ఆకలీ దప్పికా వుండవక్కడ. మనస్సుకి ప్రీతికలిగించేవే వుంటాయి. ఇంద్రియాలకు తృప్తిపరుచుకోవడం కంటే మరేమీ వుండ దక్కడ చెయ్యవలసింది.

కర్మఫలం యిలా వుంటుంది. కనక, అక్కడ కామసుఖా లనుభవించా లన్నకోరికతో నువ్విక్కడ ఏపనీ చెయ్యవద్దు. నిష్కామంగానే చెయ్యి, ఏపనయినా. క్రోధంవల్ల వచ్చే నరకలోకమూ, సంతోషం

వల్ల వచ్చే స్వర్గలోకమూ నువ్వు శాశ్వతంగా కోరుకోవద్దు. నువ్వు జ్ఞానంతో మసులుకుంటూ, చేసుకున్నవన్నీ నశించిపోయేటట్టు చూసుకో. ఎంత జ్ఞానం వుండినా, సత్యమూ దమమూ రుజుప్రవర్తనా, అహింసా — ఇవెప్పుడూ విడిచిపెట్టకు. అశ్వమేధాలూ, రాజసూయాలూ — ఇంకా యిలాంటివీ యజ్ఞాలు లోకసంగ్రహం కోసమే — అంటే, నిన్ను చూసి లోకు లలా నడుచుకోడంకోసమే చెయ్యి. ఫలాలు కోరకు. పాపకర్మలకు మాత్రం దగ్గిరగా వెళ్లకు.

అలాకాక, — నీతమ్ములతో గూడా నువ్వు ద్వేషం పెంచుకుని పాపకార్యాలే చేస్తూవుంటావా? అయితే, నువ్వు మళ్లీ వనవాసం చెయ్యడమే మంచిది. అరణ్యాల్లో కష్టాలూ దుఃఖాలూ కలుగుతాయి, నిజమే; కాని అవనుభవించడం ధర్మమే అవుతుంది.

వెనకటికి, నువ్వు, నీస్వాధీనంలో వున్న బలం అంతా విడిచిపెట్టుకున్నావు. అన్నీ విడిచి అడవులకు వెళ్లిపోయావు. ఏమీ, నీకిప్పుడు ఆలోచనలు చెబుతున్న యీకృష్ణుడూ, ఈయుయుధానుడూ, కొడుకులతో గూడా ఈవిరటరాజూ, ఈరుక్మరథుడూ కొడుకులూ, ఇంకా అనేకమంది రాజు లున్నారు, వారూ! — అప్పుడు మాత్రం నీపక్షంగా లేరూ? వీరు నీకు సాయంచెయ్యకపోదురా? ఇలాంటి బలం అంతా వెంటబెట్టుకునీ, కృష్ణుణ్ణీ అర్జునుణ్ణీ ముందుబెట్టుకునీ వెళ్లి కౌరవపక్షంలో వున్న గొప్ప యోధుల నందరినీ సంహరించేసి దుర్యోధనుని దర్పం అంతా అప్పుడే నువ్వణగదొక్కి వుంటే బాగుండిపోయేది కాదుటయ్యా?

ఇందుకు మారుగా — నువ్వు, గతంలో, దుర్యోధనుడి బలం బాగా పెరగబెట్టి, నీకు సాయంచేసేవారి నందరినీ తొక్కిపెట్టీ, అడవులకు వెళ్లివుండి, ఇప్పుడేమిటయ్యా యుద్ధానికి సిద్ధపడతా విలాగ?

అవివేకీ, ధర్మహీనుడూ అయినవాడు జయించావచ్చు, ప్రజ్ఞ వుండి యెప్పుడూ ధర్మంగానే నడుచుకునేవా డోడిపోనూవచ్చు, యుద్ధంలో.

ధర్మనందనా, నీబుద్ధి యెప్పుడూ అధర్మంవైపు మొగ్గదు. ఎన్ని తొందరలు వచ్చినా నువ్వెప్పుడూ పాపప్పని చేసి యెరగవు. మరి, యిప్పుడు, ప్రజ్ఞ అంతా పాడుచేసుకున్నాక యుద్ధానికి సిద్ధపడుతున్నా వేమిటయ్యా? కోపం అనేది జబ్బేమీ లేకుండానే పుడుతుం దెవరి కయినా, పైత్యం పెరిగి నోరు చెడిపోకపోయినా అన్నహితవు పోగొడుతుం దది. తలనొప్పి పుట్టిస్తుంది. కీర్తి అంతా నాశనం చేస్తుంది. పాపాలే చేయిస్తుంది. రాజా, సామాన్యులు—అంటే దుర్జనులు ఆకోపం దిగమింగు కోలేరు. సత్పురుషు లయినవారు తప్పకుండా దిగమింగుకుంటారు. దిగమింగుకోడం వారి విధి. కనక, నువ్వు కూడా ఆకోపం దిగమింగుకో. శాంతించు.

కోపానికీ పాపాలకూ లంకె. బుద్ధివున్నవా డెన్నడూ యెవడూ కూడా దగ్గిరికి రానిచ్చుకో డది. నీకు క్షమే తగ్గది, భోగాలు కానేకావు. కాకపోయినా, ద్రోణుడూ, భీష్ముడూ, అశ్వత్థామా, కృపుడూ, శల్యుడూ, సౌమదత్తీ, వికర్ణుడూ, వివింశతీ, కర్ణుడూ, దుర్యోధనుడూ — వీరినందరినీ చంపేసిన తరవాత నువ్వు పొందుకోగల భోగాలు మాత్రం యేమిటయ్యా?

ఒక్కటే మాట. నాలుగు సముద్రాలకూ మధ్యస్థం అయిన యీభూమండలం అంతా స్వాధీనం చేసుకోగలిగినా నీకు ముదిమీ తప్పదు, చావూ తప్పదు. ప్రియం కలిగినా అప్రియమూ, సుఖం కలిగినా దుఃఖమూ కూడా తప్పవు. కనకనూ, సకలమూ తెలిసిన విద్వాంసుడవు గాని నువ్వు అజ్ఞానివి కావు కనకనూ, యుద్ధం చెయ్యా లన్న సంకల్పం విడిచిపెట్టెయ్యి. ఆప్రయత్నాలున్నూ చాలించుకో.

నీకు సాయంచెయ్యడానికి పూనుకున్నవారి వొత్తిడిమూలంగానే నీకిదంతా చెయ్యవలసివస్తోం దంటావా? అయితే, ఆభారం అంతా వారిమీద వుంచేసి నువ్వు తప్పుకో. నీ ముక్తిమార్గం పాడుచేసుకోకు.

వెంటనే అందుకున్నాడు ధర్మనందనుడు.

"సంజయా, నువ్వు నిజమే చెప్పావు. ఎవరేపని చేసినా ధర్మం తప్పగూడదు. అయితే, నేను ధర్మం తప్పకుండానే నడుచుకుంటున్నానో, ధర్మం విడిచే నడుచుకుంటున్నానో, బాగా పరిశీలించి, పూర్తిగా తెలుసుకుని మరీ మందలించు నన్ను. ఏమంటావా? ఒక్కొక్కప్పుడు అధర్మం ధర్మం అవుతుంది. మరొకప్పుడు ధర్మమే అధర్మం అవుతుంది. ధర్మం ధర్మంగా వుండడమున్నా వుంటుంది. విద్వాంసులిదంతా తరిచితరిచి చూస్తారు. అప్పుడుగాని యేదీ నిశ్చయించుకోరు వారు.

మనిషి అయినవాడు, ధర్మమూ ఆచరిస్తాడు, అధర్మమూ ఆచరిస్తాడు, అది సమయాసమయాలను బట్టివుంటుంది. ఏదయినా ఆపద వచ్చినప్పుడు అధర్మంగా నడుచుకోడం — అంటే ఇతరుల ధర్మం అనుచరించడం తప్పుకాదు. తిండేకరువయినవాడు ధర్మం తప్పకుండా బతకడం యెలాగా? కనక, మరోధర్మం అవలంబిస్తాడు, తప్పనగూడదు. పండితులిదే ఆపద్ధర్మం అంటారు. ఏకష్టమూ లేనప్పుడు కూడా తన ధర్మం విడిచి పరుల ధర్మం అవలంబించేవాడూ, కష్టాలు వచ్చినప్పుడు కూడా ఏమయినా సరే అని తన ధర్మమే పట్టుకూచుని ఆత్మహాని కలిగించుకునేవాడూ — ఈయిద్దరూ కూడా నిందార్హులే.

ఆపదలు వచ్చినప్పుడు — అంటే వీలుతప్పివచ్చినప్పుడు బతికివుండాలి కనక, బ్రాహ్మలు ఇతరుల ధర్మం అవలంబించి నడుచుకుంటారు, తప్పుకాదు; కాని ఆ ఆపద తప్పిపోయాక, వారు గతానికి ప్రాయశ్చిత్తం చేసుకుని తమ ధర్మం తామవలంబించుకోవాలి. బ్రహ్మ చేసిన నిబంధన యిది. కనక, బాగాఆలోచించి మరీ గర్హించాలి నువ్వెవరినయినా.

మనస్సు నిగ్రహించుకోవా లనుకునేవారు, తమకు ఆత్మానాత్మ వివేకం కలగడానికి సజ్జను లయినవారి యిళ్ళల్లో భోజనం చెయ్యడం — భిక్షం యెత్తుకోడం తప్పుకాదు. లోకంలో అబ్రాహ్మలు — అంటే, బ్రాహ్మణవర్ణంలో పుట్టిన్నీ, చదువూ సంధ్యా లేక తమ బ్రాహ్మణ ధర్మం అవలబించనివారున్నారు. వారుమాత్రం భిక్షంయెత్తుకోగూడదు.

మావృద్ధప్రపితామహుల దగ్గిరనుంచీ కూడా మాపూర్వు లందరూ స్వధర్మం విడిచిపెట్టకుండా యజ్ఞాలూ యాగాలూ చేశారు. నేనూ వారు తొక్కినదారే తొక్కుతాను, మరోవిధంగా చెయ్యను. నేను నాస్తికుణ్ణి కాను. కనక, సంజయా, వొక్కటి చెబుతాను వింటావా? ఈభూలోకంలో దొరికే ద్రవ్యమూ, దేవలోకంలో దొరికేదీ, చివరికి ప్రజాపతిలోకమూ, బ్రహ్మలోకమూ, స్వర్గలోకమూ — వీటిలో యేదిన్నీ కూడా అధర్మంగా వస్తే నాకక్కరలేదు.

ఈకృష్ణుడున్నాడు, చూడూ. ధర్మంవల్ల మంచిఫలం వస్తుం దంటారే, అది యిచ్చేవా డితను. మిక్కిలీ నేర్పుగలవా డితను. నీతి మంతుడు. సూక్ష్మబుద్ధిగలవాడు. బ్రాహ్మణసేవ యెప్పుడూ మానడు. ఈరాజుల నందరినీ నడిపేవా డితనే. నేను సామోపాయం విడిచిపెట్టినా, యుద్ధమే చెయ్యదలచి స్వధర్మం విడిచిపెట్టినా, నువ్వే కాదు, ఎవరయినా నన్ను నిందించవచ్చు. ఏవిషయం అయినా, నిర్ణ యించతగినవా డీకృష్ణుడు. ఇతను, కౌరవులకూ కావలసినవాడే, మాకూ కావలసినవాడే, మాఉభయులశ్రేయస్సూ సాధించతగ్గవాడే యితను.

ఈసాత్యకీ యీచేదిరాజులూ, ఈఅంధకరాజులూ, ఈవార్ష్ణే యులూ, ఈభోజులూ, ఈకుకురులూ, ఈసృంజయులూ ఈకృష్ణుని మాటమీదే నడుచుకుంటూ శత్రువులను సంహరించి మిత్రుల నానంద పెడుతున్నారు. ఉగ్రసేనుడూ, తక్కిన వృష్ణ్యంధకులూ ఇంద్రునకు సాటిఅయినవారు మానవంతులు. సత్యంతప్పనివారున్నూ. బల

పరాక్రమాలలో వారికి సాటి మరి లేరు. వారికిన్నీ అందరికీ కృష్ణుని మాటే వేదవాక్యం. ఆవంతా కూడా వారది జవదాటరు. తత్ఫలితంగా, వారందరూ సకలసంపదలూ గడించుకుని సర్వభోగాలూ అనుభవిస్తున్నారు. బభ్రుడికిన్నీ ఈకృష్ణునిమాటే మాట. గ్రీష్మరుతువు గడిచిపోగానే చక్కగా వానలు కురిసి మేఘుడు ప్రజలను సుఖపెడతాడు. కృష్ణుడున్నూ అచ్చంగా అంతే. ఏపని యెప్పు డెలా చెయ్యాలో యితనికి తెలిసినట్టు మరెవరికీ తెలియదు. మిక్కిలీ సాధువితను. మేమంటే యితని కెంతో ప్రీతి, కనక, మేమితని మాటమీద నడుచుకుంటాము"

# 29

## సంజయరాయబారం 9

వెంటనే కృష్ణు డందుకున్నాడు.

"సంజయా, పాండుపుత్రులు దీర్ఘాయుష్మంతులు కావాలి. సమస్త భోగభాగ్యాలూ అనుభవించాలి. సంతోషంగా వుండాలి. ఇదీ నాకోరిక. అక్కడ ధృతరాష్ట్రుడున్నూ తన కొడుకు లందరితోనూ సుఖంగా వుండాలి, ఇదీ నాకోరికే. ఇక్కడ పాండవులకూ, అక్కడ కౌరవులకూ గూడా యెప్పుడూ శాంతంగా వుండమనే నావుపదేశం.

అయితే, ఈధర్మనందనుడు, కౌరవులయెడల ఎవరూ చూపించలేనంత శాంతం చూపించాడు; కాని ధృతరాష్ట్రుడు రాజ్యవ్యామోహంతోనే వున్నాడు. అతని కొడుకులసంగతి నేను చెప్పనక్కరలేదు గదా? కలహామే కాని శాంతం యెక్కడ రుచిస్తుం దయ్యా వారికి?

నేను ధర్మం తప్పినడుచుకోడం నువ్వెరుగుదువా? పోనీ, పాండుపుత్రులున్నూ ధర్మం తప్పడం నువ్వెప్పు డయినా చూశావా? వారు ధర్మం చెడకుండా కుటుంబసంప్రదాయం అనుసరించి నడుచుకుంటు

న్నారు. బ్రాహ్మ లెలా చెబితే అలా నడుచుకుంటున్నారు. మరి, వారు ధర్మం తప్పా రన్నావే, యేమి చూసి అన్నావయ్యా నువ్వా మాట ?

ఇక్కడ కర్మ చేస్తేనే పరలోకంలో మోక్షం సిద్ధిస్తుందంటారు కొందరు. "కాదు కాదు, కర్మ చెయ్యనక్కరలేదు, జ్ఞానం వుంటే చాలు, మోక్షం దొరుకుతుం దంటారు మరికొందరు. భక్ష్యాలూ భోజ్యాలూ తినకుండా యెవరికయినా ఆకలి తీరుతుందా యెప్పుడయినా ?

బ్రాహ్మలు ఎంత విద్వాంసు లయినా తమకు విహితమైన కర్మ చేసేతీరాలిగదా ?

జ్ఞానం అగత్యమే. అయితే, ఎవడికి తగ్గ కర్మ వాడు చేసేటట్టుగా వుండా లది, అప్పుడే దానికి ఫలం కలుగుతుంది. కర్మచెయ్యడం అంటే కూడా విశేషం వుంది. అది చేస్తే ఈలోకంలోనూ పరలోకం లోనూ ఫలం కనపడాలి దానికి.

మంచినీళ్లు పుచ్చుకుంటేనే దప్పిక తీరుతుం దెవరి కయినా, నువ్వెరగందా యిది ? కర్మచేస్తేనే నడుస్తుం దిదంతా. పరలోకానికి వెళ్లినా యీకర్మే వెంటబడుతుంది. "పరలోకం కావా లంటే కర్మకాదు. మరేదో దానికి మంచి వుపాయం వుం" దని యెవ డయినా అంటే అది పిచ్చిమాట.

పరలోకంలో దేవత లందరూ మహోజ్జ్వలంగా వున్నారు. గాలి చక్కగా వీస్తోంది. రాత్రీ పగలూ కలిపిస్తూ సూర్యుడూ, నెలలూ, పక్షాలూ, నక్షత్రాలూ కల్పిస్తూ చంద్రుడూ నిశ్చలంగా వుద యిస్తున్నారు. ప్రజలకు మేలుకూరుస్తూ అగ్నిదేవుడు తన దహాన స్వభావం వెల్లడించుకుంటున్నాడు. భూదేవి యీభారం అంతా నిశ్చ లంగా భరిస్తోంది. ప్రాణికోటికి ఆప్యాయనం చేస్తూ నదులు అతి వడిగా ప్రవహిస్తున్నాయి. దిక్కులూ ఆకాశమూ ప్రతిధ్వనింపచేస్తూ పర్జన్యుడు చక్కగా వర్షిస్తున్నాడు. తానందరికంటే మిక్కిలీ శ్రేష్ఠు

డయి వుండడానికి ఇంద్రుడు నిశ్చలంగా బ్రహ్మచర్యం నడుపుకుంటున్నాడు. అందుకోసం అతను సుఖాలన్నీ వదులుకున్నాడు. ప్రీతివిడిచి పెట్టేశాడు. అప్రమత్తుడై సత్యమూ ధర్మమూ పాలిస్తూ, దమమూ, ఓర్పూ, సమభావమూ కనబరుచుకుంటూ దేవరాజ్యం పాలించుకుంటున్నా డతను నిశ్చలంగా. బృహస్పతి కూడా యథాశాస్త్రంగా బ్రహ్మచర్యం నడుపుకుంటున్నాడు. ముందతను మనస్సు నిగ్రహించుకున్నాడు. సుఖాలు వదులుకున్నాడు. ఇంద్రియా లన్నీ స్వాధీనం చేసుకున్నాడు. దీంతో అతను దేవతలకు గురువు కాగలిగాడు.

ఇదంతా వారికి కర్మయోగం అవలంబించడంవల్ల సిద్ధించింది. అంటే, తమతమ విహితకర్మలు చెయ్యడంవల్లనే వీరంతా ఇలాంటి పనులు చెయ్యగలుగుతున్నారు. నక్షత్రాలూ, రుద్రులూ ఆదిత్యులూ, వసువులూ, విశ్వేదేవతలూ, యముడూ, కుబేరుడూ, గంధర్వులూ, యక్షులూ, అప్సరసలూ, కూడా యీకర్మయోగంవల్లనే యీమంచి స్థితి సంపాదించుకున్నారు. మహర్షులు కూడా బ్రహ్మవిద్యలు నేర్చుకుని, బ్రహ్మచర్యం నడుపుకుంటూ ఘనత సంపాదించుకున్నారు. ఇదంతా కర్మయోగం ఘనత, ఇదంతా నువ్వెరుగుదువు. మరి, కౌరవులకోసం ఈపాండుపుత్రులను కర్మయోగం అవలంబించవద్దని యెందుకూ ఇలా నిరోధిస్తావూ?

ఈధర్మనందనుడు వేదవేదాంగా లన్నీ తెలిసినవాడు. అశ్వమేధ మన్నా రాజసూయ మన్నా యితని కెంతో శ్రద్ధ. విలుకాళ్లలో యింతటివాడు లేడు. వీరు కౌరవులను చంపకుండానే తమ ధర్మం తామనుసరించుకోగలిగేటట్టయితే, భీమసేనుడు హింసకు పూనుకోవలసిన అగత్యమే వుండదు. వీరు పుణ్యకార్యాలతోనే కాలమున్నాగడుపుకుంటూ వుండవచ్చు. పితృపితామహ క్రమంగా వచ్చిన ధర్మం

నెరవేర్చుకుంటూ, ఏకారణంవల్లనైనా వీరందులో మరణించడమే తటస్థపడితే అది వీరికి గొప్ప కీర్తీ, నిశ్చలమైన ఆనందమూ కలిగిస్తుంది.

సంజయా, మాట్లాడితే "శాంతి, శాంతి" అంటావే నువ్వు, అశాంతి, రాజులకు, యుద్ధం చెయ్యడంలో వుందో చెయ్యకపోడంలోనే వుందో చెప్పవోయ్! నాలుగువర్ణాల విభాగం యేమిటో, అది యెందుకో ముందు నువ్వు బాగా తెలుసుకో. ఆనాలుగువర్ణాలవారికీ ఏర్పడ్డ విధు లేమిటో గుర్తించుకో. మరి, యీపాండవు లిప్పుడేమి చెయ్యా లని చూస్తున్నారో అది పరకాయించుకో, అప్పుడు, వీరిని, నిందించవలసివుంటే నిందించు, కొనియాడవలసివుంటే కొనియాడు, కాదనను.

బ్రాహ్మణుడైనవాడు తాను వేదవేదాంగాలు చదువుకోవాలి, శిష్యులకు చెప్పాలి. తాను స్వయంగా యజ్ఞాలు చెయ్యాలి, యితరులచేత చేయించాలి. తాను దానాలు చెయ్యాలి, తన కెవరు లిస్తే పుచ్చుకోవాలి. క్షత్రియుడైనవాడు వేదవేదాంగా లన్నీ చదువుకోవాలి; గాని తానవి యితరులకు చెప్పగూడదు. యజ్ఞాలు చెయ్యాలి; గాని యితరులచేత చేయించగూడదు. తాను దానాలూ ధర్మాలూ చెయ్యాలి; గాని యితరు లిస్తే పుచ్చుకోగూడదు. తన పెళ్ళాం బిడ్డలతో సుఖంగా వుంటూ అప్రమత్తుడై ప్రజలను కాపాడాలి. ఇలా నడుచుకునే క్షత్రియుడు గొప్పపుణ్యం చేసుకున్నవా డవుతాడు. బ్రహ్మలోకమున్నా అతనికి సిద్ధిస్తుంది.

వైశ్యుడు వేదాలూ వేదాంగాలూ చదువుకోవాలి; గాని యితరులకు చెప్పగూడదు. వ్యవసాయమూ, గోసంరక్షణమూ, వర్తకమూ, చేస్తూ డబ్బు గడించుకోవాలి, పరాకులేకుండా అది భద్రపరుచుకోవాలి. బ్రాహ్మల ప్రీతీ, క్షత్రియుల దయా సంపాదించుకోవాలి. దానధర్మాలుచేస్తూ గృహస్థధర్మం పాలించుకోవాలి. ఇక శూద్రుని సంగతి.

అతను వేదాలు చదువుకోగూడదు. యజ్ఞాలు చెయ్యగూడదు. బ్రాహ్మణులకూ క్షత్రియులకూ సేవ చెయ్యాలి. శ్రద్ధగా సంపదలు సంపాదించుకోవాలి.

రాజయినవాడు పరాకులేకుండా యిదంతా పరకాయించుకుంటూ వుండాలి. ఎవరి ధర్మాలు వారు నిర్వర్తించుకునేటట్టు చూడాలి. తాను నిష్కామంగా వుండాలి. అన్నివర్ణాలవారియెడలా, అన్ని కులాలవారియెడలా సమదృష్టితో వుండాలి. ఎప్పుడూ కామపరతంత్రుడయి వుండగూడదు. సర్వధర్మాలూ తెలిసినవారూ, ధర్మం ప్రకారం నడుచుకునేవారూ కనపడితే, వారిని చూసి వారివల్ల తెలుసుకుని వారిలా ధర్మంగా నడుచుకోమని ప్రజలకు చెప్పాలి. తానుగూడా వారి నాశ్రయించి విశేషాలు తెలుసుకుంటూ వుండాలి. వారియెడల తానెప్పుడూ భయభక్తులు కనబరచాలి, వారి కెప్పుడూ, యేవిధంగానూ చెరుపుచెయ్యగూడదు. కీడు తలపెట్టనే గూడదు.

ఇలా కాకుండా, బలం కూర్చుకుని యితరుల సంపదలు హరించాలని రాజెప్పు డనుకుంటాడో అప్పుడే యుద్ధం అగత్యం అవుతుంది. ఇందుకోసమే కవచాలూ, అస్త్రశస్త్రాలూ, ధనుస్సులూ పుట్టాయి. వెనకటికి దస్యులను సంహరించడానికి ఇంద్రుడే యివన్నీ సిద్ధంచేయించాడు. అంటే, ఆయుధాలతో దుష్టులను సంహరిస్తే పాపం చుట్టుకోదు. విశేషించి పుణ్యమే వస్తుంది, కావలసినంత.

ఇప్పుడు కౌరవు లీతప్పు చేస్తున్నారు. వారికి జ్ఞానం లేదు. ధర్మం అక్కరలేదు. అంచేతనే వారిది దీక్షగా చేస్తున్నారు. ఇది మంచిది కాదు. కొడుకులు మాత్రమే కాదు, ధృతరాష్ట్రుడున్నూ చేస్తున్నాడీపని. కాకపోతే, పిత్రార్జితం అయిన పాండుపుత్రుల సంపద వారెందుకు హరించారో చెప్పు, చూతాం. ఇది రాజధర్మమేనా? ధృత

రాష్ట్రుడూ అతని కొడుకులున్నే కాదు, కౌరవులందరూ చేస్తున్నా రిది నీకు తెలియందిటయ్యా ?

దొంగ అయినవాడు పరుల సొత్తు దోచుకుంటాడు. ఆదోచుకోడంలో — కన్నంవేసి తానెవరికంటా పడకుండా దోచుకున్నా వొకటే, యెదటబడి కొట్టి దోచుకున్నా వొకటే, దొంగతనమే అది. అది గర్హించతగ్గదే. మరి, యిప్పుడు, ఆదొంగకీ, ధృతరాష్ట్రుని కొడుకులకూ భేదం యేమిటి ?

దుర్యోధనుడు దీర్ఘక్రోధం గలవాడు. దాంతో, అతను మంచి చెడ్డలు గుర్తించుకోడంలేదు. స్వార్థం తప్ప మరేమీ యెరగ డతను. వల్లమాలిన లోభం అతనికి. దానా దీనా మంచివన్నీ తనకే వుండా లంటాడు. పైపెచ్చు, — అది ధర్మమనీ — అదే ధర్మ మనీ అనుకుంటాడు. ఈకారణంవల్లనే పాండవుల రాజ్యం వేసుకున్నా డతను. కనక, మాది మేమనుభవించా లంటే యుద్ధం తప్పదు. యుద్ధంలో చచ్చిపోతామూ, అదీ మాకొక గౌరవమే. పిత్రార్జిత మైన రాజ్యం పరరాజ్యంకంటే మంచిది. అటు మత్తైక్కి, యిటు మృత్యుపాశ బద్ధులై దుర్యోధనునికి సాయంచెయ్యడానికి వచ్చారు చూడూ, ఆరాజు లందరూ వినేటట్టు ఇదంతా కౌరవరాజసభలో స్పష్టంగా చెప్పవయ్యా !

సంజయా, ఆవేళ, సభలో, కౌరవులు చేసిం దెంతపాపప్పనో గుర్తించావా ? ద్రౌపది సామాన్యురాలా ? గొప్ప యశస్విని ఆమె. మంచి శీలమూ, మంచి నడవడీనీ ఆమెవి. పైపెచ్చు, పాండవుల ప్రియభార్య ఆమె. అలాంటి ఉత్తమురాయిల్లాలిని కాముతురు డైన దుర్యోధను డలా భంగపెడుతూవుంటే భీష్ముడూ తక్కిన కౌరవ వృద్ధులూ చూస్తూ వూరుకున్నారు కాదూ ? అలాకాక, వారందరూ అప్పు డాదుర్మార్గుల నడ్డుపెట్టివుంటే నాకు ప్రియమూ, ధృతరాష్ట్రుడి కొడుకులకు క్షేమమూ కలిగించినవా రయివుందురుకదా ?

దుశ్శాసనుడున్నూ, ఆ వేళ, అ త్తింటి ఆత్మీయులతో నిండివున్న ఆసభకు అక్రమంగా లాక్కువచ్చాడు ద్రౌపదిని. అందరు రాజు లున్నా రక్కడ, వొక్క డయినా యిది తగ దనగలిగారా? ఒక్క విదురుడేగదా ఆబుద్ధిహీనుణ్ణి మందలించా డావేళ. నువ్వు మాత్రం వొరగవ్వా అది? అది మంచిది కా దని చెప్పగలిగావా నువ్వప్పుడు? అప్పు డామె తన్ను తాను రక్షించుకోడమే కాదు, మహాసముద్రంలో మునిగిపోడానికి సిద్ధంగా వున్న వోడన ధరించినట్టు పాండుపుత్రులనున్నూ రక్షించగలిగింది.

అంతటితో కుదిరిందా అప్పుడు? కౌరవుల ఆనిండుసభలో సూత పుత్రుడు కర్ణు డేమన్నా డామెని? "ద్రౌపదీ! నీభ ర్త లందరూ వోడిపోయారు. కనక, దుర్యోధనమహారాజు అంతఃపురంలో దాసివై పడివుండి మరోభ ర్తని చూసుకో" అని కదూ? అది అర్జునునిగుండెలు నాటుకుంది తెలునా! సహజంగా అతను బీభత్సుడు. యుద్ధ పొసగిం దంటే నానాబీభత్సమూచేసిపారేస్తా డందర్నీ. మాటరూపంగా కర్ణుడు విడిచిన ఆబాణం అలాంటి అర్జునుని కూడా మిక్కిలీ ఆవేదన కలిగిస్తోంది. నిజంగా ఎముకలు కొరికేస్తోం దది.

దుశ్శాశనుడయినా తక్కువచేశాడా అప్పుడు? అంతా వోడిపోయి వీరు కృష్ణాజినాలు కట్టుకునేటప్పుడు "వీరందరూ షండతిలల్లాగ నశించిపోయారు. నరకమే వీరికి రాసిపెట్టిం దిక" అని కాదూ అన్నా డతను? "ధర్మనందనా! నకులుడున్నూ వోడిపాయాడు. ఇక నీభార్య ద్రౌపది మాత్రమే మిగిలివుంది. ఆమెని కూడా వొడ్డవోయ్" అంటూ శకుని అన్న మాటలు మరిచావా? జూదంలో అయితే మాత్రం ఇలా అనవలసిందేనా?

ఇదంతా నువ్వెరుగుదువు. కళ్ళారా చూసేవున్నావు నువ్వు. అయిం దేదో అయింది. ఇక స్వయంగా నే నక్కడికి రావా లని

చూస్తున్నాను. వచ్చి యిదంతా చక్కబెడతాను. పాండుపుత్రుల కేలాంటి నష్టమూ లేకుండా కౌరవులను శాంతింపచెయ్యాలని నాసంకల్పం. ఇది నెరవేర్చగలిగితే నేను ధన్యుణ్ణే. కౌరవులున్నూ మృత్యుపాశం తప్పించుకున్నా రన్నమాటే.

శుక్రనీతి ననుసరించి మాట్లాడతా న్నేను. ధర్మమూ అహింసా — ఇవి పురస్కరించుకుని వుంటుం దది. వారు నామాట వినిపించుకుంటారా ? అసలు, నన్నాదరిస్తారా వారు ? లేకపోతే భీముడూ అర్జునుడూ వుండనే వున్నారులే. నాశనం చేసేస్తారు వారిని క్షణంలో భీమార్జునులు. తాము చేసుకున్న పాపాలన్నీ అప్పుడు తెలుసుకుంటారు కౌరవులు.

జూదం పూర్తి అయాక దుర్యోధనుడు ఈపాండుపుత్రుల నన్న మాటలు విన్నావు కదూ ? మాటల్లో అంత తీక్షణమైన వుంటాయా ? అంత పరుషంగానున్నూ మాట్లాడగలరా యెవరయినా ? కాని, మరిచిపోకు. గద చేతపట్టడం తడువుగా భీమసేనుడు సిద్ధంగా వున్నాడు. అవన్నీ ఆసమయాన అతనే జ్ఞాపకం చేస్తాడు, తొందర అక్కర్లేదు.

ఇంతకీ, — దుర్యోధనుని స్వరూప మేమిటో నీకు తెలుసా ? ఒక పెద్దచెట్టది. దాని సారం అంతా క్రోధం. కర్ణుడే దాని మాను. శకునే కొమ్మ. దుశ్శాసనుడు పువ్వులూ పళ్ళూను. మూఢుడైన ధృతరాష్ట్రుడు దాని మొదలు. ఇటు చూశావా ? ధర్మనందనుడున్నూ దుర్యోధనుని లాగ వొక పెద్దచెట్టే. కాని అది క్రోధమయం అయితే యిది ధర్మమయం. దీనిమాను నర్జునుడు. కొమ్మ భీముడు. నకులుడూ సహదేవుడూ పువ్వులూ పళ్లూను. ఇక మొద లేమిటంటావా ? అదినేనే. నేనొక్కణ్ణే కాదు, ఇటు వేదాలూ బ్రాహ్మలూ కూడా దాని మొదలు.

అయితే, సంజయా, ఉన్నదున్నట్లు చెబుతా విను. కొడుకు లందరితోనూ కలిసి ధృతరాష్ట్రు డొక మహారణ్యం అనుకో. పాండు

పుత్రు లా అడవిలో వుండే పులులు. పులులుంటే అడవిలో యెవరూ ప్రవేశించలేరు. అది నరికెయ్యడం అంటూ వుండనే వుండదు. అరణ్యంలో వున్న పులులనూ యెవరూ చంపలేరు. పుల్లేని అడవి నశించిపోతుంది. అలాగే అరణ్యం లేకపోతే పులులూ దెబ్బతింటాయి. కనక, అడవి పులులనూ పులు లడవినీ కాపాడుకుంటూ వుండాలి. ఇంకొకటి కూడా చెబుతా విను. దుర్యోధనాదులు తీగ లనుకో. పాండు పుత్రులు చెట్లనుకో, చెట్లను ఆశ్రయించుకుని వుంటే తీగలకు భద్రం.

ఇక తుదిమాట. ఈపాండుపుత్రులు, ధృతరాష్ట్రుణ్ణి సేవించుకోడానికీ సిద్ధంగా వున్నారు. వీలుతప్పితే, సమూలంగా పెల్లగించివెయ్యడానికీ సిద్ధంగా వున్నారు. కనక, ధృతరాష్ట్రు డేది కావా లంటే అందుకే సిద్ధంగా వుండవచ్చు. పాండుపుత్రులు మహానుభావులు, ధర్మం తప్పి యెరగనివారు. ఇప్పటివరకూ వీరు ఓర్పువహించేవున్నారు, సందేహం లేదు; కాని వీరెందుకయినా సమర్థులు. ఇది తెలుసుకుని మరీ మాట్లాడు అక్కడ "

## 30

### స మ్మో హ న ం

"కృష్ణా, మరి, నాకు సెలవు దయచెయ్యి" అంటూ అందుకున్నాడు సంజయుడు.

"ధర్మనందనా, నీకు శుభం కావాలి. మరి నేను వెడతాను. తొందరలో నేనేమయినా తప్పుమాట లనివుంటే నన్ను క్షమించు. భీమసేనుణ్ణీ, అర్జునుణ్ణీ, నకులసహదేవులనూ, సాత్యకినీ, చేకితానుణ్ణీ కూడా నేను సెలవిమ్మని కోరుతున్నాను. మీకందరికీ సకలశుభాలూ కలగాలి. నామీద దయవుంచండి" అనిన్నీ అన్నాడంవరితోనూ అతను.

"చాలా సంతోషం. సంజయా, వెళ్ళిరా" అని బదులు చెప్పి ధర్మరాజు అందుకున్నాడు.

"మేమేమయినా పొరపాట్లు చేసివుంటే అవి మరచిపో. నువ్వు మమ్మల్నెరుగుదువు. మేమున్నూ అందరమూ నిన్ను బాగా యెరుగుదుము. కల్మషం లేనివాడవు నువ్వు. అటు కౌరవులకూ, ఇటు మాకూ గూడా కావలసినవాడవే నువ్వు.

సంజయా, నువ్విప్పుడు దూతగానే వచ్చావనుకో, కాని మాకెప్పుడూ ఆప్తుడవేనువ్వు. మేమంటే చాలా యిష్టం నీకు. మంచిశీలం నీది. తృప్తిగలవాడవు నువ్వు. మంచిమాటలే ఆడతావెప్పుడూ. ఎప్పుడూ పొరపాటు చెయ్యవు. ఎంత పరుషంగా మాట్లాడినా నువ్వు కోపగించుకోవు. ఎప్పుడూ ఎవరికీ గూడా మర్మాలు దూసుకుపోయేటట్టు మాట్లాడవు. పరుషంగానూ మాటాడవు. నీమాట ధర్మసమ్మతంగా వుంటుంది. గంభీరంగా వుంటుంది. మనసు నొప్పించని మాట నీది. ఇది మాకు బాగా తెలుసు.

నువ్విక్కడికి దూతగా రావడం మాకెంతో యిష్టంగా వుంది. నీలాగ ఇక్కడికి రాదగిన రెండోమనిషి విదురు డొక్కడే, మరి, మూడోవాడు లేడు. మునుపు మేము తరుచు నిన్ను చూస్తూవుండే వాళ్ళం. అర్జునుడికి నువ్వు ప్రాణస్నేహితుడవు.

సంజయా, నువ్వు వెళ్ళగానే అక్కడి బ్రాహ్మల నందరినీ సందర్శించి నానమస్కారాలు మనవిచేసి, తరవాత వారి క్షేమం అడిగానని చెప్పు. విశుద్ధవీర్యులు వారు. బ్రహ్మచర్యం నడుపుకుంటూ వేదవేదాంగాలు నేర్చుకున్నవారు వారు. మంచికుటుంబాల్లో పుట్టినవారు. ధర్మాలన్నీ తెలుసుకుని అలా నడుచుకుంటున్నవారు. ఎల్లప్పుడూ పఠనపాఠనాలతోనే వారికి కాలక్షేపం. వారేకాక, యతులున్నారు. తపశ్శాలు లున్నారు. వారికిన్నీ నానమస్కారాలు మనవిచేసి వారి క్షేమం అడిగానని చెప్పు. ధృతరాష్ట్రుని పురో

హింతు డున్నాడు. గురువు లున్నారు. ఋత్విక్కు లున్నారు. వారి కిన్నీ నానమస్కారాలు నివేదించి క్షేమం అడిగా నని చెప్పు.

మేమంటే చాలా అభిమానించుకుంటూ, మమ్మ ల్నెప్పుడూ తలుచుకుంటూనూ వుండే అశ్రోత్రియు లున్నా రక్కడ చాలామంది. శూద్రాదుల్లో వారు బహూ ఉత్తములు. మిక్కిలీ మానధనులు. నుంచి నడవడి కలవారు. గొప్ప బలపరాక్రమాలు వారివి. యథా శక్తిగా ధర్మమార్గంలోనే నడుచుకుంటూ వుంటారు వారు. మా క్షేమం వారికి చెప్పి, వారి క్షేమమూ, ఆరోగ్యమూ నేనడిగా నని చెప్పు. లౌక్యవ్యవహారాలతో కాలక్షేపంచేసేవారూ, వర్తక వాణిజ్యాలతో కాలక్షేపంచేసేవారూ కూడా చాలామంది వున్నారు. వారి కిన్నీ మా క్షేమం చెప్పి, నేను వారి కుశలం అడిగా నని చెప్పు.

మాగురుదేవుడు ద్రోణాచార్యు డున్నాడు. మేమంటే యెంతో అభిమానం అతనికి. నీతిశాస్త్రం బాగా తెలిసినవా డతను. మిక్కిలీ ప్రసన్నంగా వుంటా డెప్పుడూ. బ్రహ్మచర్యం పాలించుకుంటూ వేద వేదాంగాలు నేర్చినవా డతను. మాకు చతుష్పాత్తుగా — అంటే, మంత్ర — ఉపచార — ప్రయోగ — ఉపసంహారాలతో ధనుర్వేదం అంతా నూరిపోసినవా డతను. అతనికి నాపాదాభివందనాలు నివేదించి నేనడిగా నని అతని క్షేమం అడుగు. అతని కొడు కున్నా డశ్వత్థామ. బ్రహ్మచర్యవ్రతం తప్పకుండా వేదాలూ, ఇంకా అనేకవిద్యలూ నేర్చినవా డతను. చతుష్పాత్తుగా ధనుర్వేదమున్నూ బాగా నేర్చిన వాడు. మిక్కిలీ గొప్ప వేగం అతనిది. బహూ చక్కనివాడు. గాన విద్యలో అంతటివాడు మరి లేడు. అతని క్షేమమున్నూ అడిగానని చెప్పు.

కృపాచార్యు డున్నాడు చూడూ, స్వయంగా నువ్వతని ఇంటికి వెళ్ళు. మాసంగతు లన్నీ చెబుతూ, మాకుగా నువ్వతని పాదాలు కళ్ళకద్దుకో. మహారథు డతను. ఆత్మవేత్తలలో మిక్కిలీ గొప్పవాడు,

మా తాత వున్నాడు. శౌర్యం అనేది అతని దగ్గిరే కనపడుతుం దెవరి కయినా. కుత్సితం అనేది యెరగనే యెరగ డతను. మహాతపశ్శాలి. ప్రజ్ఞలో అతనికి సాటిరాగలవాడు పృథివిమీద లేడు. మచ్చలేని శీలం అతనిది. అంతటి విద్యావంతుడు కూడా మరి లేడు. బాహుబలమూ, ధైర్యసాహసాలూ చెప్పవలసివస్తే అతణ్ణే చెప్పాలి. కౌరవుల కందరికీ తలమానికం అతను. పాదాలు పట్టుకుని నన్నతనికి జ్ఞాపకంచెయ్యి.

మా పెత్తండ్రికిన్నీ నమస్కరించి నా క్షేమం మనవిచెయ్యి. కానయితే అంధుడే; కాని గొప్పపండితుడు. చాలాచాలా తెలిసిన వాడు. మిక్కిలీ సూక్ష్మబుద్ధి అతనిది. పెద్దలంటే చాలా భక్తి. కౌరవసార్వభౌము డతను. పనిలో పని దుర్యోధనునితోగూడా చెప్పు నేను క్షేమం అడిగా నని. రాజు పెద్దవాడు కతను; కాని మిక్కిలీ మందుడు. పైగా, మూర్ఖుడు. రహస్యంగా అపకారాలు చెయ్య డంలో చాలా దిట్ట. పాపాత్ముడు. ఇవాళ భూమండలం అంతా అతనే యేలుతున్నాడు. అతని తమ్ముడే దుశ్శాసనుడు. దుర్గుణాలలో ఆఅన్నకి తమ్ముడు, అయినా మంచి విలుకాడు. కౌరవులలో చెప్పుకో తగ్గ శూరుడు. అతనితో గూడా నేను క్షేమం అడిగా నని చెప్పు.

బాహ్లికుడు సహజంగా మిక్కిలీ శాంతుడు. భరతకులాని కంతకీ యిప్పుడు శాంతే ప్రధానం అని చెప్పేవా డత నొక్కడే. మంచి పండితుడు. నాకు బదులుగా నువ్వతనికి నమస్కారం చెయ్యి. సోమ దత్తుడు మంచి గుణవంతుడు. గొప్ప విజ్ఞాని. చాలా ప్రసన్నుడు. స్నేహం వున్నచోట యెంతటి కోపం వచ్చినా నిగ్రహించుకుంటా డతను. నాకు మిక్కిలీ పూజ్యుడు. అతనికి నానమస్కారాలు మనవి చేసి క్షేమం అడుగు. సౌమదత్తి కూడా చాలా మంచివాడు. కౌరవుల కందరికీ అతనంటే యెంతోగౌరవం. మాకు సోదరుని వంటివా డతను. విశేషించి నాకు చెలికాడు. గొప్పవిలుకాడు.

రథికుల్లోనూ చెప్పుకోతగ్గవాడు. అతణ్ణీ, అతని మంత్రులనూ కూడా కలుసుకుని నేను క్షేమం అడిగానని చెప్పు.

ఎందరో కౌరవప్రముఖు లున్నారు. వారు, మాకు, పుత్రులూ, పౌత్రులూ, భ్రాతలూ అవుతారు. వారిలో వొక్కొక్క డొక్కొక్క విశేషం గలవాడు. వారిలో ఎవరెవ రెలాంటి ఆదరానికి తగుదురో అలాంటి ఆదరంతోనే నాపేరుచెప్పి వారి కుశలం అడుగు. దుర్యోధనుడు, ఎందరో రాజులను తనకి సాయం తెచ్చుకున్నాడు. వారిలో వశాతు లున్నారు. సాల్వు లున్నారు. కేకయు లున్నారు. అంబష్ఠులూ, త్రిగర్తులూ వున్నారు. ప్రాచ్యులూ, దాక్షిణాత్యులూ, పాశ్చాత్యులూ, ఔత్తరాహులూ అయిన రాజులున్నూ యెందరో వున్నారు. వారందరూ సజ్జనులు. మంచిశీలం గలవారు. బలపరాక్రవంతుల్లో చెప్పుకోతగ్గవారు. వారిలో రథికు లున్నారు. అశ్వికు లున్నారు. గజయోధు లున్నారు. పదాతు లున్నారు. వారిని కూడా నా పేరు చెప్పి అందరినీ క్షేమం అడుగు.

ఆర్థికవ్యవహారాలు చూసే అమాత్యు లున్నారు. ద్వారపాలకు లున్నారు. సేనానాయకులున్నారు. ఆయమూ వ్యయమూ తేల్చే లెక్కగా ళ్లున్నారు. ముందువెనకలు బాగా పరిశీలించేవారున్నారు. వారిని కూడా క్షేమం అడుగు.

సంజయా, వైశ్యాపుత్రు డైన యుయుత్సుణ్ణి మరిచిపోకేం? కౌరవు లందరిలోనూ మిక్కిలీ ఉత్తము డతను. గొప్ప తెలివితేట లతనివి. ప్రజ్ఞకూడా సామాన్యం కా దతనిది. సకలధర్మాలూ తెలిసినవాడూ, అలా నడుచుకునేవాడూనూ అతను. యుద్ధం అంటే బొత్తిగా యిష్టంలేదతనికి. అతని క్షేమం అడగాలి సుమా. చిత్రసేనుణ్ణి కూడా నువ్వుమరిచిపోవద్దు. నికర్తనం, దేవనం, మతాక్షం అనే ద్యూతప్రక్రియల్లో మిక్కిలీ సమర్థు డతను. ఘాలాక్షుని కయినా

తెలియకుండా మోసం చెయ్యడంలో అంతటివాడు లేడు. యుద్ధ విద్యలోనూ సమర్థుడు. అతణ్ణి గూడా క్షేమం అడుగు.

గాంధారరాజున్నాడు శకుని. పార్వతీయుడతను. జూదంలో అంత మోసకాడు పృథివిమీద మరొకడు లేడు. దుర్యోధనుడు మహామాని, నిజమే. అందు కతని దోహదం చాలా యెక్కువ. అబద్ధాలకు వెరవడు. అతణ్ణి కూడా క్షేమం అడిగానని చెప్పు. కర్ణుణ్ణి కూడా నాపేరుగా కుశలం అడుగు సుమా. మేమసాధ్యుల మనే అంటాడతను; కాని తానొక్కడే మమ్మ ల్లోడించేస్తానంటాడు. దుర్యోధనుణ్ణి నమ్మిస్తున్నావాడతనే. నిజాని కతనూ సమర్థుడేలే, చెప్పకేం?

విదురుడు మహానుభావుడు. అగాధం అతని బుద్ధి. అంతటి దూరపుచూపు గలవాడు మరొకడు లేడు. అతను మాకు భక్తుడూ గురువూను. ప్రభువూ మిత్రుడూను. అతనే తల్లీ అతనే తండ్రీనీ. మంత్రికూడా మాకతనే. అతణ్ణి కూడా క్షేమం అడుగు. వృద్ధస్త్రీలున్నా రెందరో అక్కడ. వారందరూ చాలా మంచివారు. వారందరూ మాకు తల్లులే. వారిని, ఎవరికి వారినే గానూ, అందరినీ కలిపినీ క్షేమం అడుగు. "మీబిడ్డలు కులాసాగా వున్నారా?" అని ముందడిగే, వారి క్షేమం అడుగు తరవాత. మేమంతా యిక్కడ క్షేమంగా వున్నామని చెప్పు వారితో.

రాజభార్య లున్నారు, ధృతరాష్ట్రుని కోడళ్ళెందరో. రాచమర్యాద లన్నీ పూర్తిగా అనుభవిస్తూనే వుంటారు వారు, అభ్యంతరం లేదు. ఏవిధమైన కష్టాలూ వుండవు వారికి. అత్తమామలయెడల భయభక్తులతోనే మసులుకుంటూనూ వుంటారు వారు. భర్తలకున్నూ అనుకూలవతు లయివుంటారు. ముందివన్నీ వివరంగా అడిగి, తరవాతే నేను క్షేమం అడిగానని చెప్పు.

కోడళ్లున్నారు చాలామంది. గొప్పగొప్ప కుటుంబాలకు చెందిన ఆడబిడ్డలు వారు. చాలా మంచివా ళ్ళని పేరు తెచ్చుకున్నారు వారందరూ. "బిడ్డలతో మీరంతా కుశలమా ?" అని నేనడిగా నని చెప్పు వారితో. కౌరవుల ఆడబిడ్డ లున్నా రెందరో. ముందు "మీభ ర్తలయెడల మీరూ, మీయెడల మీభ ర్తలూ అను కూలంగా వుంటున్నారా ?" అనడిగి, తరవాతే నేను క్షేమం అడిగా నని చెప్పు వారితో కూడా.

వారకాంత లున్నా రక్కడ చాలా నుంది. వాళ్లందరూ చక్కని చుక్కలు. చూడ్డానికీ మాట్లాడ్డానికీ గూడా సులభ మైనవాళ్ళు వాళ్ళందరూ. మంచిమంచి బట్టలు కట్టుకుని చక్కగా అలంకరించు కుని వుంటా రెప్పుడూ. మోసా లెరగరు. వాళ్ళని కూడా నేను క్షేమం అడిగా నని చెప్పు. దాసదాసీజనం వుందక్కడ లెక్కా- పత్రమూ లేకుండా. వాళ్ళని ఆశ్రయించుకున్న వాళ్ళూ వున్నా రెందరో. అంతఃపురాల్లో పనిచేసే కుబ్జ లున్నా రెందరో. వాళ్ళ కందరికీ మేమిక్కడ కుశలంగా వున్నా మని చెప్పు. "మీవృత్తులూ మడిమాన్యాలూ యథాప్రకారం సాగుతున్నాయా ? దుర్యోధనుడు మీభాగ్యభోగ్యాల కాటంకం రాకుండా చూస్తున్నాడా ?" అని నేనడిగా నని చెప్పి, వాళ్ళ కుశలం కూడా అడుగు.

అంధులూ, కుంటివాళ్ళూ ఇంకా అనేకరకాల అశ క్తులూ వున్నా రక్కడ, వేలు. అందరినీ రాజు పోషి స్తున్నాడు. "మీరు చాలా కష్టా లనుభవి స్తున్నారు. పూర్వజన్మల్లో మీరుచేసుకున్న పాపాలవల్ల మీకిప్పుడు డివి తటస్థించాయి. నేను శత్రువుల నందరినీ సంహరించి వచ్చి, మిత్రుల నందరినీ ఆనందపెడుతూ, మిమ్మల్ని కూడా పుష్క- లంగా అన్నవస్త్రా లిచ్చి ఆదరిస్తాను భయపడకండి" అని ముందు ధైర్యం కలిగించి, తరవాత వాళ్ళని కూడా క్షేమం అడుగు.

ఇదివరలో నేనెందరికో బ్రాహ్మల కెన్నో వృత్తులూ, మాన్యాలూ యిచ్చివున్నాను. ఇకముందున్నూ యిస్తాను, ఇస్తూనే వుంటాను. నా సంగతి వారికి దూతల ముఖాన వర్తమానం చెయ్యమని నామాటలుగా దుర్యోధనునితో చెప్పు. నేను క్షేమం అడిగా ననిన్నీ వారితో చెప్పు.

ఎక్కడెక్కణ్ణుంచో వచ్చిన రాయబారు లున్నా రక్కడ యెందరో. వారికి ముందు నాక్షేమం చెప్పి తరవాత వారిక్షేమం అడిగా నను. దుర్యోధను డెందరో యోధులను కూర్చుకుని వున్నాడు. వారందరూ చాలా సమర్థులు, సందేహం లేదు. అయితే, ధర్మం నిత్యం, శాశ్వతం, అది నశించేదికాదు. శత్రువులను సంహరించడానికి నాకా ధర్మమే సాయం. కనక, దుర్యోధనుడి కీమాట చెప్పు. నేనన్నా నని చెప్పు. "ఓయీ, వాటా అన్నది లేకుండా, యీ కురు రాజ్యం అంతా నువ్వొక్కడవే యేలుకుందా మనుకుంటున్నావు; కాని సాగ దది, నేను సాగనివ్వను. ఇస్తావా, మాకింద్రప్రస్థం యిచ్చెయ్యి. లేదూ, యుద్ధానికి సిద్ధంగా వుండు.

# 31

## "ఇదం బ్రాహ్మ మిదం క్షాత్రమ్"

మళ్ళీ ప్రారంభించాడు ధర్మరాజు వెంటనే.

"సంజయూ, మంచివాడూ చెడ్డవాడూ — చిన్నవాడూ ముసలి వాడూ, బలవంతుడూ బలహీనుడూ — వీరందరూ విధాత చేతిలో వారు, స్వతంత్రులు కారు. ఆవిధాత, పిల్లకాయకు పాండిత్యం యిస్తాడు. పండితుణ్ణి పిల్లవాడికంటేనూ అజ్ఞానిగా చేస్తాడు. ఇదంతా, ఆవిధాత, వారి కందరికీ పూర్వజన్మంలో చేసుకున్న పుణ్యాపాపాలను

బట్టి యేర్పాటుచేస్తాడు. తన బలం అంతా చూసుకుని మురిసిపోతూ వుంటాడు మా పెత్తండ్రి. కనక, ముందీ సంగతి స్పష్టంగా చెప్పు అతనికి, తరవాతే నానమస్కారాలు విన్నవించి, మా క్షేమం అతనికి చెప్పి తనక్షేమం నేనడిగా నను.

అతను నిండుకొలువు తీరి వున్నప్పుడు నువ్వు చెప్పవలసిం దేమి టంటే? "రాజేంద్రా! నీఅనుగ్రహంవల్ల మేము క్షేమంగా వున్నాము. నీఅనుగ్రహంవల్లనే పిన్నల మయివుండికూడా రాజ్యాధికారం సంపా దించుకున్నాము. మరి, నువ్వే మమ్మల్నిప్పుడు మరిచిపోడం ధర్మమా? బ్రహ్మాండ మైన సైన్యం కూర్చుకుని వున్నావు నువ్విప్పుడు; కాని మాలో వొక్కడికిచాలు చాల దది. సమయంవస్తే మేము శత్రువులను బుగ్గిచేసేస్తాము; కాని వొకళ్ళకి స్వాధీనంఅయి పడివుండము"

తరవాత భీష్ముడిదగ్గిరికి వెళ్ళు నువ్వు. మాకందరకీ పితామహు డతను. నాపేరు చెబుతూ నువ్వతని పాదాలు పట్టుకో ముందు. "తాతా, శంతనుమహారాజు వంశం నీతో నశించిపోకుండా నువ్వు మళ్ళీ నిలబెట్టావు. మనమ లందరూ నీకు సమానమే. కనక, నీస్వబుద్ధితో ఆలోచించి, వారందరూ వొకరి కొక రాసరాగా వుంటూ సుఖంగా బతికేటట్టు కట్టడి చెయ్యి" అని నామాటగా చెప్పు. తరవాత విదురిడి దగ్గిరికి వెళ్ళు. నేను యుద్ధం చెయ్యా లనుకోడంలే దని అతనితో చెప్పు.

ఆనిండుకొలువులోనే వుంటాడు దుర్యోధనుడు. కౌరవు లందరూ తమ ఆశలన్నీ అతనిమీదే పెట్టుకునివుంటారు. ముందతని క్షేమం అడిగి, తరవాత, నామాటలుగా యిలా చెప్పు.

"దుర్యోధనా, ఆవేళ, యేపాపమూ యెరగని ద్రౌపదిని మీవా డలా దుఃఖపెడుతూవుంటే చూస్తూవూరుకున్నావు నువ్వు. అయినా,

వోర్చికపట్టి, కౌరవులను చంపకుండా వూరుకున్నాము. ఎన్నో కష్టాలున్నా కలిగించారు మీరు. అయినా, బలవంతులం అయివుండిన్నీ, అవన్నీ క్షమించి వూరుకున్నాము. కౌరవులను చంపకూడ దనుకునే వూరుకున్నాము. ఇదంతా కౌరవు లెరుగుదురు. మేమేమి చెయ్యగలమో అదీ వారు పూర్తిగా యెరుగుదురు. కుంతి నతిక్రమించి, నీమాటమీద, దుశ్శాసనుడు జుట్టుపట్టుకుని ద్రౌపదిని ఈడ్చాడు. అదీ క్షమించి వూరుకున్నాము మేము. అదంతా గతంగతం. ఇక ముందుసంగతి చెబుతున్నాను. ధర్మంగా మాకు రావలసిందేదో అది మేము స్వాధీనపరుచుకుంటాము. ఇక అశ్రద్ధ చెయ్యము. ఇతరుల సంపదలు వేసుకుందా మన్న దురాశ యిక వదులుకో నువ్వు. అలా అయితే, శాంతి యేర్పడి, వొకళ్ళమీద వొకళ్ళకి ప్రీతి కలుగుతుంది. ఇప్పటికీ మేము శాంతే కోరుతున్నాము. కనక, రాజ్యంలో యెంతో కొంత మాకిచ్చెయ్యి. పోనీ, మాఅయిదుగురికీ అయిదువూళ్ళియ్యి, చాలు. వాటిలో వొకటి అవిస్థలం. రెండోది వృకస్థలం. మూడోది మాకంది. నాలుగోది వారణావతం. అయిదోది యేదయినా సరే, మరొకటి. అది నీయిష్టం. మనమూ, మన జ్ఞాతులున్నూ అందరూ శాంతంగా — సుఖంగా బతకా లని మాఆశ. అన్నా తమ్ముడూ యేకం కావా లనీ, తండ్రీ కొడుకూ వొకటి కావా లనీ మాకోరిక. పాంచాలురూ కౌరవులూ చిరునవ్వు నవ్వుకుంటూ కలిసిపోవాలని మాప్రయత్నం. కౌరవులూ పాంచాలురూ సుఖంగా వుండడం మేము చూడగలుగుతా మనే అనుకుంటున్నాం. నాయనా, సుయోధనా, మంచి మనస్సుతో మన మంతా కలసిపోదా మోయి! చివరి కొక్కటి చెబుతాను బాగాఆలోచించుకో. మేము శాంతంగానూ బతగ్గలం, యుద్ధమూ చెయ్యగలం. ధర్మమూ ఆచరించగలం. అర్థమూ సంపాదించుకోగలం. మెత్తమెత్తగానూ వుండగలం, దారుణాలూ చెయ్యగలం"

# 32

## మర్మోద్ఘాటనం

ధృతరాష్ట్రుడు చెప్పింది చెప్పినట్లు పూర్తిచేసుకుని, ధర్మరాజు సెలవు పొంది సంజయుడు హస్తినాపురం చేరుకున్నాడు. ఆ దారినే రాజ భవనానికి వెళ్ళి "రాజుగారితో నేనిప్పుడే మాట్లాడాలి. నేను వచ్చి యిక్కడ కనిపెట్టుకునివున్నా నని చెప్పు" అని తొందరపెట్టాడు ద్వారపాలకుణ్ణి. వాడు వెళ్ళి యీసంగతి చెప్పగా రాజు "వెంటనే తీసుకురా, నా దర్శనంకోసం కనిపెట్టుకూర్చోవాలా సంజయుడు? వెళ్ళువెళ్ళు, నేనిప్పుడు ఉత్సాహంగానేవున్నాను. త్వరగా తీసుకురా" అని తానున్నూ తొందరపెట్టాడు.

ద్వారపాలకుడు దారి చూపించగా సంజయుడు రాజభవనం ప్రవేశించాడు. హస్తినాపురానికంతకీ పేరెక్కిన గొప్ప మేడ అది. ప్రాజ్ఞులైన శూరు లెందరో కాపలావున్నారు దానికి. ధృతరాష్ట్రుడు సింహాసనంమీదే కూచునివున్నాడు. "రాజేంద్రా, నమస్కారం. నేను సంజయుణ్ణి" అంటూ దగ్గిరికి వెళ్ళి ప్రారంభించాడు సంజయుడు.

"నేనిప్పుడే వచ్చాను పాండుపుత్రుల దగ్గిరనుంచి. ధర్మనందనుడు నీకు నమస్కారాలు విన్నవించుకుని క్షేమం అడిగాడు. మిక్కిలీ మానధను డతను. నీకొడుకుల క్షేమమూ, మనుమల కుశలమూ, మునిమనుమల ఆరోగ్యమూ కూడా అడిగా డతను. నిన్నాశ్రయించు కుని వున్నవారిదిన్నీ క్షేమం అడిగా డందరిదీ —"

మాట పూర్తికాకుండానే అందుకుని "సంజయా, ధర్మనందనుడు అజాతశత్రువు. అతణ్ణి మిక్కిలీ మెచ్చుకుంటున్నా న్నేను. అతను, తమ్ములూ, పుత్రులూ, అమాత్యులూ — బంధువులూ — అందరి

తోనూ కుశలంగా వున్నాడా ?" అనడిగాడు ధృతరాష్ట్రుడు. "చాలా కులాసాగా వున్నా" డంటూ మళ్ళీ ప్రారంభించాడు సంజయుడు.

"రాజేంద్రా, నిర్దుష్ట మైన ధర్మమార్గంలో నడుచుకుంటూ నిష్కళంకంగా బతుకుతున్నాడు ధర్మనందనుడు. నీకు తెలియని దేమీ లేదు. చాలాచాలా తెలిసినవా డతను. మంచి స్వభావం అతనిది. మిక్కిలీ దూరదృష్టిగలవా డతను. ధర్మం కంటే దయా, డబ్బు కంటే ధర్మమూ గొప్ప వన్న నమ్మకం అతనిది. అతనికీన్నీ సుఖం కావాలి, ప్రియమున్నూ కావాలి. అయితే, అవి ధర్మబద్ధా లయి వుండా లతనికి. తాడు పట్టుకులాగితే కర్రబొమ్మ ఆడుతుంది. అలాగే కాలరూప మైన ఈశ్వరు డెలా తిప్పితే మనిషి అలా తిరుగుతాడు. అంచేత దైవమే బల మని అతని విశ్వాసం.

నువ్వు చేసిన పని చాలా ఘోర మైనది. చెప్పడానికి శక్యం కానిది. పాపాల పుట్ట. అయితే, అవతలివాడు ఊరుకున్నంతసేపే దీనికి చెల్లుబడి. ధర్మనందను డలా కాదు. జీర్ణమై శిథిలమయిపోయిన కూసం విడిచిపెట్టేస్తుంది పాము. అత నలాగే పాపం విడిచిపెట్టే శాడు. పైగా, పెద్దలకు సమ్మత మైన మార్గాన సంచరిస్తున్నాడు. రాజేంద్రా, బాగా పరిశీలించి చూసుకో. నువ్వు చేస్తున్న పని ధర్మా నికి మిక్కిలీ దూరం. సంపదలకున్నూ దూరం. నువ్విక్కడ నిందల పాలయిపోతున్నావు. పరలోకంలో నీకు నరకమే గతి అయిపోతుంది.

ఉన్న సంపద అంతా పాండుపుత్రులను దూరంగావుంచి నీకొడుకులతో కలిసి నువ్వొక్కడవు మాత్రమే అనుభవించా లని చూస్తున్నావు. దీనివల్ల నీకీలోకంలో అధర్మపరుడ వని అపకీర్తి పెరిగి పోతోంది. జను లందరూ నిన్ను నిందిస్తున్నారు. ప్రజ్ఞ తక్కువగా వుండి, చెడ్డకుటుంబంలో పుట్టి, దయాధర్మాలు లేక, దీర్ఘవిరోధం పెట్టుకుని క్షత్రియవిద్యలు నేర్చుకోక బలపరాక్రమాలున్నూ లేక

చెడ్డపనులు చేసేవాడికి ఆపదలు కనిపెట్టుకుని వుంటా యెప్పుడూ. మంచి కుటుంబంలో పుట్టి, బలపరాక్రమాలు సంపాదించుకుని, సర్వ ధర్మాలూ తెలుసుకుని మనస్సు నిగ్రహించుకుని సుఖంగా బతుకుతూ ధర్మాధర్మాలు గుర్తించుకుని నడిచేవాడి కెప్పుడూ ఆపదలు రావు.

మంత్రార్థవేత్తలలో సాటిలేని గొప్పవిద్వాంసు లున్నారు నీదగ్గిర, వారెప్పుడూ ధర్మాధర్మాలు విడమర్చి చెబుతూనే ఉన్నారు. కాని పోతే మూఢుడవు కాక పాండుపుత్రుల నడవుల కెందుకు పంపుతావూ? నీమంత్రులందరూ తమ విధులు సక్రమంగానే నిర్వహించుకుంటున్నారు. కనక, వారు, నువ్వు చేసే పనులవల్ల నీకుటుంబం అంతా నాశనం అయి పోతుందని నిశ్చయించుకునే వున్నారు.

నీపాపాలకు తగ్గట్టు ధర్మనందనుడు కూడా పాపాలకే వొడికట్టి వుంటే, ఈకురువంశం అంతా యిదివరకే నాశనం అయివుండును. పాపం అంతా నీకే విడిచిపెట్టా డతను. అంచేత నువ్వు నిందలపాలై పోతున్నావు. అర్జును డీశరీరంతోనే స్వర్గానికి వెళ్ళి వచ్చా డంటే అతని శక్తి యెంతటిదో తెలియడం లేదూ? మరి, అలాంటివా డరణ్యాల్లో అంతంతబాధ లనుభవించాడేం? మనిషి ప్రయత్నాలకంటే దైవనిర్ణయమే బలమైన దనడాని కింతకంటే మరేమినిదర్శనం కావాలీ?

బలిచక్రవర్తి శౌర్యసాహసాలు చాలా గొప్పవి. అయితే, అతను, తానుచేసుకున్న కర్మకే అవి ఫలా లని తెలుసుకున్నాడు. గొప్ప గొప్ప వైభవా లనుభవించా డతను; కాని అవన్నీ దైవయోగం వల్ల వచ్చినవే అని గుర్తించుకున్నాడు. ఎంత అనుభవించినా విషయ సుఖాలకు అంతులే దని తెలుసుకున్నాడు. చివరికి, దేనికయినా, కాలస్వరూపుడైన ఈశ్వరుడే కారణం అని నమ్ముకున్నాడు.

కన్నూ, చెవీ, ముక్కూ, చర్మమూ, జిహ్వా — ఇవి, మనిషికి రూపమూ శబ్దమూ గంధమూ స్పర్శా రసమూ తెలుపుడు చేసే

యింద్రియాలు. తృష్ణ నశిస్తేగాని యివి అణగవు. ఇవి నిగ్రహించు కోగలవాడికి దుఃఖాలు రావు. కాని కొందరు పురుషకారంవల్లనే సర్వమూ సిద్ధిస్తుం దనుకుంటారు. తల్లీతండ్రీ చేసుకున్న కర్మవల్ల పుట్టి మనిషి భోజనం చెయ్యడంవల్లనే పెరుగుతా డనుకుంటారు. కాని ఆమనిషి సుఖమూ దుఃఖమూ కూడా అనుభవిస్తాడు. ప్రియమూ అప్రియమూ, చింతా గౌరవమూ కూడా కలుగుతాయి. దైవ యోగం కాకపోతే యిదంతా యేమిటీ? ఎవ రయినా మంచిపనులు చేస్తే పొగడుతారు. చెడ్డపనులు చేస్తే తెగడుతారు.

పాండుపుత్రులతో నువ్వు విరోధం పెట్టుకున్నావు. నేనిందుకు గర్హిస్తున్నాను. ఆవిరోధంవల్ల ప్రజలు నలిగిపోతారు. అగ్ని దేవుడు విజృంభించి అరణ్యం అంతా బుగ్గిచేస్తాడు. అలాగే, నీపాండవద్వేషం పెరిగిపోయి కురుకులం అంతా నాశనంచేస్తుంది.

నీకొడుకు సర్వమూ తనకే వుండా లనుకుంటాడు. జూదంసమ యాన యింతమందిలోనూ నువ్వొక్కడవే అతణ్ణి మెచ్చుకున్నావు. అంచేతనే నీకిప్పుడు శాంతి దూరం అయిపోయింది. ఆపాపం అంతా పండడాని కిప్పుడు సిద్ధంగా వుంది. ఆప్తుల నందరినీ దూరంచేసు కున్నావు నువ్వు. ఇంతేకాదు. ఆప్తులు కానివారి నందరినీ దగ్గిరకి తీసుకున్నావు. అంచేతనే యీభూమండలం అంతా యేలడం నీకు సాధ్యపడకుండా వుంది.

రాజేంద్రా, యేది యేమయినా రథంమీద అతివేగంగా వచ్చి వుండడంవల్ల నేను మిక్కిలీ బడలిపోయి వున్నాను. సెలవిస్తివా యింటికి పోయి పడుకుంటాను. కౌరవు లందరితోపాటు నువ్వున్నూ ధర్మనందను డన్నమాటలు రేపు సభలో వినవచ్చు" అన్నాడు సంజయుడు. చివరికి, "అది బాగుం" దని ధృతరాష్ట్రుడు సెలవిచ్చి అతణ్ణి పంపేశాడు.

# 33

## మంత్రోపదేశం

ధృతరాష్ట్రుడు ద్వారపాలకుణ్ణి పిలిచి "నుంచున్నపాటున నేను విదురునితో మాట్లాడాలి, వెళ్ళి, త్వరగా తీసుకురా" అని తొందర పెట్టాడు. వాడతణ్ణి తీసుకువచ్చి చెప్పగా "విదురునికి నాదగ్గిరకి రావడానికి వేళాపాళా అక్కర్లేదు, తీసుకురా" అన్నాడు.

తనపేరు చెప్పి ముందు నమస్కారంచేసి "ఏమి సెలవు?" అనడిగాడు విదురుడు. "విదురా, సంజయుడు వచ్చి నన్ను చాలా గర్హించి వెళ్ళిపోయాడు. ధర్మనందనుని మాటలు రేపు సభలో చెబుతానన్నాడు. ధర్మనందనుని ధోరణి యేమిటో కొంచెమున్నా అవగాహన కావడంలేదు నాకు. అంచేత కుతకుతలాడిపోతున్నాన్నేను. నాకు నిద్రరావడంలేదు. ధర్మార్థాలన్నీ నువ్వు బాగా తెలిసినవాడవు. కనక, ఈస్థితిలో నాకు మనశ్శాంతి కలిగే మాట చెప్పు" అంటూ ప్రాధేయపడ్డాడు ధృతరాష్ట్రుడు.

"సంజయుడు వచ్చాడు, నాకేదో దిగులుపట్టుకుంది. నాయింద్రియాలన్నీ పట్టుతప్పిపోయాయి. రేపేమి చెబుతాడో అని కంగారు నాకు" అని కూడా అన్నాడు. "మనది రాజర్షివంశం, ఇంతమందిమి వున్నా మీవంశంలో; కాని ప్రాజ్ఞులంతా నిన్నొకణ్ణే లెక్కచేస్తారు. కనక, నువ్వు ధర్మబద్ధమైన మాట చెప్పు. మనకు శ్రేయస్సున్నూ కలిగించే మాట చెప్పు" అనిన్నీ అడిగాడతను.

విదురుడు ప్రారభించాడు, మెల్లిగా.

"రాజేంద్రా, బలవంతులు దండెత్తివచ్చి మీదపడ్డవాడికీ, దుర్బలుడికీ, ఏ పనిచెయ్యడానికయినా సాధనసామగ్రి లేనివాడికీ, ఉన్నదంతా దొంగలు దోచుకుపోయినవాడికీ, కామార్తుడికీ, దొంగకూ

నిద్రరాదు. మంచిలక్షణా లన్నీ వున్న రాజే ప్రజల నేలగలడు. ధర్మనందనుడు నీకు ప్రార్థనీయుడు గాని సామాన్యుడు కాడు. అలాంటి వాణ్ణి అడవులకు పంపావు నువ్వు. నీదగ్గిర రాజలక్షణాలు కొంచెము న్నా లేవు. నీకు కళ్ళు లేవు. అంచేత, రాజ్యం ఏలడానికి నువ్వర్హుడవు కావు. నువ్వు ధర్మాత్ముడవున్నూ కావు. అసలు, నీకు, ధర్మాలు తెలియనే తెలియవు.

ధర్మనందనుడు క్రూరుడు కాడు, జాలివుం దతనికి. ధర్మంగా నడుచుకుంటాడు. సత్యమే పలుకుతాడు. బలపరాక్రమాలు గలవాడు. అయినా, పెద్దవాడ వని నీయెడల భయభక్తులతో మసులుకుంటు న్నాడు. అందువల్ల అతను నానాకష్టాలూ అనుభవిస్తున్నాడు.

దుర్యోధనుడూ, శకునీ, కర్ణుడూ, దుశ్శాసనుడూ – ఈనలుగురే నీకిష్టమైనవాళ్ళు. ఉన్నదంతా వీళ్ళ చేతుల్లో పెట్టేశావు నువ్వు. ఇక నీ కైశ్వర్యం తక్కమంటే యెలా తక్కుతుందీ ? వాళ్ళ కేమీ తెలియదు. వాళ్లు పండితులు కారు.

శాస్త్రాలు క్షుణ్ణంగా చదువుకుని ఆత్మజ్ఞానం సంపాదించుకోవాలి. ప్రారంభించినకార్యం పూర్తిచెయ్యగల సత్తావుండాలి. ఓర్పుండాలి. ధర్మమూ అధర్మమూ తెలిసి ధర్మంగానే నడుచుకోవాలి. చెడ్డ పనులు చెయ్యగూడదు. మంచిపనులే చెయ్యాలి. నాస్తికుడయివుండ గూడదు. శ్రద్ధకలవాడు కావాలి. ఈలక్షణాలున్నవాడే పండితుడు.

క్రోధమూ, హర్షమూ, దర్పమూ, సిగ్గూ, బండతనమూ, నేను గొప్పవాణ్ణన్న అహమికా – ఇవి లేనివాడే పండితుడు. తానేమి చేసేదీ యెవ్వరికీ తెలియనివ్వగూడదు. తానేమి ఆలోచిస్తున్నదీ కూడా యెవరికీ తెలియనివ్వగూడదు. తాను చేసిన పని మాత్రమే కనపడా లెవరి కయినా. ఇలా నడుచుకోగలిగినవాడే పండితుడు. పని చేసేటప్పుడు చలీ, యెండా, భయమూ, ఇష్టానిష్టాలూ, అన్నీ వున్నా

యనీ యేమీా లేవనీ – ఇలాంటి వికారాలూ – ఇవిపెట్టుకోనివాడే పండితుడు.

ఎవని ప్రజ్ఞ పాదరసంలాగ చురుగ్గా ప్రసరిస్తుందో, ధర్మం అనుసరించిన్నీ వుంటుందో, కోరికలకంటే నీతే ప్రధానం అని యెవరను కుంటాడో అతనే పండితుడు. పండితు డయినవా డెప్పుడూ తన శక్తి తెలుసుకునే యెత్తులు వేస్తాడు. తనశక్తికి తగినట్టే పనిచేస్తాడు. ఏదీ, యెవరినీ చులకనగా చూడడు. వినగానే బోధపరుచుకుంటాడు. జ్ఞాపకంవుండడానికీ, బాగా అవగాహన కావడానికీ శ్రద్ధగా వింటాడు. బాగా అర్థంచేసుకుని మరీ ప్రారంభిస్తా డేపనయినా. ఏసంగతీ అడగందే చెప్పడు. ఇదీ పండితుని మొదటి లక్షణం.

పండితు డయినవా డందనిదానికోసం అర్రులుచాపడు. పని చెడిపోతే విచారించడు. ఆపదలు వస్తే బెంగటిల్లడు. మంచిచెడ్డలూ, కష్టసుఖాలూ, సాధ్యాసాధ్యాలూ, లాభనష్టాలూ బాగా విచారణ చేసుకుని గాని యేపనీ ప్రారంభించడు. ప్రారంభించడం అంటూ వస్తే సగంలో విడిచిపెట్టడు. తనమనస్సెటూ వురకలు వెయ్యకుండా నిగ్రహించుకుంటాడు. కాలంవ్యర్థంగా గడిచిపోనివ్వడు. అయ్యేలు చెయ్యతగ్గపనులే చేస్తాడు. ప్రయోజనం లేని పను లేమీా చెయ్యడు. తన మిత్రుల అభ్యుదయం చూసి అసూయపడడు. తనకి సన్మానం జరిగితే పొంగిపోడు, అవమానం జరిగితే కుంగిపోడు. గంగా ప్రవాహం లాగ కలత లేకుండా వుంటా డెప్పుడూ.

పండితుడైనవాడు ఐశ్వర్యం మొదలైనవాటి తత్వం బాగా తెలిసినవా డయివుంటాడు. కార్యకారణసంబంధా లన్నీ బాగా గుర్తించుకుని వుంటాడు. ఎదటివా డేవుపాయం అవలంబిస్తున్నాడో అది బాగా తెలుసుకుంటాడు. జరిగే మాటే చెబుతాడు. లోకం పోకడ లన్నీ బాగా అవగాహన చేసుకుంటాడు. మంచి ఊహాశాలీ

సద్యస్ఫూర్తి కలవాడున్నూ అయివుంటాడు. అడిగిన సంగతి వెంటనే చెప్పగలవా డయివుంటాడు. ఎన్నడూ పెద్దల దారి తప్పి నడుచుకోడు. ప్రజ్ఞ ననుసరించిన శాస్త్రజ్ఞానమూ. శాస్త్రజ్ఞానానికి తగ్గ ప్రజ్ఞా వుంటా యతనికి. లెక్కా-పత్రమూ లేనంత డబ్బున్నా, గొప్ప చదువువచ్చినా, అంతులేని ఐశ్వర్యంపట్టినా గర్వం లేకుండా, వొదిగి వొదిగిమసులుకుంటాడు.

ఇక మూఢు లున్నారు. పండితుడు కానివాడు — అంటే మూఢుడు, శాస్త్రాలు చదువుకోడు. గర్వించి కిందూమీదూ చూడకుండా తిరుగుతాడు. దరిద్రు డయి వుండినో్న పెద్దకభుర్లు చెబుతాడు. తన సొంతపనులు మానుకుని యితరులపనిమీద తిరుగుతూ వుంటాడు. ఒకటి చేస్తా నని చెప్పి మిత్రులకు మరొకటి చేస్తాడు. కోరకూడనివి కావా లంటాడు. కోరతగ్గవి విడిచిపెట్టేస్తాడు. బలవంతు డయివున్న వానితో విరోధంపెట్టుకుంటాడు. శత్రువును మిత్రు డనుకుని నిజంగా మిత్రుడయినవాణ్ణి ద్వేషిస్తాడు. ఎప్పుడూ చెడ్డ పనులే చేస్తా డేంచేసినా. తానే చేసుకోవలసిన పనులు భృత్యుల కప్పగిస్తాడు. ప్రతీపనీ, ప్రతీవాణ్ణీ సందేహిస్తాడు. అప్పటికప్పుడు చెయ్యవలసిందెప్పటికో గాని చెయ్యడు. తల్లితండ్రులకయినా శ్రాద్ధక్రియలు చెయ్యడు. దేవతలను పూజించడు. మంచివారితో యెవరితోనూ స్నేహంచెయ్యడు.

పిలవకుండావెళ్లి ప్రవేశిస్తాడు ప్రతీదాల్లోనూ. ఎవరూ కదపకపోయినా నోటికి తలుపూ ద్వారబంధమూ లేకుండా మాట్లాడతాడు. నమ్మరానివాళ్ళనే నమ్ముతాడు. తాను చేస్తున్నపనే మరొకడు చేస్తే అది శుద్ధతప్పుపని అంటాడు. ఏమీ చెయ్యలేడు కాని మాట్లాడితే కస్సుమంటాడు. తన తాహతేమిటో గుర్తించుకోడు. ధర్మార్థాలకు దూరమైన పనికి పూనుకుంటాడు. అదయినా, కష్టపడకుండా నెరవేరా లంటాడు. తనకు సంబంధం లేనివాణ్ణి ఆజ్ఞ పెట్టపోతాడు.

చేతగానివాని చుట్టూ తిరుగుతాడు. లోభినిపట్టుకుని పాకులాడతాడు.

భృత్యులకు కొంచెమున్నా పెట్టకుండా తాను మాత్రమే ఎవడు పంచభక్ష్యపరమాన్నాలూ తింటాడో, మంచివిలవగల బట్టలున్నా కడతాడో వాడికంటే క్రూరుడెవ డున్నాడూ లోకంలో ? పాపప్పని చేసేవాడొక్కడే. ఆపనిచేసి వాడు గడించే డబ్బుమాత్రం చాలా మంది అనుభవిస్తారు. దానివల్లవచ్చే పాపం మాత్రం ఆఅనుభవించే వాళ్ళ కంటదు. ఆడబ్బు సంపాదించినవాడికే చుట్టబెట్టుకుంటుంది. విలుకాడు విడిచిన బాణం వొక్కణ్ణే చంపుతుంది. ఆగురితప్పితే వొక్కణ్ణయినా చంపకపోవచ్చు, అది. కాని, బుద్ధిమంతు డయిన వాడు వొక్కపన్నాగం చేసివిడిచిపెడితే రాజూ, రాజ్యమూ కూడా యెగిరిపోతాయి.

బుద్ధి వొక్కటే. దాంతో, చెయ్యతగ్గదీ, చెయ్యరానిదీ — ఈరెండూ నిశ్చయించుకోవాలి. సామమూ, దానమూ, భేదమూ, దండమూ — ఈనాలు గుపాయాలతోనూ మిత్రుణ్ణీ, తటస్థంగా వున్న వాణ్ణీ, గర్భశత్రువునీ — ఈముగ్గురినీ వశపరచుకోవాలి. ఇంద్రియా లయిదూ నిగ్రహించుకుని, సంధీ, విగ్రహమూ, యానమూ, ఆసనమూ, ద్వైధీభావమూ, సమాశ్రయమూ — యీఆరుగుణాలూ బాగా అల వరుచుకుని స్త్రీల యెడల వ్యామోహమూ, జూదమూ, వేటా, సురాపానమూ, ఫుల్లవిరిచినట్టు మాట్లాడమూ, క్రూరంగా దండించ డమూ, దుబారాఖర్చులు చేసి డబ్బు నాశనంచేసుకోడమూ — ఈయేడూ వదులుకుంటే సుఖం కలుగుతుంది.

పుచ్చుకున్నవా ణ్ణొక్కణ్ణే చంపుతుంది విషం. కత్తిదెబ్బకూడా వొక్కణ్ణే కడ తేరుస్తుంది. మంత్రాంగరహస్యం బయటపడిం దంటే మాత్రం రాజ్యానికి రాజ్యమూ, ఆరాజ్యంలో వున్న ప్రజలూ కూడా బుగ్గిఅయిపోతారు. ఉన్నమంచిపదార్థా లన్నీ వొక్కడే ఆరగించ

గూడదు. ఒక్కడే కూంచుని ఏ ఆలోచనా చెయ్యగూడదు. దూర దేశాలు వెళ్ళవలసివస్తే వొక్కడే వెళ్ళగూడదు. ఇంటిల్లపాదీ గాఢంగా నిద్రపోయేటప్పు డేవొక్కడూ మేలుకుని వుండగూడదు. సత్యం వొక్కటే తెలుసుకోతగ్గది. పలకవలసింది న్నీ సత్యం వొక్కటే. ఆసత్యం స్వర్గానికి మెట్టు. సముద్రంలో ప్రయాణం చేసే వాడికి వోడ యెటువంటిదో లోకంలో బతికేవాడికి సత్యం అటువంటిది.

క్షమగలవాళ్లు చేసే తప్పొక్కటే. అది తప్పుచేసిన వాళ్లని క్షమించివిడిచిపెట్టడం. ఏమంటే? క్షమగలవాణ్ణి, లోకం, చేతగానివా డని నిశ్చయించుకుంటుంది. అయితే, పరకాయించి చూసుకుంటే మాత్రం యీక్షమ దోషం కాదు. శక్తిగలవాళ్ళకి క్షమ, బలం లాగే లెక్క. చేతగానివాళ్ళకి క్షమ వొక మంచి గుణమూ, బల వంతుల కొక భూషణమును. క్షమలో మంచి వశీకరణశక్తి వుంది. క్షమాగుణం వున్నవాడికి అసాధ్యం యేమీ లేదు. శాంతం అనే కత్తి చేతిలో వున్నవాణ్ణి దుర్మార్గు లేమీ చెయ్యలేరు.

గడ్డీ గాదమూ లేనిచోట నిప్పురవ్వ పడితే దాని కదే చల్లారి పోతుంది. అలాగే క్షమలేనివాడు, ఇతరులమీద దోషా లారోపిస్తే, చివరికి వాడిమీదే పడతా యవి. ధర్మం వొక్కటే శ్రేయస్సు కలిగిస్తుంది. క్షమ వొక్కటే శాంతి కలిగిస్తుంది. చదువొక్కటే మంచి తృప్తి కలిగిస్తుంది. అహింస వొక్కటే సుఖం కలిగిస్తుంది. పుట్టలో వుండే అల్పజీవులను పాము మింగేసేటట్లు, యుద్ధం చెయ్యని రాజులనూ, తీర్థయాత్రలు చెయ్యని బ్రాహ్మలనూ భూమి మింగే స్తుంది. పరుషంగా మాట్లాడకపోడమూ, అయోగ్యులను గౌరవించక పోడమూ - ఈ రెండూ చేసేవాడు లోకంలో ఉత్తముడనిపించుకుంటాడు.

ఒకతె మోహించిన పురుషుణ్ణే తామూ మోహించే స్త్రీలూ, ఒకరు గౌరవించినవారినే తామూ గౌరవించే పురుషులూ పరప్రత్య

యనేయబుద్ధులు. స్వయంగా మంచిచెడ్డలు నిర్ణయించుకోలేనివారు వారు. డబ్బులేకుండా పెద్దపెద్ద ప్రయత్నాలు చెయ్యతలిచేవాడూ, ఏమీ చెయ్యలేనివాడయిన్నీ కోపపడేవాడూ తమకి తామే శుష్కించి పోతారు. ఏపనిచెయ్యడానికీ పూనుకోని గృహస్థూ, అన్నిపనులు చెయ్యడానికీ తానే సిద్ధపడే సన్యాసీ, అవి విపరీతప్పనులు కావడంవల్ల ఎందుకూ పనికిరాకుండాపోతారు చివరికి. క్షమాగుణం వున్న రాజూ, ఉన్నంతలో వొకళ్ళ కిచ్చే దరిద్రుడూ స్వర్గంకంటే ఇంకా పైలోకాలు సంపాదించుకుంటారు. న్యాయంగా వచ్చిన డబ్బు, మంచివాళ్ళకి దానంచెయ్యకపోడమూ, దుర్మార్గులకు దానంచెయ్యడమూ — ఇవి రెండూ కూడా అధర్మాలు. పిల్లికి బిచ్చంవెయ్యని ధనవంతుణ్ణీ, తపస్సు చెయ్యని బీదవాణ్ణీ మెడలో బండరాళ్ళుకట్టి యేట్లో ముంచెయ్యాలి.

ఎప్పుడూ యోగనిష్ఠతో వుండే సన్యాసీ, ప్రాణాలు పోయేటట్టున్నా యుద్ధంలో వెనకంజ వెయ్యని రాజూ సూర్యమండలం భేదించుకుని పోయి పరమేశ్వరునిలో ఐక్యం అయిపోతారు. ఉపాయాలయినా అపాయాలయినా మూడు. అవీ యివీ గూడా ఉత్తమమూ మధ్యమమూ అధమమూ అని మూడు విధాలు. ఉపాయాల్లో సామోపాయం ఉత్తమం, భేదోపాయమూ దానోపాయమూ మధ్యమాలు. దండోపాయం అధమం. అపాయాల్లో కొద్దికోరిక లుండడం ఉత్తమం. కోరిక లెప్పుడూ పెంచుకుంటూనే వుండడం మధ్యమం. మళ్ళీమళ్ళీ పెడుతూవుండాలనుకోడం అధమం. పురుషులున్నూ ఉత్తములూ మధ్యములూ అధములూ అని మూడురకాలు. వారిలో ఉత్తముణ్ణి ఉత్తమకార్యాలకూ, మధ్యముణ్ణి మధ్యమకార్యాలకూ, అధముణ్ణి అధమకార్యాలకూ నియమించాలి. భార్యా, పుత్రుడూ, భృత్యుడూ — ఈముగ్గురూ నిర్ధను లని పేరు. వారేమయినా సంపాదిస్తే, అది, వారెవరివారో వారికే చెందుతుంది.

ఇతరులసొత్తు హరించడమూ, ఇతరుల భార్యలను కోరడమూ, మిత్రులను విడిచిపెట్టెయ్యడమూ, — ఈ మూడూ మహాదోషాలు. నాశనంచేస్తా యివి. కామమూ, క్రోధమూ, లోభమూ — ఇవి మూడూ నరకానికి సింహద్వారాలు. కోరినవరాలివ్వడమూ, రాజ్యాధికారమూ, కొడుకు పుట్టడమూ — ఇవి మూడూ సమానాలు. అయితే చేజిక్కిన శత్రువును విడిచిపెట్టడం యీమూడింటికంటే గొప్పది. తన యెడల మిక్కిలీ భక్తిగలవాణ్ణీ, తన్నెప్పుడూ సేవిస్తూవుండే వాణ్ణీ నాకు నువ్వే గతి అంటూ శరణుచొచ్చిన వాణ్ణీ—ఈముగ్గురినీ, తనకి ప్రాణాపాయం వచ్చేటట్టున్నా విడిచిపెట్టగూడదు. కొద్దిపాటి ప్రజ్ఞ వున్న వారితోనూ, ఎంత స్వల్పానికైన దినాలకొద్దీ ఆలోచించేవారితోనూ, అల్పసంతోషులతో—లేక—సోమరులతోనూ, స్తోత్రపాఠకులతో—లేక—యుద్ధం అంటే భయపడే వాళ్లతోనూ బలవంతుడైన రాజెప్పుడూ రాజకార్యాల విషయమై ఆలోచించగూడదు. సంపన్నుడైన గృహస్థు, వృద్ధుడైన జ్ఞాతినీ, బీదవాడైన కులీనుణ్ణీ, దరిద్రుడైన స్నేహితుణ్ణీ, బిడ్డలులేని వితంతుసోదరినీ తన యింటో వుంచుకోవాలి. ఏమంటే? వృద్ధజ్ఞాతి కుటుంబ సంప్రదాయాలు జ్ఞాపకంచేస్తూవుంటాడు. బీదకులీనుడు పిల్లలకు సదాచారాలు మప్పుతూ వుంటాడు. దరిద్రస్నేహితుడు మంచి ఆలోచనలు చెబుతూ వుంటాడు. బిడ్డలు లేని వితంతుసోదరి డబ్బు జాగ్రత్తపెడుతూ వుంటుంది.

ఒకప్పు డింద్రుడడగ్గా "దేవతల సంకల్పమూ, ప్రజ్ఞావంతుల మహానుభావమూ, చదువుకున్నవారి వినయమూ, పాపకర్మలు క్షీణించిపోడమూ — ఇవి నాలుగూ సద్యఃఫలాలు — అప్పటికప్పుడు ఫలం యిచ్చే" వని బృహస్పతి చెప్పాడు. అగ్నిహోత్రమూ, మౌనమూ, చదువూ, యజ్ఞమూ — ఇవి యథోచితంగా చెయ్యాలి. సరిగా చేస్తే యివి క్షేమం కలిగిస్తాయి. లేకపోతే అపాయం కలిగిస్తాయి. తల్లీ,

తండ్రీ, అగ్ని, ఆత్మా, గురువూ — యీ అయిదుగురూ అయి దగ్నులు. పంచాగ్నులంటే వీరే. వీరిని భక్తిశ్రద్ధలతో సేవించుకోవాలి. దేవతలూ, పితృదేవతలూ, మనుష్యులూ, ముష్టివాళ్లూ, అతిథులూ — యీ అయిదుగురినీ ఆదరించేవాడు లోకంలో గొప్ప కీర్తి పొందుతాడు.

స్నేహితులూ, తటస్థులూ, శత్రువులూ, నువ్వు పోషించవలసిన పెద్దలూ, నిన్నాశ్రయించుకుని బతికేవాళ్ళూ నువ్వెక్కడికి వెడితే అక్కడికే వస్తారు నీవెంట. మనిషి కయిదు ఇంద్రియా లున్నాయి, నిగ్రహించుకోవలసినవి. వాటిలో వొక్కటి స్వాధీనం కాకపోయినా, తోలుతిత్తిలో వున్న నీరు, రంధ్రం వుంటే కారిపోయేటట్టు, వాని ప్రజ్ఞ అంతా నీళ్ళుకారిపోతుంది.

తన కైశ్వర్యం పట్టాలని ఆశించేవాడు, నిద్రా, బడలికా, భయమూ, క్రోధమూ, సోమరితనమూ, దీర్ఘాలోచనా — యీఆరూ విడిచిపెట్టుకోవాలి. మంచిచెడ్డలు వివరించి చెప్పని గురువూ, వేదం రాని పురోహితుడూ, కష్టాలు వచ్చినప్పుడు గట్టెక్కించని రాజూ, ప్రియంగా మాట్లాడని భార్యా, ఊరు విడవని గొల్లవాడూ (పసుల కాపరీ,) అరణ్యాలవెంట తిరిగే మంగలీ — సముద్రంమధ్య పగిలిపోయిన వోడను విడిచిపెట్టేటట్టు—యీ ఆరుగురినీ విడిచిపెట్టెయ్యాలి! సత్యమూ, జ్ఞానమూ, చురుకుదనమూ, అసూయలేకుండా వుండడమూ, క్షమా, ధైర్యమూ — ఈ ఆరుగుణాలూ పురుషుడెప్పుడూ విడిచిపెట్టుకో గూడదు.

ఎప్పుడూ చేతికి డబ్బు వస్తూవుండడమూ, ఆరోగ్యమూ, ప్రియురాలైన భార్యా, ప్రీతిగా మాట్లాడే భార్యా, తనచెప్పుచేతల్లో వుండే కొడుకూ, ఉపయోగకరమైన చదువూ — మనిషి కివి ఆరూ సుఖం కలిగిస్తాయి. కామమూ, క్రోధమూ, శోకమూ, మోహమూ,

మదమూ, మానమూ — యీఆరింటినీ స్వాధీనంలో వుంచుకోగలిగిన వాడు ఎప్పుడూ పాపాలు చెయ్యడు. పాపాల వల్ల సంభవించే కీడూ అనుభవించడు. లోకంలో — ఏమరిపాటుగా వుండేవాడివల్ల దొంగలూ, రోగివల్ల వైద్యుడూ, కామాతురునివల్ల స్త్రీ, యజ్ఞంచేసేవాడివల్ల యాజకుడూ, తగువులాడుకునేవారివల్ల రాజూ, మూర్ఖునివల్ల పండితుడూ లక్షణంగా బతుకుతారు. ఆవులూ, సేవకవృత్తీ, వ్యవసాయమూ, భార్యా, చదువూ, శూద్రస్నేహమూ, — యీ ఆరూ క్షణం చూసుకోకపోయినా నశించిపోతాయి.

చదువు పూర్తి అయిపోయాక శిష్యుడు గురువునూ, పెళ్ళాడిన తరవాత కొడుకు తల్లినీ, కామం అణగిపోయిన తరవాత పురుషుడు స్త్రీనీ, పని ముగిసిన తరవాత లాభం పొందినవాడు సాయంచేసిన వాణ్ణీ, అవతలివొడ్డుచేరాక ఏరుదాటినవాడు పడవనూ, ఆరోగ్యం పొందాక రోగి వైద్యుణ్ణీ — పూర్వంచేసిన ఉపకారం మరిచిపోయి నిర్లక్ష్యంచేస్తారు. ఆరోగ్యమూ, రుణభారం లేకపోడమూ, దేశాలు పట్టిపోవలసిన దుర్గతి లేకపోడమూ, సజ్జనులతో సహవాసమూ, స్వేచ్ఛాజీవనమూ, నిర్భయంగా బతగ్గలగడమూ — ఇవి ఆరూ మనిషికి మిక్కిలీ సుఖం కలిగిస్తాయి. ఓర్వలేనివాడూ, పేరాసలకుపోయేవాడూ, సంతుష్టి లేనివాడూ, క్రోధంగలవాడూ, ప్రతీదానికీ సందేహించేవాడూ, ఇతరుల పంచలబడి బతికేవాడూ — యీ ఆరుగురూ ఎప్పుడూ దుఃఖపడుతూవుంటారు.

స్త్రీవ్యామోహమూ, జూదమూ, వేటా, సురాపానమూ, పుల్లవిరిచినట్టు మాట్లాడ్డమూ, కఠినంగా దండించడమూ, డబ్బు దూబరాచెయ్యడమూ — ఇవి యేడూ వ్యసనాలు. చాలా చెడ్డవివి. రాజయినవాడల్లా యివి విడిచిపెట్టెయ్యాలి. లేకపోతే, యెంత కట్టుదిట్టం గలవాడయినా నశించిపోతాడు. బ్రాహ్మలను ద్వేషించడమూ, బ్రాహ్మ

లతో నగువులాడ్డమూ, బ్రాహ్మల సొత్తు హరించడమూ, బ్రాహ్మ లను చంపడమూ, బ్రాహ్మలను నిందించడమూ, ఎవరయినా బ్రాహ్మ లను ప్రశంసిస్తే అది వినలేకపోడమూ, ఏపనివచ్చినా బ్రాహ్మలను కలియనియ్యకపోడమూ, బ్రాహ్మ లేవిషయమై అయినా మాట్లాడ వస్తే అసహ్యించుకోడమూ — ఇవి యెనిమిదీ మహాదోషాలు. ప్రతీ మనిషీ యిది బాగా తెలుసుకోవాలి. తెలుసుకుని యీదోషాలు విడిచి పెట్టాలి. మనిషి ఇకముందు చెడిపోతా డనడాని కివి పూర్వచిహ్నాలు.

స్నేహితులను కలుసుకోడమూ, అపారంగా డబ్బు కలిసిరావడమూ, కొడుకుని పొదువుకోడమూ, సంభోగమూ, కులాసాగా మాట్లాడు కోడమూ, తనవారిలో — తనకులంవారిలో ఘనుడయి వుండడమూ, అనుకున్నది లభించడమూ, సభల్లో సత్కారం జరగడమూ — ఈయెని మిదీ సంతోషాని క్కారణాలు. సుఖమున్నా కలిగిస్తా యివి. ప్రజ్ఞ వుండడమూ, మంచికుటుంబంలో పుట్టడమూ, దమమూ, చదువు సంధ్యలూ, పరాక్రమమూ, మితంగా మాట్లాడ్డమూ, దానం చెయ్యడమూ, కృతజ్ఞత కనపరచడమూ — ఈ యెనిమిది గుణాలూ మనిషికి మంచి గౌరవం తెస్తాయి.

ఈదేహానికి తొమ్మిది ద్వారా లున్నాయి. మూడు దూలా లున్నాయి. అయిదుగురు సాక్షు లున్నారు దీనికి. క్షేత్రజ్ఞు డిందులో నివసిస్తున్నాడు. ఇదంతా బాగాబోధపరుచుకున్న వాడే పండితు డన్నా కవి అన్నాను. మత్తుడు — కల్లుమొదలైనవి తాగి కైపెక్కినవాడూ, ప్రమత్తుడు — మరేదో ధోరణిలో వుండి దృష్టి యిక్కడ లేనివాడూ, ఉన్మత్తుడు — మతిచెడినవాడూ, శ్రాంతుడు — బడలిపోయినవాడూ, క్రుద్ధుడు — క్రోధంపెంచుకున్న వాడూ, బుభుక్షితుడు - ఆకలిగా వున్న వాడూ, తొందరపాటున్నా కలవాడూ, లుబ్ధుడు — పిసినిగొట్టూ, భీతుడు — భయపడివున్న వాడూ, కామి - స్త్రీవ్యామోహంలోపడి

ప్రపంచం మరిచిపోయినవాడూ — ఈపదిమందీ ధర్మం తెలుసుకోలేరు. కనక, ప్రతీవాడూ, ఈపదిమందివిషయమయినీ జాగ్రత్తగా వుండాలి.

ఈసందర్భంలో వొక యితిహాసం వుంది. సుధన్వుడనే అసురేంద్రుడు తన కొడుకులకోసం యెన్నో నీతులు చెప్పాడు. పెద్దలైనవారెప్పుడూ అవి వుదాహరిస్తూవుంటారు. నువ్వున్నూ సావధానంగా విను.

కోరికలూ కోపమూ విడిచిపెట్టుకుని, యోగ్యులయినవారికి ధనధాన్యాలు సమర్పించుకుంటూ, పెద్దలయినవారివల్ల యెప్పుడూ మంచిచెడ్డలు తెలుసుకుంటూ, ఏపని అయినా వెంటనే నెరవేర్చే రాజంటే లోకం తనకి ప్రమాణంగా చూసుకుంటుంది. లోకులు తన్ను నమ్ముకునివుండేటట్టు చేసుకోగలవాడూ, నేరం చెయ్యడం నిజం అని తేలిసవెంటనే అది చేసినవాణ్ణి శిక్షించేవాడూ, ఏనేరాని కెంత శిక్ష విధించాలో అదీ, ఎవరి నెలా క్షమించాలో అదీ బాగా గుర్తెరిగినవాడూ— ఇలాంటి రాజు అఖండైశ్వర్యం అనుభవిస్తాడు. బలహీనులయినవారి నెవరినీ అవమానించరాదు. శత్రువుల మర్మాలూ లోట్లూ బాగా తెలుసుకోడానికి, బుద్ధిపూర్వకంగా వారితో కలసిమెలసి తిరుగుతూ వుండాలి. తనకంటే యెక్కువ బలవంతులయినవారితో విరోధం పెట్టుకోగూడదు. సమయం వచ్చినప్పుడు మాత్రం విజృంభించి తన పరాక్రమం చూపించాలి. ఇలా నడుచుకోగల రాజే ధీరుడంటే.

ఆపదలు వస్తే విచారిస్తూ కూచోగూడదు. ఏమరిపాటు లేకుండా ఎప్పటికప్పుడు సర్వప్రయత్నాలూ సాగిస్తూ వుండాలి. సమయం తప్పివస్తే దుఃఖం దిగమింగుకోవాలి. ఇలా చేసేరాజు ధురంధరుడనిపించుకుంటాడు. అతని శత్రువులతనిచేతిలో వోడిపోతారు. అనవసరంగా యిల్లువిడిచి పరదేశాలకు పోగూడదు. పాపాత్ములతో యెన్నడూ చెలిమిచెయ్యరాదు. పరస్త్రీలను కూడగూడదు. దంభం— అంటే ఇతరులను మోసంచెయ్యడానికి తాను ధర్మాత్ముణ్ణన్నట్టు

నటించగూడదు. దొంగతనం చెయ్యగూడదు. పిసినిగొట్టుతనం పనికి రాదు. సురాపానం చెయ్యగూడదు. ఇవి మిక్కిలీ చెడ్డపనులు. ఇవి చెయ్యని రాజు సకలసుఖాలూ అనుభవిస్తాడు.

పండితుడైనవాడు, ధర్మం కోసమూ అర్థంకోసమూ కామం కోసమూ యెన్నడూ ఆత్రపడగూడదు. అడిగితే సత్యమే చెప్పాలి. మిత్రులకోసం యెవరితోనూ వివాదంపెట్టుకోగూడదు. తన్నాదరించలే దని యెవరిమీదా కోపగించగూడదు. ఎవరిమీదా అసూయపెట్టుకో గూడదు. దయార్ద్రచిత్తుడయివుండాలి. తన దౌర్బల్యం—లోటేమిటో గుర్తించుకుని అందరితోనూ యిష్టంగా మసులుకోవాలి. అలాంటిరా జెక్కడికి వెళ్ళినా వోహో అనిపించుకుంటాడు. డాబుగా వేషంవేసుకుని తిరగ్గూడదు. పౌరుషంకొద్దీ యెవరినీ నిందించగూడదు. నిజంగా కోపమే వచ్చినా యెవరినీదుర్భాషలాడరాదు. అలా చేసేరాజునే జనులాదరంగా చూస్తారు.

చల్లారిపోయిన విరోధం కెలకరాదు, దర్పంగా తిరగ్గూడదు. వాజమ్మలాగా తిరగరాదు. పేదతనం వచ్చి చెడ్డవృత్తు లవలంబించ గూడదు. తనకు సుఖాలు వస్తే పొంగిపోవడమూ, పగవారికి కష్టాలు వస్తే దిసంతులు కొట్టడమూ మంచిది కాదు. ముందెవరి కయినా యేమయినా యిచ్చి తరవాత పిసుక్కోగూడదు. ఇలాగ జాగ్రత్తగా మసులుకునే రాజును, జనులు, ఆర్యజాతికి భూషణంవంటివా డని గౌరవిస్తారు.

ఎలాంటివాడూ మంచిచెడ్డలు బాగా తెలుసుకోవాలి. దేశాచారా లుంటాయి. ఆకాలానికి తగిన ధర్మాలు కొన్నివుంటాయి. అవి బాగా తెలుసుకోవాలి. అవన్నీ బాగా గుర్తించుకుంటూ నడుచుకోవాలి. ఉత్తమం అంటే యేమిటో అధమం అంటే యేమిటో బాగా అవ గాహన చేసుకోవాలి పెద్దలదారి ననుసరించి నడుచుకోవాలి. ఇలా

చేసేరాజు జనులకు ప్రీతిపాత్రు డవుతాడు. అంచేత అతనెక్కడ వుంటే అక్కడ పెద్ద అయి వన్నెకెక్కుతాడు.

ప్రజ్ఞావంతు డెప్పుడూ ఎందులోనూ నటనకు పూనుకోగూడదు. మోహం — ఏదీ పూర్తిగానూ సరిగానూ తెలుసుకోకపోడమూ, ఇతరులను ద్వేషించడమూ, రాజద్వేషమూ, పాపప్పనులు చెయ్యడమూ, కొండేలు చెప్పడమూ—వీటికీ దూరంగా వుండాలి. బహుజనులతోనూ విరోధం పెట్టుకోరాదు. మత్తెక్కివున్న వాళ్ళతోనూ పిచ్చివాళ్ళతోనూ మాట్లాడగూడదు. దుర్జనులతో సహవాసం చెయ్యగూడదు. ఇవి తెలిసి మసులుకునే రాజు అందరిలో జాతిరత్నం అన్నట్టుంటాడు.

దైవభక్తితో దానధర్మాలు చేస్తూ, ఎందులోనూ పొరపాటు పడకుండా మంగళకృత్యాలు చేస్తూ, అక్కడికీ యెందులో నయినా ప్రమాదపడడం తటస్థిస్తే ప్రాయశ్చిత్తం చేసుకుంటూ మసులుకునే రాజుకి దేవతలు అభ్యుదయం కలిగిస్తారు. ఎవడూ కూడా తనసాటి అయినవారితోనే వియ్యం అందాలి. తక్కువవారితో స్నేహమూ వ్యవహారమూ కూడా చెయ్యగూడదు. అసలు మాటే ఆడగూడదు. గుణవంతు లయినవారినే తనకు పురోహితులుగా ఏర్పాటుచేసుకోవాలి. ఇలా నడుచుకునే రాజు నీతిమార్గం యెప్పుడూ చెడకుండా వుంటుంది.

భోజనందగ్గిర, పండితుడైనవాడు, తన్నాశ్రయించుకునివున్న వాళ్ళకి పుష్కలంగా పెడుతూ తానే తక్కువచేసుకుంటాడు. మిక్కిలీ శ్రమపడతాడు; కాని రాత్రి యేకొంచెంసేపో మాత్రమే నిద్రపోతాడు. శత్రువు లయినవారు వచ్చికోరినా తనకున్న దాల్లో తక్కువకాకుండా యిస్తాడు. ఆత్మజ్ఞానం వున్న అలాంటిరాజుకి కష్టా లెప్పుడూ రావు. వచ్చినా వాటి కవే తొలగిపోతాయి. పండితు డైనరాజు తానేమి యోచిస్తున్నదీ, తానేమి చెయ్యదలుచుకున్నదీ, తానేమి చేస్తున్నదీ కూడా యెవరికీ తెలియనివ్వడు. ఏమిచేసిందీ కూడా తెలియనివ్వడు.

దేశంలో కలుగుతున్న ఫలితాలను బట్టిమాత్రమే యెవ రయినా అవి వూహించుకోగలగాలి ; తన ఆలోచన అంత రహస్యంగా వుంచుకోగలిగిన రాజు కెప్పుడూ యెలాంటి కీడూ మూడదు.

పండితు డయిన రాజు అందరికీ యిష్టంగా వుండాలి. అందరికీ వుపకారం చేస్తూ వుండాలి. సత్యమే పలకాలి. వినమ్రుడై నడుచుకోవాలి, మనస్సులో కూడా చెడుతలంపులు పెట్టుకోకూడదు. తన మర్యాదలకు భంగంరాకుండా చూసుకుంటూ వుండాలి. ఇలా నడుచుకునేరాజు తనవాళ్ళందరిలోనూ నాయకమణి అయి ప్రకాశిస్తాడు.

పండితుడైన రాజు సిగ్గరి అయివుండాలి. అనుకోకుండానూ, తెలియకుండానూ, తనవల్ల యేమయినా చెడ్డపనులు జరిగితే తానందుకు సిగ్గుపడవలసివస్తుంది కనక, జాగ్రత్తగా వుండాలి. అలాంటిరాజు అందరికీ గురువయి అందరి ఆదరగౌరవాలూ పొందుతాడు. తనమంచి నడవడివల్లా, తన తేజస్సువల్లా, తనవిశుద్ధస్వభావంవల్లా సూర్యుడన్నట్టు ప్రకాశిస్తూవుంటాడు.

రాజేంద్రా, ఈలక్షణా లన్నీ పాండుపుత్రుల దగ్గర వున్నాయి. పాండురాజు, శాపదగ్ధు డయిపోయి అడవుల్లో వుండినప్పుడు దేవతల ప్రసాదంవల్ల పుట్టుకువచ్చారు వారు. వారయిదుగురూ సామాన్యులు కారు. అయిదుగురూ దేవేంద్రులకు సాటి ఆయినవారు. చిన్నప్పట్నుంచీ నీచేతిలో పెరిగారు, నువ్వెలా చెబితే అలా నడుచుకుంటున్నారు. కనక, వారివంతు రాజ్యం వారి కిచ్చెయ్యి. తరవాత, వున్నదంతా నువ్వూ నీకొడుకులూ సుఖంగా అనుభవించండి లక్షణంగా. ఇలా చేస్తే దేవతల్లోనూ మనుష్యుల్లోనూ కూడా నిన్నవమానించేవాడుండడు.

# మంత్రోపదేశం 2

"నాయనా, విదురా, ధర్మమూ అర్థమూ నీకు బాగా తెలుసు. కనక కంటికి కూరుకురాక వేగిపోతున్న నాకు ఏది మంచిదో అది చెప్పవోయి" అనడిగాడు ధృతరాష్ట్రుడు. "అజాతశత్రు వయిన ధర్మనందనుని కిష్టమైనదీ, కౌరవులకు శ్రేయస్కరమైనదీ బాగా ఆలోచించి చెప్పు. నేనిప్పు డేదో కీడుమూడుతుం దని భయపడుతున్నాను. అంచేత యెటుచూసినా అపాయమే కనపడుతోంది నాకు. నామనస్సంతా చెడిపోయివుం దిప్పుడు. కనక, ధర్మనందను డేమి చెయ్యా లనుకుంటున్నాడో అది వున్నదున్నట్టు చెప్పు నాకు" అనికూడా అడిగాడు.

"రాజేంద్రా! ఎవరికి తాను పరాభవం కలక్కూడ దనుకుంటాడో అతనికి, పుణ్యమైనా పాపమైనా, తన్నడక్కపోయినా వున్నదున్నట్టు చెప్పాలి, కావలసినవాడు. కౌరవులకు హితం కలగా లిప్పుడు. నీకోరికా యిదే, నాకోరికా యిదే. కనక, శ్రేయస్కరమూ ధర్మసమ్మతమూ కూడా అయిన వొకమాట చెబుతా విను" అంటూ మళ్లీ ప్రారంభించాడు విదురుడు.

"తప్పుడుపనులు చేస్తే వొక్కొక్కప్పుడు మేలు కలిగితే కలగనే వచ్చు; కాని నువ్వలాంటిది అంగీకరించడం శ్రేయస్కరం కాదు. ఒకొక్కప్పుడు మంచిపనులే చేసినా లేశమూ ప్రయోజనం కలక్కపోవచ్చు. అందుకు విచారించడమూ తగదు. మంచిపనే చెయ్యా లనుకున్నా, ముందు, దాని సాధ్యాసాధ్యాలూ, లాభనష్టాలూ, కష్టసుఖాలూ ఆలోచించుకోవాలి. తొందరపడి యేదీ చెయ్యగూడదు. ఏపనిచేస్తే యేమి లాభం కలుగుతుందో, చివరి కది యెలా మారు

తుందో బాగా తర్కించుకుని ప్రయత్నించడమో మానుకోడమో అప్పుడు స్థిరపరుచుకోవాలి.

కోట యేస్థితిలో వుందో, బొక్కసం పెరుగుదలలో వుందో తరిగి పోతోందో, రాజ్యమున్నూ స్థిమితంగా వుందో కల్లోలంగా వుందో, తన దండశక్తి నిరాఘాటంగా సాగుతోందోలేదో – ఇదంతా ప్రతీ క్షణమూ పరిశీలించుకోని రాజు ఎన్నాళ్లో సాగించుకోలేడు తనప్రభుత్వం. ఇవన్నీ మంచిస్థితిలో వుండేటట్టు మాత్రమే కాదు, రాజయినవాడు, ధర్మమూ ఆర్థికవిషయమూ కూడా బాగా చూసుకుంటూ వుండాలి, తన కేమీ అపాయం రాకూడ దనుకునేవాడు.

రాజయినవాడు, రాజ్యం స్వాధీనపడిపోయింది గదా అని ధర్మమూ రాజనీతీ తప్పి నడుచుకోగూడదు. ముదిమివస్తే చక్కదనం యెలా నశించిపోతుందో ధర్మమూ నీతీ లేకపోతే రాజ్యమూ అలాగే నశించి పోతుంది. తినేవస్తు వేదో దొరకిందిగదా అన్న ఆబతో, చేప, ఇనప గేలం మింగుతుంది. తరవాత వచ్చే ప్రాణాపాయం గుర్తించుకోదు. ఆభక్షించతగ్గది ముందు స్వాధీనంచేసుకోడం తనకు శక్యమో కాదో చూసుకోవాలి. శక్యంఅయినా అది తనకు జీర్ణం అవుతుందో కాదో పరకాయించుకోవాలి. జీర్ణం అయినా దానివల్ల తనకు మేలే కలుగు తుందో కీడే కలుగుతుందో విచారణ చేసుకోవాలి. ఇన్ని పరీక్షలకూ నిలిస్తే అప్పుడూ అది మింగడం శ్రేయస్కరం. చెట్టు కాసిందంటే, ఆకాయ పక్వానికి వచ్చిందో లేదో చూసుకోవాలి ముందు. పక్వానికి వచ్చివుండకపోతే మధురమైన రసం అనుభవానికి రాదు. పోనీఅంటే దాని విత్తనమున్నూ చెడిపోతుంది. ఆకాయ బాగా పక్వం అయివుంటే దానిరసం మిక్కిలీ తృప్తికలిగిస్తుంది. దానివిత్తనమున్నూ అలాంటి పళ్లెన్నో యిస్తుంది.

తుమ్మెద, పువ్వు నలిగిపోకుండా మకరందం తాగుతుంది. రాజయినవాడు, యెవరినీ బాధపెట్టకుండా తన క్కావలసినవి అలాగే సంగ్రహించుకోవాలి. పూలదండలు కట్టేవాడు, చెట్టు మొదలు నరకడు, పువ్వులే కోసుకుంటాడు. బొగ్గు లమ్ముకునేవాడు పువ్వుల కేసే చూడడు, మొదలే నరికేస్తాడు. మనిషయినవాడు "ఈపనిచేస్తే నాకేమి లాభమూ? ఇది చెయ్యకపోతే వచ్చేనష్టం యేమిటీ?" అని ముందు బాగా ఆలోచించుకుని, చెయ్యడమో మానడమో అప్పుడు చూస్తుకోవాలి. పనిచెయ్యకపోయినా కొన్ని ఫలాలు సిద్ధిస్తాయి. ఎంత పనిచేసినా కొన్ని ఫలాలు సిద్ధించకపోవడమూ వుంది.

కొందరికి అనుగ్రహం వచ్చినా ఏమీ లాభం వుండదు. కోపం వచ్చినా ఏమీ పోదు. స్త్రీలు నపుంసకుణ్ణి భర్తగా స్వీకరించరు. అలాగే జనులున్నూ అలాంటి నిరర్థకుణ్ణి రాజుగా అంగీకరించరు. కొన్ని పనులు మిక్కిలీ సులువుగా నెరవేరతాయి. గొప్ప ఫలితమున్నూ యిస్తాయి. పండితుడైనవాడు అలాంటిపనులు వెంటనే చేసేస్తాడు, లేశమూ జాగుచెయ్యకుండా.

జనులకు చల్లని చూపు ముఖ్యం. ఋజుప్రవర్తనమున్నూ ప్రధానమే. అలానడుచుకునేవాడి దగ్గిరికే చేరతారు జనులు, అతనేమీ చెయ్యకపోయినా. విరగబూసిన చెట్టు కాయకపోవచ్చు. కాసి పండిన చెట్టు ఎక్కడానికి వీలు కాకపోవచ్చు. కాయ పండకపోయినా పండినట్టు వుండవచ్చు. ఏదియేమయినా చెట్టుమాత్రం యెన్నడూ నశించదు.

రాజయినవాడు ప్రసన్నంగా చూడాలి. మంచి వుద్దేశాలు కనబరచాలి. ప్రీతిగా మాట్లాడాలి. సుఖం కలిగించే పనులు చెయ్యాలి. అలా చెయ్యగలవాణ్ణి జనులు నెత్తిమీద పెట్టుకుంటారు. వేటకాణ్ణి చూస్తే జంతువులు భయపడిపారిపోయేటట్టు కొందరు రాజులను చూస్తే జనులు తొలగిపోతారు. చక్రవర్తే అయినా, అలాంటిరాజు

త్వరలో నే నశించిపో తాడు. ఎం తెంత లేసి మేఘా లయినా గాలి విసురికి చెల్లా చెద రయిపో తాయి. అలా గే వంశ పారంపర్యా వచ్చిన రాజ్యం అయినా రాజయినవా డు నీతిమాలిన పనులుచేస్తే నాశనంఅయిపోతుంది.

రాజు, తనపూర్వు లందరూ ఏమార్గాన నడుచుకున్నా రో తానూ ఆమార్గ మే అనుసరించాలి. అలాంటి రాజు కే యీభూమి సకలసంపదలూ యిస్తుంది. రాజ్యమున్నూ వృద్ధిపొందుతుంది. ఇలా కాక, ధర్మం విడిచిపెట్టి, అంతటితో వూరుకోక అధర్మంగా నడిచే రాజుకి ఈభూమి, నిప్పులో పడ్డ చర్మంలాగ ముట్టుకుపోతుంది. చెయ్యిజారిపోతుంది. శత్రువుల రాజ్యం నాశనంచేదా మని వూహించేవాడు ముందు, తన రాజ్యం బాగుచేసుకో వాలి. కాక, ధర్మమార్గాన నడుచుకుంటూ రాజ్యం సంపాదించుకో వాలి. ధర్మంగా, నీతితప్పకుండా పరిపాలించాలి. అలా నడుచుకు నేవాడికి ధర్మబద్ధ మైన సంపద లభిస్తుంది. ఆసంపద యెప్పుడూ నశించిపోదు. తరిగిన్నీపోదు.

నల్ల రాళ్ళనుంచి బంగారం సంపాదిస్తారు జనులు. అలా గే పిచ్చివాళ్ళ పేలాపనలోనుంచీ, చంటిపిల్లల తొక్కుపలుకులలోనుంచీ కూడా, రాజు, సారం గ్రహించుకో వాలి. మహర్షులు శిలావృత్తి అవలంబించి — పొలాల్లో రాలి పడివున్న వరికంకులూ, జొన్న కంకులూ ఏరుకుని జీవిస్తారు. బుద్ధిమంతు డైన రాజు, అలా గే పండితుల వాక్కుల్లోనుంచీ, సజ్జనుల మాటల్లోనుంచీ, ధర్మపరుల సత్కార్యాల్లోనుంచీ సారం గ్రహించి ధీరుడు కావాలి.

ఆవులు వాసనతో చూస్తాయి. బ్రాహ్మలు వేదాలతో చూస్తారు. రాజులు చారులతో చూస్తారు. సామాన్యజనులు కళ్ళతోమాత్రమే చూడగలుగుతారు. తన్నీ, కుమ్మీ పాలుపితి కేవాణ్ణి బాధించే ఆవు చావుదెబ్బలు తింటుంది. సాధువుగా వుండి చక్కగా పాలిచ్చే ఆవు నెవరూ బాధించరు. కొలిమిలో పెట్టి కాల్చకపోయినా, కొన్ని వస్తు

వులు సహజంగానే వంగుతాయి. సహజంగానే వంగివున్న కర్ర కాల్ప రెవరూ. ఇదే వాక పారంగా గ్రహించుకుని దుర్బలుడైన రాజు తనకంటే బలవంతుడైనవాడిదగ్గిర వంగివంగి నడుచుకోవాలి. బలవంతుడి యెదట నమ్రుడయేవాడు, ఇంద్రుడిదగ్గిరా నమ్రుడవుతాడు. దానివల్ల, బలాధిష్ఠానదేవతా ఇంద్రుడూ కూడా అలా వంగినడుచుకునేవాణ్ణి చాలా దయతో చూస్తారు. ఎన్నో మేళ్ళున్నూ కలిగిస్తారు.

పశువులకు పర్జన్యుడు బంధువు. రాజులకు మంత్రులు బంధువులు. స్త్రీలకు పతులు బంధువులు. బ్రాహ్మలకు వేదాలు బంధువులు. ధర్మానికి సత్యం రక్ష. చదువుకి అభ్యాసం రక్ష. చక్కదనానికి ఉద్వర్తనం — నలుగులు రక్ష. కులానికి శీలం రక్ష. ధాన్యానికి కొలత రక్ష. గుర్రాలకు వ్యాయామశిక్షణ రక్ష. గోవులకు తరుచు కనిపెడుతూవుండడం రక్ష. స్త్రీలకు సామాన్యవస్త్రాలు రక్ష.

శీలం లేనివాడికి కులం యెంత గొప్ప దయినా లాభం లేదు. శీలం వుంటే, హీనకులంలో పుట్టినవాళ్ళున్నూ ఉత్తములే అవుతారు. ఇతరుల డబ్బూ, రూపమూ, బలపరాక్రమాలూ, జాతీ, కుటుంబమర్యాదా, సుఖమూ, సౌభాగ్యమూ, గౌరవమూ, చూసి ఈర్ష్యపడేవాడు, చచ్చేదాకా కుళ్ళికంపెత్తిపోతూవుంటాడు. చెడ్డపనులు చెయ్యడానికి భయపడాలి. మంచిపనులు మానడానికి జంకాలి. అభీష్టం సిద్ధించకముందే పూనిక చెడిపోయే పను లేమీ చెయ్యకూడదు!

చదువుసంధ్యలూ, ధనధాన్యాలూ, బలగమూ — ఇవి గర్విష్ఠునకు మదం పుట్టిస్తాయి. సత్పురుషులకు మాత్రం యివి దమం — ఓరిమి కలిగిస్తాయి. సజ్జనులైనవారు. ఎప్పుడైనా — ఎందుకైనా సాయంచెయ్యమని దుర్జనులను కోరడం సంభవించవచ్చు. దానివల్ల ఆ దుర్జనులకు వారిగేదేమీలేదు? కాని, దుర్జను లని బాగా పేరుపడిపోయి వుండిన్నీ, వారు, దీంతో తాము సజ్జనుల మయిపోయా మనుకుంటారు. నిజం చెప్పవలసి

వస్తే, సజ్జనులకు సజ్జనులే గతి. ఆత్మజ్ఞానం కలవాళ్ళకీ, దుర్జనులకూ కూడా ఎప్పటికీ సజ్జనులే గతి. ఎలాంటి పరిస్థితుల్లోనూ కూడా దుర్జనులు సజ్జనులకు గతి కారు.

వేషభాషలు గలవాళ్ళకి సభల్లో ఆదరగౌరవాలకు తక్కువరాదు. గోవు లున్నవాడికి మిష్టాన్నాల బెంగవుండదు. వాహనా లున్నవాడికి ప్రయాణా లంటే భయం వుండదు. శీలం మంచిదైనవాడి కెప్పుడూ ఎలాంటి లోటూ రాదు. పురుషుడికి శీలమే ప్రధానం. అది పాడు చేసుకున్నవాడికి, బతికివున్నా, డబ్బున్నా, బంధువులున్నా వున్నా యేమీ ప్రయోజనం లేదు.

సంపన్నులు మాంసాహారమూ, మధ్యతరగతులవారు గోరసాన్నమూ, దరిద్రులు నూనెవస్తువులూ భుజిస్తారు. దరిద్రుల కెప్పుడూ తృప్తే. ఏమంటే? ఆకలంటే యేమిటో, రుచి, అంటే యేమిటో వారికే తెలుస్తాయి. ఎక్కువగానూ వుంటాయి కూడా వారి కవి. సంపన్నులకు తృప్తిగా భోజనం చెయ్యడాని కుండదు. దరిద్రులకు రాళ్ళూ రప్పా తిన్నా జీర్ణం అయిపోతాయి. పనిదొరకదేమో—బతుకుదెరువు లేకపోతుందేమో అని హీనకులాలవారికి భయం. చచ్చిపోతామేమో అని మధ్యతరగతులవారికి భయం. అవమానం జరుగుతుందేమో అని సంపన్నులకు బెంగ. ఐశ్వర్యం వొక మత్తు. అది వున్నవాళ్ళు పాపాలే చేస్తారు. సురాపానం మొదలైనవి చేసి మరీ కారెక్కిపోతారు. ఒక్కమాటయినా నసాళం అంటే దెబ్బతగిలితే గాని మత్తుపోయి వాళ్ళకి ప్రపంచం తెలియదు.

ఇంద్రియాలు నిగ్రహించుకోలేనివాడు గ్రహాలవల్ల నక్షత్రాలెలా బాధపడతాయో అలాగే బాధపడతాడాయింద్రియాలవల్లనే. ఇంద్రియా లయిదూ మనిషిని దిగతీసేస్తాయి. నువ్వు వాటికి లొంగిపోయి వున్నావు; కనక, ఆపదలమీద ఆపదలు నీకు తప్పవు. తన

మనస్సును లొంగతీసుకోలేని రాజు తన మంత్రులను వశంలో వుంచుకో లేడు. ఒక వేళ మంత్రులను స్వాధీనంచేసుకోగలిగినా శత్రువులను అణచుకో లేడు. పై పెచ్చు, తానే దిగనారిపోతాడు. మనిషికయినా రాజుకైనా తన మనస్సే మొదటి శత్రువు. దాన్ని లొంగతీసుకోవాలి, ముందు.

ఇంద్రియాలను వశంలో వుంచుకున్నవాడూ, మనస్సును లొంగ తీసుకున్నవాడూ, అపరాధులను యథోచితంగా శిక్షించగలవాడూ, ఏపని అయినా బాగా పరిశీలించిమరీ చేసేవాడూ ధీరు డనిపించు కుంటాడు. అలాంటిధీరుణ్ణి సంపదలు తమకి తామే వచ్చి చేరు కుంటాయి. పురుషునికి శరీరమే రథం. మనస్సే రథికుడు. ఇంద్రి యాలే గుర్రాలు. ఇవన్నీ స్వాధీనంలో వుంచుకోగలవాడే క్షేమంగా జీవయాత్ర సాగించుకోగలడు. రాజ్యాలూ ఏలగలడు. పెంకిగుర్రం చేతగాని సారథిని ఈడ్చితన్నుతుంది. అలాగే యివి తమ్మి స్వాధీనం చేసుకోని రాజుని తిప్పితిప్పి కొడతాయి.

ఇంద్రియాలు జయించుకోలేనివాడు, కీడే మేలనీ — లేక — మేలే కీడనీ అనుకుంటాడు. సుఖమే దుఃఖ మనీ, దుఃఖమే సుఖమనీ కూడా అనుకుంటాడు. ఇంద్రియాలకు తానే లొంగిపోయి, ధర్మమూ అర్థమూ విడిచిపెట్టేసినవాడికి, సంపదలు నశిస్తాయి. ప్రాణాలు పోతాయి. ధనధాన్యాలు బుగ్గయిపోతాయి. చివరకి, పెళ్ళాం బిడ్డలున్నూ దూరం అయిపోతారు. మనస్సూ బుద్ధీ, ఇంద్రియాలూ లొంగతీసుకుని, తానంటే ఏమిటో ముందు పరిశీలించుకున్నవాడు, తనకి తానే బంధువు అవుతాడు. అలా చెయ్యని వాడు తనకి తానే పగవాడయిపోతాడు. కామమూ క్రోధమూ — ఈ రెండూ ఎంతటి జ్ఞాన మయినా నాశనంచేసేస్తాయి. కనక, ధర్మాధర్మాలు పరిశీలించుకుంటూ సాధనసామగ్రి చేకూర్చుకున్న వాడు సుఖాలే అనుభవిస్తా డెప్పుడూ.

ఇంద్రియాలు లొంగతీసుకోలేక ఎందరో మహాత్ములు చెడ్డారు. ఎందరో రాజులే కాదు, చక్రవర్తులున్నా బైరాగులయిపోయారు. ఎండిన కర్రతో కలసివుంటే పచ్చికర్ర కూడా కాలిపోతుంది. అలాగే, పాపాత్ములతో కలిసి తిరిగితే పాపాలెరగనివాడున్నా భ్రష్టుడయి పోతాడు. మంచి ధ్వనులు వినాలనీ, మంచి శరీరం స్పృశించి సుఖం అనుభవించాలనీ, మంచి చక్కదనం చూడాలనీ, మంచి రసం ఆస్వాదించాలనీ, మంచి సువాసన ఆఘ్రాణించాలనీ, ఉవ్విళ్ళూరేవాడు చెవీ, చర్మమూ, కళ్లూ, జిహ్వా, ముక్కూ — ఈఅయిదుగురు శత్రువులకూ స్వాధీనం అయిపోయి ఆపదల్లో కూరుకుపోతాడు.

అసూయ లేకుండా వుండడమూ, ఋజుప్రవర్తనమూ, శౌచమూ, సంతోషమూ, ప్రీతిగా మాట్లాడ్డమూ, మనోనిగ్రహమూ, సత్యమూ, చాంచల్యం లేకపోడమూ—ఇవి పాపాత్ముల కందవు. మూర్ఖులు సజ్జనులను చూసి ఓర్చలేక గోలపెడతారు. నీలాపనిందలూ మోపుతారు. అయితే, ఆపనులు చేసినవాడే చెడిపోతాడు. ఓపికపట్టినవాడు బాగానే వుంటాడు.

దుర్మార్గాలకు హింసే బలం. రాజులకు దండోపాయమే బలం! స్త్రీలకు సేవచెయ్యడమే బలం, సజ్జనులకు క్షమే బలం. రాజేంద్రా! మాట్లాడకుండా వుండడం చాలా కష్టం. పోనీ అంటే, అర్థయుక్తంగానూ చమత్కారంగానూ చాలసేపు మాట్లాడ్డమూ కష్టమే. మంచిమాట శుభాలు కలిగిస్తుంది, చెడ్డమాట చిక్కులు తెచ్చిపెడుతుంది. బాణాల వల్ల కలిగిన గాయం మానిపోతుంది. గొడ్డళ్ళతో నరికేసిన అరణ్యమూ మళ్ళీ చిగిరించి పెరుగుతుంది; కాని మాటలవల్ల కలిగిన గాయం మాత్రం యెన్నడూ మానదు. కైజారూ, తుపాకిగుండూ, బాణమూ—ఇవి శరీరంలోనుంచి సులభంగానే తీసివెయ్యవచ్చు. మాట అనే బాణం

మాత్రం తీసెయ్యడానికి సాధ్యంకాదు. సూటిగా వెళ్ళి గుండెల్లో నాటుకుంటుంది మరి, అది.

మాటలనే బాణాలు నోటినుంచి బయలుదేరుతాయి, గుండెల్లో పొడుచుకుంటాయి వెళ్ళి. వాటిదెబ్బ తిన్నవాడు రాత్రీపగలూ కూడా దుఃఖిస్తూనే వుంటాడు. ఎంచేతనంటే? అవి మర్మాలు దూసుకు పోతాయి. కనక, పండితుడైనవా డెప్పుడూ అలాంటి మాట లనగూడదు. దేవతలు ఎవరికి పరాభవం కలిగించా లనుకుంటారో, వారి బుద్ధిచెరిపేస్తారు, ముందు. కనక, అలా అయినవా రిక చెడ్డపనులే చేస్తూ వుంటా రెప్పుడూ. బుద్ధిచెడినప్పుడు, జీవితానికి నాశనమునూ్న కనిపెట్టుకునివున్నప్పుడు, ఆమనిషికి దుర్నీతే నీతిగా తోస్తూవుంటుంది. ఆబుద్ధి యిక మారదు.

రాజేంద్రా, నువ్వూ నీకొడుకులూ కూడా యిప్పు డీస్థితిలో వున్నారు. పాండుపుత్రులమీద ద్వేషం వుండడంవల్ల నువ్వీ సంగతి గ్రహించలేకుండా వున్నా విప్పుడు. ధర్మనందనుడు సర్వలక్షణసంప న్నుడు. మూడులోకాలూ ఏలడాని కర్హుడు. అతనే రాజు కాదగిన వాడు. అలాంటివా డిప్పుడు నీకు శిష్యు డయివున్నాడు. అతను నీచెప్పుచేతల్లో వుండడం, నిజంగా నీకే చాలామంచిది. అతనే రాజ్యా ర్హుడు. నీకొడుకులు కారు. పాండురాజు సంపాదించిన రాజ్యాని కతనే వారసుడు. ఇంతేకాదు. నీకొడుకులకంటె అత నెన్నో విధాల ఉత్త ముడు. తేజస్సూ, ప్రజ్ఞా అతనికే వున్నాయి. ధర్మమూ, అర్థికవిష యాలూ అతనికే తెలుసు. జాలివున్నవా డతను. దయార్ద్రహృ దయు డతను. అంచేత, ధర్మం తెలిసినవాళ్ళ కందరకీ అతనే నాయక మణి. కాని నీమీదల గురుభావం పెట్టుకుని వుండడంవల్ల ఎన్ని కష్టాలు వచ్చినా ఓర్చుకుంటూ వస్తున్నాడు.

# 35

## మంత్రోపదేశం 3

"విదురా, నువ్వు చిత్రవిచిత్రాలు చెబుతున్నావు. అవి యెంతవిన్నా నాకు తృప్తి కలగడం లేదు. కనక, ధర్మార్థా లింకా చెప్పవయ్యా" అనడిగాడు ధృతరాష్ట్రుడు.

"రాజేంద్రా! తీర్థా లన్నిటిలోనూ స్నానంచెయ్యడమూ ప్రాణి కోటి అంతటియెడలా ఋజుమార్గాన ఒక్కవిధంగానే నడుచుకో డమూ—ఈ రెండూ సమ మైనవి. ఋజుమార్గాన నడుచుకోడం కొంచెం యెక్కువ అని చెప్పినా చెప్పవచ్చు. కనక, నువ్వు నీకొడుకుల విష యమై ఋజుమార్గాన నడుచుకోడం చాలా మంచిది. అలా చేస్తే, నీకు, ఈలోకంలో గొప్ప కీర్తి కలుగుతుంది, పరలోకంలో స్వర్గసు ఖాలూ కలుగుతాయి. మనిషికి, ఈలోకంలో కీర్తి యెన్నా ళ్ళుంటుందో, అత నన్నాళ్ళు స్వర్గంలో వుంటాడు, సుఖంగా. కేశిని అని వొక కన్యక. ఆమెనిగురించి విరోచనునకూ సుధన్వునకూ వెనక టికి సంవాదం జరిగింది. ఇక్కడ చెప్పవలసిన ఇతిహాసం అది, చెబుతా విను" అంటూ మళ్ళీ ప్రారంభించాడు, విదురుడు.

"వెనకటికి కేశిని అని వొక కన్య. సాటిలేని సౌందర్యం ఆమెది. సాటిలేని భర్తను సంపాదించుకుందా మని ఆమె స్వయంవరం చాటించు కుంది. విరోచను డనే వొక దానవుడు స్వయంవరానికి వచ్చాడు. భక్తశిఖామణి అయిన ప్రహ్లాదుని కొడు కతను. అతణ్ణి గౌరవించి "ఓయీ, బ్రాహ్మ లుత్తములా, లేక, మీదానవు లుత్తములా?" అనడిగిం దామె. దానికి విరోచనుడు "మేము ప్రజాపతుల వంశీకులం. ఈలోకా లన్నీ మావే. మేమే ఉత్తములం. దేవతలకూ బ్రాహ్మ లకూ లెక్కాపత్రమూ కూడా లేదు" అని దృఢంగా చెప్పాడు.

"అయితే, సరే, మనం కనిపెట్టుకుని వుందాం. సుధన్వుడు తెల్లవారావాటప్పటికి తప్పకుండా వస్తాడు. అతను వచ్చాక చూసుకుందాం యిదంతా" అని బదులు చెప్పింది కేశిని.

అనుకున్నట్టుగా, మర్నాడు పొద్దుపొడిచాటప్పటికి వచ్చాడు సుధన్వుడు. కేశినిని కలుసుకున్నాడు. విరోచను డక్కడే వున్నా డప్పటికి. వెంటనే అర్ఘ్యమూ పాద్యమూ ఇచ్చి సుధన్వుణ్ణి మిక్కిలీ ఆదరించి కేశిని కూచోమని ఆసనం యిచ్చింది. "ఇలా వచ్చికూచో" అన్నాడు విరోచనుడు, తాను కూచున్న చోట కొంచెం చోటు చూపిస్తూ. అందుకు "నువ్వా బంగారుపీఠంమీదే కూచో. నువ్వు పిలిచావు కనక, నేనా ఆసనంవొక్కమాటు ముట్టుకుంటాను. అంతే. నీతో కలిసి నే నేకాసనం మీద కూచోను. అది నాకు తగదు" అని తిరస్కరించాడు సుధన్వుడు.

"నిజమే" అన్నాడు విరోచనుడు. "సుధన్వుడా, నీకు తగినది కొయ్యపీట. లేకపోతే దర్భాసనం. అదీకాకపోతే కంబళీ. అంతేగాని నాతోసమంగా ఉత్తమాసనంమీద కూచోడానికి నువ్వు తగవు" అనిన్నీ నిష్ఠురంగా అన్నా డతను. "అవునులే, కుఱ్ఱవాడవు నీకేం తెలుసూ ? ఇద్దరు బ్రాహ్మలు కలిసి కూచోవచ్చు. ఇద్దరు క్షత్రియు లున్నా కలిసికూచోవచ్చు, ఇద్దరు వైశ్యులూ ఇద్దరు శూద్రులూ కూడా కలిసి కూచోవచ్చు. వారయినా తండ్రీ కొడుకూ అయితేనే అలా కూచోవచ్చు. అంతే గాని, తక్కినవా రెవరూ కలిసికూచో గూడదు. ఇంతకీ, — నీతండ్రి అయిన ప్రహ్లాదుడు నాకు ఉన్నతాసనం యిచ్చి, తాను నాయెదట కిందే నుంచుని మాట్లాడతాడు నాతో. నువ్వు గారాంగా పెరిగా వింటో. ఇదేమీ నువ్వెరుగవు మరి" అంటూ సుధన్వుడు నిర్లక్ష్యంగా బదులుచెప్పా డందుకు.

ఇది మాటలతో తీరలేదు. "అయితే, మాకున్న బంగారమూ, ఆవులూ, గుఱ్ఱాలూ తక్కిన సంపద అంతాకూడా పందెం వొడ్డుతు

న్నాను. నువ్వు గొప్పవాడవో నేనే గొప్పవాణ్ణో యెవరి నైనా యెరిగినవారి నడుగుదాం, రా" అన్నాడు విరోచనుడు. దానికి "నీబంగారమూ, నీఆవులూ, నీగుర్రాలూ, తక్కిన నీసంపద యావత్తూ నువ్వే వుంచుకో. చేతనైతే ప్రాణా లొడ్డుకుందాం, రా, తెలిసినవారి నెవరి నైనా అడుగుదాం" అన్నాడు సుధన్వుడు.

అందు కంగీకరించాడు విరోచనుడు. అయితే, యెవరిదగ్గిరికీ వెళ్ళడం? ఈసంగతి వచ్చాటప్పటికి "నేను దేవతల దగ్గిరికి రాను. బ్రాహ్మలదగ్గిరి కసలే రాను" అన్నాడు విరోచనుడు నిర్మాగ మాటంగా. "నువ్వు ప్రాణా లొడ్డడానికి సిద్ధపడ్డావు కనక, నీతండ్రి దగ్గరకే వెడదాం, మరొకరి దగ్గిరి కెందుకూ? నువ్వు తన కొడుకువి గదా అని నీతండ్రి నీకోసం అబద్ధం ఆడడులే" అన్నాడు సుధన్వుడు.

ఇద్దరూ బయలుదేరి ప్రహ్లాదుడి దగ్గిరికి వెళ్ళారు. వారిద్దరూ కలిసి రావడం చూశాడు ప్రహ్లాదుడు. "వీళ్ళెప్పుడూ కలిసి తిరిగినవాళ్ళు కారే, యిప్పు డెందు కిలా వస్తున్నారూ? కలిసేవస్తూవుండిన్నీ తాచు పాముల్లా బుసకొడుతూనే వున్నా రిది యేమిటీ?" అని ఖింతపడ్డాడు ప్రహ్లాదుడు. "ఇంకెందు" కని కొడుకునే ఆడిగా డతను "నువ్వూ సుధన్వుడూ స్నేహం కట్టుకున్నారా?" అని. "లే" దన్నాడు విరోచనుడు. "నాయనా, మేము ప్రాణాలు పందెం వొడ్డుకుని వచ్చాం. అబద్ధం ఆడకుండా మాప్రశ్నలకు బదులుచెప్పు" అన్నా డతను.

వెంటనే ప్రహ్లాదుడు సుధన్వునకు అర్ఘ్యమూ పాద్యమూ యిచ్చి "అయ్యా, నువ్వు మాకు పూజ్యుడవు. ఇదిగో మధుపర్కం. ఇదిగో, బలిసివున్న వెల్లావున్నూ పరిగ్రహించు" అని కోరాడు; కాని సుధన్వుడవి పుచ్చుకోలేదు. "ప్రహ్లాదా! నీఅర్ఘ్యపాద్యాలూ, నీ మధుపర్కమూ, నీవెల్లావూ నాకక్కరలేదు. ఇదంతా నాకు దారిలోనే

ముట్టింది. నీకొడుకు గొప్పవాడా, బ్రాహ్మలం మేముగొప్పవాళ్ళమా? అబద్ధం ఆడకుండా ఇందుకు మాత్రం బదులుచెప్పు నువ్వు" అనడిగాడు సుధన్వుడు, కచ్చితంగా.

ఇవి విని ప్రహ్లాదుడు "నాకీ విరోచను డొక్కడే కొడుకు. సాక్షాత్తూ బ్రహ్మణ్యుడవు నువ్వు దయచేశావు. మరి, నావంటివాడు మీతగువు తీర్చగలడా?" అంటూ సందేహించాడు, "తప్ప" దన్నాడు సుధన్వుడు. "విరోచనుడు నీకు కొడుకు. ఆవు లిచ్చుకో అతనికి ఇంకా యేమియేమిటో ధనధాన్యాలున్నూ యిచ్చుకో. బుద్ధి మంతుడవు నువ్వు. మాతగువు నువ్వే తీర్చాలి" అని బలవంతంకూడా చేశా డతను. దీనిమీద ప్రహ్లాదుడు "సుధన్వుడా, అయితే, సాక్ష్యం చెప్పనివాడూ, విశేషించి అబద్ధం ఆడినవాడూ ఎలాంటి లోకాలకు పోతారయ్యా?" అనడిగాడు.

"సవతులు గల స్త్రీ, తనభర్త రాత్రి తనకేసి చూడకపోతే యెలాంటిదుఃఖం పొందుతుందో అలాంటి దుఃఖమే పొందుతాడు సాక్ష్యంలో అబద్ధం చెప్పినవాడు. జూదంలో ఓడిపోయినవాడూ, బరువులు మోసిమోసి బడలిపోయినవాడూ పొందే దుఃఖమున్నూ పొందుతాడు. ఇంతేకాదు. అబద్ధం చెప్పినందు కధికార్లు దండిస్తారు. అన్నమూ నీరూ ఇవ్వకుండా కోటగుమ్మాన కట్టిన్నీ పడవేస్తారు. వాడి చుట్టూ పగవాళ్ళున్నూ మూగివుంటా రా సమయాన. ప్రహ్లాదా, పశువుల విషయమై అబద్ధం ఆడితే, ఆ ఆడినవాడి పూర్వులు, అయిదు తరాలవాళ్ళు స్వర్గభ్రష్టులయి నరకంలో పడిపోతారు. ఆవులవిషయమై అబద్ధం ఆడితే పదితరాలవాళ్ళూ, గుర్రంవిషయమై అబద్ధం అడితే నూరుతరాలవాళ్లూ, ఒక మనిషివిషయమై అబద్ధంఆడితే వెయ్యితరాల వాళ్లూనరకంలో పడిపోతారు. బంగారంకోసం అబద్ధంఆడితే, వెనకటి తరాలవాళ్లూ, ముందటితరాలవాళ్ళూ కూడా అందరూ నరకంలోకూలి

పోతారు. ఇక భూమి విషయమై అబద్ధం ఆడితేనా? ఉన్నదంతా ఊడ్చుకుపోతుంది. కనక, నువ్వు అబద్ధం మాత్రం ఆడవద్దు" అని బదులుచెప్పాడు సుధన్వుడు.

అప్పుడు ప్రహ్లాదుడు కొడుకుని పిలిచి "నాయనా, సుధన్వుని తండ్రి అంగిరసుడు నాకంటే చాలా గొప్పవాడు. సుధన్వుడు నీకంటే గొప్పవాడు. సుధన్వుని తల్లిగూడా నీతల్లికంటే చాలాగొప్పది. అంచేత, నువ్వే వోడిపోయావు. అంచేత, సుధన్వు డిప్పుడు నీప్రాణాల కధికారి అయివున్నాడు" అని చెప్పి "బ్రాహ్మణోత్తమా, నువ్వు నాకొడుకుని నాకనుగ్రహించాలి" అని సుధన్వుణ్ణి కోరాడు.

దాని కంగీకరించాడు సుధన్వుడు; కాని "ప్రహ్లాదా! నువ్వు ధర్మం తప్పలేదు. కొడుకోసం అబద్ధమున్నా ఆడలేదు నువ్వు, కనక, ఇదే, నీకొడుకుని మళ్ళీ నీకిచ్చేస్తున్నాను. నీకోరిక చాలా దుర్లభం అయినా, నే నందు కంగీరించాను. అయితే, నీకొడుకు, కేశినిమొదట నా* పాదాలు కడగాలి. ఇదిమాత్రం తప్ప" దని ఖండితంగా చెప్పాడు.

కనక కౌరవేంద్రా భూమివిషయమై నువ్వబద్ధం ఆడవద్దు. నీకొడుకులకోసం నువ్వాపనిచేస్తే, అబద్ధం ఆడినందుకు పాపం అనుభవించడమే కాదు, నీకొడుకులతోనూ నీమంత్రులతోనూ సర్వనాశనమే అయిపోతావు నువ్వు. పశుల కాపరి, ఆవులను కాపాడేటట్టు, దేవతలు, కర్రపుచ్చుకూర్చుని మనుష్యులను కాపాడరు. తామెవరిని కాపాడా లని చూస్తారో, వారికి మంచిబుద్ధులు మాత్రమే పుట్టిస్తారు వారు. పురుషుడికి సద్బుద్ధితో మంచిపనులు చేసినకొద్దీ కోరికలు నెరవేరతాయి. మాయచేస్తే మాయగా బతికేవాణ్ణి వేదాలు రక్షించవు.

* పెళ్ళిలో వధూవరులు పసుపునీళ్ళతో వొకరి కొకరు కాళ్ళు కడుక్కోవడం వొక ఆచారం.

వాడిపాపాలున్నా పోగొట్టవు. పైగా, రెక్కలు వచ్చిన పక్షిపిల్లలు, గూళ్ళు విడిచి వెళ్ళిపోయేటట్టు, వేదాలు ఆమనిషినే విడిచిపెట్టేస్తాయి.

మద్యపానం చేసేవాణ్ణీ, పదిమందితోనూ విరోధంపెట్టుకునేవాణ్ణీ, భార్యాభర్తలకు ఎడబాటు కలిగించేవాణ్ణీ, జ్ఞాతులకు వాళ్ళలో వాళ్ళకి విరోధాలు కలిగించేవాణ్ణీ, రాజద్వేషం పెట్టుకున్నవాణ్ణీ, స్త్రీలతో విరోధపడేవాణ్ణీ, సముద్రవర్తకంచేసేవాణ్ణీ మొదట దొంగతనాలతో డబ్బు సంపాదించి, తరవాత ఆడబ్బుతో వర్తకంచేసేవాణ్ణీ సోది చెప్పేవాణ్ణీ, వైద్యుణ్ణీ, పగవాణ్ణీ, స్నేహితుణ్ణీ నాటకాల్లో వేషంవేసే వాణ్ణీ—వీరిని ఎందులోనూ సాక్షులుగా పెట్టుకోగూడదు.

ఇళ్ళు తగలబెట్టేవాడూ, విషంపెట్టేవాడూ, కుండుని యింట భోజనం చేసేవాడూ, సోమరసం అమ్ముకునేవాడూ, కత్తులూ బాణాలూ మొదలైన ఆయుధాలు చేసి జీవించేవాడూ, కొండేలు చెప్పేవాడూ, మిత్రులయినవారికి ద్రోహాలు చేసేవాడూ, పరస్త్రీలను కూడేవాడూ, గురువు భార్యను కూడేవాడూ, భ్రూణహత్యలు చేసే వాడూ, మధ్యపానం చేసే బ్రాహ్మడూ, అతికఠినహృదయంగలవాడూ, అసలే దుఃఖిస్తున్నవాళ్ళని బాధపెట్టి మళ్ళీమళ్ళీ యేడ్పించేవాడూ, నాస్తికుడూ, వేదాలునిందించేవాడూ, స్రువప్రగ్రహణుడు—అంటే రాజకీయాల ప్రాబల్యంతో వర్తకులవల్ల లంచాలు పుచ్చుకునే వాడూ, వ్రాత్యుడు—అంటే యుక్తసమయాన ఉపనయనం కానివాడూ, రక్షించమంటూవచ్చి శరణుచొచ్చినవాణ్ణి తానే నాశనంచేసేవాడూ, ఆత్మజ్ఞానం వుండీన్నీ వ్యవసాయం చేసే బ్రాహ్మడూ — వీళ్లందరూ బ్రహ్మహత్యలు చేసినవాళ్ళతోసమానులు.

పుటంపెడితే, బంగారం మంచిదవునో కాదో తెలుస్తుంది. ప్రవర్త నను బట్టి మనిషిగుణం తెలుస్తుంది. వ్యవహారాన్నిబట్టి మనిషి సజ్జ నుడో దుర్జనుడో తెలిసిపోతుంది. భయంకలిగి నప్పుడు శౌర్యమూ,

డబ్బుచిక్కులు వచ్చినప్పుడు ధైర్యమూ, ఆపదలు వచ్చినప్పుడు స్నేహమూ, చారుల యోగ్యతా తెలిసిపోతాయి.

ముదిమితో చక్కదనం పోతుంది. ఆశలు పెరిగితే ధైర్యం చెడి పోతుంది. మృత్యువుతో ప్రాణాలు పోతాయి. అసూయ వుంటే ధర్మం భ్రష్టం అయిపోతుంది. క్రోధంవల్ల సంపదలు హరించిపోతాయి. దుర్జనులకు సేవలు చేస్తే శీలం చెడిపోతుంది. కామంవల్ల సిగ్గు హరించి పోతుంది. గర్వంతో సకలమూ నాశనం అయిపోతుంది.

సంపద మంచిపనులవల్ల కలుగుతుంది. తెలివితేటలవల్ల పెరుగు తుంది. శక్తిసామర్థ్యాలవల్ల నిలుస్తుంది. మనోనిగ్రహంవల్ల స్థిరపడి పోతుంది. ప్రజ్ఞా, మంచికుటుంబంలో పుట్టడమూ, దమమూ, వేద వేదాంగాలు నేర్చుకోడమూ, పరాక్రమమూ, మితంగా మాట్లాడ్డమూ, యథాశక్తిగా దానధర్మాలు చెయ్యడమూ, చేసినమేలు జ్ఞాపకం పెట్టుకోడమూ — ఇవన్నీ చాలాగొప్ప గుణాలు. పురుషుణ్ణి రాణింపచేస్తా యివి. అయితే, రాజు సత్కరించినప్పుడే వీటికి విలవ యేర్పడుతుంది.

యజ్ఞాలు చెయ్యడమూ, దానాలు చెయ్యడమూ, వేదాలు చదువు కోడమూ, తపస్సు చెయ్యడమూ, ఇంద్రియాలు నిగ్రహించుకోడమూ, సత్యమే పలకడమూ, ఋజువుగా నడుచుకోడమూ, దయకలిగి వుండడమూ — ఇవి యెనిమిదీ మిక్కిలీ గొప్ప సుగుణాలు. చనిపోయిన తరవాత యివిగల మనిషి స్వర్గంలో చిరకాలం సుఖిస్తాడనడాని కివి నిదర్శనాలు. అయితే, వీటిలో మొదటి నాలుగూ మనిషి ప్రయత్న పూర్వకంగా సాధించుకోవలసినవి. తక్కిన నాలుగూ నేర్చుకుంటే వచ్చేవి కావు. సజ్జను లయినవారికే కలిగే నవి.

ధర్మమార్గాన నడుచుకోవా లంటే, ఆమార్గా లెనిమిది. యజ్ఞం చెయ్యడమూ, వేదవేదాంగాలు చదువుకోడమూ, దానాలు చెయ్య

డమూ, తపస్సు చెయ్యడమూ, సత్యం పలకడమూ, క్షమా, దయా, లోభం లేకపోడమూ, — ఇవీ అవి. వీటిలో మొదటి నాలుగూ కావా లంటే ఎవరయినా చెయ్యవచ్చు. చాలామంది వేషంకోసం చేస్తారు. చివరి నాలుగూ నిజంగా మహానుభావు లయినవారు గాని చెయ్యలేరు.

పెద్దలు లేనిది సభ కాదు. ధర్మం చెప్పనివారు పెద్దలు కారు. సత్యం లేనిది ధర్మం కాదు. మోసం వున్నది సత్యమున్నా కాదు. సత్యమూ, వినయమూ, వేదాలు చదువుకోడమూ, మంత్రోపాసనా, మంచికుటుంబంలో పుట్టడమూ, శీలమూ, బలమూ, ధనమూ, శౌర్యమూ, యుక్తియుక్తంగా మాట్లాడ్డమూ — ఇవి పదీ స్వర్గంలో సకలసుఖాలూ కలిగిస్తాయి. పాపంచేస్తే పాపాత్ము డన్న పేరుపొందు తాడు. దాంతో, బతికివున్నంతకాలమూ పాపాలే చేస్తాడు. అందుకు తగ్గ చెడ్డఫలాలే అనుభవిస్తా డెప్పుడూ. పుణ్యంచేస్తే పుణ్యాత్ము డన్న పేరుపొందుతాడు. ఎప్పుడూ పుణ్యకార్యాలే చేస్తాడు. అందుకు తగ్గ మంచిఫలాలే అనుభవిస్తాడు. అంచేత, మనిషి అయినవా డెవ్వడూ పాపంచెయ్యగూడదు. దీక్షపట్టి అలాంటిపనులు మానుకోవాలి. లేక పోతే ప్రజ్ఞ అంతా నాశనం అయిపోతుంది. ప్రజ్ఞ నాశనం అయిపోయిన వాడు, పాపంమీద పాపమే చేస్తూవుంటాడు. బతికివున్నంతకాలమూ. మరి, పుణ్యం అయితే, ప్రజ్ఞను వృద్ధిచేస్తుందది, ప్రజ్ఞ ఎక్కువ అయిన వాడు ఎల్లప్పుడూ సత్కార్యాలే చేస్తాడు. అంచేత ప్రతీవాడూ శ్రద్ధ పట్టి సత్కార్యాలే చేస్తూ పుణ్యం సంపాదించుకోవాలి.

అసూయ కలవాడూ, ఇతరుల రహస్యాలు బయటపెట్టేవాడూ, నిష్ఠురంగామాట్లాడేవాడూ, విరోధాలుపెట్టేవాడూ, మోసకారీ — వీళ్ళు చేసేవన్నీ పాపాలే. పొందేవన్నీ పాపఫలాలే. అసూయ లేని వాడూ, మంచిచెడ్డలు గుర్తించగలవాడూ — వీరు చేసేవన్నీ పుణ్యాలే. పొందేవన్నీ పుణ్యఫలాలే.

ప్రాజ్ఞులతో తిరుగుతూ వారి దగ్గరవున్న ప్రజ్ఞ మాత్రమే సంపాదించుకునేవాడు, ప్రజ్ఞగల పండితు డవుతాడు. ధర్మార్థాలున్నూ సంపాందించుకుంటాడు. సుఖపడతాడు. రాత్రి అంతా సుఖంగావుండాలంటే కష్టపడి అందుకొావలసిన సాధనసామగ్రి అంతా పగలే సంపాదించుకోవాలి. వర్షాకాలం నాలుగు మాసాలూ సుఖపడాలంటే, అందుకోసం తక్కిన ఎనిమిదిమాసాలూ జాగ్రత్తపడాలి. ముదిమి వచ్చాక సుఖపడాలంటే అందుకు పడుచుతనంలోనే సకలమూ సంపాదించుకోవాలి. చనిపోయాక శాశ్వతంగా స్వర్గసుఖా లనుభవించాలంటే బతికివున్నంతకాలమూ అందుకోసం పాటుపడుతూ వుండవలిసిందే.

చక్కగా జీర్ణం అయితేనే అన్నం మంచి దంటారు. వయసు చెల్లాకే భార్యను మంచి దంటారు. యుద్ధంలో జయించుకువస్తేనే శూరుణ్ణి మెచ్చుకుంటారు. తత్వజ్ఞానం పొందితేనే తపస్సుచేసినవాణ్ణి వోహో అంటారు. అక్రమంగా డబ్బు సంపాదించి దాంతో తన లోపాలు మాటుపరుచుకుందా మంటే లాభంలేదు, సరికదా, కొత్త లోపాలు మరికొన్ని బయటికి వస్తాయి.

ఆత్మజ్ఞానం కలవాళ్ళకి గురువే శాసకుడు. దుర్మార్గులకు రాజే శిక్షకుడు. పరమరహస్యంగా పాపాలు చేసేవాళ్ళకి యముడే బుద్ధిచెప్పేవాడు. నదులు పుట్టిన స్థలాలూ, మహర్షుల జన్మరహస్యాలూ, మహాత్ముల కులాలూ, స్త్రీలు చేసే దుష్కృత్యాలూ — ఇవి తెలుసుకోడం యెవరికీ సాధ్యం కాదు.

బ్రాహ్మలను పూజించేవాడూ, జ్ఞాతులయెడల ఆదరాభిమానాలు కనబరిచేవాడూ, మంచినడత నడిచేవాడూ - ఇలాంటి క్షత్రియుడే చిరకాలం రాజ్యం యేలగలడు. శూరుడూ, బాగా చదువుకున్నవాడూ, చక్కగా సేవలుచెయ్యగలవాడూ — ఈముగ్గురికే యీభూమి బంగారుపూలు పూస్తుంది. బుద్ధిబలంతో సిద్ధించే కార్యాలు త్తమాలు.

బాహుబలంతో సిద్ధించే కార్యాలు మధ్యమాలు. మోసంచేస్తే సిద్ధించే కార్యాలు అధమాలు. సిద్ధించాక మనిషిని కుంగతీసే కార్యాలు నీచాతినీచాలు.

రాజేంద్రా! రాజ్యాధికారం అంతా దుర్యోధనునికీ, శకునికీ, శుద్ధ మూఢుడైన దుశ్శాసనునికీ, అంతటివాడే అయిన కర్ణునికీ కట్టబెట్టావు. ఐశ్వర్యం పట్టమంటే యిక నీకెలాపడుతుంది? పోనీ, పాండుపుత్రుల సంగతి చూస్తామా? ఉండవలసిన మంచిగుణాలన్నీ వున్నాయి వారిదగ్గిర. పైగా, నిన్ను, వారు తండ్రిగా చూసుకుంటున్నారు. నువ్వు వారిని కొడుకులుగా చూసుకో"

## 36

## మంత్రోపదేశం 4

"ఈసందర్భంలో యిక్కడ వుదహరించవలసిన యితిహాసం వొకటుంది. చాలా పురాతనం అది. ఆత్రేయుడికీ దేవతల్లో వొక వర్గానికి చెందిన సాధ్యులకూ జరిగిన సంవాదం. ఆత్రేయమహర్షి, అప్పుడు, పరివ్రాజకరూపాన (హంస) సంచరిస్తున్నాడు.

"మహాత్మా, మేము సాధ్యులం. నువ్వెవరవో గుర్తించకుండా వున్నాం మేము. అయితే, నువ్వు సకలవిద్యలూ తెలిసిన మహానుభావుడ వని తోస్తోంది మాకు. కనక, మాకేమయినా మంచిమాటలు చెప్పు" అని కోరారు సాధ్యులు.

దీనిమీద ఆత్రేయు డందుకున్నాడు.

"ఇది నాకు తెలుసు. సాధ్యులారా, చెబుతావినండి. ప్రతీ వాడూ కూడా, ధైర్యంవహించి ఇంద్రియాలను జయించి, సత్యమూ ధర్మమూ తప్పకుండా నడుచుకుంటూ హృదయగ్రంథి విప్పుకుని, సుఖదుఃఖాలూ, ప్రియాప్రియాలూ — ఇలాంటి ద్వంద్వాలు విడిచి లోకం

అంతా ఆత్మవతుగా చూసుకోవాలి. తన బాగు చూసి యెవ రైనా యేడిస్తే వారి నేమీ అనగూడదు. వినీవిననట్టు శాంతించి వూరుకోవాలి. అలాచేస్తే తనలోవున్న కోపం ఆయేడ్చేవాణ్ణే కాల్చేస్తుంది. అంతేకాదు. ఆయేడ్చేవాడు చేసుకున్న సుకృతం అంతా అశాంతించినవాడికి చెందుతుంది. కనక, ఎవరిని చూసీ తానేడవగూడదు. ఎవరినీ అవమానించగూడదు. మిత్రులకు ద్రోహం చెయ్యగూడదు. నీచుల చుట్టూ తిరగరాదు. గర్వించగూడ దెందుకూ. నీచవృత్తుల్లో దిగిపోగూడదు. పరుషంగా ఎవరనీ తూలనాడగూడదు.

పరుషవాక్కులు ఎదటివాడి మర్మాలు దూసుకుపోతాయి. ఎముకలు కొరికేస్తాయి. గుండెలు చీల్చేస్తాయి. ప్రాణాలున్నూ తీసేస్తాయి. కనక, ధర్మాని కట్టుబడి యెవరూ యెవరియెడలా పరుషంగా మాట్లాడగూడదు. అలా మాట్లాడి యితరులను ఖేదపరిచేవాడు సర్వవిధాలా చెడిపోతాడు. వాడి మొగాన మృత్యుదేవతా దరిద్రదేవతా తాండవంచేస్తూ వుంటాయి. ఎవడయినా, సూర్యుడు లాగా అగ్ని లాగా కాల్చేసే బాణాలతో తనని కొడితే, ఆదెబ్బలుతిన్నవాడు, ఎదటివాడు తనకి సుకృతం — అంటే స్వర్గసుఖం కలిగిస్తున్నా డనుకోవాలి. ఈసంగతి పండితు డైనవాడే గ్రహించగలడు. యుద్ధంలో చచ్చిపోయినవాడు వీరస్వర్గం పొందుతాడు. మరి, నాటకంలో వేషం వేసేవాడు, తాను తానుగా కాక, మరొక డన్నట్టు ప్రవర్తిస్తాడు. అలాగే, మనిషి, దుర్మార్గుడితో సహవాసం చేస్తే దుర్మార్గు డయిపోతాడు. మంచివాడితో సహవాసం చేస్తే మంచివాడున్నూ అయిపోతాడు. తపశ్శాలి నాశ్రయిస్తే తానూ తపశ్శాలి అయిపోతాడు. దొంగతో స్నేహంచేస్తే దొంగ అవుతాడు. ఎవడూ అతివాదం చెయ్యగూడదు. తాను చేయించనూ గూడదు. ఎవరయినా తననికొట్టినా మారు దెబ్బ కొట్టగూడదు. అలా చేసేవాణ్ణి దేవత లనుగ్రహిస్తారు.

ఏదో వొకటి మాట్లాడ్డంకంటే యేమీ మాట్లాడకుండా వుండడం మంచిది. మాట్లాడక తప్పనిసరి అయితే, సత్యం పలకడం మంచిది. అసత్యమున్నా ప్రియంగా చెప్పడం మంచిది. అలా ప్రియంగా చెప్పడంలో కూడా ధర్మమే చెప్పడం అన్నిటికంటేనూ మంచిది. మనిషి, తానెవరితో మాట్లాడతాడో, ఎవరి నాశ్రయించుకుతిరుగుతాడో తానూ అలాంటివాడే అవుతాడు. సహజంగా తానెలాంటివాడు కావా లనుకుంటే అలాంటివాడే అయిపోతాడు.

ఏపనీ చెయ్యకపోతే యేపాపమూ అంటదు. అలా వుండగలవాడు ఎవరినీ జయించా లనుకోడు. ఎవరికీ తానోడిపోడు. ఎవరితోనూ విరోధం పెట్టుకోడు. ఎవరినీ మారుదెబ్బ కొట్టడు. దూషణా భూషణా కూడా ఆమనిషికి సమానమే అవుతాయి. ఆమనిషి యెందుకూ దుఃఖించడు. ఎందుకూ ఉబ్బిపోడు.

ఉత్తము డైనవా డెప్పుడూ, ఇతరులకు క్షేమం కలగా లనే కోరుతూ వుంటాడు. కష్టాలు సంభవించా లనుకోడు. ఎప్పుడూ సత్యమే పలుకుతాడు. వినయంగానే నడుచుకుంటాడు. శాంతే కోరుతూ వుంటాడు కూడా. మధ్యము డున్నాడు. ఆమనిషి పోడిమాటలు చెప్పడు. ఇస్తానంటే యివ్వడమే పెట్టుకుంటాడు. ఇతరుల కెందులో యెలాంటి లోట్లున్నాయో అవి పరిశీలించుకుంటూ వుంటా డెప్పుడూ.

ఇక అధము డున్నాడు. అలాంటి దుర్జనుడు ప్రపంచంలో మరొకడుండడు. ఆమనిషి ఒకమాటమీద వుండడు. ఒకరిమాట వినడు. తన కుపకారం చేసినవాళ్లకున్నా అపకారం చేస్తాడు. దెబ్బలు తింటాడు. తిట్లు తింటాడు. కోపం తగ్గించుకోలేడు. చేసినమేలు మరిచిపోయి కీడే చేస్తా డితరులకు. ఎవరితోనూ స్నేహంగా వుండడు. ఇవన్నీ అధముడి కళావిశేషాలు. ఇంతేకాదు, ఆమనిషి, ఎవరికీ మేలుకోరడు. ఎవరినీ నమ్మడు. స్నేహితులను కూడా తెగనాడతాడు. కనక తనకు

క్షేమమూ, శ్రేయస్సూ కోరుకునేవా డెవడూ కూడా అధములను కళ్లతోనయినా చూడగూడదు. మధ్యములతోనైనా తప్పనిసరి అయితేనే కలుసుకుంటూ వుండాలి. ఉత్తములను మాత్రం యెప్పుడూ సేవించుకుంటూ వుండాలి. అధముడు తన క్రూరకృత్యాలవల్ల డబ్బు సంపాదించవచ్చు. తన ప్రజ్ఞవల్లా, తన పురుషకారంవల్లా అభ్యుదయమున్నూ పొందవచ్చు. వాణ్ణెవరూ యెప్పుడూ మెచ్చుకోరు. మంచి కుటుంబాల్లో పుట్టినవాడి లక్షణం వొక్కటీ అబ్బదు వాడికి.

ఇది విని ధృతరాష్ట్రుడు "విదురా, దేవతలూ, ధర్మార్థాలు తెలిసినవారూ, వేదవేదాంగాలు నేర్చినవారూ, మహాకులా లంటూ వుంటారే, అవంటే యెలాంటివి?" అనడిగాడు. దానిమీద విదురుడు మళ్ళీ అందుకున్నాడు.

"తపస్సూ, ఇంద్రియనిగ్రహమూ, బ్రహ్మజ్ఞానమూ, యజ్ఞయాగాలు చెయ్యడమూ, శాస్త్రోక్తంగా వివాహాలు చేసుకోడమూ, ఎప్పుడూ అన్నదానం చేస్తూవుండడమూ — ఈయేడూ యెప్పు డెవరు చక్కగా నెరవేర్చుకుంటూ వుంటారో వారి కుటుంబాలే మహాకులాలు. మంచి శీలం గలవారూ, వ్యభిచారాదిదోషాలు లేనివారూ, మనస్సు నిగ్రహించుకుని ధర్మమార్గాన సంచరించేవారూ, సత్కీర్తి సంపాదించుకోవా లని తాపత్రయపడేవారూ, ఎన్నడూ అబద్ధం ఆడనివారూ వీరి కుటుంబాలు మహాకులాలు.

యజ్ఞయాగాలు చెయ్యకపోయినా, మంచీ చెడ్డాలేకుండానూ, చూసుకోకుండానూ వివాహాలు చేసుకున్నా, వేదాలు నిందించినా, ఎంతెంత లేసి కుటుంబాలూకూడా దుష్కులా లయిపోతాయి. దేవతాద్రవ్యం హరించడమూ, బ్రాహ్మలద్రవ్యమున్నూ హరించడమూ, బ్రాహ్మలను పూజించకపోడమూ, బ్రాహ్మలను నిందించడమూ, ఇతరులు తమదగ్గిర

దాచుకున్న డబ్బు కొట్టెయ్యడమూ — ఇలాంటి పనులవల్లకూడా ఎలాంటి ఉత్తమకుటుంబాలున్నూ దుష్కులా లయిపోతాయి.

ఎన్ని ఆవులున్నా, పురుషు లెంతగొప్ప వాళ్లయినా, ఎంత డబ్బున్నా వుండినా, శీలం మంచిది కాకపోతే ఆకుటుంబం మహాకులం అనిపించుకోదు. శీలంవుంటే డబ్బు లేకపోయినా మంచికులంకిందే లెక్క. దానికి సత్కీర్తిన్నీ వస్తుంది. అంచేత బాగా శ్రద్ధపట్టి శీలం రక్షించుకోవాలి. డబ్బు వొక లెక్కలోది కాదు. అది వస్తుంది పోతుంది. దరిద్రం అంటే డబ్బు లేకపోడం కాదు, శీలం లేకపోడం. శీలం పాడుచేసుకున్నాడా, వాడు పతితు డయిపోయా డన్నమాట. ఎన్ని ఆవు లున్నా, యెన్ని పశువు లున్నా, యెన్ని గుర్రా లున్నా, ఎంత కృషి వుండినా, శీలం లేకపోతే అవి మహాకులాలు కావు.

విరోధాలు పెట్టేవాడూ, ఇతరుల ద్రవ్యం కాజేసేవాడూ, మిత్రులకు ద్రోహం చేసేవాడూ, కపటంగా ప్రవర్తించేవాడూ, అబద్ధం ఆడేవాడూ, పితృదేవతలకూ, దేవతలకూ అతిథులకూ పెట్టకుండా తానే ముందు భోజనంచేసేవాడూ, బ్రాహ్మలను చంపేవాడూ, బ్రాహ్మలను ద్వేషించేవాడూ, కృషిచెయ్యనివాడూ మనకుటుంబంలో రాజూ మంత్రీకూడా అయి వుండగూడదు. గడ్డీ, భూమి, నీరూ, సత్యవాక్కూ — ఇవి సజ్జనుల యిళ్లల్లో యెప్పుడూ వుంటాయి. తినిశవృక్షం యెంత చిన్నదైనా పెద్దపెద్ద బరువులు భరించగలదు. తక్కిన చెట్లకాశక్తి లేదు. మంచికులాల్లో పుట్టినవా రలాగ యెంతకైనా తగివుంటారు. తక్కినవా రెందుకూ పనికిరారు

కోపంవస్తుం దేమో అని అప్రియం అయినా నిజం చెప్పనివాడు మిత్రుడు కాడు. అనుమానాస్పదంగా ప్రవర్తించేవాడున్నూ మిత్రుడు కాడు. ఎవడిమీద తండ్రిమీద కలిగే విశ్వాసం కలుగుతుందో వాడే మిత్రుడు. ఇతరులు కారు. ఎప్పుడూ వెంటపడి తిరిగేవా రందరూ

మిత్రులు కారు. ఎలాంటి బంధుత్వమూ లేకపోయినా అంటిపెట్టుకుని వుండి చలసంలేని మైత్రి చూపించేవాడే మిత్రుడు. అతనే బంధువు. అతనే గతి. అతనే పరాయణముచ్చు. చలచిత్తుడికీ, పెద్దలమాట విననివాడికీ ఎక్కడికక్కడే భ్రాంతిపడుతూ వుండేవాడికీ మిత్రులుండరు.

హంసలు నీరెండిపోయిన సరస్సులు విడిచిపెట్టి మరోచోటికి వెళ్లిపోతాయి. స్థిరబుద్ధి కానివాణ్ణీ, ఆత్మజ్ఞానం లేనివాణ్ణీ, ఇంద్రియాలను నిగ్రహించుకోలేనివాణ్ణీ సంపదలలాగే విడిచిపెట్టేస్తాయి. అప్పటికప్పుడే యెందుకో కోప్పడతారు కొందరు. అప్పటికప్పుడే మళ్లీ దయ చూపిస్తారు, ఏమీ కారణం లేకుండా. నీచుల స్వభావం యిది. గట్టిగా గాలి వీచితే పికాపికాలయిపోయే మేఘాలవంటివాళ్లు నీచులు. మిత్రులవల్ల ఉపకారాలు పొందీ, లాభాలు పొందీ సమయం వచ్చినప్పుడాదుకోనివాళ్లు కృతఘ్నులు. చచ్చిపోయాక వాళ్లని కుక్కలూ నక్కలూ కూడా ముట్టవు. డబ్బున్నా లేకపోయినా, మిత్రులను ఆదరిస్తూనే వుండాలి. లుబ్ధుడయినవాడు మిత్రుల స్వభావంగుర్తించలేడు.

ఆత్మీయులను పిడిచిపెట్టుకుని విచారిస్తూ కూచుంటే రూపం మారిపోతుంది. బలపరాక్రమాలు సన్నగిల్లిపోతాయి. తెలివి తెల్లారిపోతుంది. రోగాలున్నూ వెంటబడతాయి. ఏదీ కలిసిరాదు. శరీరం కూడా చిక్కి శల్యం అయిపోతుంది. శత్రువు లిదంతా చూసి మిక్కిలీ సంతోషిస్తారు. కనక, దుఃఖంమాత్రం యెప్పుడూ చేరనిచ్చుకోకు. మనిషియినవాడు మళ్ళీమళ్ళీ పుడుతూనూ వుంటాడు, చస్తూనూ వుంటాడు. మళ్ళీ మళ్ళీ చెడిపోతాడు, బాగుపడుతాడు. మళ్ళీమళ్ళీ వొకరిని దేవిరిస్తూనూ వుంటాడు, వొకరికిస్తూనూ వుంటాడు. మళ్ళీమళ్ళీ దుఃఖిస్తూనూ వుంటాడు, పొంగిపోతూనూ వుంటాడు. సుఖదుఃఖాలూ, చావుపుట్టుకలూ, లాభనష్టాలూ — ఇవి వస్తూనూ వుంటాయి, పోతూనూ వుంటాయి. అంచేత, ధీరుడైనవా

డెప్పుడూ పొంగిపోగూడదు, కుంగిపోగూడదు. కళ్ళూ, చెవులూ ముక్కులూ, నాలుకా, చర్మమూ, మనస్సూ — ఈ ఆరింద్రియాల్లో యేది స్వాధీనంలో వుండకపోయినా, దానిమూలంగా, వోటికుండలో నీటిలాగ బుద్ధి దిగజారిపోతూనే ఉంటుంది.

ఇదంతా విని, ధృతరాష్ట్రుడు, "విదురా, ధర్మనందనుడు మిక్కిలీ శాంతమూర్తి. కాని నేనతని కెన్నో అపకారాలు చేశాను, లోపల్లోపల. అదంతా మనస్సులో పెట్టుకుని రవిలిపోతున్నాడతను. నాకొడుకులు చూస్తామా, మిక్కిలీ అవివేకులు. అంచేత, ధర్మనందనుడు, ఎప్పుడో వొకప్పుడు యుద్ధంలో నాకొడుకులను నాశనంచెయ్యక మానడు. ఇది తలుచుకుంటే నామతిపోతోంది. నామనస్సునూ కలిగిపోతోంది. దీని కేదయినా విరుగుడు చెప్పు నాయనా" అనడిగాడు. దీనిమీద విదురుడు మళ్ళీ ప్రారంభించాడు.

"రాజేంద్రా! నిశ్చలంగా నువ్వు తపస్సుచెయ్యాలి. ఇంద్రియాలు నిగ్రహించుకోవాలి. త్యాగాలు చెయ్యాలి. శాంతి కలగాలంటే యింతకంటే మరో మార్గంలేదు. బుద్ధి వుంటే భయం పోతుంది. తపస్సు చేస్తే గొప్పతనం కలుగుతుంది. యోగాభ్యాసం చేస్తే శాంతికలుగుతుంది. వేదవేదాంగాలు చదవకపోయినా, దానధర్మాలు చెయ్యకపోయినా రాగద్వేషాలు విడిచిపెడితే చాలు, మోక్షం లభిస్తుంది. శ్రద్ధగా వేదాలు చదువుకున్నవారికీ, వెనకంజ వెయ్యకుండా నిర్భయంగా యుద్ధంచేసినవారికీ, మంచిపనులు చేసినవారికీ, దీక్షగా ఘోరతపస్సు చేసినవారికీ చివరికి, సుఖం కలిగితీరుతుంది.

భేదబుద్ధిగలవాళ్లు హంసతూలికాతల్పాలమీద పడుకునీగూడా సుఖనిద్ర అనుభవించలేరు. ఎంత చక్కని స్త్రీలు లభించినా హాయిగా సుఖపడలేరు. వందిమాగధులు అంతూ దరీ లేకుండా స్తోత్రపాఠాలు చదివినా సంతోషించలేరు. ధర్మమార్గాన సంచరించలేరు. సుఖమూ

ఆనందమూ అనుభవించలేరు వాళ్లు. గౌరవాదరాలు సంపాదించుకోలేరు. శాంతంగా బతకాలేరు. ఎంత మంచిమాటలూ కూడా వారికి రుచి చవు. వారికి క్షేమం వుండనే వుండదు. చివరికి సర్వనాశనం తప్ప, వారికి మరోగతి పట్టదు.

గోవులదగ్గిర చూడవలసింది పాడిపంటలు. బ్రాహ్మల దగ్గిర చూడ వలసింది తపస్సు. స్త్రీలదగ్గిర చాపల్యం వుండకుండా వుండదు. జ్ఞాతుల వల్ల భయమున్నా తప్పదు. దారా లెంత సన్ననివయినా కొన్ని కలిస్తే బలపడి ఎంతకైనా చాలతాయి. అలాగే సజ్జనులున్నా పది మందీ కలిస్తే యెలాంటి కష్టాలున్నా సహించగలరు. కొరకంచులు వేరువేరుగా పడివుంటే పొగమాత్రమే వస్తుంది. అన్నీ కలిస్తే భగభగ మండుతాయి. జ్ఞాతుల సంగతీ అంతే.

బ్రాహ్మలయెడలా, స్త్రీలయెడలా, జ్ఞాతులయెడలా, గోవులయెడలా దౌర్జన్యం కనబరిచేవాడు, చెట్టున మిగలముగ్గిన పండులాగ త్వరలోనే రాలిపోతాడు. చెట్టెంత పెద్దదిగా వుండినా, దానికెన్ని బోట్లున్నా వొగ్గినా ఒక్కటే వుంటే సుడిగాలికి కుప్పగా కూలిపోతుంది. అలాంటి చెట్లు కొన్ని కలిసివుంటే మాత్రం యెలాంటి గాలివిసుళ్లకీ తట్టుకుని వుండగలుగుతాయి. మనుష్యుల విషయం కూడా యింతే. మనిషి యెంత సమర్థుడయినా వొక్కడే అయితే, సులభంగా భంగపడి పోతాడు. పదిమందీ కలిస్తే వారి నెవరూ యేమీ చెయ్యలేరు. జ్ఞాతులున్నా వొక్కమాటమీద వుండగలిగితే వారిని పట్టపగ్గా లుండవు.

బ్రాహ్మలూ, ఆవులూ, జ్ఞాతులూ, శిశువులూ, స్త్రీలూ, తమకన్నం పెట్టి పోషించినవారూ, శరణుపొందినవారూ — వీరి నెవరూ చంపగూడదు. డబ్బుండడం వొక్కటే మనుష్యులకు గుణం. ఆరోగ్యం వుండడమున్నా అలాంటిదే మరో గుణం. డబ్బులేకపోయినా ఆరోగ్యం లేకపోయినా మనుష్యులు చచ్చినవాళ్లలోనే లెక్క. రోగగ్రస్తులు

పుత్రపౌత్రు లెందరున్నా, పాడిపంటలున్నా ఎంతగా వుండినా సుఖప డలేరు. ధనంవల్ల సిద్ధించేభోగాలు వారు గుర్తించనే లేరు. సౌఖ్యం అసలే అనుభవించలేరు.

వెనకటికి, ద్రౌపది జూదంలో వోడిపోయినప్పుడు "దుర్యోధనుణ్ణి మందలించు. జూదం మాన్పించు" అని నేను చెప్పినమాటలు నువ్వు వినిపించుకోలేదు. పండితు డైనవా డెవడూ కూడా జూదం అంగీకరిం చడు. మెత్తనివాడితో కయ్యంపెట్టుకోడం, అదొకబలపరాక్రమాల కిందే లెక్క అవుతుందా? ధర్మం చాలా సూక్ష్మ మైనది. వెంటనే ఆచరణలో పెట్టడమే అది తెలిసినందుకు ప్రయోజనం. క్రూరకృ త్యాలు చేసి సంపాదించిన డబ్బు నిలవదు. ధర్మంగా సంపాదించిన డబ్బు పుత్రపౌత్రపారంపర్యంగా అనుభవానికి వస్తుంది.

నీకొడుకులు పాండుపుత్రులనూ, పాండుపుత్రులు నీకొడుకులనూ ఆదుకోడం చాలామంచిది. కౌరవులకూ పాండవులకూ మిత్రు లయినా శత్రువు లయినా వొక్కరుగానే వుండాలిగాని, వొకరి శత్రువు లొకరికి మిత్రులూ, వొకరి మిత్రులొకరికి శత్రువులూ అయివుండ గూడదు. కలిసివుంటేనే నీకొడుకుల కయినా, పాండుపుత్రుల కయినా క్షేమమూ సుఖమున్నూ.

కౌరవుల కందరికీ నువ్వే మూలవిరాట్టువి. కౌరవకులం అంతా నీఅధీనంలో వుందిప్పుడు. అరణ్యాల్లో తిరుగుతూ నానా కష్టాలూ అనుభవించివచ్చిన పాండుపుత్రులను నువ్విప్పుడు చూడుకోవాలి. దాని వల్ల నీకు గొప్పకీర్తి కలుగుతుంది కనక, నువ్వు, నీకొడుకులనూ పాండుని కొడుకులనూ ఏకంచెయ్యి. మీలో మీరు భేదాలు పెంచుకుంటే, దానివల్ల శత్రువులు బలపడతారు. అందుకవకాశం కలగనివ్వకు. పాండుపుత్రులు సత్యాని కట్టుబడివున్నారు. నీకొడుకులున్నూ అలా వుండేటట్టు చూసుకో.

37

# మంత్రోపదేశం 5

"రాజేంద్రా! తనమాట లక్ష్యపెట్టనివాణ్ణి ఆజ్ఞాపించేవాడూ, కొద్ది లాభానికే మిక్కిలీ పొంగిపోయేవాడూ, పగవాణ్ణి నమ్ముకుని వెంటబడి తిరిగేవాడూ, స్త్రీలను రక్షించడమే ప్రధానం అనుకునేవాడూ, కోరతగనివాణ్ణి అదియిమ్మనీ, యిది యిమ్మనీ కోరేవాడూ, ఆత్మస్తుతి చేసుకునేవాడూ, మంచికుటుంబంలో పుట్టివుండిన్నీ చెడ్డపనులు చేసేవాడూ, తాను దుర్బలు డయ్యుండిన్నీ మిక్కిలీ బలవంతు డయినవాడితో విరోధంపెట్టుకునేవాడూ, శ్రద్ధలేనివాడికి చదువుచెప్పడానికి పూనుకునేవాడూ, కోరగూడనిది కోరేవాడూ, భయమూ, అవమానమూ గుర్తించక కొడుకు భార్యతో - కోడలితో సయ్యాటలాడేవాడూ, కోడలితో వ్యభిచరిస్తూవుండిన్నీ తన్నెవడూ యేమీ చెయ్యకూడ దనీ, తనకి గౌరవంకూడా చెయ్యా లనీ అనుకునేవాడూ, పరస్త్రీలయందు బిడ్డలను కనేవాడూ, హద్దూపద్దూ లేకుండా స్త్రీలమీద నీలాపనిందలు వేసేవాడూ, తన కితరులు చేసిన మేలు మరిచిపోయి "నాకెవరూ యెప్పుడూ యేమీ మేలుచెయ్యలే" దని చెప్పేవాడూ, తీర్థక్షేత్రాల్లో బ్రాహ్మల కేదోయిస్తా నని వాగ్దానం చేసివుండి, తరవాత వచ్చి ఆబ్రాహ్మడు ఆవాగ్దానం చెల్లించవలసిం దని కోరితే యివ్వకుండానే పంపేసి "ఆబ్రాహ్మల కది యిచ్చా నిది యిచ్చా" నని అందరితోనూ చెప్పుకునేవాడూ, దుర్జనుడికి ధర్మం చెప్పడానికి సిద్ధకిపడేవాడూ — ఈపదిహేడుగురూ, పిడిగుద్దులతో ఆకాశం పడగొట్టడానికీ, ఇంద్రధనుస్సు వంచడానికీ, సూర్యకిరణాలు మూటగట్టడాని ప్రయత్నించే మూర్ఖు లని స్వాయంభువమనువు చెప్పివున్నాడు. వీళ్ళను యమకింకరులు పాశాలతో కట్టి నరకానికి తీసుకుపోతారు. ఇతరులు

తమయెడల యెలా నడుచుకుంటారో, తామూ వారియెడల అలాగే నడుచుకోవాలి, మనుష్యులు. మాయచేసేవాణ్ణి మాయచెయ్యడమూ, మంచిచేసేవాణ్ణి మంచిచెయ్యడమూ — ఇదే పరమధర్మం".

ఇది విని ధృతరాష్ట్రుడు "విదురా, సకలవేదాల్లోనూ పురుషునికి నూరేళ్లాయు వని చెప్పింది. మరి, అందరూ నూరేళ్లు బతకడంలే దెంచేతా?" అనడిగాడు. విదురుడు మళ్ళీ ప్రారంభించాడు.

"రాజేంద్రా, అతి అభిమానమూ, అతిగా వాదించడమూ, ఇళ్లు తగలబెట్టీ, దోచుకునీ, విషంపెట్టి చంపీ — ఇలాంటి ఘోరాలు, చెయ్యడమూ, క్రోధంవహించడమూ, ఎంతసేపూ తన కడుపుకోసమే చూసుకోడమూ, మిత్రులకు ద్రోహం చెయ్యడమూ — ఇవి ఆరూ దుష్కృత్యాలు. ఇవి ఆరూ మిక్కిలీ వాడి, అయిన ఆరుకత్తులు. పురుషుల ఆయుర్దాయం ఇవి కోసేస్తాయి. మనుష్యుల నివే చంపుతాయి. ఈపాపాలకు నువ్వు దూరంగా వుంటివా, నీక్షేమాని కేమీ భంగంరాదు.

నమ్మి వున్నవాడి భార్యను కూడేవాడూ, గురువుభార్యను కూడే వాడూ, శూద్రస్త్రీలను కూడేవాడూ, మద్యపానం చేసేవాడూ, గ్రామణి అయినవాడూ, బ్రాహ్మలను నీచవృత్తుల్లో దింపేవాడూ, బ్రాహ్మల మాన్యాలు హరించేవాడూ, శరణుపొందినవాణ్ణి చంపే వాడూ, — వీళ్ళందరూ బ్రహ్మహత్య చేసినవాడితో సమానులు. వీళ్ళతో కలిసివుండేవాడు ప్రాయశ్చిత్తం చేసుకోవా లని చెబుతోంది వేదం.

విద్వాంసుడూ, నీతిశాస్త్రం తెలిసినవాడూ, దానధర్మాలు చేసే వాడూ, పితృదేవతలకూ దేవతలకూ అతిథులకూ ముందు పెట్టి, వారు తినగా మిగిలింది తినేవాడూ, ఎవరినీ హింసించనివాడూ, చెడ్డ పనులు చెయ్యనివాడూ, ఏమరుపాటు లేనివాడూ, చేసినమేలు మరచి పోనివాడూ, సత్యమే పలికేవాడూ, దయగలవాడూ — ఇలాంటివాడు స్వర్గసుఖాలనుభవిస్తాడు.

రాజేంద్రా, ప్రియంగా మాట్లాడేవా రెందరో వుంటారు. మేలు కలిగించే అప్రియంమాట చెప్పేవాడూ వినేవాడూ కూడా లోకంలో అరుదుగానే వుంటారు. యజమాని ఇష్టమూ అయిష్టమూ లెక్కచెయ్యకుండా, కేవలమూ ధర్మమే అవలంబించి, అప్రియమే అయినా మేలుచేకూర్చేమాట చెప్పేవాడు మిక్కిలీ ఉత్తముడు. రాజయినవాడు, అలాంటివాళ్లనే సంపాదించుకోవలసినది.

ఒకణ్ణి విడిచిపెట్టుకుని అయినా కుటుంబం క్షేమం చూసుకోవాలి అగత్యం అయితే, వొకకుటుంబమే విడిచిపెట్టేసి గ్రామం కాపాడుకోవాలి. దేశక్షేమంకోసం వొక గ్రామం విడిచిపెట్టేసినా తప్పులేదు. తన క్షేమకోసం యీభూమండలం అంతా విడిచినా విడిచిపెట్టెయ్య వచ్చు. ఇందులో లేశమూ తప్పులేదు. ఆపదలు వస్తే ఉపయోగపడుతుంది కనక ధనం జాగ్రత్తచేసుకోవాలి. ధనంకంటే యెక్కువ జాగ్రత్తగా కాపాడుకోవాలి భార్యను. ధనంకంటేనూ భార్యకంటేనూ యెక్కువగా తనని తాను రక్షించుకోవాలి.

జూదం విరోధాలకు కారణం అవుతుం దని ఆదినుంచీవున్నమాటే. అంచేత, వినోదంకోసం అయినా జూదం ఆడరాదు. నీకొడుకు జూదం ఆడేటప్పుడే యిది మంచిది కాదని నీకు చాలా గట్టిగా చెప్పా న్నేను. ఔషధం అంటే రోగి మిక్కిలీ వెగటుగా చూస్తాడు. నామాట నువ్వప్పుడలాగే చూశావు.

కాకులచేత నెమళ్లను కొట్టిద్దా మనీ, నక్కలచేత సింహాలను కొట్టిద్దా మనీ చూసినట్టు, దుర్యోధనాదులచేత పాండుపుత్రులను నాశనంచేయిద్దా మని చూశావు నువ్వు. అందుకు ఫలితంగా తగిన కాలం వచ్చిం దిప్పుడు. అంచేతనే నువ్విలా విచారిస్తున్నావు. తనని భయభక్తులతో కొలుచుకుంటూ తన క్షేమమే కోరే భృత్యునిమీద

ఆగ్రహించనివాణ్ణి నమ్మి, ఆభృత్యులు శాశ్వతంగా పడివుంటారు. ఆపదలు వచ్చినా విడిచిపెట్టరు.

రాజయినవాడు, ముందు, భృత్యులను సత్కరించకుండా డబ్బూ రాజ్యమూ వృద్ధిచేసుకోడానికి చూడకూడదు. తగిన ఆదరగౌరవాలు చూపించని రాజుని నమ్ముకునేవున్న మంత్రులున్నూ విడిచిపెట్టేస్తారు, చివరకి. ఏపని మొదలుపెట్టా లనుకున్నా, అది నెగ్గుతుందో లేదో ముందు పరకాయించుకోవాలి. నెగ్గినా లాభం వుంటుందో లేదో లెక్కలు బాగా చూసుకోవాలి. లాభం వుంటుం దంటే, అప్పుడు, తగిన మడిమాన్యా లిచ్చి తనకి సాయంచెయ్యడానికి యోగ్యులైన వారిని చేర్చుకోవాలి. సహాయసంపత్తివున్న వాడికి అసాధ్యం అంటూ లేదు మరి.

యజమాని వుద్దేశాలు గుర్తించుకుంటూ అన్ని పనులూ చురుగ్గా చేస్తారు కొందరు. మంచి సలహాలే చెబుతారు వారెప్పుడూ. అను రాగమున్నా కనపరుస్తారు, కావలసినంత. అలాంటివాళ్లని, రాజు, తగిన సత్కారం చేసి ఆదరించి తనదగ్గిర వుంచుకోవాలి. పనిచెబితే కొందరు వినిపించుకోరు. కొందరు పనిచెప్పినవాడికే పనిచెబుతారు. కొందరు ప్రతివాదం కూడా చేస్తారు, గట్టిగా. తమకే చాలా ప్రజ్ఞ వుందనుకుంటారు వాళ్ళు. అన్నిటికీ వితండవాదం కూడా చేస్తారు. అలాంటి భృత్యులను విడిచి పెట్టేసి రాజు వెంటనే పొమ్మనాలి.

మనిషి దర్పంగా వుండాలి. చతురుడై వుండాలి. దీర్ఘాలోచన చెయ్యకుండా దేనికయినా వెంటనే పూనుకునేవాడు కావాలి. దయగలవాడై వుండాలి. స్నేహపాత్రుడయి వుండాలి. ఎంతెంతగా లోభపెట్టినా యెవరికీ లోబడిపోకుండా వుండగలగాలి. ఇవి యెని మిది మంచిగుణాలు. రాజు, ఈగుణా లన్నీ వున్నవాణ్ణే యెప్పుడూ రాయబారిగా పంపా లెక్కడి కయినా.

సాయంకాలం నమ్మరానివాడి యింటికి కెప్పుడూ వెళ్ళగూడదు. రచ్చసావళ్ళలో, రాత్రులు, నొక్కడూ రహస్యంగా వుండగూడదు. రాజుగారి ప్రియురాళ్లనెప్పుడూ కామించరాదు. దురాలోచనలు చేసేవాడి మాయలో పడగూడదు. వాణ్ణి నమ్మనే కూడదు. యుక్తిగా మాట్లాడి తప్పించుకోవాలి వాణ్ణి. లజ్జావంతుడూ, రాజూ, రంకుటాలూ, రాజోద్యోగీ, కొడుకూ, సోదరుడూ, చిన్న పిల్లలు గల వితంతువూ, సేనలో పనిచేసేవాడూ, అధికారం పోయిన వాడూ — వీరితో వ్యవహారం పెట్టుకోగూడ దేమిన్నీ.

బలమూ, రూపమూ, మంజులస్వరమూ, చక్కని శరీరఛాయా, స్పర్శసుఖమూ, పరిమళమూ, పరిశుభ్రతా, సంపదా, నాజూకు తనమూ, స్త్రీలప్రీతీ — స్నానంచేసేవాడి కీపదీ సిద్ధిస్తా యెప్పుడూ. ఆరోగ్యమూ, దీర్ఘాయువూ, బలమూ, సౌఖ్యమూ, మంచిసంతానమూ, తిండిపోతన్న నిందరాకపోడమూ — మితంగా భోజనం చేసే వాడి కీఆరు యోగ్యతలూ పడతాయి.

సోమరిపోతూ, తిండిపోతూ, లోకానికి విరోధి అయినవాడూ, మాయలమారీ, క్రూరుడూ, దేశకాలాలు గుర్తించనివాడూ, తగని వేషం వేసుకుతిరిగేవాడూ — వీళ్ళ నింటికి చేరనివ్వగూడదు. ఎవరికీ యెప్పుడూ యేమీ యివ్వని లోభీ ఇతరులు పచ్చగా వుంటే చూసి యేడ్చేవాడూ, మూర్ఖుడూ, అడవుల్లో తిరిగేవాడూ, మోసకాడూ, తాను చాలా గొప్పవాణ్ణనుకునేవాడూ, నిర్దయగా ఇతరులను హింసించేవాడూ, పగబట్టివుండినవాడూ, చేసిన మేలు మరచిపోయే వాడూ — వీళ్ళని యెలాంటియిబ్బందులువచ్చినా యేమిన్నీ కోరగూడదు.

ఇళ్లుతగలబెట్టడం విషంపెట్టి చంపడం దోచుకోడం — ఇలాంటి దుష్కృత్యాలు చేసే ఆతతాయీ, తొందరపాటు గలవాడూ, ఎప్పుడూ అబద్ధాలే చెప్పేవాడూ, భక్తిలేనివాడూ, స్నేహం మాను

కున్నవాడూ, గర్విష్ఠీ — వీళ్లు ఆరుగురూ అధములు. ఇలాంటివాళ్ల నెప్పుడూ సేవించరాదు. సహాయం వుంటే సకలార్థాలూ సిద్ధిస్తాయి. అర్థం వుంటే సహాయం లభిస్తుంది. సహాయమూ అర్థసంపత్తీ — ఇవి రెండూ అన్యోన్యాలు.

కొడుకులను కని, వాళ్ల కెలాంటి రుణమూ లేకుండాచేసి, ఏదో వొక వృత్తిన్నీ అప్పగించి, కూతుళ్లకు మంచిభర్తలను తెచ్చి తరవాత అడవుల్లోకి వెళ్లి మునివృత్తి అవలంబించడం చాలా మంచి ధర్మం. అందరికీ హితమూ, తనకి సుఖమూ కలిగే పనే చెయ్యాలి అందరూ కూడా. అదంతా ఈశ్వరార్పణంగా కూడా చెయ్యాలి. ఇలా చేసేవాడికి సిద్ధించని దంటూ ఏమీ వుండదు. ధనధాన్యసమృద్ధీ, బలపరాక్రమాలూ, శౌర్యసాహసాలూ, ధర్మబుద్ధీ, కార్యోత్సాహమూ, కృషీ — ఇవి గలవాడికి లోటంటూ రా దెప్పుడూ.

రాజేంద్రా! పాండుపుత్రులతో యుద్ధం పెట్టుకుంటే యెలాంటి ఆపదలు వస్తాయో గుర్తించుకో. వారిని చూస్తే, దేవతలే కాదు, దేవేంద్రుడున్నూ గడగడలాడిపోతాడు. కొడుకులతో విరోధపడ్డం నీకు మంచిది కాదు. దానివల్ల గుండెబెదు రుంటూనే వుంటుంది నీకు. కీర్తిన్నీ నాశనం అయిపోతుంది. ఇదంతా నీ శత్రువులకు ఆనందం కలిగిస్తుంది. భీష్మునికీ, నీకూ, ద్రోణునికీ, ధర్మనందనునికీ, కోపంవస్తే అది, తోకచుక్కలాగ ఈభూమండలం అంతా బూడిద చేసేస్తుంది.

నీకొడుకులు నూరుగురూ, కర్ణుడూ, పాండుపుత్రులూ కలిసివుంటే నాలుగుసముద్రాలకూ మధ్యస్థం అయిన యీభూమండలం అంతా యేలగలరు. పాపాత్ము లెప్పుడూ యితరుల దోషాలే లెక్కపెడతారు గాని మంచిగుణాలు గుర్తించరు. సకలసంపదలూ నీకు సిద్ధించాలంటే ముందు ధర్మంగా నడుచుకో. స్వర్గంలో తప్ప అమృతం దొరకదు. అలాగే ధర్మబుద్ధి వుంటే తప్ప సకలార్థాలూ సిద్ధించవు.

పాపులకు జంకి ధర్మకార్యాలే చేసేవాడికి ప్రపంచంలో తెలియని దంటూ వుండదు. ధర్మమూ, అర్థమూ కామమూ — వీటిలో యేది యెప్పు డనుభవించాలో తెలిసినవాడి కవి మూడూకూడా పూర్తిగా సిద్ధిస్తాయి. కోపంవస్తే మండిపడీ, సంతోషం వస్తే పొంగిపోయీ యెందుకూ తొందరపడనివాడూ, ఆపద లలుముకుంటే కుంగిపోని వాడూ సకలసంపదలూ అనుభవిస్తాడు.

బాహుబలమూ, అమాత్యబలమూ, ధనబలమూ, కులబలమూ ప్రజ్ఞాబలమూ — అని బలం అయిదువిధాలు. వీటిలో బాహుబలం అధమం. కులబలం అంటే తాతతండ్రులదగ్గిరనుంచీ అవిచ్ఛిన్నంగా వచ్చే కుటుంబగౌరవం అన్నమాట. ప్రజ్ఞాబలమే అన్నిటికంటేనూ మిక్కిలీ ఉత్తమం. దానివల్ల సకలమూ సిద్ధిస్తుంది. గొప్పవా రెలాంటి అపకార మైనా చెయ్యగలరు. కనక, వారితో పగపెట్టుకోరాదు. పెట్టుకోడం తప్పకపోతే "నేను వాడికి దూరంగా వుంటాను, నాకేమి భయమూ ?" అని గర్వించి యేమరి వుండగూడదు.

స్త్రీలనూ, రాజులనూ, తాచుపాములనూ, వేదములనూ, యజమానులనూ, పగవారినీ, భోగాలనూ, ఆయువునూ బుద్ధిగలవా డెవ్వడూ నమ్ముకుని వుండడు. ప్రజ్ఞ అనే బాణంతో అయిన గాయం మాన్ప డానికి వైద్యుడు లేడు. మందు లేదు. మంత్రతంత్రాల్లేవు. జపాలూ హోమాలూ లేవు. విషవైద్యులున్నూ ఆగాయం మాన్పలేరు. పాములూ, అగ్ని, సింహాలూ, కన్నకొడుకులూ — వీరిని పరాభవించ గూడదు. మిక్కిలీ తేజస్సుగల వర్గం యిది. దానివల్ల చాలా చిక్కులు వస్తాయి.

కర్రల్లో నిప్పుంది! చాలా తీక్ష్ణ మైన దది; కాని ఎవ రయినా రేపితే తప్ప అది బయటికి రాదు. ఎవరయినా మధించారా, దారుణంగా బయటపడి అది అడవుల కడవులే బుగ్గిచేసేస్తుంది. చేసుకున్న

భార్యయందు తాను కన్న కొడుకులా నిప్పువంటివారు. కోపం రానంత సేపూ, వారూ, కర్రలో నిప్పులాగే అణగివుంటారు. రాజా, నువ్వూ నీకొడుకులూ పూలతీగలవంటివారు. మరి, పాండుపుత్రులో అంటే గొప్ప వృక్షాలవంటివారు. వృక్షాలను ఆశ్రయించుకుంటేనే తీగలకు క్షేమం. నీకొడుకులు అడవి అనీ, పాండుపుత్రులు సింహాలనీ గుర్తించుకో. వారూ వీరూ కలిసివుంటేనే వుభయులకూ క్షేమం అనిన్నీ జ్ఞాపకం వుంచుకో.

## 38

### మంత్రోపదేశం 6

పెద్దలయినవా రింటికివస్తే, మీాదిప్రాణాలు మీాదికే యెగిరిపోతాయి పిన్నలకు. అయితే, ఆపెద్దలకు అర్ఘ్యమూ, పాద్యమూ ఇచ్చి ఆదర గౌరవాలు చేస్తేమాత్రం ప్రాణాలు మళ్లీ కోలుకుంటాయి. సజ్జను లింటికి వస్తే, స్వయంగా కాళ్లు కడిగి అర్ఘ్యమూ ఆసనమూ యిచ్చి తన క్షేమాదికమూ తనస్థితిగతులూ వివరించి వారికి ప్రీతిపాత్ర మైన భోజనంపెట్టి, పూజించాలి. లోభమూ, భయమూ, పిసినిగొట్టు తనమూ — ఇలాంటివిపెట్టుకుని, అలాంటి సజ్జనులకు ఆదరసత్కారాలు చెయ్యనివాడి బతుకు బరువుచేటు.

వైద్యుడూ, కత్తులూ బాణాలూ వంటి మారణాయుధాలుచేసే వాడూ, బ్రహ్మచర్యం చెరుచుకున్నవాడూ, దొంగా, క్రూరుడూ మద్యపానం చేసేవాడూ, భ్రూణహత్యలు చేసేవాడూ, సైన్యంలో చేరి జీవించేవాడూ, డబ్బుపుచ్చుకుని వేదంచెప్పేవాడూ, వీరికి అర్ఘ్యమూ పాద్యమూ యివ్వగూడదు ; కాని, సాదరంగా ఆతిథ్యం యివ్వాలి. ఉప్పూ, పిండివంటలూ, పాలూ, పెరుగూ, తేనే, నూనే, నెయ్యీ,

నువ్వులూ, మాంసమూ, పళ్లూ, దుంపలూ, కూరగాయలూ, ఎర్రని బట్టలూ, సుగంధద్రవ్యాలూ, బెల్లమూ—ఎన్నడూ యివి అమ్మగూడదు.

రోషం విడిచిపెట్టి, డబ్బూ చిల్లపెంకూ సమంగా చూస్తూ, శోకమూ మోహమూ తగ్గించుకుని, యెలాంటివారియెడలా కూడా స్నేహమూ విరోధమూ కూడా పెట్టుకోక, దూషణభూషణతిరస్కారాలు లెక్కచెయ్యక ప్రియమనీ అప్రియమనీ ఇలాంటి ద్వంద్వాలు విడిచి, ఏదీ పట్టించుకోకుండా తిరగేవాణ్ణి పెద్దలు భిక్షుకు డంటారు. నివ్వరిధాన్యమూ, కందమూలాలూ, గారపిండీ, కాయగూరలూ – ఇవి మాత్రమే తింటూ, అతిథులను ఆదరిస్తూ, అగ్నికార్యం చేసుకుంటూ, ఇంద్రియాలుజయించి అడవుల్లోనివసించివుండేవారినితాపసులుఅంటారు.

బుద్ధివంతు డైనవాడు, ఎవడికైనా అపకారం చేసి, దూరంగా వెళ్ళిపోయిన్నీ "ఇక మనకు భయంలేదు" అనుకుని నిర్లక్ష్యంగా వుండగూడదు. ఏమంటే, తెలివిగలవాడి చేతులు చాలా పొడుగు. వాటితో వా డెంతదూరాన వుండిన వాణ్ణీ కూడా హింసించి చంపగలడు. నమ్మగూడనివాళ్ల నెప్పుడూ నమ్మగూడదు. తనని నమ్మివుండిన వాళ్ల నైనా అతిగా నమ్మగూడదు. నమ్మకంవల్ల వొకొక్కప్పుడు చాలా నష్టాలూ కష్టాలు కలుగుతాయి. మొదటికీ మోసం రావచ్చు.

ఎవరిని చూసీ యీర్ష్య పడగూడదు. తన భార్యను జాగ్రత్తగా కాపాడుకుంటూ వుండాలి. తన కెంత డబ్బుంటే అది, ఎవరి కెంత యివ్వవచ్చునో అంతా ధారాళంగా యిస్తూ వుండాలి. అందరితోటీ ప్రీతిగా మాట్లాడాలి. తాను స్నేహపాత్రు డయివుండాలి. ఎవరితో నైనా మంచిగా మాట్లాడాలి. స్త్రీలకు దాసుడయిపోగూడదు. అయితే, స్త్రీలు మహానుభావురాళ్ళు. పుణ్యస్వభావలు. ఇంటికి వెలుగు తెస్తారు. ఇంటికి లక్ష్మీస్వరూపురాళ్ళున్ను. అంచేత, వారి నెప్పుడూ పూజిస్తూ వుండాలి. జాగ్రత్తగా రక్షించుకోవాలి కూడా.

తన అంతఃపురం సంగతు లన్నీ తండ్రిచేతిలో వుంచాలి. వంటయింటి పెత్తనం తల్లికివ్వాలి. పశుధనం తనతో సమాను డైనవాడి కప్పగించాలి. కృషివిషయం మాత్రం తాను స్వయంగా చూసుకోవాలి. వర్తకవాణిజ్యాలన్నీ పనివాళ్ళచేత నడిపించాలి. బ్రాహ్మలకు తన కొడుకులచేత పూజలు చేయించాలి.

సజ్జనుల కుటుంబాల్లో పుట్టేవా ళ్లు త్తము లయివుంటారు. వాళ్ళ తేజస్సున్నూ అగ్నితో సమాన మయివుంటుంది. క్షమగలవారూ, నిర్వికారులున్నూ అయివుంటారు వారు. కర్రలో నిప్పుంది నిగూఢంగా. అలాగే నిరాడంబరంగా వుంటారు వారు. రాజు తన ఆలోచన లెవరికీ తెలియనివ్వగూడదు. తాను చారులమూలంగా లోకవృత్తాంతం అంతా తెలుసుకుంటూ వుండాలి. అలాంటి రాజు సకలసంపదలూ చిరకాలం అనుభవిస్తాడు. ధర్మానికీ, కామానికీ, అర్థికాలకూ సంబంధించిన పను లతిరహస్యంగా జరిగించాలి రాజు. పని పూర్తయాక మాత్రమే అవి యెవరయినా తెలుసుకోగలిగేటట్టు జాగ్రత్తపడాలి. అలాంటి రాజు మంత్రాంగం యెప్పుడూ భంగపడదు.

మంత్రాలోచన చెయ్యా లంటే, రాజులకు, పర్వతశిఖరాలూ, ఏకాంతంలో వున్న మేడలూ, గడ్డిగాదమూ లేని కీకారణ్యమూ — ఇవి మాత్రమే తగిన ప్రదేశాలు. స్నేహితుడూ, స్నేహితుల్లోనూ పండితుడూ, పండితుల్లోకూడా మళ్ళీఇంద్రియనిగ్రహం వుండి మితభాషి అయివుండినవాడూ మాత్రమే ఆమంత్రాలోచన తెలుసుకోడాని కర్హుండు. మంత్రాంగాలోచనా, ఆయవ్యయాలూ మంత్రుల అధీనంలో వుండవలసినవి. వారు మాత్రమే ఆవిషయాలు నెరవేర్చవలసినవారు. కనక, బాగా పరిశీలించుకోకుండా యెవరినీ మంత్రులుగా చేర్చుకోరాదు.

ధర్మానికీ, కామానికీ, అర్థికాలకూ సంబంధించి రాజు చేసిన పనులు అతని మంత్రాంగసభ్యులకు మాత్రమే తెలియాలి. అదయినా అవి

జరిగిపోయాకే తెలియాలి. అలా జాగ్రత్తపడగలరాజే రాజని చెప్పుకో తగ్గవాడు. అలాంటిరాజే సకలసంపదలూ అనుభవిస్తాడు. అతని ఆలోచనలే కార్యరూపం పొందుతాయి.

ప్రమాదంవశాన కూడా రాజయినవాడు చెడ్డపనులు చెయ్య గూడదు. చేస్తే అవి చెడిపోడమే కాదు. ఆరాజూ చెడిపోతాడు. ప్రాణాపాయమున్నూ కలుగుతుం దతనికి. మంచిపనులు చేస్తే లాభం కలగడం అలా వుండగా సుఖమున్నూ కలుగుతుంది. చెయ్యకపోతే పశ్చాత్తాపమున్నూ కలుగుతుంది, తరవాత. వేదం చదువుకోని బ్రాహ్మడు శ్రాద్ధభోజనానికి పనికిరాడు. సంధీ, విగ్రహమూ, యానమూ, ఆసనమూ, ద్వైధీభావమూ, సమాశ్రయమూ— యీ ఆరుగుణాలూ తెలుసుకోనివాడున్నూ అలాగే మంత్రాలోచన తెలుసుకోడానికి పనికిరాడు.

రాజు, తన స్థితి యేమిటో బాగా తెలుసుకుని వుండాలి. శత్రువు తనకంటే వృద్ధిపొందుతున్నాడో, క్షీణిస్తున్నాడో అదిన్నీ తెలుసు కుంటూ వుండాలి. షడ్గుణాలూ బాగా అవగాహన చేసుకుని న్నీ వుం డాలి. మంచిశీలమున్నూ కలవాడయివుండాలి. అలాంటి రాజే యీభూ మండలం అంతా అడ్డులేకుండా యేలగలుగుతాడు.

కోపం వస్తే అవతలివాణ్ణి నాశనంచేయ్యడానికీ, అనుగ్రహం వస్తే యెంతోబాగుచెయ్యడానికీ సమర్థుడయి వుండాలి రాజు. బొక్కసం యేస్థితిలోవుందో అది యెప్పటికప్పుడు బాగా పరిశీలించుకుంటూ వుండాలి. తాను చేసిన పని యెలా పరిణమిస్తోందో అది మళ్లీ మళ్లీ పరకాయించుకుంటూ వుండాలి. అలాంటి రాజే బంగారం పండే యీభూమండలం అంతా పరిపాలించగలుగుతాడు.

రాజు, తాను రాజయివుండినందుకూ, ఎవరికీ అందని వెల్లగొడుగు తన వొక్కడికే మాత్రమే వుండినందుకున్నూ తృప్తిపడాలి. తన కున్న

సంపద అంతా తన భృత్యులకే విడిచిపెట్టాలి. అంతా తానే అనుభవించగూడదు. బ్రాహ్మణ్ణి బ్రాహ్మడే తెలుసుకోగలడు. స్త్రీని భర్త మాత్రమే తెలుసుకోగలడు. మంత్రులను రాజే తెలుసుకోగలడు. ఇంతేకాదు. ఆరాజున్నూ తనని తాను మాత్రమే తెలుసుకోగలడు. చంపతగిన శత్రువు చేతికిచిక్కితే వాణ్ణి విడిచిపెట్టగూడదు. ముందు చెరపట్టి వాడి పరిస్థితు లన్నీ బాగా తెలుసుకోవాలి. బలవంతు డయి వుంటే వాణ్ణి వెంటనే చంపెయ్యాలి. లేకపోతే తనకే అపాయం కలుగుతుంది త్వరలో.

రాజు, దేవతలూ, రాజులూ, బ్రాహ్మలూ, ముసలివాళ్లూ, పిల్లలూ, రోగులూ — వీళ్ళమీద ఎంత కోపం వచ్చినా ప్రయత్నపూర్వకంగా అది అణిచేసుకోవాలి. లాభంలేని యుద్ధాలు చెయ్యగూడదు. అలాంటి యుద్ధాలు చెయ్యనివాడికి కీడనేది కలక్కపోడమే కాదు, గొప్ప కీర్తిన్నీ వస్తుంది.

తనకి కోపంవస్తే అవతలివాణ్ణి పాతాళానికి తొక్కెయ్యడమూ, సంతోషంవస్తే స్వర్గానికెత్తెయ్యడమూ — రాజయినవాడి కుండవలసిన ముఖ్యలక్షణం యిది. ఈలక్షణం లేని రాజుని, స్త్రీలు నపుంసకుణ్ణి భర్తనెలా విడిచిపెట్టేస్తారో జను లలా విడిచిపెట్టేస్తారు. బుద్ధివున్నంత మాత్రాన డబ్బు గడించడం సాధ్యం కాదు. సోమరితనం వుండినంత మాత్రాన దారిద్ర్యమున్నూ రాదు. ఇవి లోకసామాన్యధర్మాలు. ప్రాజ్ఞుడైనవాడే యిది తెలుసుకోగలడు.

బుద్ధిమంతుడైన రాజు, విద్వాంసులనూ, మంచిశీలంగలవారినీ, వృద్ధులనూ, బుద్ధిమంతులనూ, ధనికులనూ, కులగౌరవంగలవారినీ యెప్పుడూ అవమానించగూడదు. మూర్ఖు డయినా, నీచపనులు చేసినా, అసూయాపరుడయినా, అధర్మానికి వొడిగట్టేవాడయినా, నోటిదురుసుకలవా డయినా కోపిష్టి అయినా రాజు చెడిపోతాడు.

మోసబుద్ధి లేకపోడమూ, దానధర్మాలు చెయ్యడమూ, హద్దుమీరక పోడమూ, ఆలోచించి మాట్లాడ్డమూ — ఇవి శత్రువులను కూడా వశ్యం చేస్తాయి.

రాజు కుయుక్తులెరగనివాడూ, సమర్థుడూ, చేసిన మేలు మరచిపోనివాడూ, బుద్ధిశాలీ, ఋజుమార్గాన నడుచుకునేవాడూ అయితే, అలాంటి రాజుని, భృత్యులూ మిత్రులూ — ఇలాంటిపరివారం యెప్పుడూ విడిచిపోదు. నమ్మకంగా ఆశ్రయించుకునే వుంటుంది. తనకి సంపత్తు కలగాలంటే — అభివృద్ధిన్నీ కావాలంటే ధైర్యంగావుండా లెప్పుడూ. శాంతంగా వుండాలి. ఇంద్రియాలు నిగ్రహించుకోవాలి. దయాళువు అయివుండాలి. శౌచం గలవాడున్నూ అయివుండాలి. సౌమ్యంగా మాట్లాడేవాడు కావాలి. మిత్రులయినవారి కెప్పుడూ ద్రోహం చెయ్యగూడదు. ఇవి యేడూ సంపదలు కలిగించి పెంపున్నూ చేసే లక్షణాలు.

భృత్యుల కేమీ యివ్వకుండా అంతా తానే మింగేసేవాడూ, చేసినమేలు మరిచిపోయేవాడూ, సిగ్గులేనివాడూ, — జనులు ఇలాంటి రాజుని విడిచిపెట్టెయ్యాలి. తానేమో చెడ్డపనులు చేసి, ఏదోషమూ యెరగనివాళ్ళమీద కోప్పడేవాడు, పామున్నయింటో పడుకున్నవాడిలాగ నిద్ర అనేది లేకుండా రాత్రి తెల్లవార్లూ వేగిపోతాడు. జీతనాతాలు సరిగా యివ్వకపోతే, భృత్యులు, తన యోగక్షేమాలు భంగపరిచేస్తారు. కనక, యివి గుర్తించి దేవతల నెలా పూజిస్తామో అలాగ వాళ్ళని బాగా కనిపెడుతూ వుండాలి, ప్రీతిగా.

స్త్రీలూ, ఏమరిపాటుగలవాళ్ళూ, చెడిపోయినవాళ్ళూ, అనార్యులూ చేపట్టిన పను లన్నీ చెడిపోతాయి; గాని నెరవేరవు. తన వ్యవహారం అంతా స్త్రీలకూ, జూదగాళ్ళకూ, బాలురకూ అప్పగించేవాడు, మెడలో రాళ్ళు కట్టుకుని నదిలో యీదేవాడిలాగ మునిగి చక్కాపోతాడు.

ఎవరితోనూ ఘర్షణపడకుండా తమ కార్యాలు నెరవేర్చుకునేవాళ్ళే పండితు లని చెప్పాలి. జూదగాళ్ళూ, ముఖస్తుతిచేసేవాళ్ళూ, రంకుటాళ్ళూ — వీళ్ళుపొగడ్తలు సంపాదించుకునేవారు ఎంతోకాలం బతకరు.

రాజేంద్రా, పాండుపుత్రులు గొప్ప శూరులు. గొప్ప విలుకాళ్ళు. వారిని కాదని, భరతకులంవారి సంపద లన్నీ నువ్వు దుర్యోధనుని చేతుల్లో పెట్టావు. తనకే అఖండైశ్వర్యం వుందని కన్నూమిన్నూ కానకుండా సంచరించిన బలిచక్రవర్తి పాతాళాని కృంగిపోయాడు. నీకొడుకూ అలాగే భ్రష్టు డయిపోతాడు, తప్పదు. కొద్దిరోజుల్లోనే నీకళ్ళారా చూస్తావు నువ్వది.

## 39

### మంత్రోపదేశము 7

"విదురా, ఐశ్వర్యానికీ దారిద్ర్యానికీ పురుషుడు కర్తగాడు. తాడుకట్టి ఆడిస్తే కర్రబొమ్మ ఆడుతుంది. దైవంచేతిలో పురుషుడూ ఆమాత్రం వాడే. నీమాటలు మాత్రం నాకెంతో తృప్తికలిగిస్తున్నాయి. కనక, యింకాచెప్పు" అనడిగాడు ధృతరాష్ట్రుడు.

"రాజేంద్రా, సమయం కాకుండా బృహస్పతే వచ్చి చెప్పినా యెవరూ వినిపించుకోరు. పైగా, హేళనకూడా చేస్తారు. అడిగిం దిస్తే వొకడు ప్రియు డవుతాడు. తన కనుకూలంగా మాట్లాడితే వొకడు ప్రియు డవుతాడు; కాని నిజం చెప్పవలసివస్తే, మంచి ఆలోచన చెప్పడంవల్ల ప్రియుడైనవాడే ప్రియుడు. శత్రువయినవా డెప్పుడూ సజ్జను డనిపించుకోడు. మేధావి అనీ, పండితు డనీ కూడా అనిపించుకోడు. స్నేహితుడు చేసేవన్నీ మంచిపనులూ, శత్రువు చేసేవన్నీ చెడ్డకార్యాలూ అవుతా యెవరికైనా.

దుర్యోధనుడు పుట్టీపుట్టగానే "వీణ్ణి విడిచిపెట్టెయ్యి" అని చెప్పానీనికు "వీణ్ణొక్కణ్ణీ విడిచిపెడితే తక్కిన నీనూరుగురు కొడుకులూ సుఖంగా బతుకుతారు. వీణ్ణి విడిచిపెట్టకపోతే ఆనూరుగురూ కూడా నశించిపోతారు" అనిన్నీ కచ్చితంగా చెప్పాన్నే నప్పుడు. వృద్ధి అంటే, నాశనంచేసేవృద్ధి వృద్ధికాదు. వృద్ధికలిగించే నాశనమున్నూ నాశనంకాదు. గుణాలనుపట్టి కొందరూ, డబ్బునిబట్టి కొందరూ ఘనత పొందుతారు. నిజానికి, గుణాలను బట్టి ఘను లైనవారే ఘనులు. గుణంలేకపోతే ధనికులను విడిచిపెట్టెయ్యావలసిందే" అని బదులు చెప్పాడు విదురుడు.

దీనిమీద ధృతరాష్ట్రుడు "విదురా, చివరికి హితకరం అయేమాట చెబుతున్నావు నువ్వు. ప్రాజ్ఞు లయినవారి కదే సమ్మతం కావచ్చు; కాని, నాకొడుకుని నేను విడిచిపెట్టుకోలేను. ధర్మం యెక్కడ వుంటే జయం అక్కడ వుంటుంది, కానీ చూద్దాం" అన్నాడు.

విదురుడు ప్రారంభించాడు మళ్లీ.

"రాజేంద్రా! మిక్కిలీ గుణసంపన్నుడైనవాడూ, వినయవిధేయతలు గలవాడూ లోకులకు కొద్దిపాటి కష్టం కలిగినా చూసి వూరుకోలేడు. ఇతరులమీద నీలాపనిందలు వెయ్యడమే పెట్టుకున్న పాపాత్ములు చెలరేగి, ఇతరులకు దుఃఖాలు కలిగించడానికీ, ఇతరుల్లో విరోధాలు పుట్టించడానికిన్నీ మాత్రమే చూస్తూవుంటా రెప్పుడూ. వాళ్లని చూస్తేనే పాపం చుట్టబెట్టుకుంటుంది. వాళ్లతో కలిస్తే సర్వనాశనమే సంభవిస్తుంది. వాళ్లదగ్గిర డబ్బు పుచ్చుకుంటే చిక్కులు వస్తాయి. వాళ్లకి డబ్బిచ్చినా ఏదో నష్టమే కలుగుతుంది.

కలిసివున్నవారిని విడతియ్యడమూ, సిగ్గులేకుండా ఏదిపడితే అది కావాలని పీక్కుతినడమూ, దగాచెయ్యడమూ — ఇలాంటి పాపాత్ములు

కొందరున్నారు. ఇంకా మెన్నో చెడ్డపనులు చేస్తూవుంటారు వాళ్లు. వాళ్లతో సావాసం చెయ్యగూడదు. వాళ్ళని దగ్గరకే చేరనివ్వగూడదు.

నీచులతో సావాసం మానుకుంటే, వారిమీద వుండే ప్రీతి దాని కదే నశించిపోతుంది. స్నేహంవల్ల కలిగే సుఖమూ, దానివల్ల కలిగే లాభమూ కూడా గుర్తించలేరు నీచులు. పైగా, స్నేహం తగ్గించుకోడం చూసి అపవాదలు వెయ్యడం కూడా ప్రారంభిస్తారు వాళ్లు. పొరపాటున అయినా, కొద్దిపాటి అయినా అపకారం జరిగితే సహించలేరు వాళ్లు. వాళ్లతో స్నేహం చెయ్యగూడదు. వాళ్ల నెప్పుడూ దూరంగా వుంచాలి.

దరిద్రుడూ, దీనుడూ, రోగగ్రస్తుడూ అయిన జ్ఞాతిని చేరదీసి కాపాడేవాడు సిరిసంపదలతో తులతూగుతూవుంటాడు. తనకు క్షేమమూ, సుఖమూ కలగా లనుకునేవారికి జ్ఞాతులను బాగుచెయ్యడం చాలా అగత్యం. కులాభివృద్ధి కావా లన్నా ఆపనిచేసితీరాలి. అలాచేసేవాడి కెంతో శ్రేయస్సు కలుగుతుంది. జ్ఞాతుల్లో కొందరు గుణహీను లుండవచ్చు. అయినా, వారికి సాయంచెయ్యాలి. గుణవంతులవిషయమై చెప్పవలసిన పనే లేదిక.

పాండుపుత్రులు మిక్కిలీ గుణవంతులు. నీఅనుగ్రహమున్నూ కోరుతున్నవారు, వారు. పైగా, మహావీరులు. ఎంతోవద్దు, వారు నిశ్చింతగా బతకడానికి చిన్నచిన్నగ్రామా లయినా కొన్ని వారి కనుగ్రహించు. ఇలాచేస్తే అపారమైన కీర్తి వస్తుంది నీకు. ఇది నీకొడుకుల కున్నూ శ్రేయస్సు కలిగిస్తుంది. కనక, వారికి చెప్పి నువ్వీపని చేయించు.

నేను కూడా నీకు హితం చెప్పాలి. అందుకు, ముందు, నువ్వూ, నేను నీశ్రేయస్సుకోరేవాణ్ణే అని గుర్తించుకోవాలి. ఎలాంటిసందర్భంలోనూ కూడా — ఎవరూకూడా జ్ఞాతులతో విరోధం పెట్టుకోగూడదు. తన యింటికి వారిని భోజనానికి పిలవాలి, తాను వారియింటో భోజనం

చెయ్యాలి. వారితో మంచిచెడ్డలు మాట్లాడుతూ వుండాలి. వారికి తన ప్రీతి కనబరచాలి. తాను వారి ప్రీతి సంపాదించుకోవాలి. జ్ఞాతు లైనవారు, జ్ఞాతులను ఎలాంటి కష్టాల్లోనూ కూడా వొడ్డెక్కిస్తారు. ఎలాంటి సుఖసమయాల్లోనూ కూడా అడుక్కి తొక్కేస్తారు. అంటే, జ్ఞాతుల్లో మంచివాళ్ళూ చెడ్డవాళ్ళూ కూడా వుంటారు. మంచివాళ్ళు మంచీ, చెడ్డవాళ్ళు చెడ్డాచేస్తారు.

పాండుపుత్రులను నువ్వు మంచిగా చూడు. నువ్వు వారితో కలిసి వుంటే శత్రువులు నిన్నేమీ చెయ్యలేరు. ధనవంతుడైన జ్ఞాతిని నమ్ముకున్న బీదజ్ఞాతి నశిస్తే ఆపాపం ఆ ధనవంతు డైన జ్ఞాతికి చుట్టుకుంటుంది. వ్యవహారం యిలాగే వుంటే నువ్వు, నీకొడుకులు నాశనం అయిపోయా రనో, పాండుపుత్రులు కడతేరిపోయా రనో త్వరలోనే వింటావు, తప్పదు. కనక, యిదంతా యిప్పుడే ఆలోచించుకో. ఈ జీవితం నశించేదే గాని శాశ్వతం కాదుగదా? పాప కార్యం చేసినవాడు, మంచం యెక్కకయినా పరితపించడమూ, కుళ్ళి కుళ్ళి చావడమూ తప్పదు. అలాంటిద తటస్థించకుండా యిప్పుడే జాగ్రత్తపడ్డం మంచిది.

శుక్రనీతి మొదలైనవి నీతితంత్రా లెన్నో వున్నాయి. అవి చదివి వుంటేగాని యెవడూ యిలా చెయ్యలేడు. అలాంటి దూరదృష్టి బుద్ధి మంతు లయినవారికే కలుగుతుంది. నీకొడుకు దుర్యోధనుడు, పాండు పుత్రుల విషయమై యెంతో పాపంచేశాడు. నువ్వయినా పూనుకుని యిప్పు డది తొలగించుకోడం మంచిది. నువ్వు కౌరవకులాని కంతకీ పెద్దవు, మరి.

కనక, పాండుపుత్రులను నువ్విప్పుడు పదస్థులను చేస్తేవా, లోకంలో నీకెంతో కీర్తివస్తుంది. బుద్ధిమంతులూ, సజ్జనులూ నిన్నెంతో ఆదరి స్తారు. పెద్ద లెన్నో సుభాషితాలు సెలవిచ్చి వున్నారు. నువ్వు వాటి

ననుసరించి నడుచుకో, అవి నీకు మంచి ఫలితాలిస్తాయి. దానివల్ల కూడా నీ కపారమైన కీర్తివస్తుంది. చిరకాలమున్నా వుండిపోతుందది.

ఎంతటి నేర్పుగలవారైనా, పెద్దలు ఉపదేశాల సరిగా పాటించక పోతే – బాగా తరిచి చూసుకుని, బోధపరుచుకుని, అలా నడుచుకోక పోతే జ్ఞానం వుండిన ప్రయోజనం వుండదు. పాపపనులు చెయ్యని వాడు బాగుపడతాడు. తానంతకుముందు చేసిన పాపాలు బాగా గుర్తించుకుని వాటికి తగ్గ ప్రతిక్రియలు చేసుకోనివాడు నరకం అనే నూయిలో కూరుకుపోతాడు.

మద్యపానం చెయ్యడంవల్ల కలిగేమదమూ మొద్దునిద్రా, ఎదటివాళ్ల ప్రయత్నాలు ఆకళించుకోలేకపోడమూ, తన నేత్రవక్త్రవికారాలతో తన వుద్దేశాలు ఎవరికీ తెలియకుండా చేసుకునే గాంభీర్యం లేకపోడమూ దుష్టులైన మంత్రులను నమ్ముకుని వుండడమూ, నేర్పరులైన చారులను నియమించుకోలేకపోడమూ – ఇవి ఆయా రాజుల మంత్రాలోచనలు చెరిచే మార్గాలు. అంటే, ఈఆరులక్షణాలూ లేనివాడు, తన మంత్రాలోచనలు గుట్టుగా వుంచుకోలేడు. దానివల్ల చాలా చిక్కులువస్తాయి. కనక, రాజయినవాడు, యీఆరువిషయాల్లోనూ చాలా జాగ్రత్తగా వుండాలి. అలావున్నవాడు శత్రువులను సులభంగా గెలుచుకోగలుగుతాడు. ధర్మమూ, కామమూ, ఆర్థికసంపత్తి కూడా పొందగలుగుతాడు.

వేదం చదువుకోకుండానూ, పెద్దలను సేవించుకోకుండానూ ధర్మమూ ఆర్థికవిషయాలూ బాగా తెలుసుకోడం యెంతతెలివైనవాడికీ కూడా సాధ్యంకాదు. బృహస్పతివంటివాడున్నా యేమీ చెయ్యలేడిక్కడ. సముద్రంలో పడిపోయిన వస్తువూ, శ్రద్ధలేనివాడికి చెప్పిన చదువూ, బూడిదలో చేసిన హోమమూ వృథావృథా. ఆలాగే, చెవియొగ్గి విని పించుకోని వాడి కెన్ని సుభాషితాలు చెప్పినా వ్యర్థమే. మేధావి

అయినవాడు, తన ప్రతిభవల్ల జరగబోయేది బాగా పరిశీలించుకునీ, స్వబుద్ధితో బాగా విమర్శ చేసుకునీ, ఇతరులవల్ల వినీ కనీ కూడా బాగా తెలుసుకునీ, ప్రాజ్ఞులెవరో గుర్తించి కోరి వారితో స్నేహం చేసుకోవాలి.

వినయంవున్నవాడి కపకీర్తి రాదు. బలపరాక్రమా లున్నవాడికి అనర్థాలు రావు. క్షమ వున్నవాడికి క్రోధం కలగదు. సదాచారం వున్నవాడి కవలక్షణాలు పట్టుబడవు. వస్తుసామగ్రీ, జన్మస్థానమూ, నివసించే యిల్లూ, నడతా, భోజనపద్ధతీ, బట్టకట్టురీతీ — ఇవి బాగా పరిశీలించుకుంటే, ఎదటివాడు మంచికులంవా డవునో కాదో తెలిసిపోతుంది. కామోద్రేకం కలిగే పరిస్థితులే యేర్పడితే దేహాభిమానం విడిచిపెట్టుకున్నవాడున్నూ లోబడిపోతాడు. కామార్తుడే అయివుండిన వాడిమాట చెప్పడం యెందుకింక? పెద్దలను సేవించుకోడమూ, విద్వత్తా, ధర్మమార్గాన సంచరించడమూ, స్నేహపాత్రతా, స్నేహితులను సంపాదించుకుని వుండడమూ, మధురంగా మాట్లాడ్డమూ, — ఇవి మంచితనానికి ముఖ్యలక్షణాలు. ఇలాంటిలక్షణాలున్నవాడి స్నేహం విడిచిపెట్టుకోగూడదు.

మంచికులంలో పుట్టినా, చెడ్డకులంలో పుట్టినా, మర్యాదా అతిక్రమించనివా డయితే, ధర్మంకోసం పాకులాడేవాడూ, మెత్తనివాడూ, లజ్జావంతుడున్నూ అయితే, వందమంది కులీనులకంటే ఆమనిషే శ్రేష్ఠుడు. మనసూమనసూ, ఆంతర్యమూఆంతర్యమూ, ప్రజ్ఞా ప్రజ్ఞా కలిసినవాళ్ళకి స్నేహం యెప్పుడూ చెడిపోదు. దుర్బుద్ధిగలవాడూ, ప్రజ్ఞ లేనివాడూ, గడ్డికప్పిన నూతి వంటివాడూ — ఇలాంటివాడితో బుద్ధివున్నవా డెవడూ స్నేహం చెయ్యగూడదు. గర్విష్ఠులైన మూర్ఖులతోనూ, క్రూరులతోనూ, దుస్సాహసం గలవాళ్ళతోనూ,

ధర్మం విడిచిపెట్టినవాళ్ళతోనూ గూడా బుద్ధివున్నవా డెవడూ స్నేహం చెయ్యగూడదు.

కృతజ్ఞుడూ, ధర్మతత్పరుడూ, సత్యమే పలికేవాడూ, మృదుస్వభావంగలవాడూ, దృఢమైన భక్తిగలవాడూ, ఇంద్రియాలు జయించినవాడూ, మంచినడవడి కలవాడూ అయిన మిత్రుణ్ణి ఎప్పుడూ విడిచిపెట్టుకోగూడదు. ఇంద్రియాలను జయించడం అంటే మృత్యువును జయించడంకంటేనూ కష్టమైన పని. పోనీ అంటే, ఇంద్రియాలను పూర్తిగా జయించడం దేవతలకున్నూ సాధ్యం కానిపని.

అందరియెడలా — ప్రాణికోటి అంతటియెడలా దయగలిగివుండడమూ, అసూయలేకుండా వుండడమూ, ఓరిమీ ధైర్యమూ ఉండడమూ, మిత్రులను అవమానించకుండా వుండడమూ — ఇవి ఆయుస్సు వృద్ధిచేస్తా యంటారు, పెద్దలు. చెడిపోయిన కార్యం, బుద్ధిబలంతోనూ, నీతిననుసరించీ బాగుచెయ్యడం ఉత్తములకు వ్రతం.

దుఃఖాలు వస్తా యన్నప్పుడే జాగ్రత్తపడి ప్రతిక్రియ చేసేవాడూ, రానేవస్తే ధైర్యం చెరుచుకోకుండా వుండేవాడూ, అవి గడిచిపోయాక ఏమి చెయ్యాలో అది తెలిసినవాడూ — ఇలాంటివా డెన్నడూ — ఏవిధంగానూ చెడిపోడు. మనిషి, మనసా వాచా కర్మణా కూడా దుష్కృత్యాలకు పూనుకోగూడదు. పూనుకుంటే నాశనం అయిపోతాడు. కనక, త్రికరణశుద్ధిగా ఎప్పుడూ మంచిపనులే చెయ్యాలి.

మంగళాలంభనం — అంటే, పెరుగూ, సన్నగరికా, ఆవూ — ఇవి తాకడమూ, సహాయసంపత్తీ, యత్నమూ, ఋజువర్తనమూ — ఇవి ఐశ్వర్యం కలిగిస్తాయి. విసుగుదల లేకపోవడం, సంపత్తికీ లాభాలకూ సుఖాలకూ ప్రధానకారణం. విసుగన్నది లేనివాడు గొప్పవాడవుతాడు. అంతూ దరీ లేని సుఖాలున్నూ అనుభవించగలుగుతాడు. అందరి

మెదలా యెల్లప్పుడూ ఓరిమి చూపుతూ వుండడంకంటే సంపత్తు కలిగి చేది మరొకటి లేదు. మనిషికి హితం కలిగించేది కూడా మరొకటి లేదు.

శక్తిలేనివాడు అన్నిటికీ ఓర్చి వూరుకోడం మంచిది. శక్తిగల వాడు ధర్మంకోసం ఓర్చివూరుకోడం మంచిది. లాభమూ నష్టమూ కూడా లెక్క-చెయ్యని నిర్లిప్తుడు ఎప్పుడూ ఓరిమితో వుండడం చాలా మంచిది. ధర్మమూ అర్థమూ — ఇవి పాడుచేసుకుని కేవలమూ సుఖమే అనుభవించడం మంచిది కాదు. దుఃఖంతో కుంగిపోయినవాళ్ళూ, ఏమరివుండేవాళ్ళూ, నాస్తికులూ, సోమరిపోతులూ, ఇంద్రియాలు నిగ్రహించుకోలేనివాళ్ళూ, ఉత్సాహం చంపుకున్నవాళ్ళూ సిరిసంపదలు పోగొట్టుకుంటారు.

ఋజుమార్గాన సంచరించేవాణ్ణీ, లజ్జాస్వభావం గలవాణ్ణీ, ఎందుకూ పనికిరానివాడుగా భావించి దుర్జనులు బాధించడానికి చూస్తారు. కొంచె మయినా కుటిలస్వభావం లేనివాణ్ణీ, అతిగా దానధర్మాలు చేసేవాణ్ణీ, అతిశూరుణ్ణీ, అతిగా నియమనిష్ఠ లుండేవాణ్ణీ, తాను మహాప్రజ్ఞావంతుణ్ణని గర్వించేవాణ్ణీ చూసి లక్ష్మి భయపడి దూరంగా పోతుంది. ఇంతే కాదు, లక్ష్మి, పూర్తిగా సుగుణాలే వున్నవాణ్ణీ వరించదు. సుగుణాలు బొత్తిగా లేనివాణ్ణీ వరించదు. అంటే, లక్ష్మి, కేవలమూ సుగుణాలే కోరదు. గుణాలసలే లేకపోడమూ అంగీకరించదు. గుడ్డిఆవు లాగ, మతిలేక, యెక్కడో వొకచోట వుండిపోతుంది చివరికి.

వేదాలు చదువుకున్నందుకు అగ్నిహోత్రాలు చేసుకోడమే ఫలం. శాస్త్రాలు చదివినందుకు మంచిశీలమూ, మంచినడవడీ అలవర్చుకోడమే ఫలం. భార్య వున్నందుకు సంభోగసుఖమూ, పుత్రోత్పత్తీ ఫలం. డబ్బున్నందుకు తాననుభవించడమూ, ఇతరులకు పెట్టడమున్నే ఫలం. అధర్మంగా సంపాదించిన డబ్బుతో పరలోకసుఖంకోరి యజ్ఞాలూ యాగాలూ దానాలూ ధర్మాలూ ఎన్ని చేసినా ఫలం లేదు.

గాఢారణ్యాలకు పోయినా, వసదుర్గాల్లో బంధించినా, ఎంతెంతలేసి ఆపదలు వచ్చినా, ఎలాంటి క్లిష్టపరిస్థిలు అలుముకున్నా, మీాదికి దూసుకువచ్చి నరకడానికి శత్రువులు కత్తు లెత్తినా సత్త్వమూర్తుల కేమీా భయంలేదు. పూనికా, ఇంద్రియనిగ్రహమూ, దక్షతా, ఏమరిపాటు లేమీా, ధైర్యమూ, బుద్ధీ, బాగా ఆలోచించి యెందుకయినా పూనుకోడమూ — ఇవి ఐశ్వర్యానికి మూలకారణాలు. మహర్షులకు తపస్సే బలం. బ్రహ్మవేత్తలకు పరబ్రహ్మమే బలం. దుర్జనులకు హింసే బలం. గుణవంతులకు క్షమే బలం.

నీళ్లూ, దుంపలూ, పళ్లూ, పాలూ, హవిస్సూ, బ్రాహ్మల ఆజ్ఞా, గురువు మాటా, ఔషధమూ — ఇవి యేలాంటి వ్రతాల్లోనూ పుచ్చుకోవచ్చు. ధర్మం అంటే యేమిటో అది టూకీగా చెప్పాలంటే, ఇతరులేమిచేస్తే తనకు కష్టంగా వుంటుందో అది తానితరులకు చెయ్యకుండా వుండడమే. ఎదటివాడు క్రోధంవహిస్తే తానున్నూ అలా కాకపోడమే అందుకు విరుగుడు. సజ్జనుణ్ణి జయించాలంటే సత్కారాలు చెయ్యడమే అందుకు సాధనం. లుబ్ధుణ్ణి జయించాలంటే దానమే అందుకుపాయం. అబద్ధం జయించాలంటే సత్యమే అందుకు మార్గం.

స్త్రీలనూ, ధూర్తులనూ, సోమరిపోతులనూ, పిరికిపందలనూ, ముకోపులనూ, తానే చాలా గొప్పవాణ్ణనుకునేవాణ్ణీ, దొంగనూ, చేసినమేలు మరచినవాణ్ణీ, నాస్తికుణ్ణీ ఎందుకూ నమ్మగూడదు. పెద్దలు చెప్పినట్టు నడుచుకునేవాడికీ, పెద్దలను సేవించేవాడికీ, ఆయువూ కీర్తీ, బలమూ, సంపదా పెరుగుతాయి. చాలా కష్టపడితేగాని నెరవేరనివీ, ధర్మం తప్పితే గాని సాధ్యం కానివీ, శత్రువుని ఆశ్రయిస్తేగాని వీలుపడనివీ — ఈపను లెప్పుడూ చెయ్యగూడదు. చదువు లేని మనిషీ, సంతానభాగ్యం కలిగించని సంభోగమూ, తిన తిండీ కట్టబట్టా లేని జనులూ, రాజులేని రాజ్యమూ శోచనీయాలు.

కాలి నడకే మనిషికి ముదిమి. వాగులే కొండలకు ముదిమి. సంభోగం లేకపోడమే స్త్రీకి ముదిమి. దురుసుమాటలే మనస్సుకి ముదిమి.

వల్లించకపోడం వేదాలకూ, వ్రతనియమాలు లేకపోడం బ్రాహ్మలకూ, బాహ్లీకదేశం భూమండలానికీ, అబద్ధం మనిషికీ, భర్తకు దూరంగా వుండడం స్త్రీకీ, భంగపాటు కలిగిస్తాయి. పడుకున్నకొద్దీ నిద్ర పెరుగుతుంది గాని తరగదు. సంభోగం చేసినకొద్దీ స్త్రీకి కామం హెచ్చుతుంది గాని తగ్గదు. కట్టెలు వేసినకొద్దీ అగ్ని విజృంభిస్తుంది గాని శాంతించదు. తాగినకొద్దీ మద్యం కావా లనిపిస్తుంది గాని తృప్తి కలిగించదు.

అడిగిన వన్నీ యిచ్చి మిత్రులను తృప్తిపరచడమూ, యుద్ధంచేసి శత్రువులను ఓడించడమూ పెళ్లాంబిడ్డలకు తృప్తిగా అన్నపానాలు కూర్చడమూ — ఇవి జీవితానికి సాఫల్యం కలిగిస్తాయి. లోకంలో వందలూ వేలూ జనులు జీవిస్తూనే వున్నారు. రాజేంద్రా! బతకవలసినంతకాలమూ నువ్వూ బతుకుతావు, దానికోసం ఆదుర్దాపడనక్కర లేదు. భూమండలంలో వున్న ధనధాన్యాలూ, స్త్రీల్లూ, పశువులూ — సర్వమూ తనకే స్వాధీనం అయినా తృప్తికలగ దెవరికీ.

ఇంతకీ, — అప్పుడే కాదిప్పుడూ, మరెప్పటికిన్నీ కూడా నేను చెప్పేదొక్కటే, నిజంగా నీకు అందరియెడలా సమదృష్టి వుందా? వుంటే, నీకొడుకులనూ పాండుపుత్రులనూ కూడా సమానంగా చూడు."

## 40

## మంత్రోపదేశం 8

విదురుడు మళ్ళీ ప్రారంభించాడు.

"శక్తివంచన లేకుండా సజ్జనులు మెచ్చుకునేటట్టు పనిచేసేవాడు త్వరలో గొప్పకీర్తి పొందుతాడు. తమర్నానందపెట్టేవాణ్ణి సజ్జనులు

సుఖపడేటట్టు చెయ్యగలరు. ఎంత లాభం కలిగించే దయినా, ఆపని మానేసేవాడు, తాచుపాము కూసం విడిచిపెట్టేటట్టు దుఃఖాలు విడిచి పెట్టి సుఖపడతాడు. అబద్ధా లాడి లాభం గడించడమూ, రాజుతో కొండేలు చెప్పడమూ, చాటున గురువుని నిర్బంధించడమూ బ్రహ్మ హత్య కేమీ తక్కువకావు.

అసూయ అంటే మృత్యువు తప్ప మరేమీ కాదు. గురువునకు సేవలు చెయ్యకపోడమూ, తొందరపడ్డమూ, తనని తానే మెచ్చుకోడమూ, — ఈమూడూ చదువు సాగనియ్యవు. బద్ధకమూ, మద మోహాలూ, చిన్నతనపుచేష్టలూ, పోట్లుకబుర్లూ, పొగరూ, దర్పమూ, త్యాగం లేకపోడమూ — ఈయేడూ చదువుకునేవాడు దగ్గిరకు రానివ్వ గూడని మహాదోషాలు. సుఖంకోరేవాడికి విద్యరాదు. విద్య కోరే వాడికి సుఖం వుండదు. కనక, సుఖమే కావా లంటే విద్యా, విద్యే కావాలంటే సుఖమూ వదులుకోవాలి. ఎన్ని కట్టెలు వేసినా అగ్నికి తృప్తి కాదు. ఎన్నినదులు వచ్చిపడ్డా సముద్రానికి తృప్తిలేదు. ఎంతమందిని చంపినా యమునికి తృప్తి కలగదు. ఎందరు పురుషులను కూడినా స్త్రీ కూడా తృప్తిపడదు.

ఆశవుంటే ధైర్యం హరించిపోతుంది. యముడు సమృద్ధిని చేరుస్తాడు. క్రోధం సంపదలను నాశనం చేస్తుంది. లోభం కీర్తిని హరిం చేస్తుంది. ఆలనాపాలనా లేకపోడం పశువులను నాశనంచేస్తుంది. ఒక్క బ్రాహ్మడు చాలు, కోపంవస్తే రాష్ట్రం అంతా పాడుచెయ్యడానికి.

మేకలూ, కంచూ, వెండీ, తేనెటీగలూ, శ్రోత్రియుడూ, ముసలి జ్ఞాతీ, బీదకులీనుడూ — వీరి నెప్పుడూ ఇంట్లో వుంచుకోడం మిక్కిలీ శ్రేయస్కరం. రాగిపాత్రలూ, మంచిగంధమూ, వీణా, అద్దమూ, తేనే, నెయ్యీ, రాగీ, లోహమూ, శంఖమూ, సాలగ్రామమూ, వంశలోచనా — ఇవి చాలా మంచివస్తువులు. దేవతలనూ, బ్రాహ్మ

లనూ, అతిథులనూ పూజించడాని కెప్పుడూ యివి యింటో వుండడం మంచి దని దృఢంగా చెప్పాడు స్వాయంభవమనువు.

నేనెన్నిమా ట్లెంతచెప్పినా నీకు చెప్పే దొకటే. ఇది చాలా మంచిది. చాలాగొప్పదిన్నీ. ఏమిటంటావా? కామంవల్లగానీ, లోభం వల్ల గానీ, ప్రాణాలకోసం గానీ నువ్వెప్పుడూ ధర్మం విడిచిపెట్టవద్దు. ధర్మం శాశ్వతం. సుఖమూ, దుఃఖమూ శాశ్వతాలు కావు. జీవుడు శాశ్వతం. మాయ మాత్రం శాశ్వతం కాదు. కనక, శాశ్వతాలకోసం అశాశ్వతాలను విడిచిపెట్టుకో. దాంతో నీకు తృప్తి కలుగుతుంది.

ధనధాన్యాలతో నిండివుండిన యీభూమండలం యెందరో రాజులు పాలించారు. వారందరూ మహాబలవంతులూ మహానుభావులున్నూ; కాని అంత చేసిన్నీ, ఆరాజ్యం అంతా విడిచి, ఆభోగాలున్నూ విడిచి పెట్టేసి యమునికి స్వాధీనం అయిపోయారు వారు. కొడుకంటే యెంతో ప్రేమగదా యెవరి కయినా? ఆకొడుకు చచ్చిపోతే క్షణం అయినా యింటో వుండనివ్వరు. ఎక్కడికో తీసుకుపోతారు దూరంగా. జుట్టు విరబోసుకుని యేడ్చియేడ్చి, చివరికి చితిలో పడేస్తారు, కట్టెలతోపాటు. చచ్చిపోయినవాడి డబ్బంతా మరొక డనుభవిస్తాడు. వాడి శరీరం మాత్రం కాకులూ గద్దలూ కుక్కలూ నక్కలూ తింటాయి. చివరికి నిప్పయినా బుగ్గిచేసేస్తుంది. ఇక చచ్చినవాడు, పుణ్యమూ పాపమూ — ఈరెండింటిలో వొకటి మాత్రమే కూడా పట్టుకుపోతాడు.

ఎంత చెట్టున్నా, దానికి పువ్వులూ కాయలూ పళ్ళూ లేకపోతే పక్షు లది విడిచివెళ్ళిపోతాయి. అలాగే, చచ్చిపోయినవాణ్ణి, జ్ఞాతులూ, స్నేహితులూ, చివరికి కన్నకొడుకులూ కూడా విడిచిపెట్టేస్తారు. చచ్చి పోయినవాడితో, చేసుకున్న కర్మ మాత్రమే వెంటబడుతుంది. కనక, మనిషి అయినవాడు, శ్రద్ధచేసి, ధర్మం సంపాదించుకోవాలి, మెల్లి మెల్లిగా.

రాజేంద్రా, ఈలోకాని క్రిందా పైనీ గూడా గాఢమైన అంధకారం వుంది. అది యింద్రియాలను మోహపెట్టేస్తుంది. ఇది బాగా గుర్తించుకోవాలి నువ్వు. అది నిన్నంటగూడదని నాకోరిక. నామాట వింటివా, విని అలా నడుచుకుంటివా నీకు గొప్పకీర్తి వస్తుంది. ఇహలోకంలోనూ పరలోకంలోనూ గూడా నీకు భయం అన్నది వుండదు.

ఆత్మ ఒక నది. పుణ్యమే అందులో నీరు. సత్యమే దానికి జన్మస్థానం. ధైర్యమే దానికి వొడ్డు. దయాదాక్షిణ్యాలే అందులో కెరటాలు. అందులో స్నానం చేసినవాడు పుణ్యం చేసుకున్నవాడవుతాడు మనిషి. ఇంకోనది వుంది. పంచేంద్రియాలూ అందులో నీరు. కామమూ క్రోధమూ అందులో మొసళ్ళు. ధైర్యం అనేనావ యెక్కితివా, నువ్వు పునర్జన్మ అనే సుడిగుండంలో పడకుండా వొడ్డెక్కగలవు.

ప్రజ్ఞలోనూ, ధర్మంలోనూ, విద్యలోనూ, వయస్సులోనూ పెద్ద అయిన బంధువు నాశ్రయించుకుని వుండి, ఏది చెయ్యవచ్చునో యేది చెయ్యగూడదో అతనివల్ల తెలుసుకుని, అతను చెప్పినట్టు నడుచుకునేవాడెప్పుడూ చెడిపోడు. శిశ్నోదరాలను ధైర్యంతో రక్షించుకోవాలి. కళ్లతో కాళ్లూ చేతులూ రక్షించుకోవాలి. మనస్సుతో కళ్లూ చెవులూ రక్షించుకోవాలి. చేసే పనితో మనస్సూ వాక్కూ రక్షించుకోవాలి.

స్నానమూ, సంధ్యావందనమూ, వేదాధ్యయనమూ, దేవపితృతర్పణాలూ, జపమూ, హోమమూ చేసుకుంటూ, సత్యమే పలుకుతూ, పతితులయింట భోజనం చెయ్యకుండా గురువుచెప్పినట్టు నడుచుకునే బ్రాహ్మడు బ్రహ్మలోకానికి వెళ్లిపోతాడు, శాశ్వతంగా. వేదాలు చదువుకుని, నిత్యాగ్నిహోత్రాలు చేసుకుంటూ, యజ్ఞాలుచేసి, జనులను ధర్మమార్గాన పాలించి, గోవులనూ బ్రాహ్మలనూ పూజించి అగత్యం అయితే, యుద్ధరంగంలో ప్రాణాలు విడిచే క్షత్రియుడు స్వర్గానికి వెళ్లిపోతాడు. వేదాలు చదువుకుని, బ్రాహ్మలనూ క్షత్రియు

లనూ పూజిస్తూ, డబ్బు సంపాదించి తనని ఆశ్రయించుకున్నవాళ్లకి పెట్టి, తానున్నూ అనుభవించి, యజ్ఞయాగాలు చేసిన వైశ్యుడు స్వర్గసుఖాలు పొందుతాడు. శూద్రుడు, బ్రాహ్మణులనూ, క్షత్రియులనూ, వైశ్యులనూ పూజించాలి. వారికి ఇష్టంగా నడుచుకోవాలి. ఇలాచేస్తే పాపాలన్నీ పోయి శూద్రుడున్నూ స్వర్గసుఖా లనుభవిస్తాడు.

రాజేంద్రా, నాలుగువర్ణాలవారికీ ఏర్పడ్డ ధర్మాలివి. ధర్మనందనుడు సర్వలక్షణసంపన్నుడైన క్షత్రియుడు. అతను, ప్రజలను ఏలకపోడం శ్రేయస్కరం కాదు. కనక, నువ్వతణ్ణి రాజుని చెయ్యాలి"

ఇదంతా విన్నాడు ధృతరాష్ట్రుడు. "విదురా, నువ్వు చెప్పిందంతా ధర్మమే. పాండుపుత్రుల విషయం తలుచుకున్నప్పుడల్లా నాకూ యిలాగే అనిపిస్తూ వుంటుంది. కాని దుర్యోధనుణ్ణి చూస్తే మాత్రం యిదంతా పోతుంది. ఇంతకీ, — అంతా దైవాధీనం. దైవానికి వ్యతిరేకం చెయ్యడం యెవరికయినా శక్యమా" అనడిగాడు.

# 41

## సనత్సుజాతీయం

"విదురా, నువ్వు చాలా విచిత్రాలు చెబుతున్నావు. నువ్వింతవరకూ చెప్పినవి సరే, చెప్పని వేమయినా వుంటే అవి చెప్పు" అనడిగాడు ధృతరాష్ట్రుడు. దానికి విదురుడు "రాజేంద్రా! పురాణపురుషుడైన సనత్సుజాతుడు మనుష్యులకు మరణం లేదని చెప్పాడు. అతను చాలా గొప్ప పండితుడు. హృదయంలో గుప్తంగా వున్నవీ, ప్రకాశంగా వున్నవీ సంగతు లన్నీ నీకతను చెబుతాడు" అని బదులు చెప్పాడు. "నీకవేమీ తెలియవా? ఆసనాతనుడు చెబుతా డన్నదంతా నువ్వే చెప్పరాదూ నాకు?" అని మళ్ళీ అడిగాడు, ధృతరాష్ట్రుడు.

"నాకు అర్హత లే" దన్నాడు విదురుడు. "నేను శూద్ర స్త్రీ యందు పుట్టాను. నే నదేమీ చెప్పగూడదు. చెప్పనూ లేను. సనత్సు జాతుడు బ్రాహ్మణోత్తముడు. అతనికి తెలియని రహస్యమున్నూ లేదు. నేనది చెబితే దేవతలు గర్హిస్తారు. అతను చెబితే హర్షిస్తారు." అని వివరాలున్నూ చెప్పా డతను.

"అయితే, నేను, ఆ మహానుభావుణ్ణి ఇక్కడే యీ శరీరంతో కలుసుకోగలనా?" అని మళ్ళీ అడిగాడు ధృతరాష్ట్రుడు. వెంటనే విదురు డతణ్ణి తలుచుకున్నాడు. దాంతో, సనత్సుజాతు డక్కడ సాక్షాత్కరించా డప్పటికప్పుడు.

వెంటనే విదురుడు యథాశాస్త్రంగా అర్ఘ్యమూ పాద్యమూ, మధు పర్కమూ మొదలైనవిచ్చి అతణ్ణి సత్కరించి "భగవన్! ఈకౌరవ రాజు ధృతరాష్ట్రుని కొక సందేహం వుంది. అది చెప్పడానికి నేను తగను. నువ్వే తగుదువు. అది వింటే, యీరాజేంద్రునకు దుఃఖాలన్నీ పోతాయి. ప్రియమూ అప్రియమూ, లాభమూ, నష్టమూ, ముదిమీ మరణమూ, భయమూ క్రోధమూ ఆకలీ దప్పికా, మదంవల్ల పుట్టిన అరతీ, తంద్రా, కామమూ, క్రోధమూ జననమూ మరణమూ — ఇవన్నీ తెలుసుకుని ఆనందిస్తాడు" అని కోరాడు.

# 42

## సనత్సుజాతీయం 2

శాస్త్రజ్ఞానసంపన్నుడైన ధృతరాష్ట్రుడు, సనత్సుజాతుణ్ణి పూజించి "మహాత్మా, నువ్వు మరణమే లేదన్నా వని చెప్పాడు విదురుడు. దేవతలూ అసురులూ కూడా తమకు మృత్యువు సంభవించకుండా వుండా లని బ్రహ్మచర్యవ్రతం అవలంబిస్తా రని చెబుతారు పెద్దలు.

మరి, మృత్యు వనేది వుందా లేదా? ఇందులో యేది నిజం?" అనడి గాడు, ఏకాంతాన. సనత్సుజాతు డందుకున్నాడు దానిమీద.

"రాజేంద్రా, రెండూ నిజమే. మోహంవల్ల మృత్యువుసంభవిస్తుం దన్నమాట పెద్దలు చెప్పేదే. మరి మృత్యువంటే? ప్రమాదం తప్ప మరేమీ కాదు. ఆ ప్రమాదం లేకపోడమే అమృతత్వం. ప్రమాదం అంటే తానెవరో తెలియకపోడం. ఆత్మజ్ఞానం లేకపోడం అన్నమాట. ఈ ప్రమాదంవల్లనే అసురులు పరాభవం పొందారు. ప్రమాదంలేక పోతే బ్రహ్మీభూతు లవుతా రెవరయినా. అంటే, అమరు లవుతారు. మృత్యు వనేది మీదపడి జంతువులను తినే పెద్దపులివంటిది కాదు. దాని కొక రూపం అంటూ లేదు.

మృత్యువంటే ప్రమాదం కాదనీ, అది వేరే మరొకటనీ, దాని పేరే యము డనీ అంటారు కొందరు. ఆ యముడు పితృలోకంలో రాజ్యం చేస్తూ వుంటా డనీ, అతను, పాపంచేసిన వారిని కష్టపెడతా డనీ, పుణ్యంచేసినవారిని సుఖసుపెడతా డనీ అంటారు వారు. బ్రహ్మ చర్యం అంటే ఆత్మానుసంధానం అన్నమాట. దానివల్ల ఆత్మజ్ఞానం కలుగుతుంది. అంటే, ఆత్మకీ పరమాత్మకీ భేదం లేదనీ, వొకటే అనీ జ్ఞానం కలుగుతుంది. అదే అమృతత్వం. యముని ఆజ్ఞవల్ల క్రోధమూ ప్రమాదమూ లోభమూ — ఇన్ని రూపాలతో బయలుదేరుతుంది మృత్యువు. మనుష్యులు అహంకారానికి వశు లయిపోతారు. తప్పు దారులు తొక్కుతారు. శరీరమే తాము అనుకోడంవల్ల ఆత్మైక్యం పొందలేరు.

వారు ఆ ప్రమాదంవల్ల, ఇహలోకం పరలోకం — వీటిమధ్య తిరు గుతూ వుంటారు. అంటే, మళ్ళీపుట్టడం మళ్ళీచచ్చిపోడం — ఇవి వారి కొకటి తరవాత వొకటి యెడతెగకుండా వస్తూవుంటాయి. ఏదో కోరిక పెట్టుకునే చేస్తారు, వారే కర్మ అయినా, దానికి ఫలం కలుగు

తుంది. ఆ ఫలం — అంటే ఆభోగా లనుభవించడానికి వారు స్వర్గానికి వెడతారు. ఆఫలం పూర్తి అయిపోగానే మళ్ళీ భూమ్మీద పుడతారు. అంచేత, మృత్యువును తప్పించుకోలేరు వారు.

ఈ శరీరమే తా ననుకునేవాడు ఇంద్రియవ్యాపారాలమీదే తన మనస్సు నిలుపుకుంటాడు. దాంతో వాడి అజ్ఞానం బలపడుతుంది. అంటే ఆమనిషిని మాయ కమ్ముకుంటుంది. వాడి కిక బ్రహ్మభావం కలగదు. ఈ సంసారసాగరంలో మునుగుతూ తేలుతూ వుంటాడు.

ముందు, విషయసుఖాలమీది ఆశే వారిని నాశనంచేస్తుంది. తరవాత, కామక్రోధాలు, ఆనాశనం పూర్తిచేస్తాయి. మూఢు లీవిధంగా మృత్యువుకి దగ్గిరపడతారు. పండితు లలా కాదు. ధైర్యంవహించి విషయసుఖాలు విడిచిపెట్టేస్తారు వారు. దాంతో, వారు మృత్యువును జయించగలుగుతారు. "భోగాదివిషయా లన్నీ అనిత్యాలు. అవి దుఃఖం కట్టికుడుపుతాయి" అని తెలిసినవాడు వాటినే నాశనం చేస్తాడు. అంటే విడిచిపెట్టేస్తాడు. పండితు డంటే అలా చెయ్యగలవాడే పండితుడు. వాడు మృత్యువునకు తానే మృత్యు వవుతాడు.

కోరికలు క్షణక్షణమూ పుడుతూనే వుంటాయి. వాటికి లొంగిపోయేవాడు వాటితోనే కడతేరిపోతాడు. పండితుడైనవాడు, వెనకటి జన్మలో తానుచేసుకున్న పుణ్యమూ పాపమూ కూడా అనుభవంవల్ల కాక, జ్ఞానంవల్ల పోగొట్టుకుంటాడు. అదేమోక్షమార్గం. కోరిక అంటే అంధకారం అన్నమాట. నరకం అంటే అదే. కల్లుతాగి మత్తెక్కిన వాడు, గొయ్యా నుయ్యా గుర్తించుకోకుండా ముందుకి పరుగెత్తుతాడు. కోరికలు గలవారున్నూ — అంటే పుణ్యకర్మలు చేసేవారున్నూ అలాగే నరకంకేసి పోతూవుంటారు, క్రమంగా.

మృత్యువు గడ్డితో చేసిన పులిబొమ్మ వంటిది. కోరికల ఆతర్యం తెలుసుకుని, స్త్రీవ్యామోహం మొదలయిన విషయసుఖాశలు పెట్టుకో

కుండా జ్ఞానం సంపాదించుకునే పండితు ణ్ణదేమీ చెయ్యలేదు. ఈశరీ రమే నేననుకుంటున్నావు నువ్వు. కనక, కామక్రోధాధులే నీకు మృత్యు వవుతాయి. మృత్యువు రహస్యమూ, పరబ్రహ్మస్వరూపమూ తెలుసు కున్నవాడు మృత్యు వంటే భయపడడు. పామరుణ్ణి నశింపజేసే మృత్యువు, పండితుడి దగ్గిరికి వచ్చాఎప్పటికి తానే నశించిపోతు ది"

ఇది విని ధృతరాష్ట్రుడు "మహాత్మా, యజ్ఞయాగాదికర్మలే సనాతనా లనీ, అవే పుణ్యం కలిగిస్తా యనీ, అవి చేస్తేనే మనిషికి పుణ్యలోకాలు లభిస్తాయనీ పెద్దలు చెబుతున్నారు. పుణ్యలోకాలు పొందడమే పరమపురుషార్థం అని వేదాలు చెబుతున్నాయి. ఇది తెలిసిన పండితుడు కర్మచెయ్యకుండా యెలావుంటాడూ ?" అనడిగాడు. దీనికి సనత్సుజాతుడు "ఉత్తమలోకాలు లభించడమే ఉత్తమం అను కునేవాడు పండితుడు కాడు, అజ్ఞాని. వేదాలు చెప్పేమాట, అజ్ఞానికి గాని జ్ఞానికి కాదు. ఏమంటే ? పుణ్యకర్మలు చేస్తే ఉత్తమలోకాలు లభిస్తాయి సందేహం లేదు ; కాని అది శాశ్వతం కాదు. అనుభవం వల్ల పుణ్యం కొన్నాళ్ళకు తరిగిపోతుంది. పుణ్యం తగ్గిపోగానే మళ్ళీ భూలోకంలో పుట్టడం తప్పదు. అంటే, పుణ్యకర్మలవల్ల జన్మపరంపర పెరుగుతూనే వుంటుంది. దానివల్ల యెన్నటికీ మోక్షం లభించదు. అంచేత, జ్ఞాని అయినవా డెన్నడూ కర్మలు చెయ్యడు. బ్రహ్మోపాసన చేస్తూ వేదమార్గం విడిచిపెట్టేస్తాడు" అని బదులు చెప్పాడు.

"పరమాత్మ ఆద్యంతాలు లేనివాడు. సనాతనుడున్నూ. ఆపరమాత్మే ఈ భూతసృష్టి అంతా చేస్తున్నా డంటే, మరి, అతణ్ణెందుకు నియ మించేవా రెవరు ?. పరమాత్మ తానే గదా యీలోకంలో యిన్ని రకాల పుట్టుకలు పుడుతున్నాడు ? దానివల్ల అతని క్కలిగే ప్రయో జనం యేమిటి ? అలా పుట్టకుండా వుంటే అతనికలిగే కష్టమున్నూ

యేమిటీ? ఇదంతా నాకు వివరంగా చెప్పు" అని మళ్ళీ అడిగాడు ధృతరాష్ట్రుడు. సనత్సుజాతుడు ప్రారంభించాడు.

"రాజేంద్రా! కూటస్థుడు ఒక్కడే. భేదం వుందనడం మహా దోషం. ఆపరమాత్ముడొక్కడే అయివుండిన్నీ అనాది అయిన అవిద్య వల్ల అనేకరూపాలుగా కనబడతాడు. మాయవల్ల ఆత్మ వేరు, అనిపిస్తుంది. కాని అది నిజంకాదు. అభేదమే సత్యం. పరమాత్ముడికి పైవాడెవడూ లేడు. మాయవల్లనే పరమాత్మకు జగత్కారణత్వం కనపడుతోంది. భగవంతుడు నిత్యుడు. మాయవల్లనే అత నీజగత్తంతా కల్పిస్తున్నాడు. భగవంతునకు మాయ ఉన్నదని వేదాలే చెబుతున్నాయి"

దీనిమీద "లోకంలో కొందరు యజ్ఞాలూ యాగాలూ మొదలైన ధర్మకార్యా లెందుకు చేస్తున్నారూ? మరికొందరు సురాపానం మొదలైన పాపా లెందుకు చేస్తున్నారూ? ధర్మం పాపాలు పోగొడుతుందా, పాపాలు ధర్మం నాశనంచేస్తాయా?" అని మళ్ళీ అడిగాడు ధృతరాష్ట్రుడు. దీనికి సనత్సుజాతు డిలా ప్రారంభించాడు.

"రాజేంద్రా! జ్ఞాని అయినవాడు, తాను పుణ్యకర్మలు చేసినా పాపకర్మలు చేసినా తన జ్ఞానాగ్నితో ఆపుణ్యపాపాలు దహించేసుకుంటాడు. అంటే, తనకు కర్మఫలం అంటకుండా చూసుకుంటాడు. కర్మఫలం నశిస్తే గాని మోక్షంలేదు మరి. ఫలంకోరి పుణ్యమో పాపమో చేసేవాడు అది అనుభవించి తీరాలి. పుణ్యపాపాలు చేసుకోడం యిక్కడా అనుభవించడం పరలోకంలోనూను. పండితుడైన వాడు ధర్మమే ప్రధానంగాచూసుకుంటాడు. అంతబలీయమైనది మరొకటిలేదు.

బలవంతు డైన రాజు, తన బలపరాక్రమాలవల్ల తన రాజ్యాభివృద్ధి చేసుకుంటే, అది చూసి, తక్కినవారున్నూ అలాగే గొప్పతనం సంపాదించుకోడానికి పోటీపడతారు. అలాగే, స్వర్గసుఖా లనుభవించడానికి, యజ్ఞాలూ యాగాలూ చేసేవారిని చూసి, వారికంటే యెక్కువ సుఖా

లనుభవించా లని పోటీపడి అంతకంటే పుణ్యకార్యాలు చేస్తారు మరి కొందరు; కాని పండితు లైనవా రిలా చెయ్యరు. వారే ఫలమూ ఆశించరు. అంటే, కోరికలు పెట్టుకోరు వారు. ఈ లోకంలో వున్నందుకు తాము కొన్ని కర్మలు చెయ్యవలసివుం దని గుర్తించు కుంటారు వారు. అవి మాత్రమే చేస్తారు. ఆ చెయ్యడమున్నూ నిష్కామంగా చేస్తారు. వాటివల్ల కలిగే ఫలాలు బ్రహ్మార్పణం చేసే స్తారు వారు. అందువల్ల వారు, పుణ్యానికీ పాపానికీ కూడా దూరులయి పరమాత్మలో ఐక్యం అయిపోతారు. అంటే మోక్షం పొందుతారు.

వారికి విరక్తు లని పేరు. దగ్గిరవారూ పైవారూ కూడా వారిని లక్ష్యపెట్టరు. అన్నపానాలకు లోటులేని బ్రాహ్మలు ఈవిరక్తుల నాదరిస్తారు. కనక, వారున్నచోటే వుంటారు వీరు. జ్ఞాని-అంటే పండితుడు, తన శక్తి యెవరికీ తెలియనివ్వడు. అంచేత, అతణ్ణెవరూ లెక్క చెయ్యరు. ఆదరించరు. తన కేవిధంగానూ కష్టాలు కలిగించనివారి అన్నమే స్వీకరిస్తాడు పండితుడు. బ్రహ్మవేత్త అయిన పండితుడు, తన పుత్రమిత్రకళత్రాదులతో కలిసేవుండినా, యెప్పుడూ యోగసమాధి లో వుండి ఆ బ్రహ్మపదార్థంకోసమే చూస్తూ వుంటాడు.

ఆత్మకు శరీరం లేదు. స్త్రీఅనీ పురుషు డనీ భేదం లేదు. ఏపనీ అక్కర్లేదు. ఆకలిదప్పికలూ, శోకమోహాలూ, జరామృత్యువులూ, ప్రియాప్రియాలూ, సుఖదుఃఖాలూ శీతోష్ణాలూ — ఇలాంటి ద్వంద్వాలేవి. ఇవన్నీ దేహానికే వుంటాయి. ఈదేహమే తా ననుకోడం తప్పు. ఈశరీరమే తాను అనుకునేవాడు దొంగ. వాడు పాపాత్ముడు. బ్రహ్మ వేత్త అయిన పండితుడు, సంసారసంబంధ మైన మమకారంలో పడ కూడదు. తానొక గొప్పవా డన్నట్టూ వుండకూడదు. తాము బ్రహ్మ వేత్తల మని చెప్పుకుంటూ జనులవల్ల పూజలూ సత్కారాలూ పొందే వారు కక్కినవస్తువులు తిని బతికే కుక్కలవంటివారు.

పెళ్లాం బిడ్డలమీాదా, ధనధాన్యాలమీాదా ఆసక్తి లేనివారూ, వేదాల్లో చెప్పివున్న బ్రహ్మచర్యమూ, అహింసా, సత్యమూ, అపరిగ్రహమూ సమాధీ మొదలైనవాటిమీాదే ఆసక్తి కలవారూ పరబ్రహ్మస్వరూపులని తెలుసుకోవాలి. వారి నెవరూ కదల్చలేరు. ఏమీా చెయ్యలేరు. యజ్ఞాలూ యాగాలూ — ఇలాంటి పుణ్యకర్మలు చేసి దేవతల అనుగ్రహం సంపాదించుకున్నవాడూ, అలాంటివాణ్ణి అనుగ్రహించే ఆదేవతలూ కూడా బ్రహ్మవేత్తకు సరిరారు. ఆబ్రహ్మవేత్త యెంత గూఢంగా సంచరిస్తున్నా బుద్ధిమంతులు కొందరతణ్ణి గుర్తించేస్తారు. భక్తితో వారతణ్ణి పూజిస్తారు. అయినా, ఆబ్రహ్మవేత్త తనకి తనక అలాంటి సత్కారాలు జరుగుతున్నాయని పొంగిపోగూడదు. తన సంగతి తెలియనివారు తనని అవమానిస్తారు. అందుకూ అతను ఖేదం పొందగూడదు.

కళ్లు తమకితామే మూసుకుంటాయి. మళ్ళీ తెరుచుకుంటాయి. ఇది లోకస్వభావం. కొందరు గౌరవించేవారుంటారెవరికయినా. కొందరు అగౌరవించడమే పెట్టుకుంటారు. అలాంటివారి మధ్య ఉండక తప్పని బ్రహ్మవేత్త మానానికీ అవమానానికీ గూడా చలించగూడదు.

మృష్టాన్నమూ, సుందరాంగనలూ, ధనధాన్యాలూ, వస్తువాహనాలూ కావాలని దీక్షగా పనిచేసేవాడు అవి సంపాదించుకుంటాడు. కాని అవన్నీ బ్రహ్మజ్ఞానానికీ బ్రహ్మజ్ఞానం కలవారికీ శత్రువులు. ఈసంగతి గ్రహించలేనివాడికి, బ్రహ్మానందం యెన్నటికీ లభించదు. సజ్జనులు చెప్పేదేమిటంటే? సత్యమూ, ఋజువర్తనమూ, సిగ్గూ, ఇంద్రియనిగ్రహమూ, శౌచమూ, బ్రహ్మవిద్యా — ఇవి ఆరూ బ్రహ్మానందానికి మార్గాలు. సామాన్యులకివి అందవు. ఇవి మానమోహాలకు వ్యతిరేకాలు"

# 43

## సనత్సుజాతీయం 3

"మహాత్మా, మౌనం యెవరికి? మౌనం అంటే యేమిటి? మౌనం వల్లనే పండితుడైనవాడు నిర్వికల్పం అయిన పదవి సంపాదించు కుంటాడా? ఈమౌనం నిర్వహించడం యెలాగ? ఇదంతా నాకు వివరించి చెప్పు" అని ధృతరాష్ట్రు డడగ్గా సనత్సుజాతుడు "రాజేంద్రా! వేదాలూ మనస్సూ కూడా పరమాత్మను పొందలేకపోతున్నాయి. అంచేత, పరమాత్మకే మౌనం అనిపేరు. వేదాలు పరబ్రహ్మను వివరించి చెబుతాయి. బ్రహ్మనుంచే పుట్టాయి వేదాలు" అని బదులు చెప్పాడు.

"అయితే, ఋగ్వేదమూ, యజుర్వేదమూ, సామవేదమూ, చదువుకున్న బ్రాహ్మడు పాపాలుచేస్తే ఆపాపా లతని కంటవా!" అని ధృతరాష్ట్రుడు మళ్లీ అడిగాడు. "రాజేంద్రా! నీకు సత్యం చెబుతా విను. ఋగ్వేదమూ, యజుర్వేదమూ, సామవేదమూ కూడా మాయకాళ్లయిన బ్రాహ్మల పాపాలు పోగొట్టవు. రెక్కలు వచ్చాక పక్షి పిల్లలు గూళ్లువిడిచి వెళ్లిపోతాయి. వేదాలు అలాగే అభ్యసించినవాడు చచ్చిపోగానే అతణ్ణి విడిచివెళ్లిపోతాయి" అని మళ్లీ బదులుచెప్పాడు సనత్సుజాతుడు.

"మహాత్మా, చదువుకున్నవారి పాపాలు వేదాలు పోగొట్టలేనప్పుడు, మరి, బ్రాహ్మలు "వేదాలు వేదా" లంటూ కూచుంటా రెందుకూ?" అనడిగాడు ధృతరాష్ట్రుడు. "రాజా, మాయాకల్పితమైన పరమాత్మ నామరూపాదివిశేషరూపంతో యీప్రపంచం అంతా భాసిస్తోంది. ఈవిషయం వేదాలవల్లా, వేదవేత్తలవల్లా తెలుస్తుంది. పరమేశ్వరుని రూపం ఈజగత్తుకంటే భిన్నమైనది. వేదాలు చదువుకుంటే బ్రహ్మప్రాప్తికి ఉపాయాలు తెలుస్తాయి. ఆపరబ్రహ్మను పొంద

డానికే తపస్సు. వేదాలు చెప్పే యజ్ఞయాగాలు చేస్తే పుణ్యం లభిస్తుంది. ఆపుణ్యంవల్ల వేదవేత్త పాపాలు పోగొట్టుకుంటాడు. జ్ఞాని అవుతాడు. దాంతో, చివరికి బ్రహ్మైక్యం పొందుతాడు. స్వర్గసుఖాల కోసం యజ్ఞయాగాలు చేసేవాడు ఆసుఖాలు పూర్తిగా అనుభవించి మళ్ళీ యీసంసారంలో పడతాడు. అంటే, మళ్ళీ మనిషి అయి పుడతాడు. ఈలోకంలోతపస్సుచేస్తే పరలోకంలో సుఖం కలుగుతుంది. బ్రాహ్మలు — అంటే వేదం చదువుకున్నవారు చేసే తపస్సుఫలకాలంలో మిక్కిలీ వృద్ధి అవుతుంది. అలా కాక, అజ్ఞాని అయినవాడు ఎంత తపస్సు చేస్తే అంతే ఫలం అవుతుంది ; గాని వృద్ధికాదు. అంటే వేదవేత్త చేసిన తపస్సు ముక్తికలిగిస్తుంది. ఇతరులుచేసింది స్వర్గసుఖాలు మాత్రమే కలిగిస్తుంది. అని మళ్లీ బదులుచెప్పాడు సనత్సుజాతుడు.

"మహాత్మా, వేదవేత్తల తపస్సు వృద్ధి అవుతుం దన్నావు. గొప్ప ఫలా లిస్తుం దన్నావు. అదంతా యెలా తటస్థిస్తుందీ? తపస్సు కేవలం అని యెలా అనిపించుకుందీ?" అనడిగాడు ధృతరాష్ట్రుడు మళ్ళీ.

"రాజా, నిష్కలుషం అయిన తపస్సు "కేవలం" అనిపించుకుంటుంది. అదే వృద్ధిఅయి గొప్పఫలా లిస్తుంది. నువ్వు సన్నడిగే విషయం అంతా తపోమూలం. తపస్సువల్ల వేదవేత్తలు అమృతత్వం పొందుతారు" అని మళ్ళీ చెప్పాడు సనత్సుజాతుడు.

"మహాత్మా, తపస్సు నిష్కల్మషంగా వుండా లన్నావు. కల్మషం యేమిటి? ఈరహస్యం నాకు వివరించి చెప్పు" అని మళ్ళీ ధృతరాష్ట్రుడి ప్రార్థన.

"రాజేంద్రా, తపస్సుకి కల్మషాలు పన్నెండు. అవి క్రోధం మొదలైనవి. క్రూరత్వం మొదలైనవి మరో యేడున్నూ వున్నాయి దోషాలు. తపస్సుకి గుణాలున్నూ పన్నెండు. అవి జ్ఞానం మొదలైనవి. ఈగుణదోషాలు నీకు వివరించి చెబుతా విను.

1 క్రోధం — కోరిక సిద్ధించకపోతే కలుగుతుం దది. 2 కామం — పూలదండలూ, మైపూతలూ, స్త్రీలూ — వీటిమీాది కోరిక. 3 లోభం— ఇతరుల డబ్బుమీాద కోరిక. లేక, తాను గడించిన డబ్బు సత్పాత్ర దానం చెయ్యకపోడం. 4 మోహం — చెయ్యతగ్గ దేదో చెయ్యరాని దేదో తెలుసుకోలేకపోడం. 5 వివిత్స — విషయసుఖాల వివరాలు తెలుసుకోవా లన్న కోరిక. 6 నిర్దయ — కఠినంగా ప్రవర్తించడం. 7 అసూయ — ఇతరుల గుణాలు దోషాలు అని వాదించడం. లేక, ఇతరుల సుగుణాలు చూసి సహించలేకపోడం. 8 మానం అభిమానం— అంటే తానే గొప్పవాణ్ణనుకోడం. ఇదే గర్వం. 9 శోకం — తనకి ప్రీతి పాత్ర.మైనది పోతే కలిగే మనోవికారం. 10 స్పృహ — విషయసుఖా లనుభవించాలన్న కోరిక. 11 ఈర్ష్య — ఇతరులు సుఖపడుతూవుంటే చూసి సహించలేకపోడం. 12 జుగుప్స — ఇతరుల సుగుణాలు పైకి రాకుండా చెయ్యా లన్న దుష్ప్రయత్నం.

ఇవి పన్నెండూ మహాదోషాలు. ఎప్పుడూ యివి దగ్గిరకు చేరనివ్వ గూడదు. వేటకాడు సందుచూసి మృగాలను కొడతాడు. అలాగే యీాదోషాలు ఏమాత్రం సందుదొరికినా మనిషిని నాశనంచేస్తాయి. ఇవి కాక, దోషాలింకో యేడున్నా యన్నాను. అవి సంభోగసంవిత్తు— విషయసుఖా లన్నా ముఖ్యంగా సంభోగం అన్నా ఆసక్తి చూపించే వాడు. 2 విషమేధమానుడు — ఇతరులకు చెరుపుచేసి — జనుల కొకరికీ వొకరికీ విరోధంపెట్టి అందువల్ల బతికేవాడు. 3 దత్తానుతాపి — బుద్ధి పూర్వకంగా ముందొకరి కొకటి యిచ్చి తరవాత యిచ్చినందు కేడ్చే వాడు. 4 కృపణుడు — డబ్బు వస్తుం దంటే యెందు కయినా సిద్ధపడే వాడు. 5 బలీయాన్ — జ్ఞానం వొక గొప్ప బలం. అది లేనివాడు. 6 వర్గ ప్రశంశి — ఇంద్రియాలను జయించడానికి బదులు, అవి మంచి వని

పొగిడేవాడు. 7 వనితాద్వేష్ట — పతివ్రత అయిన తన భార్యను ద్వేషించేవాడు. వీళ్లకు నృశంసు లని పేరు.

గుణాలు పన్నెం డని చెప్పాను. ఇక అవి చెబుతాను. 1 ధర్మం — వర్ణాశ్రమధర్మాలు. 2 సత్యం — ఉన్నదున్నట్టు చెప్పడం. 3 దమం — జిహ్వాచాపలమూ, ఉపస్థాచాపలమూ లేకపోడం. 4 తపస్సు — కష్ట సాధ్యాలయిన చాంద్రాయణం మొదలైన వ్రతాలు చెయ్యడం. 5 అమాత్సర్యం — పరులగుణాలు చూసి ఓర్వలేకపోడం అనేది లేక పోడం. 6 హ్రీ — లజ్జ. 7 తితిక్ష — ఎంతెంత కారణాలున్నా క్రోధం వహించలేకపోడం. 8 అనసూయ — ఇతరుల మంచిగుణా లన్నీ దుర్గుణా లని ఆరోపించకపోడం. 9 యజ్ఞం — అగ్నిష్టోమం మొదలైనవి చెయ్యడం. 10 దానం — ఈవి. 11 ధృతి — ఎలాంటి ఆపదలు వచ్చినా తాను పూనుకొన్న కార్యం మానకపోడం. 12 శ్రుతం — అర్థం తెలుసుకుంటూ వేదం చదువుకోడం.

ఈపన్నెండూ మహాగుణాలు. వీటిలో ఏవొక్కటీ కూడా తక్కువ కాకుండా చూసుకుంటూ జాగ్రత్తగా మసులుకునే బ్రాహ్మడు ఈభూమండలం అంతా ఏలుకోగలుగుతాడు. వీటిలో, మూడు — రెండు — కనీసం వొక్కగుణం మాత్రమే వున్నా ఆబ్రాహ్మడు కాల క్రమాన జ్ఞానం వృద్ధిచేసుకుని మహర్షి అయిపోతాడు. ఇంకొకటి కూడా వుంది. 1 దమం—ఇంద్రియాలు నిగ్రహించుకోడం. 2 త్యాగం—ఈశ్వరార్పణంగా — అంటే ఏకోరికలూ లేకుండా కర్మలు చెయ్యడం. 3 అప్రమాదం — తత్వజ్ఞానం సంపాదించుకోడం. ఇవి సత్యం తప్పకుండా జరిగించుకుంటే చాలు, మోక్షం లభిస్తుం దని పెద్దలు చెబుతారు.

దమానికిన్నీ పద్ధెనిమిది దోషా లున్నాయి. 1 అనృతం — అబద్ధం ఆడడం. 2 పైశునం — ఇతరులను దూషించడం. లేక, ఇతరుల మీద కొండేలు చెప్పడం. 3 తృష్ణ — విషయసుఖాలమీది కోరిక.

4 ప్రాతికూల్యం — అన్నిటిలోనూ వ్యతిరేకంగా వుండడం. 5 తమం — అజ్ఞానం. 6 అరతి — లాభం కలిగినా సంతోషం లేకపోడం. 7 లోక ద్వేషం — అందరితోనూ విరోధంపెట్టుకోడం. 8 అభిమానం — గర్వం. 9 వివాద — అందరితోనూ ఎప్పుడూ జగడం ఆడుతూ వుండడం. 10 ప్రాణిపీడనం — తన దేహం పోషించుకోడానికి ప్రాణి కోటిని హింసించడం. 11 పరివాదం — ఇతరులను నిందించడం. 12 అతివాదం — వాగుడు. పరితాపం — అనవసరంగా — ఇతరుల కలిమి చూసి దుఃఖించడం. 14 అక్షమ — కష్టాలు సహించలేక పోడం. 15 అధృతి — ఇంద్రియచాంచల్యం. 16 అసిద్ధి — ధర్మబుద్ధీ, జ్ఞానమూ, వైరాగ్యమూ లేకపోడం. 17 పాపకృత్యం పాపప్పనులే చేస్తూ వుండడం. 18 హింస — ఇతరులను చంపడం. ఇవి పద్ధెనిమిది.

ఇవి దమం నాశనం చేస్తాయి. ఇవి లేకపోడమే దమం. ఇందుల్లో యేవొక్క దోషం వుండినా దమం చెడిపోతుంది.

ఇవి కాక, మదానికి దోషా లున్నాయి పద్ధెనిమిది. దమదోషాలు న్నాయే, వాటికి పద్ధెనిమిదింటికీ వ్యతిరేకా లివి. అంటే, మదదోషా లొక్కటీన్నీ లేకపోతే, ఆమనిషికి లేశమున్నా మదం లేదన్న మాట. దమం పూర్తిగా వుందన్న మాటాను.

త్యాగం ఆరువిధాలు. వాటిలో మూడు ముఖ్యమైనవి. అర్హుడైన వాడికి డబ్బే కాదు, ఏమివ్వమన్నా — చివరికి తన కొడుకుల నిమ్మన్నా యిచ్చెయ్యడం. 2 ఇష్టాపూర్తం — అంటే, పితృ దేవతలకోసమూ దేవతలకోసమూ దానాలు చెయ్యడం. 3 కామత్యాగం — అంటే, వైరాగ్యం పూని కామం విడిచిపెట్టడం. కోరిక లన్నీ కామమే. స్త్రీవాంఛ యిందులో బలీయమైనది. ఇలాంటి కోరికలు — సంసారంలో వుంటేవాడి కుండే కోరిక లన్నీ విడిచిపెట్టడం కామత్యాగం. త్యాగాలలో

యీమూడూ, ఈమూడింటిలోనూ మళ్లీ యీకామత్యాగమూ ముఖ్యమైనవి.

ఈకామత్యాగం యెనిమిది గుణాలతో వుంటుంది. ఆగుణాలు 1 సత్యం — నిజమే చెప్పడం. 2 ధ్యానం — ధ్యానించడం. 3 సమాధానం - పరమాత్మలో మనస్సు లీనంచెయ్యడం. 4 చోద్యం — నేనెవణ్ణి? ఎక్కణ్ణుంచి వచ్చాను? ఏమి చేస్తాను? యథార్థం తెలుసుకోడానికి తనలో తానిలాగ చర్చించుకోడం. 5 వైరాగ్యం — ఐహికసుఖాలూ, స్వర్గాది ఆముష్మికసుఖాలూ కోరకపోడం. 6 అస్తేయం — దొంగతనం లేకపోడం. 7 బ్రహ్మచర్యం — మైథునవ్యాపారం మనసా కూడా లేక పోడం 8 అసంగ్రహం — పెళ్లా మనీ, బిడ్డ లనీ, సిరిసంపద లనీ — ఇలాంటివి కూడబెట్టుకోవా లన్న ఆసక్తి లేకపోడం.

ఇలాంటి గుణాలు అలవర్చుకుని కామత్యాగం చెయ్యాలి. నువ్వు సత్యస్వరూపుడవు కావాలి. లోకా లన్నీ సత్యంలోనే వున్నాయి. అవి సత్యంలోనే పుడుతున్నాయి. సత్యంవల్లనే మోక్షం లభిస్తుంది. క్రోధం మొదలైన దోషాలు ఏమీ పెట్టుకోకుండా సత్యమే పలకాలి. సత్యమే సజ్జనులకు తపస్సు. దోషాల్లేని తపస్సు గొప్పఫలా లిస్తుంది.

రాజేంద్రా, నువ్వడిగింది యిది. శ్రద్ధగా విను. ఇది సకలపాపాలూ పోగొడుతుంది. ఇంద్రియాలూ మనస్సూ నిగ్రహించుకుని జరిగిపోయి నవీ కాగలవీ తెలుసుకోక నిశ్చలంగా వుండేవాడు సుఖపడతాడు.”

ఇది విని “బ్రాహ్మల్లో చతుర్వేదు లున్నారు. వారు, నాలుగు వేదాలూ పురాణాలూ బాగా నేర్చినవారు. త్రివేదులూ, ద్వివేదులూ వున్నారు. మూడేసి వేదాలు చదివినవా రొక్కరూ, రెండేసి వేదాలు చదివినవా రొక్కరూను వారు. ఒక్క వేదమే చదివినవారూ. అసలు, వేదమే చదవనివారూ కూడా వున్నారు. వారిలో యెవరు గొప్పవా” రనడిగాడు ధృతరాష్ట్రుడు.

"రాజేంద్రా" అంటూ అందుకున్నాడు సనత్సుజాతుడు. "సచ్చి నందాద్వితీయసంవిద్రూప మైన పరబ్రహ్మాను తెలుసుకోకపోడంవల్ల వేదం అనేకా లయింది. ఆపరబ్రహ్మా నెలాగయినా తెలియజెయ్యా డానికే తటస్థించిం దది. ఈసత్యం తెలిసినవాడే బ్రహ్మావేత్త అవుతాడు. పరబ్రహ్మాను తెలిసికోకుండానే "నేను ప్రాజ్ఞణ్ణి" అనుకునేవాడు, కేవలమూ డబ్బుకోసమే యజ్ఞంచేస్తాడు. అందుకోసమే యితరులచేత కూడా యజ్ఞాలుచేయిస్తాడు. ఇంతకంటే అజ్ఞాని మరి వుండడు. ఉన్న యితిహాసాలూ, పురాణాలూ కూడా అన్నీనీ, నాలుగు వేదాలూ చదివినవాణ్ణి వాచాటు డని చెప్పాలే గాని బ్రాహ్మా డని చెప్పడానికి వీల్లేదు. సచ్చిదానందపరబ్రహ్మాను తెలుసుకుని అతణ్ణి మననంచేసుకుంటూ వుండేవాడే బ్రాహ్మాడు. వేదం అంటే మరేమిటో కాదు, పరబ్రహ్మాను తెలుసుకోడాని కొకసాధనం. అంటే, వేదవేత్త అయినవాడు — వేదం తెలుసుకున్న వాడు బ్రహ్మావేత్త అన్న మాట.

కాక, — వేదాలు జడస్వరూపాలు. పోనీ, పరబ్రహ్మామో అంటే, వాచామగోచరం. మాటల కంద దది. సత్యస్వరూపం అది. కనక, బ్రహ్మాపదార్థం వేదాలవల్ల తెలియదు. వేదం తెలుసుకున్నాడంటే జ్ఞాని అయినా డన్న మాట. వేదం చదివినందువల్ల కలగవలసిన స్థితి అది. అలా జ్ఞానం సంపాదించినవాడే బ్రహ్మావేత్త అవుతాడు. కేవలమూ వేదాలు మాత్రమే తెలిసినవారు లోకజ్ఞులనిపించుకుంటారు. అదిచాలదు. తత్త్వమసి ఇత్యాది వాక్యాలు పరబ్రహ్మాను ఉపాసిస్తున్నాయి. అవి అవగాహనచేసుకోవాలి ముఖ్యంగా.

శాఖాచంద్రన్యాయం వుంది. నెలపొడుపునాటి చంద్రుడు స్పష్టంగా కనపడడు. ఏ చెట్టుకొమ్మనో ఆధారంచేసుకుని "అదిగో, ఆకొమ్మకి కిందుగా — పక్కగా — లేక మీదుగా చూడు" అంటాడు చూసినవాడు. చూడదలచినవాడికప్పుడు కనపడుతుం దా నెలవంక. కొమ్మలో

వుందా ఆనెలవంక. అలాగే, వేదంలోనూ పరబ్రహ్మంలేదు. కొమ్మ లాగే వేదమున్నూ ఏకసాధనం. బ్రహ్మపదార్థం బోధించగలవాడే బ్రాహ్మడు. మరి, అబోధించగలగడం యెలా సంభవిస్తుందీ? వేదం తెలుసుకుంటేనే మరో మార్గం లేదందుకు.

ఇంద్రియాలు సుఖంమరిగి పరబ్రహ్మను తెలుసుకోనియ్యవు. వేదాలు అవలోడన చేస్తేనే బ్రహ్మపదార్థం తెలుసుకోగలగడం. కర్మలన్నీ విడిచిపెట్టాలి. అంటే, కర్మఫలాలు ఆశించగూడదు. మౌనంగా వుండాలి. లోకమంతా తానే అనుకుని — సర్వభూతాలూ ఆత్మవతుగా భావించుకుంటూ ఉపాసించాలి. అప్పుడు తెలుస్తుంది బ్రహ్మతత్వం. మౌనం అవలంబించినవాడే ముని. అరణ్యాల్లో నివసించినంత మాత్రాన మునికాడెవడూ. ఆపరమాత్మను తెలుసుకున్నవాడే మునుల్లో ఉత్తముడు. అవాఙ్మనసగోచరుడైన పరమాత్మ, ప్రకృతి సంయోగంతో ప్రపంచం అంతా నిండిపుంటున్నాడు. అతని నామ రూపాలు విశదంచెయ్యడమే వ్యాకరణం. అది తెలిసినవాడే వైయాకరణి. సకలమూ గుర్తించగల డతను. కనక సర్వజ్ఞుడని అతనికి పేరు"

# 44

## సనత్సుజాతీయం 4

"మహానుభావా, పరమాత్మతత్వం బాగా విశదంగా చెప్పావు. మరి, అది సాధించే ఉపాయమున్నూ విశదంచెయ్యవలసింది" అనడిగాడు ధృతరాష్ట్రుడు. సనత్సుజాతుడు మళ్ళీ ప్రారంభించాడు.

"రాజా, త్వరపడితే అందేది కాదు బ్రహ్మపదార్థం. ఇంద్రియాలెంత అణుచుకున్నా, మనస్సుమాత్రం సంకల్పవికల్పాలు చేస్తూనే వుంటుంది. సాధారణంగా ఆమనస్సున్నూ బుద్ధిలో లీనంచేసుకోవాలి. అప్పుడే బ్రహ్మవిద్య అవగాహన అవుతుంది. అప్పుడయినా బ్రహ్మ

చర్యం అవలంబించగలిగితేనే అది సిద్ధిస్తుంది. సత్యస్వరూపమూ, సమస్తవిద్యలకూ మూలమూ అయినది వినాలంటున్నావు నువ్వు. సాధువులకున్నూ బ్రహ్మచర్యంవల్లనే గాని అది సాధ్యం కాదు. అది సిద్ధిస్తే మర్త్యభావం పోతుంది. శాస్త్రం అనుసరించి గురువు ఉపదేశించాలది. లేకపోతే దానివల్ల కలిగిన జ్ఞానం నిలవదు. అంటే, ఎలాంటివారికీ కూడా గురువు నారాధించడం చాలా ముఖ్యం" అని బదులుచెప్పాడతను.

"బ్రహ్మచర్యం అవలంబిస్తే బ్రహవిద్య సాధ్యం అవుతుంది, సరే. మరి, ఆబ్రహ్మచర్యం ఆచరించడం యెలాగా?" అని మళ్ళీ అడిగాడు ధృతరాష్ట్రుడు. సనత్సుజాతు డిలా చెప్పాడు.

"గురువు పాదాలాశ్రయించి కపటవృత్తి లేకుండా ఆరాధించిన వారు గురువుకి ఆంతరంగికులవుతారు. వారే శాస్త్రకారులంటే. గురువు అనుగ్రహంవల్ల బ్రహ్మభావం పొందుతారు వారు. అంటే, బ్రహ్మైక్యం పొందుతారు. బ్రహ్మపదార్థం తెలుసుకోవాలన్న దీక్షతో, వారు, కామాలన్నీ విడిచిపెట్టుకుంటారు. తన్మాలంగా, గడ్డినుంచి కాడను వేరుచేసేటట్టు ఈభౌతికశరీరంనుంచి చిన్మాత్రస్వరూపి అయిన ఆత్మను వేరుచేసుకుంటారు. అంటే, ఈదేహం వేరూ, నేను అనుకునే ఆత్మ వేరూ అని తెలుసుకోగలుగుతారు. ఈభౌతికశరీరం తల్లిదండ్రులవల్ల లభిస్తుంది. గురువు ఇచ్చే శరీరం సత్యమూ, శాశ్వతమూను. అదే ఆత్మ. గురువు ఆత్మజ్ఞానం కలిగిస్తాడన్నమాట. దాని వల్లనే మోక్షం సిద్ధిస్తుంది.

అది సిద్ధింపచేసేవాడు గురువు. గురువు చేసింది గుర్తించుకుంటూ, గురువుచేసిన ఉపకారం స్మరించుకుంటూ శిష్యుడు, గురువు కెప్పుడూ నమస్కారం చేస్తూ వుండాలి. గురువుకి ఎలాంటిద్రోహమూ, ఎంత మాత్రమూ కూడా చెయ్యగూడదు. అతను చెప్పేది శ్రద్ధగా వింటూ

ఇంకా యింకా చెప్పించుకోవాలి. అభిమానం పిడిచిపెట్టి గురువుని సర్వవిధాలా సేవించుకోవాలి.

బ్రహ్మచర్యాని కిది మొదటిపాదం. డబ్బుపోయినా — చివరికి ప్రాణమే పోయే స్థితివచ్చినా గురువు కేది యిష్టమో అదే త్రికరణ శుద్ధిగా చేస్తూవుండాలి శిష్యుడు. గురువు భార్యనూ, గురువు బిడ్డలనూ కూడా అచ్చంగా గురువుని చూసినట్టే చూసుకుంటూ వుండాలి. గురువు నారాధించినట్టే వారినీ ఆరాధించాలి. బ్రహ్మచర్యాని కిది రెండోపాదం.

గురువు తనకు చేసిన మే లెప్పుడూ మరిచిపోగూడదు. "ఈమహాత్ముడే మనకి బ్రహ్మవిద్య చెప్పా" డని గుర్తించుకుంటూ వుండా లెప్పుడూ. గురువంటే పరమానందంగా వుండాలి. బ్రహ్మచర్యాని కిది మూడోపాదం.

గురువువల్ల తాను బ్రహ్మవిద్య తెలుసుకున్నా డంటే, గురువుకి, తాను, చాలా ఋణపడివున్నా డన్నమాట. ఆఋణంతీర్చుకోవాలి శిష్యుడు. అంటే, బహువిధాల గురువుని సేవించుకుంటూ వుండాలి. గురువుని విడిచివెళ్లి మరోచోట వుండగూడదు. "గురువుకి నేనిది యిస్తున్నాను. ఇది చేస్తున్నా" నని మనస్సులో కూడా అనుకోగూడదు. ఎక్కడా చెప్పనూ గూడదు. బ్రహ్మచర్యాని కిది నాలుగోపాదం.

అంటే, బ్రహ్మచర్యానికి నాలుగుపాదా లున్నాయన్నమాట. సర్వవిధాలా గురువుని సేవించుకోడమే నాలుగుపాదాలా బ్రహ్మచర్యం ఆచరించడం అంటే. బ్రహ్మచర్యానికి నాలుగుపాదా లున్నట్టే బ్రహ్మవిద్యకున్నూ నాలుగుపాదా లున్నాయి. కాలం గడిచినకొద్దీ బుద్ధి పరిపక్వం అవుతుంది. ఇదొకపాదం. గురువు బ్రహ్మవిద్య ఉపదేశిస్తాడు. ఇదొకపాదం. శిష్యుడు తనకి తానే మననం చేసుకుంటాడా బ్రహ్మవిద్య. ఇదొకపాదం. సహాధ్యాయులతో చర్చ జరుగుతూ

వుంటుంది. ఇదొకపాదం. వీటికొక క్రమం లేదు. కాని, బ్రహ్మవిద్య అలవడాలంటే ఈ నాలుగుపాదాలా — యీనాలుగు విధాలా శ్రద్ధ వుండాలి. దాంతో బ్రహ్మజ్ఞానం కలుగుతుంది. జ్ఞానమూ, సత్యమూ, దమమూ, శ్రుతమూ, మాత్సర్యం లేకపోడమూ, సిగ్గూ, తితిక్షా, అసూయ లేక పోడమూ, యజ్ఞమూ, దానమూ, ధృతీ, శమమూ — ఈపన్నెండుగుణాలూ, త్యాగాలూ, అవి నడిపించుకునే శక్తి — ఇవి గురుసేవ చేస్తూవుంటేనే సాధ్యం అవుతాయి. బ్రహ్మత్మభావం వల్ల బ్రహ్మచర్యం సిద్ధిస్తుంది. ఇలా నడుచుకుంటూ, శిష్యుడు, తనకి లభించిన ధనం అంతా గురువుకి సమర్పించుకుంటూ వుండాలి. ఇలా చేసే శిష్యుడు సజ్జనుల మార్గాన నడచినవా డవుతాడు. దీంతో గురువుకి, శిష్యునియెడల పుత్రభావం కలుగుతుంది. శిష్యునకు సకలశుభాలూ కలుగుతాయి. సంతానవంతు డవుతాడు. పరువూ ప్రతిష్ఠా యేర్పడతాయి. బ్రహ్మచర్యంవల్లనే దేవతలకు దేవత్వం సిద్ధించింది. మహర్షులున్నూ బ్రహ్మీభూతు లయినారు. గంధర్వులూ, అప్సరసలూ సుందరాంగు లయినారు. ఈబ్రహ్మచర్యంవల్లనే సూర్యుడు జగత్తు నంతనూ ప్రకాశింపచేస్తున్నాడు. ఈబ్రహ్మ చర్యం అవలంబించి తన శరీరం పావనంచేసుకున్న వాడు జరామరణాలు జయించుకోగలుగుతాడు. కర్మమార్గం శాశ్వతఫలా లివ్వలేదు. జ్ఞానమార్గమే అందుకు తగ్గది. మోక్షం కావాలంటే, జ్ఞానం సంపాదించుకోడం వొక్కటే వుపాయం"

దీనిమీద ధృతరాష్ట్రుడు "మహాత్మా, బ్రహ్మజ్ఞానం సంపాదించుకున్నవాడు పరతత్వం పొందగలుతా డన్నావే? శాశ్వతమూ, అమరమూ అయిన ఆ పరతత్వం రంగు నలుపా, తెలుపా, యెఱుపా. పసుపా, బూడిదరంగా?" అనడిగాడు. "కాదుకా" డన్నాడు సనత్సుజాతుడు. "పరతత్వానికి రంగంటూ లేదు. అసలది భూమ్మీదా లేదు, ఆకాశానా లేదు. పంచభూతాత్మకమే కాదది. భౌతికం

అయినదానికే రూపమైనా రంగైనా వుండడం. పరతత్వం ప్రపంచాతీతం. అది వైశ్వానరసామాలలోనూ, రథంతరబార్హద్రథాదిసామాలలోనూ మహావ్రతాల్లోనూ కూడా లేదు. కర్మ లెన్ని చేసినా లభించ దది. బ్రహ్మవేత్త అయినవాడి కాత్మలోనే కనపడుతుం దది. సంసారానికిన్నీ అతతీ మైనది. అణువులకంటే చిన్నదీ, పర్వతాలకంటే పెద్దదీ కూడానూ అది అధిష్ఠానం నిర్వికారం. అదే బ్రహ్మం. సమస్త భూతాలూ దానినుంచే ఉత్పత్తి అవుతాయి. నశించిపోతాయి. ద్వైతం కాని దది. బ్రహ్మవేత్త అయినవాడు జ్ఞానయోగంతో చూడ గలుగుతా డది. ఈ జగత్తంతా దానియందే ప్రతిష్ఠితం అయివుంది. అది తెలుసుకున్నవారు జరామరణరహితులు — ముక్తులవుతారు ”

# 45

## సనత్సుజాతీయం 5

సనత్సుజాతు డింకా యిలా చెప్పాడు.

“శోకమూ, క్రోధమూ, లోభమూ, కామమూ, గర్వమూ, అతి నిద్రా, ఈసూ, అవివేకమూ, నివిత్సా, నిర్దయా, అసూయా, జుగుప్సా — ఈపన్నెండు గుణాలూ మహాదోషా లని యిదివరలో చెప్పివున్నాను. మనుష్యుల నవి నాశనంచేసేస్తాయి. మృగాలను పట్టుకో డానికి వేటకాడు వీలూచాలూ చూసుకుంటూ వుంటాడు. అలాగే, యివన్నీ, పరాకుగా వున్న సందర్భం గుర్తించుకుని వొక్కొక్కటే మనిషిని చుట్టుకుంటాయి. నిర్దయా, పరుషవాక్యా, అతిగా వాగ డమూ, క్రోధమూ, డాబూ, టక్కరితనమూ — ఇవి క్రూరుల గుణాలు. ఈ గుణా లున్నవారని క్షమించగూడదు. స్త్రీలోలుడూ, కుట్రలు చేస్తూ బతికేవాడూ, ఏదయినా — ఎవరికయినా మనస్ఫూర్తిగా ముం దిచ్చి తరవాత “అయ్యోయిచ్చానే?” అని యేడ్చుకునేవాడూ,

డబ్బువచ్చేచోట ఎలాంటి అవమానా లయినా లెక్కచెయ్యనివాడూ జ్ఞానహీనుడూ, ఆత్మస్తుతి చేసుకునే వాడూ, సుశీల అయిన తన భార్యను ద్వేషించేవాడూ — ఈ యేడుగురూ తుచ్ఛులు. బహు పాపాత్ములు.

ధర్మమూ, సత్యమూ, తపస్సూ, దమమూ, వేద వేదాంగాలు చదువుకోడమూ, మాత్సర్యం లేకపోడమూ, సిగ్గుబిడియాలూ, సహనమూ, సజ్జనులమీద ఏదోషాలూ ఆరోపించకపోడమూ, యజ్ఞమూ, దానమూ, మనోనిగ్రహమూ, శమమూ — ఇవి మహావ్రతాలు. ఇవి ఆచరించేవారే బ్రాహ్మలు. ఈగుణా లున్నవాడు భూమండలం అంతా స్వాధీనంచేసుకోగలడు. వీటిలో మూడు — లేక — రెండు — కనీసం వొక్కగుణం వుండినా, కాలక్రమాన, ఆబ్రాహ్మడు తన జ్ఞానంవల్ల తక్కిన అన్నిగుణాలూ అలవర్చుకుని, చివరికి, మహర్షి అవుతాడు.

దమమూ, త్యాగమూ, జాగ్రత్తా — ఈమూడింటిలోనూ అమృతం వుంది. విద్వాంసులకు — బ్రహ్మపదార్థమే ముఖ్యంగా చూసుకునే బ్రాహ్మల కివి ముఖ్యమైనవి. తప్పులు వెతికీ, లేకపోతే మోపీ ఇతరులను నిందించడం బ్రాహ్మలైనవారికి బొత్తిగా తగని పని. అలా నిందించేవారు నరకానికి పోతారు. మదానికి పద్దెనిమిది దోషా లున్నాయి. పరస్త్రీగమనం. 2 ధర్మకార్యాలు చెడగొట్టడం. 3 సాధుజనులమీద దోషం ఆరోపించడమూ, 4 అబద్ధాలాడడమూ, స్త్రీవ్యామోహమూ, 6 క్రోధమూ, 7 మద్యపానంచేసి వొళ్లు తెలియకుండా పడిపోడమూ, 8 ఇతరులను నిందించడమూ, 9 మంచివారిమీద రాజులతో కొండేలు చెప్పడమూ, 10 నటులకోసమూ, నర్తకులకోసమూ, వేశ్యలకోసమూ డబ్బు పాడుచేసుకోడమూ, 11 ఇతరులతో విరోధం పెట్టుకోడమూ, 12 ఇతరులను చూసి వోర్చలేకపోడమూ, 13 ప్రాణికోటిని పీడించడమూ, 14 ఈసూ, 15 గర్వించి వెకిలినవ్వులు నవ్వడమూ, 16 మంచి చెడ్డలు విడిచి నోటికి వచ్చినట్లల్లా వాగడమూ 17 చెయ్య తగ్గ దేదో

చెయ్యరాని దేదో తెలుసుకోకపోడమూ, 18 ఇతగుల కెప్పుడూ ద్రోహంచెయ్యడానికే చూస్తూవుండడమూ - ఇవీ ఆదోషాలు. గర్హించవలసిన వివి. ప్రాజ్ఞుడైనవాడు ఈదోషాలు దగ్గిరికి రానిచ్చుకోగూడదు.

స్నేహంలో ఆరుగుణా లున్నాయి. 1 స్నేహితుడు సంతోషిస్తే తానూ సంతోషించడం. 2 స్నేహితుడు దుఃఖిస్తే తానూ దుఃఖించడం. 3 తనకు మిక్కిలీ ప్రీతిపాత్ర మైనది. — చివరికి తనకొడుకుని ఇమ్మన్నా యిచ్చెయ్యడం. 4 ఎవడికయినా డబ్బిచ్చి "నేనితని కుపకారం చేశా" నన్న అహమికతో వాడి యింట నివసించకపోడం. 5 తాను స్వయంగా సంపాదించుకున్నదే తాననుభవి చడం. 6 తనకెంత శ్రేయస్కరం అయినదైనా అది మిత్రులకోసం నిశ్చింతగా వెచ్చించెయ్యడం — చాలా గొప్పగుణా లివి. ధనవంతుడూ సాత్త్వికుడూ అయినవాడు ఇది ప్రధానంగా చూసుకుంటూ త్యాగి అవుతాడు. దీంతో, యింద్రియాలు జయించినవా డయిపోతా డామనిషి.

ఇది శోకతపస్సు. ఇలా నడుచుకున్నవాడు పుణ్యలోకాలకు పోతాడు. సంకల్పంతో కొందరు యజ్ఞాలు చేస్తారు. మనస్సుతోనే చేస్తారు కొందరు. బ్రహ్మయజ్ఞమూ — జపమూ — ఈవిధంగా కొందరు యజ్ఞాలు చేస్తారు. పామరులు పశుపురోడాశాలతో యజ్ఞంచేస్తారు.

యోగశాస్త్రం యిది. ఇది శిష్యులకు తెలియజెప్పాలి. బ్రహ్మజ్ఞాని కిది సాధనం. తక్కిన శాస్త్రా లన్నీ మాటలపోగులే. సమస్తమూ యిందులోనే వుంది. ఇది తెలిసినవారు జరామరణరహితు లవుతారు. కర్మలుచేస్తే బ్రహ్మపదార్థం దొరకదు. యజ్ఞయాగాలు చేసేవా ళ్ళందరూ పిసిపిల్లలకింద లెక్క. వాళ్ళకి మోక్షంలభించదు. సంగతిసందర్భాలన్నీ బోధపడ్డాక ఇది ఏకాంతంగా ఉపాసన చెయ్యాలి. ముఖ్యంగా మనస్సుని అరికట్టుకోవాలి. ఎవరైనా స్తుతిచేస్తే ఉబ్బిపో గూడదు.

నిందిస్తే రోషమూ తెచ్చుకోగూడదు. ఇలా చేసినవారికే బ్రహ్మ పదార్థం బోధపడుతుంది. దొరకనూ దొరుకుతుందికూడా.

# 46

## సనత్సుజాతీయం 6

సనత్సుజాతుడు మళ్ళీ ప్రారంభించాడు.

" రాజేంద్రా, పరమాత్మ విశ్వోత్పత్తికి మూలకారణం. అతని వల్లనే ప్రపంచం అంతా ప్రవర్తిస్తోంది. ఆనందరూపు డతను. వృత్తీ, స్వరూపమూ, ఉపాధీ లేవతనికి. సూర్యాదిగ్రహాలరూపాన విరాజిల్లుతూ వుంటా డతను. ఇంద్రుడూ దేవతలూ అతణ్ణే ఉపాసిస్తారు. అతనివల్లనే సూర్యుడు తేజరిల్లుతున్నాడు. సనాతనుడైన ఆ భగవంతుణ్ణి యోగులు మాత్రమే చూడగలరు.

పరమాత్మ సంకల్పంవల్ల హిరణ్యగర్భుడు పుట్టాడు. ఆ పరమాత్మ వల్లనే వృద్ధినీ పొందా డతను. తాను జ్యోతిస్సుల మధ్యగావుండి తాను వెలుగుతూ, ఆ జ్యోతిస్సులనుకూడా వెలిగిస్తున్నా డతను. సనాతనుడైన ఆ భగవంతుణ్ణి యోగులుమాత్రమే చూడగలరు.

పరమాత్మ దేశకాలవస్త్వపరిచ్ఛిన్నుడు. అతను జీవులను పుట్టిస్తున్నాడు. ఆ జీవులు పరమాత్మస్వరూపులే కాని భిన్నులు కారు. విద్వాంసులిదే చెబుతారు. సనాతనుడైన ఆ భగవంతుణ్ణి యోగులు మాత్రమే చూడగలరు. పరమాత్మవల్ల పంచభూతాలూ సృష్టి అవుతున్నాయి. ఆ పంచభూతాలవల్లా స్థూలదేహం పుడుతోంది. ఆ దేహానికి మధ్యగా వుండే హృదయాకాశాన జీవాత్మాపరమాత్మా నిండి వున్నారు. జీవాత్మ స్థూలదేహంలో మాత్రమే వుంటున్నాడు. పరమాత్మ అంతటా ప్రకాశిస్తున్నాడు. సనాతనుడైన ఆ భగవంతుణ్ణి యోగులు మాత్రమే చూడగలరు.

పరమాత్మ రథచక్రంలో వున్నాడు. ఆచక్రం నాశనం లేనిది. శాశ్వత మైనదిన్నీ. ఆకాశాన గుర్రాలు నడుపుతున్నా యది. సనాతను డైన ఆభగవంతుణ్ణి యోగులు మాత్రమే చూడగలరు. పరమాత్మ కెక్కడా సాటి లేదు. ఎవరూ కూడా యీచర్మచక్షువులతో చూడలే రతణ్ణి. మనస్సుతోనూ, బుద్ధితోనూ హృదయంతోనూ అతణ్ణి గుర్తించ వచ్చు. అలా గుర్తించగలవారు జరామరణాలు లేనివా రవుతారు. వారే యోగులు. ఆయోగులు మాత్రమే సనాతనుడైన భగవంతుణ్ణి చూడగలరు.

కర్మేంద్రియా లయినూ, జ్ఞానేంద్రియా లయినూ మనస్సూ, బుద్ధీ – ఇవి పరమాత్మువల్లనే రక్షించబడుతున్నాయి. ఇవి సంసారం మధు వనుకుని అందులో మునుగుతూ తేలుతూ వుంటాయి. తేనెటీగలు ఒక పక్షంలో కూడబెట్టుకున్న తేనె అంతా మరోపక్షంలో ఆరగిస్తాయి. అలాగే జీవుడు పూర్వజన్మంలో చేసుకున్న సుకృతమూ దుష్కృతమూ ఈజన్మంలో అనుభవిస్తాడు. పరమాత్మే జీవుణ్ణిలా అనుభవింపచేస్తాడు. సనాతను డైన ఆభగవంతుణ్ణి యోగులు మాత్రమే చూడగలరు.

అజ్ఞాను లయినవారు, బంగారపు ఆకులు గల అశ్వత్థవృక్షంచేరు కుంటే జ్ఞాను లవుతారు. జ్ఞానులకే ముక్తి దొరుకుతుంది. ప్రాణం అపా నాన్నీ, ప్రాణాన్ని చంద్రుడూ, చంద్రుణ్ణి సూర్యుడూ, సూర్యుణ్ణి పర మాత్మా లీనంచేసుకుంటున్నారు. పరమాత్మకే హంస అనిపేరు. జీవుడు దానివొకపాదం. అది ఆపాదం యెత్తితే మరి సంసారం లేదు. సర్వభూ తాంతర్గతుడైన పరమాత్మ అంగుష్ఠమాత్రుడై లింగశరీరంలో వుంటాడు. మూఢు లతణ్ణి గుర్తించలేరు. పాములు, కనపడ్డవారి నందరినీ చంపేసి తమకలుగుల్లోకి వెళ్లిపోతాయి. ఇంద్రియా లలాగే విషయసుఖాలతో మనుష్యులను నాశనంచేస్తాయి. శమమూ, దమమూ మొదలైన సాధ నసంపత్తి వున్నవారికీ లేనివారికీ గూడా ఆత్మ సమానమే. ముక్తికీ

సంసారబంధానికీ గూడా సమానమే యిది. కనక, శమదమాదిసాధన సంపత్తి ఉండినవారే మోక్షం పొందగలరు. బ్రహ్మజ్ఞానం కలవాడు, ఇహలోకఫలాలూ పరలోకఫలాలూ గూడా పొందుతాడు. యజ్ఞయాగాలు చెయ్యకపోయినా వాటివల్ల కలిగేఫలా లనుభవిస్తాడు. బ్రహ్మజ్ఞానం ఉంటే, మరి, మృత్యువన్నది లేదు. పరమాత్మ ఇలా వుంటాడని పోల్చిచెప్పడానికి పోలిక యేదీ లేదు; కాని అతని స్వరూపం గుర్తించగలవాడు అమరు డవుతాడు.

అంచేత, బ్రహ్మజ్ఞానం కలవాడికి జననమరణాలులేవు. అవే లేకపోతే, మరి, సంసారం యెలా వుంటుంది? సత్తుకీ అసత్తుకీ గూడా కారణం వొక్కటే. లౌకికానికీ వ్యావహారికానికీ కారణం వొక్కటే. మరణమే లేనప్పుడు స్వర్గసుఖా లెక్కడివి? ఆకాశం మొదలు దేహాంతందాకా సమస్తమూ సృష్టించి, పరమాత్మ, అంగుష్ఠమాత్రుడై వుంటాడు. అతణ్ణి ఈకళ్లతో చూడలేము. జ్ఞానివొక్కడే అతణ్ణి తెలుసుకోగలడు. ఆపరమాత్మ కారణం కావడంవల్లనే వాయువు వీస్తున్నాడు. అతనివల్లనే లయం కలుగుతోంది. అతనివల్లనే అగ్నీ చంద్రుడూ తేజరిల్లుతున్నారు. అన్నిటినీ పుట్టించే వస్తువది జీవం. అదీ జగత్తు కాధారం. అదే అమృతం. అంటే, జరామరణశూన్యం. అదే యీభౌతికప్రపంచం అంతాను. అదే బ్రహ్మపదార్థం. అతనివల్లనే భూతా లన్నీ పుడుతున్నాయి. నశిస్తూనూ వున్నాయి. ఆబ్రహ్మపదార్థమే జీవేశ్వరుల కాధారం. అదే సమస్తమూ భరిస్తోంది. ఏళ్లూ సముద్రమూ ప్రవహిస్తున్నా యంటే దానివల్లనే.

పరబ్రహ్మస్వరూపం చర్మచక్షువులకు కనపడదు. కర్మలుచేసి, అందువల్ల మనస్సు నిర్మలమైనవారు మాత్రం చూడగల రది. అలా చూడగలవారే ముక్తిపొందేవారు. ఆపరబ్రహ్మ అంతటా వున్నాడు. అన్నిటిలోనూ వున్నాడు. ఇది గుర్తించి ధ్యానం చేసేవాడికి దుఃఖాలు

రావు. లోకం అంతా జలమయం అయివుండినప్పుడు చెరువెందుకు? అలాగే బ్రహ్మజ్ఞాని కితరజీవాలవల్ల ప్రయోజనం యేం వుంది? ఈజీవుడు ఒకజన్మలో తల్లి అవుతాడు. మరోజన్మలో తండ్రి అవుతాడు. ఇంకోజన్మంలో కొడుకవుతాడు. సర్వానికీ అతనే ఆత్మ. ఆత్మకూ శరీరానికీ సంబంధం లేదు.

చెప్పిచెప్పి, సనత్సుజాతుడు చివరికిలా అన్నాడు "పరమాత్మే నాజన్మకి కారణం. బట్టవుందంటే, పడుగులోనూ పేకలోనూ, కూడా నూలువుంది. అలాగే పరమాత్మ నాలోనూ అన్నిటిలోనూ కూడా వున్నాడు. కనక, పరమాత్మ నా యెడల ప్రసన్నుడయి వున్నాడు. పరమాత్మ పరమాణువు కంటెనూ సూక్ష్మపదార్థం. అంతటా వున్నాడతను. అన్నిటినీ అతనే సృష్టించాడు. అందరి హృదయాల్లోనూ వున్నాడు. బ్రహ్మజ్ఞానం గలవా రతణ్ణి ధ్యానించి ముక్తులవుతారు. ముక్తి అంటే, జననమూ మరణమూ లేకపోవడమూ, పరబ్రహ్మతో జీవాత్మ ఐక్యం కావడమున్నూ"

## 47

### కౌరవసభ

విదురుడూ, సనత్సుజాతుడూ ధృతరాష్ట్రుని కిలా చెబుతూ వుండగానే రాత్రి గడిచిపోయింది. తెల్లవారడం తడువుగా, రాజు లందరూ సంజయరాయబారం సంగతి వినడానికి కౌరవసభకు వచ్చారు.

ఆసభాభవనం చాలా తెల్లగా, కైలాసపర్వతంలా వుంది. చాలా విశాలమైనదది. సభఅంతటా మంచిగంధపునీళ్ళు చల్లారు. గోడలూ స్తంభాలూ బంగారపుచిత్రాలతో మిక్కిలీ శోభాయమానంగా వున్నాయి. బంగారంతోనూ కర్రతోనూ చేసి రత్నాలు పొదిగిన

ఉన్న తాసనా లెన్నో వున్నా యాసభాభవనంలో. వాటికి మెత్తని పరుపులున్నూ వున్నాయి.

భీష్ముడూ, ద్రోణుడూ, కృపుడూ, శల్యుడూ, కృతవర్మా, జయద్రథుడూ, అశ్వత్థామా, వికర్ణుడూ, సోమదత్తుడూ, బాహ్లీకుడూ, మహాప్రాజ్ఞుడైన విదురుడూ, యుయుత్సుడూ — వీరూ, ఇంకా అనేకులు శూరులూ వెంటరాగా ధృతరాష్ట్రుడు వచ్చి సింహాసనం అలంకరించాడు. దుశ్శాసనుడూ, చిత్రసేనుడూ, శకునీ, దుర్ముఖుడూ, దుస్సహుడూ, కర్ణుడూ, ఉలూకుడూ, వివింశతీ, — వీరందరూ వెంట రాగా దుర్యోధనుడున్నూ వచ్చాడక్కడికి. వచ్చినవా రందరూ తమ తమ కుచితాలైన ఆసనా లలంకరించారు. అప్పు డాసభ, దేవతలతో నిండివున్న ఇంద్రసభలాగా, సింహాలతో నిండివున్న పర్వతగుహలాగా భాసించింది.

అప్పుడు ద్వారపాలకుడు వచ్చి "ప్రభూ, పాండవుల దగ్గిరికి వెళ్లి వుండిన సంజయుడు వచ్చివున్నా" డని చెప్పాడు. ఇంతలో కుండలధారి అయిన సంజయుడే వచ్చాడక్కడికి. వచ్చి ఎవరికి తగినట్టు వారికి నమస్కారాలు చెప్పుకుని అతను "రాజేంద్రా! పాండుపుత్రు లందరూ కుశలంగా వున్నారు. పిన్నాపెద్దా తారతమ్యం అనుసరించి, వారు, కౌరవుల్లో పెద్దల కందరికీ నమస్కారాలూ, పిన్నలకు ఆలింగనాలూ విన్నవించి కుశలం అడిగారు. నువ్వు చెప్పిందంతా నేను వారికి చెప్పాను" అని చెప్పాడు.

## 48

## అర్జునుడు

"సంజయా, అర్జునుడు అదీనసత్త్వుడు. దురాత్ములను సంహరించడాని కంకణం కట్టుకుని వున్నాడు. సభామధ్యంలో రాజులంతా వింటూ

వుండగా అత నేమి చెప్పాడో అదంతా చెప్పు వివరంగా" అనడిగాడు ధృతరాష్ట్రుడు. దీనిమీద సంజయు డందుకున్నాడు.

"యోధానుయోధు డైన అర్జునుడు చెప్పినమాటలు దుర్యోధనుడున్నూ బాగా వినాలి. ధర్మనందనునిమాట మీద కృష్ణుడు వింటూ వుండగానే చెప్పా డత నీమాటలు. తన బాహుబలమూ, శౌర్యసాహసాలూ బాగా తెలుసుకుని వున్నవా డతను. "ఈమాట లన్నీ కౌరవుల నిండుకొలువులో చెప్పు" అంటూ జంకూగొంకూ లేకుండా చెప్పా డతను.

"సంజయా, కారులు పేలే సూతపుత్రుడు కర్ణు డక్కడే వుంటాడు. ప్రజ్ఞయేమో చాలా తక్కువ అతనికి; కాని, నాతో పోరాటానికే చూస్తూవుంటా డెప్పుడూ. అతని కాలం మూడిందిలే. కనక, అతను వినేటట్టే చెప్పు, దుర్యోధనునితో నామాటలు. దుర్యోధనుని పక్షాన యుద్ధంచేసి మమ్మల్ని ఓడించడానికి వచ్చివున్న రాజులున్నూ వుంటారప్పు డాసభలో. మంత్రు లందరితోనూ ధృతరాష్ట్రుడున్నూ అక్కడే వుంటాడు. వారుకూడా అందరూ వినేటట్టు చెప్పు నామాటలు, వొక్క అక్షర మైనా విడిచిపెట్ట కుండా" అని చెప్పాడు నాతో అర్జునుడు. అతనీమాటలు చెప్పినప్పుడు, దేవత లందరూ యింద్రుని మాట లెంత శ్రద్ధగా వింటారో అంత శ్రద్ధగానూ విన్నారు తక్కిన పాండుపుత్రులూ, సృంజయులున్నూ.

గాండీవం చేతబట్టి, కళ్లెర్ర జేసి అత నేం చెప్పా డంటే?

"సంజయా, దుర్యోధనుడు, ధర్మనందనునికి రాజ్యభాగం విడిచిపెట్టక పోయిన ట్టయితే, పూర్వజన్మంలో అతను చేసుకున్న పాపం అంతా యిప్పుడే అనుభవానికి వస్తుంది. భీమసేనునితోనూ, నాతోనూ కవలతోనూ, శ్రీకృష్ణునితోనూ సాత్యకితోనూ, ధృష్టద్యుమ్నుడితోనూ, శిఖండితోనూ, మహేంద్రసమాను డైన ధర్మనందనుడితోనూ యుద్ధం చెయ్యడానికే దుర్యోధనుడు సిద్ధపడ్డంచూస్తే, పాండుపుత్రుల కోరిక

లన్నీ నెరవేరినట్టే తోస్తోంది. ఏమంటే ? తన క్షేమాత్రం అప్రియం కలిగినా, ధర్మనందనుడు, భూమండలం వొక్కటే కాదు అంతరిక్ష మున్నూ బుగ్గిచేసేస్తాడు.

"పాండవులతో యుద్ధం చెయ్యడమే నీవుద్దేశం అయితే మాకు రావలసిన భాగం నువ్వు మాకివ్వకు" అని దృఢంగా చెప్పమన్నా డతను దుర్యోధనునితో. సంజయా, సమస్తమూ విడిచిపెట్టి సన్యాసి అయి, ధర్మంకోసం అడవుల్లో దుఃఖశయ్య అధివసించివున్నాడు గాదూ ధర్మనందనుడూ? యుద్ధరంగంలో ప్రాణాలు విడిచి అంత్యశయ్యగా దాని మీదే పడుకుంటాడు దుర్యోధనుడు తొందరపడనక్కరలేదు. అన్యా యంగానూ, దౌర్జన్యంగానూ దుర్యోధను డాక్రమించుకుని వున్న జను లను, నువ్వు, సిగ్గూ, జ్ఞానమూ, తపస్సూ, దమమూ, శౌర్యమూ, ధర్మసంరక్షణమూ — ఇలాంటి సుగుణాలున్న ధర్మనందనునియెడల అనురక్తు లయేటట్టు చూడు. కౌరవులకూ మాకూ సంధి పొసగేటట్టు చూడనేవద్దు.

కౌరవులు, మాయోపాయాలతో తన కెన్నిమా ర్లెన్ని అప కారాలు చేసినా, ధర్మనందనుడు, తన ఋజువర్తనంవల్లా తపోదమాల వల్లా, ధర్మబుద్ధితో సత్యమే మాట్లాడుతూ, ఎన్నికష్టాలు వచ్చినా వోర్చుకొంటూ వస్తున్నాడు. ఆ సంయమం విడిచి అతను కోపోద్రిక్తు డయాడంటే దుర్యోధను డప్పుడు గోలపెట్టవలసిందే; గాని మరి దారి లేదు. మండుటెండల్లో కార్చిచ్చు చెలరేగిం దంటే అడవుల కడు వులే దహించేస్తుంది. ధర్మనందనుడున్నూ క్రోధోద్రిక్తుడై అలాగే కౌరవసైన్యం అంతా బుగ్గి చేసేస్తాడు.

గదచేతబుచ్చుకుని మండిపడుతూనూ, క్రోధం అనే విషం కక్కు తూనూ రథం యెక్కి బయలుదేరతాడు భీమసేనుడు. ముందుభాగాన వున్న సైన్యం అంతా పిండీగుండా చేసేస్తూవుంటే మావాళ్ళుకూడా

తెరిచూడలే రతన్ని. యమునికంటేనూ భయంకరంగా వుంటూ డప్పు డతను. పర్వతశిఖరాలవంటి యేనుగులను గూడా మెగ్గేసి బుగ్గిచేసేస్తా డతను. ఆ యేనుగుల కుంభస్థలాలు బద్దలై కడవలతో గుమ్మరించి నట్టు రక్తం కారుతూ వుంటుంది. ఆలమందల్లో సింహం వురికిన ట్టురికి శత్రువులను నుసిచేసేస్తా డతను. గండ్రగొడ్డలితో అరణ్యాం ఛేదించేటట్టు ఖడ్గంచేతబట్టి కాల్బంట్లను నరికేస్తాడు. కౌరవుల నందరినీ తృణ ప్రాయంగా కాల్చేస్తాడు. పండబారివున్న సస్యం అంతా అగ్గిపిడుగు పాటుతోనుసి అయిపోయేటట్టు అయిపోతుంది తన సైన్యం అంతా. భీమసేనుని ప్రతిజ్ఞ అప్పుడు జ్ఞాపకంవస్తుంది దుర్యోధనునికి.

నకులుడు రథికుల కందరికీ మహారథికుడు. చిత్రయుద్ధాలుచెయ్య డంలో అంతటివాడు మరిలేడు. సుఖపడ్డానికే తగినవా డతను; కాని నానాకష్టాలూ అనుభవించా డడవుల్లో. అది మరిచిపోలే దతను. ఆ క్రోధంతో విషం కక్కే నల్లత్రాచులాగ యుద్ధరంగంలో ప్రవేశించి కూల్చి పారేశా టప్పుడు యుద్ధం అంటే యేమిటో తెలుస్తుంది దుర్యోధనునికి.

మీపక్షంగా యుద్ధంచెయ్యడాని కెందరో వచ్చారు రాజులు. ధర్మ నందనుని ధాటి కాగలేక వారందరూ నష్టాత్ములై రథాలు విడిచి పారిపోయేటప్పుడు దుర్యోధనుడు పశ్చాత్తాప పడతాడు, తాను చేసిన దానికి. ద్రౌపది పుత్రు లయిదుగురూ బాలకులే గాని మహాయో ధులు. అస్త్రశస్త్రా లన్నీ బాగా నేర్చినవారు. వారి శౌర్యం సహించ లేక తన సైన్యం చెల్లాచెదరయిపోయేటప్పుడు దుర్యోధనుడు "యెందుకు వచ్చిందిరా యిది?" అంటూ పరితపిస్తాడు.

సహదేవుని రథం చడీచప్పుడూ లేకుండా వచ్చి మీదపడిపోతుంది. దానివేగమున్నూ సామాన్యం కాదు. దాని కెందునా అడ్డూ లేదు. అతనిగుర్రాలున్నూ మిక్కిలీ వేగవంతాలు. ఆరథం యెక్కి అతను

రకరకాల మండలగతులతో వచ్చి కౌరవుల సైన్యంలోపడి రాజుల శిరస్సు లెగరగొడతాడు. అతి ఘోరంగా వుంటుం దప్పుడు యుద్ధం. దానికి తగ్గట్టు సింహనాదంచేసుకుంటూ నిర్భయంగా సంచరిస్తా డతను. ఏదిక్కున చూసినా అత నే వుంటాడు. మిక్కిలీ నిపుణు డతను. సత్యవాది. తానన్న మాట యుద్ధంలో నెగ్గించుకునితీరతా డతను. ధర్మం తప్పనివా డతను. అతని బలపరాక్రమాలు సాటిలేనివి. గాంధారరాజయిన శకునిమీదపడి చించిచెండాడకమాన డతను. అప్పుడు తెలుస్తుంది దుర్యోధనునికి తన తెలివితక్కువతనం. అప్పుడు విచారిస్తా డతను.

అభిమన్యు డెలాంటి పరవీరులనూ కూడా కూల్చేస్తాడు. బాలుడే గాని అబాలవీర్యు డతను. ఒక్క కృష్ణుడు మాత్రమే అతనికి సాటి. పరసైన్యసాగరం యెంతటిదైనా అనాయాసంగా లంఘించేస్తా డతను. ఆయుధం పుచ్చుకుని బయలుదేరాడంటే సాక్షాత్తూ మృత్యుదేవత అన్నట్టు మీదపడిపోతా డతను. ఇంద్రుడొక్కడే అతనితో పోల్చదగ్గ వాడు. అతణ్ణి చూస్తాడు, అంతే దుర్యోధనుడు, గుండెపగిలి పరితపిస్తాడు.

భద్రకులున్నారు. వారివేగం అనితరసాధ్యం. సింహవిక్రములు వారు. యువకులు. అస్త్రశస్త్రవిద్యల్లో ఆరితేరినవారు. వారు తన వారినందరినీ కడతేర్చడం చూస్తే అప్పుడు పరితపిస్తాడు దుర్యోధనుడు.

విరాట్ద్రుపదు లున్నారు. వృద్ధులే కాని మహారథులు వారు. తమ సైన్యా లన్నీ తరలించుకువచ్చారువారు. వారు కళ్ళు విప్పి చూస్తేనే చాలు గడగడలాడిపోతాడు దుర్యోధనుడు. వారిలో, ద్రుపదుడు యువకుల శిరస్సులు దుల్లకొట్టేటప్పుడూ, మత్స్యసైన్యంతో వురికి విరటుడు తనసైన్యం అంతా నల్లినినలిపినట్టు నలిపివేసేటప్పుడూ మరీ గోలపెట్టేస్తాడు దుర్యోధనుడు.

విరటుని పెద్దకొడు కుత్తరుడు గొప్పవీరుడు. రథికుల్లో మిక్కిలీ సమర్థు డతను. అతణ్ణి చూసిన్నీ డీల్లపోతాడు దుర్యోధనుడు. భీష్ముడు

మహావీరుడే; కాని శిఖండిచేతుల్లో అతను కడతేరడం తప్పదు. అప్పుడు కురుసైన్యంలో వొక్కడూ మిగలడు. అతనున్నూ కళ్ళబడ్డం తోనే తల్లకిందు లయిపోతాడు దుర్యోధనుడు.

సృంజయ లసాధ్యులు. వారిలో వొక్క ధృష్టద్యుమ్నుడు చాలు నెంతకైనా. అస్త్రశస్త్రరహస్యా లన్నీ ద్రోణుడే చెప్పా డతనికి. తీక్ష్ణబాణాలతో అతను తన సేనఅంతా నేలమట్టం చేసేటప్పుడు పరిత పిస్తాడు దుర్యోధనుడు.

వృష్ణిసింహు డైన సాత్యకి వున్నాడు. మహావీరు డతను. ధీమం తుడూ, శ్రీమంతుడున్ను. మనీషీ మనస్వీన్ని. కనక, రాజ్యాశపెట్టుకో వద్దని మీా దుర్యోధనునితో చెప్పు. రథం యెక్కి ఆసాత్యకి బయలు దేరా డంటే యెవడూ యెదిరించలేడు. సకలశస్త్రాస్త్రాలూ తెలుసు అతనికి. భయమన్నది యెరగ డతను. మహారథుడు. దీర్ఘబాహుడు. అతని వేగమున్నా యెవరూ అందుకోలేరు. తాడిచెట్టంత ఆయుధం అతనిది. మేఘా లుదకధారలు కురిసేటట్టు విజృమ్మితా డతను శత్రువుల మీాద నిశితబాణాలు. కౌరవముఖ్యుల సందరినీ అత నొక్కడే కూల గొడతాడు. వాసనతోనే పసికడతాయి సింహాన్ని గోవులు. అలాగే, కళ్ళేబడనక్కరలే దతను యుద్ధరంగంలో ప్రవేశించా డంటేనే చాలు తుళ్లిపడి శత్రువులు పరుగులంకించుకుంటారు. పర్వతాలకు పర్వతాలే పిండిచెయ్యగల డతను. లోకా లన్నీ బుగ్గిచెయ్యగలడు. అతని అస్త్ర పాటవం అతిచిత్రమూ అతిసూక్ష్మమున్ను. విలుకాడైనవాడి కెలాంటి యోగ్యత లుండాలో అవన్నీ వున్నవాడతను. నాలుగుగుర్రాలు పూన్చిన శ్రీకృష్ణుని బంగారురథం మీాద అతను కనపడితేనే చాలు గడగడలాడిపోతాడు దుర్యోధనుడు.

సంజయా, నారథంసంగతి కేరే చెప్పాలా నీకు? నా తెల్లగుర్రాలు పూనుస్తారు దానికి. నవరత్నాలతోనూ మిలమిల మెరుస్తూ వుంటుం

దది. కపిధ్వజం దాని కలంకారం. కృష్ణుడు నొగలమీద వుంటాడు. నాగాండీవజ్యారవం వజ్రాయుధం ధ్వని వంటిది. దిశలు గడగడ లాడిపో తాయి దాంతో. మందబుద్ధి అయిన దుర్యోధనుడు త్వరలోనే వింటా డా ధ్వని. అంధకారంలో ఆలమందల్లా అయిపోతారు తనయోధు లప్పుడు. మేఘమండలంలోనుంచి దూసుకువచ్చే మెరుపుతీగల్లా మీదపడిపో తాయి నాబాణాలు. శతఘ్నులు కావవి, సహస్రఘ్నులు. ఒక్కొక్క బాణం వేలకొద్దీ యోధులను కూల్చేస్తుంది. చర్మమూ మర్మాలూ చించెయ్యడం మాత్రమే కాదు, ఎముకలున్నూ విరిచేస్తా యవి. యోధులే కాదు, రథాలూ యేనుగులూ గుర్రాలూ కూడా చాపచు ట్టగా పడిపోతాయి వాటిదెబ్బకి. తనవాళ్లు నామీద వేలూ లక్షలే చిమ్మతారు బాణాలు, నిజమే; కాని నాబాణాలతో అవి తుక్కుతు క్కయిపోతాయి. విపాఠా లనే నాబాణా లెరుగుదువు నువ్వు. పిట్టలు చెట్లనుంచి ఆరముగ్గిన పళ్లు డుల్లగొడతాయి చూడూ, అలా డుల్ల గొడతా యవి కౌరవయువకవీరుల తలపళ్లు. గుర్రాలూ, ఏనుగులూ, రథాలూ యెక్కి నామీదికి వచ్చేవారి తలపళ్లున్నూ అలాగే డుల్లి పోతాయి వాటితో.

నాబాణమార్గానికి వచ్చారంటే కూలిపోవలసిందే కౌరవయో ధులు. ఊహే గాని యుద్ధంచెయ్యడం అంటూ వుండదు వారు. కాల్బంట్లూ, రథికులూ, ఆశ్వికులూ, గజయోధులూ — వారూ వీరూ యేమిటి నోరు తెరుచుకుని మృత్యుదేవత మీదపడిపోయేటట్టు పడి పోతాను, వారందరిమీదా నేను. మంటలు కక్కుతూ వెళ్లి నాబా ణాలు బుగ్గిచేసేస్తాయి, వారిని. అది చూసి అప్పు డఘోరిస్తాడు దుర్యో ధనుడు. ఎటుచూసినా నారథమే వుంటుంది. కౌరవసేన అంతా అటు ధూళితో నిండిపోయి, యిటునాబాణాలతో తెగిపోతుంది. అది చూసు కుంటాడు, నెత్తీనోరూ బాదుకుంటాడు, దుర్యోధనుడు.

ఇంతేకాదు. కౌరవసైన్యం అంతా పలాయితం అవుతుంది. చేష్టలు తక్కి, వాళ్లు తెగి కూలిపోతుంది. అశ్వికులూ, రథికులూ, గజయోధులూ రాలిపోతారు. వాహనా లెటువీలుంటే అటు పారిపోతాయి. అక్కడికీ బతికివుండినవాళ్లకి నోళ్లెండిపోతూవుంటాయి. ఎటుచూసినా ఏడ్పులూ పెడబొబ్బలూ తప్ప మరోటి వుండదు. చచ్చేవాళ్లూ చచ్చినవాళ్లూ అయి, యుద్ధరంగం అంతా ఘ్రాలతోనూ, పేగులతోనూ, కాలుసేతులతోనూ, మొండేలతోనూ, ఎముకులతోనూ నిండిపోతుంది. యుద్ధంలో, నాచేతిలో చచ్చి స్వర్గానికి వెళ్లడానికే సృష్టించాడు బ్రహ్మదేవుడు వాళ్లని. ఇదంతా చూసుకుంటాడు, దుర్యోధనుడు గోలపెట్టేస్తాడు.

ఇంతపని కూడా కానక్కరలేదు. నారథంమీద వొకచేత పగ్గాలూ, వొకచేత పాంచజన్యమూ పుచ్చుకుని శ్రీకృష్ణు డుంటాడు. నేనుంటాను. నాగాండీవమూ దేవదత్తమూ వుంటాయి. అక్షయతూణీరాలుంటాయి. పైని రెపరెపలాడుతూ వుంటుంది కపిధ్వజం. కలపటం రావడం దాకా యెందుకూ, ఈసన్ని వేశం చూస్తేనే చాలు, బిక్క మొగం వేసేస్తాడు దుర్యోధనుడు.

మారాజ్యం హరించిన దురాత్ముల నందరినీ సంహరిస్తూనూ, ఈ అధర్మయుగం పూర్తిచేసి ధర్మయుగం ప్రారంభిస్తూనూ కాలాగ్ని లాగ, నేను, తనపుత్రపౌత్రాదుల నందరినీ బుగ్గిచేశాటప్పుడు ధృతరాష్ట్రుడున్నూ పరిపరివిధాల పరితపిస్తాడు, గుండెలు బాదుకుంటూ. తన తమ్ములతోపాటూ, సైన్యంతోపాటూ, భృత్యులతో పాటూ తన దర్పమున్నూ అంతా నాశనం అయిపోయాక, ఐశ్వర్యమున్నూ భ్రష్టం అయిపోయాక అల్పచిత్తు డయిన దుర్యోధనుడు బాగా విచారిస్తాడు.

వెనకటి కొకనాటి పొద్దున్న నేను సంధ్యావందనమూ జపమూ పూర్తిచేసుకున్నతరవాత బ్రాహ్మ డొకడు వచ్చి "అర్జునా, నువ్వొక ఘనకార్యం చెయ్యాలి. చాలా దుష్కరం అది. నీశత్రువుల నందరినీ

సంహారించడమే ఆ ఘనకార్యం. ఇందులో, ఐరావతం యెక్కి వజ్రా యుధం చేతబుచ్చుకుని నీశత్రువులను సంహారిస్తూ ఇంద్రుడు నీకు ముందుంటాడు. సుగ్రీవం అనే గుఱ్ఱం పూన్చిన రథం యెక్కి నీశత్రు వులను నాశనం చేస్తూ కృష్ణుడు నీకుముందుంటాడు ” అని చెప్పాడు. ఆ బ్రాహ్మ డింద్రుడే సందేహం లేదు. అంచేతనే నేను శ్రీకృష్ణుణ్ణి కోరుకున్నాను. ఇదంతా దేవతల యేర్పాటు. యుద్ధమే చెయ్యడు కృష్ణుడు అంతే; కాని నాకు తప్పకుండా జయంచేకూరుస్తాడు. మను ష్యులే కాదు, దేవతలున్నూ దీనికి భిన్నంగా ఏమీచెయ్యలేరు.

సముద్రాని కంతూ దరీ అంటూ లేదు. జలాని కంతకూ రాశి అది. విడిచేతులతో యెవడా సముద్రం యివతలినుం చవతలి కీదగలడో వాడొక్కడే మహాశూరు డైన శ్రీకృష్ణుణ్ణి జయించగలడు. పెద్ద పెద్ద రాతిబండలతో యేర్పడ్డ కైలాసపర్వతం తన చేతులతో బద్దలుకొట్టా లని చూసేవాడిచేతులు గోళ్ళతోగూడా పిప్పిపిప్పి అయిపోతాయేగాని ఆ పర్వతాని కేమి నష్టమూ? కృష్ణుణ్ణి జయిద్దా మనుకున్న వాడి పనీ అంతే అవుతుంది. యుద్ధంలో శ్రీకృష్ణుణ్ణి జయించడం అంటే యేమిటో తెలుసా? దేవతల నందరినీ చావ గొట్టి అమృతం హారించడమూ, సూర్యచంద్రులను చేతులతో పట్టుకోడమూ, భగభగమండుతున్న అగ్నిహోత్రం చేతులతో ఆర్పడమూను.

రుక్మిణీదేవి మిక్కిలీ యశస్సుగల నారీమణి. అంతటి తేజస్వంతు రాలు పృథివిమీద మరి లేదు. ఏకాకి అయి వెళ్ళి, భోజుల నందరినీ చితగ్గొట్టి, శ్రీకృష్ణు డామెను హారించుకు వచ్చి వివాహంచేసుకున్నాడు. ఆమె కొడుకే ప్రద్యుమ్నుడు. శ్రీకృష్ణుడు గాంధారరాజులను కూడా అందరినీ జయించాడు. నగ్నజిత్తు కొడుకుల నందరినీ వోడించి, వారు చెరపట్టివున్న సుదర్శనరాజుని విడిపించాడు. గుండెలమీద వొక్కటే చరుపు చరిచి పాండ్యరాజును పరిమార్చాడు. ఘోరయుద్ధంచేసి కాళిం

గులనంకరినీ మర్దించి చంపాడు. వారణాసి కాల్చి యెన్నో సంవత్స రాలు దాని కేమీ దిక్కులేకుండా చేశాడు. నిషాదరా జయిన ఏక లవ్యుణ్ణి జయించడం యెవరికీ సాధ్యం కాదనుకునేవా రందరూ. వెన కటికి, జంభు డనే రాక్షసుడు అతణ్ణి చంపుదా మని రెండు చేతులతోనూ గట్టిగా చరిచాడు; కాని ఆ చరుపులకు తానే చచ్చిపోయాడు. అలాంటి యేకలవ్యుణ్ణి వొక్కటే చరుపు చరిచి చంపాడు శ్రీకృష్ణుడు.

ఉగ్రసేనుని కొడుకైన కంసుడు మిక్కిలీ దుర్మార్గుడు. వృష్ణ్యంధక యోధులు బలిసివుండిన నిండుకొలువులో, బలరాముని సాయంతో కృష్ణు డాకంసుణ్ణి సంహారించి అతని తండ్రికి రాజ్యం కట్టబెట్టాడు. సాల్వుడు మహామాయావి. మిక్కిలీ క్రూరుడు. అతిభయంకరుడు. అత నాకాశాని కెగిరి యుద్ధంచేశాడు. అయినా యీ కృష్ణు డతణ్ణి అనాయాసంగా చంపేశాడు. ఆసాల్వుని కోటముం దొక పెద్దశతఘ్ని వుండేది. కృష్ణు డది రెండు చేతులతోనూ పట్టుకుని విరిచిపారేశాడు.

మాహిష్మతీపురాధిపతి అయిన నరకాసురు ణ్ణెరగనివారు లేరు. మహాబలశాలి వాడు. వాడిదుర్గం యెలాంటివారికీ చొరరానిది. అది భేదించడమున్నా యెవరికీశక్యంకాదు. వా డదితి మణికుండలాలు హరిం చాడు. దేవతలూ ఇంద్రుడూ కూడా వాణ్ణేమీ చెయ్యలేకపోయారు. వారందరూ మృత్యువు లేనివారే; కాని వాణ్ణెదిరించలేకపోయారు. ఎదిరించిన్నీ నిలవలేకపోయారు. చేసేది లేక చివరకి కృష్ణు ణ్ణాశ్రయిం చారు వారు. అతని బలపరాక్రమాలూ అస్త్రసంపదా వారికి బాగా తెలుసు. ముందు నిర్మోచనం అనే నగరంలో ఆరువేలరాక్షసులను సం హారించాడు కృష్ణుడు. వాడి సేనాధిపతి మురాసురుణ్ణి కూడా సంహారిం చాడు. నరకు డక్కడే యెదిరించాడు కృష్ణుణ్ణి. ఇద్దరికీ ఘోరయుద్ధం జరిగింది. ఆయుద్ధంలో, సుడిగాలికి కొండగోగుచెట్టు పడిపోయేటట్టు కూలిపోయాడు నరకాసురుడు. ఈవిధంగా దేవతలకున్నా సాధ్యం

కాని పనిచేశాడు కృష్ణుడు. ఆమణికుండలా లదితి కిచ్చాడు. అందుకు మెచ్చి, యెలాంటి యుద్ధంలోనూ శ్రమ అనేది కలక్కుండా వుండేటట్టూ, ఆకాశానా నీటిలోనూ కూడా అవక్రగతి కలిగేటట్టూ, ఎంతటి గొప్ప శస్త్రములూ కూడా శరీరం దూసుకుపోకుండా వుండేటట్టూ కృష్ణుడికి వరా లిచ్చారు దేవతలు.

కృష్ణుడు కృష్ణు డంటే యేమనుకున్నారో యిలాంటివా డతను. అతని బలపరాక్రమా లపారాలు. అప్రమేయు డతను. అతని శక్తిసామర్థ్యాలు వూహించడానికిన్నీ చాల రెవరూ. అలాంటి మహానుభావుణ్ణి జయిద్దా మనుకుంటున్నాడు దుర్యోధనుడు. నాకూ కృష్ణునకూ భేదం కల్పిద్దామనిన్నీ చూస్తున్నాడు. మమ్మల్ని చూసి దుర్యోధనుణ్ణి క్షమించి వూరుకుంటున్నాడు కృష్ణుడు. యుద్ధం పొసగినప్పుడు గాని యిది దుర్యోధనునకు బోధపడదు.

శాంతనవు డైన భీష్మునకూ, ద్రోణాచార్యునకూ, అశ్వత్థామకూ, సాటిలేనివిలుకాడు కృపాచార్యునకూ మొక్కి, మారాజ్యం స్వాధీన పరుచుకోడానికి నేను యుద్ధం చేస్తాను. దుర్బుద్ధితో మాతో యుద్ధానికి సిద్ధపడేవాడు నాశనం అయిపోతాడు తప్పదు. అదే ధర్మం అంటే. క్రూరులచేత మాయలమారి జూదంలో వోడిపోయి, పన్నెండేళ్లరణ్యవాసమూ, వొకయే డజ్ఞాతవాసమూ చేశాం మేము. మేము బతికే వుండగా, దుర్యోధనాదులు మారాజ్యం మాకు తక్కకుండా ఎలా చేస్తారో చూస్తాను.

మాకు దేవేంద్రాదులు సాయంచేస్తారు. అయినా, దుర్యోధనాదులే జయిస్తారా? అయితే, అధర్మమే జయిస్తుం దన్నమాట. సత్కర్మ అనేది లేనేలే దన్నమాట. పురుషుడు కర్మబద్ధు డనీ, మేము తనకంటే ఉత్తములమనీ దుర్యోధను డనుకోకపోయిన ట్టయితే, కృష్ణుని సాయంతో యుద్ధంచేసి సబంధుమిత్రంగా దుర్యోధనుణ్ణి నాశ

నంచేసేస్తా న్నేను. మేము చేసిన సత్కర్మలు వ్యర్థం కాకపోతే, మేము చేసుకున్న పుణ్యమున్నూ అయిపోకుండా వుంటే, దుర్యోధనున కప జయం తప్పదు.

నేను చెప్పేది బాగా విను. యుద్ధానికి సిద్ధపడ్డారో దుర్యోధనాదు లిక లేకుండాపోయారో. వారిలో వొక్కడూ మిగలడు. కర్ణునితో కలిపి దుర్యోధనాదుల నందరినీ నేను సంహారించేస్తాను. కనక, యిప్పుడే వారేమి కావా లంటే అది చేసుకోమను. పెళ్ళాంబిడ్డలతో స్వేచ్ఛగా సుఖించమను. బహుశ్రుతులూ, శీలవంతులూ, కులీనులూ, జ్యోతి శ్శాస్త్రంలో అఖండప్రజ్ఞావంతులు అయిన సిద్ధాంతులూ, అయిన వృద్ధబ్రాహ్మలెందరో వున్నారు మాదగ్గిర. దైవం మాపక్షాన వున్నాడు. శకునాలు మాకనుకూలంగా వున్నాయి. ఆ బ్రాహ్మణోత్త ములు, కౌరవులకూ సృంజయులకూ నాశనమూ మా కభ్యుదయమూ తప్ప దని చెబుతున్నారు.

అజాతశత్రు వయిన ధర్మనందనుడు శత్రువులను సంహారించడానికి సర్వవిధాలా సిద్ధంగా వున్నాడు. దివ్యదృష్టితో అతీతానాగతాలు గుర్తించగల శ్రీకృష్ణుడు, కౌరవు లోడిపోతారనీ, మేము గెలుస్తా మనీ నిశ్చయించుకుని వున్నాడు. నాకున్నూ అదలా జరుగుతుం దని స్పష్టంగా గోచరిస్తోంది. నేనూ పూర్వజ్ఞానంతో చెబుతున్నా నీమాట. నాజ్ఞానం లేశమూ కలుషితం కాలేదు. దుర్యోధనాదులు నశించిపోడం తథ్యం.

నాగాండీవం నాప్రయత్నం లేకుండానే విజృంభిస్తోంది. మీటక పోయినా నాఅల్లెతాడు మోగిపోతోంది. బాణాలున్నూ అమ్ముల పొదులలోనుంచి దూకడానికి చూస్తున్నాయి. నాఖడ్గం వొరలోనుంచి బైటికి కురుకుతోంది. "నీశత్రువుల కిరీటా లెప్పుడు పడగొడతానో" అంటూ గర్జిస్తోంది జెండా. రాత్రిళ్ళు నక్కలు కూస్తున్నాయి. ఆకాశం

నుంచి రక్తం కురుస్తున్నారు. నక్కలూ, కాకులూ, కొంగలూ, గద్దలూ, డేగలూ నారథం వెనక మూగుతున్నాయి.

కార్చిచ్చు అడవి అంతా బుగ్గిచేసేస్తుంది. అలాగే నేను మీపక్షంగా వచ్చిన రాజుల నందరినీ బూడిదచేసేస్తాను. పాశుపతాస్త్రమూ, బ్రహ్మాస్త్రమూ ప్రయోగించి శత్రుసైన్యం అంతా నేను నాశనంచేసేస్తాను. ఇది నిశ్చయం. ఈసంగతి దుర్యోధనునితో గట్టిగా చెప్పు. ఇంద్రుడూ మొదలైనవారికిన్నీ అజయ్యులైనవారితో యుద్ధంచెయ్యడానికి సిద్ధపడుతున్నాడు దుర్యోధనుడు. అతని అజ్ఞానం యెంత గాఢంగా వుందో పరకాయించావా? ఇంతకీ :— సంజయా, వృద్ధుడైన భీష్ముడూ, కృపుడూ, ద్రోణుడూ, అశ్వత్థామా, ధీశాలి అయిన విదురుడూ, ఏమిచెబుతారో అది కావాలి. కౌరవులు క్షేమంగా వుండాలి.

# 49

## తా తా మ న మ ల వ ర స

అక్కడ కూడివున్న రాజు లందరూ వినేటట్టు, దుర్యోధనుణ్ణి పిలిచి భీష్ము డిలా చెప్పాడు.

"వెనకటి కొకనాడు దేవతల్లో ముఖ్యు లంతా బ్రహ్మసన్నిధికి వెళ్లారు. ముఖ్యులంటే, — బృహస్పతీ, శుక్రుడూ, ఇంద్రుడూ, వసువులూ, అగ్ని, ఆదిత్యులూ, సాధ్యులూ, సప్తమహర్షులూ, విశ్వావసు వనే గంధర్వుడూ, అప్సరసలూ కూడా వున్నారు వారిలో. వారంద రూ నమస్కారాలు విన్నవించుకుని బ్రహ్మను సేవించుకుంటున్నారు.

ఆసమయాన, పూర్వదేవు లైన నరనారాయణులు, తమ అఖండ తేజస్సుతో అక్కడివారి తేజస్సూ, మనస్సులూ ఆకర్షించుకుంటూ వారి నందరినీ దాటివెళ్లిపోయారు. అది చూసి ఆశ్చర్యపడి "మహాత్మా,

నిన్ను సేవించుకోకుండా — నీ వైపయినా చూడకుండా వెళ్లిపోతున్నారు, వారెవరు ?" అనడిగాడు, బృహస్పతి.

అందుకు బ్రహ్మ "తమ దివ్యతేజస్సుతో భూమీ అంతరిక్షమూ కూడా వెలిగిస్తూ యిప్పుడిలా వెళ్లినవారు నరుడూ నారాయణుడూ అన్న మహర్షులు. మహాతపస్సంపన్నులు వారు. లోకాతీతులు. సాటిలేని బలపరాక్రమాలు వారివి. భూలోకంనుంచి వచ్చారిక్కడికి. అమానుషాలైన గొప్పపనులు చేసి లోకం అంతా ఆనందపెట్టినవారు వారు. ఇద్దరన్నట్టు కనపడతారు; కాని వారికెందునా భేదంలేదు. అసురులను నాశనంచెయ్యడమూ, దేవతలనూ గంధర్వులనూ ఆనందపెట్టడమూ — ఇంతే వారి పని" అని బదులుచెప్పాడు.

దేవాసురులకు మహాయుద్ధం జరుగుతోం దప్పుడు. మహాభయంకర మైన యుద్ధం అది. దేవతలకు "ఓడిపోతాం" అన్న భయం పుట్టివుం దప్పటికే. అంచేత, ఇంద్రుడు, ఈమాట వినడం తడవుగా దేవతల నందరినీ వెంటబెట్టుకుని, బృహస్పతి వెంటబయలుదేరి వారు తపస్సు చేసుకుంటున్నచోటికి వెళ్లాడు. వెళ్లీవెళ్లగానే "ఒక వరం దయచెయ్యా" లని కోరా డతను. "ఇస్తాం, కోరుకో" మన్నారు వారు. "మాకీయుద్ధంలో మీరు సహాయంచెయ్యా" లన్నా డింద్రుడు. "తప్పకుండా చేస్తాం" అన్నారు వారు. అంటూనే ఇంద్రుడి వెంట బయలుదేరారు కూడా.

మళ్లీ కలపటం అయింది. శత్రువులు విరుచుకుని మీదపడ్డారు. నరుడు, పౌలోములూ కాలఖంజులూ అనే శత్రువులను వేలకొద్దీ సంహారించాడు, విలాసంగా. అది చూసి మింగేద్దామని జంభాసురుడు మీదికి కురికాడు. నరు డెదిరించాడు. అతివడిగా పోతోంది రథం. నేల ఎగుడుదిగుడుగా వుండడంవల్ల ఎగురుతూ దుముకుతూ పోతోందా రథం. అయినా, ఆరథం మీదే వుండి, నరుడు, పదునైన బాణాలతో

జంభాసురునితలపండెగరగొట్టేశాడు. తరవాత నివాతకవచులను కూడా సంహారించా డతను. సముద్రపుటొడ్డున హిరణ్యపురం అంటూ వుంది. అక్కడ వున్నా రా నివాతకవచులు. అరవై వేలమందిని సంహారించాడు నరుడు వారి నక్కడ. హిరణ్యపురమున్నూ బుగ్గిచేసేశాడు.

తరవాత ఖాండవం కూడా కాల్చేశాడు. దేవత లందరూ వచ్చి మీదపడ్డా రప్పుడు. ఇంద్రుడున్నూ వచ్చాడు మండిపడుతూ. అయినా, జంకనేది లేకుండా, వారి నందరినీ యెదిరించి వోడించేశాడు నరుడు. నారాయణుడున్నూ యిలాగే అనేకులను సంహారించాడు.

ఇలాగ, ఈనరనారాయణులు బలపరాక్రమాలవిషయమై ఎంత మాత్రమూ సాటిలేనివారు. ఎవరూ కూడా ఎలాంటివారూ కూడా వారి నేమీ చెయ్యలేరు. వారికి పూర్వదేవు లని ప్రసిద్ధి. ఆనరుడే అర్జునుడూ, ఆనారాయణుడే కృష్ణుడున్నూ. ఈమర్త్యలోకంలో వారి నిద్దరినీ యెవరూ జయించలేరు.

నిజానికి, నరుడూ నారాయణుడూ వొకటే సత్వం. అయితే, లోకసంగ్రహాంకోసం యిద్దరుగా రూపొందారు. తాము చేసుకున్న శుభకర్మలవల్ల ఎవరికీ అందని అక్షయలోకాలు సంపాదించుకుంటారు. ఎప్పుడెప్పు డెక్కడెక్కడ తమ అగత్యం యేర్పడుతూ వుంటుందో అప్పుడప్పుడల్లా అక్కడక్కడ ఆవిర్భవిస్తూ వుంటారు వారు.

"దుష్టశిక్షణకోసం యుద్ధంచెయ్యడమే వారి పని", అని నారదుడు యాదవుల కందరికీ చెప్పివున్నాడు. దుర్యోధనా, ఒకటిచెబుతా విను. శంఖమూ, చక్రమూ, గదా చేతబట్టి కృష్ణుడూ, భయంకర యుద్ధరంగంలో అస్త్రాలు విజృమ్మిస్తూ అర్జునుడూ వొక్క రథంమీద వుండగా నువ్వెప్పుడు చూస్తావో నామాటలు నీకప్పుడు జ్ఞాపకం వస్తాయి. నామాట లంటే నీకు లెక్కలేకపోవచ్చు; గాని కురుకులం

అంతా నామరూపా ల్లేకుండాపోతుంది, అదయినా గుర్తించుకో. నీబుద్ధి యిప్పుడు ధర్మానికీ, అర్థానికీ గూడా దూరం అయిపోయివుంది.

ఇంతేకాగు. కర్ణుడు పరశురాముని శాపంతో కుంగిపోయివున్నాడు. అసలే అతను దుర్జాతివాడు. సౌబలు డైన శకుని కూడా అలాంటి వాడే. ఎలాంటి పాపాలకున్నూ జంకనివాడు నీతమ్ముడు దుశ్శాసనుడు. నువ్వీముగ్గురి మాటలూ మాత్రమే వింటున్నావు. కౌరవులున్నూ అందరూ నీమాటమీదే వుంటున్నారు. ఇప్పు డయినా నువ్వు నేను చెప్పేది వినిపించుకోకపోతే, నీవాళ్ళలో చాలామంది నాశనం అయి పోయా రన్న మాట అయినా వినకతప్పదు నీకు ”

భీష్ము డిలా అనగా “ నువ్విలా అనగూడ ” దంటూ దురుసుగా అందుకున్నాడు కర్ణుడు. “ నేను క్షత్రియధర్మం అవలంబించివున్నాను. నాధర్మం నేనెప్పుడూ తప్పియెరగను. నువ్వు నన్ను మహా గర్హిస్తు న్నావుగాని నేనెప్పుడూ చెడ్డపనులు చేసి యెరగను. నావల్ల లేశ మున్నూ పాపంసంచితం కాలేదు. ఈ సంగతి దుర్యోధనాదు లందరూ బాగా యెరుగుదురు. యుద్ధరంగంలో అడుగుపెట్టానా పాండవుల నందరినీ నేనొక్కణ్ణే సంహరించివేస్తాను. ఇవాళే గాదు, పాండుపుత్రులు ఎప్పుడూ విరుద్ధంగానే ప్రవర్తిస్తున్నారు. వారితో పొందుగా వుండా లంటే మాటలా ? నేను ధృతరాష్ట్రుని కేది యిష్టమో అదంతా చెయ్య వలసివుంది. దుర్యోధనుడిప్పుడు రాజయివున్నాడు. కనక, అతనికిన్నీ యేది యిష్టమో అదిన్నీ అంతా నేను సాధించవలసివుంది ” అని చాలా కచ్చితంగా చెప్పాడు.

కర్ణుని మాటమీద భీష్ముడు మళ్ళీ అందుకున్నాడు. “ ధృత రాష్ట్రా, మాటిమాటికీ యీకర్ణుడు పాండుపుత్రుల నందరినీ తానే చంపివేస్తా నంటున్నాడు. అదెన్నటికీ జరగదు. పాండుపుత్రుల్లో యీకర్ణుడు పదహారోవంతయినా కాడు మరి. సహజంగా నీకొడుకులే

దుర్మార్గులు. పైఆని, వారు చేసే చెడ్డపనుల కన్నిటికీ యీకర్ణుడే కారణం. కర్ణుడు చెప్పిన మాటలు వినేవా రలా చేస్తున్నారు. పాండుపుత్రులు దేవాంశవల్ల పుట్టినవారు. వారివిషయమై నీకొడుకులు చేసే ద్రోహాని కంతకూ — అవమానాలకున్నూ అన్నిటికీ యీసూతపుత్రుడే మూలం. పోనీ, అదలా వుంచు. పాండుపుత్రుల్లో వొక్కొక్కడే యెంతెంతో గొప్పపనులు చేశారు. వాటిలో వొకటయినా యీ సూతపుత్రుడు చెయ్యగలిగగాడా వొక్క మాటయినా?

మనం గోగ్రహణం చేసినప్పుడు తన తమ్ముణ్ణి తన కళ్ళయెదటే సంహరించిన అర్జును ణ్ణేమి చెయ్యగలిగా డీకర్ణుడు? కౌరవుల నందరినీ చచ్చిన పీనుగు లన్నట్టు చేసి అర్జునుడు తలగుడ్డలు వొలుచుకు పోయాడుగదా, మరి, అప్పు డీకర్ణుడక్కడ లేడనుకుంటున్నావా? ఈసూతపుత్ర డాబోతులాగ యిప్పు డిలా రంకెలువేస్తున్నాడు; గాని ఘోషయాత్రలో గంధర్వులు వచ్చి నీకొడుకిని చెరపట్టినప్పు డేమి చెయ్య గలిగాడూ? అప్పుడు భీమార్జునులూ, నకులసహదేవులూ మాత్రమే నీకొడుకుని విడిపించారు గంధర్వుల నోడించి, మరిచి పోయావా? ఈకర్ణు డున్నాడే, ధర్మానికీ, అర్థానికీ గూడా చాలా దూరం. ఇతను చెప్పేవన్నీ కోతలుగాని చేతలుగావు” అని నిర్మొగ మాటంగా చెప్పా డతను.

భీష్ముడు మాట ముగించడమే తడువుగా ద్రోణు డందుకున్నాడు. “రాజేంద్రా” అంటూ ముందు ధృతరాష్ట్రుణ్ణి సంబోధించా డతను. “భరతకులపావనుడైన భీష్ముడు చెప్పినట్టు చెయ్యి. ధనలుబ్ధులు చెప్పే మాటలు వినవద్దు నువ్వు. యుద్ధానికి సిద్ధపడ్డం నీకు చాలా ముప్పు తెచ్చిపెడుతుంది. పాండుపుత్రులతో కలిసిమెలిసి వుండడమే నీకు శ్రేయస్కరం. అర్జునుడు నీతో చెప్పమన్నా డని సంజయుడు చెప్పాడు చూడూ, అక్షరాలా ఆమాటలు జరిగితీరతాయి. అర్జును డెంతపన

యినా చెయ్యగలడు. అతనికి సాటివచ్చే విలుకాడు ముల్లోకాల్లోనూ లేడు. ఇది సత్యం" అని చాలా దృఢంగా చెప్పా డతను.

కాని ధృతరాష్ట్రుడు భీష్ముని మాటలూ, ద్రోణుని మాటలూ కూడా లెక్క చెయ్యలేదు. పైగా, అటు తిరిగి "పాండవుల సంగతి యింకా చెప్పవోయి" అని సజంయు ణ్ణడిగా డతను. అది చూసి కౌరవు లందరూ ప్రాణాలమీద ఆశవదులుకున్నారు.

## 50

## ధర్మనందనుని ధైర్యం యేమిటోయ్?

"సంజయా, యుద్ధంలో సాయంచేసి మనకు ప్రీతికలిగించడానికి పూను కుని యెందరోరాజులు బాసట అయివచ్చివున్నారు. ఇది విని ధర్మనం దను డేమన్నాడోయ్? నువ్వక్కడి వృత్తాంతం చెబుతున్నప్పు డతని వాలకం యెలావుందోయ్? అక్కడివారిలో – ముఖ్యంగా, అతని తమ్ముల్లోనూ కొడుకుల్లోన్నూ, అత నేమి చెబితే వెంటనే ఆపని చెయ్యడానికి అతని మొగంకేసే చూస్తూ సిద్ధంగావుండినవారున్నూ యెవరోయ్? అతను ధర్మా లన్నీ తెలిసినవాడు. ధర్మం తప్పనివా డున్నూ. అయితే, మందబుద్ధు లైన మనవా ళ్లతనికి కోపం తెప్పిం చారు. అయినా, యుద్ధానికి సిద్ధపడవ ద్దని అత న్నెవ రయినా దిగతీ స్తున్నా రా లేదా? అదే జరుగుతూ వుంటే యెవ రాపని చేస్తున్న వారు?" అనడిగాడు ధృతరాష్ట్రుడు.

సంజయు డందుకున్నాడు. "రాజేంద్రా, ధర్మపుత్రు డెప్పు డేమి ఆజ్ఞాపిస్తాడో అని అతని తమ్ములూ, కొడుకులూ, పాంచాలురూ కూడా యెప్పుడూ అతనిమొగంమీదే చూపులు నిలుపుకుని వుం టారు. ఏమి టేమిటో చెయ్య మని వారి నతను నిర్దేశిస్తూనూ వుంటాడు. పాండుపుత్రుల రథాలూ, పాంచాలుర రథాలూ వేరువేరుగా బారులు

తీరివుండి, అత నెక్కడి కయినా వెళ్లినా, వెళ్లివచ్చినా అభినందిస్తూ వుంటాయి. నడిమింటి సూర్యభగవాను డన్నట్టు తేజరిల్లే ధర్మపుత్రుణ్ణి పాంచాలురు వినయవిధేయతలతో సేవించుకుంటూ వుంటాడు. కేకయులూ, మత్స్యదేశీయులున్నూ మాత్రమే కాదు, ఆలమందలూ గొర్రెలమందలూ కాసుకునే పామరులుగూడా ధర్మనందను డంటే మిక్కిలీ భయభక్తులతో మసులుకుంటూవుంటారు. బ్రాహ్మణబాలికలూ, క్షత్రియబాలికలూ, వైశ్యబాలికలూ తాము ఆటపాటల్లో మునిగివుండిన్నీ ధర్మనందనుడు బయలుదేరా డంటే అన్నీ విడిచి పరుగులెత్తుకుంటూ వస్త్రా రత్ణ్ణి చూడ్డానికి" అని చెప్పా డతను.

దానిమీాద ధృతరాష్ట్రుడు "అయితే, ధృష్టద్యుమ్నుని చూసుకునా సోమకులను చూసుకునా పాండుపుత్రులు మనమీాద దండెత్తి రావడం?" అని మళ్ళీ అడిగాడు. ఇది విని సంజయుడు ఏదో ఆలోచిస్తూ పెద్దనిట్టూర్పు విడిచిపెట్టాడు ముందు. ఇంతలో నిష్కారణంగా అతని కేదో జంకుపుట్టింది. దాంతో, నుంచునివుండినవాడు నుంచుని వున్నట్టుగానే నేలమీాద పడిపోయాడు. అది చూసి "రాజేంద్రా, ఎంచేతనో సంజయుడు మూర్ఛిల్లిపడిపోయాడు. మాటా చూపూ లేకుండా వున్నాడు. చాలా నీరసపడిపోయి వున్నాడు" అని చెప్పాడు విదురుడు. "కావచ్చు" నన్నాడు ధృతరాష్ట్రుడు. "మహారథులైన కుంతీపుత్రులను చూసిన కళ్ళకతని కేదో అపాయశంక కలిగి వుంటుంది. దాంతో మనస్సు చెడి అలా అయిపోయివుంటా" డనిన్నీ అన్నా డతను.

ఇంతలో తెలివి రాగా, సంజయుడు మళ్లీ ప్రారంభించాడు.

"రాజేంద్రా, నేను కుంతీపుత్రులను చూశాను. విరాటనగరంలో అజ్ఞాతవాసం చెయ్యడంలో వారెంతో చిక్కిపోయివున్నారు. అయినా, ధృష్టద్యుమ్నుని బలం చూసుకుని వారు యుద్ధానికి సిద్ధపడుతున్నారు.

ధర్మనందనుడు, రోషంవల్లా, భయంవల్లా, లోభంవల్లా, డబ్బుకోసమూ కూడా యెన్నడూ ధర్మంవిడిచిపెట్టడు. ధర్మానికి అతనే ప్రమాణం. అతణ్ణి చూసుకునే పాండుపుత్రులు యుద్ధసన్నాహాలుచేసుకుంటున్నారు.

బాహుబలంలో భీమసేనునికి సాటివచ్చేవాడు పృథివిమీద మరి లేడు. ధనుస్సు చేతబట్టాడంటే, రాజుల నందరినీ అతిసులభంగా స్వాధీన పరుచుకుంటాడతను. యుద్ధంచేసి కాశీరాజునీ, అంగరాజునీ, మగధ రాజునీ, కళింగాధిపతినీ ఓడించాడతను. అతని బాహుబలంవల్లనే తక్కిన పాండుపుత్రులు లక్కయింట బుగ్గిఅయిపోకుండా నిలిచివున్నారు. మనుష్యులను భక్షించే హిడింబాసురుణ్ణి అతనే నాశనంచేశాడు. ద్రౌపదిని చెరపట్టిన సైంధవుణ్ణి చంపినవాడున్నూ అతనే. ఆభీమసేనుణ్ణి చూసుకుని వారు యుద్ధానికి సిద్ధపడుతున్నారు.

ద్రౌపది కోరికమీద సౌగంధికపుష్పాలు తేవడంకోసం అతను గంధమాదనపర్వతంమీదికి వెళ్లాడు. అది చాలా యెగుడుదిగుడుగా వున్న పర్వతం. అక్కడ యక్షులతణ్ణెదిరించారు. అయినా, తాను నాగాయుతబలుడు కనక భీమసేనుడు వారి నందరినీ జయించి సౌగంధికాలు తెచ్చాడు. ఆభీమసేనుణ్ణి నమ్ముకుని వారు యుద్ధానికి సిద్ధపడుతున్నారు.

కృష్ణుని సాయంతో అగ్నికి ప్రీతి కలిగించడానికి పూనుకున్నా డర్జునుడు. దేవత లందరూ దండెత్తివచ్చా రప్పు డతనిమీదికి. స్వయంగా, దేవేంద్రుడున్నూ వచ్చిపడ్డాడు. కాని దేవతలనే కాదు, దేవేంద్రుణ్ణే త్రాహిత్రాహి అనిపించా డర్జునుడు. దేవదేవుడైన మహేశ్వరునకూ అతనికీ యుద్ధం పోసిగిందోమాటు. మహేశ్వరుడు సామాన్యుడా? శూలపాణి. అలాంటివాణ్ణెదిరించి తన బాహుబలం చూపించి సంతోషపెట్టా డతను. లోకపాలకులనున్నూ అందరినీ స్వాధీనపరుచుకున్నా డతను. ఆఅర్జునుణ్ణి చూసుకుని వారు యుద్ధానికి సిద్ధపడుతున్నారు.

తూర్పుదిక్కంతా మ్లేచ్ఛులతో నిండివుంది. చిత్రయుద్ధాలుచేసి నకులుడు వారి నందరినీ లోపుచేసుకున్నాడు. మిక్కిలీ చక్కనివా డతను. చూడతగ్గవాడు. మహావీరుడు. సాటలేని యోధుడు. ఆనకులుణ్ణి చూసుకుని యుద్ధానికి సిద్ధపడుతున్నారు వారు. సహదేవుడున్నూ సామాన్యుడు కాడు. కాశీరాజునీ, అంగమగధకళింగాధిపతులనూ జయించా డతను. ఈపృథివిమీద, బలపరాక్రమాల్లో అశ్వత్థామా, ధృష్టకేతువూ, రుక్మీ, ప్రద్యుమ్నుడూ మాత్రమే సాటి అతనికి. అతణ్ణి చూసుకుని యుద్ధానికి సిద్ధపడుతున్నారు వారు. అతనితో యుద్ధం అంటే, కౌరవులకు ప్రాణాంతకం అన్నమాట.

కాశీరాజు కూతురైన అంబ, భీష్ముణ్ణి సంహరించా లన్న దీక్షతో గొప్పతపస్సుచేసి మలీజన్మలో ద్రుపదమహారాజు కూతు రయిపుట్టింది. కొన్నాళ్ల కామె పురుషు డయిపోయింది. ఆపురుషుడే శిఖండి. పురుషుల గుణగణా లతనికి తెలిసినట్టు మరెవరకీ తెలియవు. అతను వొంటరిగా వెళ్లి కళింగదేశం అంతా జయించాడు. ఒక యక్షుడు అతని స్త్రీరూపం తాను పుచ్చుకుని తన పురుషరూపం ఆమె కిచ్చాడు. అయక్షుడున్నూ భీష్ముణ్ణి సంహారించా లనే అలా చేశాడు. గొప్ప విలుకాడూ, మిక్కిలీ భయంకరుడూ అయిన ఆశిఖండిని చూసుకుని పాండుపుత్రులు యుద్ధానికి సిద్ధపడుతున్నారు.

కేకయు లయిదుగు రన్నదమ్ములు. వార యిదుగురూ గొప్ప విలుకాళ్లూ, గొప్పశూరులున్నూ. ఆముక్తకవచులున్నూ వారు. వారిని చూసుకుని పాండుపుత్రులు నీకొడుకులమీద పడ్డాని కాయత్తపడుతున్నారు. యదువీరు డైన యుయుధానుడు సత్యవిక్రముడు. దీర్ఘబాహువు. అమ్ములపొదినుంచి బాణం పుచ్చుకోడమూ, ధనుస్సున తొడగడమూ, విడవడమూ ఎవరూ గుర్తించలేనంత వేగం అతనిది. అంతటి ధైర్యశాలిన్నీ మరొకడు లేడు. మనవాళ్ల నందరినీ అత నొక్కడే

నిలవరించగలడు. అజ్ఞాతవాసకాలంలో పాండుపుత్రులకు శరణం అయినవాడు విరటుడు. అతనున్నూ మనవాళ్ల నొక పూపూపుతాడు.

కాశీరాజున్నూ గొప్పయోధుడు. మహారథుల్లో వొకడు. వారిపక్షంగా పోరేవారిలో బాగా చెప్పుకోతగ్గవా డతను. అతణ్ణి చూసుకునిన్నీ వారు కయ్యానికి సిద్ధపడుతున్నారు. నిజానికి, ద్రౌపదేయులు పసివాళ్లే. కాని యుద్ధరంగంలో అడుగుపెట్టా రంటే యెలాంటివారికీ లొంగరు వారు. నల్లతాచులకూ వారికీ భేద మేమీ లేదు. వారిని చూసుకునిన్నీ పాండుపుత్రులు జైత్రప్రస్థానానికి పూనుకుంటున్నారు. ఇక అభిమన్యు డున్నాడు. కృష్ణు డెంతటివీరుడో అంతటి వీరు డతను. ధర్మపుత్రు డెంత దమంకలవాడో అతనూ అంత దమం కలవాడు. అతణ్ణి చూసుకునిన్నీ వారు యుద్ధసన్నహాలు చేసుకుంటున్నారు.

శిశుపాలుని కొడుకు ధృష్టకేతువు-నువ్వెరగనివాడు కాడు. ధనుస్సు చేతబట్టి యుద్ధరంగంలో వురికా డంటే యెలాంటివారికీ గూడా అతని పోటు సహించడం చాలా కష్టం. మహారథు డతను. ఆచేదిరాజును చూసుకుని పాండుపుత్రులు యుద్ధంలో మనవాళ్లతో తలపడబోతున్నారు. కృష్ణుడు అక్షౌహిణిసేనతో వచ్చి కలుసుకున్నాడు. పాండవుల కేడుగడ అతను. దేవతల కింద్రు డెలాంటివాడో పాండుపుత్రుల కతనలాంటివాడు. ముఖ్యంగా అతణ్ణి చూసుకుని వారూగిపోతున్నారు యుద్ధంలో దూకడానికి.

చేదిపతి సోదరు డున్నాడు శరభుడు. కరకర్ణుడున్నూ అతని వెంట వచ్చివున్నాడు. వారిని చూసుకుని పాండుపుత్రులు యుద్ధాని కాయత్తపడుతున్నారు. జరాసంధుని కొడుకు సహదేవుడూ, జరత్సేనుడూ సాటిలేని వీరులు. పాండుపుత్రుల కెలా గయినా జయం చేకూర్చా లని కటిబద్ధు లయివున్నారు వారు. మహాతేజశ్శాలి ద్రుపదుని సంగతి నీకు వేరే చెప్పనక్కరలేదుగదా ? ఎలాగయినా పాండుపుత్రులకు అభ్యు

దయం సాధించిపెట్టడమే అతని పరాకాష్ఠ. పాండుపుత్రులకోసం, అగత్య మయితే, అంతా త్యాగంచేసెయ్యడానికి సిద్ధపడివున్నా డతను. అపారమైన సైన్యం వెంటబెట్టుకువచ్చా డతను. స్వయంగా, అతనన్నా నీకొడుకులను విడిచిపెట్టడు.

వీరే కాదు, తూర్పు దేశీయులూ, ఉత్తర దేశీయులూ వందలూ వేలూ మహావీరు లున్నా రింకా. వారిని చూసుకునిన్నీ ధర్మరాజు యుద్ధానికి సిద్ధపడుతున్నాడు ”

# 51

## “ సింహస్వప్నం కాదు, భీమస్వప్నం ”

“ సంజయా, ” అంటూ ప్రారంభించాడు ధృతరాష్ట్రుడు.

“ నువ్వుచెప్పినవా రందరూ బహూ ఉత్సాహవంతులు. అయితే, వారందరూ వొకయెత్తూ భీమసేను డొకడూ వొక యెత్తూను. భయంకరంగా బొబ్బరించే పులినిచూస్తే లేళ్లకూ దుప్పులకూ యెలా వుంటుందో ఆభీమసేనుణ్ణొకణ్ణే చూస్తే నాకంత భయమూ కలుగుతోంది. నిట్టూర్పులేగాని నాకు రాత్రిళ్ళు నిద్రరావడంలేదు. మహేంద్రునితో సమానుడైన ఆ భీమసేనుణ్ణెదిరించగలవాడూ, సంహరించగలవాడూ మన సైన్యంలో వొక్కడూ కనపడ్డంలేదు.

దీర్ఘకోపం అతనిది. పగపట్టా డంటే అంతం చూసేదాకా విడిచిపెట్టడు. అతని నవ్వు విషపునవ్వు. అది కసిపెంచుకుంటున్నా డనడానికి నిదర్శనం. అతని దగ్గిర ఉన్మాదలక్షణా లున్నాయి. పులుకూ పులుకూ చూస్తా డెప్పుడూ. ఉరిమిన ట్టుంటుం దతని కంఠ స్వరం. మహావేగం అతనిది. మహాబలశాలీ, మహాబాహూ డున్నూ అతను. మందు లైన నాకొడుకుల నందరినీ యుద్ధంలో అతను తుదముట్టించే

స్తాడు, తప్పదు. గొప్ప నిర్బంధంలో యిరుక్కుపోయివున్నారు నాకొడుకులు. వారినందరినీ నాశనం చేసేస్తాడతను.

ఎనిమిది అంచుల యినపగద అతనిది. బంగారపుకట్లతో మెరుస్తూ వుంటుందది. చాలా ఘోరమైనది. బ్రహ్మదండంకంటేనూ అమోఘం అది. నాకెప్పుడూ అది కళ్ళకి కట్టినట్టుంటోంది. లేడిమందల్లో సింహంలాగ విహరిస్తాడతను నాకొడుకుల మధ్య. క్రూరవిక్రము డతనొక్కడే నాకొడుకులపాలిటి యముడు. నాకెప్పుడూ వ్యతిరేకమే ఆతిండిపోతు. చిన్నతనంలో కూడా అతనివేగం చాలా దుస్సహంగా వుండేది.

గిల్లికజ్జాలు పెంచుకుంటూ, నాకొడుకులు చిన్నప్పణ్ణుంచీ అతనిచేత చావుదెబ్బలుతింటున్నారు. అది నాపేగులు తోడేస్తోంది. మాకూ వారికీ ఎడమొగాలూ పెడమొగాలూ ఏర్పడ్డాని కతనే కారణం. వల్లమాలిన క్రోధంతో కళ్ళు మూసుకుపోయి అతను నాకొడుకుల చతురంగబలాలూ మింగేస్తున్నట్టు కనపడుతున్నాడు నాకు. శస్త్రాస్త్రాల్లో ద్రోణుడూ అర్జునుడూ మాత్రమే సాటి అతనికి. వేగం చెప్పవలసివస్తే వాయుదేవుణ్ణొక్కణ్ణే చెప్పాలి. క్రోధం మహేశ్వరునిదే చెప్పుకోవాలి, అతనిదే చెప్పుకోవాలి. అతణ్ణి చంపగలవాడు త్రిలోకాల్లోనూ లేడు.

సంజయా, భీము ణ్ణెదిరించి నిలవబడగలవా రెవరయినా వుంటే చెప్పవయ్యా. అలా వుంటే నాకొడుకులు బతికిపోయా రన్నమాటే. కాని వున్నాడంటావా? అనేకమంది రాక్షసులనూ యక్షులనూ చంపివున్నాడతను. మనిషి అయినవా డెవడూ అతనివేగం సహించలేడు. చిన్నతనంలో కూడా నాకెప్పుడూ లొంగలేదతను. నా కొడుకులునూ, చిన్నప్పణ్ణుంచీ క్లేశపెడుతూనే వున్నా రతణ్ణి. అంచేత, నాకొడుకులమీద అతనికి వల్లమాలిన పగ. మొగం చిట్లించుకుంటూ కోరచూపులు చూస్తాడతను, శాంతించడం అంటూ వుంటుందా యెప్పుడయినా?

"భీమసేనుడు గొప్పశూరుడు. సాటిలేనివాడు. తాళవృక్షం వంటివాడు. అర్జునునికంటే ప్రాదేశమాత్రం పొడుగవుతాడు. వేగంలో గుర్రాలనూ, బలంలో మదపుటేనుగులనూ మించుతాడు. తేనెకళ్లవాడవుతాడు. మహాబలశాలి. స్పష్టంగా మాట్లాడడు" అని యిలాగ అతని బలమూ రూపమూ స్పష్టంగా చెప్పాడు చిన్నప్పుడే వ్యాసమహాముని. దీనికి సాయం, నాకొడుకులే కాదు, చిన్నప్పుడు నేను కూడా యెన్నో అడ్డంకులు కలిగించి అతని మనసు విరిచేశాను.

అతని గద వంకరా టింకరా లేనిది. చాలా పెద్దది. ఇనపది. శతఘ్ని. అంటే, వొక్కొక్క వేటుకి వందలూ వేలూ పడగొడుతుంది. దాని ధ్వని పిడుగులధ్వని మించుతుంది. ఆగద తప్పించుకోగలరా నాకొడుకులు? భీమసేనుడంటే వొక మహాసముద్రం. దాని కంతు లేదు. అది దాటడానికి సాధనమున్నూ లేదు. దానిలోతున్నూ ఇంత అని చెప్పలేము. ఎక్కడికక్కడే బాణాలతో నిండివుందది. మందులైన నాకొడుకు లది విడిచేతులతో యీదా లని చూస్తున్నారు.

నేనెంత మొత్తుకున్నా నాకొడుకులు నామాట లెక్కచెయ్యడం లేదు. తామే సర్వజ్ఞుల మన్న అహంభావం వారి నలా చేస్తోంది. భీమసేనుడు వచ్చి మీదపడితే తప్పించుకోడానికి మరి గతి లేదని వారు గుర్తించుకోడంలేదు. పురుషరూపం తాల్చిన మృత్యువుతో యుద్ధం చెయ్యడానికి సిద్ధపడుతున్నారు వారు. గద తిప్పుకుంటూ యేనుగుల తలలు బద్దలుకొట్టుకుంటూ, సెలవులు నాకుకుంటూ, క్రోధబాష్పం విడుస్తూ, యేనుగులను గురిచూసి కూల్చేస్తూ ఉరుముతున్నట్టు భయంకరంగా పెడబొబ్బలుపెట్టుకుంటూ, ఏనుగులు గీపెడితే తానంతకంటే గర్జిస్తూ, రథాల మధ్యనపడి రథికులనుకూల్చుకుంటూ వీరవిహారం చేసే భీముణ్ణి చూడ్డమే తడువుగా దావాగ్నిచూసి లేళ్ళగుంపుల్లాగ నాకొడుకులు యుద్ధరంగం విడిచిపారిపోతారుగాని నిలవలేరు.

భీమసేనుని గద నాలుగుమూళ్ళది. అది తాకిందా, ప్రాణాలు పోయాయన్నమాటే. ఆగదచేతబుచ్చుకుని తాండవంచేస్తూ, ఎక్కడి కక్కడే యుద్ధరంగంలో వీథులు దిద్దుకుంటూ, యోధులను కూల్చేస్తూ, అతను ప్రళయకాలం చూపిస్తాడు మావాళ్ళకి. మత్తెక్కిన యేనుగు అడవిలో జొరబడి మహావృక్షాలు కూల్చేసేటట్టు, భీమసేనుడు యుద్ధ రంగంలో వురికి నాకొడుకుల యోధులనందరినీ నేలమట్టంచేసేస్తాడు. గంగానదివేగం వొడ్డునవున్న చెట్లన్నీ కూల్చేస్తుంది. భీమసేనుడు, అలాగే, రథాలు విరగ్గొడుతూ, గుర్రాలను కూలుస్తూ, ఏనుగులను పచ్చడిచేస్తూ రథికులనూ, సారథులనూ సలిపివేస్తూ నాకొడుకుల సేన అంతా నాశనంచేస్తాడు. ఆభీమసేనుణ్ణిచూసి, నాకొడుకులూ, రాజులూ భృత్యులూ కూడా భయభ్రాంతులై చెట్టొకసిట్టగా ఎటువీలుంటే అటు పారిపోతారు; గాని యెదటబడి నిలవలేరు.

జరాసంధు ణ్ణెరగనివారు లేరు. తన బలపరాక్రమాలవల్ల ఈభూ మండలం అంతా స్వాధీనంచేసుకుని పరిపాలించా డతను. భీష్ముని ప్రతాపంవల్ల కౌరవులూ, తమ నీతిచాతుర్యంవల్ల అంధకులూ వృష్ణులూ మాత్రమే అతనికి లోబడలేదు. కృష్ణుణ్ణిమాత్రమే వెంటబెట్టుకువెళ్ళి అలాంటి జరాసంధుణ్ణి అంతఃపురంలోనే సంహారించేశాడు భీమసేనుడు. సామాన్యమైన ఆయుధం అయినా పుచ్చుకోకుండా, విడిచేతులతోనే చీల్చిచంపాడతను. ఇంతా అంతా కసిగా దతనిది సల్లతాచు విషం కంటే ఘోరమైనది. అదంతా నాకొడుకులమీాద గుమ్మరిస్తా డిప్పు డతగాడు. వజ్రాయుధం చేతబట్టి మహేంద్రుడు రాక్షసులను సంహా రించినట్టు, గదచేతబుచ్చుకుని నాకొడుకుల నందరినీ పిప్పిచేసేస్తా డతను.

అతని పరాక్రమమూ వేగమూ కూడా ఎవరూ సహించరానివీ, అడ్డుకోరానివిన్నీ. కళ్ళెర్రజేసి అతను నాకొడుకులమీాది కురుకు తున్నట్టే కనపడుతోంది నాకు. గదచేతబుచ్చుకోకుండా – ధను

స్సయినా పట్టకుండా — రథం యెక్కకుండా — చివరికి కవచం అయినా తొడుక్కోకుండా విడిచేతులతోనే యుద్ధం ప్రారంభించినా ఆభీమసేనుని యెదట నిలవలే డెవడూ. భీష్ముడూ, ద్రోణుడూ, కృపుడూ, నేనూ మాత్రమే ఆభీమసేనుని బలపరాక్రమా లెరుగుదుము. ఆ మహానుభావులు ఆర్యవృత్తం బాగా యెరిగినవారు కనక తాము నాశనం అయిపోడానికే సిద్ధపడి నాకొడుకుల సైన్యం నడపిస్తున్నారు. పురుషకారం కంటే దైవం బలీయం అని నేనెరుగుదును. అంచేతనే పాండుపుత్రులకే జయం నిశ్చయం అని నేను గుర్తించుకోగలుగుతున్నాను. అయినా, నాకొడుకులను నాచెప్పుచేతల్లో వుంచుకోలేకపోతున్నాను.

గొప్పవిలుకాళ్ళు పాండుపుత్రులు. స్వర్గమార్గం ప్రవేశించి ప్రాణాలయినా విడిచిపెడతారు; గాని వారు ధర్మంవిడిచిపెట్టరు. నాకొడుకుల్లాగే పాండుపుత్రులున్నూ భీష్మునకు పౌత్రులు. ద్రోణునకూ కృపునకూ ప్రియశిష్యులున్నూ. అయితే, ఆమహానుభావులు ముగ్గురూ మొదణ్ణుంచీ మాదగ్గిరవున్నారు. మేమిచ్చింది తృణమో పణమో అనుభవిస్తున్నారు. అంచేతనే ఆవృద్ధులు ముగ్గురూమాపక్షాన వున్నారు, అంతే. ఆయుధంచేతబట్టి క్షత్రియధర్మం నిలబెట్టుకునేవాడికి యుద్ధంలో మరణం సంభవిస్తే అది చాలా స్తుతిపాత్రమే అవుతుంది. పాండుపుత్రులతో యుద్ధంచెయ్యడానికి వచ్చివున్న యీరాజులను చూసి నేను మిక్కిలి దుఃఖిస్తున్నాను. ఏమంటే? విదురుడు నిర్దేశించిన అపాయం సర్వసిద్ధంగా వుందిప్పుడు.

జ్ఞానం దుఃఖాలు పోగొడుతుం దన్నమాట నేను నమ్మను. ఇప్పుడు కలుగబోయే దుఃఖంవల్ల జ్ఞానమే నాశనం అయిపోతోంది. జీవన్ముక్తులైన మహర్షుల కూడా యీసుఖాలూ దుఃఖాలూ తప్పడంలేదు మరి. ఇలాంటి స్థితిలో, పెళ్ళామనీ బిడ్డలనీ, మనమలనీ, బంధువులనీ రాజ్యాలనీవెయ్యివిధాల మోహపాశాల్లోతగులుకునే పామరుల సం

గతిచెప్పడాని కేం వుందీ ? బతుకే సంశయంగా వున్న యీసమయాన తరణోపాయం యేమిటీ ? ఆలోచించిన కొద్దీ కౌరవులకు నాశనం తప్ప నట్టే తోస్తోంది నాకు. కౌరవులకు సంభవించిన యీవిపత్తు కంతకీ మాయాజూదమే కారణం అవుతోంది.

మందు డైన దుర్యోధనుడు ఐశ్వర్యలోభంవల్ల చేశా డీపాపప్పని. చక్రం పైకీ కిందకీ తిరుగుతూ వుంటుంది. కాలాని కిది స్వభావం. సంజయా, ఇదిగో, చూస్తూవుండగా, కాలపాశబద్ధు లయి నాకొడుకులు నశించిపోతున్నారు. నేనిప్పు డేమిటీ చెయ్యాడం ? ఆచెయ్యాడం అయినా యెలాగా ? నేనిప్పు డెక్కడికి పోనూ ? నాకొడుకు లందరూ చచ్చిపోడమూ, నేను స్త్రీల రోదనధ్వనులు వినడమూ నాకు తప్పదని పిస్తోంది. నాకు చావెలావస్తుందీ ? మండువేసవిలో అడవి అంతా బుగ్గి చేసేస్తుంది దావానలం. అర్జునునితో కలసివచ్చి భీమసేనుడున్నూ నా కొడుకుల నలాగే నాశనంచేసేస్తాడు''

# 52

## అర్జునుడా, యముడా అతను ?

ధృతరాష్ట్రుడు మళ్లీ అందుకున్నాడు.

"ధర్మనందను డబద్ధం ఆడ్డం మన మెప్పుడూ యెరగం. అతని నమ్మినబంటు అర్జునుడు. కనక, మూడులోకాలూ ధర్మనందనుడివే, సందేహం లేదు. ప్రతీదినమూ నిద్రాహారాలు మానుకుని ఆలోచిస్తున్నాను; కాని అర్జును న్నెదిరించి నిలవగల యోధు డెవడూ కనపడ్డం లేదు నాకు. గుండెలు దూసుకుపోయేటట్టు కర్ణనాళీకాలు విడుస్తాడతను. ద్రోణుడూ కర్ణుడూ కూడా మహావీరులే. అస్త్రశస్త్రాల్లో ఆరితేరినవారే. బలవంతు లెవరూ అంటూ లెక్క ప్రారంభిస్తే వారే

నస్తారు మొదట. వారు యుద్ధరంగంలో వెనకంజవెయ్యనివారున్నూ. కాని వారివిషయమై నాకొక సందేహంవుంది గొప్పది. అంచేత, విజయం నాకు లభిస్తుందన్న నమ్మకం లేదు. ఏమంటే ? భీము డన్నా ధర్మనం దనుడన్నా నకులసహదేవు లన్నా కర్ణునకు చాలాదయ. వారి నేమీ చెయ్యడతను. పైగా, ప్రమాదాలున్నూ యెన్నో వున్నా యతని దగ్గిర. పోనీ ద్రోణుడో అంటే, మనవాళ్లకీ గురువే, అర్జునకూ గురువే అతను. పైగా వయసుమళ్లినవాడు. అర్జునుడు గొప్పవిలుకాడు మాత్రమే కాదు. మహాబలశాలి. మిక్కిలీ సమర్థుడు. శ్రమ యెరగ నివా డతను. ఎలాంటి ఘోరయుద్ధం తటస్థించినా పరాజయమున్నూ యెరగనివా డతను.

అతనే కాదు. మొత్తం పాండుపుత్రు లందరూ కూడా అస్త్ర శస్త్రాల్లో చాలా నిపుణులు. మహాశూరులు. ఇప్పటికే త్రిలోకాల్లోన్నూ మోగిపోతోంది వారి కీర్తి. స్వర్గరాజ్యాధికారం అయినా విడిచి పెట్టుకుంటారు; గాని విజయంమాత్రం సాధించుకుని తీరతారు వారు. కనక, కర్ణద్రోణులో అర్జునుడో చచ్చిపోతే తప్ప మావాళ్ళకి శాంతి లేదు. అయితే, అర్జునుణ్ణి చంపగలవా డెక్కడా లేడు. పోనీ అంటే, అత ణ్ణోడించ గలవాడున్నూ కనపడడు. నాకొడుకు లంటే వల్ల మాలిన కోపం అతనికి. అది తగ్గే వుపాయం కనపడదు.

అస్త్రశస్త్రాల్లో సమర్థులైనవా రింకా యెందరో వున్నారు. వారు, శత్రువులను జయించనూ వచ్చు, శత్రువుల చేతిలో వోడిపోనూ వచ్చు. అర్జునునికి మాత్రం జయించడమేగాని వోడిపోడం అంటూ వుండ దెప్పుడూ. వెనకటికి, జబ్బచరిచి ముప్పయిమూడుకోట్ల దేవతలనూ కాసుకో మని పిలిచి కూడా దగ్గిరవుండి ఖాండవం అగ్నిపాలుచేశా డతను. దేవతల నందరినీ వోడించిపారదోలాడు. అతనికి మాత్రం అప జయం అన్నది లేదు.

ఇంకోటి కూడా వుంది, విన్నావా? శీలంలోనూ ప్రవర్తనలోనూ కృష్ణునకూ అర్జుననకూ లేశమూ తేడా లేదు. అలాంటి కృష్ణుడా అర్జునునకు సారథి. కనక, దేవేంద్రుని కెంత నిశ్చయమో అర్జుననకూ అంతే నిశ్చయం విజయం. ఒక రథాన ఆకృష్ణుడూ యీకృష్ణు (అర్జును)డూ, నారితొడిగినగాండీవమూ-ఈమూడూవుండడం-త్రేతాగ్నులంటే యింతకంటే మరేంవుందీ? కాదంటే, గాండీవం వంటి ధనుస్సూ మరొకటి లేదు. అలాంటిసారథీ అలాంటి రథికుడూ కూడా మరొకళ్ళు లేరు; కాని మందులైన నాకొడుకులిది గుర్తించలేకుండా వున్నారు.

పిడుగయినా కొంచెం మిగిలిస్తుంది. అర్జునుడు విడిచిన బాణాలు మాత్రం కొంచెమున్నా మిగల్చవు, పూర్తిగా దహించివేస్తాయి. అర్జునుని బాణాలు నాకొడుకుల సైనికుల శరీరాలనుంచి శిరస్సులు తెగగొట్టి వేరుచేస్తున్నట్టూ, గాండీవం తేజస్సు నాకొడుకుల దండంతా బుగ్గిచేస్తున్నట్టూ, అర్జునుని రథవేగం భరించలేక భయార్తులై కౌరవ సైనికు లందరూ పారిపోతున్నట్టూ కనపడుతోంది నాకు. బ్రహ్మ, అర్జునుణ్ణి నాకొడుకులపాలిటికి యముడుగా సృష్టించినట్టుంది. నాకొడుకులకు వినాశంతప్పదు"

## 53

## "మన కులమే నశించిపోతుంది"

మళ్ళీ ప్రారంభించాడు ధృతరాష్ట్రుడు.

"పాండుపుత్రులు, యుద్ధంచేసి విజయం సంపాదించాలని నిశ్చయించుకుని వున్నట్టే, వారికి సాయంవచ్చినవారున్నూ వారికి జయం కలిగించే తీరా లని నిశ్చయించుకుని, ప్రాణాలకున్నూ తెగించుకునివున్నారు. పాంచాలరాజులూ, కేకయరాజులూ, మత్స్యరాజులూ, మగధరాజులూ, వత్సరాజులూ, పాండుపుత్రులకు సాయంచేయ్యడానికి

వచ్చారంటున్నారు. వారే కాదు. కృష్ణుడున్నూ వున్నాడు. అతనుకూడా వారికి జయం సంపాదించిపెట్టడానికే కంకణం కట్టుకుని వున్నాడు. మనుష్యులను మాత్రమే కాదు, దేవతలనూ, వారి ప్రభువైన ఇంద్రుణ్ణీ కూడా పాండుపుత్రులకు లోబరచగల డతను. అసలు, సృష్టికర్తే అతను.

పైగా, శైనేయుడు సాత్యకి వున్నాడక్కడ. అర్జునుని దగ్గిర, పూర్తిగానూ క్షుణ్ణంగానూ యుద్ధవిద్య నేర్చుకుని వున్నవా డతను. భయమన్నది యెరగనివాడు. పొలంలో విత్తనాలు చల్లేటట్టు విజ్జిమ్ముతా డతను యుద్ధరంగంలో బాణాలు. పాంచాలయువరాజు ధృష్టద్యుమ్ను డొకడున్నాడు. యుద్ధరంగంలో వురికాడా, దయా దాక్షిణ్యాలు మరిచిపోయి, చాలా క్రూరంగా ప్రవర్తిస్తా డతను. మహారథుల్లో వొకడు గాని సామాన్యుడు కాడు. గొప్పగొప్ప అస్త్రాలు ప్రయోగించి మనసేన అంతా నాశనంచేస్తాడు; గాని విడిచిపెట్ట డతను.

ధర్మనందనుని క్రోధమూ, అర్జునుని పరాక్రమమూ చూసినా, నకులసహదేవులనూ భీమసేనుణ్ణీ తలుచుకున్నా నాగుండెలు ముక్కముక్క లయిపోతున్నాయి. వారికి సాయంచెయ్యడానికి వచ్చిన రాజులున్నూ గొప్పయోధులు. నాకొడుకుల సైనికులు వారిని తప్పించుకోలేరు. సంజయా, అందుకోసం నేనీ మొత్తుకోడం.

పాండుపుత్రుడైన యుధిష్ఠుడు సామాన్యుడు కాడు. మహామాని అతను. చూడతగ్గవాడు. మిక్కిలీ సంపన్నుడు. బ్రహ్మవర్చస్సే అలా రూపొందిన ట్టున్నాడు. గొప్ప ప్రతిభావంతుడు. మహాప్రజ్ఞాశాలి. ధర్మాత్ముడు. మిత్రులూ, అమాత్యులూ, యుద్ధవిశారదులైన అనేకమంది మహాయోధులూ, తమ్ములూ, మామలూ—అతనిమీద యీగ అయినా వాలకుండా చూస్తున్నారు. అతని ఆజ్ఞలున్నూ నెరవేరుస్తున్నారు. అతని ధైర్యమూ మంత్రాలోచనా అసాధారణాలు. గొప్ప

దాత అతను. దయాశాలి. నిజమైన పరాక్రమం అతనిది. లజ్జగల వాడు. చాలా సంగతులు తెలిసినవాడు. ఆత్మవేది. పెద్దలను సేవించడం అంటే ఒక్కలీ ప్రీతి అతనికి. ఇంద్రియాలు జయించినవాడు. ఇలాగ ఎటుచూసినా, సకలసుగుణాలకూ నిధి అతను. భగభగ మండే అగ్నితో సమానుడతను. అతని యెదటబడి యెవరు బతగ్గలరూ? చావడానికి సిద్ధంగా వున్నవాడే పాండవు లనే అగ్నిలో వురుకుతాడు. నేనేమి చెప్పినా ధర్మనందను డిప్పుడు వినిపించుకోడు. నా కొడుకుల నందరినీ నాశనంచేసితీరతా డతను.

కనక, కౌరవుల కందరికీ నేను చెప్పవలసిం దొకటే. పాండుపుత్రులతో యుద్ధానికి సిద్ధపడ్డం ఎంతమాత్రమూ మంచిది కాదు. యుద్ధం జరగడమే వస్తే మన కులమే నశించిపోతుంది కనక, యుద్ధంమాట మరిచిపోడమే నామతం. మీరిందు కిష్టపడతారా, మేము శాంతి సాధించడానికి ప్రయత్నిస్తాము. మనం యిలాగే వారి కింకా క్లేశాలు కలిగిస్తూవుంటే మాత్రం ధర్మనందనుడు మనలో వొక్కణ్ణీ విడిచి పెట్టడు. పైపెచ్చు, ఈ అధర్మాని కంతకీ మూలం అని నన్నే నిందిస్తా డతను"

# 54

## దుర్యోధనుణ్ణి నొక్కిపెట్టి వుంచు

వెంటనే సంజయు డందుకున్నాడు.

"రాజేంద్రా, నువ్వు చెప్పినట్టు యుద్ధరంగంలో గాండీవం పాల బడి క్షాత్రం నాశనం కాకతప్పదు. సవ్యసాచి అయిన అర్జునుని శక్తి సామర్థ్యాలు బాగా యెరిగివుండిన్నీ నువ్విలాగ కొడుకుల కెదురుచెప్ప లేకపోడం అర్థంలేనిపని. చాలా పొరపాట్లు చేశావు నువ్వు. ఇదిమాత్రం నీకు కలిసివచ్చేకాలం కాదు. పాండుపుత్రులకు మొదణ్ణుంచీ నువ్వప

కారాలే చేస్తున్నావు. తండ్రీ సావధానచిత్తుడైన మిత్రుడూ అయిన వాళ్ళెప్పుడూ ప్రియమూ చేస్తారు, హితమూ చేస్తారు. వారికి నువ్వు తండ్రివే; కాని ద్రోహా లెన్నో చేశావు. తండ్రి వనిపించుకోడానికి నీకర్హత లేదు.

మాయజూదంలో, నీకొడుకులు "ఇది గెలుచుకున్నాం. ఇది మాసొత్తయిపోయింది" అని దిసంతులు కొడితే మహాభాగ్యం దని సంతోషించావు నువ్వు. నీకొడుకులూ కర్ణుడూ వారి ననరాని మాటలంటూవుంటే విని వూరుకున్నావే గాని వాళ్ళని మందలించలేక పోయావు. నీకొడుకులు రాజ్యం అంతా జయించేస్తా రనీ, ఏలుకుంటా రనీ పొంగిపోయావే గాని బలపరాక్రమాలమాట ఆలోచించుకో లేకపోయావు. పితృపితామహక్రమంగా నీకు వచ్చిన రాజ్యం అంతా చూస్తే కురుజాంగలభూములే కదూ? కాని పాండురాజూ, అతని కొడుకులూ జయించుకువచ్చిన రాజ్యా లన్నీ నీసొంతాలే అనుకుంటు న్నావు నువ్వు.

గంధర్వులు నీకొడుకులను చెరపట్టినప్పు డేమయింది? అంతులేని సముద్రంలో మునిగిపోతున్న స్థితి నీకొడుకుల కది. అప్పుడు నీకొడుకులను విడిపించుకుని వచ్చి నీకిచ్చినవాడు ధర్మనందనుడు. మరి, ఆ పాండనందనుల విషయమై నువ్వు చేసిం దేమిటో చెప్పుసా? నీకొడుకులు మాయజూదంలో వారిని మోసంచేస్తే వారడవులపా లయిపోతే కుర్రపిల్లవాడిలాగ యెగిరిగంతువేశావు. కదూ? అర్జునుడు కరుకుటమ్ములు కురిస్తే మహాసముద్రాలన్నీ యెండియెడారులయిపోతాయి, రక్తమాంసాల ముద్దలు మనుష్యులమాట చేప్పే దేమిటీ?

విలుకాళ్ళలో అర్జునుడు గొప్పవాడు. విల్లుల్లో గాండీవం గొప్పది. భూతప్రపంచం అంతట్లోనూ కృష్ణుడు గొప్పవాడు. ఆయుధాలలో సుదర్శనం గొప్పది. జెండాల్లో కపిధ్వజం గొప్పది. వెల్లగుర్రాలు

పూన్చిన రథంయెక్కి యుద్ధరంగంలో ప్రవేశించి కాలచక్రంలా గిర్రున తిరుగుతూ చేతికందినవారి నందరినీ నాశనంచేసేస్తా డర్జునుడు.

రాజెవడూ అన్న ప్రశ్నవస్తే, భీముడూ అర్జునుడూ యెవరివాళ్లో ఆయుధిష్ఠిరుడే రాజు గాని మరొకడు కాడు. ఈభూమండలం అంతా అతనిదే. ఆభీమునిచేతిలో నీసైన్యం అంతా పిండీగుండా అయిపోతుంది. అది కళ్ళారా చూసుకుంటూ నీకొడుకులైన దుర్యోధనాదులు కూడా అందరూ పీనుగుపెంట లయిపోతారు. భీముణ్ణీ అర్జునుణ్ణీ యెదిరించలేనివాళ్ళకి జయం అంటే యేమిటీ? నీకొడుకులకు సాయంచెయ్యాడాని కెందరో రాజులు వచ్చారు తెలుసు; కాని నీకొడుకులకంటే ఆకాశంనుంచి వూడిపడ్డవాళ్లు కా రారాజులు.

విరటరాజుకి నువ్వంటే లేశమూ గౌరవం లేదు. పాంచాల రాజులూ, కేకయరాజులూ, సాల్వరాజులూ, శూరసేనరాజులూ నిన్ను గౌరవించకపోడమే కాదు, అవమానమే చేస్తున్నారు నీకు. వారందరూ ధర్మనందనుని బలపరాక్రమా లెరుగుదురు. అంచేత అతణ్ణే ఆశ్రయించుకుని వున్నారు. అంతే కాదు, నీకొడుకుల నందరినీ ద్వేషిస్తున్నారు కూడా వారందరూ.

పాండుపుత్రులు మిక్కిలీ ధర్మాత్ములు. వారితో యుద్ధానికి సిద్ధపడ్డం మహాఘోరం. అలాంటివారిని నీకొడుకు అనేకవిధాల పీడించాడు. ఇప్పటికీ పీడిస్తున్నాడు. దుర్యోధనుణ్ణి, అతని జతగాళ్లనీ యెలాగయినా నొక్కిపెట్టాలిగాని చూస్తూ వూరుకోగూడదు నువ్వు. అతణ్ణి దయతలచడం యెంతమాత్రమూ శ్రేయస్కరం కాదు. మాయజూదం ఆడాటప్పుడు నేను చెప్పే వున్నాను. విదురుడున్నూ చెవినిల్లు కట్టుకుని పోరాడు; కాని నువ్వు మామాట వినిపించుకోలేదు. ఇప్పుడిక యెంతమొత్తుకుంటే యేమి లాభమూ ?

# 55

## దుర్యోధనుని ధీమా

"భయంలేదు. మహారాజా, మాకోసం నువ్వేమీ బెంగపెట్టుకోనక్కర లేదు" అంటూ ప్రారంభించాడు దుర్యోధనుడు.

"పాండుపుత్రు లెంత బలవంతు లనుకున్నా, వారిని కూల్చెయ్యడానికి మాకు సామర్థ్యం లేకపోలేదు. వనవాసం పూర్తిఅయిన తరవాత కృష్ణుడు పాండుపుత్రులను కలుసుకున్నాడు. ఊరికే కాదు, గొప్ప బలగంతో వెళ్ళికలుసుకున్నాడు. కేకయులూ, ధృష్టకేతువూ, ధృష్టద్యుమ్నుడూ మరికొందరు రాజులూ కూడా వారిని కలుసుకున్నారు. అందరూ కలిసి నిన్ను చాలా నిందించారు. కౌరవులను కూడా అందరినీ దూషించారు. సపుత్రమిత్రకళత్రంగా నిన్ను నాశనంచేసి నీరాజ్యం అంతా పాండుపుత్రులకు కట్టబెట్టా లని వారి ప్రయత్నం. ఇది తెలుసుకుని నేను భీష్మునకూ, ద్రోణునకూ, కృపునకూ వివరంగా చెప్పాను. పాండుపుత్రులు తమ మాట వింటారనే భీష్మాదుల నమ్మకం. కాని, కృష్ణుడు మన ల్నందరినీ నాశనం చెయ్యడానికే చూస్తున్నాడు. ఒక్క విదురుణ్ణి మాత్రం యేమీ చెయ్య డతను. కౌరవుల రాజ్యం అంతా పాండవులకు స్వాధీనపరచడమే అతని పూనిక.

ఇప్పుడు మనంచెయ్యవలసింది సంధిచేసుకోడమా, అన్నీ విడిచిపెట్టి పారిపోడమా? ప్రాణాలు పోయినా సరే, మేము యుద్ధమే చేస్తాము. అందులో మాకు పరాజయం సంభవిస్తుందా? ధర్మపుత్రున కందరూ కలిసి రాజ్యం కట్టబెడతారా? అప్పటి మాట చూసుకుందాం. మేమోడిపోతామనీ, వారే గెలుస్తారనీ, నువ్వు దుఃఖిస్తున్నావు. నేనందుకు విచారిస్తున్నాను.

నీకోడుకులు సామాన్యు లని నువ్వెందు కనుకోవాలి? వారిని మేమెన్నో మాట్లు నిగ్రహించాము. అదంతా నువ్వెరుగుదువు. పాండుపుత్రులింతుకు బదులుతీర్చుకోడానికి చూస్తారు, మాకు తెలుసు. దీనికోసం నేనూ పరితపిస్తున్నాను. ఇదిగుర్తించి భీష్ముడూ ద్రోణుడూ కృపుడూ "నువ్వుభయపడవ" ద్దని చెప్పారు నాకు. "నీశత్రువులు మనల్ని జయించలేరు. మాలో వొక్కొక్కడే నీశత్రువులను సంహరించగలడు. వారు యుద్ధానికి వస్తే రానియ్యి, మా బాణాలతో వారి పొగ రణిచివేస్తాము. వెనక, మాలో భీష్ము డొక్కడే యెందరో రాజుల నోడించాడు. తన తండ్రి చనిపోయినతరవాత చేశా డతనిది. అప్పుడు వారిలో మిగిలివుండినవా రతణ్ణి శరణు చొచ్చారు. ఆభీష్ము డిప్పు డొక్కడే కాదు, మేమున్నా అతనికి తోడున్నాము. కనక, నీకు భయం అక్కరలే" దని చెప్పారు.

వారి రాజ్యం అంతా మన భుక్తంలో వుంది. అప్పుడేమీ చెయ్యలేనివా రిప్పుడు మాత్రం యేమి చేస్తారు? పాండవులు పరాక్రమ శూన్యులు. వారిపక్షమున్నా యేమంత బలంగా లేదు. నాకు సాయంవచ్చినవారందరూ నాకష్టసుఖాలు తమ వన్నట్టు చూసుకుంటారు. నాకోసం వారు, సముద్రంలో అయినా దూకుతారు. అగ్గిలో నయినా వురుకుతారు. వీరందరూ నీకు మతిపోయిం దనుకుంటున్నారు. ఈరాజు లంతా అక్కరలేదు. వీరిలో వొక్కొక్కడే చాలు పాండవులను సంహరించడానికి. కనక, నువ్వేమీ భయపడకు. ఇంద్రుడు వచ్చినీ నాసేన నేమీ చెయ్యలేడు. స్వాయంభువు అయిన బ్రహ్మ కూడా నాసేనను కదపలేడు.

"ఇక, ముల్లోకాల్లోనూ అంతవాడు లే" డని పొగిడేస్తున్నావే నువ్వు, ఆ యుధిష్ఠిరుడు పట్నాల మాట విడిచిపెట్టి, అయిదూళ్ళిస్తే చాలు నన్నకాడికి దిగజారిపోయాడు, ఇది గమనించావా నువ్వు?

నా సైన్యం చూసి భయపడిపోయీ, నా ప్రభావం గుర్తించి వెరగుపడి పోయీ ఈ స్థితికి వచ్చా డతను. భీమసేనుణ్ణి కూడా నువ్వు చాలా గొప్ప చేస్తున్నావు. అతనున్నూ నా ప్రభావం పూర్తిగా యెరగడు. గదా యుద్ధంలో నాకు సాటివచ్చేవాడు భూమ్మీద లేడు. నన్ను మించే వా డింతవరకూ పుట్టనూలేదు. ఇకముందు పుట్టనూ పుట్టడు. గురువుల నాశ్రయించి, చాలా కష్టపడి విద్య లన్నీ కూలంకషంగా నేర్చుకున్నా న్నేను. భీమునివల్లా మరెవరివల్లా కూడా భయం లేదు నాకు.

"గదాయుద్ధంలో దుర్యోధనునకు చాలేవాడు ముల్లోకాల్లోనూ లే" డని యెన్నోమాట్లు చాలా దృఢంగా చెప్పాడు బలరాముడు. నేనతనిదగ్గిర శిష్యరికం చేసివున్నాను, నువ్వెరగంది కాదు. యుద్ధమే చెయ్యవలసివస్తే నాకు బలరాముడే సాటి, బలరామునకున్నూ నేనే సాటి గదా యుద్ధంలో. అయితే, బలపరాక్రమాల్లో మాత్రం నాకతను బాగా తీసికట్టు. నేను గదపుచ్చుకొంటే యెప్పుడూ తాళుకో లేడు భీముడా దెబ్బకు. నాగదతో వొక్కదెబ్బ చాలు భీముడు పర లోకానికి వెంచెయ్యడానికి. గద చేతబట్టి యెప్పుడు నాయెదట పడ తాడా అని భీమునికోసం యెన్నాళ్ళనుంచో కాసుకూచున్నా న్నేను.

నేను గదతో వొక్కదెబ్బ కొడితే చాలు హిమతత్పర్వతం కూడా పిండిపిండి అయిపోతుంది. నాగదదెబ్బకి భీముడు భూమ్మీదపడి గిలగిల తన్నుకుని చచ్చి వూరుకుంటాడు. "గదాయుద్ధంలో దుర్యోధనునకు సాటిఅయినవాడు లే" డన్నమాట వొక్క బలరామునిదే కాదు, భీమునిదిన్నీ. భీముడిదిన్నీ మాత్రమే కాదు, కృష్ణార్జునులదిన్నీ. కనక, భీమసేనుణ్ణి తలుచుకుని నువ్వు భయపడవలసిన పని లేశమూ లేదు. అతణ్ణి నిమిషంలో కూల్చేస్తా న్నేను, నిశ్చింతగా వుండు.

భీముడు నాచేతిలో చచ్చిపోయా డంటే, మనకి సాయంవచ్చిన రాజుల్లో కొందరు ఉత్తరక్షణంలో అర్జునుణ్ణి కడతేర్చేస్తారు. అర్జునుణ్ణి

నీలెక్కేమి టనగలిగినవాళ్ళు ఆరాజుల్లో యెందరో వున్నారు. భీష్ముడూ, ద్రోణుడూ, కృపుడూ, అశ్వత్థామా, కర్ణుడూ, భూరిశ్రవుడూ, శల్యుడూ, జయద్రథుడూ, — వీరిలో వొక్కొక్కడే చాలు, పాండుపుత్రుల నందరినీ కూలగొట్టడానికి. అందరూ కలిస్తే యింకేమయినా వుందా? మనసైన్యం సర్వవిధాలా పరిపూర్ణం అయినది. ఇంతటి మహాసైన్యం వొక్క అర్జునుణ్ణే కొట్టలేకపోతుం దన్న సందేహాని కవకాశం యెక్కడి దయ్యా?

భీష్ముని బాణాలతోనూ, ద్రోణాశ్వత్థామల బాణాలతానూ అర్జునుడు తుక్కుతుక్కయిపోతాడు తప్పదు. పితామహు డైన భీష్ముడు శంతనుమహారాజుకంటేనూ గొప్పవాడు. బ్రహ్మర్షులతో సమాను డతను. దేవతలుగూడ అత ణ్ణేమీ చెయ్యలేరు. అతణ్ణి చంపగలవాడు లేనేలేడు. స్వచ్ఛందమరణం కలిగేటట్టు వరం యిచ్చాడు తండ్రి అతనికి.

బ్రహ్మర్షి అయిన భరద్వాజునకు ద్రోణియందు పుట్టినవాడు ద్రోణుడు. గొప్పగొప్ప అస్త్రా లెన్నో నేర్చిన అశ్వత్థామ ద్రోణుని కొడుకు. మహర్షి అయిన గౌతముని కొడుకు కృపుడు. శరస్తంబంలో పుట్టినవా డతను. ఎలాంటివాడూ కూడా అతణ్ణి చంపలేరు. ఇలాగ, అశ్వత్థామకు తల్లీ తండ్రీ మేనమామా కూడా అయోనిజు లై వున్నారు. అతని గొప్పతనం వేరే చెప్పాలా యెవరయినా? సహజంగా కూడా మహాశూరు డతను. వీరందరూ దేవతలకు సాటివచ్చే మహారథులు. యుద్ధం పొసగిందంటే మహేంద్రుణ్ణి కూడా చిందరవందర చేసెయ్యగలవారు వీరు. వీరిలో వొక్కొక్క ణ్ణయినా జయించలేడే అర్జునుడు, ముగ్గురూ యేకమయి మీదపడితే యేమి చెయ్యగల డయ్యా? బతగ్గలడుటయ్యా అసలు?

ఇక కర్ణు డున్నాడు. భీష్ముడూ, ద్రోణుడూ, కృపుడూ — ఈ ముగ్గు రికీ సాటిఅయినవా డతను. "నాఅంతవాడ వయినా" వని పరశు రామునిచేత అనిపించుకున్నవాడు కూడాను, అతను. సహజకుండ లాలతో ఎంతో ప్రకాశించేవా డతను. చూసి విడిచిపెట్టలేక శచీదేవి కోసం ఇంద్రు డడిగిపట్టుకుపోయాడవి. మిక్కిలీ భయంకర మైన శక్త్యా యుధం వుందతనిదగ్గిర. అత ణ్ణెదిరించి బతగ్గలడా అర్జునుడు?

ఇలాగ ఎటుచూసినా అరచేతిలో వుసిరిపండులా వుంది నాకు విజయం. నాశత్రువు లయిన పాండుపుత్రులకు నికృష్ట మైనచావున్నూ రాసిపెట్టివుంది. భీష్ముడు దినానికి పదివేలమంది యోధులను చంప గలడు. ద్రోణుడూ కృపుడూ అశ్వత్థామా కూడా అంతపనీ చెయ్య గలరు. ఇక సంశప్తకు లున్నారు. "మాచేతిలో అర్జును డయినా చావాలి, అర్జునుని చేతిలో మేమయినా చావా" లన్నంతపట్టుదలగా వున్నారు వారు. అలాంటి రాజు లొకడా యిద్దరా — ఎంతోమంద వుండగా నువ్వెందు కలా బాధపడతావు? భీమసేనుడు చచ్చిపో యాక, మరి, వారిలో యెదిరించి నిలవగల మొగవాడెవడయ్యా, నీకు చాదస్తం కాకపోతే?

పాండుపుత్రు లయిదుగురు. ధృష్టద్యుమ్ను డొకడూ, సాత్యకి మరొకడూను. మొత్తానికి, మన శత్రువుల్లో ఈయేడుగురే చెప్పుకో తగ్గ యోధులు. వారి బండారం అంతా యెన్నిమాట్లు లెక్కపెట్టినా అంతే. ఇక మనయోధు లెవరెవరో చెబుతాను చూసుకో. భీష్ముడూ, ద్రోణుడూ, కృపుడూ, అశ్వత్థామా, కర్ణుడూ, సోమదత్తుడూ, ప్రాజ్ఞ్యోతిషాధిపతీ, శల్యుడూ, జయద్రథుడూ, దుశ్శాసనుడూ, దుర్ము ఖుడూ, దుస్సహుడూ, శ్రుతాయువూ, చిత్రసేనుడూ, పురుమిత్రుడూ, వివింశతీ, భూరిశ్రవుడూ, వికర్ణుడూ — ఇంకా యెందరో మహాయోధు

లున్నారు మనకు. వీరియెదట ఆయేసు గురికీ లెక్కేమిటి పత్రం యేమిటి మహారాజా?

పోనీ, యోధుల సంగతి అలా వుంచి సేనల సంగతి చూద్దాం. మనసేన పదకొం డక్షౌహిణులు. ఏడక్షౌహిణులేగా వారిది? మనకి పరాజయం కలుగుతుందనుకోడం యెలాగ? ఎదటివారి సైన్యం తన సైన్యంలో మూడోవంతు తక్కువగా వుంటే వెళ్ళిమీాదపడవచ్చు నని చెప్పాడు బృహస్పతి, మరిచిపోయూవా? పైగా, వారిబలగం నిస్సారమూా, మన బలగం చేవగలదిన్నీ. ఇదంతా బాగా పరకాయించుకో కుండా అలా బేలపోడం ధర్మమేనా?"

## 56

### పాండవుల గుర్రాలు

తండ్రి కిలా చెప్పి, దుర్యోధనుడు "సంజయూ, ధర్మనందను డేడక్షౌహిణులు మాత్రమే బలగం కూర్చుకోగలిగాడు గదా, మరి, నాతో యుద్ధంచెయ్యడాని కెలా సాహసిస్తున్నాడూ?" అనడిగాడు. ఇందుకు సంజయు డిలా చెప్పాడు.

"రాజా, ధర్మనందనుడు చాలా ఉత్సాహంగా వున్నాడు. చాలా ధీమాగా యుద్ధానికి సిద్ధపడుతున్నాడు. భీముడూ, అర్జునుడూ, నకుల సహదేవులూా కూడా యుద్ధం జరగబోతున్నందుకు చాలా పొంగి పోతున్నారు. భయం అన్నమాటే యెరగరు, వారు. తనమంత్రం యేపాటిదో పరీక్షించుకోడాని కర్జునుడు తనరథం అక్కడికి రప్పించు కున్నాడు. దాని తేజస్సుతో దిక్కులు జిగాల్ జిగాల్మనేశాయి. మెరుపులతో చకచక లాడుతున్న నీలమేఘంలా కనపడింది మాకళ్ళ కది. అది గమనించి, అందరినీ పరకాయించి "సంజయూ, మాయుద్ధసన్నాహాని కంతకూా యిది పూర్వరూపం. మాశత్రువులను మేము మిక్కిలీ

సులువుగా ఓడించేస్తాం, తప్పదు" అన్నాడు నాతో. అతనన్నది తప్ప దనే తోచింది నాకున్నూ"

దీనిమీద దుర్యోధనుడు "సంజయా, జూదంలో ఓడిపోయిన వారు పాండుపుత్రులు. వారిని పొగిడేస్తున్నావు నువ్వు. గొప్ప కూడా చేస్తున్నావు మహా! సరే కాని, వారి గుఱ్ఱా లెలాంటివో, జెండాలున్నూ యెలాంటివోయి" అనడిగాడు మళ్ళీ. సంజయుడు మళ్ళీ మొదలుపెట్టాడు.

"రాజా, అర్జునుని రథం చాలాగొప్పది. ఇంద్రుని సాయంపుచ్చుకుని విశ్వకర్మ చాలా విచిత్రంగా వుండేటట్టు తయారుచేశా డది. అతని జెండా కూడా చాలా అద్భుత మైనది. త్వష్టా ధాతా అనేక రూపాలుగా నిర్మించా రది దేవమాయతో. ఆరూపాలు విలవకట్ట రానివీ, మిక్కిలీ గొప్పవీ, దేవలోకానికి సంబంధించినవిన్నీ. వాయుపుత్రు డైన హనుమంతుడు, భీముని కోరకమీద సమయంవచ్చినప్పుడు దానిమీద తన రూపం కనపరుస్తాడు. ఆజెండా తేజస్సు సకల దిక్కులా ఆమడదూరం వ్యాపిస్తుంది. ఆకాశాన అది ఇంద్రధ్వజం అన్నట్టుంటుంది. అది చాలా పెద్దది; కాని తేలికగా వుంటుంది. చెట్లూ చేమలూ, రాయీరప్పా – ఏవీ కూడా దాని కడ్డురాలేవు. ఆ రథానికి వెల్ల గుఱ్ఱాలు పూనుస్తారు. చిత్రరథు డిచ్చా డర్జునున కవి. వాయువేగం వొక్కటే వాటి వేగానికి సాటి. దేవలోకానికి చెందిన వవి. కనక, నేలమీదే కాదు, ఆకాశానా, స్వర్గలోకానా కూడా నిరాఘాటంగా సంచరిస్తా యవి. నూరుగుఱ్ఱా లవి. ఏ కారణం వల్లనైనా వాటిలో కొన్ని చచ్చిపోడం తటస్థపడితే వరప్రభావంవల్ల ఆ సంఖ్యపూర్తి అయిపోతూ వుంటుంది.

ధర్మనందనుని గుఱ్ఱాలు దంతపురంగుగా వుంటాయి. చాలా పెద్దవవి. అర్జునుని గుఱ్ఱాలలాగే మిక్కిలీ బలంకల వవి. భీముని రథానికి

పూన్చే గుర్రాలున్నూ నిక్కిలీ వేగంగలవి. సప్తమహర్షుల తేజస్సు వంటి తేజస్సు వాటిది. అవి కూడా వాయువేగం గలవి.

తన గుర్రాలకు సాటిఅయినవాటిని అర్జును డిచ్చాడు సహదేవునకు. తెలుపూ నలుపూ కలిసిన రంగు వాటిది. వాటి సిగుదులు తిత్తిరి పక్షుల రంగుగా వుంటాయి. నకులుడి కిం(దు డిచ్చాడు గొప్పగుర్రాలు. అవిన్నీ వాయువేగాలే. చాలా బలమైనవిన్నీ. వాటికి సాటిఅయినవి కూడా భూమ్మీద మరి లేవు.

అభిమన్యుని గుర్రాలూ, ద్రౌపది కొడుకుల గుర్రాలూ కూడా చాలా ప్రశస్తమైనవి. వారికి తగినవిన్నీ అవీ దేవత లిచ్చినవీ, చాలా మెత్తయినవిన్నీ.

# 57

## ఉజ్జీలు

"అది సరేగానీ — సంజయా, పాండుపుత్రులకు సాయంగా వచ్చిన రాజు లెవరెవరు? నాకొడుకు సేనలో యెవరెవరితో వారెవరెవరు యుద్ధంచేస్తారు? ఈ వివరాలు చెప్పు" అనడిగాడు ధృతరాష్ట్రుడు. విన మని సంజయుడు ప్రారంభించాడు.

"రాజేంద్రా, అంధకులకూ వృష్ణులకూ ముఖ్యుడైన శ్రీకృష్ణుడు వారికి సర్వసాహాయ్యంగా వచ్చివున్నాడు. చేకితానుడూ, యుయుధానుడూ, సాత్యకీ గూడా వారిలో ముఖ్యుల్లోనే లెక్క. వారొక అక్షౌహిణిసేనతో వచ్చారు. వారు మహాబలపరాక్రమవంతులు. మహారథులు. పాండవులకోసం ప్రాణా లయినా విడిచిపెడతా మంటూ వచ్చారు వారు. ధృష్టద్యుమ్నుడూ, సత్యజిత్తూ — వీరిని కూర్చుకుని వొక అక్షౌహిణిసేనతో ద్రుపదుడు వచ్చాడు. అతని సేన కంతకూ శిఖండి నాయకుడు.

శంఖుడూ, ఉత్తరుడూ — ఈకుమాళ్లతోనూ, సూర్యదత్తుడూ, మదిరాక్షుడూ — ఈతమ్ముళ్లతోనూ అక్షౌహిణిసేన వెంటబెట్టుకుని విరటరాజు వచ్చాడు. జరాసంధుని కొడుకు సహదేవుడూ, చేదిరాజు ధృష్టకేతుడూ వొక్కొక్క అక్షౌహిణి సేనతో వచ్చారు. లోహితక ధ్వజులైన కేకయు లయిదుగురూ అక్షౌహిణీసేనతో వచ్చారు. మరెందరో మహాయోధులున్నూ వచ్చారు.

మానుషవ్యూహమూ, దైవవ్యూహమూ, గాంధర్వవ్యూహమూ' ఆసురవ్యూహమూ నడపడంలో చాలా సమర్థుడైన ధృష్టద్యుమ్నుడు పాండుపుత్రుల సైన్యాని కంతకూ ముందుభాగాన వుంటాడు. భీష్ముణ్ణి కొట్టడానికి శిఖండి వంతువేసుకున్నాడు. తనయోధుల నందరినీ వెంటబెట్టుకుని విరటరాజు శిఖండికి బాసట అయివుంటాడు. శల్యుడు ధర్మనందనుని పాలు. వారి కిద్దరికీ వుజ్జీ బాగాలేదని ఆక్షేపించారు అక్కడివారిలో కొందరు. దుర్యోధనుడూ, అతని కొడుకులూ, అతని నూరుగురుతమ్ముళ్లూ, తూర్పుదక్షిణరాజులూ భీమసేనునిపాలు.

కర్ణు డర్జునుని పాలు. అశ్వత్థామా, వికర్ణుడూ, జయద్రథుడూ, తామెవరికీ లొంగమనుకునే మరికొందరు యోధులూ కూడా అర్జునుని పాలే. కేకయరాజపుత్రు లయిదుగురూ కేకయరాజులతోనే యుద్ధం చేస్తారు. మాలవయోధులూ, సాల్వయోధులూ, త్రిగర్తుల్లో ముఖ్యులైన సంశప్తకులూ కూడా కేకయరాజపుత్రులపాలే. దుర్యోధనుని కొడుకులూ, దుశ్శాసనుని కొడుకులూ, బృహద్బలుడూ అభిమన్యుని పాలు. గొప్పవిలుకాళ్ళయిన ద్రౌపది కొడుకులూ, ధృష్టద్యుమ్నుడూ, మరికొందరూ ద్రోణు ణ్ణెదిరిస్తారు. సోమదత్తుడు చేకితానుని పాలు. భోజుడైన కృతవర్మ యుయుధానుని పాలు. మాద్రికొడుకు సహదేవుడు ఇంద్రునంతటివాడు. సీలల్లుడైన సుబలు ణ్ణేరుకున్నా

డతను. ఉలూకుడూ, సారస్వతులూ నకులుని పాలు. వీరు కాక తక్కినవారు తమ కెవ రెదురుపడితే వారితో డీకొంటారు.

రాజేంద్రా, అక్కడి యేర్పాట్లిలా వున్నాయి. ఇక్కడ నీకేది చెయ్యా లంటే అది చెయ్యి.

ఇది విన్నాడు ధృతరాష్ట్రుడు. సంజయుణ్ణి పిలిచి యిలా అన్నాడు. "నా కొడుకులు మాయజూదంలో మాత్రమే నేర్పు సంపాదించారు. అంచేత బలవంతుడైన భీమసేనునితో యుద్ధంపొసగిం దనగానే వారిక లేరనే నిశ్చయించుకున్నా న్నేను. తక్కిన రాజులున్నూ అగ్గిలోపడ్డ శలభా ల్లాగ గాండీవాగ్నిలో పడి బుగ్గి అయిపోతారు. సమర్థులైన పాండుపుత్రుల చేతిలో నాకొడుకుల సైన్యం అంతా తుక్కుతుక్కయి చెల్లాచెదరున్నూ అయిపోతుంది. దాన్ని రక్షించగలవా రెవరూ కన పడరు నాకు. పాండుపుత్రులూ వారి అనుచరులూ కూడా అతిర థులూ, మహాశూరులూ, మక్కిలీ యశస్సుగలవారున్నూ. తేజ స్సులో అగ్నితోనూ సూర్యునితోనూ సమానులు వారు. యుద్ధంలో యెదురు లేనివారు. ఏమంటే? వారి కందరికీ యుధిష్ఠిరుడు నాయకుడు. శ్రీకృష్ణుడు సర్వరక్షకుడు. భీముడూ, అర్జునుడూ, నకులసహదేవులూ, ధృష్టద్యుమ్నుడూ, సాత్యకీ, ద్రుపదుడూ, ధృష్టకేతుడూ, ఉత్తమౌ జుడూ, యుధామన్యుడూ, శిఖండీ ఉత్తరుడూ, కాశీరాజచేదిరాజులూ, సృంజయులూ ఇంకా అనేకులూ వారి యోధులు. పర్వతాలున్నూ గుండా పిండీ చెయ్యగల రణధీరులు వారు. ఆపాండవుల నింద్రుడున్నూ యేమీ చెయ్యలేడు. అమానుషప్రజ్ఞ వారిది. వద్దువద్దని నేనెంత గోల పెడుతున్నా నాకొడుకు వారితో జగడానికే సిద్ధపడుతున్నాడు, నేనేమిచెయ్యగలనూ?

ఇది విన్నాడు దుర్యోధనుడు చాలా దురుసుగా అందుకున్నాడు. "రాజేంద్రా, పాండుపుత్రులూ మేమూకూడా వొక్కజాతికే చెందిన వాళ్ళం. ఉభయులమూ ఈభూమ్మీదే సంచరిస్తున్నాం. మరి,

పాండుపుత్రులకే జయం కలుగుతుం దని నువ్వెందు కనుకుంటావూ? భీష్ముణ్ణీ, ద్రోణుణ్ణీ, కృపుణ్ణీ, కర్ణుణ్ణీ, జయద్రథుణ్ణీ, సోమదత్తుణ్ణీ, అశ్వత్థామనూ ఇంద్రుడు కూడా తేరిచూడలేడుగదా, పాండుపుత్రు లేమిచెయ్యగలరయ్యా? నాపక్షంగా పాండుపుత్రులతో యుద్ధంచెయ్య డానికి వచ్చినవారున్నూ మహాశూరులు. అస్త్రశస్త్రాల్లో నిధులు. పాండుపుత్రులను నాశనంచెయ్యడానికి సర్వసమర్థులు. వారిని నీపాండు పుత్రు లేమీ చెయ్యలేరు, సరిగదా, కళ్ళతో నయినా చూడలేరు. పాండుపుత్రులనూ, వారి పుత్రులనూ కూడా నేనొక్కణ్ణే సంహారిం చేస్తాను. నారథాలు చూసీ, నాబాణాల కాగలేకా పాండుపుత్రులూ, పాంచాలరాజులూ కూడా పారిపోతారు, నీకీవిచారం యెందుకయ్యా?"

కాని ధృతరాష్ట్రు డిది లెక్కచెయ్యలేదు. "సంజయా, నాకొడుకు మాటలు విన్నావా? వొట్టి పిచ్చిమాట లవి. దుర్యోధనుడు యుధిష్ఠిరుణ్ణి జయించడం సర్వకల్ల. ధర్మజ్ఞులూ, ధర్మపరాయణులూ, మహాత్ములూ అయిన పాండుపుత్రుల బలపరాక్రమాలూ, వారి బిడ్డల శౌర్యధైర్యాలూ భీష్ముడు బాగా యెరుగును. అంచేతనే వారితో యుద్ధంపెట్టుకోవద్దని చెబుతున్నా డతను, మొదణ్ణుంచీ. ఇది యేమయినా? వారి సంగతులు నాకింకా చెప్పవోయి. యుద్ధానికి వారి నింతగా ప్రోత్సహిస్తున్నవారున్నూ యెవరో వివరంగా చెప్ప వోయి" అనడిగాడు. "ఇదిగో, విను" అంటూ సంజయుడు మళ్ళీ అందుకున్నాడు.

"రాజేంద్రా, పాండుపుత్రుల నిప్పుడు బాగా కవ్విస్తున్నవాడు ధృష్టద్యుమ్నుడు. "మీ కేమీ భయంవద్దు. యుద్ధంజరగవలసిందే" అంటూ చెవి నిల్లుకట్టుకుని పోరుతున్నా డతను. దుర్యోధనుని పక్షంగా మిమ్మెదిరించడాని కొందరు రాజులు వచ్చారు, నాకు తెలుసు. వారినేకాదు, వారి వాళ్ళను కూడా నేనొక్కణ్ణే సంహారించివేస్తాను.

కనపడ్డచేపనల్లా మింగేస్తూ తిమింగిలం మహాసముద్రంలో యెలా విజృంభిస్తుందో, చేతికందినవా ణ్ణల్లా కూల్చేస్తూ సంకుల సమరంలో నే నలా చెరరేగుతాను, చూసుకో. ఉత్తుంగతరంగాలతో ముంచుకు వచ్చే సముద్రం చెలియకట్టచూసి యెలా ఆగిపోతుందో, భీష్ముడూ, ద్రోణుడూ, కృపుడూ, కర్ణుడూ, అశ్వత్థామా శల్యుడూ కూడా నన్నుచూసి కొయ్యయిపోయి నిలిచిపో వలసిందే, ముందు కదుగు వెయ్యకుండా" అని చాలా గట్టిగా చెప్పాడతను. ఇది విని మిక్కిలీ సంతోషించాడు ధర్మరాజు. "బావా, నీ బలపరాక్రమాలూ, నీధైర్యమూ కూడా యిక్కడివా రందరూ బాగా యెరుగుదురు. ఈ యుద్ధంలో నువ్వే మమ్మల్ని గట్టెక్కించాలి. కౌరవుల నందరినీ నాశనంచెయ్యడానికి నువ్వొక్కడవే చాలు. నీ క్షాత్రం జగత్ప్రఖ్యాతి పొందినది. కౌరవులు వాళ్ళు తెలియకుండా వచ్చిమీదపడతారు, వాళ్ళనేమి చేస్తావో — అదంతా నీదేభారం. యుద్ధంలో వోడిపోయి పారిపోయేవాళ్ళ నెవడు దయతలచగలుగుతాడో అలాంటివీరుణ్ణి వేలూ లక్షలూ యిచ్చి సంపాదించుకోవా లని చెబుతారు నీతివేత్తలు. నువ్వలాంటి వీరుడవ్వూ, శూరుడవ్వూ, విక్రాంతుడవ్వూనూ" అని కూడా చెప్పా డతను.

దీనిమీద ఆధృష్టద్యుమ్నుడు నన్ను పిలిచి యిలా చెప్పాడు. "సంజయా, దుర్యోధనునకు సాయంగా వచ్చిన రాజులతోనూ, బాహ్లికునితోనూ, కృపుడూ, కర్ణుడూ, ద్రోణుడూ, అశ్వత్థామా, జయద్రథుడూ, దుశ్శాసనుడూ, వికర్ణుడూ, దుర్యోధనుడూ, భీష్ముడూ వీరితోనూ నామాటలుగా చెప్పు. "మీరందరూ ధర్మనందనుణ్ణి శరణు పొందండి. లేకపోతే, అర్జునుడు మిమ్మల్నందరినీ నాశనంచేసేస్తాడు. కనక, రాజ్యం అంతా ధర్మనందనునకు సమర్పించుకోండి. రక్షించమని ధర్మనందనుణ్ణి వేడుకోండి. సత్యపరాక్రము డైన అర్జునునివంటి వీరుడు

ముల్లోకాల్లోనూ మరొకడు లేడు. అతని రథం దేవత లిచ్చింది. మనుష్యమాత్రు డెవడూ అతణ్ణి జయించలేడు. కనక, యుద్ధంమాట కట్టిపెట్టుకోండి.

## 58

### " మంచి కొడుకులను కనుక్కోండి "

" సంజయా, నీమాటలమీద కృష్ణుడూ అర్జునుడూ యేమన్నారో అది చెప్పవోయి " అనడిగాడు ధృతరాష్ట్రుడు. " అదే చెబుతున్నాను, విన " మని సంజయుడు మొదలుపెట్టాడు.

" చాలా ప్రయత్నంచేసి సెలవుపొంది, చేతులు దోయిలించుకుని ఆమహాత్ముల పాదాలమీదే చూపులు నిలుపుకుని సంగతిసందర్భాలు విన్నవించుకోడానికి అంతఃపురానికి వెళ్ళాన్నేను. కృష్ణార్జునులూ ద్రౌపదీ, సత్యభామా మాత్రమే ఉండే స్థలం అది. అభిమన్యునకూ, నకులసహదేవులకూ కూడా అక్కడికి వెళ్ళడాని కధికారం లేదు.

కృష్ణార్జును లిద్దరూ విలవగల బట్టలు కట్టుకునీ, గొప్పగొప్ప రత్నాభరణాలు ధరించీ, చందనం పూయించుకునీ, చక్కని పూలమాలలు వేసుకునీ, మదిరాపానం చేసి చాలా వుల్లాసంగా వున్నారు. అక్కడ యెన్నో ఆసనా లున్నాయి, చాలా విలవయినవి. వాటిలో చాలా గొప్ప ఆసనం వొకటుంది బంగారపుది. నవరత్నాలూ పొదిగారు దానికి. అర్జునుని తొడలమీద తన పాదాలుంచుకుని కృష్ణుడు కూచుని వున్నాడు దానిమీద. నన్ను కూచోమని అర్జునుడు తన పాదపీఠం చూపించాడు ; కాని వొక్కమాటు నే నది నాచేతులతో, మాత్రం తాకి కిందే కూచున్నాను, వారి యెదట.

నాకు తన పాదపీఠం చూపుతూ అర్జునుడు తనకాళ్ళు అవతలికి తీసుకున్నప్పుడు ఆపాదాల్లో శుభలక్షణాలయిన దీర్ఘరేఖలు కన

పడ్డాయి నాకు. గంభీరదర్శను లైన ఆనీలనీరదమూర్తులు ఏకాసనాన కూచునివుండడం చూశాటప్పటికి భయమూ సంభ్రమమూ కూడా కలిగాయి నాకు.

కృష్ణార్జును లింద్రునితోనూ విష్ణువుతోనూ సమానులు. ఈసంగతి గుర్తించక, దుర్యోధనుడు, గొప్పవిలుకాళ్ళయిన భీష్మద్రోణుల ఆసరా చూసుకునీ, కర్ణుని దురాలోచనకు లోబడిపోయీ మోసపోతున్నాడు. వారిద్దరూ కూడా, ధర్మనందనుని ఆజ్ఞలు శిరసావహిస్తారు. అలాంటి సందర్భంలో ధర్మనందనుడే జయిస్తా డనడాని కిక సందేహం యేమిటీ ?

అన్నపానాదులతో వారు నన్ను చాలా సత్కరించారు. వారి సందేశం భక్తితో విన్నా న్నేను. అల్లెతాటిదెబ్బలతో కాయలు కాసివున్న తనచేత్తో అర్జునుడు కృష్ణుని పాదం తాకాడు. నాకు చెప్పవలసినది చెప్పమని అర్జునుని సంకేతం అది. వెంటనే లేచి కూచుని కృష్ణు డిలా చెప్పాడు. అది మిక్కిలీ గంభీరంగా వుంది. చాలా మృదువుగానూ వుంది. కాని ఆలోచించగా మాత్రం మిక్కిలీ భయంకరగా వుంది.

“సంజయా, కౌరవుల్లో ముఖ్యుడైన భీష్ముడూ, అస్త్రగురు వైన ద్రోణాచార్యుడూ వినేటట్టు నామాటలుగా ధృతరాష్ట్రునకిలా చెప్పు. అంతకిముందు, అక్కడివారిలో పెద్దలకు నా వందనాలూ, పిన్నలకు నాకుశలప్రశ్నలూ అందించు. నామాట లేమిటంటావా ? కౌరవులారా, పెద్దపెద్ద దక్షిణలతో బ్రాహ్మలను సంతృప్తి పరుస్తూ యజ్ఞాలూ, యాగాలూ చేసుకోండి త్వరగా. పెళ్ళాంబిడ్డలతో సకల వైభవాలూ అనుభవించండి. ఉన్న డబ్బంతా పాత్రదానాలు చేసుకోండి. మంచిమంచి కొడుకులను కూడా కనుక్కోండి, వ్యవధిలేదు. ఏమంటారా ? మీకిప్పుడు వినాశం కనిపెట్టుకుని వుంది. ధర్మనంద

నందనుడు తన విజయంకోసం మహాతొందరపడిపోతున్నాడు మరి. మాయాజూదంనాడు, యాద్రౌపది "గోవిందా, నన్ను రక్షించు" అంటూ ఆర్తంగా మొరపెట్టుకుంది. అది పెద్దరుణ మయి కూచుందినాశిర స్సున. కనక, నేనున్నూ అది త్వరగా తీర్చేసుకోవాలి. నేను సారథిగా, అనన్యసాధారణమూ తేజోమయమూ అయిన గాండీవం చేతబట్టుకుని రణరంగంలోవురకడాని కర్జునుడున్నూ వూగిపోతున్నాడు. అత ణ్ణెదిరించి దేవేంద్రుడుకూడా బతకలేడు. ఈభూమండలం అంతా తన చేతులతో మొత్త గలవాడూ, కోపించి తనచూపులతో జగత్తులోవున్న జనుల నంద రినీ వొక్కమూటుగా కాల్చెయ్యగలవాడూ, దేవతల నందరినీ స్వర్గం నుంచి పడగొట్టగలవాడూ యెవడైనా వుంటే వాడుతప్ప మరెవడూ అర్జునుణ్ణి గెలవలేడు. దేవతలూ, అసురులూ, మనుష్యులూ, యక్షులూ, గంధర్వులూ, నాగులూ—వీరిలో కూడా వొక్కడూ లేడతణ్ణెదిరించి నిలవగలవాడు. విరాటనగరంలో మీవాళ్ళ నందరినీ చావగొట్టి అత నొక్కడే పారిపోయేటట్టు చేశాడు, ఇంకా నిదర్శనాలు కావాలా?

బలమూ. వీర్యమూ, శౌర్యమూ, శీఘ్రనిర్ణయమూ, అతివడిగా బాణాలు గుప్పించడమూ, ధైర్యసాహసాలూ. గుండెనిబ్బరమూ — వొక్క అర్జునునిదగ్గిర తప్ప మరెవరిదగ్గిర వున్నాయీ అంతగా?"

రాజేంద్రా, కృష్ణుడు అర్జునున కుల్లాసం కలిగిస్తూ నీకు చెప్పమన్న మాట లివి. అర్జునుడున్నూ చెప్పా డిలాంటివే మరకొన్నిమాటలు. అవి వినాటప్పటికి నాశరీరం గజగజ వొణికిపోయింది.

## 60

### "నిద్రాహారాల్లేవు"

సంజయుడు చెప్పిం దంతా విన్నాడు ధృతరాష్ట్రుడు. ఆ మాటల్లోవున్న అంతరార్థం బాగా చర్చించుకున్నాడు. గుణదోషాలు కూడా చాలా

జాగ్రత్తగా ఆలోచించాడు. తనకొడుక్కే విజయం కలగాలన్న కోరికతో తమబలమూ, ఎదిరిబలమూ, బాగా పరకాయించుకున్నాడు. పాండుపుత్రుల దగ్గిర మానవశక్తే కాదు. దైవికశక్తీ కనపడింది ముమ్మరంగా. వారి తేజస్సున్నూ అనన్యసాధారణంగా వుంది. తన కొడుకులదగ్గిర వున్నది మానవశక్తి మాత్రమే. ఇది బాగా నిశ్చ యించుకున్నాడు. "నాయనా" అంటూ దుర్యోధనుణ్ణి పిలిచి ప్రారం భించాడు, చివరికి.

"ఎంత సర్దిచెప్పుకున్నా నావిచారం విచారంగానే వుండి పోతోంది, తగ్గడం లేదు. ఊహానుబట్టే గాదు, ప్రత్యక్షాన్ని పట్టిన్నీ నేను విచారం పోగొట్టలేకుండా వున్నాను. లోకంలో, ప్రాణికోటి అంతా కూడా తన బిడ్డలయెడల చాలా మమకారం కనబరుచుకుంటుంది. ఆబిడ్డలకు ప్రియం కూర్చడానికీ, హితం కలిగించడానికీ కూడా చూస్తుంది. ఇది సహజమూ ధర్మమూకూడాను. తన కుపకారంచేసిన వారికిన్నీ ప్రాణికోటి ఇలాగే ప్రత్యుపకారం చెయ్యబూనుకుంటుంది.

ఖాండవదహనకాలంలో అర్జునుడు తనకు చేసిన సాయం యెప్పుడూ మరిచిపోడు అగ్నిదేవుడు. అందుకు తగ్గ ప్రత్యుపకారమున్నూ చెయ్య కుండా వుండా వుండలేడు. యుధిష్ఠిరుని తండ్రి యమధర్మరాజూ, భీమ సేనుని తండ్రి వాయుదేవుడూ, అర్జునుని తండ్రి దేవేంద్రుడూ, నకుల సహదేవుల తండ్రులు అశ్వినీదేవతలూ వారికి తప్పకుండా తోడ్పడ తారు. ఈయుద్ధంలోనే తోడ్పడతారు ముఖ్యంగా. తక్కిన దేవత లున్నూ యెందరో వారికి సాయంచేస్తారు. అంచేత భీష్ముడూ, ద్రోణుడూ, కృపుడూ — ఇలాంటివా రెంతక్రోధం పెంచుకున్నా వారి కేమీ అపాయం కలగదు. మనుష్యమాత్రుడెవడూ కూడా పాండుపు త్రులను తేరిచూడలేడు. వారి బలపరాక్రమాలకు అంతులేదు మరి. అస్త్రశస్త్రాల్లోనూ అంతటి సమర్థులు మరి లేరు. ఎంత పరకాయించినా

అర్జును నెదిరించి నిలవగలవాడు ముల్లోకాల్లోనూ కనపడడు. అతని గాండీవం చాలా గొప్ప దంటే చాలదు, అతను తప్ప మరెవడూ ఎత్తలే డది. అతని అమ్ములపొదు లక్షయాలు. అతనిబాణాలు మిక్కిలీ దారుణాలు. అతనిజెండామీద హనుమంతు డున్నాడు, దాని కెందునా అడ్డులేదు. అతని రథంవంటి రథం నాలుగుసముద్రా లకూ మధ్యస్థం అయిన భూమండలంలో మరొకటి లేదు. అది బయ లుదేరితే మేఘాలురుముతున్న ట్టుంటుంది. పిడుగులున్నూ పడుతు న్నట్టు శత్రువులకు గుండెబెదురు కలిగిస్తుంది.

అర్జునుని బలపరాక్రమా లతిమానుషా లని లోకాని కంతకూ తెలుసు. దేవతలను కూడా అతను విలాసగా జయించేస్తా డనిన్నీ అందరూ యెరుగుదురు. నిమషాని కయిదువందలబాణా లెంతదూ రాని కయినా గుప్పగలవా డతను తప్ప మరెవడున్నాడూ ముల్లోకా ల్లోనూ ? అతణ్ణి జయించగలవా డెవడూ లేడని భీష్ముడూ ద్రోణుడూ కృపుడూ, అశ్వత్థామా, శల్యుడూ వొప్పుకుంటున్నారు. వారి పక్షమూ మనపక్షమూ కూడా కాని తటస్థులున్నూ ఈమాటే అంటు న్నారు. వెనకటికి కార్తవీర్యు డొకడే నిమిషాని కయిదువందల బాణాలు గుప్పించేవాడు, మళ్ళీ ఈఅర్జునుడే యిప్పు డంతటిశక్తికలవాడు.

అతను చాలా గొప్పవిలుకాడు. ఇంద్రునికీ ఉపేంద్రునికీ కూడా సాటివచ్చేవా డత నొక్కడే భూమ్మీద. అంచేత, యుద్ధం జరుగు తున్నట్టూ, నీవారి నందరినీ అతను నాశనం చేసేస్తున్నట్టున్నే కనపడు తోంది నాకు. దీంతో రాత్రీపగలూ కూడా నాకు నిద్ర రావడంలేదు. నోటి కాహారంకూడా సయించడం లేదు. సుఖం అన్నది నాకు దొరక్కుండా వుంది. ఏవిధంగా చూసినా, పాండుపుత్రులతో కలిసి శాంతంగా బతకడమే మంచి దనిపిస్తోంది నాకు. ఎంత చెప్పినా కౌరవులకంటే వారే యెక్కువ శక్తి సామర్థ్యాలు కలవారు మరి"

## 61

## "అంతా నాచేతిలో వుంది"

తండ్రి యీగా అనాటప్పటికి, యెగిసిపడ్డాడు దుర్యోధనుడు. "రాజేంద్రా, దేవత లంతా దిగివచ్చి పాండుపుత్రులకు సాయంచేస్తా రని నీకెంత మాత్రమూ భయం అక్కర్లే" దంటూ దురుసుగానున్నా అందుకున్నా డతను.

"ఏమంటే? కామమూ, ద్వేషమూ, లోభమూ, ద్రోహమూ — ఇవి లేకపోతేనే దేవత్వం. సకలభావాల్లోనూ ఉదాసీనులుకూడా అయి వుంటేనే దేవత్వం. అలా కాలేనివారు దేవతలు కాలేరు. ఇది నాసిద్ధాంతం కాదు, మహాతపస్వులు లైన వ్యాసమహర్షి, నారద మహర్షి, పరశురాముడూ కూడా నాకు చెప్పివున్నా రొకప్పుడు.

కామమూ, క్రోధమూ, లోభమూ, ద్వేషమూ — వీటి ననుసరించి ప్రవర్తించేవారు మనుష్యులే. దేవత లెప్పుడూ అలా నడుచుకోరు. అగ్నిదేవుడూ, వాయుదేవుడూ, యముడూ, ఇంద్రుడూ, అశ్వినీదేవతలూ కామం పురస్కరించుకుని నడుచుకునేవా రయివుంటే పాండుపుత్రులకు దుఃఖాలు సంభవించకేపోవును. కనక, నీకీవిషయమై విచారమూ దిగులూ అక్కర్లేదు.

కామక్రోధాదులకు వశమైపోతే ఆ దేవతలకు దేవత్వమే నిలవదు. కాక, — ఆ దేవతలు ఎప్పుడైనా కామక్రోధలోభాదులకు లోబడిపోడం వస్తే అది పాండుపుత్రులను పరాక్రమింపచెయ్యనేలేదు.

నేనభిమంత్రించా నంటే లోకాలన్నీ కాల్చేసే అగ్నికూడా చల్లారిపోతాడు. దేవతల తేజస్సు గొప్పదంటావా? సమ్మతమే; కాని నా తేజ స్సంతకంటే గొప్పది. లోకా లన్నీ చూస్తూవుండగా, అభిమంత్రించి, నేను భూమండలం అంతా బద్దలుకొట్టగలను. పర్వతశిఖ

రాలు గుండాకొట్టగలను. అంతేకాదు, అవి మళ్లీ యథాప్రకారంగా వుండేటట్టున్నూ చెయ్యగలను. జంగమమూ, స్థావరమూ, చేతనమూ, అచేతనమూ, అయిన ఈప్రపంచం అంతా నాశనం చెయ్యడానికి రాళ్ళ వర్షం ప్రారంభం అవుతుం దనుకో. లేక, మహావాయువు సుళ్లుతిప్పేస్తుం దనుకో. మంత్రబలంతో నేనదంతా శాంతింపజెయ్యగలను.

నే నభిమంత్రించి నీరంతా నల్లరాతిలాగ స్తంభింపజేసినారథాలూ యేనుగులూ, గుర్రాలూ, కాల్బలమూ గూడా ఘంటాపథంమీాద లాగ దానిమీాద నడిపించగలను.

దేవతల భావాలూ, అసురుల భావాలూ కూడా ప్రవర్తింపచెయ్య గల న్నేను. ఏపనిమీాదనైనా, సేనతో నేను బయలుదేరా నంటే, ఎక్కడికక్కడే — నేను కావా లనుకున్నచోట నల్లా గుర్రాలు పుట్టుకు వస్తాయి. భయంకరా లైన పాములూ, మృగాలూ నామంత్రబలం వల్ల నారాజ్యంలో యెవరినీ బాధించడంలేదు. నారాజ్యంలో పర్జన్యుడు ముక్కారువానలూ కురుస్తున్నాడు. నాప్రజ లందరూ ధర్మమార్గాన సంచరిస్తున్నారు. వారెలాంటి యీాతిబాధలూ యెరగ రెప్పుడూ.

వాయుదేవుడూ, అగ్నిదేవుడూ, అశ్వినీదేవతలూ, ఇంద్రుడూ, యముడూ కూడా నే నెవరిని ద్వేషిస్తానో వారిని రక్షించరు. రక్షించా లనయినా అనుకోలేరు. వారు రక్షించేవారే అయితే, అరణ్యా ల్లోనూ, విరాటనగరంలోనూ పాండుపుత్రు లెందుకంత నికృష్టంగా బతకవలసివచ్చింది ? ఇంద్రాదులే కాదు, దేవతలూ, రాక్షసులూ, గంధర్వులూ, అసురులూ కూడా నాశత్రువులను రక్షించలేరు. ఇది అక్షరాలా సత్యం. నేనెప్పుడయినా మిత్రులకు శుభమూ, శత్రువుల కశుభమూ చెయ్యా లనుకుంటే అది జరిగితీరుతుంది, తప్పదు. నే నిది యిలా జరుగుతుం దంటే గూడా జరగవలసిందే, మరోలా కావడానికి వీల్లేదు. అంచేతనే నేను సత్యవాది నంటోంది లోకం. నాయీాశక్తి

సామర్థ్యాలు ప్రపంచం అంతటా, అందరికీ తెలుసు. ఇది నీకూరట కలగడానికే చెప్పాను; గాని, ఆత్మస్తుతి చేసుకోడాని క్కాదు. నేనెప్పుడూ ఇంతవరకూ ఆత్మస్తుతి చేసుకుని యెరగను, నీకే తెలుసు నిది. ఆత్మస్తుతి మహాదోషం. నీచులుమాత్రమే చేసేపని అది.

ఇతెందుకూ? పాండుపుత్రులూ, మత్స్యరాజులూ, పాంచాల రాజులూ, కేకయులూ, సాత్యకీ, కృష్ణుడూ కూడా నాచేతిలో వోడి పోతారు, నువ్వే వింటూ వది. ఎంతెంతలేసి నదులూ కూడా సముద్రం దగ్గిరికి వెళ్ళాటప్పటికి నామరూపాల్లేకుండాపోతాయి. నామీదికి వస్తే పాండుపుత్రులూ వారి అనుచరులూ కూడా అలాగే దుంపనాశనం అయిపోతారు. వారి తేజస్సుకంటే నా తేజస్సు గొప్పది. వారి బుద్ధి కంటే నాబుద్ధి గొప్పది. వారి బలపరాక్రమాలకంటే నాబలపరాక్రమాలు గొప్పవి. వారి చదువుకంటే నాచదువు గొప్పది. వారి యోగం కంటే నా యోగమున్నూ గొప్పది. ఎటు చూసినా వారి కంటే నేనే గొప్పవాణ్ణి. భీష్ముడూ, ద్రోణుడూ, కృపుడూ, శల్యుడూ, శలుడూ తెలుసుకున్నదానికంటే, అస్త్రశస్త్రాల్లో నాకు తెలిసిందే యెక్కువ"

ఇదంతా విని ధృతరాష్ట్రుడు "సంజయా, పాండుపుత్రుల యుద్ధ ప్రయత్నాలన్నీ వివరంగా చెప్పు" అనడిగాడు.

## 62

## కర్ణుని అస్త్రసన్యాసం

దుర్యోధనుణ్ణి బాగా ప్రోత్సాహించడానికి కిది సమయం అనుకున్నాడు కర్ణుడు. సంజయుడు మాట అందుకోకుండా తానే అందుకున్నాడు "దుర్యోధనమహారాజా" అంటూ.

"నేను పరశురామునిదగ్గిర బ్రహ్మాస్త్రం నేర్చుకున్నాను; కాని అబద్ధం ఆడి తనని మోసంచేశా నన్న కోపంతో నన్నా మహాత్ముడు దారుణంగా శపించాడు. అంత్యకాలంలో నాకా బ్రహ్మాస్త్రం జ్ఞాపకం రాకుండావుండేట ట్లా శాపం. ఆమహర్షి అంతటితో వూరుకోడం నా అదృష్టమే. ఏమంటే? నిజంగా కోపంవస్తే, తనప్రచండ తేజస్సుతో సముద్రాలతో చుట్టచుట్టి భూమండలం అంతా బుగ్గిచేసెయ్యగల డతను.

తరవాత నేనాతని కెంతో శుశ్రూష చేశాను. ఎంతో పురుషకారమున్నూ చూపించాను. దాంతో; నామీద అనుగ్రహం కలిగిం దతనికి. కనక, నాఅస్త్రం నాకు పలుకుతుందనే నానమ్మకం. అంచేత, ఈయుద్ధభారం అంతా నేనే మోసేస్తాను. ఈ మత్స్యరాజులనూ, ఈపాంచాలరాజులనూ, ఈకరూష రాజులనూ, పుత్రపౌత్రులతో కలిపి పాండవులనూ గూడా నిమిషంలో నాశనంచేసేసి, నేను, శస్త్రాస్త్రధారులకు నియతాలై వుండిన పుణ్యలోకాలు సంపాదించుకుంటాను. భీష్ముణ్ణి నీదగ్గిరే వుంచుకో. ద్రోణుణ్ణీ, తక్కిన రాజులనూ కూడా నీదగ్గిరే అట్టేపెట్టుకో. మూలబలాలు వెంటబెట్టుకువెళ్ళి పాండుపుత్రుల నందరినీ నేనొక్కణ్ణే సంహరించేస్తాను. ఈభారం అంతా నాది, నువ్వు నిశ్చింతగా వుండు"

ఇది విన్నాడు భీష్ముడు. "కర్ణా, ప్రగల్భాలు చాలించు" అన్నా డతను. "కర్ణా, కాలవశాన నీబుద్ధి పెడతలబట్టింది, మమ్మల్నందరినీ యిక్కడ వుండిపొమ్మన్నావు. నువ్వొక్కడవే యుద్ధంచేస్తా నన్నావు. ఈభారం అంతా నీదే అన్నావు, మరి నువ్వే చచ్చిపోతే? ఈ ధార్తరాష్ట్రుల గతి యేమిటో ఆలోచించావా? ప్రధానమైన వాడు చచ్చిపోతే సర్వనాశనమే అన్న మాట మరిచావా? కాక. — అర్జునుణ్ణి నువ్వుజయించగలవా? కృష్ణుని సాయంతో ఖాండవం కాల్పించినప్పుడు అర్జునుడు చేసిం దేమిటో నువ్వెరుగుదువు, మ రెందుకూ గడుసుమాటలు?

మహేంద్రుడు నీకో శక్తి యిచ్చివున్నాడు, నాకు తెలుసు. కాని, తన సుదర్శనంతో కృష్ణు డది నాశనం చేసేస్తాడు, నువ్వు చూస్తా వచ. నీదగ్గిర సర్పముఖ మైన శరమున్నూ వొకటుంది. దాంతో నువ్వర్జునుణ్ణి చంపెయ్యగల ననుకుంటున్నావు. లాభంలేదు. దాన్నే కాదు, నిన్ను కూడా వొక్క దెబ్బతో నాశనంచేసేస్తా డతను.

కర్ణా, ఆట్టే మిడిసిపడకు, బాణాసురుణ్ణీ, నరకాసురుణ్ణీ, మురాసురుణ్ణీ చంపిన శ్రీకృష్ణు డున్నా డక్కడ, సర్వవిధాలా అర్జునుణ్ణి కాపాడతా డతను. అర్జును డైనా సామాన్యుడు కాడు, నీవంటి వాళ్ళనీ నీతలదన్నే వాళ్ళనీ కూడా చాలా మందినీ సంహరించివున్నా డతను" అని చాలా గట్టిగా మందలించాడు.

కర్ణుడికి చాలా రోషం వచ్చింది. చర్రున లేచాడు. "దుర్యోధన మహారాజా, భీష్ముడు చెప్పినట్లు కృష్ణుడు గొప్పవాడే. అంత కంటేనూ గొప్పవాడే నేనూ వొప్పుకుంటున్నాను; కాని భీష్ముడు నన్నిలా కసురుకోడం చాలా తప్పు. దానికి ఫలితం యేమిటో అతనే తెలుసుకుంటాడు ముందుముందు. ఇదిగో, దీంతో, అస్త్రాలూ శస్త్రాలూ నే నిక్కడ విడిచిపెట్టేస్తున్నాను. తాను బతికివుండగా యుద్ధరంగంలో నన్ను చూడడు భీష్ముడు. అతను పడిపోయాకే నా శక్తిసామర్థ్యా లీరాజుల కందరికీ చూపిస్తాను" అంటూ గిరుక్కున తిరిగి, కౌరవసభ విడిచి యింటికి వెళ్ళిపోయాడతను.

అది చూశాటప్పటికి నవ్వు వచ్చింది భీష్ముడికి. "దుర్యోధనా, కర్ణుడు అన్నమాట తప్పనివాడుగదా, యిప్పు డిలా చేశాడేం? బాధ్యతఅంతా యిదేనా? నేను బతికివుండినంతకాలమూ నువ్వేమయిపోయినా అతనికి బెంగలే దన్నమాటె కదూ? వెర్రివాడా, భీమసేనుడు చెలరేగి మన వాళ్ళ ఫుర్రె లెగరకొడతా డది మనంచూస్తాం. అవంతీరాజూ, కళింగరాజూ, జయద్రథుడూ, బాహ్లీకుడూ, చేదిరాజూ — ఇంకా

యెందరో వుండగా వారిని కాదని, కర్ణుడు, " అందరినీ, నేనే కూల్చేస్తా" ననడం ప్రగల్భాలు కొట్టడం కాదూ? కర్ణు డధముడే కాడు, అధమాధముడు. ఏమంటావా? తాను బ్రాహ్మణ్ణని చెప్పి మహాత్ముడైన పరశురాముణ్ణి మోసంచేశాడతను. అది తెలిసి ఆమహాత్ముడు మిక్కిలీ కోపించి దారుణంగా శపించాడు. దాంతో కర్ణుని ధర్మమూ తపస్సూ — సమస్తమూ నాశనం అయిపోయాయి, బాగా గుర్తించుకో" అన్నాడు చివరి కతను.

## 63

### " మేమూ మేమూ మనుష్యులమే "

కర్ణు డస్త్రసన్యాసం చెయ్యడమూ, భీష్ము డిలా అనడమూ — దీంతో బాగా ఉద్రిక్తు డయిపోయాడు దుర్యోధనుడు. " తాతా " అంటూ లేచాడు, వెంటనే.

" పాండుపుత్రులవంటి మనుష్యులమే మేమూ, మావంటిమనుష్యులే పాండుపుత్రులున్నూ. మరి, పాండుపుత్రులకు మాత్రమే జయం కలుగుతుం దని నువ్వెలా నిష్కర్ష చేస్తావూ? బలపరాక్రమాల్లోనూ, వయస్సుల్లోనూ, విద్యల్లోనూ, సమయస్ఫూర్తుల్లోనూ, అస్త్రశస్త్రాల్లోనూ, శౌర్యంలోనూ, శీఘ్రనిర్ణయంలోనూ, నేర్పులోనూ కూడా వారూ మేమూ సమానులం అయివున్నాము. పైగా, వారిదీ మానవజన్మే మాదీ మానవజన్మే, మరి, విజయం వారిదే అని యెలా నిర్ధారణ చెయ్యగలవూ నువ్వు? నిన్నూ, ద్రోణాచార్యుణ్ణీ, కృపాచార్యుణ్ణీ, బాహ్లికుణ్ణీ, తక్కిన యీ రాజులనూ నమ్ముకుని మాత్రమే యుద్ధానికి దిగడంలేదు నేను. కర్ణుడూ, నాతమ్ముడు దుశ్శాసనుడూ — ఈ ముగ్గురమే చాలు పాండవుల నయిదుగురినీ యుద్ధంలో సంహరించడానికి.

ఇక తరువాతనంటావా? మహాయజ్ఞా లెన్నో చేస్తా న్నేను. ఆయజ్ఞాల్లో బ్రాహ్మలకు భూరిదక్షిణ లిస్తాను. గోవులూ, గుర్రాలూ,

బంగారమూ కూడా కావలసినంతా యిచ్చి బ్రాహ్మలను తృప్తి పరుస్తాను. ఉచ్చులతో లేళ్ళనుపట్టి నాశనంచేసేటట్లు, మావాళ్ళు విడి చేతులతోనే పాండుపుత్రుల బలగం అంతా సంహారించేస్తారు. అప్పు డణగిపోతుంది పాండుపుత్రుల దర్పమూ, కృష్ణుని దర్పమూ కూడా" అన్నాడు, చాలా దృఢంగా అతను.

"రాజేంద్రా, నేనొక్కటి చెబుతా విను" అంటూ విదురుడు ముందుకి వచ్చాడు దీనిమీద.

"లోకంలో దమం వొక్కటే యెలాంటివారికీ గూడా సుఖం కలి గిస్తుంది. బ్రాహ్మలయినవారి కీదమం మరీ ముఖ్యం. బ్రాహ్మలకు సనాతనధర్మం అంటే యీదమమే. ఇవి గల బ్రాహ్మడికి దానమూ క్షమా వాటికవే సిద్ధిస్తాయి. ధర్మమూ, దానమూ, తపస్సూ, జ్ఞానమూ, వేదాధ్యయనమూ – ఇవి వేదోక్తా లయిన ధర్మాలు. ఈదమం తేజస్సు పెంపుచేస్తుంది. తేజస్సు వృద్ధిపొందితే పాప ముక్తుడై మహాత్ము డవుతాడు. లోకానికి దమం లేనివారివల్ల ఎన్నో కష్టాలు కలుగుతూ వుంటాయి. అలాంటి దుష్టులను అణచివెయ్యా డానికే క్షాత్రం యేర్పడింది. బ్రహ్మచర్యమూ, గార్హస్థ్యమూ, వాన ప్రస్థమూ, సన్యాసమూ – ఈనాలుగాశ్రమాలకూ గూడా దమం చాలా ముఖ్యం అయినది. గొప్ప వ్రతం యేదీ అంటే యీదమమే.

క్షమా – అంటే ఇతరులు తన కేమిచేసినా ఓర్చి వూరుకోడమూ, ధృతీ – కామక్రోధాదులకు దూరంగా వుండడమూ, అహింసా – మనసా – వాచా కర్మణా యెవరికీ ఎలాంటి పీడా కలిగించకుండా వుండడమూ, సమతా – అంటే శత్రువులయెడలా మిత్రులయెడలా గూడా సమబుద్ధీ, సత్యమూ, ఆర్జవమూ – అంటే కౌటిల్యం లేక పోడమూ, ఇంద్రియనిగ్రహమూ, ధైర్యమూ – ఎలాటి ఆపదలు వచ్చినా చలించకపోడమూ, మార్దవమూ – ప్రియంగా మాట్లాడ్డమూ, హ్రీ –

అంటే సిగ్గూ — అంటే చెడ్డపనులు చెయ్యడంలో సంకోచమూ, అచాపలమూ — అంటే మనస్సూ మాటా చెయ్యీ — వీటిని వశంలో వుంచుకోడమూ, అకార్పణ్యమూ — పామరత్వం లేకపోడమూ, అసంరంభమూ — క్రోధం లేకపోడమూ, సంతోషమూ, శ్రద్ధా — దమం కలగడానికి కివి మూలాలు. అంటే యివి గలవారు దమం గలవారు — దాంతు లనిపించుకుంటారు.

కామమూ, లోభమూ, దర్పమూ, కోపమూ, నిద్రమత్తూ, ఆత్మస్తుతీ, అభిమానమూ — అంటే రోషమూ, ఈర్ష్యా, శోకమూ — ఇవి వున్నచోట ఈదమం కలగనూ కలగదు, నిలవనూ నిలవదు. కౌటిల్యం లేకపోడమూ, చిత్తశుద్ధీ, సచ్ఛీలమూ — ఇవి దాంతుని లక్షణాలు. ఆశాపాశానికి కట్టుబడనివాడూ, స్త్రీచాపల్యం లేనివాడూ, కోరికలు తగ్గించుకునేవాడూ సముద్రంలాగ మిక్కిలీ గాంభీర్యంగలవా డవుతాడు. అతనే దాంతుడు. మంచి ప్రవృత్తిగలవాడూ, శీలంగలవాడూ, మనశ్శుద్ధిగలవాడూ, ఆత్మజ్ఞానం గల పండితుడూ ఇహలోకంలో గౌరవమూ పొందుతాడు, పరలోకంలో సద్గతీపొందుతాడు.

ఎవ డెవరికీ భయపడడో, ఎవ డెవరినీ భయపెట్టడో అతను పరిణతప్రజ్ఞుడు. అతనే మనుష్యుల్లో ఉత్తమోత్తముడు. మిత్రుడంటే ప్రాణికోటి అంతటిమెడలా మంచిగా వుండేవాడు. అతనివల్ల యెవరికీ యెలాంటి తొందరాకలగదు. ప్రజ్ఞాతృప్తుడు సముద్రంలాగ గాంభీర్యం వహించి శాంతి అనుభవిస్తాడు. దాంతులైనవారు పూర్వులు చేసిన మంచిపనులు చేస్తారు. జ్ఞానం సంపాదించుకుని, ఇంద్రియాలు జయించి మమత విడిచి, నైష్కర్మ్యం అవలంబించేవాడు ముక్తిపొందుతాడు. ఇల్లూవాకలీ విడిచి మోక్షం కావా లనుకునేవాడు పునరావృత్తిలేని లోకాలు పొందుతాడు.

# 64

## జయం వొక్కరికే

"ఈసందర్భంలో చక్కని కథ వొకటుంది" అంటూ యింకా చెప్ప సాగాడు విదురుడు.

"వేటకా డొకడు పిట్టలను పట్టడాని కొక అడవిలో ఉచ్చులు ఒగ్గి చాటున నక్కి కూచున్నాడు. కొంతసేపటికి రెండు పిట్ట లందులో చిక్కుకున్నాయి, ఒకదాని కొకటి సహాచరా లాపిట్టలు. అవి తమ అవస్థ గ్రహించి ఉచ్చుతో గూడా ఆకాశాని కెగిరి యెక్కడికో పోసా గాయి. అది చూసి, అనుభవం బాగా వున్నవాడు కనక, ఆవేట కాడు, ఆకాశాన అవి యెటుపోతే భూమ్మీద తానూ అటుబయలు దేరాడు, ఉరుకులతోనూ పరుగులతోనూ.

ఆదారిలో వొక ఆశ్రమం ఉంది. ఆపూటకి తపస్సు చాలించుకుని అప్పుడే బయటికి వచ్చాడు ముని. జరుగుతున్న దంతా చూసి ఆముని "ఓరీ, నాకిది మిక్కిలీ వింతగా కనపడుతోంది. ఏమంటే పిట్ట లేమో ఆకాశానపారిపోతున్నాయి, నువ్వు భూమ్మీద పరుగెత్తుతున్నావు, ఏమిలాభమూ? అనడిగాడు. "ఉచ్చు ఒక్కటే; కాని పిట్టలు రెండు, కొంతసేపటి కయినా అవిరెండూ తగువులాడుకోక మానవు, అప్పుడవి కిందపడిపోడమూ తప్పదు. అప్పుడు నావుచ్చు మాత్రమే కాదు, పిట్టలూ నాకు దొరికిపోతాయి" అని బదులు చెప్పాడు వేటకాడు.

అలాగే జరిగింది, అచ్చంగా కొంతదూరం వెళ్ళాక నిజంగానే ఆపిట్టలు రెండూ తగువులాడుకోసాగాయి. మృత్యుదేవత తరుముకుని వస్తోంది వాటిని మరి. వెంటనే అవి కిందపడిపోయాయి. వేటకానికి దొరికిపోయాయి.

ఆప్రిట్లల్లాగే జ్ఞాతులున్నూ ఆ స్తికోసం తమలోతాము విరోధ పడుతున్నారు. కొట్లాడుకోడానికే సిద్ధపడుతున్నారు. జ్ఞాతులైనవా రొకరి యింటి కొకరు వస్తూపోతూ వుండడమూ, వొకరి యింటు వొకరు విందులుకుడుస్తూవుండడమూ, వొకరి నొకరు తరుచు కలుసు కుంటూ వుండడమూ, వొకరితో వొక రాప్యాయనంగా మాట్లాడు కుంటూ వుండడమూ చెయ్యాలి గాని తగవులాడుకోరాదు. సమయం వచ్చినప్పుడల్లా తమలో తాము సహకరించుకునే జ్ఞాతులు సింహాలున్న అడవిలాగ యెవరికి స్వాధీనపడరు. ఎప్పుడూ డబ్బు సంపాదించడమే పెట్టుకుని కాస్తయినా అది అనుభవించనివారు చివరి కది తమ శత్రు వుల పాలు చేసుకుంటూరు. రాజేంద్రా నిప్పున్న కట్టెలు విడివిడిగా వుంటే పొగరాజిపోతాయి. కలిస్తేమాత్రం బాగా ప్రజ్వలిస్తాయి. కలిసి వుంటే జ్ఞాతులున్నూ అలాగే ప్రచండంగా వుంటూ యెవరికీ లొంగరు.

గంధమాదనపర్వతంమీద నాకళ్ళతో చూసిన వుదంతం చెబుతా నొకటి, అది కూడా విని, నీకేది మేలని తోస్తే అది చెయ్యి.

మేమొకమాటు గంధమాదన పర్వతానికి వెళ్ళాము. మాకూడా కోయవా ళ్లున్నారు. దేవతలకు సాటివచ్చే బ్రాహ్మలున్నూ వున్నారు కొందరు. మంత్రయంత్రరూప మైన విద్య సాధించుకోడానికీ, ఓషధుల గుణవి శేషాలు పరిశీలించుకోడానికీ వచ్చా రాబ్రాహ్మలు. ఆపర్వతంనిండా పొదరిళ్లలాగ తీగలల్లుకుపోయి వున్నాయి. గొప్ప గొప్ప ఓషధు లున్నూ యెన్నో వున్నాయి మిలమిల మెరిసిపోతూ. సిద్ధులూ గంధర్వులూ కూడా వున్నారు ఆపర్వతంమీద విహరిస్తూ.

ఆపర్వతాన, వొక లోయలో, పెద్దబానంత స్వర్ణమాక్షికం వుం దొకచోట. అది కుబేరునిది. గొప్పగొప్ప నల్లతాచుల కాపలాలో వుందది. అది సేవించినవారికి చావురాదు. గుడ్డితనంపోయి చక్కని చూపు వస్తుంది. ముదిమి పోయి యౌవనమున్నూ కలుగుతుంది

మళ్లీ. వైద్యశాస్త్రం బాగా తెలిసివుండిన ఆ బ్రాహ్మలు చెప్పారిదంతా. ఇది వినడమే తడవుగా ఆనల్లతాచులను కూడా లెక్క చెయ్యకుండా ఆలోయలో వురికారు కోయ లందరూ దానికోసం. ఉరకడమే తడవుగా నాశనమూ అయిపోయారు.

నీకొడుకు పనీ అలాగే వుంది. రాజ్యమే చూసుకుంటున్నాడు; గాని తరవాత వచ్చే సర్వనాశం గుర్తించుకోడంలేదతను. నీకొడుకుదగ్గిర అర్జునుణ్ణి కొట్టేద్దా మన్న వుబలాటమే గాని, అతని తేజస్సువంటి తేజస్సూ, పరాక్రమంవంటి పరాక్రమమూ కనపడదు. రథంయెక్కి తానొక్కడే బయలు దేరివెళ్లి భూమండలం అంతా జయించుకువచ్చాడర్జునుడు. విరాటనగరంలో, ఉత్తరగోగ్రహణంనాడు, భీష్ముడూ, ద్రోణుడూ, కర్ణుడూ, నీకొడుకూ గూడా భంగపడిపారిపోయి వచ్చారు, మరిచావా అది?

అగ్గికి గాలితోడయితే యింకేమయినా వుందా? క్రోధంతో అసలే చూడశక్యం కాకుండా వున్న అర్జునునకు ఇటు ద్రుపదుడూ అటు విరటుడూ తోడయివున్నారిది గుర్తించుకున్నావా నువ్వు?

రాజేంద్రా, యుధిష్ఠిరుడు నీకోసం యెదురుచూస్తున్నాడు. నువ్వు తమయెడల పుత్రవాత్సల్యం కనపరుస్తావని నమ్ముకుని యెదురుచూస్తున్నాడు, వూరికే కాదు. అతణ్ణి తగ్గిరికి తీసుకో. యుద్ధం చేస్తే యిద్దరిలో ఏ ఒక్కడికో జయం. ఆవొక్కడూ యెవడో నిర్ధారణ చెయ్యడం సాధ్యంకా దెలాంటివారికీ గూడా.''

## 65

### "సగం రాజ్యం ఇచ్చెయ్యి"

విదురు డిలా చెప్పి వూరుకోగా, కొడుకుని పిలిచి ధృతరాష్ట్రుడు ప్రారంభించాడు.

"నాయనా, దుర్యోధనా, నేను చెప్పేది బాగా విను. బాగా ఆలోచించుకో. దారి తెలియని బాటసారిలాగ తప్పుదారే మంచిదారి అనుకుంటున్నావు నువ్వు. పాండుపుత్రుల అయిదుగురి తేజస్సూ నువ్వు నాశనంచెయ్యగల ననుకుంటున్నావు, సాధ్యంకాని పని అది. ఏమంటే ? లోకాల కన్నిటికీ మూలమైన పంచభూతాల తేజస్సు వంటిది వారి తేజస్సు. అది సమీపించడమే సాధ్యంకా దెవరికీ. యుధిష్ఠిరుడు మిక్కిలీ ధర్మాత్ముడు. అతణ్ణెదిరి స్తే చావడమే గాని జయించడం యెన్నడూ వుండదు. భీమసేనునకున్నూ సాటిచెప్పగల బలశాలి పృథివిమీద లేడు. నువ్వతణ్ణి పడగొడదా మని చూస్తు న్నావు. చెట్టువెళ్ళి మహావాయువు నెదిరించిన ట్టుంటుందది.

పర్వతాల్లో మేరు వెంతగొప్పదో విలుకాళ్ళలో అర్జును డంత గొప్పవాడు. బుద్ధివున్నవా డెవడూ అతణ్ణెదిరించి యుద్ధంచెయ్యడు. పాంచాలరాజు కొడుకు ధృష్టద్యుమ్నుడు యుద్ధరంగంలో బాణాలు గుప్పడం, అచ్చంగా ఇంద్రుడు వజ్రాయుధం విసురుతున్న ట్టుంటుంది. ధనుస్సుపుచ్చుకుని బయలుదేరా డంటే కూల్చెయ్యకుండా యెవణ్ణీ మిగల్చ డతను.

అంధకవీరుల్లోనూ, వృష్ణివీరుల్లోనూ సాత్యకి కూడా అలాగే అసాధ్యు డని పేరుపొందివున్నాడు. అతణ్ణెదిరించి బతకలే డెవడూ. పాండుపుత్రులకు మేలుచెయ్యడానికి దీక్షపట్టివున్నా డతను. నీ సేన అంతా ధ్వంసంచేసేస్తాడు ; గాని విడిచిపెట్టడు.

పోలిక చెప్పవలసివస్తే ముల్లోకాలూ చాలవు కృష్ణమూర్తికి. అతని దృష్టిలో, తన పట్టమహిషులూ జ్ఞాతులూ బంధువులూ భూమండలమూ తానూ కూడా వొకయెత్తూ అర్జును డొక్కడూ వొక్క యెత్తూనూ. సహజంగా అతనొక్కడే అజేయుడు. మరి, అతనూ అర్జునుడూ కలిస్తే యింకేమన్నా వుందా ?

నాయనా, నీక్షేమమే కాదు, నీఅభ్యుదయమున్నూ కోరి చెబుతున్నారు పెద్దలు వారిమాట విను. మన మనకందరికీ పెద్ద, భీష్ముని మాట మన్నించు. కౌరవుల ఉన్నతే కోరుతున్నా న్నేను కూడా నామాట కొట్టెయ్యకు. ద్రోణుడూ, కృపుడూ, వికర్ణుడూ, బాహ్లికుడూ — వీరిని కూడా నన్ను చూసినట్టే చూసుకోవాలి నువ్వు. వీరందరూ ధర్మవేత్తలు. నువ్వంటే నాకెంత వాత్సల్యమో వీరికీ అంతే వాత్సల్యం నీయెడల.

చూడూ నాయనా, విరాటనగరంలో, నీతమ్ములూ నీసేనా ఆలమందలు విడిచి పారిపోయి వచ్చా రిది మరిచావా? అవిరాటనగరంలోనే నూట ఆరుగురు కీచకులు వొక్కక్షణంలో భీమసేనునిచేతిలో పచ్చడి అయిపోయారు, అత్యద్భుతం కాదూ అది? ఒక్క అర్జునుడే అనుకుంటే, విడివిడిగా అతని సోదరు లందరూ అలాంటి ఘనకార్యాలు చేసినవారే, మరి, వారందరూ కలిస్తే యేమాతుందో ఆలోచించుకో. కనక, వారు నీసోదరులని భావించుకో.సగంరాజ్యం వారికిచ్చి నువ్వుకూడా సుఖపడు."

## 66

### హోమం చేసేస్తాను

కొడు క్కిలా చెప్పి "కృష్ణుని మాటలు విన్నాను. మరి అర్జునుడు కూడా ఏమిచెప్పాడో అది కూడా వినిపించు" అనడిగాడు ధృతరాష్ట్రుడు. వినమని సజంయుడిలా చెప్పాడు.

"సంజయా, భీష్మున్నీ, ధృతరాష్ట్రున్నీ, కృపద్రోణాశ్వత్థామలనూ కర్ణున్నీ, బాహ్లికున్నీ, సోమదత్తున్నీ, శకునినీ, దుశ్శాసనున్నీ, శలున్నీ, పురుమిత్రున్నీ, వివింశతినీ, వికర్ణున్నీ, చిత్రసేనున్నీ, జయత్సేనున్నీ, అవంతిరాజులనూ, విందానువిందులనూ, దుర్ముఖున్నీ, సైంధవున్నీ, దుస్సహున్నీ, భూరిశ్రవున్నీ, భగదత్తున్నీ, జలసంధున్నీ, కౌరవులకు ప్రియంగా

వచ్చివుండిన రాజులనూ, ఎవరికి తగ్గట్టు వారిని నేను నమస్కరించా ననీ క్షేమంఅడిగా ననీ చెప్పు.

పాపాత్ముల్లో మేటీ, కోపిష్ఠీ, దుర్మతీ, లోభీ, అయిన దుర్యోధను నకు నామాటలు వినిపించు. అతని అమాత్యులున్నూ వినేటట్టు చెప్పు. ” అన్నాడర్జునుడు.

అప్పటి కతని కళ్లు బాగా యెఱ్ఱబడ్డాయి. “ సంజయా ” అంటూ నన్నుపిలిచి “ కృష్ణుని మాటలు విన్నావు నువ్వు. ఇదిగో నామాటలు. నారథవేగంతో ప్రచండ మైనవాయువు బయలుదేరుతుంది. ఆవాయు వుతో నాబాణా లనే అగ్ని బాగా ప్రజ్వలిస్తుంది. ఎదటివారి అస్త్ర శక్తిని నాశనంచేసే గాండీవం అనే స్రువంతో నేను హోమం చేసే స్తాను, తప్పదు. కనక, అంతకి ముందే అలాంటి పని జరక్కుండా వుండేటట్టు చూసుకోండి. ధర్మనందనుడు ఎలాంటి శత్రువులనూ కూడా నాశనంచెయ్యగలవాడు గాని సామాన్యుడు కాడు. కనక, అతని రాజ్యభాగం అతని కిచ్చెయ్యండి. లేదూ, మిమ్మల్నీ మీచతురంగబలాలనూ కూడా హోమంచేసేస్తాను.” అని అర్థవత్తు గానూ, ధర్మవత్తుగానూ చెప్పా డర్జునుడు. ఆవెంబడే అతనికీ కృష్ణు నకూ నమస్కారములు విన్నవించుకుని బయలుదేరి వచ్చేశా న్నేను ”

# 67

## వ్యా సు ని రా క

దుర్యోధనున కీమాటలు నచ్చలేదు. తక్కిన కౌరవు లందరూ మాట్లాడకుండా వూరుకున్నారు. అది చూసి సాయంవచ్చే రాజులు తమతమ బసలకు వెళ్ళిపోయారు. ఇలాగ అప్రయత్నంగా ఏకాంతస్థితి తటస్థించగా, ధృతరాష్ట్రుడు, తన కొడుకులకే విజయం కలగా లని

కోరుకుంటూ, తనవారి నిశ్చయమూ పాండుపుత్రుల నిశ్చయమూ తటస్థుల నిశ్చయమూ గూడా తెలుసుకోవా లను కున్నాడు. వెంటనే సంజయుణ్ణి విడిచి "మనసేనల స్థితీ, పాండుపుత్రుల సేనలస్థితీ నువ్వు బాగా యెరుగుదువు. మరి, మనసేనలో వుండే ఘనత యేమిటి, పాండుపుత్రుల సేనలో వుండే లోటున్నూ యేమిటి ? ధార్మికవిషయాలూ ఆర్థికవిషయాలూ కూడా నువ్వు క్షుణ్ణంగా తెలిసినవాడవు. వాటి మంచిచెడ్డలున్నూ నిర్ధారణచెయ్యగలవు నువ్వు. కాక, యుద్ధతంత్రమున్నూ పూర్తిగా తెలిసినవాడవు నువ్వు. కనక, పాండవసేన బలాబలాలూ, మనసేన బలాబలాలూ బాగా వివరించి చెప్పు. తటస్థులుగా ఎవరైనా వుంటే వారి సంగతి కూడా స్పష్టంగా చెప్పు" అనడిగాడు.

అత నడిగిం దంతా చెప్పడం సంజయున కిష్టమే ; కాని "రాజేంద్రా, మన మిద్దరమే వున్నా మిక్కడ. ఇలాంటి యేకాంతస్థితిలో నేనేమి చెప్పినా నీకసూయ పుడుతుంది. కనక చెప్పడమూ మంచిది కాదు, నేను చెప్పనూ చెప్పను. నీతండ్రి అయిన వ్యాసమహర్షినీ, నీపట్టమహిషి గాంధారదేవినీ రప్పించు. వారు ధర్మం బాగా తెలిసినవారు. నేర్పుగా మంచీ చెడ్డా నిర్ధారణచెయ్యగలవారు. నామాటలమీద నీకసూయ కలిగితే అది పూర్వపక్షమున్నూ చెయ్యగలవారు వారు. వారి యెదట నువ్వడిగిందంతానూ, కృష్ణార్జునుల ఉద్దేశం పూర్తిగానూ చెబుతాను" అని బదులుచెప్పా డతను.

ధృతరాష్ట్రుడు తలుచుకున్న వెంటనే వ్యాసమహర్షి సాక్షాత్కరించాడు. వర్తమానం అందుకుని గాంధారికూడా వచ్చింది. వారి నిద్దరినీ విదురుడు సభలో ప్రవేశపెట్టాడు. వ్యాసుడు, ధృతరాష్ట్రుని కోరికా, సంజయుని అనుమానమూ గుర్తించి "సంజయా, శ్రీకృష్ణుని తత్వమూ, అర్జునుని తత్వమూ నీకు పూర్తిగా తెలుసు. కనక,

ధృతరాష్ట్రు డేది కావా లంటే అదంతా వివరంగా చెప్పు" అని ఆజ్ఞాపించాడు, వెంటనే.

# 68

## కృ ష్ణు ని ని జ రూ ప ం

సంజయుడు ధృతరాష్ట్రుణ్ణి వినమని యిలా ప్రారంభించాడు.

"రాజేంద్రా అర్జునుడూ శ్రీకృష్ణుడూ గొప్పవిలుకాళ్ళు. పరబ్రహ్మస్వరూపమే వారు. ఐహికభోగా లనుభవించడానికి మాత్రమే కాదు, దుష్టులను శిక్షించి శిష్టులను రక్షించి ధర్మం నిలపడానికి పుట్టిన వారు వారు. కృష్ణుని ఆయుధం సుదర్శనచక్రం. దాని పరిమాణం—అడ్డకొలత అయిదుమూరలు. అయితే, ఎంతకావా లని అతను తలుచుకుంటే అంతా అయి ప్రవర్తిస్తుం దది. చూడశక్యం కాని రూపం దానిది. కౌరవు లంటే దాని కోపమూ, పాండవులంటే మిక్కిలి ప్రీతిని. సేనల సారాసారాలు దానికి బాగా తెలుసు. నరకాసురుడూ, శంబరాసుడూ, కంసుడూ, శిశుపాలుడూ – వీరందరూ చాలా దుర్మార్గులు. మిక్కిలి క్రూరులు. వీరు చేసినవన్నీ ఘోరాలు. వీరిని శ్రీకృష్ణు డందరినీ ఆడుతూపాడుతూ సంహరించేశాడు. పురుషోత్తము డంటే అత నొక్కడే. ఈభూమండలమూ ఆకాశమూ స్వర్గమూ కూడా ఆక్రమించేస్తా డతను.

మహారాజా, పాండుపుత్రుల సంగతీ, వారి బలగం సంగతీ నువ్వు మళ్ళీమళ్ళీ అడుగుతున్నావు, కనక చెబుతావిను. చరాచరాత్మక మైన యీజగత్తుకంటే శ్రీకృష్ణుడు గొప్పవాడు. తలుచుకున్నా డంటే ఈజగత్తంతా అత నొక్కడే భస్మం చేసేస్తాడు. జగత్తంతా కలిసి వచ్చినా అతణ్ణి మాత్రం యేమీ చెయ్యా లేదు. ఎక్కడ సత్యం వుంటుందో, యెక్కడ ధర్మం వుంటుందో; యెక్కడ అకృత్యా లంటే వైముఖ్యం

వుంటుందో, యెక్కడ ఋజుప్రవర్తనం వుంటుందో, అక్కడ వుంటా డతను. కనక, అత నెక్కడవుంటే అక్కడ వుంటుంది విజయం. అతని వల్లనే యీభూమండలమూ, ఆకాశమూ, స్వర్గమూ తమ పనులు తాము నిర్వర్తించుకుంటున్నాయి. ఆమహాత్ముడు పాండుపుత్రులను సత్రయోగంగా కల్పించి, మూఢులూ, అధర్మపరాయణులూ అయిన నీకొడుకులను కాల్చెయ్యడానికి చూస్తున్నాడు.

సంవత్సరాత్మకమైన కాలచక్రమూ, జన్మస్థితిలయాత్మకమైన యీ జగచ్చక్రమూ, కర్మాత్మకమైన యుగచక్రమూ ఆత్మయోగంతో ఆమహాత్ముడే నడుపుతున్నాడు. ఆయుర్దాయం తుంచేవాడు కాలుడు. శరీరమూ ప్రాణమూ విడలియ్యడం మృత్యువుపని. వీరికి, స్థావరజంగ మాత్మకమైన యీజగత్తుకీ అతనే అధినాథుడు. ఇదినిత్యసత్యం. జగత్తు కంతకీ ప్రభు వయిన ఆమహాత్ముడు సామాన్యమానవు డన్నట్టు కర్మ యోగం అవలంబిస్తాడు. కర్షకుడు సస్యాలను వృద్ధిచేసేటట్టు చేస్తా డతను కర్మలు. మాయాయోగంతో లోకాల నిలా మోసం చేస్తూ వుంటాడు, కాని అతణ్ణేసేవించుకునేవారిని మాత్రం అజ్ఞానం యెన్నడూ అలుముకోదు”

# 69

## ఇం ద్రి యా లు జ యి ం చు కో

ఇది విని ధృతరాష్ట్రుడు “శ్రీకృష్ణుడు సకలలోకాలకూ మహేశ్వరుడు. అయితే, అతణ్ణి నువ్వెలా తెలుసుకోగలిగావు? నేనెందుకు తెలుసుకో లేకపోతున్నానూ?” అనడిగాడు. దీనికి సంజయుడు “రాజేంద్రా, నీకు జ్ఞానంలేదు. అంతే కాదు, తమస్సు పేరుకునివుంది నీలో. అంచేతనే నువ్వు శ్రీకృష్ణుణ్ణి తెలుసుకోలేకపోతున్నావు. శ్రీకృష్ణుడు సాక్షాత్తూ పరమేశ్వరుడు. నాకేమాత్రమో జ్ఞానం వుంది. అంచేతనే నేనతణ్ణి అవగాహన చేసుకోగలుగుతున్నాను” అని బదులు చెప్పాడు.

"అయితే, శ్రీకృష్ణునియెడల నీకున్న భక్తి యెలాంటిది?" అని మళ్ళీ అడిగాడు ధృతరాష్ట్రుడు. "రాజా, నీకు శుభం కలగాలి. నేను పుత్రకళత్రాదులుగా పెరిగిపోయిన యీమాయజోలికి పోను. భగవదర్పణం చెయ్యకుండా ధర్మమున్నా ఆచరించన్నేను. కామక్రోధాదులు విడిచి తన్మాలంగా మనస్సు నిర్మలంచేసుకుని ధ్యానయోగంతో తత్త్వమసీత్యాది శాస్త్రరీత్యా జ్ఞాన మాత్రవ్యవహిత మైన పరబ్రహ్మ కృష్ణు డని తెలుసుకున్నాను" అని సంజయుడు మళ్ళీ బదులుచెప్పాడు.

ఇది విని ధృతరాష్ట్రుడు దుర్యోధనుణ్ణి చూసి "శ్రీకృష్ణుణ్ణి ఆశ్రయించుకో. సంజయుడు మన కాప్తుడు. అతని పరంగా ఆమహాత్ముణ్ణి శరణు పొంది సుఖపడు" అని చెప్పాడు, కాని "ఊహూ" అన్నాడు దుర్యోధనుడు. "శ్రీకృష్ణుడు భగవంతుడే. అతను లోకా లన్నీ నాశనంచెయ్యడం ధర్మమే; అయితే, అర్జునుడు తనకు సఖు డని చెబుతూ ఆపని చేస్తున్నా డతను. కనక, నేనత ణ్ణాశ్రయించను" అని వివరంగానున్నా చెప్పా డతను.

"ఛీ, నరకానికి తీసుకుపోయే మాట నీది" అంటూ కొడుకు నేవగించుకున్నాడు ధృతరాష్ట్రుడు. గాంధారిని పిలిచి "దేవీ, దుర్బుద్ధి అయి దుర్యోధనుడు చెడ్డదారి తొక్కుతున్నాడు. ఇత నీర్ష్యాపరుడు. దుర్మతి. రోషగ్రస్తుడు. సజ్జనుల మాటలు తిరస్కరించేవాడు" అనిన్నీ చెందుకున్నాడు. గాంధారి కూడా అసహ్యించుకుంది దుర్యోధనుణ్ణి. "ఐశ్వర్యం వొక్కటే నీకు ముఖ్యం. నీబుద్ధి చాలా చెడ్డది. వృద్ధులమాటలు తిరస్కరిస్తున్నావు నువ్వు. అజ్ఞానంవల్ల ఐశ్వర్యమూ జీవితమూ కూడా నువ్వు ధ్వంసంచేసుకుంటున్నావు. నీచులతో స్నేహంచేస్తూ నాకు శోకం తెచ్చిపెడుతున్నావు. కానియ్యి, భీమసేనుని చేతిలో కూలిపోయినప్పుడు నీతండ్రిమాటలు జ్ఞాపకం వస్తాయి నీకు" అనిన్నీ నిష్ఠురా లాడిం దామె.

ఈసమయంలో "రాజా" అంటూ పిలిచాడు వ్యాసుడు ధృత రాష్ట్రుణ్ణి. "నువ్వంటే శ్రీకృష్ణునకు చాలా యిష్టం" అంటూ ప్రారంభించి "నామాట విను. సంజయుడు నీకు నమ్మినదూత. నీశ్రేయస్సు కోరుతున్నా డితను. నీకభ్యుదయం కలిగించా లని యితని దీక్ష. పురాణపురుషుడూ, పరబ్రహ్మమూ అయిన శ్రీకృష్ణు ణ్ణితను బాగా యెరుగును. తనమాట వింటే నీకితను భయం అనేది లేకుండా చెయ్యగలడు. పురుషులు కొందరు క్రోధం వహించీ, ఉప్పొంగిపోతూనూ రకరకాల పాశాల్లో చిక్కుకుని తమకున్న దాంతో తృప్తిపడక పేరాసలకు పోయి యముని చేతుల్లో పడతారు. గుడ్డి వాళ్ళను నమ్ముకుని ప్రవర్తించే గుడ్డివాళ్లు వెళ్లి వెళ్లి చివరికి గోతిలో పడతారు. అలాగే మోహాంధు లొకరి నొక రనుసరించి చెడతారు. సుఖపడా లని వుందా నీకు? అయితే, శ్రీకృష్ణు ణ్ణాశ్రయించడం వొక్కటే మంచివుపాయం. ఆవుపాయం అవలంబించినవా రనేకులు ముక్తులైనా" రని వివరంగా చెప్పాడు చివరికి.

దానిమీద "సంజయా, నేనేం చేస్తే శ్రీకృష్ణుణ్ణి పొందగలనో అపాయం లేని ఆ వుపాయం చెప్పు" అనడిగాడు ధృతరాష్ట్రుడు. "అదే చెబుతున్నా" నన్నాడు సంజయుడు.

"రాజేంద్రా, ఆత్మజ్ఞానం లేనివాడు ప్రత్యగాత్మను తెలుసుకోలేడు. ఇంద్రియనిగ్రహంలేనివాడికి ఆత్మజ్ఞానం కలగదు. కామత్యాగమూ, అప్రమాదమూ, అహింసా – ఇవి జ్ఞానానికి సాధనాలు. కనక, బాగా ప్రయత్నించి ముందు ఇంద్రియాలను జయించుకో. బుద్ధి చలించ కుండా చూసుకో. బహిరంగాలూ అంతరంగాలూ అయిన విషయ సుఖా లన్నీ విడిచిపెట్టుకో, ఈ ఇంద్రియనిగ్రహమే జ్ఞానం అని చెబు తారు బ్రాహ్మలు. ఈ జ్ఞానం సంపాదించుకుని ఈమార్గంలోనే నడుచు కుంటారు పండితులు. ఇంద్రియాలు జయించుకోలేనివాడికి శ్రీకృష్ణు

డందడు. శాస్త్రం అనుసరించి యోగసమాధిలో ప్రవేశించి ఇంద్రియాలు నిగ్రహించుకున్నవాడు పరమాత్ముని తెలుసుకుని ఆనందిస్తాడు''

# 70

## "అడిగో, కృష్ణుడు వస్తున్నాడు"

"సంజయా, శ్రీకృష్ణున కెన్నో పేర్లున్నాయి, ఎన్నో పనులున్నూ చేశా డతను. ఆపేళ్ళ విశేషమూ, ఆపనుల ఆంతర్యమూ అవగాహన చేసుకుని నేనతణ్ణి సేవించుకుంటాను, కనక అతని సంగతి యింకా చెప్పవోయి'' అనడిగాడు ధృతరాష్ట్రుడు. "నేను శ్రీకృష్ణుని పేళ్ళ విశేషం కొంతవిన్నాను. నాకు తెలిసినంతవరకూ చెబుతాను కూడా. అయితే నేనే కా దెవరూ కూడా తెలుసుకోనూ లేరు, పూర్తిగా, చెప్పనూ లేరు. అత నప్రమేయుడు, మరి'' అంటూ మళ్ళీ ప్రారంభించాడు సంజయుడు.

భూతాల కన్నిటికీ ఆధారమూ, దేవతల కందరికీ కారణమూ అయినాడు కనక, వాసుదేవు డైనాడు శ్రీకృష్ణుడు. సర్వవ్యాపకుడు కనక విష్ణువు. మౌనం అవలంబించీ, ధ్యానించీ, యోగసమాధిలో ప్రవేశించీ తెలుసుకోతగినవాడు కనక మాధవుడు. సర్వతత్వమయుడు కనక మధుహంత. మధు డనే దైత్యుణ్ణి సంహరించేనవాడు కనక మధుసూదనుడు. కృషి అంటే భూమి. ణ అంటే నిర్వృతి — సుఖం, ఈరెండుధాతువుల అర్థాలూ కలియడంవల్ల కృష్ణుడు. పుండరీకం అంటే పరంధామం. అది నిత్యమూ, అక్షయమూ, అవ్యయమున్నూ. తద్భావం కనక, పుండరీకాక్షుడు.

దస్యులను — అంటే దుష్టులను పీడిస్తాడు కనక జనార్దనుడు. సత్వగుణనిష్ఠుడు కావడంవల్ల సాత్వతుడు. సర్వశ్రేష్ఠుడు కనక ఋషభేక్ష-

ణుడు. పుట్టుక లేనివాడు కనక అజుడు. ఎలాంటి సేనలనూ కూడా నాశనంచేసేస్తాడు కనక అనేకజిత్తు. ఉదరం అంటే చాలా యెక్కువగా ప్రకాశించేది. దమం కలది దామం. ఈదామం ఉదరం కనక దామోదరుడు. హర్షమూ సుఖమూ — వీటి కీశ్వరుడు కనక హృషీకేశుడు. ఎప్పుడూ అధః — అంటే కింద లేనివాడు కనక అధోక్షజుడు. భూమీ ఆకాశమూ కూడా తన బాహువులతో భరిస్తాడు కనక మహాబాహుడు. నారాలు — అంటే జలం. అందులో నివసిస్తాడు కనక నారాయణుడు. జగత్తంతా నిండివుంటాడు: పైగా, దాని కంతకూ తానే ఆధారం కనక పురుషోత్తముడు. సర్వానికీ తానే అయి సర్వమూ తానే కనక సర్వపదవాచ్యుడు. సత్యంలోనే వుంటాడు. సత్యం కంటే సత్యం కనక సత్యపదవాచ్యుడు. జయించే స్వభావం కలవాడు కనక జిష్ణుడు. శాశ్వతుడు కనక అనంతుడు. ఇంద్రియాలను ప్రకాశింపచేస్తాడు కనక గోవిందుడు. తత్వంకాని దాన్ని తత్వం అనేటట్టు భ్రమింపచేస్తాడు. ధర్మనిత్యుడైన ఆశ్రీకృష్ణుడు, లోకంలో, క్రౌర్యం అనేది లేకుండా చెయ్యడానికిప్పు డిక్కడికి వస్తున్నాడు.

# 71

## ధృతరాష్ట్రుని భక్త్యావేశం

ఇది విని ధృతరాష్ట్రుడుభక్త్యావేశంతో యిలా అన్నాడు.

"సంజయా, నాకు చూపు రావాలని కోరుకుంటున్నాను. తన శరీరప్రభలతో దిక్కులూ విదిక్కులూ కూడా ప్రకాశమానాలుగా చేసే ఆవాసుదేవుణ్ణి అందరిలాగే నేనూ దగ్గిరగా చూడాలని ఆశపడుతున్నాను.

నాసభలో, పాండుపుత్రులకు మాంగల్యం సంఘటించే మాటలూ సృంజయులకు క్షేమంకలిగించేమాటలూ మాట్లాడతా డతను. ఐశ్వర్యం కోరేవారు శిరసావహించతగ్గవీ, చావుమూడినవారు స్వీకరించలేనివీ కూడా మాట్లాడతా డతను.

సాత్వతుల్లో యేకైకవీరు డతను. యాదవుల కభ్యుదయం సాధించేవాడతను. శత్రువుల నందరినీ క్షోభపెట్టి నాశనం చేసేస్తాడు. పగరతుర కీర్తి అంతా అణిచేస్తాడు. క్రౌర్యం పోగొట్టేమాటలు చెప్పి, నావాళ్ళ నందరినీ మోహపెట్టేస్తా డతను. నాకొడుకు లిప్పు డామహానుభావుణ్ణి చూస్తారు.

మహర్షిసత్తము డైన నారాయణు డతను. ఆత్మజ్ఞుడు. సన్యాసులకు కలశంవంటివాడు. యోగముద్రాసమేతుడు, అరిష్టనేమి. గరుడుడు. సుపర్ణుడు. శ్రీహరి. లోకాలకూ లోకులకూ నిలయం. సహస్రశీర్షుడు. పురాణపురుషుడు. ఆదిమధ్యాంతరహితుడు. అనంతకీర్తి. కర్మజన్యాలైన పుణ్యం మొదలైనవాటికి కర్త, అజుడు. నిత్యుడు. పరాత్పరుడు. ఆమహాత్ముణ్ణి నేను శరణుపొందుతాను. త్రైలోక్యనిర్మాత. దేవతలకూ అసురులకూ నాగులకూ రాక్షసులకూ జననకారణం. రాజుల్లోనూ విబుధుల్లోనూ ముఖ్యుడు. ఆయింద్రానుజుణ్ణి నేను శరణు పొందుతాను"

# 72

## "ధర్మబంధురమైన సుఖం కావాలి"

సంజయుడు హస్తినాపురానికి వెళ్ళిపోయాక, యుధిష్ఠిరుడు, శ్రీకృష్ణుణ్ణి చూసి "మిత్రవత్సలా, ఇదిగో, నీస్నేహితులకు నువ్వు సాయంచెయ్యవలసిన సమయం వచ్చింది. మాఆపదలు పోగొట్టడానికి నీకంటే మరొక డెవడూ లేడు మాకు. నిన్ను చూసుకునే మేము దుర్యోధను

న్లైదిరించి యుద్ధానికి సిద్ధపడుతునాము, ఎలాంటి విపత్తులు చుట్టుముట్టినా నువ్వు యాదవుల నందరినీ రక్షిస్తున్నావు, ఆయాదవుల్లాగే యీ పాండవులునూ్నా నీరక్షణ కర్హులు. ఎదురుచూస్తూనూ వున్నారు. మాధవా, దయవుంచి, మమ్మల్ని కాపాడవయ్యా" అంటూ వేడుకున్నాడు.

"అహమస్మి" అన్నాడు వెంటనే శ్రీకృష్ణుడు, "ఇదిగో, నేను సిద్ధంగా వున్నాను. నీవుద్దేశం యేమిటి? నువ్వు చెప్పేదిన్నీ యేమిటి? నీకోరిక నేను తీరుస్తా నదేమిటో వివరించి చెప్పు" అని బదులు చెప్పా డతను.

యుధిష్ఠిరు డిలా ప్రారంభించాడు.

"మహానుభావా, ధృతరాష్ట్రుని అభిప్రాయమూ, దుర్యోధనాదుల ఉద్దేశాలూ సంజయుడు చెప్పగా వినే వున్నావు నువ్వు. సంజయుడంటే ధృతరాష్ట్రుని వ్యూహాలకు ప్రత్యక్షరూపం. అతను తన ప్రభువు చెప్పమన్న దే చెప్పా డిక్కడ. మరో విధంగా చెబితే దూత అయిన వాడు వధ్యు డయిపోతాడు మరి. పాపబుద్ధితో ఋజుమార్గం తప్పి నడుస్తూ, ఆరాజు, రాజ్యంలో కొంచెమునూ్నా భాగం యివ్వకుండానే మమ్మల్ని శాంతింపజేద్దా మని చూస్తున్నాడు. మే మతని సెలవు చొప్పున పన్నెండే ళ్ళడవుల్లో వున్నాము. ఒకయే డజ్ఞాతమునూ్నా చేశాము. ఆరాజు సత్యసంధు డనీ, అన్నమాట నిలుపుకుంటా డనీ మేము నమ్మాము. లేశమూ కూడా మాశపథం మే మతిక్రమించలేదు. బ్రాహ్మ లందరూ యెరుగుదు రీసంగతి. లుబ్ధు డయి ఆరాజు తన ధర్మం యేమిటో కొంచెమూ కూడా పరకాయించుకోడంలేదు. సహజంగానే కొడుకు మాట కాదనలే డతను. పైగా, కొడుకంటే మిక్కిలీ ప్రీతి అతనికి. అంచేతే అలా చేస్తున్నా డతను.

రాజ్యలోభం చాలావుం దతనికి. అంచేత, స్వార్థమే ప్రధానంగా చేసుకుని, దుర్యోధనుని మాటే చెల్లిస్తూ మమ్మల్ని వంచనచేస్తున్నా

డతను. నాతల్లిని నేను పోషించుకోలేకపోయాను. నామిత్రులను సుఖ పెట్టలేకపోయాను. ఇంతకంటే గొప్పదుఃఖం మరేమయినా వుందా నాకు? కాశీరాజూ, చేదిరాజూ, పాంచాలరాజూ, విరటరాజూ, నువ్వూ ఇంతమంది మహానుభావుల సాయంతో సర్వసమర్థుణ్ణయివుండిన్నీ నేను, అవిస్థలమూ, వృకస్థలమూ, మాకందీ, వారణావతమూ, ఏదయినా సరే, మరొకటీ — అయిదూళ్లో అయిదునగరాలో యిస్తే చాలు నన్న స్థితిలో వున్నాను. మావల్ల భీష్ముడూ తక్కిన పెద్దలూ నశించి పోకుండా వుండడానికే అడిగామవి. అవికూడా యివ్వనంటున్నాడు దుర్యోధనుడు, ఇంతకంటే కూడా దుఃఖం మరేమయినా వుందా నాకు? సంప్రదాయసిద్ధమైన వంశంలో పుట్టి, వయోవృద్ధుడున్నూ అయినవాడికి పరధనంయెడల లోభం పుట్టిం దంటే, ముందది ప్రజ్ఞానం నాశనం చేస్తుంది. దాంతో, సిగ్గుబిడియా లేకుండా పోతాయి. దానివల్ల ధర్మహాని కలుగుతుంది. ధర్మం లేకపోతే సిరీసంపదా నశించిపోతాయి. అవి పోడం పురుషునకు చావుతప్ప మరొకటి కాదు. పురుషునకు దారిద్ర్యమే చావు. ధనంలేనివాణ్ణి జ్ఞాతులూ మిత్రులూ విడిచి వెళ్లి పోతారు. పువ్వులూ, కాయలూ, పళ్ళూ లేని చెట్టుమీద పక్షు లుండ వుగా? దారిద్ర్యంతో మోడయిపోతాడు పురుషుడు. రెండుపూట్లా తిన డాని కేమీ లేకపోడంకంటే దురవస్థ మరేమీ లేదన్నాడు శంబరుడు.

అంచేత ధనమే ధర్మం అన్నారు పెద్దలు. అంతా ధనంలోనే వుంది. డబ్బున్నవాళ్ళే బతుకుతారు లోకంలో. డబ్బులేనివాళ్ళు చచ్చినవాళ్ళలోనే లెక్క. ఎవరైనా తమ శక్తిసామర్థ్యాలవల్ల యెవడి డబ్బయినా కొట్టేస్తే, వారు, డబ్బే కాదు, ఆమనిషి ధర్మమూ, కామమూ — చివరి కామనిషి జీవితమూ కూడా కొట్టేశా రన్న మాటే. అలాంటి అవస్థ పడ్డవారిలో కొందరు మరణమే మంచి దంటారు. కొందరు దేశాంతరాలకు పోతారు. కొంద రడవులు

పట్టిపోతారు. కొందరు సమూలంగా నశించిపోతారు. కొందరు పిచ్చివాళ్ళయిపోతారు; కొందరు శత్రువుల కాళ్ళే పట్టుకుంటారు, మరోగతి లేక.

పురుషునకు చావుకంటే ఆపద గొప్పది. ఎవరికీ మరణం తప్పనిదే. కాక, — సహజంగా దరిద్రు డయిపుట్టినవాడి కేమంత బాధ లేదు. ఐశ్వర్యవంతు డయి, చిరకాలం సిరిసంపద లనుభవించి అప్పుడు దరిద్రుడయిపోయినవాడి బతుకు చెప్పడానికి వశంకాదు. వాడా దారిద్ర్యం స్వయంకృతాపరాధం అనుకోడు. తన కలాంటి అవస్థ కల్పించా రని ఆమనిషి దేవతలను నిందిస్తాడు. ఎంతెంతలేసి శాస్త్రాలూకూడా ఆమనిషిని సరిఅయిన దారికి మళ్ళించలేవు. ప్రతీదానికీ వాడుభృత్యులమీద కోప్పడతాడు. మిత్రులను చూసి అసూయపడుతాడు. వాడెప్పుడూ కోపంతో మటమటలాడి పోతూవుంటాడు. దాంతో, వాడు, మూఢు డయిపోతాడు. అంటే, చెయ్యరాని దేదో, చెయ్యతగ్గ దేదో తెలియని స్థితి సంభవిస్తుంది వాడికి. దాంతో, క్రూరకార్యాలు చెయ్యడానికి ప్రారంభిస్తాడు. అది సాంకర్యానికి దారితీస్తుంది. ఆసాంకర్యంవల్ల నరకమే గతి అవుతుంది. పాపాత్ములకు నరకం కాక, స్వర్గం ఎలా వస్తుందీ మరి ?

ఎప్పటి కయినా జ్ఞానం తెచ్చుకుని ప్రజ్ఞ కనబరుచుకుంటేనే తరిస్తాడు. ప్రజ్ఞకలవా డెప్పుడూ శాస్త్రాలు పరిశీలించుకుంటూ వుంటాడు. శాస్త్రాలమీద కలిగే విశ్వాసంవల్ల వాడు ధర్మపరు డవుతాడు. ధర్మం వాడికి సిగ్గుబిడియాలు కలిగిస్తుంది. సిగ్గుబిడియా లున్నవాడు పాపప్పను లంటే దూరంగా తొలగిపోతాడు. దాంతో, చివరికి వాడికి సిరిసంపదలు లభిస్తాయి. ఆసిరిసంపద లున్నంత కాలమూ వాడు ప్రసన్నచిత్తుడూ ధర్మపరాయణుడూ అయి సత్కార్యాలు చేస్తాడు. వాడిబుద్ధి అధర్మంకేసి మొగ్గదు. సిగ్గుబిడియా ల్లేనివారికీ, మూఢులకూ — వారు స్త్రీ లయినా పురుషు లయినా —

శూద్రుల కెలా లేదో వారికీ అలాగే ధర్మంమీద అధికారం లేదు. సిగ్గుబిడియా లున్నవాడు దేవతలనూ పితృదేవతలనూ బాగా పూజి స్తాడు. వాడి కాత్మజ్ఞానం సిద్ధిస్తుంది. అది, అమరత్వం ప్రసాదిస్తుంది పుణ్యాత్ము లయినవారి కంతకంటే పరాకాష్ఠ మరేం వుందీ ?

రాజ్యభ్రష్టుణ్ణయినే నెలాంటి అవస్థ లనుభవిస్తున్నానో అదంతా నువ్వు చూస్తూనే వున్నావు. మారాజ్యమే మేము కోరుతున్నాం, యిందులో తప్పేమిటీ? ఈప్రయత్నంలో మేమే నాశనం అయి పోదంవస్తే అది మంచిదే. ఇక్కడ రెండు పక్షా లున్నాయి. ఒకటి — మేమూ వారూ కలిసి మెలిసి వుంటూ యెవరి రాజ్యం వారు పాలిం చుకోడం. రెండు, — మేము వారి నందరినీ సంహరించి రాజ్యం అంతా భుక్తపరుచుకోడం. ఇది — ఈరెండోపక్షం క్రూరకార్యం, నాకు తెలుసు. అనార్యులూ — పైగా పరాయివాళ్ళూ అయినవాళ్ళను సంహరించడమే తప్పు కదా, మాస్వజను లయిన కౌరవులను సంహ రించడం జరిగితే అది తప్పు కాకపోతుందా ?

కౌరవులు మాకు జ్ఞాతులు. వారి పక్షంగా వున్నవారందరూ మాకు గురువులూ మిత్రులూను. వారిని సంహరించడం కంటే మరేం వుంటుందీ పాపం? కనక, యుద్ధం మంచిది కాదు. క్షత్రియధర్మం నిజంగా పాపభూయిష్ఠం; కాని మనం క్షత్రియులం. అది ధర్మ మయినా అధర్మం అయినా యుద్ధం విడిచి మరో వృత్తి అవలంబించ డానికి మన కధికారం లేదు. శూద్రులకు సేవ నిర్ణయం అయింది. వైశ్యులు వ్యాపారంచేసి జీవిస్తారు. క్షత్రియులు వొకరిని చంపి జీవి స్తారు. బ్రాహ్మలకు బిచ్చంయెత్తుకోడం స్వధర్మం. చేప చేపను చంపి బతుకుతుంది. కుక్క కుక్కని చంపుతుంది. అలాగే క్షత్రియుడు క్షత్రియుణ్ణి చంపిజీవిస్తాడు. కృష్ణా, ఇదీ, ధర్మం. ఇదంతా నీకు తెలుసు.

యుద్ధంవల్ల పగ పెరిగిపోతుంది. ప్రాణాలు కటకటపడిపోతాయి. ఏమయినా, నీతి ననుసరించి, అదే బలంగా పెట్టుకుని, నేను యుద్ధమే చేస్తాను. జయమైనా అపజయమయినా మన యిష్టానిష్టాలను పట్టి రావు. చావూ బతుకూ గూడా మన యిష్టానిష్టాలను పట్టి సంభవించవు. ఆసమయంవస్తే తప్ప సుఖమూ కలగదు, దుఃఖాలూ రావు.

ఒక్కడే యెంతోమందిని చంపుతాడు. చాలామంది కలిసి వొక్కణ్ణి చంపడమూ వుంది. వోట్టి అభాజనుడు మహాశూరుడైనవాణ్ణి చంపేస్తాడు. నామరూపాలైనివాడు పేరుప్రతిష్ఠలు కలవాణ్ణి చంపుతాడు. యుద్ధంచేస్తే విజయం ఉభయపక్షాలకూ రాదు. ఓటమీ అంతే ఉభయపక్షాలకూ కలగదు. లాభనష్టాలు కూడా అంతే. దెబ్బతిన్నవాడు మారుదెబ్బ కొట్టకుండా విడిచిపెట్టడు. చచ్చినవాడికి జయమూ అపజయమూ కూడా సమానమే. అయితే, అపజయం మరణంకంటే గొప్పదని నానమ్మకం. జయించినవాడికూడా చివరికి మరణం తప్ప దెప్పుడో వొకప్పుడు నిజమే.

కొందరు తమ ప్రభువును కూడా చంపేస్తారు. యుద్ధంలో తనకి జయమే కలిగినా, తన పుత్రులూ సోదరులూ, చచ్చిపోతే, వాడికి జీవితం అంటే విసుగూ అసహ్యమూ పుడుతుంది. ధీరులూ, హ్రీమంతులూ, ఆర్యులూ, దయాళువులూ అయినవారు యుద్ధంలో చచ్చిపోతారు. కేవలమూ అసమర్థుడైనవాడు బతికిపోడం వుంది. శత్రువులను సంహరించడమే సంభవించినా తరవాత పశ్చాత్తాపం తప్పదెవడికీ. దానికి సాయం పాపం కూడా చుట్టుబెట్టుకుంటుంది. యుద్ధంలో చావుతప్పి బయటపడ్డవాడు, కాలక్రమాన బాగా బలగం కూర్చుకుని అందరినీ నాశనంచేస్తాడు. విజయం పగపుట్టిస్తుంది. ఓడిపోయినవా డేడుస్తూ కూచుంటాడు. క్రోధానికి లొంగిపోక శాంతంగా వుండగలవాడు సుఖంగా నిద్రపోతాడు. జయమూ అపజయమూ

కూడా లెక్కలేదు వాడికి. పగవున్నవాడెందుకో వ్యాకులపడుతు దుఃఖిస్తూనే నిద్రపోతాడు, పాము వున్న యింటో లాగ.

ఎదటివాళ్ళని సర్వనాశనం చేసేవాడి కడివరలో యేమయినా కీర్తివుంటే అదంతా మలినం అయిపోతుంది. నశించిపోతుంది, చివరికి. శాశ్వతంగా అపకీర్తిన్ని వ్యాపిస్తుంది లోకం అంతటా. ఎంతకాలం గడిచినా పగ నశించదు. యుద్ధంలో ఎదటివాళ్ళకి, చంటిపిల్లవాడే మిగిలినా లోకులు గతచరిత్ర అంతా నూరిపోసి వాడికకన్ని పగ రేపెడతారు. నెయ్యిపోస్తే నిప్పు ఆరిపోదు. పైపెచ్చు భగ్గుమంటుంది. అలాగే పగవల్ల వృద్ధిపొందుతుందే గాని పగ నశించదు. పగవుంటే శాంతి కలగదు. పైగా, యెదటివాడి దగ్గిర తప్పులే కనబడతాయి. తప్పులు వెతికేవారి కదొక తెగు లయిపోతుంది, చివరికి. మిక్కిలి బలంగలవాడు, తన కీబాధ పోవా లనుకుంటే, ఆపగ అయినా విడిచి పెట్టాలి, చావనైనా చావాలి, మరో వుపాయం లేదు. కాదంటే, శత్రువులను పురుగయినా మిగలకుండా కాల్చెయ్యాలి. దాంతో రాజ్యం అంతా నిష్కంటకంగా స్వాధీను అవుతుంది; కాని, అంత మాత్రాన అది క్రూరకార్యం కాకపోదు. కనక, పగ విడిచిపెడితే కలిగే శాంతే శాంతి అనిపించుకుంటుంది.

త్యాగం లేకపోతే సంహరించడం తప్పదు. యుద్ధంచేస్తేమ్మాకూ వారికీ గూడా విజయం సందేహాస్పదమే. కాక, — మేమయినా నాశనం అయిపోతాం, వారయినా నాశనం అయిపోతారు దానివల్ల. ఇది కులానికి కులమే సర్వనాశనం అయిపోడానికి కారణం అవుతుంది. అది నాకిష్టం లేదు.

ఇలాగ, ఎంత ఆలోచించినా నాకు శాంతే మంచిదిగా కనపడుతోంది. ఆశాంతి అయినా, సంధిచేసుకోడంవల్ల కలిగే శాంతే శాంతిగా కనపడుతోంది.

సంధిపొసగకపోతే యుద్ధం తప్పనిదే. అప్పుడు పరాక్రమించడం తప్పనిసరి అయిపోతుంది. ఆపరాక్రమించడమున్నూ అతిదారుణం అయిపోతుంది. కుక్కల పోట్లాట యెలా గర్హిస్తారో పండితులు, మనుష్యుల పోట్లాటా అలాగే గర్హిస్తారు. తోక ఆడించడమూ, మొరగడమూ, పళ్ళికిలించడమూ — ఇలా వుంటుంది కుక్కల పోరాటం. వాటిలో యేది బలం కలదో అది జయించి మాంసంముక్క నోట కరుచుకుపోతుంది. మనుష్యుల యుద్ధమూ యిలాంటిదే, తేడాలే దేమిన్నీ. బలవంతులైనవారికి, బలహీనులంటే నిర్లక్ష్యభావమూ, పగా యెప్పుడూ వుంటాయి. ఇది లోకసామాన్య ధర్మం. శాంతికోరే వాడు చేతకానివాడికింద లెక్కఅవుతాడు. తండ్రీ, రాజూ, వృద్ధుడూ — అందరికీ వీరు పూజ్యులు. ధృతరాష్ట్రుడు నాకు పూజ్యుడూ మాననీయుడున్నూ. అయితే, ఆధృతరాష్ట్రునకు దుర్యోధను డంటే ప్రీతి యెక్కువ. అంచేతే అతను సంధి కంగీకరించడం లేదు.

కృష్ణా, ఇదంతా ఆలోచించి మేమిప్పుడు చెయ్యవలసిం దేమిటో చెప్పు. ధర్మంలోనూ అర్థంలోనూ మే మెవరికీ తీసిపోగూడదు. ఇది మరిచిపోవద్దు నువ్వు. ఇలాంటి స్థితిలో నిన్ను తప్పించి మరి. మేమెవరిని సలహా అడగ్గలమూ? నువ్వు మాకు ఇష్టుడవు. మాకు ప్రియమే కలగాలని కోరేవాడవు. కాక—కార్యగతులన్నీ నీకు బాగా తెలుసు. సమస్తమూ తెలిసినవాడు నువ్వు తప్ప మాకు మరొక డెవడూ లేడు"

ఇదంతా విన్నాడు కృష్ణుడు. "ధర్మనందనా, మీకోసమూ కౌరవుల కోసమూ కూడా నేను కౌరవసభకి వెడతాను. మీఅభ్యుదయానికి భంగంలేకుండా నేనక్కడ సంధిపొసగించగలిగితే పుణ్యంచేసుకున్నా నన్నమాటే. ఇంతేకాదు,—కౌరవులనూ, సృంజయులనూ, పాండవులనూ మృత్యుముఖాన పడకుండా తప్పించానన్నమాటే. ఈభూమండల మున్నూ బుగ్గిఅయిపోకుండానేను నిలపగలిగానన్నమాటే"అన్నా డతను.

"కాని" అంటూ అందుకున్నాడు యుధిష్ఠిరుడు. "నువ్వు కౌరవ సభకు వెళ్ళడం నాకు సుతరామూ యిష్టంలేదు. నువ్వెంత మంచి మాట చెప్పినా దుర్యోధనుడు వినిపించుకోడు. రాజిప్పుడు దుర్యోధనున కెదురు చెప్పలేకుండా వున్నాడు. కనకనే నువ్వు వాళ్ళమధ్యకి వెళ్ళడం నాకిష్టంలేదు. నీకక్కడ ఏమాత్రం అయినా ద్రోహం జరిగిందా — డబ్బుకాదు, దేవత్వం కాదు, సుఖంకాదు, స్వర్గరాజ్యాధిపత్యం కాదు, దేవతల ఐశ్వర్యం అంతా వచ్చినా నాకక్కరలేదు" అని చెప్పాడు, దృఢంగా.

"అలాకాదు బావా" అన్నాడు కృష్ణుడు. "నామాట విన" మన్నాడు. "దుర్యోధనుడు పాపాత్ముడు నే నెరుగుదును. అయినా, శాంతి కోసం ప్రయత్నించకపోతే లోకమూ, రాజులూ కూడా అనరాని మాట లంటారు మనల్ని. సింహం కళ్ళెర్రజేసిం దంటే తక్కిన జంతువు లన్నీ — అన్ని జాతులూ కలసినా దాని యెదట నిలవలేవు. అలాగే, భూమండలంలో వున్న రాజు లందరూ కలిసి వచ్చినా నాయెదటపడి బతకలేరు. కౌరవులు నాయెడల యేమాత్ర మైనా అనుచితంగా ప్రవర్తిస్తారా, వొక్కక్షణంలో వారి నందరినీ కాల్చేస్తాన్నేను. నేనక్కడికి వెళ్ళడం యెప్పుడూ వ్యర్థం కాదు. పైగా, మనకోరిక నెరవేరవచ్చు కూడా. కాదంటే, నింద అయినా మనమీద లేకుండా పోతుంది" అని వివరించి చెప్పా డతను.

"సరే" అన్నా డిది విని ధర్మనందనుడు. "నీయిష్టం, కౌరవసభకు వెళ్ళిరా. కృతకృత్యుడవై నువ్వు క్షేమంగా తిరిగిరావడం నేను చూస్తాను. కౌరవులతో మాట్లాడి పాండవులకు శాంతిసంపాదించుకురా. అందరూ క్షేమంగా వుండేట ట్టేర్పాటుచేసి రా. నాకూ అర్జునునకూ గూడా నువ్వు సోదరుడవు. సఖుడవు. ఇష్టుడవు. మాయెడల నీకున్న సౌహార్దం వంటి దెవరియెడలా యెవరికీ లేదు.నాకిది

భాగా తెలుసు. లోకాని కంతకూ స్వస్తికావాలి. మమ్మెల్నెరుగు దువు నువ్వు. మాశత్రువుల నెరుగుదువు. సకలధర్మాలూ యెరుగు దువు. ఎక్కడెలా మాట్లాడాలో అదీ యెరుగుదువు. ఇక కటువుగా మాట్లాడ్డమో, మెత్తగా మాట్లాడ్డమో అది నువ్వే చూసుకో. ధర్మమే ప్రధానంగా భావించి మాకు సుఖంకలిగేటట్టు మాత్రం మాట్లాడు" అని విన్నవించుకున్నా డతను, చివరికి.

# 73

## "యుద్ధం తప్పదు"

"బావా" అంటూ ప్రారంభించాడు కృష్ణుడు. "సంజయుని మాటలూ విన్నాను, నీమాటలూ విన్నాను. నీఉద్దేశాలతో పాటు కౌరవుల ఉద్దేశాలూ నే నెరుగుదును. అయితే, నీబుద్ధి ధర్మం అనుసరించి వుంటే, వారి బుద్ధి పగ ననుసరించివుంది. యుద్ధం అనే మాట లేకుండా, శాంతంగా బతకడంలో యేది లభిస్తే అదే చాలని నీఅభిప్రాయం; కాని క్షత్రియధర్మం కాదిది. కనక, క్షత్రియు డైనవాడు చెయ్యవలసిన పని కాదు. క్షత్రియుడు బిచ్చంయెత్తు కుంటూ బతకరా దని చెబుతారు మహర్షులు. గెలవడమూ ఓడి పోడమూ అది వేరే సంగతి — యుద్ధం చెయ్యడమే క్షత్రియు డైన వాడికి స్వధర్మం. బ్రహ్మదేవు డిది యిలా నిర్ధారణ చేశాడు. "అయిదూళ్ళయినా చాలు, దయచెయ్య" మని నువ్వు అడగడం ఈధర్మానికి విరుద్ధం. దీనంగా బతకడం మంచిది కాదు. సాధ్యమున్నా కాదు. కనక విక్రమించు. శత్రువులను నాశనం చేసెయ్యి

కౌరవులు మిక్కిలీ లోభులు. చిరకాలంగా యెంతమందితోనో చెలిమిచేసుకుని వున్నారు. ఎందరితోనో కలిసి మెలిసి వుంటున్నారు.

మిత్రులనున్నూ చాలామందిని సంపాదించుకునివున్నారు. బలగాలూ బాగా పెంచుకున్నారు. వారెన్నటికీ నిన్ను తమతో సమానుడ వని అంగీకరించరు. అలా వారి నంగీకరింపచెయ్యడాని కుపాయాలూ లేవు. భీష్ముడూ, ద్రోణుడూ, కృపుడూ—ఇలాంటి వారిని చూసుకుని తాము మిక్కిలీ బలవంతుల మని భావించుకుంటున్నారు వారు. ఎంత కాలం నువ్వు మెత్తమెత్తగా వారి వెంట తిరుగుతావో అంతకాలమూ నీరాజ్యం హరించి వా రనుభవిస్తూనే వుంటారు. ధర్మమూ అర్థమూ గుర్తించీ, దయతలిచీ, నీ దైన్యం చూసీ కూడా వారు నీకోరిక తీర్చరు. అంతకాలం నువ్వు వనవాసాదిక్లేశా లనుభవించినా వారు పశ్చాత్తాపం కనపరచకపోడాని కిదీ కారణం, ముఖ్యంగా.

జూదంలో మోసంచేసి దుర్యోధనుడు నిన్నోడించాడు. భీష్ముడూ, ద్రోణుడూ, విదురుడూ, సాధువులూ, బ్రాహ్మలూ, ధృతరాష్ట్రుడూ నగరవాసులూ, కౌరవముఖ్యులూ—ఇంతమందీ చూస్తూ వుండగానే నిన్ను మోసంచేశా డతను. పోనీ, నువ్వేమయినా సామాన్యుడివా? దానధర్మాలు చెయ్యడంలో నీఅంతవాడులేడు. మిక్కిలీ మృదువరివి, కఠినుడవు కావు. దాంతుడవు. ధర్మం తప్పనివాడవు, కలిసి మెలిసిన్నీ వుంటున్నవాడవు. అలాంటి నిన్నే మోసం చేశా డతను. క్రూరు డతను, నీకింతచేసిన్నీ సిగ్గుపడటంలేదు. అలాంటివాడిమీద నీకింత మమకారం యేమిటయ్యా? లోకాల కన్నిటికీ గూడా కౌరవులు వధ్యులే. నీకున్నూ వధ్యులని వేరే చెప్పవలసిన పనే లేదు.

"నాది" అన్నది లేశమూ లేదు పాండుపుత్రులకు. వారికి నామరూపాలూ గోత్రప్రవరలూ కూడా మిగలవు. పరాభవమున్నూ తప్పదు. చివరికి నాపాదా లాశ్రయించుకుని బతకడం తప్ప వేరే గతిలేదు వారికి"—ఇది మీమొదల వారికిగల విశ్వాసం, ఇలా నిన్నూ నీసోదరులనూ నిందిస్తూ, దూషిస్తూ, తననీ తన తమ్ములనూ పొగడు

కుంటున్నాడు దుర్యోధనుడు. ఆవేళ, మాయాజూదంనాడు, పాపాత్ము డైన దుశ్శాసనుడు, జుట్టుపట్టుకుని ద్రౌపదిని కౌరవసభ కీడ్చి తెచ్చాడు. ఆమె యెంతగోలపెడుతున్నా విడిచిపెట్టలేదు. పైగా "ఆబెయ్యా, ఆబెయ్యా" అంటూ పరిహాసం కూడా చేశాడు. ఆచెయ్యడంలో, భీష్ముడూ, ద్రోణుడూ, కృపుడూ మొదలైనవా రందరూ చూస్తూ వుండగా చేశాడిదంతా, సాటిలేని బలపరాక్రమసంపన్నులు నీతమ్ము లప్పు డక్కడే వుండీకూడా వద్దని నువ్వు వారించడంవల్లా, సహజంగా ధర్మానికి కట్టుబడిపోయివుండీ కిక్కురుమనలేకపోయారు. మీా రడవులకు వెళ్ళిపోయాక, తన జ్ఞాతుల యెడల యిదంతా మళ్ళీమళ్ళీ చెబుతూ తన్ను తాను పొగడుకునేవాడు దుర్యోధనుడు.

అప్పు డక్కడ వుండినవారు, ఏపాపమూ యెరగని నిన్ను చూచి గద్గదకంఠులై యెంతో విచారించా రందరూ. రాజులూ, బ్రాహ్మలూ అందరూ దుర్యోధనుణ్ణే నిందించారు. నిందించడమూ సంహారించ డమూ—ఈ రెండింటిలోనూ సత్కులంలో పుట్టిన వాడికి సంహారించడమే మంచిది. నిందవల్ల జీవితం అంతా భగ్నం అయిపోతుంది మరి. రాజు లందరూ నిందిస్తూ వుండగా సిగ్గులేకుండా తిరిగేవాడు అప్పటికప్పుడు చచ్చిపోయినవాడికిందే లెక్క. వాణ్ణి చంపడాని కేమంత ప్రయత్నం అక్కర లేదు. కనక, నీకిక ఆలోచన వద్దు. దుర్యోధనుణ్ణి నాశనం చేసెయ్యి. భీష్మునకూ ధృతరాష్ట్రునకూ మాటిమాటికి నువ్వు పాదా భివందనాలు చేస్తావే. అది చాలా తప్పని నానమ్మకం. నేను కౌరవ సభకు వెళ్ళి, దుర్యోధనుడు మంచివాడా చెడ్డవాడా అని తటపటా యించేవారి సందేహా లన్నీ పటాపంచలు చేసి చెడ్డవా డన్న నమ్మకం కలిగించేస్తాను. అక్కడ, నేను, సర్వసాధారణాలూ నీసద్గుణాలూ, వాని దుర్గుణాలూ యేకరువుపెట్టేస్తాను. నామాటలు విన్నవా రందరూ,

సత్యవాది వనీ, ధర్మాత్ముడ వనీ నిన్నేకగ్రీవంగా పొగడుతారు. నీయెడల ఆదరగౌరవాలున్నూ యెక్కువగా కనపరుస్తారు. దుర్యోధ నుణ్ణి "లోభి" అని బాగా గర్హిస్తారు.

నువ్వు శాంతే కోరుతున్నావు. కనక, నీమీద అక్కడ ప్రతికూల భావం యెవరికీ కలగదు. రాజు లందరూ ధృతరాష్ట్రుణ్ణీ కౌరవులనూ గూడా నిందిస్తారు. లోకు లందరూ దుర్యోధను డంటే ప్రాతికూల్యం వహిస్తే — ఈవిధంగా అతను హాతు డయిపోతే యిక మిగిలే దేమి వుంటుందీ ? కనక, నీకేమీ నష్టంకలక్కుండా చూస్తాను. కౌరవుల నందరినీ తృప్తిపరుస్తాను. వారి వుద్దేశా లన్నీ పూర్తిగా గ్రహిస్తాను. దుర్యోధనుని యుద్ధసన్నాహా లన్నీ వివరంగా తెలుసుకువస్తాను, నీకు జయం సిద్ధింపజెయ్యడానికి.

ఎటు చూసినా, ఎంత ఆలోచించినా యుద్ధం తప్ప దనే తోస్తోంది నాకు. అందుకు తగ్గ సూచనలే కనపడుతున్నా యన్నీ. సాయంకాలం కాగానే పిట్టలూ మృగాలూ ఘోరంగా కూస్తున్నాయి. గుర్రాలూ ఏనుగులూ వికటంగా కనబడుతున్నాయి. అగ్ని రంగురంగులుగా మండుతోంది. ఆరంగు లన్నీ చాలా ఘోరంగా వున్నాయి. ఈఘోరా లన్నీ చూస్తే జనక్షయం తప్ప దనిపిస్తోంది. జనులను సంహారించడానికి యము డీరూపంగా బయలుదేరాడు, సందేహం లేదు. రథాలూ, గుర్రాలూ, యేనుగులూ, కవచాలూ, ఆయుధాలూ దండిగా సమకూర్చుకునీ, సర్వసిద్ధంగా వుండాలి, అప్రమత్తు లయి. కనక, నువ్వున్నూ యుద్ధానికి కావలసినవన్నీ పుష్కలంగా సమ కూర్చుకో. ఆదిలో నీకున్న రాజ్యం అంతా — మాయజూదంలో నిన్నోడించి తాను గెలుచుకున్న రాజ్యం అంతా తాను బతికివుండగా మాత్రం దుర్యోధనుడు నీకివ్వడు. నమ్ము"

# 74

## ప్ర స న్న భీ మ ం

"మధుసూదనా, కౌరవులతో మనకు సంధి అయేటట్టే మాట్లాడు. యుద్ధంపేరు చెప్పి వారిని కంగారుపెట్టవద్దు" అంటూ ప్రారంభించాడిది విని భీమసేనుడు.

"దుర్యోధనుడు వో—ట్టి కోపిష్ఠి. దీర్ఘక్రోధి. శ్రేయోద్వేషి. అతనికి రోషం ఎక్కువ. కనక, అతనితో కఠినంగా మాట్లాడకు, సామోపాయం అవలంబించే వ్యవహారం నడిపించు. సహజంగా పాపాత్ముడతను. రాక్షసులదీ అతనిదీ చిత్తవృత్తి వొకటే. ఐశ్వర్యంతో బాగా మదించివున్నాడు. మాతో మొదణ్ణుంచీ విరోధంపెట్టుకునే వున్నాడు. తొందరపాటెక్కువ. అతినిష్ఠురుడు. ఓపాటిపరాక్రమం వున్నవాడే; గాని మిక్కిలీ క్రూరుడు. దీర్ఘకోపం అతనిది. మంచిమాటలు వినిపించుకునేరకం కాదు. గర్విష్ఠి. చావడాని కయినా యిష్టపడతాడు; గాని తన మతం మాత్రంమార్చుకోడు. అలాంటివాడితో మెత్తగా మాట్లాడ్డం మంచిది కాదు, తెలుసు. స్నేహితులైన వారికిన్నీ యెప్పుడూ వ్యతిరేకంగానే నడుచుకుంటూడతను. ధర్మం యెప్పుడో విడిచి పెట్టేశాడు. అసత్యం అంటే మహాయిష్టం అతనికి. మిత్రులకు మాట కొట్టెయ్యడమే కాదు, మనసూ నొప్పిస్తాడు. సహజంగా దుష్టుడు కనక, పాపప్పను అంటే జంక డెప్పుడూ. గడ్డిలోనూ గాదంలోనూ దాగిన తాచుపాముంటే సరిపోతుందతనికి.

దుర్యోధనుని శీలం యెలాంటిదో, స్వభావం యేమిటో, బలపరాక్రమా లేపాటివో, అతని సైన్యమున్నూ యేలెక్కలోదో నీకెప్పటికప్పుడే యెరుక. వెనకటికి, కౌరవులు చాలామంచివారు. వాళ్ళూ వారిబిడ్డలూ మేమూ బాగా కలిసిమెలసి సంతోషంగా వుండేవాళ్ళం.

దుర్యోధనుని క్రోధంవల్ల, వేసవిలో అడవు లన్నీ బుగ్గిఅయిపోయే టట్టు ఆకౌరవు లందరూ నాశనం అయిపోతారు, తప్పేటట్టు లేదు.

హైహయుల్లో ముదావర్తుడూ, నీపుల్లో జనమేజయుడూ, తాళ జంఘుల్లో బహులుడూ, కృముల్లో ఉద్ధతవసువూ, సువీరుల్లో అజ బిందువూ, సురాష్ట్రుల్లో రుషర్ధికుడూ, బలీహుల్లో అర్కజుడూ, చీనుల్లో ధౌతమూలకుడూ, విదేహుల్లో హయగ్రీవుడూ, మహౌజుల్లో వరయుడూ, సుందరవంశుల్లో బాహుడూ, దీప్తాక్షుల్లో పురూరవుడూ, చేదిమత్స్యుల్లో సహజుడూ, ప్రవీరుల్లో వృషధ్వజుడూ, చంద్ర వత్సుల్లో ధారణుడూ, ముకుటుల్లో విగాహనుడూ, నందివేగుల్లో శముడూ — ఈపదిహేడుగురూ, వెనకటికి, తమతమ వంశాలు సహా లంగా నాశనంచేసుకున్న రాజులు. వీరి సంఖ్య పద్దెనమండుగురు. ఆసంఖ్యాపూర్తిచేసేవాడు దుర్యోధనుడు. అంచేతే, కౌరవుల సర్వ నాశానికి మార్గాలు వేస్తున్నా డతను.

దుర్యోధనుడు నీచు డంటే చాలదు. కౌరవకులాని కంతకూ అతను నిష్ఠురవ్వ. పరమపాపి. అంచేతే, అతనితో మృదువుగానూ మెల్లిగానూ మాట్లాడమంటున్నాను. ఆ మాట్లాడ్డంలో ధర్మార్థాలు మాత్రం మరిచిపోకు. కృష్ణా, మాభరతవంశానికి వినాశంతప్పేటట్టుంటే మేమతని చేతికిందే బతుకుతాము. అత ణ్ణనుసరించే తిరుగుతాము. మేమూ కౌరవులూ కలిసిమెలిసి వుండకపోతే మానె, ఎవరికి వారుగా నైనా శాంతంగా బతికేటట్టు చూడు. కురుకులాని కేలాంటి విపత్తూ రాకుండా చూడు. వృద్ధుడైన తాతనీ, అక్కడి సభాసదుల నందరినీ మేమడిగా మని చెప్పు. మాసోదరుల కందరికీ సౌభ్రాత్రభావం కలగా లని మేము కోరుకుంటున్నా మని చెప్పు. దుర్యోధనుణ్ణి శాంతించ మను. ఇవి నామాటలు. మాఅన్న యుధిష్ఠిరు డంగీకరించేవే

యివి. అర్జును డైనా యుద్ధం చెయ్యాలనుకోడం లేదు. అతని అంత దయాళువు ప్రపంచంలో మరొకడు లేడు"

# 75

## కృష్ణుడు భీముణ్ణి రెచ్చగొట్టడం

ఇది వినేటప్పటికి నవ్వు వచ్చింది కృష్ణునికి, కాని నిగ్రహించుకున్నాడది. భీముడింత మృదువుగా మాట్లాడ్డం యెప్పుడూ లేదు మరి. పర్వతం బెండులాగ తేలిక అయిపోయినట్టూ, మంచుగడ్డలాగ అగ్ని చల్లబడి పోయినట్టూ వుందతని కిది. అపాయకరమైన సన్నివేశం యిది. వాయువు సుడితిరిగి అగ్నిని భగభగమనిపించేటట్టు, కరుణమూర్తి భవించినట్టు కూచునివున్న భీముణ్ణి రెచ్చగొడుతూ యిలా ప్రారంభించాడతను.

"బావా, యుద్ధం అంటే పొంగి పోయేవాడివి నువ్వెప్పుడూ. ఒకళ్ళని చంపడానికే చూస్తాడు దుర్యోధనుడు, అతణ్ణి చితకబొడవాలనిన్నీ అనేవాడివి నువ్వు. నిద్రా కాకుండా, మెళుకువా కాకుండా బోర్లాపడుకుని "చితక బొడిచేస్తాను. నరికికేస్తాను. చించిచెండాడేస్తా" నంటూ వుండేవాడివి రోషంతో పళ్ళుకొరుక్కుంటూ. కోపం తగ్గించుకోలేక పొగలుకక్కే అగ్నిలాగ వేడినిట్టూర్పులు విడిచిపెట్టేవాడి వెప్పుడూ. బరువులుమోసిమోసి బడలిపోయిన నాదారుమనిషిలాగ నిట్టూరుస్తూ పడుకునిన్నీ వుండేవాడివి. కొందరు నువ్వు పిచ్చివాడవయిపోతున్నా వనుకోడమున్నూ వుంది. నువ్వు నడిస్తేభూమి అదిరిపోయేది. చెట్టూపుట్టా పెళ్ళగిల్లిపోయేవి. అరణ్యాల్లో వున్నప్పుడు ఏకాంతంగా కూచునేవాడివి; గాని బ్రాహ్మలు వచ్చినా సరిగా చూసేవాడివి కావు. రాత్రీపగలూ కూడా నవ్వన్నది మరిచిపోయి వుండేవాడివి. ఏడుస్తూ, ఉన్నట్టుండి నవ్వుతూ కళ్ళు మూసుకుని తల మోకాళ్ళమీద ఆనుకుని వుండేవాడివి తరుచు. బొమలు ముడిపెట్టి

బొడు కరుచుకుంటూ కోరచూపులు చూసేవాడివి, నాకు తెలుసు. అందుకు కౌరవులమీద కోపమూ కసీ తప్ప మరో కారణం యేమీ లేదు. తన ప్రచండసహస్రకిరణాలతో దిక్కులు వెలిగిస్తూ సూర్యుడు తూర్పున ఉదయించడమూ, చల్లని కిరణాలతో పశ్చిమాన అస్తమించడమూ ఎంతసత్యమో, నాగదతో సేనాపాపిష్టిదుర్యోధనుణ్ణి చావమోదడమూ అంతే సత్యం" అంటూ నీఅన్నదమ్ముల మధ్య కూచుని వున్నట్టే వుండి గభీమని యెగసిపడి పరవళ్ళు తొక్కే వాడివి.

అనువ్వే సంధి కావా లనడమూ యిప్పుడు ? యుద్ధం చెయ్యాలని యెంత ఆవేశం కలవారి కయినా చివరికి, అది తటస్థించాటప్పటికి బుద్ధు లిలా తల్లక్రిందు లయిపోతాయి కామోసు. అయితే, వైపరీత్యాలు జరుగుతున్నట్టేమయినా కలగన్నావా బావా నువ్వు ? నీమనస్సంతా చెదిరిపోయింది. అంచేతే. నువ్విలాగ పేడితనం చూపించుకుంటున్నావు. నీహృదయం కలుషం అయిపోయింది. నీ కూరుస్తంభ వ్యాధి వచ్చింది. కాక, — మనిషి మనస్సు చంచలం, బూరుగుదూది లాగ మీాది కెగురుతూ కిందికి పడుతూ వుంటుంది. ఆవు అరుపులాగ నీబుద్ధి వికృతం అయిపోయి, పాండవులను శోకసాగరంలో ముంచేస్తోంది తెలుసా ? మాటలు చూస్తే బెండ్లయి కొండలు నడిచిపోతున్నంత వింతగా వుంది నాకు.

ఓయి వెర్రి భీమసేనా, నువ్వింతవరకూ ఏమిచేశావో జ్ఞాపకంచేసుకో. లే. విషాదం కట్టిపెట్టి ధైర్యంగా — స్థిరంగా నిలవబడు. నువ్విలా వాడిపోడం బాగాలేదు, క్షత్రియు డైనవాడు తన స్వభుజాబలంతో సంపాదించుకున్నదే గాని అనుభవించ డెప్పుడూ, మరి "

## 76

## "ప్రచండ భీమం"

కొరడాకొస తగిలినట్టయింది భీమసేనునకు దీంతో. సహజంగా ముక్కోపి అతను. రోషం కూడా యెక్కువ తనికి. కనక, జాతిగల గుర్రంలాగ యెగిసిపడి పరవళ్ళు తొక్కుతూ అందుకున్నాడు.

"బావా, నేనొకటిచెయ్యబోతే నువ్వొక టనుకుంటున్నావు. నామనోనిశ్చయమూ, యుద్ధంలో నాబలపరాక్రమా లెలా వుంటాయో అదీ నువ్వెరుగుదు వనుకోనా, పడవయెక్కినవాడు నదిలోతు గుర్తించలేనట్టు, చిరకాలంగా నాతో కలిసిమెలసి వుంటూకూడా నాసంగతి నువ్వు గుర్తించలేకపోయా వనుకోనా? నేను భీమసేనుణ్ణని తెలిసినవా డెవడైనా యిలా మాట్లాడతాడుటయ్యా?

"ఇదిగో, నేను స్పష్టంగా చెబుతున్నాను విను. నాబలపరాక్రమాలకూ నాపౌరుషానికీ సాటిలే వెక్కడా; కాని ఆత్మస్తుతి మంచిది కాదు. అది ఆర్యు లయినవారికి తగింది కానేకాదు. కాని, నువ్వనరాని మాట లన్నావు కనక నాసంగతి నేను చెప్పుకోవలసి వస్తోంది. ఈభూమ్యంతరిక్షా లున్నాయి చూడూ, ఇవి జనులకు నివాసాలు. అచలా లివి, కదిలేవి కావు. వీటి కంతమున్నూ లేదు. ప్రాణికోటి కంతకూ యివి తల్లివంటివి. ఏకారణంవల్లనైనా యివి రెండూ కోపించి రాతిముక్కల్లాగ వొకదాంతో వొకటి ఢీకోడానికి చూస్తే నారెండుచేతులతోనూ రెండూ పట్టుకుని ఆపేస్తాను, తెలుసా? ఇదిగో, నారెండు చేతులూ చాపాను, చూశావా? ఎలాంటివా డయినా సరే వీటి మధ్య చేరుకున్నాడా, మరి, వాడి పని అంతే, విడుపించుకోలేడు. హిమవంతుడూ, సముద్రుడూ, ఇంద్రుడూ — ఈముగ్గురూ కలిసికూడా నాచేతుల్లో పడ్డవాణ్ణి రక్షించలేరు. దుర్యో

ధనుని పక్షంగా మాతో యుద్ధంచెయ్యడానికి వచ్చిన రాజుల నందరినీ వేలబెట్టి అరికాళ్ళతో రాసేస్తాను, చూసుకో. ఇప్పటికే నేనెందరు రాజులనో లొంగతీసివున్నా న్నువ్వెరగవు కామోసు నది.

పుండుకెలికినట్టు కానిమాట లని నన్నాక్షేపిస్తున్నావు నువ్వు, ఇదిగో యుద్ధం వస్తోంది, నువ్వే చూస్తావు నాసంగతి. ఏనుగులనూ, గుర్రాలనూ, రథికులనూ, కాల్బంట్లనూ నాశనంచేసేస్తాను. పేరుపడ్డ మొనగాళ్ళను వెతికివెతికి యేరియేరి కొడతాను, తొందరపడకు. కృష్ణా, నాకు కాళ్ళు లాగడంలేదు. నామనస్సు వొణికిపోడంలేదు. లోకా లన్నీ విరిగిమీదపడ్డా నాకేమీ భయంలేదు. ప్రాణికోటి నిష్కారణంగా నాశనం అయిపోతుందే అన్న దయతో నేనలా అన్నానే గాని చేవలేకకాదు. భరతవంశం క్షేమం కోరినీ సంధి చెయ్యమన్నానే గాని కౌరవులకు జడిసికాదు"

## 77

## అనుకున్నంతా అయింది

"కోప్పడకు బావా" అన్నాడు కృష్ణుడు, చిరునవ్వునవ్వుతూ చెయ్యిపట్టుకుని.

"నీవుద్దేశం పూర్తిగా తెలుసుకుందా మని తప్ప, నిన్నాక్షేపించా లనీ, నాపాండిత్యం అంతా చూపించుకుందా మనీ, క్రోధం పెట్టుకునీ నిన్నన్న మాటలు కావు నావి. నిన్ను నిందించడాని కన్న విన్నీ కావవి. నీశౌర్యధైర్యాలూ, నీబలపరాక్రమాలూ నే నెరుగుదును. నువ్విదివరలో చేసివున్న సాహసకృత్యాలూ మరిచిపోలేదు నేను. నిన్ను పరాభవించా లని నాకెప్పుడూ లేదు, నమ్ము. నీశక్తి నువ్వనుకుంటున్నదానికంటే యెక్కువ అని నేననుకుంటున్నాను. నీవంశం చాలా గొప్పది. ఎంతగొప్పదంటే, రాజాధిరాజులైనవారున్నూ

పూజించిన వంశం అది. స్నేహితులే కాదు, బంధువు లైనవారు కూడా పూజించిన వంశం అది. ఆవంశానికి తగినవాడవు నువ్వు.

పురుషకారం బలమైనదా, దైవం బలమైనదా అంటే, యెలాంటి వాళ్ళూకూడా నిర్ధారణ చెయ్యలేకుండా వున్నారు. బాగా ఆలోచించుకుని, సన్నాహాలున్నూ పూర్తిగా సమకూర్చుకుని ఎంత పురుషకారం చూపించినా, దైవం అనుకూలం కాక ఆపని చెడిపోవచ్చు. దైవం అనుకూలంగా వుండినా, పురుషకారం తక్కువయితే అదీ చెడిపోవచ్చు. కనక దైవం సంగతి మరిచిపోవాలి. శక్తికొద్దీ ప్రయత్నించాలి. చలీ, వేడీ, వర్షమూ, ఆకలిదప్పికలూ — ఇవి దైవికాలయినా, పురుషుడు శక్తికొద్దీ ప్రయత్నించి వాటికి ప్రతి క్రియ చేసుకుంటున్నాడు. కనక, పురుషకారం ప్రధానం. ఇది గుర్తించినవాడు పనిచెయ్యడమే పెట్టుకుంటాడు. అది ఫలించకపోతే కుంగిపోడు, ఫలిస్తే పొంగిపోడు.

నేను చెప్పవచ్చిం దేమిటంటే? యుద్ధంలో విజయం యెవరిదో యెవరూ నిర్ధారణచెయ్యలేరు. ఉత్సాహం ఎప్పుడూ పోగొట్టుకోగూడదు. విచారిస్తూనూ కూచోగూడదు. నేను రేపే ధృతరాష్ట్రుని దగ్గిరకి వెళ్ళి, మీకు నష్టం లేకుండా సంధిచెయ్యడానికి ప్రయత్నిస్తాను. వారు సంధి కంగీకరిస్తారా, నాకు మాటా తక్కుతుంది, కీర్తి వస్తుంది, మీకూ కోరిక సిద్ధిస్తుంది, వారికి శ్రేయస్సూ కలుగుతుంది. అలా కాక, వారు, తాబట్టిన కుందేటికి మూడేకాళ్ళన్నట్టు తమ పంతమే నెగ్గాలని కూచుంటారా, యుద్ధం తప్పదు. దానివల్ల అనేక ఘోరాలు జరుగుతాయి.

భీమసేనా, ఒకటి చెబుతాను, బాగా విను. ఈయుద్ధంలో భారం అంతా నీది. నిర్వాహణం అంతా అర్జునునిది. అంటే, నువ్వు రథం వంటివాడవు. అర్జునుడు గుర్రంవంటివాడు. నేనో అంటావా? అర్జు

నునకు సారథి నయి వుంటా న్నేను. ఇది అర్జునుని కోరిక. నామ ట్టుకి యుద్ధంఅంటే సుతరామూ యిష్టంలేదు. అంచేత, నీఅంతర్యం తెలుసుకోడానికే అలా అన్నాను, మరొకందు క్కాదు. నీశౌర్యం రగులుకుంది, నా క్కావలిసిం దది"

# 78

## "చేసిరా. చెయ్యవలసింది చెప్పు"

అర్జును డందుకున్నాడు "ప్రభూ" అంటూ. "చెప్పవలసిం దంతా మాపెద్దన్న చెప్పాడు. కాని, నీధోరణి చూడగా, సంధి పొసగుతుం దని నీకు నమ్మకం లేనట్టు కనపడుతోంది. అటు ధృతరాష్ట్రుని లోభమూ — ఇటు మాదీనత్వమూ — దీంతో వారు సంధి కంగీక రించకేపోవచ్చు. అయినా, పురుషప్రయత్నం ఫలించ దనుకున్నా, నువ్వు పనిచేసేతీరాలి. లేకపోతే, ఫలితం లేకపోడమే కాదు, ఫలిస్తుం దన్న ఆశకూడా వుండదు. కనక, ఫలం కలగనీ మాననీ, మనిషి, పనిచేస్తూనే వుండాలి. శ్రద్ధగా పనిచేస్తే ఫలమూ కలుగుతుంది.

కృష్ణా, ఇంతకీ, నువ్వక్కడ యేమి చెబుతావో యేమి చేస్తావో మరి, సంధి పొసగేటట్టు మాత్రం చూడు. ఏమంటే? సురలకూ అసురులకూ ప్రజాపతి లాగ, మాకూ కౌరవులకూ గూడా నువ్వు ప్రధానస్నేహితుడవు. మాకు లాభం వుండేటట్టు చూడ్డం నీకసాధ్యం అనుకో న్నేను. నువ్వేంచేసినా అది మంచిదే అవుతుంది. నువ్వక్క డికి వెళ్ళడమే మంచి దసలు. దుర్యోధనుని విషయమై నువ్వేది చెయ్యదలుచుకుంటే అది అలాగే అవుతుంది. వారితో సంధి కుదరనీ కుదరకపోనీ నీకేది యిష్టమో మాకూ అదే యిష్టం. ఏమయినా, పుత్రమిత్రబంధువులతో దుర్యోధనుడు నాశనం అయిపోడం మంచిది కాదు.

ధర్మనందనుని సిరిసంపదలు చూసి దుర్యోధనుడు సహించలేక పోయాడు. అవి హరించడానికి ధర్మబద్ధ మైన ఉపాయం కనపడలే దతనికి. అంచేతనే మాయాజూదం కల్పించి, మిక్కిలీ క్రూరమూ అను చితమూ అయిన ఉపాయం అవలంబించాడు — చివరకి హరించాడు. క్షత్రియుడై పుట్టి విలుకాడున్నూ అయివుండినవా డెనడూ కూడా, ప్రాణాపాయమే కలగనీ, జూదానికి రమ్మంటే వెళ్ళకుండా వుండడు. మమ్మల్ని వంచించడమూ, అడవులకు పంపడమూ చూస్తే, మేము దుర్యోధనుణ్ణి సంహరించక తీరదు. మిత్రుల మైన మాకోసం సంధి చెయ్యడానికి నువ్వు బయలుదేరడం వింతేమీ కాదు. అక్కడికి వెళ్ళి, మెత్తమెత్తగా మాట్లాడతావో, కఠినంగా మాట్లాడతావో, సంహారమే చేస్తావో అంతా నీయిష్టం. దానికోసం నువ్వేమీ విచారించవద్దు.

ఆదురాత్ముడు సభలో ద్రౌపదిని అవమానించడమూ, నీచంగా ప్రవర్తించడమూ నువ్వెరుగుదువు. చవుటిపఱ్ఱలో విత్తనాలు చల్లితే అవి మొలకలెత్తవు. అలాగే, నువ్వేమి చెప్పినా, పాండవుల విషయమై దుర్యోధనుడు మంచిగా ప్రవర్తించడు. కనక, ఏది ధర్మం అను కుంటావో నువ్వు, ఏది మాకు శ్రేయస్కరం అనుకుంటావో వెళ్ళి అది చెయ్యి. తరువాత చెయ్యవలసిం దేమిటో కూడా నువ్వే చెప్పాలిమాకు.

## 79

### "ఏమి కానీ, ప్రయత్నిస్తాను"

"నువ్వు చెప్పినట్టేచేస్తా" నన్నాడు కృష్ణుడు. "పాండవులకూ కౌరవులకూ కూడా నేను శ్రేయస్సేకోరతాను. సంధి పొసగడమో యుద్ధం తప్పకపోడమో — యిదంతా నాచేతిలో వుంది. క్షేత్రం పరిశుద్ధమే అనుకో. సారవంతమూ అనుకో. దుక్కి మొదలైనవన్నీ బాగానే జరిగా యనుకో; కాని వర్షం పడకపోతే మాత్రం పంటపండ దెప్పుడూ. పండా

లంటే నీరు పారించా లాపొలాన. అదే పురుషకారం. అంటే అది సాధనం. అయినా, సస్యం యెండిపోతుందనుకో. అది దైవయోగం. అంచేతనే మనుష్యప్రయత్నమూ దైవయోగమూ సమకూరితే గాని ఫలితం కలగ దనీ, ఇదే లోకతంత్రాని కంతకూ కారణ మనీ మహాత్ములు చెప్పారు వెనకటికి.

నేను నాశక్తివంచన లేకుండా మనుష్యప్రయత్నం చేస్తాను. దైవం మాత్రం నాకు సాధ్యం కాదు, అంతే. దురాత్ముడైన దుర్యోధనుడు ధర్మమూ విడిచిపెట్టాడు, లోకతంత్రమూ విడిచిపెట్టాడు. అలా చేసినందుకు పశ్చాత్తాపం కూడా లేదతనికి. సహజంగా దుర్యోధనుడే యిలా వుండగా, అతని మంత్రులు శకునీ, కర్ణుడూ, దుశ్శాసనుడూ అతని పాపిష్ఠిబుద్ధికే దోహదం చేస్తునారు. కాగా, దుర్యోధనుడు, సర్వనాశనం పొందడానికైనా యిష్టపడతాడు; గాని మీకు మాత్రం రాజ్యంలో భాగం యివ్వడు. పోనీ ధర్మనందనుడో అంటే సంధి చేసుకోడాని కయినా యిష్టపడతాడు గాని, రాజ్యంలో భాగం మాత్రం వదులుకోడు.

ఏమయినా, ధర్మనందనుడు, అయిదూ ళ్ళయినా మాకిస్తే చాలు నన్నమాట అక్కడ ప్రయోజనకారి అవుతుందని తోచదు నాకు. పాపాత్ముడా దుర్యోధను డందుకూ అంగీకరించడు. అప్పుడు, యుద్ధమూ తప్పదు, కౌరవుల సర్వనాశమూ తప్పదు. మీకే కాదు, నాకూ లోకానికీ గూడా సంహరించదగ్గవాడే కాని దుర్యోధనుడు విడిచిపెట్టతగినవాడు కాడు.

చిన్నప్పుడు మిమ్మెంతో బాధపెట్టా డతను. మీరాజ్యం హరించాడు. యుధిష్ఠిరుని సిరిసంపదలు చూసి యెప్పుడూ కూడా వోర్చలేడతను. అలా జరగలేదు గాని, మీకూ నాకూ పోరుపులు పుట్టించ్చాలనీ చూశా డతను, చాలామాట్లు. అతని దుష్టద్వేషా లెప్పటికప్పుడే

నేను సాగనివ్వలేదు. అతని ధోరణీ నీకు తెలుసు, నేను ధర్మనందను నకు శ్రేయస్సు సాధించిపెట్టా లని తంటాలుపడ్డమూ నీకు తెలుసు. మరి, నేను సంధి పొసగేటట్టు చెయ్యా నని యెందు కయ్యా అనుమా నిస్తావూ? భూభారం తగ్గించా లన్న వూహతో దేవతలు భూమ్మీద అవతరించివున్నా రన్న సంగతి నీకు తెలుసు, ఈస్థితిలో సంధి యెలా పొసగుతుందీ? అయితే, మాటలతోనూ చేతలతోనూ గూడా చెయ్య గలిగిన దంతా చేస్తాను. ఇందులో మాత్రం లో టేమాత్రమూ రానివ్వను; కాని సంధి పొసగుతుం దన్న నమ్మకం మాత్రం లేదు నాకు.

ఉత్తరగోగ్రహణసమయాన, అజ్ఞాతవాసం పూర్తయిందా లేదా అన్న ప్రశ్న వచ్చినప్పుడు, క్షణకాలాలూ లవకాలాలూ తక్కువ అయినా వొప్పుకో నన్నాడు దుర్యోధనుడు. భీష్ముడు నిక్కచ్చిగా చెప్పాడు చెల్లిపోయిం దని. పైగా, ఎంతో హితబోధచేశాడు. సంధిచేసుకో మనిన్నీ మహాచెప్పాడు. అయినా దుర్యోధనుడు వినిపించుకోలే దది. అప్పుడే కాదూ "వీళ్ళని సంహరించడం తప్ప" దని నువ్వు స్థిరపరుచుకున్నావూ?

ఇక వొక్కటే వుంది నాకు. ధర్మనందను డాజ్ఞాపించాడు, కనక, నేనక్కడికి వెళ్ళి సంధిప్రయత్నాలు చెయ్యవలసిందే. దాంతోపాటు, దుర్యోధనుడు చేసిన పాపపుపనుల సంగతిన్నీ ఆలోచించవలసిందే"

## 80

### "మెత్తమెత్తగా మొదలుపెట్టి........"

కృష్ణు డిలా ముగించాడు, నకులు డలా అందుకున్నాడు మాట. "ధర్మా లన్నీ బాగా తెలుసుకుని, వదాన్యుడున్నూ అయివున్న మాపెద్దన్న అనేకవిషయాలు చెప్పాడు నీకు. నువ్వాదంతా విన్నావు. పెద్దన్న అభిప్రాయం గుర్తించి, చిన్నన్న భీమసేనుడు సంధిమాటా

చెప్పాడు, తన బలపరాక్రమాల మాటా చెప్పాడు, స్పష్టంగా. అలాగే అర్జును డన్నయ్యా చెప్పా, డదిన్నీ వినేవున్నావు నువ్వు. అవన్నీ విన్నమీదట, నీవుద్దేశం కూడా మధ్యమధ్య తేలుస్తూనే వచ్చావు, కొంచెంకొంచెం.

అయితే, యివన్నీ విడిచిపెట్టెయ్యి నువ్వు. కౌరవసభకి వెళ్ళు. వారి ఉద్దేశా లేమిటో నిశ్చయా లేమిటో బాగా తెలుసుకో. అప్పటి కేది మంచి దని తోస్తే అది చెయ్యి నువ్వు. మనుష్యుల చిత్తవృత్తు లొకప్పు డున్న ట్టింకొకప్పు డుండవు. ఒకవిధంగా అనుకున్నది మరోవిధంగా అవుతూ వుండమున్నా వుంటుంది, క్షణంలో. మనుష్యులు ఎక్కడ చూసినా చలచిత్తులే, కాదనడానికి వీలులేదు. మాబుద్ధులు, మే మరణ్యవాసం చేశాటప్పు డొక లా గున్నాయి. అజ్ఞాతవాసం చేశాటప్పు డింకోలా గున్నాయి. ఇప్పుడు మరోలా గున్నాయి.

మే మరణ్యాల్లో వున్నప్పుడు ఇప్పు డున్నట్టు రాజ్యాకాంక్ష లేదు మాకు. మే మా పదమూడేళ్ళూ పూర్తిచేసుకువచ్చాక, నీదయ వల్ల ఏడక్షౌహిణుల బలం చేరింది మాకు. ఈవచ్చినవా రందరూ పులులనను మించినవారు. వీరి బలపరాక్రమా లీపాటి వని యెవరూ నిర్ధారణ చెయ్యలేరు. శస్త్రాస్త్రా లన్నిటిలోనూ ఆరితేరినవారు వీరు. వీరిని బరిమీద చూస్తే యెవడూ కూడా వీరియెదట నిటాగ్గా నుంచోలేడు. కనక, కౌరవసభలో ముందు మెత్తమెత్తగానే మాట్లాడు. సంధికోసమే చూడు. తప్పనిసరి అయితే, చివరికి భయపెట్టు. అయితే, మందుడైన దుర్యోధనుడు కంగారుపడిపోకుండా వుండేటట్టు మాత్రం చూడు.

యుధిష్ఠిరుణ్ణీ, భీమసేనుణ్ణీ, అపజయం యెలాంటిదో యెరగని అర్జునుణ్ణీ, నన్నూ తమ్ముణ్ణీ, నిన్నూ బలరామన్న బావనీ, మహావీరుడు

సాత్యకినీ, కొడుకులతో కూడా వచ్చిన విరటరాజునీ, మంత్రులను గూడా వెంటబెట్టుకువచ్చిన ద్రుపదమహారాజునీ, ధృష్టద్యుమ్నుణ్ణీ, మహాప్రతాపశాలి కాశీరాజునీ, చేదిదేశాధిపతి ధృష్టకేతుణ్ణీ యెదిరించి, చీమూ రక్తమూ వున్న మనిషి యెవడు యుద్ధంచెయ్యగలడూ? కనక, నువ్వక్కడికి వెడితేనే చాలు, ధర్మనందనుని అభిప్రాయం దానికదే నెరవేరిపోతుంది. నీలోవుందాశక్తి. నువ్వు చెబితే, భీష్ముడూ, విదురుడూ, బాహ్లీకుడూ నువ్వెంత శ్రేయస్సు కోరి ఆమాటలు చెబుతున్నావో అనంతా బాగా గుర్తించగలరు. దాని మీద, వారు, ధృతరాష్ట్రుణ్ణి మందలించగలరు. దుర్యోధనుణ్ణీ అతని మంత్రులనూ కూడా వొప్పించగలరు.

కాక,—నువ్వు హితంచెప్పేవాడవా? విదురుకు సంగతిసందర్భాలన్నీ గుర్తించగలవాడా? ఎంత తుంటరి అయినా బుద్ధితెచ్చుకుని మంచిదారి తొక్కాలంటే యింతకంటే మరేమి కావాలి బావా?"

# 81

## "యుద్ధం జరిగి తీరాలి"

"బావా" అన్నాడు సహదేవుడు. మాపెద్దన్న చెప్పిందంతా అచ్చంగా సనాతనధర్మం, సందేహం లేదు; కాని యుద్ధం జరిగితీరాలి, తప్పదు. నువ్వక్కడ యుద్ధం పొసగేటట్టే మాట్లాడు. కౌరవులే వచ్చి మాతో సంధిచేసుకుంటామన్నా నే నొప్పుకోను. కనక, నువ్వు సంధిమాటలు కట్టిపెట్టు. ఆవేళ, వాళ్లు, సభలో ద్రౌపది నంత అవమానించారే? ఆదుర్యోధనుణ్ణి కత్తె డయితే నరికెయ్యకుండా నాకా పగ యెలా తీరుతుందీ? శాంతి మాత్రం యెలా కలుగుతుందీ? భీమార్జునులూ ధర్మరాజూ ధార్మికు లయితే కానియ్యి. వారు కౌరవులతో సంధి చేసుకుంటే చేసుకోనియ్యి. నాకభ్యంతరం లేదు. నేను

మాత్రం యుద్ధమే చేస్తాను, తప్పదు ” అంటూ ఆవేశంతో అన్నాడు చివరి కతను.

ఇది విన్నాడు సాత్యకి యెగిరి గంతువేశాడు. “ కృష్ణా, బుద్ధిశాలి అయిన సహదేవుడు సత్యం చెప్పాడు ”అంటూనూ ప్రారంభించా డతను. “ దుర్యోధనుణ్ణి సంహరిస్తే గాని నా కోపం తీరదు. నారచీరలు కట్టుకుని సకలయాతనలూ అనుభవిస్తూ మీరు వనవాసంచెయ్యడం చూసి నప్పుడు నీకూ వల్ల మాలిన కోపం వచ్చింది కౌరవులమీద, అది మరి చావా ? ” అనడిగాడు గట్టిగా.

“ కనక, రణకర్కశు డైన యీసహదేవుడు చెప్పింది నాకే కాదు, యిక్కడ వుండిన ఈయోధులకున్నూ అందరికీ యిష్టమే ” అన్నాడు చివరకి. ఇది విన్నారు యోధులు, ఉబ్బెత్తుగా లేచారు, సింహనాదాలు చేస్తూనూ, కత్తులు ఝుళిపిస్తూనూ. “ నువ్వు మహాబాగా చెప్పా ” వంటే, “ నువ్వు మాకు నచ్చా ” వంటూ సహదేవుణ్ణీ, సాత్యకినీ మెచ్చుకుంటూ పరవళ్ళు కూడా తొక్కారు వారు.

# 82

## “ ఆ న ల్లని చె య్యి ”

ధర్మార్థసంపన్నం అయిన ఆమాట విని ద్రౌపది అందుకుంది. నీల కుంతల అయిన ఆద్రుపదరాజుబిడ్డ ముందు సహదేవుణ్ణీ సాత్యకినీ మెచ్చుకుంది చాలా ; కాని చల్లబడిపోయివున్న భీముణ్ణి చూశాటప్పటి కామె మన స్సంతా చెడిపోయింది. దాంతో దుఃఖం వుబికిం దామెకి. కళ్ళల్లో నీళ్ళుపెట్టుకుని “ మధుసూదనా ” అంటూ ఆరంభించిం దామె, కుమిలిపోతూ.

ఎంత మోసపోయి, పాండుపుత్రు లెలాంటి ఆపదలకు పాలయి నారో నీకు తెలుసు. ధృతరాష్ట్రుడూ, దుర్యోధనుడూ, అతని

మంత్రులూ కలిసి ఆలోచించి పంపిన సందేశం సంజయుడు చెప్పగా నువ్వు విన్నావు. దానికి ధర్మనందనుడు చెప్పిన ప్రత్యుత్తరమున్నూ విన్నావు నువ్వు. (సంధికోసం — అవిస్థలమూ, వృకస్థలమూ, మాకందీ, వారణావతమూ — అయిదోది మరేదయినా — మొత్తం మా కయిదూళ్ళిస్తే చాలు నని ధర్మనందను డడిగాడు.) దుర్యోధను డిందుకున్నూ అంగీకరించలేదు. ఇదిన్నీ నీకు తెలుసు, పూర్తిగా.

ఇక నేను చెప్పే దేమిటంటే? (రాజ్యభాగం యివ్వకుండా దుర్యోధనుడు సంధి కావాలంటే అందుకు నువ్వంగీకరించవద్దు.) వారు బలవంతు లన్న భయ మేమీ అక్కర్లేదు మనకి, మాకు సృంజయుల సాయం వుంది. దాంతో, పాండుపుత్రులు దుర్యోధనుణ్ణి సమూలంగా నాశనంచెయ్యగలరు. సామోపాయంతోనూ దానోపాయంతోనూ వ్యవహరిస్తే వారేదో వొరగబెడతా రని నువ్వెప్పుడూ అనుకోవద్దు. అంచేత వారంటే అనుగ్రహం చూపించవలసిన పనేమీ లేదు నీకు. తాను బతికిబాగుండా లనుకునేవాడు, సామదానాలకు లొంగని శత్రువులను అణిచెయ్యాలంటే దండోపాయం తప్ప మరోదారి లేదు. నువ్వూ పాండుపుత్రులూ సృంజయులూకలసి వారిని నాశనంచెయ్యండి. ఆనాశనమయినా వెంటనే చెయ్యండి, ఆలస్యం చెయ్యడానికి వీలులేదు.

ఇది పాండుపుత్రులకు మిక్కిలీ తేలికయిన పని. నీకు యశస్సు కలిగిస్తుం దిది. క్షత్రియధర్మమున్నూ నిశ్చలం అవుతుంది. క్షత్రియుడైనవాడు, ఎదటివాడు లోభి అయితే, వాడు క్షత్రియుడైనా సరే, మరోడయినా సరే వాణ్ణి సంహరించెయ్యవలసిందే. ఒక్క బ్రాహ్మలను మాత్రమే క్షత్రియుడేమీ చెయ్యగూడదు. బ్రాహ్మణవర్ణం అన్నివర్ణాలకూ గురుస్థానీయమూ పూజ్యమున్నూ. (చంపరానివాణ్ణి చంపితే యెంత దోషమో, చంపవలసినవాణ్ణి చంపకపోయినా అంతదోషమే.)

ధర్మజ్ఞులిలా నిర్ధారణ చేశారు.) చంపవలసినవాణ్ణి చంపని దోషం నీకంటగూడదని నాకోరిక.

ఇదివరలో మళ్ళీమళ్ళీ యెన్నోమాట్లు చెప్పిందే, ఇంకోమాట్టు చెబుతా నిప్పుడు. నీదగ్గిర నాకంత చనువుంది మరి. (జనార్దనా, నావంటి ఆడది భూమ్మీద మరొకర్తె యెక్కడయినా వుందా? నేను ద్రుపదమహారాజు కూతుర్ని. అందరిలా కాక అగ్నిగుండంనుంచి పుట్టుకువచ్చాను. పైగా, ధృష్టద్యుమ్నుని చెల్లెలినీ, నీకు సఖురాల్నినీ, పాండుమహారాజు కోడలినై నే నాజమీఢవంశంలో బడ్డాను. ఇంద్రునకెందునాతీసిపోని పాండుపుత్రుల కయిదుగురికీ నేను పట్టపుదేవిని. ఆ అయిదుగురివల్లా అయిదుగురు మహావీరులను కన్న తల్లి న్నేను. అభిమన్యుడెలాంటి మేనల్లుడో నాకొడుకులూ నీ లాంటి మేనల్లుళ్ళే.

పాండుపుత్రులు చూస్తూవుండగా, నువ్వు జీవించేవుండగా, కౌరవ సభలో నే నెలాంటి అవమానం పొందానో నీకు తెలుసు. పాండుపుత్రులూ, పాంచాలప్రభువులూ, యాదవసింహాలూ బతికివుండగా నేనొకళ్ళకి దాసి నయిపోయాను. కోపం అన్నది యెరక్కుండా చేష్టలు తక్కి బొమ్మలయి వుండిపోయా రప్పుడు పాండుపుత్రులు. గతిలేక నిన్ను ప్రార్థించా న్నేనప్పుడు రక్షించమని. అదంతా అయాక నామామ ధృతరాష్ట్రుడు "వరం కోరుకో" మన్నాడు నన్ను. "పాండుపుత్రులు దాసులయివుండగూడదు. వారి ఆయుధాలూ వారి కుండాలి, వారి రథాలున్నూ వారి కుండాలి" అని కోరా న్నేను. దీంతో, వనవాసానికి వెళ్ళడానికి పాండుపుత్రులకూ నాకూ ముక్తిదొరికింది.

పుండరీకాక్షా, ఇలాంటి నాకష్టా లన్నీ నువ్వెరుగుదువు. నాభర్తలను రక్షించవయ్యా! నేను ధృతరాష్ట్రునకూ భీష్మునకూ కూడా కోడలినే; కాని దాసినయిపోయాను. కృష్ణా, దుర్యోధను డింకొక్క క్షణ

మయినా బతికివుంటే, అర్జునుని విలుకానితనమూ, భీముని బలపరాక్ర మాలూ ఎందుకయ్యా, కాల్చడానికా కాకపోతే? నాయెడల నీకను గ్రహం వుంటే దయగూడా వుంటే కౌరవుల నందరినీ నాశనం చేసి చూపించవయ్యా!"

ఇలా అంటూ ద్రౌపది, ఎడమచేత్తో తన జుట్టు ఎత్తి చూపించింది కృష్ణునకు. అది మిక్కిలీ మృదువుగా వుంది. కుటిలంగా వుంది. నల్లగా వుంది. చూడ ముచ్చటగా వుందెంతో. సుగంధతైలాలతో సంస్కృతం అయి మిక్కిలీ గుబాళిస్తోంది. అది చూపించిం దామె కృష్ణునకు. "కృష్ణా, ఈజుట్టుపట్టు కున్నాడు దుర్యోధనుడు. ఈజుట్టు పట్టుకుని నన్ను సభలోకి లాక్కువెళ్ళాడు. నువ్వు వారితో సంధి మాటలు మాట్లాడే టప్పు డీసంగతి జ్ఞాపకం వుంచుకోవాలి సుమా. భీముడూ అర్జునుడూ దీనులై సంధికోసం పాకులాడితే పాకులాడనియ్యి. వృద్ధు డైనా నాతండ్రి చేస్తా డయ్యా యుద్ధం. నాసోదరు లున్నారు. వారున్నూ చేస్తారయ్యా! అభిమన్యుని వెంటబడి నాకొడుకు లయిదు గురూ కూడా చేస్తారయ్యా యుద్ధం! అన్నయ్యా, ఆనల్లని చెయ్యి — ఆదుశ్శాసనుని చెయ్యి — వొక్క నరుకుతో కిందబడి దుమ్ములో పొర్లాడ్డం నాకళ్ళతో చూస్తేగాని నాదుఃఖం — నాకసి యెలా తీరుతుం దయ్యా? గుండెల్లో భగభగ మండే నిప్పు పెట్టుకుని పదమూ డేళ్ళు ఎదురుచూశా నయ్యా నేను. ఇప్పటికీ ధర్మంకోసమే పాకులాడుతున్న యీభీమసేనుణ్ణి చూస్తేనాగుండెలు బద్దలయిపోతున్నా యన్నయ్యా!"

ఇలా చెబుతూ చెబుతూ గొల్లుమంది ద్రౌపది. కంటికీ మంటికీ యేకధారగా యేడ్చేసింది. ఆమె కంఠం గద్గదికం అయిపోయింది. పెదవులూ వొళ్ళూ వొణికిపోయాయి. "అమ్మా, వూరుకో" మన్నాడు కృష్ణు డది చూసి. కౌరవుల ఆడవాళ్ళందరూ గోలపెట్టడం చూస్తావు నువ్వు కొద్దిరోజుల్లోనే. భర్తలు, కొడుకులు, జ్ఞాతులు,

బంధువులు — అందరూ చచ్చిపోయి వారిలాగే యేడుస్తారు, నెత్తీ నోరూ బాదుకుంటూ. భీమార్జునులను వెంటబెట్టుకువెళ్లి నేను చేస్తానది. అలా జరిగేటట్టు, యుధిష్ఠిరుడే తొందరపెట్టిపంపుతాడు మమ్మల్ని. దైవం రాసిపెట్టాడిది. ఆకౌరవులు నామాట వినిపించుకోకపోతే, యుద్ధరంగంలో కుక్కలపాలూ నక్కలపాలూ అయిపోతారు, తప్పదు. హిమవత్పర్వతం వూటాడిపోనీ, భూమి బద్దలయిపోనీ, నక్షత్రాలతో ఆకాశం రాలిపోనీ నామాట మాత్రం తప్పదు. అమ్మా, వొట్టుపెట్టి చెబుతున్నా న్నేను కళ్ళు తుడుచుకో. శత్రువుల నందరినీ నాశనంచేసి, అదిగో, సిరిసంపదలతో తులతూగబోతున్నారు నీపతులు, లెక్క పరి దినా లోపికపట్టు తల్లీ"

# 83

## రథం కదిలింది

ఇదంతా విన్నాడు, చూశాడు, చివరికి నిశ్చలంగా అందుకున్నాడర్జునుడు. పురుషోత్తమా, కౌరవుల కందరికీ మిక్కిలీ స్నేహితుడవు నువ్వు. ఉభయపక్షాలవారికీ కావలసినవాడవు నువ్వు. ఉభయులనూ మందలించదగిన పెద్దవున్నూ. కనక, కౌరవులూ పాండవులూ సుఖంగా బతికేటట్టు చూడాలి నువ్వు. సంధి చెయ్యడానికైనా యేమి చెయ్యడానికైనా నువ్వు సమర్థుడవు. దుర్యోధనుడు ముక్కోపి. సంధి చెయ్యడాని కతనిదగ్గిరికి వెడుతున్నావు నువ్వు. కనక, అందుకు తగ్గట్టే మాట్లాడు అక్కడ. నువ్వు చెప్పేమాట ధర్మార్థాలతో నిండి వుంటుంది. మంగళప్రదం అవుతుంది. క్షేమం కలిగిస్తుంది. సుయోధను డది వినిపించుకుంటాడా, మంచిదే. లేదూ, అతని కాలం మూడిం దన్నమాట" అని చెప్పాడతను.

"ఔూ నిదిగో నేను బయలుదేరుతున్నా" నన్నాడు కృష్ణుడు. "నేను చెప్పేమాట ఎవరికీ అపకారం చెయ్యదు. పైగా, శ్రేయస్సే కూరుస్తుంది. ఇందుకోసం ధృతరాష్ట్రుణ్ణి కలుసుకుని నాశక్తికొద్దీ ప్రయత్నిస్తా" ననిన్నీ చెప్పాడు.

తూర్పు తెల్లవారింది. క్రమంగా సూర్యోదయం అయింది. సూర్య కిరణాలు సుఖావహంగా దిగ్దిగంతరాళాలు వ్యాపించాయి. శరదృతువు గడిచి హేమంతం ప్రారంభం అయింది. అది కార్తీకమాసం. ఆవేళ రేవతీనక్షత్రం. ఫల్గునీనక్షత్రజాతకుడైన అర్జునున కది మైత్రతార. సస్యా లన్నీ విరగపండి కన్నులవైకుంఠంగా వున్నాయి. మంగళవాద్యాలు ప్రారంభం అయినాయి. బ్రాహ్మలు స్వస్తి పలికారు. మహర్షుల స్తుతివచనాలు విని ఇంద్రుడు మేలుకునేటట్టు మేలుకున్నాడు శ్రీకృష్ణు డవి ఆలకించి. పొద్దుటిపూట నిర్వహించు కోవలసిన కృత్యా లన్నీ పూర్తిచేసుకున్నాడు. స్నానం చేశాడు. శుచి అయినాడు. బాగా అలంకరించుకున్నాడు. సూర్యనమస్కారాలు చేశాడు. హోమాలు చేసి అగ్నిహోత్రుణ్ణి కూడా సేవించుకున్నాడు. ఆబోతు తోక ముట్టుకుని, బ్రాహ్మలకు నమస్కరించి, అగ్నికి ప్రదక్షిణం చేశాడు. మంచి శకునం చూసుకున్నాడు. యుధిష్ఠిరుని మాటలు జ్ఞాపకంచేసుకున్నాడు.

తరవాత సాత్యకిని పిలిచి "నాయనా, శంఖమూ, చక్రమూ, గదా రథంమీద వుంచు. ఉపాసంగాలూ, శక్తీ తక్కిన ఆయుధాలూ కూడా వుంచు. దుర్యోధనుడు మిక్కిలీ దుష్టుడు. నమ్మడానికి వీల్లేని మనిషి. కర్ణుడూ, శకునీ అంటిపెట్టుకునివుంటూ రతణ్ణి క్షణమైనా విడిచి పెట్టకుండా. ఎంత బలహీను ణ్ణయినా శత్రువైనవా ణ్ణెప్పుడూ నమ్మి వుండగూడదు" అని చెప్పా డతనికి.

కృష్ణుడు చెప్పినట్లల్లా చేశాడు సాత్యకి. కాలాగ్నిలాగా, సూర్యబింబం లాగా దేదీప్యమానంగా వుంది రథం. ఇటు సూర్యుడూ అటు చంద్రుడూ అన్నట్టున్నాయి దాని చక్రాలు. నెలవంకలూ, పుష్పాలూ, చేపలూ, రకరకాల మృగాలూ పక్షులూ, ఇంకా యెన్నో చిత్రించారు, ఆరథాన. ఎవరూ అడ్డలేని దారథం. ఎవరికీ సాధ్యం కాని దా రథం. వ్యాఘ్రచర్మం పరిచారు దానిమీద కృష్ణునికోసం. అది శత్రువులకుదుఃఖమూ, పాండవులకు ఆనందమూ కలిగిస్తుంది. (1శైబ్యమూ, 2సుగ్రీవమూ, 3మేఘపుష్పమూ, 4బలాహకమూ అని కృష్ణుని గుర్రాలు.) శుభ్రంగా కడిగారు వాటిని. రకరకాల రత్నాభరణా లలంకరించారు వాటికి. (ఆగుర్రాలు పూన్చా రా రథానికి. దానిమీద గరుడధ్వజమున్నూ ప్రతిష్ఠించారు. అప్పు డారథం మేరు పర్వతశిఖరంలా వుంది. మేఘా లురుముతున్నట్టూ, భేరీ దుందుభీ వాయిస్తున్నట్టూ ఉం దది బయిలుదేరితే.) కృష్ణు డా రథం యెక్కి—సాత్యకిని కూడా యెక్కించుకుని బయలుదేరాడు. గాలి చల్లగా వీచింది. దుమ్మణిగిపోయింది. మృగాలూ పక్షులూ ప్రదక్షిణంగానూ, అనులోమంగానూ తిరిగాయి. జయధ్వానాలు మిన్నుముట్టాయి. సారసపక్షులూ హంసలూ అతని వెంటబడ్డాయి. హోమాలు చేసివున్న అగ్నులు ప్రదక్షిణార్చిస్సు లయి వెలిగాయి.

వసిష్ఠుడూ, వామదేవుడూ, భూరిద్యుమ్నుడూ, గయుడూ, క్రథుడూ, శుక్రుడూ, నారదుడూ, వాల్మీకుడూ, మరుత్తుడూ, కుశికుడూ, భృగువూ — మొదలైన దేవర్షులూ బ్రహ్మర్షులూ యదువంశోద్ధారకు డైన శ్రీకృష్ణునకు ప్రదక్షిణాలు చేశారు. యుధిష్ఠిరుడూ, భీమార్జునులూ, నకులసహదేవులూ, చేకితానుడూ, ధృష్టకేతుడూ, ద్రుపదుడూ, కాశీరాజూ, శిఖండీ, ధృష్టద్యుమ్నుడూ, కొడుకులతో గూడా విరటరాజూ, కేకయులూ సాగనంపడానికి బయలుదేరారు.

కృష్ణుడు కోరీ, భయపడీ, లోభించీ, డబ్బుకోసమూ, యెప్పుడూ యెవరికీ అపకారమూ చెయ్యడు, అన్యాయాలూ చెయ్యడు. సకల ధర్మాలూ తెలిసినవా డతను. మిక్కిలీ ధీరుడు. ప్రాజ్ఞుడు. సర్వభూతాలకూ ప్రభువు. దేవతలకు దేవుడు. సనాతనుడు. శ్రీవత్సలాంఛనుడు. రాజు లందరూ చూస్తూ వుండగా, ధర్మనందనుడు, ముందా కృష్ణుణ్ణి కౌగిలించుకున్నాడు.

"మహాత్మా" అన్నాడు." పుట్టినప్పణ్ణుంచీ మమ్మల్ని అతి గారంగా పెంచుకుంది మాఅమ్మ. ఉపవాసాలూ, తపస్సూ తప్ప మరో వ్యావృత్తి లేదామెకి. శుభాలే కోరుతుం దెప్పుడూ. దేవతలనూ, అతిథులనూ, గురువులనూ పూజించని దే వొక్కదిన మైనా గడపదు. ఆమె వాత్సల్యానికి హద్దులేదు. మేమంటే యెంతో ప్రేమ ఆమెకి. మాకున్నూ ఆమెకంటే ప్రేమాస్పదం మరి లేదు. దుర్యోధనునివల్ల యేఅపాయమూ కలక్కుండా జాగ్రత్తగా పెంచి మమ్మల్ని పెద్దల్ని చేసిం దామె. సముద్రంలో నావలాగ మమ్మల్ని అనేకమాట్లు మృత్యుముఖంనుంచి తప్పించింది. మాకోసం తానెన్నో దుఃఖా లనుభవించింది. సుఖాలకే తగిం దామె; కాని కష్టాలే అనుభవించింది. ఆకుంతీదేవిని – మాఅమ్మని మేమడిగా మని క్షేమం అడగవయ్యా.

మాకోసం యిప్పటికీ దుఃఖిస్తూనే వుం దామె. ఆమె నూరడించు. ఆమెకి నమస్కారం చెయ్యి. మాపేళ్ళు చెబుతూ ఆమెని కౌగిలించుకో. వివాహం అయింది, అత్తవారింటికి వచ్చింది, అంతే, కష్టాలు ప్రారంభం అయినా యామెకి. ఇప్పటికీ అలాగే వుం దామె స్థితి. జనార్దనా, మేము మాఅమ్మని సుఖపెట్టుకునే దినం యెన్నటి కైనా వస్తుం దంటావా? మేమడవులకు వెళ్ళేటప్పు డామె మమ్మల్ని విడిచిపెట్టలేక పోయింది; కాని, మేమే విడిచిపెట్టా మామెని. మాకోసం దుఃఖిస్తూ

చనిపోయిందో ఆమె, బతికే వుందో మరి. బతికే వుంటే మాకోసం దుఃఖం తప్ప దామెకి. ఆమె నూరడించు బావా!

తరవాత, ధృతరాష్ట్రునకూ, భీష్మునకూ, ద్రోణునకూ, కృపునకూ, బాహ్లీకునకూ, అశ్వత్థామకూ, సోమదత్తునకూ, తక్కిన కౌరవకౌరవేతర పెద్దలకూ నానమస్కారాలు మనవిచెయ్యి. పిన్నల కందరికీ నాఆలింగనా లందించు. విదురుడు మహాప్రాజ్ఞుడు. కౌరవులమంత్రి. అతని బుద్ధి అగాధం. సకలమర్మాలూ యెరిగినవా డతను. మాకు మారుగా నువ్వతణ్ణి కౌగిలించుకో."

ఇలా చెప్పి "వెళ్ళిరా" అని కృష్ణు డనగా, అతనికి ప్రదక్షిణం చేసి వెనక్కి మళ్ళా డతను. అప్పు డర్జును డందుకున్నాడు. "ప్రభూ! మొన్నమొన్ననే మనం నిశ్చయంచేసుకున్నాం, రాజు లందరూ చూస్తూవుండగానూ వింటూవుండగానూ మనం అర్ధరాజ్యం లాక్కోవలసిందే అని. మారుమాటాడకుండా దుర్యోధను డలా యిస్తాడా, మంచిదే. వారికి మృత్యువు తప్పుతుంది. నాకు తృప్తి అవుతుంది. అపాయ మేమిటో ఉపాయ మేమిటో ఆలోచించుకోక, దుర్యోధను డలా యివ్వడూ, కౌరవుల నందరినీ నాశనంచేసేస్తా" నన్నా డతను చివరికి దృఢంగా.

ఇది విన్నాడు భీముడు. చాలా సంతోషించాడు. ఉన్నట్టుండగా క్రోధపరవశుడై ఆకాశం దద్దరిల్లేటట్టు పెద్దపెద్ద కేకలు పెట్టాడు. ఆ కేకలకు అక్కడ వున్న విలుకాళ్ళందరూ గజగజ లాడిపోయారు. భయభ్రాంతాలయిపోయి గుర్రాలూ యేనుగులూ మలమూత్రాలు విడిచాయి.

అర్జును డప్పుడు కృష్ణుణ్ణొక్కమాటు కౌగిలించుకుని, అతని సెలవుపొంది వెనక్కి మళ్ళాడు. తక్కినవారున్నూ అడుగు వేశారు, ముందుకే చూస్తూ వెనక్కి. సారథి అయిన దారుకు డదలించగా, శైబ్యమూ, సుగ్రీవమూ, మేఘపుష్పమూ, బలాహకమూ సాచి

అడుగువేశాయి. ఆఅడుగు వెయ్యడంలో, అవి, ఆకాశం మింగే టట్టూ, మార్గం తాగేసేటట్టూ వున్నాయి.

వెళ్ళగా వెళ్ళగా వొకచోట ఋషులు కనపడ్డారు. కృష్ణునికోసం కని పెట్టుకుని వున్నారు వారు. బ్రహ్మవర్చస్సుతో ధగధగ మెరిసిపోతు న్నారువారు. దారి కీపక్కనా ఆపక్కనాకనిపెట్టుకుని వున్నారు. వారు కనపడ్డంతోనే రథం ఆపించి, దిగి, కృష్ణుడు వారి కందరికీ పాదాభివంద నాలు చేశాడు ముందు. "మహాత్ములారా, మీరందరూ కుశలంగా వున్నారా? మీధర్మం మీరు నిష్కంటకంగా నిర్వర్తించుకుంటు న్నారా? వినయవిధేయులై తక్కిన మూడువర్ణాలవారూ బ్రాహ్మలు చెప్పిన ట్టల్లా నడుచుకుంటున్నారా?" అంటూ అడిగి, తరవాత, వారిని పూజించి "భగత్స్వరూపు లైన మీా రెక్కణ్ణుంచి విజయం చేస్తున్నారూ? ఎక్కడికి వేంచేస్తున్నారూ? ఎందుకోసం మీాకీ ప్రయాణశ్రమ? నే నిప్పుడు మీాకేమి సేవలు చేసుకోవలసివుందీ? మీరు దేవలోక నివాసులు గాని సామాన్యులు కారు. మరి, యీభూమండలాని కెందుకోసం దయచేశారూ?" అనిన్నీ అడిగాడు, చేతులు దోయిలించుకుని.

దీనిమీాద, వారిలోజామదగ్న్యుడనే మహర్షి ముందుకి వచ్చి కృష్ణుణ్ణొకమాటు కౌగలించుకుని "పుణ్యమూర్తులయిన దేవర్షులమూ, బహుశ్రుతు లైన బ్రాహ్మలమూ, రాజర్షులమూ, తపోధనులమూ అయిన మేము నిన్ను పూజిస్తున్నాము. మేమందరమూ దేవత లనూ రాక్షసులనూ కూడా చూసివున్నవాళ్లం. భూమండలంలో వున్న రాజు లందరూ వొక్కచోట కూడివున్నప్పుడు వారిని చూడా లని యెన్నాళ్లనుంచో మాకుబలాటం. కౌరవసభలో ఆరాజులూ నువ్వూ కలుసుకుంటారు. అది రమణీయమైన గొప్ప దృశ్యం. అది చూడా లని మేము బయలుదేరాము. అక్కడ ధర్మార్థసహితా

లైన మాటలు చెబుతావు నువ్వు. ఆసభలో భీష్ముడూ, ద్రోణుడూ, విదురుడూ, మరికొందరు పెద్దలూ కూడా నిన్ను కలుసుకుంటారు. నీమాటలూ, వారిమాటలూ వినా లని మాకోరిక. అవన్నీ సత్యనిరతాలూ ధర్మబంధురాలూ అయివుంటాయి మరి. ఇక్కడ మాకీ విధంగా దర్శనం యిచ్చి మాట్లాడావు. నిన్ను మేమక్కడ మళ్లీ చూస్తాము. నువ్వు నిర్విఘ్నంగా వెళ్ళు. కౌరవసభలో దివ్యసింహాసనంమీద కూచుని దిక్కులు వెలిగిస్తావు నువ్వు, అప్పుడు మళ్లీ చూస్తాం" అని బదులు చెప్పాడు.

# 84

## వృ క స్థ ల ని వా స ం

కృష్ణుని వెంట శస్త్రపాణు లైన మహారథులు పదిమందీ, గుర్రపు రౌతులు వెయ్యిమందీ, కాల్బంట్లు వెయ్యిమందీ బయలుదేరారు. భోజనసామగ్రి పట్టించుకుని అందుకుసంబంధించినవారున్నూ చాలా మంది వున్నారు, ఉచితపరికరాలతో.

ప్రయాణంలో మంచిశకునాలూ చెడ్డశకునాలూ కూడా ముమ్మరంగా కనబడ్డాయి. మబ్బు లేకుండానే ఆకాశాన మెరుపులు మెరిశాయి. పిడుగులు పడ్డాయి. కుండపోతగా వర్షమున్నూ కురిసింది. పశ్చిమదిశగా ప్రవహించే సింధు మొదలైన నదులు ఏడూ తూర్పుగా మళ్ళి ప్రవహించసాగాయి. దిక్కులు తెలియలేదు. వాటికవే అగ్నులు మండసాగాయి. భూమివొణికింది. నదులూ నిండుబిందెలూ పొంగిపొర్లిపోసాగాయి. జగత్తంతా పొగతో నిండిపోయింది. శరీరం లేని గొప్పవాక్కు బయలుదేరింది ఆకాశాన. ఈవిధంగా అన్ని దేశాల్లోనూ కనబడ్డాయి ఉత్పాతాలు. హస్తినాపురంలో నైఋతిదిశగా వచ్చి ప్రచండంగా వీచింది గాలి. కృష్ణు డున్నంతమేరా మాత్రం ప్రద

క్షీణంగా చల్లని గాలి వీచింది. పూలవాన కురిసింది. ఆపువ్వుల్లో తామరపువ్వు లెక్కువగా వున్నాయి. ఎగుడుదిగుళ్ళూ, రాయీ రప్పా లేకుండా దారి చాలా ఋజువుగా వుంది. వేలకొద్దీ బ్రాహ్మలు వచ్చి అక్కడక్కడ వేదఘోష చేస్తూ జయధ్వనులు చెయ్యసాగారు. వారి నందరినీ అతను, మధుపర్కాలూ బంగారునాణాలూ ఇచ్చి సత్కరించాడు. స్త్రీలు వచ్చి ఘుమఘుమలాడే అడవిపువ్వులతో అతణ్ణి ముంచెత్తేశారు.

సర్వసస్యాలతోనూ నిండి పరమధర్మిష్ఠం అయిన శాలిభవనం దాటాడతను. పశువులతో నిండివున్న అనేక గ్రామాలూ మనస్సు కుల్లాసం కలిగించే అనేక పట్నాలూ, వివిధాలైన రాష్ట్రాలూ కూడా దాటివెళ్ళాడతను. అతణ్ణి చూడ్డానికి వేలకొద్దీ వచ్చి స్త్రీలూ పురుషులూ దారికి రెండుప్రక్కలా నుంచున్నారు. పాండవుల యేల్బడిలో యెంతో సుఖించినవారు వారు. ఏవిధమైన ఆదుర్దాలూ ఎరిగివుండనివారు, శత్రుభీతి లేనివారు. వ్యసనాలున్నూ లేనివారు. వారందరూ కృష్ణుడు తమ దేశానికతిథిగా వచ్చాడన్న ఆనందంతో అతణ్ణెంతో పూజించారు.

వెళ్ళివెళ్ళి కృష్ణుడు వృకస్థలం అనే గ్రామం సమీపించాడు. పాండుపుత్రులు తమ కిస్తే చాలునన్న అయిదూళ్ళలోనూ వొకటి అది. అప్పటికి సూర్యుడు ఎర్రనికిరణాలతో అస్తమించే స్థితిలో వున్నాడు. రథం దిగి కృష్ణుడు శుచి అయి సంధ్యావందనం చేసుకున్నాడు. "ఈరాత్రి యిక్కడ గడుపుదాం" అనిన్నీ చెప్పాడు పరిజనులతో. దారుకుడు గుర్రాలు కడిగి మేతకి విడిచిపెట్టాడు. ఆగ్రామస్థులంతా వచ్చి వారి కన్నిసదుపాయాలూ చేశారు. నిమిషంలో వంటలు అయినాయి. ఆగ్రామంలో బ్రాహ్మణగడప యెక్కువ. ఆబ్రాహ్మలందరూ కులీనులు. సిగ్గుబిడియాలు కలవారు. బ్రాహ్మణధర్మాలు నిష్కర్షగా నడుపుకునేవారు. వారందరూ వచ్చి కృష్ణుణ్ణి యథాశాస్త్రంగా పూజించి వేదోక్తంగా ఆశీర్వదించారు.

తరవాత, గ్రామంలోకి తీసుకువెళ్ళి కృష్ణునకు తమ యిళ్ళూ వాకిళ్ళూ చూపించారు వారు. సర్వసంపదలూ నిండివున్న వాయిళ్ళు. అవన్నీ చూసి, వారిని మిక్కిలీ మెచ్చుకుని, తనపిడిదికి వచ్చేశాడు కృష్ణుడు. వేళ కాగానే, కులాసాగా మాట్లాడుతూ ఆబ్రాహ్మ లందరితోనూ కలిసి భోజనంచేసి అతనా రాత్రి సుఖంగా గడిపా డక్కడ.

## 85

## కౌరవుల ఎదురుసన్నాహం

దూతలముఖంగా ధృతరాష్ట్రున కీవార్త తెలిసింది. వెంటనే భీష్ముణ్ణి పిలిచా డతను. మామూలు మర్యాద లన్నీ నడిపాడు. ద్రోణుణ్ణీ, సంజయుణ్ణీ, బుద్ధిశాలి అయిన విదురిణ్ణీ, దుర్యోధనుణ్ణీ, కర్ణుణ్ణీ, శకునినీ, దుశ్శాసనుణ్ణీ కూడా రప్పించాడు. "బాబయ్యా" అని సంబోధించాడు భీష్ముణ్ణి. "అద్భుత మైన వార్త తెలిసింది. ఆడవాళ్ళూ, వృద్ధులూ పిల్లలూ కూడా యింటింటా చెప్పుకుంటున్నా రది. నాలుగు వీధుల మొగల్లోనూ, రచ్చల్లోనూ చేరి పౌరులున్నూ చెప్పుకుంటూ వాదోపవాదాలు చేసుకుంటున్నారు దానిమీద. "పాండవుల పని మీద కృష్ణు డిక్కడికి వస్తున్నా" డని ఆవార్త. మహాపరాక్రమ శాలి అతను. సర్వవిధాలా మనకు మాననీయుడూ, పూజనీయుడూను. లోకయాత్ర అంతా అతని చేతిలోవుంది. జగదీశ్వరు డతను. ధైర్యమూ, పరాక్రమమూ, ప్రజ్ఞా, ఓజస్సూ అతనిదగ్గిరే వున్నాయి. అతణ్ణి ఆదరించడం సనాతనధర్మం. పూజిస్తే సకలసుఖాలూ, తిరస్కరిస్తే సకల కష్టాలూ కలిగిస్తా డతను. అతను సంతోషించాడా, సంగతిసందర్భా లన్నీ తెలుస్తాయి మనకి" అని చెప్పి దుర్యోధనుణ్ణి సంబోధించాడతను. "అతణ్ణి ఆదరించడానికీ, గౌరవించడానికీ దారి పొడుగునా చలవపందిళ్ళు వేయించు. విడియడానికి భవంతు లేర్పాటు

చేయించు. సకలసౌకర్యాలూ వుండాలా భవనాల్లో. సర్వసంపన్నాలున్నూ అయి వుండాలవి" అని చెప్పాడు. గాంధారినీ మళ్ళీ భీష్ముణ్ణీ సంబోధించి "యిందుకు మీరేమంటా?" రని అడిగాడు. "చాలా బాగుం" దని మెచ్చుకున్నారు వారిద్దరూ.

"వెంటనే అలా యేర్పాటుచెయ్యవలసిం" దని దుర్యోధనుడు రాజపురుషుల కాజ్ఞాపించాడు. వారి ఆజ్ఞలందుకుని వెంటనే వెళ్ళి పనివాళ్ళు రత్నాలతో అలంకరించి అనేకభవనాలు సిద్ధంచేశారు. రకరకాలైన ఆసనాలూ, మంచాలూ పరికరాలూ ఇంకా యెన్నో చేర్చారు వాటిలో. స్త్రీలున్నూ సుగంధద్రవ్యాలూ సన్నని వస్త్రాలూ పట్టుకువెళ్ళి అక్కడ కనిపెట్టుకుని వున్నారు. మంచి బలకరాలయిన భోజన పదార్థాలు సిద్ధం అయినాయి. విశేషించి వృకస్థలంలో అన్నిటికంటే గొప్పభవనం సిద్ధంచేశారు. ఇదంతా చేయించి దుర్యోధనుడీసంగతి తండ్రితో చెప్పాడు. కాని కృష్ణు డాభవనాలు చూడలేదు. తిన్నగా హస్తినాపురానికి బయలుదేరేశాడు సొంతవిడిదినుంచి.

# 86

## ధృతరాష్ట్రుని ప్రతిభ

"వృకస్థలంలో వున్నాడు కృష్ణుడు. పొద్దున్నే బయలుదేరి యిక్కడికి వస్తాడు" అన్నాడు ధృతరాష్ట్రుడు, తొలినాటి రాత్రి విదురునితో.

"యాదవసింహు డతను. గొప్ప మన స్సతనిది. ప్రసిద్ధమైన వృష్ణిరాజ్యాని కతను ప్రభువూ రక్షకుడూను. అతని బలపరాక్రమాలూ, అతని సత్తా మరొకరికి రావు. ముల్లోకాలకూ అతను ప్రపితామహుడు. ఆదిత్యులూ, వసువులూ, రుద్రులూ బృహస్పతి ఆలోచన లనుసరించి నడుచుకునేటట్టు, వృష్ణ్యంధకు లతను చెప్పినట్టు

నడుచుకుంటారు. ధర్మాలన్నీ తెలిసినవాడవు నువ్వు. కనక, నేనతనికి చెయ్యదలిచిన సత్కారాలు వివరంగా చెబుతా విను" అంటూ ప్రారంభించా డతను.

"ఒక్కొక్క రథానికి నాలుగేసి గుర్రాలు. అనాలుగూ వొక్కటే రంగువి. బాహ్లీక దేశంలో పుట్టిన జాతిగుర్రాలవి. సువర్ణరత్నాభరణాలతో వాటి కలంకారాలుచేస్తారు. అలాంటి గుర్రాలు పూన్చిన రథాలు, బంగారపువి, పదహారు సమర్పించుకుంటా న్నే నతనికి. ఎప్పుడూ మదధార లోడుకుంటూ వుంటాయి. నాగేటికాడి అంతేసి దంతాలున్నాయి వాటికి రెండేసి. పర్వతాలను కూడా కుమ్మేసి పిండీ గుండా చేసేస్తాయి, వాటితో అవి. ఒకొక్కదానికెనమండుగురేసి పరిచారకు లున్నారు. అలాంటి గొప్ప యేనుగు లెనిమిది సమర్పించు కుంటా నతనికి.

ప్రతీపిల్లా బంగారబ్బొమ్మలా మెరిసిపోతూ వుంటుంది. రత్నాభరణాలతో జిగజిగలాడుతూ వుంటుంది. నవయౌవనంలో వుంటుంది. సంతానవతి కాలే దింకా. అలాంటి దాసీపడుచులు నూరుగురిని సమర్పించుకుంటా నతనికి. దాసులనుకూడా సర్వసమర్థులను చూసి నూరుగురిని సమర్పించుకుంటా నతనికి. మెత్తని గొర్రెరోమాలతో అతిమెత్తగా వుండేటట్టునేసి గిరిజనులు కానుక పెట్టిన కంబళ్ళలో మంచివి యేరి పద్దెనిమిదివేలు సమర్పించుకుంటాను. చీనాదేశంనుంచి చాలాచక్కని జింకచర్మాలు వచ్చివున్నాయి. అవిన్నీ వేలకొద్దీ సమర్పించుకుంటాను.

ఇదిగో, గొప్పరత్నం యిది. రాత్రీపగలూ కూడా వొక్కవిధంగా మెరిసిపోతూవుంటుం దిది. ఇదిన్నీ సమర్పించుకుంటా నతనికి. నాదగ్గిర వొక వాహనంవుంది. కంచరగాడిదను పూనుస్తారు దానికి. దినానికిపద్నాలుగు యోజనాలు అనాయాసంగా వెడుతుం దది. అదిన్నీ సమర్పించు

కుంటా నతనికి. వాహానా లెన్నో, వాటితో వుండే మనుష్యు లెందరో ఆసంఖ్య కెనిమిది రెట్లు ఆహారపదార్థాలున్నూ తోలిపెడతా నతనికి.

ఒక్కదుర్యోధనుడుతప్ప తక్కిన నాకొడుకులూ మనమలూఅందరూ, జ్ఞాతులూ, బంధువులూ చక్కనిరథా లెక్కి ఎదురువెళ్ళి సగౌరవంగా తోడితెస్తా రతణ్ణి. రత్నాభరణా లలంకరించుకుని అప్సరసలా అన్నట్టున్న వారకాంతలు వెయ్యిమంది కాలినడకను వెళ్ళి గౌరవిస్తా రతణ్ణి. నగరంలోవున్న పెద్దింటిస్త్రీలూ, పిన్నలూ, కూడా మేలిముసుగు లేకుండా చాలామంది యెదురువెడతారతనికి. నగరంలో వున్న జను లాబాలగోపాలమూ సూర్యుణ్ణి చూసినట్టు చూస్తా రతణ్ణి.

ఇదిగో, రాజపురుషులు వినండి.

వీధు లన్నీ కలయంపులు చల్లించి ధ్వజాలతోనూ, పతాకాల తోనూ, పూలదండలతోనూ యిళ్ళన్నీ అలంకరింపించండి. దుశ్శాసనుని భవనం దుర్యోధనుని భవనంకంటే చాలా గొప్పది, అది చాలా చక్కగా అలంకరింపించండి. అన్ని ఋతువుల్లోనూ సుఖావహ మైన దాభవనం. చూడ సొంపయినది. చక్కనిమేడలు దాని చుట్టూ యెన్నోవున్నాయి. నాదగ్గిరా దుర్యోధనుని దగ్గిరా వున్న రత్నా భరణా లన్నీ పట్టుకువెళ్ళి అక్కడ వుంచండి. ఆభవనంలో విడి యించండి శ్రీకృష్ణుణ్ణి. దగ్గిర కనిపెట్టుకుని వుండి ఏవిధమైన లోపమూ రాకుండా చూస్తూవుండండి"

## 87

### "న య వం చ న క ట్టి పె ట్టు"

ఇదంతా విన్నాడు విదురుడు, నిర్మొగమాటంగా ప్రారంభించాడు.
" రాజేంద్రా, పూజ్యుడవూ, ముల్లోకాల్లోనూ చెప్పుకోతగ్గవాడవూ అయినా విప్పుడు. లోకాలను గౌరవించావు, లోకాల కిష్టుడవూ

అయినావు. నీవయస్సు మళ్ళిపోయివుంది. శాస్త్రంచూసినా, తర్కం చూసినా నువ్విప్పుడు చాలా మెచ్చతగ్గవాడ వైనావు. చంద్రునిలో రేఖా, సూర్యునిలో కాంతీ, సముద్రంలో కెరటాలూ లాగ ధర్మం నీకు సహజం అనుకుంటున్నారు ప్రజలు. నీయీగుణాలు చూసి లోకం అంతా నిన్నాదరిస్తోంది. కనక, ఆగుణాలు నువ్వు బాగా కాపాడు కోవాలి. ఋజుమార్గంలో నడుచుకో. చిన్నతనపుచేష్టలు చేసి నాశనం అయిపోకు.

నీకొడుకులనూ, మనమలనూ, స్నేహితులనూ, ఇష్టులనూ ఎదురు పంపి అతిథి అయివస్తున్న కృష్ణుణ్ణి నువ్వు గౌరవించడానికి పూనుకోడం చాలా బాగుంది. ఈభూమండలం అంతా యిచ్చినా శ్రీకృష్ణునకు తగిన కానుక యిచ్చినట్టు కాదు. అయితే, నానమ్మకం యేమిటో చెప్పనా? నీధర్మం ఇది అని గుర్తించీ, అతనికి ప్రీతికలిగించడం మంచి దనీ నువ్విది చెయ్యడం లేదు. అక్షరాలా ఇది సత్యం. నిజంగా యిదంతా మాయ. మోసం. వంచన. దగా. నువ్విప్పుడు చేస్తున్న దాన్నిబట్టీ నువ్వాడుతున్న మాటలనుబట్టీ నాకిది బాగా స్పష్టం అయి పోయింది. అయిదూళ్ళేగదా, అవయినా చిన్నవే గదా పాండు పుత్రు లడిగారు నిన్ను? అవి యివ్వలేకపోతున్నావే, నువ్వు మోసం చేస్తున్నా వనడంలో తప్పేమి వుందీ? డబ్బిచ్చి నువ్వు శ్రీకృష్ణుణ్ణి కొనేద్దా మని చూస్తున్నావు. ఈదెబ్బతో పాండుపుత్రులకూ శ్రీకృష్ణునకూ భేదం కల్పిద్దా మని చూస్తున్నావు; కాని నీప్రయత్నం ఫలించదు. డబ్బిచ్చీ, మాయలుపన్నీ, మరేవిధంగానూ కూడా కృష్ణుణ్ణీ అర్జునుణ్ణీ విడతీద్దాం అంటే నీకే కాదు, మరెవడికీ సాధ్యం కాదు. కృష్ణుని మాహాత్మ్యం నాకు తెలుసు. అర్జునున కతని యెడల భక్తి యెలాంటిదో, యెంతటిదో కూడా నాకు తెలుసు. కృష్ణునకు అర్జునుడు ప్రాణాలకంటేనూ యెక్కువవాడు. ఎలాంటి

సందర్భంలోనూ, ఎలాంటి కారణాలవల్లా కూడా అర్జును ణ్ణతను విడిచి పెట్టడు. ఇంతేకాదు, పాదప్రక్షాళనమూ, కుశలప్రశ్నలూ తప్ప కృష్ణుడు నువ్విచ్చేది మరేమీ పుచ్చుకోడు. తాకనే తాకడు.

కృష్ణుడు మిక్కిలీ మాననీయుడు; కనక, నువ్వతనికి తగినసన్మానం చెయ్యడమే మంచిది. ఏకోరికతో అతను కౌరవసభకు వస్తున్నాడో ఆకోరిక తీర్చి నువ్వతణ్ణి సేవించుకో. నీకూ, దుర్యోధనునకూ పాండవులకూ శాంతి కోరుతున్నా డతను. నీకిష్టమూ అది? అయితే, కృష్ణుని మాట విని సంధిచేసుకో. నువ్వు తండ్రివి. పాండవులు నీకు కొడుకులు. నువ్వు వృద్ధుడవు. పాండవులు శిశువులు కనక, వారి యెడల నువ్వు తండ్రిగా మసులుకో. వారిప్పటికీ నీయెడల కొడుకులుగానే మసులుకుంటున్నారు"

# 88

## "దుర్యోధనుని మాటలు వినలేను"

దుర్యోధను డందుకున్నాడు. "కృష్ణుని విషయమై విదురుడు చెప్పిందంతా శుద్ధసత్యం. పాండవులంటే కృష్ణున కెంతో అనురాగమూ, అభిమానమూనూ. వారిని విడతియ్యడం యెవరికీ, యెప్పుడూ సాధ్యం కాదు. నాయనా, అనేకరకా లయిన విలవగలవస్తువులు కానుకపెట్టి అనేకవిధాల కృష్ణుణ్ణి సత్కరించా లని చూస్తున్నావు నువ్వు; కాని అది మంచిది కాదు. అంత గొప్ప సన్మానం చెయ్యడం అసలే పనికి రాదు. దేశకాలా లలా వున్నా యిప్పుడు. కృష్ణుడున్నూ దేశకాలాలకు తగ్గట్టే వున్నాడు. అంచేత, నువ్విప్పు డన్నట్టు తనని గౌరవిస్తే మనం తానంటే భయపడి అలా చేశా మనుకుంటా డతను. క్షత్రియుడైనవాడు తన కవమానం జరుగుతుం దన్న పని యేదీ చెయ్యగూడదని నానిశ్చయం.

నిజానికి, కృష్ణుడు, ముల్లోకాలకూ పూజ్యుడే, సందేహం లేదు. నాకు బాగా తెలిసిందే యిది; కాని యిప్పుడతనికేమయినా యివ్వడం కర్తవ్యసరణి కాదు. యుద్ధం ప్రారంభం అయివున్నట్టే లెక్క యిప్పుడు. అది సంధిప్రయత్నాలవల్లా విందులవల్లా ఆగిపోయేది కాదు" అన్నాడతను దృఢంగా.

దీనిమీద భీష్ముడందుకున్నాడు "అబ్బాయీ" అంటూ ధృతరాష్ట్రుణ్ణి పిలిచి. "శ్రీకృష్ణుడు సత్కారం చేస్తే పొంగిపోయేవాడూ, చెయ్యకపోతే మండిపడేవాడూ కాడు. అతణ్ణవమానమూ చెయ్యలేవు నువ్వు. అవమానం చెయ్యవలసినవాడు కానేకా డతను. అతనేదయినా చెయ్యాలని నిశ్చయించుకుంటే అది యెవరూ అడ్డుకోలేరు. కనక, నువ్వు అతనేమి చెబితే అది వెంటనే చెయ్యి. సంధిచేసుకుని పాండవులను శాంతింపచెయ్యమంటాడా, తప్పకుండా చెయ్యి. ధర్మబంధురంగానూ, అర్థయుక్తంగానూ వుంటుం దతనేమి చెప్పినా. నువ్వూ నీబంధువులూ అతను చెప్పినట్టు చెయ్యడం చాలా శ్రేయస్కరం"

భీష్ముడు మాట ముగించాటప్పటికి "కాదు కా" దంటూ అందుకున్నాడు దుర్యోధనుడు. "బతికివుండినంతకాలమూ ఈభూమండలం అంతా నేనే యేలుకుంటాను. ఈనిశ్చయానికిక తిరుగులేదు, నేనిప్పుడొక గొప్ప పని చెయ్యబోతున్నాను. అదేమిటంటావా? పాండవులకు ఏడుగడ అయిన శ్రీకృష్ణుణ్ణి ఇక్కడికి వచ్చిన వెంటనే బంధించేస్తాను. తెల్లవారితే అతనిక్కడికి వస్తాడు. అతణ్ణి బంధించిపారేశానా, యాదవులూ, భూమండలమూ, పాండవులూ కూడా నాకు విధేయులయిపోతారు. తాతా, కనక మనఉపాయాలు కృష్ణునకు తెలియకుండా వుండేటట్టూ, అతణ్ణి బంధిస్తే మనకేమీ అపాయం రాకుండా

వుండేటట్టూ చెయ్యడం నీకు బాగా తెలుసు. అదేమిటో నాకు చెప్పు" అనడిగాడు చివరికతను.

ఇది విని ధృతరాష్ట్రుడూ అతని మంత్రులూ చాలా బాధపడ్డారు. వారి మనస్సంతా చెడిపోయింది. దుర్యోధనుణ్ణి పిలిచి "నాయనా, నువ్వు మహారాజవు. నువ్విలా అనకూడదు. ఇది సనాతనధర్మం కాదు. కృష్ణుడిప్పుడు రాయబారి అయి వస్తున్నాడు. సహజంగా అతను మనకు బంధువు. మిక్కిలీ ఇష్టుడు. కౌరవుల విషయమై అతనెప్పుడూ అపకారం తలపెట్టలేదు. అలాంటి మహాత్ముణ్ణి బంధించడం ధర్మంకాదు" అని గట్టిగా చెప్పాడు.

దీనిమీద ధృతరాష్ట్రుణ్ణి పిలిచి భీష్ముడు "అబ్బాయీ, నీకొడుకు మరీ విపరీతంగా సిద్ధం అవుతున్నాడు. మందబుద్ధి కావడంవల్లా, మంత్రుల దుర్బోధలవల్లా అనర్థాలే కోరుకుంటున్నాడు; గాని క్షేమం కోరుకోడం లేదు. తప్పుదారిలో పడిపోయిన మహాపాపి నీకొడుకు. నీవ్న్ హితుల హితబోధ పెడచెవినిబెట్టి నువ్వుకూడా అతణ్ణే అనుసరిస్తున్నావు. దుర్బుద్ధి అయి నీకొడుకు శ్రీకృష్ణుణ్ణెదిరించాడంటే, పుత్రమిత్రామాత్యులతో కూడా ఉత్తరక్షణంలో నాశనం అయిపోతాడు. అతను మిక్కిలీ క్రూరుడు. ధర్మం విడిచిపెట్టేశాడు. అతని మాటలు నేనిక వినలేను"

ఇలా అని సత్యపరాక్రముడైన భీష్ముడు, సభవిడిచి తన యింటికి వెళ్ళిపోయాడు మండిపడుతూ.

## 89

### కృష్ణుని రాక

అక్కడ, వృకస్థలంలో, తెల్లవారగానే లేచి, కాల్యకృత్యాలు తీర్చుకుని, బ్రాహ్మల సెలవుపొంది హాస్తినాపురానికి బయలుదేరాడు,

శ్రీకృష్ణుడు. వృకస్థలనివాసులు కొంతదూరం అతణ్ణి సాగనంపి సెలవు పొంది వెనక్కి మళ్ళారు. కృష్ణుడు వస్తున్నాడన్న వార్తవిని దుర్యోధనుడు తప్ప తక్కిన కౌరవులందరూ - భీష్ముడూ ద్రోణుడూ, కృపుడున్నూ కూడా చక్కగా అలంకరించుకుని అతని కెదురువెళ్ళారు. పౌరులు కూడా చాలామంది కృష్ణుణ్ణి చూడ్డానికి బయలుదేరారు, రకరకాల వాహనా లెక్కి కొందరూ, కాలినడకనే కొందరూనూ. భీష్ముణ్ణీ, ద్రోణుణ్ణీ, కృపుణ్ణీ, కలుసుకుని, కృష్ణుడు, చుట్టూ మూగి వారు వెంట బయలుదేరగా హస్తినాపురానికి బయలుదేరాడు.

కృష్ణుని గౌరవార్థం పట్నం అంతా బహు చక్కగా అలంకరించారు. రాజమార్గాలు రత్నాభరణాలతో బహూ రమణీయంగా వున్నాయి. స్త్రీలూ వృద్ధులూ పిల్లలూ కూడా యిళ్ళు విడిచి బారులు తీరి వీథుల్లో నుంచున్నారు. వారిమధ్యగా వెళ్ళాడు కృష్ణుడు. ఆమేడ లన్నీ ఆస్త్రీబాలవృద్ధులతో అతనివెంట నడుస్తున్నాయా అన్నట్టున్నాయి.

రాజమార్గాలన్నీ బహూ జనసమ్మర్దంగా వుండడంవల్ల అతివడిగా నడిచే కృష్ణుని గుర్రాలు చాలా మెల్లిగా నడవసాగాయి. కొంతసేపటికి ధృతరాష్ట్రుని భవనం సమీపించింది. దానిచుట్టూ ఎన్నో మేడ లున్నాయి రకరకాలు. అన్నిటిలోనూ ధృతరాష్ట్రుని భవనం మిక్కిలీ తెల్లగా ప్రకాశిస్తోంది. మూడు ప్రాకారాలు దాటి పుండరీకాక్షుడైన శ్రీకృష్ణుడు ముందు రాజభవనమూ, తరవాత సభామండపమూ ప్రవేశించాడు. అప్పుడు సింహాసనంమీద కూచునివున్న అంధరాజు, భీష్మునితోనూ ద్రోణునితోనూపాటు దిగ్గున లేచి నుంచున్నాడు. కృపుడూ, సోమదత్తుడూ, బాహ్లికుడూ కూడా లేచినుంచున్నారు.

వెళ్ళీవెళ్ళడంతోనే కృష్ణుడు ధృతరాష్ట్రుణ్ణి క్షేమం అడిగి చనువుగా మాట్లాడాడు. వయఃక్రమం అనుసరించి అక్కడ వున్న రాజుల దగ్గిరికీ — ముఖ్యంగా భీష్ముని దగ్గిరికీ, ద్రోణుని దగ్గిరికీ, అశ్వత్థామ

దగ్గిరికీ, బాహ్లీకుని దగ్గిరికీ, కృపుని దగ్గిరికీ, సోమదత్తుని దగ్గిరికీ కూడా వెళ్ళి ప్రీతి నెరిపి కుశలప్రశ్న లడిగాడు. అక్కడ గొప్ప ఆసనం వొకటి సిద్ధంగా వుంది. గొప్పగొప్ప అలంకారాలతో మెరిసిపోతోం దది. బంగారపుఆసనం అది. ధృతరాష్ట్రుడు కోరగా ఆగొప్ప ఆసనం మీద కూచున్నాడు, కృష్ణుడు.

ఇంతలో ధృతరాష్ట్రుని పురోహితులు వచ్చి శ్రీకృష్ణునకు గోవూ, మధుపర్కమూ ఉదకమూ సమర్పించారు. ఇదయాక అతను, కౌరవులతోనూ తక్కినవారితోనూ కొంచెంసేపు బంధుమర్యాదలు నెరిపాడు, చనువుగా మాట్లాడుతూ. తరవాత ధృతరాష్ట్రుని సెలవు పొంది అక్కణ్ణుంచి విదురుని భవనానికి వెళ్ళాడు. అది చాలా చక్కనిదీ పెద్దదీని. విదురుడు మంగళవస్తువు లన్నీ పుచ్చుకుని యెదురువచ్చి చాలా ఘనంగా యథాశాస్త్రంగా పూజించాడు కృష్ణుణ్ణి. "దేవా, నిన్ను సందర్శించడంతో నాకు కలిగిన ప్రీతీ, సంతోషమూ ఎంతని చెప్పగలనూ? దేహధారుల కందరికీ అంతరాత్మవు నువ్వు. సకలమూ నీకే తెలుసు" అని కూడా స్తుతించి విదురుడు పాండు పుత్రుల క్షేమం అడిగాడు ప్రీతిగా. అతను ధర్మార్థనిత్యుడూ, సత్పురుషుడూ, రోషరహితుడూ, మహాబుద్ధిశాలీ కనక, కృష్ణుడు పాండవుల క్షేమమూ, సవిస్తరంగా వారి సంగతిసందర్భాలూ చెప్పాడతనికి.

## 90

## కృ ష్ణ కుం తీ స మా వే శ ం

ఆవేళ మధ్యాహ్నం, కృష్ణుడు, తన తండ్రికి చెల్లెలూ, తనకు మేనత్తా అయిన కుంతీదేవి భవనానికి వెళ్ళాడు. చల్లని సూర్యబింబంలా మెరిసి పోతున్నా డతను. అల్లంత దూరాన వుండగానే చూసిం దామె. గుమ్మంలో అడుగుపెట్టాడు, వెళ్ళి అతని కంఠం పెనవేసుకుం దామె,

కొడుకులను తలుచుకుని కుమిలిపోతూ. తన కొడుకులూ కృష్ణుడూ బాగా కలిసిమెలిసి తిరిగివుండడం ఆమెకి తెలుసు. అంచేత అతణ్ణిచూడ గానే బావురుమందామె. తరవాతే చేసిం దతని కుచితమర్యాదలు. గొప్ప ఆసనం వుందక్కడ, దానిమీద కూచోబెట్టింది, పొదివిపట్టుకు తీసుకువెళ్ళి. ఇంతలో డగ్గుత్తిక పట్టుకుం దామెకి. అది తెమల్చు కుంటూ, "నాయనా," అంటూ ప్రారంభించింది.

"చిన్నపణ్ణుంచీ కూడా పెద్దలను సేవించుకోడం అంటే నాకొడు కుల కెంతో శ్రద్ధ. వారిలో వారి కెప్పుడూ యెలాంటి భేదమూ లేదు. అందరూ వొక్కమాటమీద వుంటారు. ఒక్కటే ఆలోచన వారికి. దగాపడి రాజ్యం పోగొట్టుకున్నారు. వందలూ వేలూ జనం కూడా తిరగవలసినవారు, నరసంచారం లేని అడవుల పాలయినారు. క్రోధమూ పొంగూ యెరగరు. బ్రహ్మణ్యులు. సత్యనిరతులు. సుఖమూ ప్రియమూ విడిచి, తమకోసమే దేవుళ్ళాడుతున్న నన్నూ విడిచి, నాహృదయం మాత్రం సమూలంగా వెంటబెట్టుకుని అడవులకు వెళ్ళిపోయారు. అలాంటి కష్టాలుపడవలసినవారు కారు వారు. నాయనా, సింహాలూ పులులూ నిండివున్న అడవుల్లో యెలా వుండ గలిగా రోయి?

తండ్రిలేని పిల్లలు. అల్లారుముద్దుగా పెరిగారు నాచేతిలో. చిన్నప్ప ణ్ణుంచీ నాకొడుకులు, ఏనుగుల ఘీంకారాలూ, గుర్రాల సకిలింపులూ, రథచక్రధ్వనులూ విని మేలుకునేవారు తెల్లవారాటప్పటికి, శంఖా లురిమేవి. భేరీలు మోగేవి. వేణుగానమూ, వీణాధ్వనులూ, బ్రాహ్మల పుణ్యాహఘోషలూ, స్వస్తివచనాలూ యువతీమణుల మంగళగీతాలూ విని మేలుకునేవారు వారు. వస్త్రాలూ, ఆభరణాలూ, ద్రవ్యమూ యిచ్చి బ్రాహ్మల నారాధించేవారు వెంటనే. వెలలేని రత్నకంబళ్ళ మీద మేడమీద పడుకుని నిద్రపోయేవారు వారు. అలాంటివారు

కీకారణ్యాల్లో క్రూరజంతువుల భీకరధ్వనులు విని మేలుకునేవారు కామోసు, పాపం.

వారిలో యుధిష్ఠిరుడు సత్యపరాక్రముడు. సిగ్గుబిడియా లెక్కువ అతనికి. దాంతుడు భూతదయాపరుడు. కామక్రోధ ద్వేషాలు జయించినవాడు. పెద్దల మార్గం తప్పి యెరగ డెప్పుడూ. అంబరీషుడూ, మాంధాతా, యయాతీ, నహుషుడూ, భరతుడూ, దిలీపుడూ, శిబీ, ఔశీనరుడూ, — ఇలాంటి మహారాజులు భరించిన భూభారం వహించిన వా డతను. అది రాజసామాన్యులకు సాధ్యపడేది కాదు. గొప్పశీలమూ మంచి స్వభావమూనూ అతనిది. సకలధర్మాలూ తెలిసినవాడు. సత్య సంగరుడు. త్రిలోకాలూ మేలతగ్గవాడు. అజాతశత్రువు. ధర్మాత్ముడు. మేలిమిబంగరువన్నె వాడు. కౌరవు లందరిలోనూ మిక్కిలీ గొప్పవాడు. ప్రియదర్శి. ఆజానుబాహుడు. ఆయుధిష్ఠిరు డిప్పు డెలా వున్నాడూ?

వెయ్యేనుగుల బలంగలవాడు భీమసేనుడు. వాయువేగం అతనిది. పగా, కసీ యెక్కు వతనికి. అతనంటే నాకెంతో యిష్టం. అన్న దమ్ము లందరికీ ప్రీతి కలిగిస్తూ వుంటా డెప్పుడూ. కీచకుల నందరినీ కలిపి సంహరించిన మహావీరుడు. శూరుల్లో కల్లా గొప్ప శూరుడు. హిడింబాసురుణ్ణీ బకుణ్ణీ క్షణంలో రూపుమాపిన మేరుధీరుడు. పరాక్రమంలో యింద్రుడూ, బలంలో వాయుదేవుడూ, క్రోధంలో మహేశ్వరుడూ మాత్రమే అతనికి సాటి. యోధు లెందరయినా వున్నారు; గాని అలాంటి యోధుడు మాత్రం లేడు. క్రోధమూ, బలమూ, పగా, కసీ అణిచిపెట్టుకుని తనకు తానే వశి అయి ధర్మరాజు ఆజ్ఞలు చెల్లిస్తున్నాడు. తేజోనిధి అతను. అమిత మైన ఓజ స్సతనిది. చూడ్డానికే మిక్కిలీ భయంకరంగా వుంటాడు. శత్రువైనవా డెవడైనా యెదిరిస్తాడా, చీల్చిచెండాడుతాడు, గాని విడిచిపెట్టడు. పరిఘలవంటి వతని బాహువులు. ఆభీమసేనుడు క్షేమంగా వున్నాడా తండ్రీ?

ఎప్పుడో వెళ్ళిపోయాడు వెయ్యిచేతుల కార్తవీర్యుడు! కాని రెండుచేతుల నాఅర్జును డిప్పటికీ అతనంటే గుర్రుగానే వుంటున్నాడు, "ఎందుకూ? ఇప్పుడు లేడు మరి" అనుకుంటూ. ఒక్కపట్టున అయిదు వందల బాణాలు గుప్పుతాడు నానాయన. తేజస్సులో సూర్య భగవానుడూ శమదమాల్లో మహర్షులూ, క్షమలో భూదేవీ, విక్ర మంలో దేవేంద్రుడూ మాత్రమే నాబిడ్డకి సరిపోల్తారు. కౌరవులకు మహారాజ్యం అంతా సంపాదించి యిచ్చినవా డతను. నాబిడ్డల కంద రికీ అతని బాహుబలమే పెట్టనికోట. మహారథికు లయినవారిలో అత నొక్కడే చెప్పుకో తగ్గవాడు. ఎదిరించాడా, ఎవ డయినా సరే వాడు, బతికి అవతలికి వెళ్ళలే డతణ్ణి. సకలభూతాలనూ జయించా డతను. అతణ్ణి మాత్రం యెవరూ జయించలేరు. దేవతల కింద్రుడులాంటివా డతను పాండవుల కందరికీ. నీకు సోదరుడూ సఖుడూ కూడాను. నాబిడ్డ అర్జునుడు సుఖంగా వున్నాడా మాధవా?

జనార్దనా, సహదేవు డున్నాడు మిక్కిలీ సిగ్గరి అతను. చాలా దయగలవాడు. అస్త్రశస్త్రాల్లో మేటి. చాలామెత్తనివాడు. సుకు మారుడు ధార్మికుడు. నాకెంతో యిష్టం అతనంటే. గొప్ప విలు కాడూ మహాశూరుడూనూ అతను. యుద్ధరంగంలో చూడాలి, నానాయన ఆటోపం. అన్నల నారాధించడంలో అలాంటివాడు పృథివిమీద మరొకడు లేడు. ధర్మార్థాలు క్షుణ్ణంగా తెలుసు అతనికి. అతని ప్రవృత్తి చూసి అన్నలంతా యెంతో ఆనందిస్తారు. కాలుకదప నివ్వడు నన్నతను. మాద్రిముద్దుబిడ్డ నాసహదేవుడు క్షేమంగావున్నాడా?

పాండవుల్లో కల్లా అందగాడు నకులుడు. అన్నలకూ తమ్ముడికీ కూడా అతనంటే మహాయిష్టం. వారికి బహిఃప్రాణం అతను. గొప్ప విలుకాడు. చిత్రవిచిత్రంగా యుద్ధంచెయ్యడంలో చాలా నేర్పరి. నాచేతుల్లో పెరిగా డతను. సుఖాలకే తగినవాడు. మహారథుడు.

అతణ్ణి మళ్ళీ యెప్పుడు చూస్తాను కృష్ణా నేను? అతణ్ణొక్కణ్ణీ చూడకుండా క్షణం అయినా బతకలేన్నేను. కొడుకుల నందరినీ విడిచిపెట్టి యిలా వున్నాను చూస్తున్నావుటయ్యా?

కృష్ణా, కొడుకు లంతా వొకయెత్తూ ద్రౌపది వొక్కర్తీ వొకయెత్తూను నాకు. మళ్ళీ మాట్లాడితే, నాకొడుకులకంటే నాకామే యెక్కువని చెబుతాను. గొప్పకులీనురాలామె. చక్కనిచుక్క. సుగుణాల వొప్పులకుప్ప. కొడుకుల నందరినీ కాదని భర్తలవెంటబడింది. సత్యమే పలుకుతుం దెప్పుడూ. చిన్నప్పణ్ణుంచీ సకలసుఖాలూ అనుభవించింది. అగ్నికల్పులు-మహాశూరులు-గొప్పవిలుకాళ్లు అయిదుగురు భర్తలుండిన్నీ దుఃఖాల పాలబడింది. కొడుకులకు దూరం అయి, ఎన్నోకష్టాల్లోనూ దుఃఖాల్లోనూ మునిగివున్న నాకోడలిని ఈపద్నాలుగో సంవత్సరంలోనైనా చూసుకుంటానా నేను? అల్లుడా, పుణ్యకర్మలవల్ల మాత్రమే పురుషుడు సుఖాలు సంపాదించుకోలేడు. ఏమంటే ద్రౌపదికంటే పుణ్యాత్మురాలుండా భూమ్మీద? మరి ఆమె కలాంటి కష్టాలెందుకు వచ్చాయీ? నిజం చెప్పనా నాయనా? అర్జునుడూ, యుధిష్ఠిరుడూ, భీమసేనుడూ, నకులసహదేవులూ — వీరందరూ కూడా ద్రౌపది తరవాతే నాకు. నాతల్లిని సభకు లాక్కువచ్చారు చూడూ ఆవేళ? నేనప్పు డనుభవించిన దుఃఖం అంతకి ముందూ యెరగను, తరవాతా యెరగ నెప్పుడూ. స్త్రీధర్మాల్లో వొక్కటీ తప్పి యెరగని వుత్తమాయిల్లాలామె. అత్తమామ లక్కడే వున్నా రా సమయాన. క్రోధీ, లోభీ అయిన దుర్యోధనుడు బలవంతాన సభకి తెప్పించాడామెని. ఏకవస్త్ర అయి వుం దప్పుడు. ధృతరాష్ట్రుడూ, మహారాజు బాహ్లికుడూ, కృపుడూ, సోమదత్తుడూ కౌరవులూ కొయ్యాయిపోయూరాదుండగం చూసి. కృష్ణా, అప్పుడాసభలో వుండినవా రందరిలోనూ వొక్కవిదురుణ్ణి మాత్రమే పూజిస్తా న్నేను. ప్రవృత్తిని బట్టే

పూజ్యు డవుతా డెవడైనా డబ్బునిబట్టీ, వయస్సునిబట్టీ కాదు. మహా బుద్ధిశాలీ, గంభీరహృదయుడూ, మహాత్ముడూ అయిన విదురుని శీలం వొక్కటే లోకా లన్నీ నిలవబెడుతోంది''

కృష్ణుణ్ణి చూడగలిగినందు కానందం; కాని తనస్థితి చూసుకుంటే దుఃఖం. కుంతిస్థితి అప్పు డిది. ఈఅవస్థలో తన దుఃఖా లన్నీ చెప్పు కుం దతనికి. పూర్వపురాజులు కూడా జూదం ఆడారు. వేటకీ వెళ్ళారు; కాని దానివల్ల వారెవరూ సుఖపడలేదు "మరేమీ లేదు కృష్ణా ఆవేళ ద్రౌపదిని సభకి లాక్కువచ్చి దుర్యోధనాదు లనేకవిధాల పరాభవించారు. అదొక్కటే నన్ను కాల్చేస్తోంది. అంతకంటే మరణం మేలు కాదటయ్యా తండ్రీ? నాకొడుకు లడవులపాలయినారు. అజ్ఞాత వాసం చేశారు. ఎన్నో దుఃఖా లనుభవించారు. అంతటితో చాల లేదు. నాబావగారికొడుకు విసిరికొడుతూ పడవేసే మెతుకులు తింటున్నా న్నేనిక్కడ. ఇప్పుడు పద్నాలుగో సంవత్సరం నడుస్తోంది. దుఃఖా లనుభవించాం కనక పాపా లన్నీ నశించాయి.

కృష్ణా, నాకొడుకుల నొకవిధంగానూ, నాతోటికోడలి కొడుకుల నొకవిధంగానూ చూడలేదు నేనెప్పుడూ. ఈసత్యం చాలు నాకు. నువ్వూ నాకొడుకులూ శత్రువుల నందరినీ సంహరించి సకలసంపదలూ అనుభవిస్తారు. అది కళ్ళతో చూసుకుంటా న్నేను, సందేహంలేదు. నాకొడుకులనూ నిన్నూ యెవరూ జయించలేరు.

నాయనా, నన్ను నిందించుకో న్నేను. దుర్యోధనుణ్ణీ నిందించను. నాతండ్రి యాచకులకు డబ్బిచ్చి పంపివేసేటట్టు నన్ను కుంతిభోజున కిచ్చి పంపివేశాడు. అతణ్ణి నిందిస్తా నంతే. నేను బంతి ఆడు కుంటున్నా నప్పుడు. ఇంకా నాచేతిలోనే వుంది బంతి, నేను విసర లేదు. అలాంటప్పు డిచ్చాడు కుంతిభోజునకు నన్ను. అప్పు డలా తండ్రి విడిచిపెట్టాడు నన్ను. మామలు విడిచిపెట్టారు నన్ను. బతికి వుండినందుకు ఫలం యేమిటి కృష్ణా నాకు?

అర్జునుణ్ణి కన్నప్పుడు పురిటిలో వొకనాటి రాత్రి ఆకాశవాణి మాటలు వినిపించాయి నాకు. "కుంతీ, నీయీకొడుకు భూమండలం అంతా జయిస్తాడు. ఇతనికీర్తితో నిండిపోతుంది స్వర్గం. ఘోరమైన యుద్ధంచేసి కౌరవుల నందరినీ సంహరించి, రాజ్యం అంతా స్వాధీనం చేసుకుని అన్నదమ్ములందరితోనూ మిక్కిలీ సుఖపడతాడు. అశ్వమేధ యాగాలు చేస్తాడు మున్నూరు" అన్న మాట లవి. ఇప్పటికీ ఆమాటలు నిజం అవుతా యన్నట్టు కనపడ్డం లేదు నాకు. అయితే, అందు కేడవను నేను. ధర్మదేవతకు నమస్కారం. కృష్ణా, ధర్మం అంటూ వుంటే నువ్వామాటలు నిజం అనిపిస్తావు. నాభర్త చనిపోయినందుకు దుఃఖం లేదు నాకు. నాకు డబ్బులేదని దుఃఖం లేదు. నాకు విరోధు లున్నా రనిన్నీ దుఃఖం లేదు. నాకొడుకులకు నేను దూరం అయిపోయాను. ఇదొక్కటే నన్ను కాల్చేస్తోంది.

విలుకాళ్ళందరికీ నెత్తిమీదివాడు, నాఅర్జునుణ్ణి కళ్ళతో చూసు కోందే నాకు శాంతి యెక్కడిది కృష్ణా? పద్నాలుగో సంవత్సరంలో నయినా, నాకొడుకులను చూసుకోలేకపోతున్నాను గదా నేను? చచ్చిపోయినవాళ్ళకి శ్రాద్ధంచేస్తారు జనులు. నిజానికి, నాకొడులకూ నేను లేనిదాన్నయిపోయాను, వాళ్ళూ నాకు లేనివాళ్ళయిపోయారు.

మాధవా, నా యుధిష్ఠిరునితో నేనన్నా నని యిలా చెప్పు. "నాయనా, నీధర్మం చాలా గొప్పది; కాని వ్యర్థం అయిపోతోం దది. అదలా అయిపోనివ్వకు. ఇతరుల పంచలబడి బతికే ఆడదాని జీవితం మిక్కిలీ నీచం. దీనంగా దేవురిస్తే చేతికివచ్చేది అనుభవించడం కంటే అవమానం మరొకటి లేదు" తరవాత అర్జునునితో యిలా చెప్పు. ఎప్పుడు యుద్ధరంగలో వురుకుదామా అని చూస్తూ వుంటాడు భీమసేనుడు. అతనితో గూడా యిలా చెప్పు. "క్షత్రియస్త్రీ కొడుకుల నెందుకోసం కంటుందో అందు కిప్పుడు సమయం

వచ్చింది. లోకం మిమ్మల్నింతవఱకూ చాలా చాలా గొప్పగా చూస్తోంది ; కాని యీ సమయం మించబెట్టుకుంటే మాత్రం చాలా దారుణంగా గర్హిస్తుంది. మీరు అలా గర్హించబడ్డా రంటే మాత్రం నేనిక మీ మొగం చూడను. శాశ్వతంగా విడిచిపెట్టేస్తాను మిమ్మల్ని. సమయంవస్తే ప్రాణా లయినా విడిచిపెట్టడం చాలా గొప్ప " క్షత్రియధర్మనిరతు లయిన నకులసహదేవులతో గూడా యిలా అను. " బలపరాక్రమాలు చూపించి సంపాదించుకున్న భోగ భాగ్యాలు బతుక్కంటే చాలా గొప్పవి. క్షత్రియు డైనవాడికి అలా సంపాదించుకుంటేనే ఆనందం కలిగిస్తా యవి." పురుషో త్తమా ! ద్రౌపది యెలా చెబితే అలా నడుచుకో మన్నానని అర్జునునితో మళ్ళీ మళ్ళీ చెప్పేం నాయనా ".

కోపంవస్తే యముణ్ణికూడా మించిపోతారు భీమార్జునులు. దేవతలను కూడా సంహరించేస్తారు. ద్రౌపది సభలో అవమానం పొందడమూ, దుశ్శాసనుని వల్లా కర్ణుని వల్లా అలాంటి మాటలు పడ్డమూ ఆమె మాట కేం, భీమార్జునుల కే తలవొంపులపని. మానవంతుడైన భీమసేను ణ్ణన్న మాటలకు త్వరలోనే ఫలం అనుభవిస్తాడు దుర్యోధనుడు. పగ పెంచుకున్నాడా, అది తీరందే భీమసేనుడు శాంతించడం అంటూ వుండదిక. ఎంతకాలాని కయినా అది తీరిపోవలసిందే, మరి దారిలేదు. తన శత్రువులను బుగ్గిచెయ్యాలి, అప్పుడు శాంతించా లతను.

నాకొడుకులకు రాజ్యభ్రంశం తటస్థించడం నాకు దుఃఖం కలిగిం చడం లేదు. జూదంలో వారోడిపోడమూ, అడవులుపట్టిపోడమూ కూడా నాకు దుఃఖం కలిగించడం లేదు. ఏకవస్త్ర అయివుండగా కౌర వులు ద్రౌపదిని సభకు లాక్కురావడమూ, కానిమాట లనడమూ — ఇదే నాపేగులు తోడేస్తోంది.

నాబిడ్డ యెప్పుడూ స్త్రీధర్మాలు తప్పదు. క్షత్రియధర్మాలూ జవ దాటదు. అయిదుగురు భర్తలుండినా అనాథ అయిపోయిం దప్పుడామె. కృష్ణా, నాకూ నాకొడుకులకూ నువ్వే దిక్కు. నిన్ను చూసుకునీ మహాబలపరాక్రమశాలి బలరామన్నను చూసుకునీ, మహారథుడైన ప్రద్యుమ్నుణ్ణి చూసుకునీ, తేరిచూడరాని భీమసేనుడూ, వెనకంజ యెరగని అర్జునుడూ బతికివున్నారు కనకా, నేనీ దుఃఖా లన్నీ భరించుకువస్తున్నాను ".

" అత్తయ్యా, వద్దు, నువ్విక శోకించవలసిన పనిలేదు " అంటూ వోదార్చా డామెని శ్రీకృష్ణుడు. " ముల్లోకాల్లోనూ లేదు నీవంటి స్త్రీరత్నం మరొకతె. యదువంశంలో, మహారాజు శూరుని కడుపున పుట్టి, వొక మడుగులోనుంచి మరో మడుగులో పడ్డట్టు, పాండుమహారాజు చెయ్యిపట్టి, ఆజమేధవంశం మెట్టావు నువ్వు. సకలైశ్వర్యాలూ అనుభవించావు. మంగళదేవత వని ప్రఖ్యాతి పొందావు. భర్త ఆదరానికి పాత్రం అయినావు. వీరపత్నివి మాత్రమే కాదు, వీరమాతవున్నూ నువ్వు. సుగుణా లన్నీ నీదగ్గిరే వున్నాయి. నీయంతటి ప్రాజ్ఞురాలు మరెక్కడా లేదు. కనక, సుఖాలూ దుఃఖాలూ కూడా సమంగా చూసుకోవాలి నువ్వు. నీకొడుకులు, నిద్రా తంద్రా, క్రోధమూ హర్షమూ, ఆకలీ దప్పికా, చలీ ఎండా — ఇలాంటి ద్వంద్వాల కతీతులై వీరులు మాత్రమే అనుభవించతగ్గ సుఖాలకోసమే యెదురు చూస్తున్నారు. నీ కొడుకులవంటి ఉత్తములు స్వల్పా లాశించ రెప్పుడూ. ధీరు లయినవారు సామ్రాజ్యం అయినా యేలుకుంటారు, వానప్రస్థాశ్రమం అయినా స్వీకరిస్తారు. కొద్దిపాటి ఐశ్వర్యం కళ్లతో అయినా చూడరు. పరబ్రహ్మానందమే సుఖం అన్నారు పెద్దలు. దానికి భిన్నమైన దంతా దుఃఖమే నమ్మా !

తాము కుశలంగా వున్నారు, నీకొడుకులూ ద్రౌపదీ నీకుశలం అడిగారు. శత్రువుల నందరినీ నాశనం చేసేసి, లోకానికంతకూ ప్రభువులై, సిరిసంపదలతో తులతూగుతూ నీకొడుకు లష్టైశ్వర్యాలూ అనుభవిస్తారు, త్వరలోనే చూస్తావు నువ్వది. కనక, విచారించకు. నిశ్చలంగా వుండు" అనికూడా చెప్పా డతను, సాదరంగా.

"అల్లుడా" అంది కుంతి నిట్టూర్పు విడిచి. "నీకేది మంచి దని తోస్తుందో, ఏది చేస్తే హితం కలుగుతుందో అదల్లా చెయ్యి. ధర్మానికి లోపం రాకూడదు. మోసం వుండగూడదు. దగా చెయ్యరాదు. అంతే నాక్కావలసింది. నాకొడుకులను నువ్విలా కనిపెడుతూ వుండాలి సుమా! నీశక్తిసామర్థ్యాలు నాకు తెలుసు. నీసత్యనిరతీ, నీమహాకులీనతా నాకు తెలుసు. పథకాలు వెయ్యడంలోనూ, నడిపించడంలోనూ, బలపరాక్రమాలు చూపించడంలోనూ శత్రువులను దుంపనాశనం చెయ్యడంలోనూ నీకు చాలినవా రెవరూ లేరు. నువ్వే మాకు ధర్మం. నువ్వే మాకు సత్యం. నువ్వే మాకు తపస్సు. నువ్వే మాకు రక్ష. నువ్వే మాకు పరమాత్మవు. అంతా నీచేతిలో వుంది. నువ్వేమితలుచుకుంటే అదే అవుతుంది" అంటూ కృష్ణుని రెండు చేతులూ పట్టుకుంది కుంతి.

ఆమె సెలవుపొంది, ఆమెకి ప్రదక్షిణం చేసి, దుర్యోధనభవనానికి బయలుదేరాడు శ్రీకృష్ణుడు.

# 91

## "భోజనం మాట ముందుముందు"

అక్కడ వుండినంత ఐశ్వర్యం మరెక్కడా లేదు. ఇంద్రభవనమే సాటి దానికి. చిత్రాతిచిత్రాలైన ఆసనా లున్నా యక్కడ. మూడ్ను

ప్రాకారాలు దాటివెళ్ళా డక్కడికి కృష్ణుడు. ద్వారపాలకు లతణ్ణి చూసి కిక్కురుమనలేదు. వెనక్కి వెనక్కి తప్పుకున్నారు. పర్వతశిఖరం లాగా, నీరదనీలమేఘం లాగా మహోన్నతంగా వుందది. దానిశోభ చెప్పతరంకాదు. ఆమేడలో రాజు లందరూ పరివేష్టించి సేవిస్తున్నారు దుర్యోధనుణ్ణి. సుధర్మలో దేవేంద్రు డున్న ట్టున్నా డతను. దుర్యోధనునకు దగ్గిరగా దుశ్శాసనుడూ, కర్ణుడూ, శకునీ కూచునివున్నారు.

కృష్ణుడు కనపడ్డంతోటే దిగ్గున లేచాడు దుర్యోధనుడు. అతనితో పాటే దుశ్శాసనుడూ, కర్ణుడూ శకునీకూడా లేచారు. అక్కడ గొప్ప ఆసనం వొక టుంది, విడిగా. బంగారపు ఆసనం అది. చాలా రమ్యంగా వుంది. దుర్యోధనుడు ఆహ్వానించి చూపించగా దానిమీద కూచున్నాడు కృష్ణుడు. వెంటనే గోవూ, మధుపర్కమూ, ఉదకమూ సమర్పించి "ఇవిగో మాభవనాలు. ఇదిగో మారాజ్యం. ఇరిగో మాకౌరవులు. అంతా నీవాళ్ళం. అదంతా నీసొత్తు" అని మర్యాదగా చెప్పాడు దుర్యోధనుడు. కౌరవులూ రాజులూ కూడా కృష్ణుణ్ణి మిక్కిలీ గౌరవించారు.

ఇదంతా అయాక "భోజనానికి లేదాం" అన్నాడు దుర్యోధనుడు కృష్ణునితో "దానికేం, తరవాత చూసుకుందాం దానిమాట" అంటూ తేల్చేశాడు వెంటనే కృష్ణుడు. దుర్యోధను డప్పుడు "బాగా గమనిస్తూ వుండు" అన్నట్టు కర్ణుణ్ణొక్కమాటు సంబోధించి "కృష్ణా, నీకోసం అపురూపా లయిన వంటలు చేయించాను. రకరకాల పానీయాలూ, వెలలేని బట్టలూ వింతవింత శయ్యలూ ఏర్పాటుచేయించాను. నువ్వేందు కంగీకరించవూ?" అనడిగాడు. కానయితే చాలా మృదువుగానే అడిగా డతను; కాని "లేకపోతే, జాగ్రత్తసుమా" అన్న శాఠ్యస్ఫురణ మాత్రం వుంది. దాల్లో. "నువ్వు పాండవులకూ మాకూ సమానంగానే సాయంచేశావు. ఉభయుల శ్రేయస్సూ కోరు

తూనే వున్నావు నువ్వు. మానాయనకు నువ్వు దగ్గిర చుట్టానివి. ఇంతే కాదు, నువ్వే తనకి ప్రభు వ్వని ఆయన విశ్వాసం. ధర్మార్థాలున్నూ బాగా తెలిసినవాడవు నువ్వు. మరి, మాఆతిథ్యం తిరస్కరించడాని క్కారణం యేమిటీ ?" అని అడిగాడు దుర్యోధనుడు.

ఒక్క మందహాసం విసిరాడు ముందు, కృష్ణుడు. తరవాత దుర్యోధనుని భుజంతట్టి "రాచకార్యంమీద వచ్చిన దూతలు తాము వచ్చిన పని సానుకూలం అయితేనే భోజనంచేస్తారు, గౌరవమర్యాదలూ స్వీకరిస్తారు. కనక, నువ్వు నన్ను ముందు కృతార్థుణ్ణి చెయ్యి. తరవాత, నువ్వూ నీమంత్రులూ గౌరవం చెయ్యండి స్వీకరిస్తాను" అని బదులుచెప్పాడు దానికి కృష్ణుడు. ఉపమితున్న ట్టున్నా యామాటలు. స్పష్టంగా వున్నాయి ; సాకూతంగానూ వున్నాయి. పొందికగానూ, అక్షరస్ఖాలిత్యా ల్లేకుండా పొంకంగానూ వున్నాయి. హేతుబద్ధంగా కూడా వున్నా యెటు చూసినా.

దీనిమీద దుర్యోధనుడు "కృష్ణా, మావిషయమై నువ్వు మరోవిధంగా భావించడం ధర్మంకాదు. నువ్వు కృతార్థుడ వయినా కాకపోయినా నిన్ను పూజించడం మాధర్మం. నీకు తగ్గట్టు పూజించలేమనుకో. అయినా, ప్రీతితో మేము చెయ్యదలుచుకున్న సత్కారాలు నువ్వు తిరస్కరించడానికి మాత్రం కారణా లేమీ కనపడ్డం లేదు మాకు. మీకూ మాకూ యెప్పుడూ విరోధా ల్లేవు. భేదభావాలూ లేవు. బాగా ఆలోచించు. నువ్విలా అనడంలో ధర్మం యేమీ లేదు" అన్నాడు, అసంతృప్తి కనపరుస్తూ.

కర్ణాదులకేసి చూసి, చిరునవ్వునవ్వి కృష్ణు డిలా అన్నాడు. "బుద్ధిపూర్వకంగానూ, ద్వేషంపెట్టుకునీ, క్రోధంతోనూ, డబ్బుకోసమూ, వాదానికీ, లోభంవల్లా – ఏవిధంగానూ కూడా ధర్మంతప్పి మాట్లాడ న్నే నెప్పుడూ. ప్రీతివున్నచోట చెయ్యాలి భోజనం. ఆపదలో

వున్నప్పుడున్నూ ఎక్కడపడితే అక్కడ చెయ్యవచ్చు; కాని దుర్యోధనా, నామీద నీకు ప్రీతిలేదు. నేనాపదలోనూ లేనిప్పుడు. పుట్టింది మొదలుకునే పాండవులను ద్వేషిస్తున్నావు నువ్వు. అకారణంగా ద్వేషిస్తున్నావు. వారెప్పుడూ ప్రీతిగా కలిసిమెలిసివుండేవారు. నీకు సోదరులు సుగుణాఢ్యులు. వారి నలా ద్వేషించడం ధర్మంకాదు నీకు. పాండవులు ధర్మం తప్పి యెరగరు. అలా కాదని యెవరైనా చెప్పగల రేమో చూడు. వారిని ద్వేషించేవాడు నన్నూ ద్వేషిస్తున్నట్టే లెక్క. వారి నాదరించేవాడు నన్నూ ఆదరిస్తున్నా డనే నిశ్చయం. ధర్మతత్పరులైన పాండవులకూ నాకూ వొకటే ప్రాణం. నువ్విది బాగా తెలుసుకో. కామక్రోధాదులకు లోబడిపోయి, అజ్ఞానిన్నీ అయి విరోధం పెంచుకునేవాడూ, గుణవంతులను ద్వేషించేవాడూ పురుషాధము డనిపించుకుంటాడు. అజ్ఞానంవల్లా లోభంవల్లా మంచిగుణాలుగల జ్ఞాతులను ద్వేషించేవాడు, ఆత్మనిగ్రహం కలవాడు కాడు. క్రోధం జయించినవాడూ కాడు. త్వరలోనే నశించేపోతాడు వాడు. గుణవంతులయినవారిలో కూడా తన కిష్టంలేనివా రుండవచ్చు. ప్రీతి కనబరిచి వారిని లోబరుచుకోగలవాడు యశస్వి అవుతాడు. ఇన్ని కారణాలవల్ల నీయింటో భోజనం చెయ్యడం మంచిది కాదని నేను స్థిరపరుచుకున్నాను. ఈనగరంలో నేను భోజనం చెయ్యదగిన యిల్లేదయినా వుంటే అది విదురుని దొక్కటే"

ఇలా చెప్పి, లేచి, వెంటనే బయటికి వచ్చేశాడు కృష్ణుడు. విదురుని యింటికి వెళ్ళిపోయాడు తిన్నగా. "మ యిళ్ళన్నీ నీవి. మా సకల సంపదలూ నీవి. మేము నీవాళ్ళం" అని మనవిచేసుకుంటూ ద్రోణుడూ, కృపుడూ, భీష్ముడూ, బాహ్లీకుడూ, కౌరవులున్నూ కొందరూ అతనివెంట విదురుని యింటికి వెళ్ళారు; కాని "మీరు నాకు సర్వోపచారాలు చేసినవారే, సందేహం లేదు. కనక, యిప్పటికి మీయిళ్ళకు

వెళ్ళిపొండి" అని మంచి మాటలు చెప్పి వారిని పంపివేశాడు కృష్ణుడు.

విదురు డత ణ్ణనేకవిధాల పూజించాడు. కానుకలున్నా సమ ర్పించా డెన్నో. అవన్నీ బ్రాహ్మల కిచ్చేశాడు కృష్ణుడు. వారిలో వేదవేత్త లయినవారిని చాలా డబ్బున్నూ యిచ్చి సత్కరించాడు. చివరికి, దేవతలతో కూడా యింద్రు డున్నట్టు, కృష్ణుడు, తనవా రంద రితోనూ అక్కడ తృప్తిగా భోజనంచేశాడు.

# 92

## "నీరాక మంచిది కాదు"

ఆరాత్రి, భోజనానంతరం, కొంచెంసేపు విశ్రమించాక "కృష్ణా, నువ్విప్పు డిక్కడికి రావడం యేమీబాగాలే" దంటూ ప్రారంభించాడు విదురుడు.

"దుర్యోధనుడు దీర్ఘక్రోధి. ధర్మార్థాలు లెక్కలే వతనికి. ఇతరు లకు మానభంగం చెయ్యడం వొక క్రీడ అతనికి. కాని తనకి మాత్రం అభిమానం వున్నట్టు మాట్లాడతాడు మహా. పెద్దలమాటలు బుద్ధి పూర్వకంగా నిర్లక్ష్యం చేస్తాడు. ధర్మశాస్త్రం అంటే అతని కొక గడ్డి పరక. తనకి తోచదు, వొకళ్లు చెబితే వినడు. చాలా చెడ్డమన స్సత నిది. మూర్ఖప్పట్టెక్కువ. శ్రేయస్సు పొందతగ్గవాడు కాడు. కామప రవశుడు. తాను మహాప్రాజ్ఞు ణ్ణని యెంతో గర్వంఅతనికి. మిత్రద్రోహం చెయ్యడానికి సుతరామూ సంకోచించడు. ఎవరేం చెప్పినా అనుమాని స్తాడు. స్వయంగా ఏమీ చెయ్యడు. ఎవరయినా మేలుచేస్తే అది అప్పటికప్పుడే మరిచిపోతాడు. ధర్మా లన్నీ విడిచిపెట్టేశాడు. అబద్ధం అంటే—తాను మాత్రమే అబద్ధం ఆడడంఅంటే మహాయిష్టం అతనికి.

ఇంద్రియాలకు వశు డయిపోయివున్నాడు పూర్తిగా. ఒకదారీ తెన్నూ లేకుండా, ఎప్పటి కెలా తోస్తే అలా చేస్తాడు. ఇలాగ యింకా యెన్నెన్నో దోషాలే వున్నా యతనిదగ్గిర చూసినకొద్దీ.

నువ్వు చబితే — నువ్వు చెప్పావు కనక యెంత శ్రేయస్కరం అయినా అదలా చెయ్యడు. భీష్ముడూ, ద్రోణుడూ, కృపుడూ, అశ్వత్థామా, జయద్రథుడూ — వీరంతా తన కేదో వొరగబెడతా రన్నీ నమ్మకంతో సంధి అన్నమాటే వినిపించుకోకుండా వున్నాడు. భీష్మాదులను పాండుపుత్రులు తేరి అయినా చూడలే రని అతని నమ్మకం. ఈవిషయమై కర్ణుడు మరీని. ఎందరో రాజులు తనకి సాయంవచ్చివుండడంవల్ల ఆసేనాసముదయం అంతా చూసుకుని, తాను నెగ్గేశా ననే అనుకుంటున్నాడు దుర్యోధనుడు.

కర్ణు డొక్కడే శత్రువుల నందరినీ చావగొట్టేస్తా డని గొప్ప నమ్మకం అతనికి. అంచేత కూడా సంధి అంటే వినిపించుకోడం లేదతను. కర్ణుడు చేస్తున్నా డదంతా. కౌరవులు బుద్ధిమంతు లనుకుని సంధికోసం ప్రయత్నిస్తున్నావు నువ్వు. కాని పాండుపుత్రులకు నలుసంత కూడా యివ్వకూడ దని గట్టిగా నిశ్చయించుకునివున్నారు వారు. చెవిటివాళ్ల దగ్గిర సంగీతం పాడితే యేమిటీ ప్రయోజనం? మంచిమాటా చెడ్డమాటా కూడా వొక్కవిధంగానే భావించుకునేవాళ్లదగ్గిర ప్రాజ్ఞుడైనవాడు మాటే ఆడగూడదు. బ్రాహ్మడు వెళ్లి చండాలునకు హితోపదేశంచేసిన ట్టుంటుంది, దుర్యోధనునకు నువ్వేమి చెప్పినా.

అత నిప్పుడు పెద్దబలగం కూర్చుకుని వున్నాడు. సహజంగా మూఢుడు. నీమాట పొల్లుపోడం తప్ప మరేమీ ప్రయోజనం వుండదు. నీమాట వినిపించుకోనేవినిపించుకో డసలు. వారంతా దుర్బుద్ధులు. పాపాలకు జంకరు. నువ్వు వారి మధ్యకి రావడమే మంచిది కాదని తోస్తోంది నాకు. వాళ్లలో వొక్కడూ తగు మనిషి కాడు.

మాట్లాడితే పెడర్థాలే తీస్తారండి మా. ఎప్పుడూ దురాలోచనలే చేస్తూవుంటారు. ఒక్కడు కాదు, చాలామంది వున్నారు వాళ్లు. వాళ్ల మధ్యకి వెళ్లి వాళ్లకి వ్యతిరేకంగా నువ్వు మాట్లాడ్డం మంచిదికాదనిపిస్తోంది నాకు.

పెద్దలతో సావాసం లేకపోడం. దానికి సాయం, వల్లమాలిన ఐశ్వర్యం. ఇటు దర్పం. అటు పడుచుదనపు ఉన్మాదం. అన్నిటికీ పైని ఓర్వలేనితనం. దీంతో కళ్లుమూసుకుపోయవున్నారు వాళ్లు. ఎంత శ్రేయస్కరం అయినమాట చెప్తూ నువ్వు, వినిపించుకోరు. తన అపారసైన్యం చూసుకుని విర్రవీగుతున్నాడు దుర్యోధనుడు. నువ్వంటేనే పెద్ద అనుమానం అతనికి. దేవతల నందరినీ వెంటబెట్టుకుని దేవేంద్రుడే దండెత్తివచ్చినా తమ చిటికినవే లయినా కదపలే దని వాళ్లకి గర్వం. ఎంత హేతుబద్ధంగా వుండనీ నీమాట, వాళ్లకి సారహీనంగా కనపడుతుంది.

రథాలూ, గుర్రాలూ, ఏనుగులూ నిండివున్న పెద్దసేన తన చుట్టూ చేర్చుకునివున్నా డతను. ప్రపంచంలో మరేమీ కనపడ్డంలే దతనికి. ఈభూమండలం అంతా తాను జయించేసినట్టే అనుకుంటున్నాడు దుర్యోధనుడు. ఎదిరి అన్నమాట లేకుండా, ఈపృథివి అంతా తానేకచ్ఛత్రాధిపత్యంగా ఏలుకుందా మనుకుంటున్నా డతను. కాగడా పెట్టి వెతికినా శమదమాల్లేవతని దగ్గిర. నిన్ను బంధించేద్దా మనీ, ఇక అంతా తనకే అయిపోతుం దనీ అనుకుంటున్నాడు. ఎందరో మహాయోధులు తమతమ్ముః రాజులతో కదిలివచ్చి అతనిపక్షంగా పాండవులతో యుద్ధంచెయ్యడానికిగుమిగూడివున్నా రిక్కడ. ఆరాజులందరూ ఇదివరలో నీతో విరోధపడివుండినవాళ్లే. నీచేతిలో వాళ్ళప్పుడు కుక్కినపే లయిపోయివుండినవాళ్ళే. నీమీది ఈర్ష్యవల్లే వారంతా యిప్పుడు దుర్యోధనుని పక్షం అయివున్నారు. ప్రాణాల

కున్నా తెగించివున్నారు. కనక, నువ్విప్పుడు వాళ్ళమధ్యకివెళ్ళడం నాకెంతమాత్రమూ ఇష్టంలేదు. నిజానికి, దేవతలకున్నూ అజేయుడవే నువ్వు. నీప్రభావమూ, నీపౌరుషమూ, నీబుద్ధిసూక్ష్మతా నేను బాగా యెరుగుదును. పాండవు లంటే యెంత ప్రీతివుందో నువ్వన్నా అంతప్రీతే వుంది నాకు. అంచేతే — ఆప్రేమవల్లే ఆగౌరవాదరాలవల్లే — ఆసుహృద్భావంవల్లే యిలా చెబుతున్నా న్నేను. ఈసంగతి నేను వాచా చెప్పనే అక్కరలేదు నీకు. ఏమంటే ? శరీరధారుల కందరికీ అంతరాత్మవే నువ్వు.

# 93

## నాకోసం భయపడకు

"ప్రాజ్ఞుడైనవా డెలా చెప్పాలో, విచక్షణ చూపగలవా డెలా విశదంచెయ్యాలో, నావంటి స్నేహితుడికి నీవంటి స్నేహితు డేంచెయ్యాలో అదంతా చేశావు నువ్వు" అన్నాడు కృష్ణుడు ముందు. తరవాత వివరంగా చెప్పడాని కందుకున్నాడు.

"విదురా, ధర్మమూ, సత్యమూ నీరూపంగా మూర్తీభవించాయి. అంచేతనే తల్లీ తండ్రీ చెప్పేటట్టు నువ్వింత చనువుగా — ఇంత ప్రేమగా చెప్పావు నువ్వు. నువ్వు చెప్పిం దంతా సత్యం, సందేహంలేదు. యుక్తియుక్తమూ యీసమయానికి తగ్గదిన్నీ కూడాను, కాదనను; కాని, సాహసించి నేనిక్కడికి రావడాని క్కారణం చెబుతాను విను, శ్రద్ధగా.

దుర్యోధనుని దుస్సంకల్పా లన్నీ నాకు తెలుసు. వచ్చినరాజు లందరూ పగపట్టి నాయెడల మిక్కిలీ కసిగా వున్నా రిదీ నాకు తెలుసు. ఇదంతా తెలిసివుంది కనకనే కౌరవులతో మాట్లాడ్డానికి వచ్చా న్నేను. స్థావరజంగమాత్మక మైన ఈభూమండలానికి మృత్యుపాశం తప్పించ

గలవాడికి గొప్పధర్మం — అత్యుత్తమధర్మం లభిస్తుంది. తన శక్తి కొద్దీ ధర్మకార్యం చెయ్యడానికి పూనుకున్నవాడికి అది నెరవేరకపోతే పుణ్యం అయినా దొరుకుతుంది, కావలసినంత. ఇందులో సందేహ మేమీ లేదు నాకు. కాక, మనసా పాపసంకల్పాలే వుండినా కూడా పనిచేసేటప్పుడు మాత్రం పాపబుద్ధి లేకుండా వుంటే పాపం అంటదని చెబుతారు ధర్మసూక్ష్మాలు తెలిసిన పెద్దలు.

కౌరవులూ సృంజయులూ యుద్ధంలో కొట్టుకుచావడానికి సర్వ సిద్ధంగా వున్నా రిప్పుడు. అదలా జరక్కుండా సంధిచెయ్యడానికి ప్రయత్నిస్తా న్నే నమాయికంగా. నిజానికి, కౌరవుల కిప్పుడు ఘోర మైన ఆపద కనిపెట్టుకునివుంది. కర్ణుడూ దుర్యోధనుడూ — వీరిద్దరే కారణం దానికి. వీరివల్ల దోసతోటలా వున్నవంశానికి వంశం అంతా తుడిచిపెట్టుకునిపోయే దుర్యోగం సిద్ధంగా వుంది. మిత్రు డైనవా డిలాంటిది తప్పించడానికి పూనుకోకపోడం క్రౌర్యం అవుతుంది. జుట్టు పట్టుకుని తనని కొట్టవచ్చేదాకా — చివరికి కొట్టేదాకా కూడా, మిత్రు డైనవాణ్ణి అకార్యం చెయ్యకుండా అడ్డుకుంటూనే వుండాలి, మనిషయిన వాడు. అలా చెయ్యనివాణ్ణి లోకం గర్హిస్తుంది, గట్టిగా.

నేను కష్టసుఖాలు వివరిస్తూ చెబుతాను. లాభనష్టాలు కనపరుస్తూ చెబుతాను. శుభంకోరుతూనే చెబుతాను. ధర్మార్థబంధురంగానే చెబుతాను. ముఖ్యంగా తనకు మేలు కలిగించడానకే చెబుతాను. ఇదంతా గుర్తించుకుని తనమంత్రులతో కూడా దుర్యోధనుడు నామాట వినడం ధర్మం. పాండవుల కొక్కరికేకాదు, కౌరవులకూ, ఈ భూమండలంలో వున్న తక్కిన రాజులకూ హితం కలిగించడానికే నాపూనిక. నిష్కల్మషంగా పూనుకుంటూ న్నేను. తనకోసమే యింతగా చెబుతున్నా దుర్యోధనుడు నన్ననుమానిస్తాడా ? కానియ్యి, నాకు తృప్తీ కలుగుతుంది, దానివల్ల, పుణ్యమూ వస్తుంది.

జ్ఞాతులకూ బంధువులకూ అభిప్రాయాలు భేదించినప్పుడు అవి నివారించడానికి మధ్యవర్తి అయి ప్రయత్నించని మిత్రుడు మిత్రు డని పించుకోడాని కర్హుడు కాడు. "తనకు శక్తివుండికూడా, కొట్టుకోడానికి సిద్ధపడుతున్న పాండవులనూ కౌరవులనూ శాంతింపచేశాడు కాడు" అని, అధర్మపరులూ, మూఢులూ, విరోధులూ కూడా నిందించ లేరు నన్నిక. కౌరవులు నామాట వినకపోతే పోనీ, నాకు లోకాపవా దయినా తప్పిపోతుంది.

దుర్యోధనుడు చిన్నపిల్లకాయ కాడు. ధర్మార్థయుక్తంగా చెబుతా గాని మరోవిధంగా చెప్పన్నేను. శ్రేయస్సుకలిగిస్తుందిగాని కీడుచెయ్యదు నేనుచెప్పేది. అయినా, నామాట వినడూ, అతను ? చెడతాడు, సమూ లంగా నాశనం అయిపోతాడు, నాకేం ? పాండవులకు నష్టం లేకుండా కౌరవులను శాంతింపచెయ్య కలిగితే నాకు పుణ్యమూ తక్కుతుంది, కౌరవులు బతికిపోతారు. నామాట మంగళకరం అనీ, ధర్మార్థబం ధురం అనీ, అహింసాపర మనీ గ్రహించి సంధికి అంగీకరించేటట్టయితే కౌరవులు నన్ను పూజించా రన్నమాటే.

విదురా, ఒక్కటి చెబుతా విను. తక్కిన అన్ని జాతుల మృగాలూ కలిసి కట్టకట్టుకువచ్చినా, కళ్ళెర్రజేసిం దంటే, సింహంయెదట నిలవనే లేవు. అలాగే, భూమండలంలో వున్న రాజు లందరూ కూడబలు క్కుని వచ్చినా నాయెదట ఆగలేరు"

తరవాత, ధర్మార్థకామాలకు సంబంధించిన వివరా లెన్నో చెప్పాడు కృష్ణుడు. ఆచెప్పడంలో యెన్నో భాషా చమత్కారాలు చూపించాడతను. అక్షరరమ్యతలున్నూ చూపించాడు, చాలా. అవన్నీ విని చాలా ఆనందించాడు విదురుడు. అతనుకూడా యెన్నో కథలు చెప్పాడు, ఆప్రసంగానికి తగినవి. కృష్ణు డవన్నీ విన్నాడు. చివరికి,

యాదవుల కందరికీ సకల సుఖాలూ కలిగించే ఆకృష్ణుడు, మెత్తని శయ్యమీద సుఖంగా పడుకుని కమ్మగా నిద్రపోయాడు.

# 94

## కౌరవసభలో

ఆరాత్రి గడిచింది. సూతులూ మాగధులూ వచ్చి చక్కని పాటలు పాడి, శంఖాలూది దుందుభులు మోగించి కృష్ణుణ్ణి మేలుకొలిపారు. ప్రాతఃకాల్యా లన్నీ తీర్చుకుని, స్నానసంధ్యాద్యనుష్ఠాలూ, సూర్యనమస్కారాలూ, ప్రాతరౌపాసనా ముగించుకున్నా డతను.

ఇంతలో దుర్యోధనుడూ శకునీవచ్చి ధృతరాష్ట్ర మహారాజు కొలువు తీరివున్నా డని మనవిచేశారు. "భీష్ముడూ, ద్రోణుడూ, కృపుడూ, రాజు లందరూ కూడా, దేవత లందరూ ఇంద్రుని కోసం యెదురు చూసేటట్టు, నీకోసం యెదురుచూస్తున్నా" రని కూడా చెప్పారు వారు. కృష్ణుడున్నూ వారినిద్దరినీ చాలా ఆదరించాడు, చనువుగా మాట్లాడి.

అప్పటికి నాలుగుబారల పొద్దెక్కింది. కృష్ణుడు, ఆవులూ, గుర్రాలూ బంగారమూ, నూతనవస్త్రాలూ, నవరత్నాలూ యిచ్చి బ్రాహ్మల నెందరినో సత్కరించాడు. ఆసమయంలో వచ్చి సారథి అయిన దారుకు డతనికి వందనాలు సమర్పించుకున్నాడు. వెంటనే రథమున్నూ తీసుకువచ్చా డతను, సర్వసిద్ధంచేసి. శైబ్యమూ, సుగ్రీవమూ, మేఘపుష్పమూ, బలాహమూ పూన్చా డారథాని కతను. రత్నాభరణాలతోనూ బంగారపుమువ్వలతోనూ దేదీప్యమానంగానూ, చాలా చక్కగానూ వున్నాయి, రథమూ గుర్రాలూను. కౌస్తుభమణి ధరించి, అగ్నికీ బ్రాహ్మలకూ ప్రదక్షిణంచేసి కౌరవులతోనూ యాదవులతోనూ చనువుగా మాట్లాడుతూ వచ్చిరథం యెక్కాడు కృష్ణుడు. విదురుడున్నూ యెక్కా డతని వెనకనే.

మరోరథం యెక్కి దుర్యోధనుడూ శకునీ కృష్ణుని వెనక బయలు దేరారు. సాత్యకి రథమూ, కృతవర్మ రథమూ దానివెనక ఉన్నాయి. చాలా మంది యాదవులు గుర్రా లెక్కీ, రథా లెక్కీ ఏనుగు లెక్కీ వారి తరవాత బయలుదేరారు. ఆ యాదవుల రథా లెంతో చక్కగా వున్నాయి. రత్నాభరణాలతో జిగజిగలాడుతున్నాయి. రకరకాల రథా లవి. వాటి గుర్రాలున్నూ దేశదేశాలనుంచీ వచ్చిన ఉత్తమజాతులవి. దారి అంతా చక్కగా తుడిచి కలయం పులు చల్లివుంచా రంతకిముందే. శంఖా లురిమాయి. భేరీకాహాళాల గంభీరధ్వనులతో హస్తినాపురం ముఖరితం అయిపోయింది.

సింహపరాక్రమశాలు లైన విఖ్యాతయోధులు శ్రీకృష్ణుణ్ణి పరివేష్టించి నడిచారు. కత్తులూ, ధనుస్సులూ, గదలూ, మొదలైన రకరకాల ఆయుధాలు ధరించి చిత్రవిచిత్రా లైన వస్త్రాలు ధరించి వున్నారు వారు. అయిదు వందల యేనుగులూ, వేలకొద్దీ రథాలూ కృష్ణు నకు వెనక కొన్నీ ముందు కొన్నీ బయలుదేరాయి. కృష్ణుణ్ణి చూడ్డానికి, ఇళ్లువిడిచి, బయట నిలవబడివున్న స్త్రీలతోనూ వృద్ధుల తోనూ, బాలబాలికలతోనూ నగరవీథులు విలక్షణశోభతో ప్రకా శించాయి. ఆ స్త్రీలందరూ ఆపక్కనా యీపక్కనా చప్టాలమీద నడుస్తూ వుంటే, పచ్చని రకరకాల చెట్లతో అరణ్యాలు కదులుతూ వున్నట్టుంది.

వెంటవస్తున్న కౌరవులు అనేకవిధాల మర్యాద చేస్తున్నారు. జనులు వింతవింతలుగా చెప్పుకుంటూ మెచ్చుకుంటున్నారు. అందరూ ఆబగా చూస్తున్నారు. ఇదంతా వింటున్నాడు కృష్ణుడు. అంతా చూస్తూనూ వున్నా డతను. సభామందిరం సమీపించగానే కృష్ణుని పరిచారకులు శంఖాలూదారు. వేణుగానం చేశారు. అది విని సభలో వున్న రాజు లందరూ కృష్ణు ణ్ణెప్పుడు చూస్తామా అన్న ఉత్కంఠతో

వృాగిపోయారు. ఇంతలో వారికి కృష్ణుని రథధ్వని వినిపించింది. వెంటనే వా రుప్పొంగిపోయారు లోపల.

సభామందిరద్వారం దగ్గిర ఆగింది రథం. మెల్లిగా దిగాడు కృష్ణుడు. ఎదట కైలాసశిఖరం లాగా, నూత్న మేఘం లాగా తేజోబంధురమైన ఇంద్రభవనం అన్నట్టున్న సభామందిరమున్నూ ప్రవేశించాడు. ఒక చేత్తో సాత్యకినీ వొకచేత్తో విదురుణ్ణీ పట్టుకుని వున్నా డతను. సూర్య భగవానుడు జ్యోతిస్సు లన్నీ వెలిగించేటట్టు కౌరవుల నందరినీ తన అపూర్వ తేజస్సుతో ముంచెత్తేస్తున్నాడు. దుర్యోధనుడూ, కర్ణుడూ అతనికి ముందు నడవగా, కృతవర్మా, మరికొందరు యాదవులూ వెనక నడిచారు. అతణ్ణి చూశారు, ముందు ధృతరాష్ట్రుడూ, తరవాత భీష్ముడూ ద్రోణుడూ, కృపుడూ మొదలైనవాళూ లేచినుంచున్నారు. తరవాత రాజు లందరూ లేచారు.

కృష్ణుని కోసం అక్కడ వొక గొప్పఆసనం వుంచా రంతకి ముందే. బంగారంతో సిద్ధపరిచి నవరత్నాలూ పొదిగారు దానికి. అక్కడ వున్న ఆసనా లన్నీ మించివుం దది. చాలా శ్రద్ధపట్టి ధృత రాష్ట్రుడు సిద్ధంచేయించా డది కృష్ణునికోసం. చిఱునవ్వు నవ్వుతూ కృష్ణుడు ధృతరాష్ట్రుణ్ణీ, భీష్ముణ్ణీ, ద్రోణుణ్ణీ, కృపుణ్ణీ, తరవాత వయఃక్రమంగా రాజులనూ పలకరించాడు చనువుగా. కౌరవులూ ఆరాజులూ కూడా మిక్కిలీ ఆదరించా రతణ్ణి.

కృష్ణు డటూ యిటూ చూడగా నారదాదిమహర్షులు వస్తున్నారు. వెంటనే భీష్ముణ్ణి పిలిచి అతను "రాజా, ఇక్కడ చేరివున్న రాజుల నందరినీ చూడ్డానికదే నారదాది మహర్షు లాకాశంనుంచి అవతరిస్తు న్నారు. వారి కాసనా లిచ్చి సత్కారాలు చెయ్యాలి. వా రాసీ నులు కాకుండా మరెవరూ కూచోగూడదు. మనం అందరమూ

నుంచునే వుండాలి. వారిని పూజించే యేర్పాట్లుచేయించు" అని మెల్లిగా చెప్పా డతను.

అప్పటి కప్పుడే ద్వారంలోకి వచ్చారు మహర్షులు. వారు కన పడ్డంతోనే "ఆసనా లాసనా" లంటూ తొందరపెట్టాడు భీష్ముడు పరిచారకులను. వెంటనే యెగిరివస్తున్నట్టు వచ్చా యెన్నో ఆసనా లక్కడికి. రకరకాలవవి. చాలాగొప్పవి. బంగారంతో నిర్మించారవి. రత్నాలతో అలంకరించారు. పురోహితులు వచ్చి అర్ఘ్యపాద్యాది సత్కారాలు చెయ్యగా మహర్షు లందరూ ఎవరికి తగిన ఆసనం వా రలంకరించారు. అప్పుడు కూచున్నాడు కృష్ణుడు, తనకి నిర్దిష్ట మైన ఆసనంమీద. దుశ్శాసనుడు వచ్చి సాత్యకికీ, వివింశతి వచ్చి కృతవర్మకూ ఉత్తమాసనాలు నిర్దేశించారు. కృష్ణునకు మరీ దగ్గరగా దుర్యోధనుడూ కర్ణుడూ కూచున్నారు వొకటే ఆసనంమీద. తర వాత తనకొడుకులతో వచ్చి గాంధారరాజు కూచున్నాడు ప్రత్యేకాస నాలమీద. విదురుడు కృష్ణుడున్న ఆసనం స్పృశిస్తూ దగ్గిరే వున్న మణిపీఠంమీద కూచున్నాడు.

చిరకాలానికి చూశా రక్కడ వున్న రాజు లందరూ కృష్ణుణ్ణి. అమృతం లభించినంతగా ఆనందించారువారు తామప్పు డక్కడ వుండ గలిగినందుకు. నల్లఅవిసెపువ్వురంగులో వున్నాడు కృష్ణుడు. పీతాంబరం ధరించి బంగారంలో తాపడంచేసిన ఇంద్రనీలమణిలా వున్నా డతను. సభ అంతా నిశ్శబ్దం అయిపోయింది.

## 95

### ఉ ప క్ర మ ణి క

ఆస్థితిలో ప్రారంభించాడు కృష్ణుడు. దంతాలకాంతి ముఖాని కొక వింతశోభ కూర్చిం దతనికి. గ్రీష్మఋతువు గడిచిపోగానే బయలుదేరే

నీల మేఘం వురుముతున్నట్టు ధృతరాష్ట్రుణ్ణి పిలిచి, సభలో వున్న వారి కందరికీ వినబడేలాగ అందుకున్నా డతను.

"రాజేంద్రా, వీరాధివీరు లైనవా రందరూ నశించిపోకుండా వుండాలని కౌరవులకూ పాండవులకూ సంధిచేద్దామని కోరివచ్చా న్నే నిక్కడికి. శ్రేయస్కరా లైన సంగతులు నీకెవరూ చెప్పనక్కరలేదు. ఆవిషయంలో తెలియవలసిం దంతా నీకు తెలిసే వుంది. వేద వేదాంగాది విద్యలతోనూ, సదాచారసంపత్తితోనూ, తక్కిన రాజకులాలకంటే కురుకులం మిక్కిలీ శ్రేష్ఠం అయివుంది. ఇతరులకు సుఖం కలిగించాలన్న దృష్టీ, ఇతరుల దుఃఖాలు చూసి జాలిపడే హృదయమూ, కరుణా, ఇతరులకు కష్టాలు కలిగించని నడతా, ఋజుభావమూ, ఓర్పూ, సత్యమూ — ఇవి కురుకులం ప్రత్యేక యోగ్యతలు. మహనీయ మైన ఈవంశానికి ఇవాళ నీవల్ల దారుణ మైన కళంకం రావడం మంచిది కాదు. కౌరవుల కందరికీ నువ్వాధారం. చాటుగానూ బహిరంగంగానూ చెడ్డపనులు చేసేవారిని నిర్దాక్షిణ్యంగా శిక్షించవలసినవాడవు నువ్వే.

నీకొడుకు లైన దుర్యోధనాదులు ధర్మార్థాలు పూర్తిగా విడిచిపెట్టి, క్రూరులై మరీ విచ్చలపడిగా సంచరిస్తున్నారు. శిష్టాచారాలు దూరంచేసుకుని హద్దుపద్దులున్నూ గమనించకుండా, లోభులై గుండెలు రాయచేసుకుని స్వజనుల విషయమయ్యే వారలా ప్రవర్తిస్తున్నారు. ఇది నీకు బాగా తెలుసు. ఘోరమైన ఆపద నీకౌరవులకే సంభవించబోతోంది, మరెవరికీ కాదు. నువ్వేమాత్రం యేమరి వుండినా, భూమండలానికి భూమండలమే నాశనం అయిపోతుంది దీనివల్ల. కులనాశనం కాగూడ దన్న సంకల్పం నీకుంటే సులభంగానే తప్పించవచ్చునిది. ఈసందర్భములో సంధిపొసగడం అసాధ్యం కాదని నానమ్మకం. ఆసంధిచెయ్యవలసిన బాధ్యత ఇటు నీకూ అటు నాకూ

మాత్రమే వుంది. కనక, నీకొడుకులను నువ్వు జాగ్రత్త పెట్టుకో. పాండవులను నేను జాగ్రత్త పెడతాను.

నీకొడుకులకూ, నీమనుమలకూ నీఆజ్ఞ శిరసావహించవలసిన విధి వుంది. దానివల్ల, వారికి, లాభమే కాదు, బలమూ పెరుగుతుంది. ఇది నీకూ మంచిదే, పాండవులకూ మంచిదే, సంధికోసం తాపత్రయపడుతున్న నాకూ మంచిదే. విరోధాలవల్ల లేశమూ లాభం లేదని బాగా బోధించి సంధి చెయ్యి. ఇలా చేస్తే, నీకొడుకులే కాదు, పాండవులున్నా నీవాళ్లే అవుతారు. ధర్మార్థాలు విడిచిపెట్టకు. పాండవులను, నీకు పెట్టని కోట లయివుండేటట్టు చేసుకో. పాండుపుత్రులను జయించాలంటే, యెవరికీ, యెప్పుడూ, యేవిధానా కూడా శక్యంకాదు. పాండవులు నీకు రక్షగా వుంటే దేవతల నందరినీ వెంటబెట్టుకువచ్చి దేవేంద్రుడున్నా నిన్నేమీ చెయ్యలేడు. తక్కినరాజులమాట మరి, చెప్పనే అక్కరలేదు.

భీష్ముడూ, ద్రోణుడూ, కృపుడూ, కర్ణుడూ, వివింశతీ, అశ్వత్థామా, వికర్ణుడూ, సోమదత్తుడూ, బాహ్లికుడూ, సైంధవుడూ, కాళింగుడూ, కాంభోజుడూ, సుదక్షిణుడూ, యుధిష్ఠిరుడూ, భీమసేనుడూ, అర్జునుడూ, నకులసహదేవులూ—వీరందరూ వొకటయివుంటే బుద్ధివుండినవాడెవడైనా వీరి వెదిరించడానికి సాహసించగలడా? కౌరవులూ పాండవులూ కలిసివుంటే నీకు వచ్చే ప్రత్యేకలాభం యేమిటో చెప్పమంటావా? ఈభూమండలాని కంతకీ ఏకచ్ఛత్రాధిపత్యం నీకు లభిస్తుంది. నిన్నెవ్వడూ చెనకలేడు. ఇప్పుడు నీతో సమానులైన రాజులున్నారు కొందరు. అప్పుడు నీతో మైత్రిచేసుకుంటారు వారు, కోరి. ప్రయత్నించి కౌరవులకూ పాండవులకూ సంధి కుదురుస్తారు. నీకు శ్రేయస్సు కోరతారు. కలిగిస్తారు కూడా.

ఇలా జరిగితే, నువ్వూ, కొడుకులతోనూ, మనమలతోనూ, తండ్రులతోనూ, సోదరులతోనూ స్నేహితులతోనూ కలిసిమెలిసివుంటూ, సురక్షితుడవై సకలసుఖాలూ అనుభవిస్తావు. పాండవులను దగ్గిరసా తీసుకుని ఆదరిస్తే నీకు కలిగే ప్రయోజనం యిది. పాండవులనూ నీకొడుకులనూ సమానంగా చూసుకుంటే నువ్వు నీశత్రువులను కూడా నాశనం చెయ్యగలుగుతావు. నీసొంతాని కింతటి ఘనత మరేం వుందీ? పాండవులతోనూ వారి మంత్రులతోనూ సంధిచేసుకుంటే వారు జయించి తెచ్చిన రాజ్యమే ఏలుకుంటావు నువ్వు. యుద్ధం జరిగితే నాశనం తప్పదు. వారికా మీకా? ఇద్దరికీ తప్పదు. ఇంతకు తప్పించి యేం వొరుగుతుం దనుకుంటున్నావూ నువ్వు? ఈయుద్ధంలో పాండవులే చచ్చిపోయినా నీకొడుకులే చచ్చిపోయినా నువ్వు బావుకునే దేమీ లేదు.

పాండుపుత్రులూ నీకొడుకులూ కూడా మహాశూరులు. అస్త్రశస్త్రాల్లో బాగా ఆరితేరినవారు. వారు కొట్టుకోడానికి-నరుక్కోడానికి — నాశనం చేసుకోడానికి సిద్ధపడుతున్నారు. వద్దు, దారుణంగా నశించిపోకుండా వారిని రక్షించుకో. యుద్ధం తప్పకపోతే, నీకొడుకులనూ అందరినీ చూడలేం, పాండుపుత్రులనూ అందరినీ చూడలేం మనం. ఒకరినొకరు కడతేర్చుకుంటారు వారు. రాజు లందరూ మహాకసితో వచ్చివున్నారిక్కడికి. ప్రజలున్నూ అంతా నాశనం అయిపోతారు మీలోమీరే కాదు. అలా జరక్కుండా చూడు.

నువ్వుగాని ముందు శాంతి స్తివా, తక్కిం దంతా సవ్యంగా జరిగిపోతుంది. పాండుపుత్రులూ నీకొడుకులూ కూడా విశుద్ధవంశీయులు. దాంతులు. సిగ్గుబిడియా లున్నవారు. పూజ్యులు. ఒకరి కొకరాసరా అవుతూ సుఖంగా బతగ్గలిగేటట్టు చూడు వారిని. ఈవచ్చిన రాజులున్నూ, ప్రీతిగా సహపంక్తిభోజనాలు చేసి, కమ్మని పానీయాలు పుచ్చుకుని, కులాసాగా స్నేహం నెరుపుకుని, వెలలేని

నూతనవస్త్రాలు ధరించి, పూలమాలలు వేసుకుని, సత్కారాలు పొంది, పగలూ వైరాలూ మరిచిపోయి, సంతోషంగా తమతమ యిళ్ళకు వెళ్ళిపోయేటట్టు చెయ్యి.

చిన్నప్పుడు పాండుపుత్రులంటే నీకెలాంటి ప్రీతివుండేదో యిప్పుడు కూడా వారియెడల అలాంటిదే చూపించి సంధి చేసుకో. అది నీకెంతో శ్రేయస్కరం. చిన్నతనంలోనే తండ్రిలేనివా రయిపోయారు వారు. అయినా, నువ్వాదుకుని, పెద్దచేసి విద్యాబుద్ధులుగరిపించావు. నీకొడుకులనూ వారినీ కూడా సమానంగా ఏలుకో. వారి కాపదలు వస్తేతొలగించవలసినవాడవు నువ్వే. అదే నీకు ధర్మార్థాలు సంఘటిస్తుంది.

ముందు నీకు మొక్కి నన్నిలా చెప్పమన్నారు వారు. "నీసెలవు చొప్పున మేము సకలదుఃఖాలూ అనుభవించాము. పన్నెండేళ్ళు డవులపాలయిపోయాము. జనం కిక్కిరిసివున్నచోట, వొకయేడు, యెవరూ గుర్తించలేనట్టుగా మసులుకున్నాం. నువ్వు తండ్రివన్న భయభక్తులతో మాప్రతిజ్ఞమీదే వున్నాం మేమిప్పటికీ. లేశమూ మాశపథం మేము భంగపరుచుకోలేదు. బ్రాహ్మ లెరుగుదు రీసంగతి మొదణ్ణుంచీ. కనక, నువ్వున్నూ నీమాటమీద నిలబడు. మారాజ్య భాగం మాకిస్తా వన్న నమ్మకంవల్లనే మేము అలా నడుచుకున్నాం. ధర్మార్థాలు బాగా ఆలోచించి నువ్విప్పుడు మమ్మల్ని ఉద్ధరించాలి. నువ్వే మాకు తల్లివీ తండ్రివీ కూడా అయి మమ్మల్ని కటాక్షించాలి నువ్విప్పుడు. గురు వంటే శిష్యులు చూపించవలసిన భక్త్యాదరాలూ, శిష్యు లంటే గురువు చూపించవలసిన ప్రేమానురాగాలూ చాలా గొప్పవి. మమ్మల్ని ఆప్రేమానురాగాలతో చూడు. ఆభక్త్యాదరాలతో మేమూ నిన్ను ఆరాధించుకుంటాము. కొడుకులు తప్పుతే సరిదిద్దవలసిన బాధ్యత తండ్రిది. మమ్మల్ని మంచిదారిలో ప్రవేశపెట్టి, నీధర్మం నువ్వు నిర్వర్తించుకో"

ఇదీ వారు నీకు చెప్పుమన్న సంగతి.

రాజేంద్రా, వారు, ఇక్కడి యీసభాసదులకన్నూ యిలా విన్న వించుకుంటున్నట్టు చెప్పుమన్నారు, తరవాత. "అయ్యా, ధర్మం తెలిసినవారు సభలో వున్నప్పు డధర్మాలేమీ జరగ్గూడదు. ఎవరి యెట్ట యెదట, అసత్యంతో సత్యమూ, అధర్మంతో ధర్మమూ అణగారిపోతాయో ఆసభాసదులూ అణగారిపోయినవారే అనిపించుకుంటారు. నది ప్రవాహం దాని వొడ్డున వున్న చెట్లే పెల్లగించివేస్తుంది. సభలో అధర్మం ప్రబలితే అది ఆసభాసదులనే కూల్చేస్తుం దలాగే. ధర్మమే ప్రధానంగా ఏపక్షమూ అవలంబించనివారు 'సత్యమే పలుకుతారు. న్యాయమే పాలిస్తారు.

రాజా, పాండవుల 'రాజ్యభాగం పాండవుల కివ్వడంకంటే నువ్వు చెయ్యగల ధర్మం మరేం వుందీ? ఇక్కడ యిప్పు డింతమంది రాజులున్నారు, వీరు చెప్పా లిప్పుడు నువ్వు చెయ్యవలసిం దేమిటో. ధర్మార్థాలే ఆలోచించి నేను సత్యమే చెబుతున్నా నని నువ్వు నమ్మ గలిగితే, ముందు, నువ్వు, ఈక్షత్రియోత్తముల కందరికీ మరణం తప్పించు. కోపం విడిచి శాంతంగా ఆలోచించు. పిత్ర్యమైన పాండవుల రాజ్యభాగం పాండవుల కిచ్చి, తరవాత, నువ్వూ నీకొడుకులూ, దీర్ఘాయువూ, సిరిసంపదలూ, దివ్యభోగాలూ అనుభవించండి.

రాజా, పెద్దలు నడిచిన దారే నడుస్తూ, యుధిష్ఠిరుడు ధర్మమే నమ్ముకుని వున్నా డని నీకు తెలుసు. నీయెడలా నీకొడుకులయెడలా అత నెలాంటిభక్తిప్రేమలు కనబరుస్తున్నాడో అదీ నీకు తెలుసు. లక్కయింటి సంగతి మరిచిపోలే దనుకుంటూ న్నవ్వు. వారి కల్పించిన కష్టాలూ చేసిన తిరస్కారాలూ కూడా మరిచిపోలేదనుకుంటూ న్నవ్వు. అయినా, మళ్ళీ వచ్చి నిన్నే ఆశ్రయిస్తున్నా డతను, ఇది గుర్తించుకో. వారిని హాస్తినాపురంనుంచి ఇంద్రప్రస్థానికి తరిమివేశావునువ్వు. అయినా,

మరో విధంగా చెయ్యక, అక్కడ వుండే రాజుల నందరినీ లోప్పుచేసు కుని, వారి నందరినీ నీకే అంకితంచేశా డతను. ఏవిధంగానూ నిన్న తిక్ర మించి—నిన్ను కాదని నడుచుకోలే దతను. అతనంత ధర్మంగా నడుచుకుంటూ వుండినా చూడలేక, నీకొడుకు, శకునిచేత మాయ జూదం ఆడించి, మోసంచేసి అతని రాజ్యమూ, ధనధాన్యాలూ సర్వమూ హరించాడు. సభకి యీడ్చి తెప్పించి ద్రౌపదిని చాలా ఘోరంగా అవమానించాడు. అదంతా చూస్తూ వుండీకూడా క్షత్రియధర్మం అనుసరించి అన్నమాట తప్పలేదు యుధిష్ఠిరుడు.

రాజా, ఇప్పు డిక చెప్పే దేమి టంటావా? నేను నీశ్రేయస్సు కోరు తున్నాను. పాండుపుత్రుల శ్రేయస్సూ కోరుతున్నాను. ధర్మార్థాలు విడిచి, సుఖాలు పోగొట్టుకుని, చివరికి, నీకొడుకులను కూడా నాశనం చేసుకోకు. నీకొడుకులు, అనర్థమే తమకు అర్థం అనీ, అర్థమే అనర్థమనీ అనుకుంటున్నారు. ఇది వల్లమాలిన లోభంవల్ల వచ్చిన వుట్టిమునక. వారిని మందలించుకో. మరి, పాండవుల సంగతి యేమిటంటావా? నువ్వు చేరదీస్తే నిన్ను సేవించుకోడానికీ, నిరాకరిస్తే సమూలంగా నిన్ను నాశనంచెయ్యడానికీ గూడా నిశ్చయించుకుని వున్నారు. కనక, ఆలోచించుకో. ఏది మంచి దని తోస్తే అందుకు పూనుకో"

ఇదంతా విన్నారు రాజులు. చాలాచాలా మెచ్చుకున్నారు కృష్ణుణ్ణి లోపల్లోపలే. ఎదట బడిమాట్టాడ్డానికి మాత్రం వొక్కడూ సాహసించలేకపోయాడు.

# 96

## దంభోద్భవుడు

కృష్ణుని మాటలతో పులకలు పెట్టగా సభాసదు లందరూ నిశ్చేష్టు లయిపోయారు. "ఒక్క డైనా లేవ డేమిటి బదులుచెప్పడానికి?"

అనుకున్నారు వారందరూ; తాము మాత్రం లేవలేకపోయారు సాహసించి. జామదగ్న్యు డనే మహర్షి వొక్కడు మాత్రమే లేచాడు, చూసిచూసి.

"రాజేంద్రా, నేనిప్పుడొకమాట చెబుతాను, సోదాహరణంగా. నిశ్శంకగా విని, అది నీకు నచ్చితే అలా చేసి శ్రేయస్సు సంపాదించుకో. వెనకటికి, దంభోద్భవు డని వొక సార్వభౌము డుండేవా డని చెప్పారు పెద్దలు. క్షత్రియు డతను. భూమండలం అంతా యేలాడు చాలాకాలం. రాత్రిగడిచి తెల్లవారగానే వొకపని చేసేవా డతను, క్రమం తప్పకుండా. బ్రాహ్మణులనూ, క్షత్రియులనూ పిలిచేవాడు. "యుద్ధంలో నన్ను మించేవాడు — కనీసం సమానం అయేవా డెవడైనా వున్నాడా లోకంలో? వాడు బ్రాహ్మణుడైనా సరే, క్షత్రియుడైనా సరే, వైశ్యుడైనా సరే, శూద్రుడైనా సరే, కత్తి పట్టగల మొగవా డుంటే రావచ్చు నామీదికి" అంటూ జబ్బ చరిచేవాడు. మరో పని లేదతనికి. దర్పంతో రంకెవేస్తూ భూమండలం అంతా తిరిగాడు.

ఒకచోట కొందరు బ్రాహ్మణులు తారసపడ్డా రతనికి. వేదవేత్తలు వారు. బ్రహ్మైకానందపరోక్షానుభూతికోసమే వారి శ్రద్ధ అంతా. మిక్కిలీ ధీరులు వారు. దేనికీ భయపడేవారు కారు. దంభోద్భవు డలా ఆత్మస్తుతిచేసుకోడం చూసి "వ" ద్దనీ "అది మంచిది కా" దనీ అనేకవిధాల మందలించారు వారు. చాలాసార్లు గర్హించారు కూడా; కాని అత నది వినిపించుకోలేదు. మళ్ళీమళ్ళీ అడిగా డదేమాట. మహా తపోధనులు వారు. మహాత్ములు. మాటిమాటికీ అతనలా అనడంతో వారికి చాలా కోపంవచ్చింది. "రాజా, ఇప్పటికి శాంతించు, ఇక్కడ కాదు నీరంకెలు, కావా లంటే చెబుతాం విను. అనేక యుద్ధాల్లో అఖండవిజయాలు సంపాదించినవా రున్నా రొకచోట,

వారుపురుషోత్తములు. వారిని మించడం కాదు, వారితో సమానమే కాలేవు నువ్వెప్పుడూ కూడా” అన్నారు, దాంతో వారు.

“అయితే, వారెక్కడవున్నారు? ఎవరికొడుకులువారు? ఏమిచేస్తూ వుంటారు? ఎవరు వారు?” అని యిన్ని ప్రశ్నలడిగాడు గుక్క తిప్పుకోకుండా అతను. “నరుడూ నారాయణుడూ అని వారి పేళ్ళు. గొప్ప తపోధను లని చెబుతారు వారిని పెద్దలు. మానవలోకాని కవతరించిన దేవతలువారు. వెళ్లి వారితో యుద్ధంచెయ్యి, చేతనైతే. గంధమాదన పర్వతం మీద వారిప్పుడు ఘోరమైన తపస్సు చేసుకుంటున్నారుట” అని బదులుచెప్పారు ఆబ్రాహ్మణులతనికి.

ఆరాజు, ఆమాట వినడమే తడవుగా, షడంగిని అయిన—రథాలూ, గుర్రాలూ, ఏనుగులూ, కాల్బంట్లూ, బళ్ళూ, లొట్టిపిట్టలూ—ఇవి నిండివున్న గొప్ప సైన్యం వెంటబెట్టుకుని, యెకాయెకీని గంధమాదన పర్వతానికి వెళ్లి వారిని కలుసుకున్నాడు.

ఆకలీ, దప్పికా — వీటితో వారి శరీరాలు బక్కచిక్కిపోయి వున్నాయి. చలీ, గాలీ, ఎండా — వీటితో వాడిపోయినీ వున్నాయి. వారిని కుశలం అడిగా డారాజు ముందు. వారున్నూ కందమూల ఫలాలూ, జలమూ, ఆసనమూ ఇచ్చి ఆదరించా రతణ్ణి. “నువ్వి క్కడి కెందుకు వచ్చావూ? నీకేమి కావాలీ?” అని కూడా అడిగారు, సాదరంగా. “యుద్ధం యుద్ధం” అన్నా డతను, క్లుప్తంగా ముందు, తన సంగతి చెప్పి. తన శక్తిసామర్థ్యాలు పొగడుకున్నాడు. తన శపథం సంగతి కూడా చెప్పాడు, చివరికి మీసాలు మెలి పెట్టుకుంటూ. నాభుజాబలంతో, యెదిరించినవారి నందరినీ జయించి భూమండలం అంతా ఆక్రమించాను. పాలించానుకూడా. మీతోయుద్ధంచేద్దామని వచ్చా నిక్కడికి. తగినవాడితో వొకపట్టుపట్టాలని యెన్నాళ్ళ

నుంచో నాకుబలాటం. కనక, నాకీవిధంగా యివ్వండి ఆతిథ్యం, కంద మూలఫలాలతో గాదు" అన్నాడు, బింకంగా అతను, కోరచూపులు చూస్తూ.

"తప్పుతప్పు" అన్నారు వా రంగీకరించలే దందుకు. "క్రోధానికీ లోభానికీ మిక్కిలీ దూర మైన ఆశ్రమభూమి యిది. అలాంటి మాట లనగూడ దిక్కడ. ఇక్కడ యుద్ధం మాటే యెత్తగూడదు, ఆయుధా లెలా వస్తాయి? క్షత్రియు లెందరో వున్నారు పృథివి అంతటా, మరో చోటికి వెళ్ళి వారిని పిలుచుకో నువ్వు. వారితో యుద్ధం చేసి నీకోరిక తీర్చుకో" అంటూ యెంతో చెప్పారు వారు; కాని వినిపించుకోలే దతను. తొడచరుచుకున్నాడు. మీసం దువ్వుకున్నాడు. "రావలసిందే, ధనుస్సు పుచ్చుకోవలసిందే" అంటూ వాక్కటే ధోరణి అతనిది. మళ్ళీమళ్ళీ చెప్పారు. క్షమించారు. సముదాయించారు; కాని లాభంలేకపోయింది.

"అయి తే కాసుకో" అంటూ చక్కావచ్చాడు నరుడు గుప్పెడు దర్భలు పట్టుకుని. "నీశస్త్రాస్త్రా లన్నీ సిద్ధంచేసుకో. సైన్యం అంతా వ్యూహంపన్నుకో. నేనిదే నీచిరకాలవాంఛ తీర్చేస్తాను రా" అని పిలిచా డతను. "నీశస్త్రాస్త్రాలు దర్భపరక లయి తే నాశస్త్రాస్త్రా లివిగో" అంటూ విల్లమ్ములు పుచ్చుకుని వచ్చి నరునిమీద బాణవర్షం కురిపించాడు దంభోద్భవుడు. నరు డాబాణా లన్నీ దర్భపరకలతోనే నాశనంచేసేశాడు. పైగా, మహాఘోర మైన ఐషీకాస్త్రం ప్రయోగించా డారాజుమీద. ఎదురులేని అస్త్రంఅది. సైనికులకు కళ్ళూ ముక్కులూ, చెవులూ పనికిరాకుండా చేసేసిం దది ముందు. అందరూ భయభ్రాంతు లయిపోయారు దాంతో. ఆదర్భపరకలతో ఆకాశం అంతా తెల్లబడిపోయింది. అది చూసి "రక్షించు" అంటూ నరుని పాదాలమీద వాలాడు రాజు, చెంపలువేసుకుని.

"రాజా, బుద్ధిగలిగి మసులుకో. బ్రహ్మణ్యుడ వయి, ధర్మాత్ముడవ్వా అయి మసులుకో. ఎవరిమీదా కాలుదువ్వకు, ఎప్పుడూ. నువ్వు శత్రువులను సంహరించలేవిక. ప్రజ్ఞ సంపాదించుకుని, లోభమూ అహంకారమూ విడిచి, ఆత్మజ్ఞానివై, దాంతీ క్షాంతీ అవలంబించి సౌమ్యంగా ప్రజల నేలుకో, వెళ్ళిపో. నీకు క్షేమం కలగాలి. బ్రాహ్మలు కనపడితే, వినయవిధేయుడవై వారి కుశలం తెలుసుకుంటూ వుండు" అంటూ మందలించి పంపేశాడు నరుడు.

రాజా, నరుడు చేసినపని చాలా గొప్పదే. అయితే, నారాయణు డతనికంటే చాలా గొప్పవాడు. ఆనరుడే అర్జునుడు. గాండీవంలో అత నస్త్రాలు తొడక్కముందే వెళ్ళి ఆశ్రయించి మంచిచేసుకో అతణ్ణి. కామమూ, క్రోధమూ, లోభమూ, మోహమూ, మదమూ, మానమూ మాత్సర్యమూ, అహంకారమూ — ఈయెనిమిదీ, కాకుదీకమూ, శుకమూ, నాకమూ, అక్షిసంతర్జనమూ, సంతానమూ, నర్తకమూ, ఘోరమూ, ఆశ్యమోదకమూ — అన్న పేర్లతో నిషితాలైన గొప్ప ఆయుధా లయివున్నాయి. వీటిదెబ్బ తిన్నవారు ఉన్మాదమూ, చేత నాహానీ, స్వాపమూ, ప్లవనమూ, వమనమూ, మూత్రణమూ, రోద నమూ, హాసమూ — ఈయెనిమిది వికారాలకూ లోనయిమరణిస్తారు.

సృష్టికర్తా లోకాధీశ్వరుడూ, సకలక్రియాదక్షుడూ అయిన నారాయణు డనే కృష్ణుడు అర్జునునకు ముఖ్యబంధువ్వా, ఏడుగడానూ. అంచేత, అర్జును ణ్ణెదిరించి యెవరూ బతకలేరు. అర్జునుని దగ్గిర ఉత్తమ గుణా లెన్నో వున్నాయి. సర్వవిధాలా అతణ్ణి మించినవాడు శ్రీకృష్ణుడు. కనక, బుద్ధితెచ్చుకుని పాండవులతో సంధిచేసుకో. వాడితో భేదం పెట్టుకోకు. అది చాలా అపాయకరం. యుద్ధంమాట మరిచిపో. నీవంశం చాలా గొప్పది. అది నిలిచివుండాలి పృథివిమీద. ఇదినీకు స్వార్థం. ఇందుకోసం అయినా నువ్వు సంధిచేసుకో"

# 97

## మాతలి అల్లుడికోసము తిరగడం

"దుర్యోధనా" అంటూ కణ్వుడందుకున్నాడు వెంటనే.

"రాజా, లోకా లన్నీ సృష్టించిన బ్రహ్మకు క్షయమూ, అంతమూ, లేవు. అలాగే నరనారాయణులకున్నూ లేవవి. ఆదిత్యులందరిలోనూ విష్ణు వొక్కడే సనాతనుడూ, అక్షయుడూ, అవ్యయుడూ, నిత్యుడూ, ప్రభువున్నూ అయి తేజరిల్లుతున్నాడు. సూర్యచంద్రులూ, భూమీ, జలమూ, వాయువూ, అగ్ని, ఆకాశమూ, గ్రహాలూ, నక్షత్రాలూ, ఇవన్నీ నిమిత్తమరణాలు. అశాశ్వతాలు. ఇవి నశిస్తాయి. మళ్ళీమళ్ళీ సృష్టిఅవుతాయి కూడా. మనుష్యులూ, మృగాలూ, పక్షులూ — తక్కిన తిర్యగ్యోనులూ, ముహూర్తమరణాలు. వీరిలో రాజు లైన గొప్పవారు. సిరిసంపద లనుభవించి ఆయువు మూడగానే నశించి, తాము చేసుకున్న సుకృతదుష్కృతా లనుభవించడానికి మళ్ళీమళ్ళీ పుడుతూ వుంటారు. ఇది గుర్తించుకుని నువ్వు ధర్మనందనునితో సంధి చేసుకోడం చాలా శ్రేయస్కరం.

పాండవులూ, కౌరవులూ కలిసి ప్రజాపాలనం చెయ్యడం ఉభయులకూ గూడా చాలామంచిది. "నేను బలవంతు"ణ్ణని భావించుకోడం మెవరి కయినా అపాయకరమే. ఏమంటే ? బలవంతులకంటే బలవంతులున్నారు లోకంలో, ఎక్కడి కక్కడికే. బలవంతు లైనవారి దగ్గిర సేనాబలం ఎంతమాత్రమూ నిలవలేదు. ఆమాటకి వస్తే పాండవులు ఎంతోబలవంతులు. దేవతలను మించినవారు వారు, బలపరాక్రమాల్లో.

ఈ సందర్భంలో సనాతన మైన యితిహాసం వొకటుంది. తన కూతురికి వరుణ్ణి సంపాదించడానికి పూనుకున్నాడు మాతలి. అతను త్రిలోకాధిపతి అయిన దేవేంద్రుని సారథి. అతని కొక్క తే కూతురు.

అంతటి అందకత్తె మరి లేదని త్రిలోకాల్లోనూ పేరుపొందిం దామె. ఆమెపేరు గుణకేశి. సౌందర్యంలోనే కాదు సౌకుమార్యంలోనూ లావణ్యంలోనూ ఆమెకి సాటి అయిన స్త్రీ మరి లేదు.

ఆమెకి యౌవనం అంకురించింది. దాంతో, ఆమె కిక పెళ్లి చెయ్యాలని నిశ్చయించుకున్నారు తల్లిదండ్రులు. "గొప్పశీలసంపదా, అపారమైన కీర్తీ, విఖ్యాతీ, మృదుస్వభావమూ గలవారియింట ఆడపిల్ల పుట్టడం మంచిది కాదు. సత్పురుషులకు ఆడపిల్ల పుడితే, తండ్రివంశమూ, తల్లివంశమూ, పెళ్లిచేసుకున్న భర్తవంశమూ కూడా సంశయాస్పదా లయిపోతాయి. మనుష్యులకు సహజమైన దృష్టితో దేవలోకమూ మనుష్యలోకమూ గూడా వెతికాను; కాని నాబిడ్డకు తగిన పెళ్లికొడుకు కనపడలేదు నాకు" అని చాలా విసుక్కున్నాడు మాతలి. దేవతల్లోనూ, దైత్యుల్లోనూ, గంధర్వుల్లోనూ, మనుష్యుల్లోనూ, మహర్షుల్లోనూ కూడా ఎంత వెతికినా తగినవాడు కనపడిలే దతనికి.

అతని భార్య పేరు సుధర్మ. ఒకనాటిరాత్రి ఆమెతో చాలా ఆలోచించి పెళ్లికొడుకోసం నాగలోకానికి బయలుదేరా డతను. "నాగుల్లో నాబిడ్డకు తగిన వరుడు తప్పకుండా దొరుకుతాడు" అనుకుంటూ బయలుదేరా డతను. సుధర్మకు ప్రదక్షిణం చేసి, కూతురి శిరస్సు ముద్దాడి, ముందు భూలోకానికి వచ్చాడు.

## 98

## మాతలి అల్లుడికోసం తిరగడం — 2

మార్గమధ్యాన నారదుడు కనబడ్డా డతనికి. అతను వరుణుని దగ్గిరికి వెడుతున్నాడు. యాదాలాభంగా కలుసుకున్నా రిద్దరూ. "మాతలీ నువ్వు సొంతపనిమీద వెడుతున్నావా, నీప్రభువు ఇంద్రుని పనిమీద వెడుతున్నావా?" అనడిగాడు నారదుడు. దానిమీద మాతలి తన సంగతి అంతా చెప్పా డతనికి.

"అయితే కలిసే వెడదాం రావోయ్" అన్నాడు నారదుడు. నేను వరుణుణ్ణి చూసివద్దామని స్వర్గంనుంచి బయలుదేరాను. భూమిలోపల వున్న విశేషా లన్నీ చూపిస్తూ నీకెన్నో సంగతులు చెబుతా న్నేను. మనంయిద్దరమూ కలిసే వెతుకుదాం మంచిపెళ్లికొడుకుని" అనిచెబుతూ నారదుడు, మాతలిని వెంటబెట్టుకుని భూమిలోపలికి ప్రవేశించాడు.

వరుణుణ్ణి చూశారు వారిద్దరూ. అతను దేవర్షులకు తగినవిధంగా నారదుణ్ణీ, ఇంద్రునకు తగిన విధంగా మాతలినీ ఆదరించి బాగా పూజించాడు. అందుకు మిక్కిలీ సంతోషించి తమ పూనిక వరుణున కెరిగించి వారు నాగలోకానికి వెళ్ళారు. భూమ్యంతర్భాగాన నివసించే వారి సంగతిసందర్భా లన్నీ నారదునకు బాగా తెలుసు. అవన్నీ మాతలికి వివరిస్తూ వచ్చా డతను.

"మాతలీ, కొడుకులతోనూ, మనమలతోనూ ఆనందిస్తున్న వరుణుణ్ణి చూశావుగదా? ఇదే అతని నివాసం. సకలమూ సమృద్ధిగా వుందిక్కడ. సర్వతోభద్ర మైన స్థలం యిది. ఇతణ్ణి చూశావా, వరుణుని కొడు కితను. చాలా ప్రాజ్ఞుడు. శీలమూ, స్వభావమూ, శౌచమూ — వీటితో మిక్కిలీ విశిష్టమైన పురుషు డితను. ఈయువకుడు వరుణుని మనమడు. సోముని కూతురు రీపుష్కరుణ్ణి వరించి పెళ్లాడింది. జ్యోత్స్న అనీ, కాళిఅనీ ఆమెకి పేళ్లు. రూపంలో రెండోలక్ష్మీదేవి ఆమె.

అదితి పెద్దకొడుకు కృతుడు నువ్వెరిగినవాడే. ఇదిగో, యిదే వరుణుని భవనం. బంగారంతో నిర్మించా రిది. ఇందులో అపారంగా వుంది సుర. అది పుచ్చుకోడంవల్లనే దేవతలు సుర లనిపించుకుంటు న్నారు. ఇదిగో చూశావా, దేదీప్యమానా లయిన ఆయుధా లిక్కడ యెన్ని వున్నాయో? ఇవన్నీ దైత్యులవి. ఓడిపోయారు వారు. తమ రాజ్యాలు విడిచిపెట్టి పారిపోయారు. ఆయుధాలకు మాత్రం నాశం అంటూ లేదు. ఇవి శత్రువుమీదికి విసిరితే దెబ్బకొట్టి మళ్లీ విసిరిన

వాడి చేతికి వచ్చి చేరుకుంటూాయి. దేవతలు స్వాధీనపరుచుకున్నా రివన్నీ.

మాతలీ, రాక్షసులూ, దైత్యులూ తమ ఆయుధాలతో పడివున్నా రిక్కడ. ఇది వారుణం అనే మడుగు. అగ్ని దేవు డిందులో వెలుగు తున్నాడు. విష్ణుచక్రం ఆఅగ్నిమధ్య వుందిందులో ఇదిగో యిది గాండీ మయ మైన ధనుస్సు. దేవతల కాపలాలలో వుంది. దీన్నుంచే పుట్టింది గాండీవం. ఎలాంటివాళ్లనైనా యిట్టే అణిచేస్తుం దిది. వేలకొద్దీ ఆయుధాలకు సాటి యిది. రాక్షసుల్లోనూ, రాజుల్లోనూ అసాధ్యులైనవారిని లొంగదీస్తుం దిది. బ్రహ్మదేవుని సృష్టి యిది. చండ ప్రచండం యిది. రాజుల శస్త్రా లన్నీ నాశనంచే సేస్తుంది. వరుణునికొడుకులు వాడుతూ వుంటా రిది తరుచు.

ఇదిగో, ఛత్రగృహంలో వరుణదేవుని గొడుగు, ఎక్కడపడితే అక్కడ చల్లని నీరు వర్షిస్తుం దిది. చంద్రకిరణాల్లాగ అతినిర్మలం అయి ఆనీరు కంటికి కనపడదు. దానిచుట్టూ చిమ్మచీకటి కమ్ముకుని వుంది. చూడతగ్గ వస్తువు లింకా యెన్నో వున్నా యిక్కడ. అయితే, అవన్నీ చూస్తూ కూచుంటే నువ్వు వచ్చిన పని ఆలస్యం అయిపోతుంది కనక, వెడదాం పద ".

# 99

## మాతలి అల్లుడికోసం తిరగడం – 3

"మాతలీ, నాగలోకాని కంతకీ యిది నడిబొడ్డు. ఈపట్నంపేరు పాతాళం. దైత్యులూ దానవులూ యెందరో వున్నా రిక్కడ. భూలోకంనుంచి జంగమా లైన జంతువు లిక్కడికి రావడం తటస్థపడితే భయపడిపోయి దారుణంగా అరుస్తూవుంటా యిక్కడ. ఇక్కడ ఆసురం అయిన అగ్ని వుంది. ఈనీరు పీలుస్తూ ఆత్మపోషణ చేసు

కుంటూ వుంటుందది. దేవతలు, శత్రువుల నందరినీ వోడించి అమృతం పానంచేసి యిక్కడే వుంచా రది. దానివల్లనే చంద్రునకు వృద్ధీ క్షయమూ ఏర్పడుతున్నాయి. అతిదిప్యతు డైన హయగ్రీవుడు ప్రతీ పర్వంనాడూ యిక్కడే ఆవిర్భవించి, వేదాధ్యయనంచేసేవారికి సుస్వరం అలవడ్డానికి తన పలుకులతో జగత్తంతా ముఖరితం చేస్తూవుంటాడు. జలమూర్తు లైన చంద్రాదు లిక్కడ పతనం పొందుతారు. అంటే, చంద్రకాంతశిలల్లాగ స్రవిస్తారు. అంచేత, యిది, పతజ్జలం కావలసి వుండీన్నీ పాతాళం అయిపోయింది.

ఐరావతం, తన తొండంతో యిక్కడి నీరు గ్రహించి జగత్తు శ్రేయస్సుకోరి మేఘాల కందిస్తుంది. అదే ఇంద్రుడు వర్షరూపంగా భూమండలానికి మళ్ళీ యిస్తాడు. ఇక్కడి నీటిలో తిమితిమింగలా లెన్నో సంచరిస్తూవుంటాయి. ఆనీటిమీద ప్రసరించే చంద్రకిరణాలే వాటి కాహారం. ఎన్నో రూపాలుగా వుంటాయవి. ఎన్నో పరిమాణా ల్లోనూ వుంటాయి. ఇక్కడి జంతువులు కొన్ని సూర్యకిరణాలు సహించ లేక పగలు మరణించి, రాత్రి మళ్ళీ పుడుతూ వుంటాయి.

దినదినమూ చంద్రు డిక్కడే వుదయిస్తాడు. కిరణాలనే తన చేతు లతో అమృతం తాకి వాటితో స్పృశించి చచ్చినవారిని బతికిస్తూ వుంటాడు. ధర్మనిరతులైన దైత్యులు కాలంతీరి ఇంద్రునకు తమ సర్వస్వమూ కోలుపోయి బందీ లయివున్నా రిక్కడి చెరసాలల్లో. సకలభూతాలకూ ప్రభు వైన భూతపతి లోకహితంకోసం గొప్ప తపస్సు చేశా డిక్కడ. ఎక్కడో వొకచోట పడివుంటూ, అప్రయత్నంగా ఏది దొరికితే అదే తింటూ, ఏచెట్టుపట్టలో కట్టుకుంటూ కాలం గడపడం గోవ్రతం అంటారు. అలాంటి గోవ్రతం అవలంబించిన మహర్షులూ ఎడతెగకుండా వేదశాస్త్రాలు చదవడంతో క్షీణించిపోయి, ప్రాణాలు విడిచి, స్వర్గం సంపాదించుకునిన్నీ యిక్కడే వుండిపోయారు.

స్రుప్రతీకం అని వొక దేవగజం. దానివంశంలో, ఐరావతమూ, వామ నమూ, కుముదమూ, అంజనమూ ఇక్కడే జన్మించాయి.

అదిగో, చూడవోయ్, అండం వొకటి నీటిలో తేలుతోంది.! దాని తేజస్సు చూశావా ఎంత అద్భుతంగా ఎంత వుందో ? సృష్ట్యాది నుంచీ అది అలాగే వుందిక్కడ. అది కదలదు, బద్దలూ కాదు. అదే మిటో, యెలా పుట్టిందో, దాని తల్లి యెవరో, తండ్రి యెవరో యెవరూ చెప్పలేరు. ఇందులోనుంచి, వొకానొకప్పుడు, ఘోరమైన అగ్ని బయలుదేరుతుంది. స్థావరజంగమాత్మకాలైన మూడు లోకాలూ క్షణంలో దగ్ధంచేసేస్తుందది. ఈపట్నంలో నీకు నచ్చినవరు డెవడైనా కనపడతాడేమో చూడు. నేను వెళ్ళి చాలా ప్రయత్నించి వాడు నీకూతుర్ని వరించేటట్టు చేస్తాను, వెంటనే.

నారదు డిలా చెప్పగా, మాతలి, "ఇక్కడివా డెవడూ నాకు నచ్చలేదు. మరోచోటికి వెళ్ళిపోదాం పద త్వరగా" అన్నాడు.

## 100

### మాతలి అల్లుడికోసం తిరగటం—4

"మాతలీ, హిరణ్యపురం యిది. మిక్కిలీ ప్రఖ్యాతిపొందిన పట్నం యిది ప్రపంచంలో. మనసా వూహించుకుని అద్భుతమైన రూపకల్పన చేసి చాలా శ్రమపడి మయుడు నిర్మించా డిది. శతమాయావులూ, సహస్రమాయావులూ అయిన దైత్యులూ దానవులూ నివసించివున్నా రిక్కడ. మహాశూరులు వారు. వరప్రసాదులు. ఇంద్రుడూ, యముడూ, వరుణుడూ, కుబేరుడూ కూడా లొంగదియ్యలేరు వారిని. కాల ఖంజులూ, విష్ణుపాదంలో పుట్టిన రాక్షసులూ, బ్రహ్మపాదంలో పుట్టిన దైత్యులూ వున్నా రిక్కడ. పెద్దపెద్దకోరలతో మహాభయంక రంగా వుంటారు వారు. వేగంలోనూ పరాక్రమంలోనూ కూడా వాయు

దేవుణ్ణి మించివున్నారు వారు. అన్నిటిలోనూ వారి మాయాబలం చాలా గొప్పది. నివాతకవచులున్నూ వున్నా రక్కడ. యుద్ధం అంటే గొప్పపండుగు వారికి. ఇంద్రుడైనా వారి నేమీ చెయ్యలేడు. వాళ్ళతో తలపడి, నువ్వూ నీకొడుకు గోముఖుడూ, ఇంద్రుడూ అతని కొడుకు జయంతుడూ కూడా చాలాసార్లు వోడిపోయివున్నారు, జ్ఞాపకం వుందా ?

వారి భవనాలు చూశావా యెంత చక్కగా వున్నాయో ? బంగారంతోనూ వెండితోనూ నిర్మించారవి. ఎక్కడ యేసదుపాయా లుండాలో శాస్త్రప్రకారం అవన్నీ పూర్తిగా యేర్పాటుచేయించు కున్నారు వారు తమభవనాల్లో.

వాటికి, వజ్రాలూ, వైడూర్యాలూ, పద్మరాగాలూ, ప్రవాళాలూ మొదలైన నవరత్నాలూ పొదిగించుకున్నారు. కొన్నిభవనాలు సూర్యకాంతమణుల్లాగ యెర్రగానూ, మరికొన్ని భవనాలు చంద్ర కాంతమణుల్లాగా స్ఫటికశిలల్లాగా తెల్లగానూ వుండి జిగజిగ మెరిసి పోతున్నాయి. మట్టిపనీ, రాతిపనీ, కర్రపనీ చాలా అద్భుతంగా చేయించుకున్నారు. రూపాన్నిబట్టీ, గుణాన్నిబట్టీ, ద్రవ్యాన్నిబట్టీ కూడా యథాశాస్త్రంగా నిర్మింపించుకున్నారు కనక, వాటిసంగతి యెవరూ వివరించలేరు.

వారి ఆటస్థలాలూ, శయనాలూ, నిత్యమూ వాడుకునే పాత్రలూ, ఆసనాలూ, ఎంతచిత్రవిచిత్రంగా వున్నాయో చూశావా ? అవి యెంత విలవగలవో వూహించగలవా ? అవిగో చెట్లు, ఎన్నిజాతులవో చూడు. పువ్వులూ యేపళ్ళూ కావా లంటే అవే యిస్తా యవి. ఎప్పుడు కావా లంటే అప్పుడున్నూ యిస్తాయి. అవి క్రీడాపర్వతాలు. మేఘా లన్నట్టున్నాయి కదూ యిక్కణ్ణుంచి చూస్తే ? జలపాతా లున్నూ కల్పించుకున్నారు వాటిమీద ”

ఇదంతా యిలా చూపించి, నారదుడు "మాతలీ, నీకు నచ్చిన వరు డెవడైనా కనపడతా డేమో యిక్కడ చూద్దామా, మరో చోటికి వెళ్ళిపోదామా?" అనడిగాడు. "వద్దువ" ద్దన్నాడు మాతలి. "దేవతలకు నేను వ్యతిరేకంగా నడుచుకోగూడదు. దేవతలూ దైత్యులూ సోదరు లయ్యుండిన్నీ బద్ధవిరోధం పెట్టుకునివున్నారు. అది యీనాటిదీ కాదు, ఎన్నటికీ గూడా తీరేదిన్నీ కాదు. శత్రు పక్షంతో నేనెలా వియ్యంఅందుతానూ? ఈదైత్యులనూ దానవులనూ నేను కళ్ళతో గూడా చూడనుగాక, చూడ" డన్నా డతను, కచ్చితంగా.

## 101

### మాతలి అల్లుడికోసం తిరగడం 5

"మాతలీ, ఇది గరుడలోకం" అంటూ మళ్ళీ ప్రారంభించాడు నారదుడు.

"వీరు పాములను నాశనంచేసేస్తారు. ఎంత దూరం వెళ్ళినా, ఎంతెంత యుద్ధాలు చేసినా, ఎంతెంతబరువులు మోసినా బడలికా ఆయాసమూ వుండవు వీరికి. వైనతేయుని కొడుకు లయిన సుముఖుడూ, సునాముడూ, సునేత్రుడూ, సువర్చసుడూ, సురుచుడూ, సుబలుడూ వీరికి మూలపురుషులు. వారిపేరుగా యెన్నో వంశాలు తామరతంపరగా వర్ధిల్లా యిక్కడ. కశ్యపుడు వీరి ఆదిమూలం. అఖండైశ్వర్యంతో తులతూగుతున్నారు వీరు. అందరూ శ్రీవత్స లాంఛనులు. చేసేపనులను బట్టి చూస్తే క్షత్రియులు వీరు. దయ అనేది యెరగరు. పాములను అమాంతంగా చంపి తినెయ్యడం విలాస క్రీడ వీరికి. ఇలాగు వొక జాతికి జాతినే నాశనంచేస్తూ వుండడంవల్ల వీరికి బ్రాహ్మణ్యాం సిద్ధించలేదు.

శ్రీమహావిష్ణువు చేరదీసినందున, ఈగరుడకులం, లోకంలో విఖ్యాతమూ అయింది, పవిత్రమూ అయింది, ఉత్తమమూ, అయింది. విష్ణువే దేవుడు వీరికి. వైష్ణవపారమ్యం వీరి సిద్ధాంతం. వీరెప్పుడూ విష్ణువునే ధ్యానిస్తూనూ పూజిస్తూనూ వుంటారు. విష్ణువే వీరికి గతి.

సువర్ణచూడుడు, నాగాశనుడు, దారుణుడు, చండతుండకుడు, అనిలుడు, అనలుడు, విశాలాక్షుడు, కుండలి, పంకజిత్తు, వజ్రవిష్కంభుడు, వైనతేయుడు, వామనుడు, వాతవేగుడు, దిశాచక్షుడు, నిమేషుడు, అనిమిషుడు, త్రిరావుడు, సప్తరావుడు, వాల్మీకి, ద్వీపకుడు, దైత్యద్వీపుడు, సరిద్వీపుడు, సారసుడు, పద్మకేతనుడు, సుముఖుడు, చిత్రకేతువు, చిత్రబర్హుడు, అనఘుడు. మేషహృత్తు, కుముదుడు, దక్షుడు, సర్పాంతకుడు, సహభోజనుడు, గురుభారుడు, కపోతుడు, సూర్యనేత్రుడు, చిరాంతకుడు, విష్ణుధర్ముడు, కుమారుడు, పరిబర్హుడు, హరి, సుస్వరుడు, మధుపర్కుడు, హేమవర్ణుడు, మాలయుడు, మాతరిశ్వుడు, నిశాకరుడు, దివాకరుడు - గరుడుల్లో వీరు మిక్కిలి సమర్థులు. వీరంతా చాలా, విఖ్యాతిపొందినవారు.

కొద్దిమంది పేళ్ళు మాత్రమే చెప్పా న్నేను. వారి సంగతిన్నీ బహూ కొద్దిగా మాత్రమే చెప్పాను. విఖ్యాతిపొందినవారిలో నైనా వాకమో స్తరుగా సర్వసాధారణులనే చెప్పాను. వీరిలో నీకెవరూ నచ్చకపోతే మంచివరుడు దొరికే చోటికి తీసుకువెడతాను పద”

# 102

## మాతలి అల్లుడికోసం తిరగడం—6

ఇద్దరూ బయలుదేరారు. “ఇది రసాతలం” అంటూ ప్రారంభించాడు నారదుడు.

“ఏడో లోకం యిది. అమృతంతోపాటు పుట్టి గోజాతి కంతకూ తల్లి అయిన కామధేనువు ఇక్కడే వుంది. మిక్కిలీ శ్రేష్ఠమైన పాలు

స్రవిస్తూవుంటుం దది. ఆపాలున్నూ భూసారంవల్ల పుట్టి, షడ్రసాలకూ సారంఅయివుంటాయి. వెనకటి కొక మాటు, బ్రహ్మ, అమృతంపుచ్చుకుని తేన్చాడు. అప్పు డతని ముఖంలోనుంచి పుట్టిందీ కామధేనువు. అంచేతనే బ్రాహ్మలదీ గోవులదీ వొక టే కులం. ఆకామధేనువు స్రవించే పాలధార భూమ్మీద పడ్డచోట పాలసముద్రం యేర్పడింది. ఆపాలసముద్రం నురగతో దాని తీరంఅంతా తెల్లనిపూలతో నిండి వున్న ట్టుంటుంది. ఆతీరంచూసి ఆనందిస్తూవుంటా రక్కడ కొందరు మునులు. మహోగ్ర మైన తపస్సు చేస్తూ వుంటారు వారక్కడ. వారంటే దేవతలకున్నూ గడగడ. ఈకామధేనువుకి పుట్టినవే నాలు గావు లున్నాయి. సురూప, హంసిక, సుభద్ర, సర్వకామదుఘ అని వాటికి పేళ్ళు. వాటిలో సురూప తూర్పునా, హంసిక దక్షిణానా, సుభద్ర పడమటా, సర్వకామదుఘ ఉత్తరానా వుండి భూమండలం అంతా భరిస్తున్నాయి. ఈనాలుగింటి పాలూ తీసుకువెళ్ళి కలిపి, మందరపర్వతం కవ్వంగా చేసుకుని దేవతలూ, అసురులూ పాల సముద్రం మధించారు. అప్పుడే పుట్టా యందులో సురా, లక్ష్మీదేవీ, అమృతమూ, ఉచ్చైశ్రవమూ, కౌస్తుభమాణిక్యమూను. ఈకామ ధేనువు సుధాహారులకు సుధా, స్వధాహారులకు స్వధా, అమృతాహారుల కమృతమూ, యిస్తూవుంటుంది, ముమ్మరంగా. రసాతలాన నివసిస్తే కలిగే సుఖం, స్వర్గంలోనూ, నాకలోకంలోనూ, త్రివిష్టపంలోనూకూడా కలగ దని గొప్పపాట వుందొకటి. అది చాలాసనాతనం. ఈరసాతలాన నివసించే పండితు లెప్పుడూ పాడుతూవుంటా రది.”

## 103

### మాతలి అల్లుడికోసం తిరగడం—7

“మాతలీ, ఇది భోగవతి అనే పట్నం. అమరావతి యెంతగొప్పదో యిదంత గొప్పది. అది దేవరాజు పరిపాలిస్తున్నట్టు, ఇది సర్పరా

జయిన వాసుకి పరిపాలిస్తున్నాడు. శేషు డనే నాగేంద్రు డిక్కడే వుంటాడు. గొప్పతపస్సు చేసి ముల్లోకాల్లోనూ చాలా గొప్పవా డనిపించుకున్నా డతను. దివ్యాభరణాలు ధరించి వెయ్యిపడగలతో వుంటా డెప్పుడూ, అతనే భరిస్తున్నా డీమండలం అంతా. కైలాస పర్వతం అన్నట్టుంటా డతను. చాలా బలవంతుడు. అగ్నిజ్వాల లా వుంటుం దతని జిహ్వ.

సురస కుమా ళ్ళయిన నాగు లందరూ యిక్కడే వుంటారు. రకరకాల ఆకారాలు వారివి. రత్నాభరణాలతో ధగధగ మెరుస్తూ వుంటారు. మణిస్వస్తికచక్రాంకులు, కమండలుకలక్షణులూను వారు. వారందరూ, చాలా బలవంతులు. వారి రౌద్రం చెప్పతరం కాదు. అది వారి కందరికీ సహజ మైనది. వారిలో కొందరు వెయ్యితలలవారూ, కొంద రయిదువందలతలలవారూ కొందరు నూరుతలలవారూ, కొందరు ముప్ఫయితలలవారూ, కొందరు పది తలలవారూను. వారిలో కొందరు మళ్ళీ యేడేసిముఖాలవా రున్నారు. పర్వతాల్లా వుంటారు వారు వారి పడగలు చాలా విశాలంగా వుంటాయి. ఇక్కడి నాగు లందరిదీ వొకటే కోవ. వేలూ, లక్షలూ, కోట్లూ, అయుతాలూ అర్బుదాలూ వున్నారు వారిక్కడ.

వాసుకి, తక్షకుడు, కర్కోటకుడు, ధనంజయుడు, కాలీయుడు నహుషుడు, కంబలుడు, అశ్వతరుడు, బాహ్యకుండుడు, మణి, ఆపూరణుడు, ఖగుడు, వామనుడు, ఐలపత్రుడు, కుకురుడు, కుకుణుడు, ఆర్యకుడు, నందకుడు, కలశుడు, పోతకుడు, కైలాసకుడు, పింజరకుడు, నాగుడు, ఐరావతుడు, సుమనసుడు, సుముఖుడు, దధిముఖుడు, శంఖుడు, నందుడు, ఉపనందకుడు, ఆప్తుడు, కోటరకుడు, శిఖుడు, నిష్ఠూరకుడు, తిత్తిరి, హస్తిభద్రుడు. కుముదుడు, మాల్యపిండకుడు, ఇద్దరు పద్ములు, పుండరీకుడు, పుష్పుడు, ముద్గరపర్ణకుడు, కరవీరుడు,

పీఠరకుడు, సంవృత్తుడు, వృత్తుడు, పిండారుడు, బిల్వపత్రుడు, మూషికాదుడు, శిరీషకుడు, దిలీపుడు, శంఖశీర్షుడు, జ్యోతిష్కుడు, అపరాజితుడు. కౌరవ్యుడు, ధృతరాష్ట్రుడు, కుహురుడు, కుశకుడు, విరజుడు, ధారణుడు, సుబాహుడు, ముఖరుడు, జయుడు, బధిరుడు, అంధుడు విశుండుడు, విరసుడు' సురసుడు — ఆకశ్యపపుత్రు లందరిలోనూ వీరు మిక్కిలి ప్రఖ్యాతిపొందినవారు.

ఇలా చెప్పి, నారదుడు "మాతలీ, వీరిలో నీకెవడైనా నచ్చాడా?" అనడిగాడు. దీనిమీద, మాతలి, తొట్రుపాటు లేకుండా బాగా నిదానించి చూశాడు ముందు. "నారదా, కౌరవ్యునకూ, ఆర్యునకూ ఎదట వున్న యువకు డెవరు? చాలా చక్కగా వున్నా డతను. మంచి తేజశ్శాలి. అతని తల్లీ తండ్రీ యెవరు? మూలపురుషు డెవ రతనికి? చాలా నిదానమైనవాడూ, మంచి ధీరుడూ అయినవా డన్న ట్టున్నాడు. రూపమూ, వయస్సూ కూడా చాలా బాగున్నాయి. నాబిడ్డకు తగిన వరు డన్నట్టు, తోచడమే కాదు, నామనస్సులో హత్తుకుపోయాడు కూడా" అని బదులుచెప్పాడు, తరవాత.

"ఐరావతవంశం అతనిది. పేరు సుముఖుడు. ఆర్యకుని పౌత్రుడూ, వామనుని దౌహిత్రుడున్నూ. అతని తండ్రి చికురుడు. అయితే, మొన్న మొన్ననే గరుత్మంతు డతణ్ణి తినేశాడు." అని నారదుడు కొన్ని వివరాలు చెప్పగా, "మహర్షీ, నాకు బాగా నచ్చాడయ్యా అతను. అతనికి నాబిడ్డ గుణకేశి నిస్తాను, వెళ్ళి మాట్లాడవయ్యా" అంటూ తొందరపెట్టాడు, మాతలి.

## 104

### మాతలి అల్లునికోసం తిరగడం—8

నారదుడు వెళ్ళి ఆర్యకునితో మాట్లాడాడు.

"ఆర్యా, ఇతను మాతలి. దేవేంద్రుని సారథి. అంతేకాదు,

ప్రాణస్నేహితుడున్నూ. శుచి. శీలవంతుడు. సుగుణఖని. తేజశ్శాలి. అఖండబలపరాక్రమశాలి. ఇంద్రున కితను సఖుడు మాత్రమున్నే కాడు, మంత్రిన్నీ. యుద్ధరంగంలో ప్రవేశించినప్పు డింద్రుడూ యితనూ కొంచెం హెచ్చుతగ్గుల్లో వుంటారు, బలపరాక్రమాల్లోనూ, శౌర్యధైర్యాల్లోనూను. దేవాసురులకు యుద్ధం తటస్థిస్తే, వెయ్యి గుర్రాలు పూన్చిన యింద్రుని జైత్రరథం మనోబలంతోనే నడిపిస్తాడితను. శత్రువులను ముందితను గుర్రాలతో జయిస్తే, తనబాహుబలంతో యింద్రుడు తరవాతే జయిస్తాడు వారిని. మొదట ఇతను కొట్టిన తరవాతే కొడతా డింద్రు డెవరి నైనా.

గుణకేశి అని యితని కొక కూతురు. అంత చక్కని చుక్క ముల్లోకాల్లోనూ మరి లేదు. సత్యమూ, శీలమూ, సుగుణాలూ ఆమె సొమ్ము. ఆమెకి తగిన పెళ్ళికొడుకుని సంపాదిద్దా మని బయలుదేరా డితను. చాలాలోకాలు తిరిగాడింతవరకూ. ఇక్కడ నీకొడుకు కొడుకు నచ్చా డితనికి. నీకున్నూ నచ్చితే ఆపిల్లవిషయమై ఆలోచించు. విష్ణుమూర్తి యింటో లక్ష్మియెలా వుంటుందో, అగ్ని యింటో స్వాహాదేవిన్నీ యెలా వుంటుందో, అలా వుంటుంది నీయింటో గుణకేశి. ఇంద్రునకు శచీదేవి లా వుంటుం దామె నీమనమనికి. సుముఖునకు తండ్రిలేడు నాకు తెలుసు. అయినా, నీయెడలగల గౌరవాదరాల వల్లా, నీమూలపురుషు డైన ఐరావతునియెడల గల భక్త్యాదరాల వల్లా మేమిష్టపడుతున్నా మతనికి పిల్లనివ్వడానికి. నీకోసం యెదురు చూస్తున్నాడు మాతలి, కనక, సగౌరవంగా అతనితో మాట్టాడవయ్యా" అని చెప్పా డతను.

ఆర్యకునకు సంతోషమూ కలిగింది విషాదమూ కలిగిం దీమాటతో. "మహర్షీ, నాకొడుకు చనిపోయాడు. నామనమడు త్వరలోనే చనిపోతాడు, తప్పదు. నేను గుణకేశిని కోడలుగా స్వీకరిం

చడం మెలాగా? అంచేత, నీమాట నేనంగీకరించలేకపోతున్నాను; గాని ఇంద్రుని చెలికాడు మాతలితో వియ్యం అందడం యిష్టంలేక కాదు. నాకొడుకు రుచిరుణ్ణి మొన్న మొన్న నే గరుత్మంతుడు తినేశాడు. ఈకారణంవల్ల మేము మిక్కిలీ దుఃఖార్తులం అయివున్నాము.

ఇంతేకాదు. నాకొడుకుని తినేసి, వెడుతూ వెడుతూ "ఒక్కనెలలో మళ్ళీవచ్చి నీమనమ డైన సుముఖుణ్ణి తినేస్తానని చెప్పి వెళ్ళాడు గరుడుడు. అలా జరిగితీరుతుం దది. గరుడుడు మాట అన్నా డంటే యిక తిరుగులేదు దానికి. అంచేత నువ్వు చెప్పినమాటమీద నాకేమీా వుత్సాహం కలగడం లేదు" అని బదులుచెప్పా డార్యకుడు.

"నువ్వామాట అనవద్దు. ఈవిషయం బాగా స్థిరపరుచుకున్నాన్నే" నన్నాడు మాతలి. నీమనమ డైన సుముఖునియెడల అల్లుడన్న భావం స్థిరపడిపోయింది నాకు. నాతోనూ నారదునితోనూ వచ్చి నీమనమడు దేవేంద్రుని దర్శనంచెయ్యడం మంచిది. తరవాత, జరగవలసి దంతా నేను చూసుకుంటాను. గరుడునివల్ల అపాయం రాకుండా కూడా నేనే చూసుకుంటాను. కనక, నీమనమణ్ణి నాతో పంపెయ్యి. నీకు శుభం" అని కూడా అన్నా డతను.

మాతలీ, నారదుడూ, సుముఖుడూ వెళ్ళి దేవేంద్రుని దర్శనం చేసుకున్నారు. శ్రీహరి కూడా వున్నా డప్పు డక్కడ. వారిద్దరూ యేదో మాట్లాడుకుంటున్నారు. నారదుడు మాతలి సంగతి అంతా విన్నవించాడు వారికి." అమృతం యిచ్చి యీసుముఖుణ్ణి దేవతల్లో చేర్చుకో." అని చెప్పాడు శ్రీహరి, యింద్రునితో. నారదుడూ, మాతలీ సుముఖుడూ నీదర్శనం చేసుకున్నాక వ్యర్థంగా తిరిగివెళ్ళిపోడం నీకే గొప్పకాదు." అని కూడా చెప్పాడు శ్రీహరి.

ఇంద్రు డాలోచించాడు. గరుడుని శౌర్యసాహసా లతనికి తెలుసు. "నువ్వే చెయ్యి ఆపని" అంటూ భారం అంతా శ్రీహరిమీాద

వుంచి తాను తప్పుకుండా మని చూశా డతను. "అలా కా" దన్నాడు శ్రీహరి. "చరాచరాత్మక మైన జగత్తు కంతకూ నాథుడవు నువ్వు. నువ్వేమిచేసినా నిన్నడ్డుకోగలవా డెవడు?" అని యెదు రడిగాడు కూడా.

అమృతం యివ్వలేదు; గాని యింద్రుడు సుముఖునకు దీర్ఘాయు విచ్చాడు. ఏమయినా తనకు గండం గడిచినందుకు చాలా సంతో షించి, సుముఖుడు, గుణకేశిని వివాహం చేసుకుని ఆమెని వెంటబెట్టుకుని తన యింటికి వెళ్ళిపోయాడు, హాయిగా. నారదుడూ అర్యకుడూ కూడా ఈవిధంగా తమ కోరిక నెరవేరినందుకు మిక్కిలీ సంతోషించి యెవరిదారిని వారు వెళ్ళిపోయారు.

## 105

### మాతలి అల్లుడికోసం తిరగడం—9

అక్కడ, గరుత్మంతున కిదంతా తెలిసింది. చాలా కోపం వచ్చేసిం దతనికి. ఒక్కదూకునవచ్చి యింద్రునిదగ్గర వాలా డతను. ఆరావ డంలో అతిదురుసుగా రావడంవల్ల, అతనిరెక్కల గాలికి ముల్లోకాలూ అటూ యిటూ వూగీసలాడిపోయాయి.

"ప్రభూ, నేనేమి అపరాధ చేశా నని నానోటి దగ్గిర అన్నం పడగొట్టావూ నువ్వు?" అనడిగా డతను ముందు.

"ప్రాణికోటి స్వభావాలు బాగా పరిశీలించి విధాత రకరకాల ఆహారాలు కల్పించాడు. నాకిది నిర్దేశించాడు. అదెందుకు నాకందకుండాచేశావూ? నేనా నాగకుమారుణ్ణి తినడానికి నిశ్చయించుకున్నాను. అందు కొక నియతి కూడా పెట్టుకున్నాను. నాకుటుంబం పోషించుకోవా లంటే ఆనాగకుమారుడు నాకు మిక్కిలీఅగత్యం.

మరొో నాగకుమారుణ్ణి నేను ముట్టుకోను. ముందూ వెనకా చూసుకో కుండా నాతో చెలగాటం మొదలుపెట్టావు నువ్వు. ఇదుగో నాప్రాణాలు విడిచిపెట్టేస్తా న్నేను. నాపరిజనులూ అలాగే చేస్తారు. నాయింట్లో వున్న భృత్యులున్నూ అంతేచేస్తారు. బాగా సంతోషించు నువ్వు.

ఇంతకీ, — త్రిలోకాలకూ అధీశ్వరు ణ్ణయి వుండవలసినవాణ్ణి నేను. అలాంటి నే నిప్పు డొకరికి భృత్యుణ్ణయి వున్నాను. కనక, నాకిది తగిన శిక్షే లే. దీనిక్కారణం, విష్ణుమూర్తి కాదు, నువ్వు. ముల్లోకాలకూనువ్వే ఈశ్వరుడవు మరి. అయితే, నీతల్లి మాత్రమే కాదు, నాతల్లీ కశ్యపుని కూతురే. లోకా లన్నీ నేనూ పాలించగలను. ఎవరూ సహించరానంత బలం వుంది నాకున్నూ. దేవదానవయుద్ధాల్లో నేను కూడా ఎంతెంత వీరకృత్యాలో చేసి వున్నాను. శ్రుతశ్రీ, శ్రుతసేనుడూ, వివస్వంతుడూ, రోచనాముఖుడూ, ప్రసృతుడూ, కాలకాక్షుడూ—మొదలైన దైత్యుల నెందరినో సంహరించివున్నా న్నేను; కాని నీసోదరుని జెండామీద వుండవలసివచ్చింది నాకు. అతనికి దాస్యం చేస్తున్నాను. నామూపున ఎక్కించుకుని అతణ్ణి మోస్తున్నాను కూడా. అంచేతే, నేనంటే నీకింత లోకువ. కనకనే నన్నవమానిస్తున్నావు నువ్వు. నేను మోసినంతబరువు మొయ్యగలవాడు మరొకడు లేడు త్రిలోకాలయందూ. నాలాగ అతి బలవంతుడైనవాడు మాత్రం మరెవడున్నాడూ? అయినా, సకుటుంబంగా నీతమ్ముణ్ణి మోస్తూ దాస్యం చేస్తున్నా న్నేను. అంచేతే నువ్వు నాఅన్నంపడగొట్టావు. నువ్వూ, నీతమ్ముడైన యీవిష్ణుమూర్తీ నాగౌరవం అంతా నాశనంచేశారు. అదితి కన్న యీ దేవత లందరిలోనూ నువ్వేగొప్పబలశాలివి, సందేహం లేదు. కాని, నా రెక్కల్లో— వొక్క రెక్కలో— వొకప్రాదేశమాత్రంతో మోసేస్తా న్నిన్ను నేను. నువ్వు గొప్పబలశాలివో నేను గొప్పబలశాలినో చూసుకోమరి ''

ఇదంతా విన్నాడు విష్ణుమూర్తి. గరుడుని గర్వం సహించ లేకపోయా డతను. నిజానికి, గరుడు డసాధ్యుడే. అయినా కళ్లెర్ర జేశాడు విష్ణుమూర్తి. "గరుడుడా, నువ్వు మిక్కిలీ బలహీనుడవు; కాని గొప్పబలశాలి ననుకుంటున్నావు. నాయెదటే నువ్వాత్మస్తుతి చేసుకోడం ఏమీ బాగా లేదు. ముల్లోకాలూ కలిసివచ్చినీ నాదేహం మొయ్యలేవు. నన్ను నేనే భరించుకుంటున్నాను. నిన్ను కూడా భరిస్తున్నా న్నేను. ఎంతో అక్కర్లేదు, ఇదిగో నాయెడమ చెయ్యి ఒక్కటే మొయ్యి చూతాం. ఇది మొయ్యగలిగితే అప్పుడు నువ్వు గర్వించడం న్యాయం" అనికూడా అన్నా డతను.

అంటూనే తన యెడమచెయ్యి గరుడునిమీద వేశాడు: కాని వుత్తరక్షణంలో, గిజగిజలాడుతూ, ప్రాణాలుకడంటగా, కళ్ళు తేల వేసుకుంటూ చాపచుట్టగా పడిపోయాడు గరుడుడు. పర్వతాలూ, అడవులూ, సముద్రాలూ నిండివున్న భూమండలం అంతా యెంత బరువుంటుందో ఆవొక్క చెయ్యీ అంతబరు వుండడం చూసి తెల్ల పోయా డతను. విష్ణుమూర్తి గరుడుణ్ణి బాధపెడదా మనుకోలేదు. అంచేత, తన బలంకొద్దీ అణచలే దతణ్ణి. అంచేతనే బతగ్గలిగా డతను. శరీరం అంతా ముద్ద అయిపోయింది. చైతన్యం లోపించినట్టయిపో యింది. కంగారు పడిపోయాడు. పళ్ళు గిట్టకరుచుకుపోయాయి. రెక్కల్లో వున్న యీక లెన్నో వూడిపోయాయి. "మహాప్రభూ, రక్షించు." అంటూ గోలపెట్టాడు, వెంటనే అతను. "విలాసగా వేశావు నామీద నీచెయ్యి. అక్కడికే నాప్రాణా లెగించుకు పోయాయి. దేవదేవా, ఇక భరించలేను, నన్ను బతికించు. నిజమే, నేనే బలవంతుణ్ణని విర్రవీగాను. నీబలం తెలుసుకోలేకపోయా న్నేను. అంచేతే నాఅంతవాడు లేడనుకున్నాను. ఏమయినా, నీజెండా కని

పెట్టుకుని వున్న వాణ్ణి, కనక, కటాక్షించు" అంటూ ఆర్తంగా ప్రార్థించా డతను.

"ఎప్పుడూ యిలా చెయ్యవుగదా మరి!" అంటూ వొకమాటు నిలవతీసి "సరే, పో" అన్నాడు విష్ణుమూర్తి; కాని, సుముఖుణ్ణి గరుడుని గుండెలమీద పడేటట్టు యెడవకాలి వేలితో యెగజిమ్మాడు. అది మొదలు గరుత్మంతుడు వొకపాముతో వుంటూ డెప్పుడూ. ఈ విధంగా అంత బలశాలికీ గూడా గర్వభంగంచేశాడు విష్ణుమూర్తి.

ఈ యితిహాసం యిలా చెప్పి, కణ్వుడు దుర్యోధనా, యుద్ధరంగంలో పాండుపుత్రుల యెదట పడేదాకానే నువ్వు బతికివుంటావు. మహాయోధుల్లో కల్లా గొప్పయోధుడైన భీమసేనుణ్ణీ, ఇంద్రసుతుడైన అర్జునుణ్ణీ యెదిరించి యుద్ధంలో కొట్టగలవా డెవడూ లేడు, లోకంలో. ఇటు శ్రీమహావిష్ణువు. అటు వాయుదేవుడూ, ఇంద్రుడూ, ధర్ముడూ, అశ్వనీదేవతలూను. ఇదీ పాండుపుత్రుల నిజస్వరూపం. నువ్వు కన్నెత్తి వారిని చూడనైనా చూడలేవు. కనక, యీపాటికి వారితో విరోధం చాలించుకో. సంధి చేసుకో. శ్రీకృష్ణు డిప్పుడు తీర్థం అయి నీయింటికి వచ్చివున్నాడు. అత ణ్ణాశ్రయించి నీవంశం నిలుపుకో. శ్రీమహావిష్ణువు మాహాత్మ్యం అంతా యెరిగినవా డీ నారదుడు. సాక్షాత్తుగా ఆ మహావిష్ణువే యీ కృష్ణుడు" అని చాలా దూరం చెప్పాడు.

కాని, యిది వినేటప్పటికి దుర్యోధనునకు కోపం ముంచుకువచ్చింది. కనుబొమలు ముడిపడ్డాయి. ఒక్క వెకిలినవ్వు నవ్వా డతను, కర్ణుని కేసి చూస్తూ, ముందు. కణ్వుని మాట నిరాకరించాడు "చెప్పావు పోవయ్యా" అంటూ తరవాత. "పరమేశ్వరుడు నన్నెందుకు పుట్టించాడో, ముందేమి కానుందో, నాగతి యేమవుతుందో అదంతా

అలాగే అవుతుంది. నేనలాగే ప్రవర్తిస్తాను. ఇక ఆట్టే వేలకు నువ్వో" అన్నాడు చివరి కతను, తొడచరుచుకుంటూ.

## 106

### గాలవచరిత్ర

ఇదంతా విని జనమేజయుడు "మహాత్మా, దుర్యోధనుడు అనర్థాలే కోరుకోడం చూస్తే చాలా వింతగా వుంది. ఇతరుల డబ్బంటే అంతగా లోభపడేవా డెవడూ కనపడడు మరొకడు. మహారాజయ్యుండికూడా నీచులతో స్నేహంచెయ్యడమూ, చావంటే జంకకపోడమూ, కూడా అర్థంకావడం లేదు. జ్ఞాతులకు దుఃఖమూ, బంధువులకు శోకమూ, స్నేహితులకు క్లేశమూ కలిగించడమూ మూర్ఖుల పనే; కాని శత్రువులకు సంబరం కలిగించడం చూస్తే యేమనాలో తోచడంలేదు. అంత తప్పుదారిలో పడిపోయాడే అతను, వ్యాసభగవానుడు మందలించకుండా యెలా వూరుకున్నాడూ? భీష్ముడున్నూ అంతముందు కెందుకు వెళ్ళనిచ్చాడూ అసలు? వారు సుహృదులు కారా, స్నేహితులు కారా, స్నిగ్ధులు కారా, యెందు కిలా జరిగింది?" అనడిగాడు. దీనికి వైశంపాయనుడు "అందరూ చెప్పా, రెంతో చెప్పారు; కాని ప్రయోజనం లేకపోయింది" అని బదులుచెప్పి "నారదుడున్నూ చాలాదూరం చెప్పాడు, ఆ వివరాలు చెబుతా విను" అంటూ ప్రారంభించాడు మళ్ళీ.

"దుర్యోధనా, మంచిమనస్సుతో హితవు చెప్పేవాడూ అది వినేవాడూ కూడా అపురూపంగానే వుంటారు లోకంలో. వారిద్దరూ కూడా సుహృదు లయివుంటారు మరి. అంటే, ప్రత్యుపకారం కోరకుండా తమకు చేతనైనంతవుపకారం చేస్తారు వారు. వారున్నచోట బంధువు లుండరు. ఏమంటే? తనకు ప్రత్యుపకారం జరుగుతుం దని తోస్తేనే

ఉకాపరం చేస్తాడు బంధు వైనవాడు. సుహృదులు చెప్పేమాట తప్ప కుండా వినాలి. అయితే, నిర్బంధం మాత్రం చెయ్యకూడదు దేవహూ. నిర్బంధించడం మాఢ్యం అవుతుంది మరి. ఈవిషయమై సనాతన మైన యితిహాసం వొకటుంది, చెబుతా విను ”

“ నిర్బంధంవల్ల గాలవు డనే మునికుమారుడు చెడిపోయాడు. ఆ వివరా లేమిటంటావా ? విశ్వామిత్రుడు ఘోర మైన తపస్సు చేసుకుంటున్నపుడు ధర్ము డొకమాటు అతణ్ణి పరీక్షచేద్దా మనుకున్నాడు. సప్తమహర్షుల్లోనూ అచ్చంగా వసిష్ఠు డన్నట్టు సిద్ధం అయివచ్చాడు వెంటనే. ఊరికేకాదు “ ఆకలి ఆకలి. పేగులు మాడిపోతున్నా ” యంటూ వచ్చాడు తూలిపోతూ. అది చూసి కంగారుపడి పరమాన్నం సిద్ధంచేయించాడు విశ్వామిత్రుడు ; కాని వసిష్ఠు డప్పటిదాకా వుండలేకపోయాడు. అది చూసి తన యింటికి తీసుకువెళ్ళి సిద్ధంగా వున్న అన్నంపెట్టా డతని కొకముని. ఇంతలో ఉడుకూముడుకూగా వున్న పరమాన్నం పట్టుకుచక్కావచ్చాడు విశ్వామిత్రుడు. “ అయ్యా, ఆకలికి తాళలేక మరోచోట భోజనంచేశా న్నేను. మళ్ళీ వస్తా నిలాగే వుండు ” అంటూ చక్కాపోయాడు వసిష్ఠుడు.

“ సరే ” అన్నాడు విశ్వామిత్రుడు. ఆపాయసపాత్ర ఎంతవేడిగా వున్నా సంకోచించక నెత్తిమీద పెట్టుకున్నాడు. పడిపోకుండా అది రెండుచేతులతోనూ పట్టుకుని స్థాణువులాగ నుంచుని వుండిపోయాడు, గాలవు డని వొక మునికుమారుడు. విశ్వామిత్రు డంటే యెంతో గౌరవమూ భక్తీ ప్రీతీని అతనికి. అతని దగ్గిర చదువుకుంటున్న శిష్యుడు మరి. అంచేత, అలా నుంచుని వుండిపోయిన విశ్వామిత్రునకు సకలోపచారాలూ చెయ్యసాగాడు గాలవుడు.

వందసంవత్సరాలు గడిచిపోయా యిలాగ. వసిష్ఠుని వేషంతో ధర్ముడు మళ్ళీ వచ్చా డప్పుడు ఆవురావురు మంటూనే భోజనానికి.

అప్పటికీ అలాగే నుంచుని వున్నాడు విశ్వామిత్రుడు. పాయసపాత్ర నెత్తిమీదే వుంది. గాలిమాత్రమే ఆహారంగా వుండిపోయాడు విశ్వామిత్రుడు. "దింపు, అన్నంపెట్టు" అన్నాడు వసిష్ఠుడు. చూడగా అప్పుడు వండినట్లే వుందది. అంత వేడిగానూ వుంది. అది భుజించి "బ్రహ్మర్షీ, నేను చాలా సంతోషించా" నంటూ వెళ్ళిపోయాడు వసిష్ఠుడు.

ధర్ముని మాటతో, విశ్వామిత్రుడు, క్షత్రియత్వం విడిచి యిలాగ బ్రహ్మర్షి అయినాడు. అంతవరకూ గాలవుడతనికి సేవలుచేస్తూనే వున్నాడు. అందుకు చాలా సంతోషించి "నాయనా, నేనిదే చెబుతున్నాను. నీ యిష్టంవచ్చినచోటికి వెళ్ళిపో నువ్వు" అని చెప్పాడు విశ్వామిత్రుడు. గాలవుడందుకు బ్రహ్మానందపడ్డాడు. అయితే "మహర్షి గురుదక్షిణగా ఏమి తీసుకురమ్మని సెలవు?" అనడిగా డతను. "గురుదక్షిణ యిస్తేగాని నువ్వు చెప్పిన చదువు నాకు సంస్కారం కలిగించదు మరి" అని మనవిచేసుకున్నాడు కూడాను. "గురుదక్షిణ విద్యాశాంతి అనిపించుకుంటుంది. గురువునకది సమర్పించుకుంటే స్వర్గంలో యజ్ఞంచేసినంత ఫలం కదా! కనక నీ యిష్టమైన దేమిటో చెప్పు, తీసుకువస్తా" నంటూ కూచున్నాడు గాలవుడు.

"వద్దవ" న్నాడు విశ్వామిత్రుడు. "గురుదక్షిణ అంటూ వేరే అక్కర్లేదు. నువ్వు చేసిన శుశ్రూషతోనే నేను చాలా తృప్తి పడ్డాను, కనక, నిశ్చింతగా వెళ్ళిపో, వెళ్ళిపో" అని కూడా తొందర పెట్టాడు చాలామార్లు; కాని గాలవుడు కదల్లేదు. "ఏమి తీసుకురమ్మంటూ?" వన్నమాట కూడా విడిచిపెట్టలే దతను. దీంతో కోపం వచ్చింది విశ్వామిత్రునికి. నిర్బంధం యెవరికైనా అంతే చేస్తుంది మరి. "సరే, అయితే విను" అన్నా డతను. "గుర్రం అంతా చంద్రకిరణా లంత తెల్లగా వుండాలి. చెవులమీద మాత్రం నల్లని

మచ్చ వుండాలి. అన్నీ వొక్కవిధంగా వుండాలి. అలాంటిగుర్రాలెని మిదివందలు తీసుకురా. వెళ్లు, నుంచోకు, త్వరగా తీసుకురా" అని నిష్ఠురంగా చెప్పాడు."

# 107

## గా ల వ చ రి త్ర 2

విశ్వామిత్రుని మాట విన్నాడు, అంతే. గాలవుడు భోజనం మానుకున్నాడు. నిద్ర విడిచిపెట్టేశాడు. ఎక్కడా నుంచోడు, కూచోడు, ఎముకులూ చర్మమూ మాత్రమే మిగిలాయతని శరీరాన. తెల్లబడిపోయిందా శరీరం. చింతపట్టుకుంది. ఇటు దైన్యమూ — అటు యేడుపూ — వీటితో దహించుకుపోసాగాడతను. "నాకు స్నేహితుల్లేరు. డబ్బులేదు. వచ్చే మార్గాలున్నూ లేవు. చంద్రకిరణాలంత తెల్లని గుర్రాలు — ఒకటీ రెండూ కా, దెనిమిది వందలు. నాకెక్కణ్ణుంచి వస్తాయీ? నాకిక నిద్ర అంటే యేమిటి, ఆహారం అంటే యేమిటి? బతికివుండడం మాత్రం యెందుకు?" అంటూ వొకటే దుఃఖం పట్టుకుందతనికి.

"సముద్రం లోఅడుగంటా మునిగో, భూమ్మీద నరసంచారం లేని దూరతీరాలకు వెళ్లో ప్రాణాలు విడిచిపెట్టెయ్యడమే గతి నాకు. డబ్బులేనివాడికీ, ఏకోరికా తీరనివాడికీ, రుణాల్లో మునిగిపోయి వుండినవాడికీ ప్రయత్నం చెయ్యందే సుఖంయెక్కడిదీ? స్నేహితుల దగ్గిర డబ్బుపుచ్చుకుని లక్షణంగా వాడుకుని నువ్వుకోరిం దిస్తానని మాట యిచ్చి ప్రత్యుపకారం చెయ్యనివాడు బతికివుండడం కంటే చచ్చిపోడం మేలు. నేనిది చేస్తానని శపథంపట్టి అది చెయ్యలేనివాడికి సకలమూ నశించిపోతుంది. అబద్ధాలాడేవాడు బతికివుండిన్నీ చచ్చినవాళ్లలో లెక్క. వాడికి సంతానం నిలవదు. పెత్తనం వుండదు. చివరికి గతి

కూడా వుండదు, మంచిది. కృతఘ్నుడైనవాడికి కీర్తి తక్కువ. వాడి కెక్కడా స్థానం వుండదు. సుఖంకలగనే కలగదు. కృతఘ్నుడు దగ్గిర చేరనివ్వతగ్గవాడు కాడు. వాడికి తరుణోపాయం కూడా లేదు. డబ్బు లేనివాడు పాపాత్ముడవుతాడు. వాడికి బతుకులేదు. కుటుంబం వుండదు, పాపాత్మునికి. పైగా, చేసిందంతా నిష్ఫలం అయిపోయి, పూర్తిగా నశించిపోతాడు, పాపాత్ముడు.

నిజంగా, నేను పాపాత్ముణ్ణి. కృతఘ్నుణ్ణి. పినుణ్ణి. అసత్యవాదిని. ఏమంటే? గురుదేవునితో నీకిది చేస్తా నని చెప్పి చెయ్య లేకుండా వున్నాను మరి. కనక, నాకు చేతనైనంతా ప్రయత్నం చేసి చూస్తాను. లాభం లేదూ, ప్రాణాలు విడిచిపెట్టేస్తాను. దేవతల న్నెనేదీ కోరలే దెప్పుడూ. యజ్ఞాల సందర్భాల్లో నేనంటే చాలా ఆదరం చూపిస్తారు వారు. కనక, నేనిప్పుడు శ్రీకృష్ణు ణ్ణాశ్రయిస్తాను వెళ్లి. మరో వుపాయం లేదు నాకు. దేవతల కందరికీ దేవత అతను. ముల్లోకా లకూ ప్రభువు. గతిలేనివాళ్లకీ వున్నవాళ్లకీ కూడా అతనే గతి. దేవ దానవు లందరూ కూడా అతని అనుగ్రహంవల్లనే సకలభోగభాగ్యాలూ అనుభవిస్తున్నారు. ఇదిగో, కృష్ణునకు సాష్టాంగనమస్కారాలు"

కళ్లు తెరుచుకుని లేచాటప్పటికి ఎదుట గరుత్మంతుడు నుంచుని వున్నాడు. "గాలవా" అంటూ చాలా ప్రీతిగా పిలిచా డతను. "నువ్వు నాకు స్నేహితుడవు. సామాన్యుడవుకాదు స్నేహితు లందరి లోనూ గొప్ప స్నేహితుడవు. సంపన్నుడైవున్నవాడికి స్నేహితుని కోరిక తీర్చడం పరమధర్మం. బ్రాహ్మణోత్తమా, నాకేమాత్రమో సంపద వుంది, లోటు లేదు. నేనిదివరకే చెప్పా న్నివిషయమై కృష్ణు నకు. కనక నాతో రా, నీకెక్కడికి వెళ్లా లనుంటే అక్కడి కల్లా తీసుకువెడతాను" అని చెప్పాడు సాదరంగా.

# 108

## గా ల వ చ రి త్ర 3

"గాలవా, ముందు మన మేదిక్కుకి వెడదామూ? తూర్పుదిశకా, దక్షిణానికా, పశ్చిమానికా, ఉత్తరానికా? సర్వలోకాలకూ వెలుగిచ్చే సూర్యు డీతూర్పున ఉదయిస్తాడు. సాధ్యు లిక్కడ తపస్సు చేసుకుంటూ వుంటారు. బుద్ధి, సూర్యుని ప్రభావంవల్ల ప్రాతస్సాయంకాలాల యిక్కడ పుట్టుకువస్తూవుంటుంది. అది జగత్తంతా వ్యాపిస్తుంది.

అగ్నిషోమదైవత్యా లయిన యజ్ఞపురుషుని ఆజ్యభాగా లిక్కడే ప్రతిష్ఠితా లయి వున్నాయి. యథాశాస్త్రంగా సంస్కారంచేసి యిక్కడ హోమంచేస్తే ఆ హవ్యం అంతటా వ్యాపిస్తుంది. పగటికీ, దేవమార్గానికీ యిదే దారి. దక్షునికూతుళ్లు ఎందరో ప్రజల నిక్కడ కన్నారు. కశ్యపప్రజాపతి బిడ్డ లిక్కడే పుట్టిపెరిగారు. ఇంద్రునకు దేవ రాజ్యాని కిక్కడే పట్టాభిషేకం జరిగింది. అంచేత, దేవతల ఐశ్వర్యాని కంతకూ యిదే మూలం. దేవత లిక్కడే తపస్సు చేసుకున్నారు. దేవత లంతా పూర్వం యిక్కడే వుండేవారు. పూర్వం ఇన్ని కార్యా లిక్కడ జరిగివుండడంవల్ల దీనికి పూర్వదిక్కు అని పేరువచ్చింది.

దేవకార్యాలున్నూ యిక్కడే జరిగాయి పూర్వం. బ్రహ్మ, వెనకటి కిక్కడే వేదాలు గానంచేశాడు. బ్రహ్మవాదులకు, సవిత, యిక్కడే సావిత్రిని ఉపదేశించాడు. సూర్యుడు యాజ్ఞవల్క్యున కిక్కడే వేదం ప్రసాదించాడు. యజ్ఞాల్లో ముఖ్యం అయివున్న సోమం దేవతలవల్ల యిక్కడే వరాలు పొందివుంది. త్రేతాగ్నులు సోమాజ్య పయోరూపా లైన ఉదకాలు సంపాదించుకుని ఇక్కడే తృప్తు లయి వున్నారు. వరుణుడు పాతాళరాజ్యాని కిక్కడే అభిషిక్తుడై సకల సంపదలూ అనుభవిస్తున్నాడు.

పురాణపురుషు డైన వసిష్ఠు డిక్కడే పుట్టాడు, పెరిగాడు, మరణ మున్నూ పొందాడు. ప్రణవంలో వేదశాఖ లన్నీ యిక్కడే పుట్టాయి. మునీశ్వరులు కొందరిక్కడ హోమధూమం పానంచేసి ధూమపులయి నారు. దేవేంద్రుడు, వరాహం మొదలైన అనేక మృగాల నిక్కడే ప్రోక్షించి దేవతలకు హవిర్భాగాలు కల్పించాడు. అహితులూ, కృతఘ్నులూ అయిన మనుష్యులనూ, అసురులనూ సూర్యు డిక్కడ నాశనంచేసేస్తాడు. ముల్లోకాలకూ, ముఖ్యంగా స్వర్గానికీ, సుఖానికి యిదే ద్వారం. నీకిష్టం వుంటే యీదిక్కుకి వెడదాం పద."

## 109

### గాలవచరిత్ర 4

"యజ్ఞంచేసి వెనకటికి వివస్వతు డిది గురువునకు దక్షిణగా యిచ్చాడు. అంచేతే దక్షిణదిక్కు అని పేరువచ్చింది దీనికి. లోకత్రయానికీ పితృ పక్షం యిక్కడే వుంది. ఊష్మపు లనే దేవతల కిదే నివాసభూమి. విశ్వేదేవతలు పితృదేవతలతో కలిసి యిక్కడే వుంటారు. దేవతలతో సమానంగా యజ్ఞభాగా లనుభవిస్తారు వారు. పైతృక మైన ధర్మాని కిది ద్వారం. త్రుటి, లవం—ఈపరిమాణాలతో యిక్కడ కాలనిర్ణ యం జరుగుతూ వుంటుంది. దేవర్షులూ, పితృలోకమహర్షులూ, రాజ ర్షులూ కలిసిమెలిసి సుఖంగా వుంటా రిక్కడ.

మరణించినవారు చేసుకున్న కర్మా, వారు నిర్వర్తించిన ధర్మమూ, వారు పాలించిన సత్యమూ చిత్రగుప్తు డిక్కడే వివరిస్తాడు. వారికి ఉత్తరగతి కూడా యిక్కడే నిర్ణయం అవుతుంది. పాపాత్ము డైనా పుణ్యాత్ముడైనా మరణకాలంలో తమశ్ఛన్ను డై వుండి, మృతిజెందిన తరువాత యిక్కడికే వస్తాడు మొదట. రాక్షసులు, వేలకొద్దీ లక్షల కొద్దీ కోట్లకొద్దీ కూడా వున్నా రిక్కడ. పాపాత్ము లైనవా రిక్కడ

నానాయాతనలూ చూస్తారు. మందరనికుంజాల్లోను, బ్రహ్మర్షుల నివాసాల్లోనూ చేరి, మనస్సూ బుద్ధీ హరించి పారవశ్యం కలిగించే గాథలు కమ్మగా గానం చేస్తారు. గాథలతో జటిలాలై వున్న సామాలు విని ఇక్కడ, భార్యలనూ మంత్రులనూ, రాజ్యమూ కూడా విడిచి రైవతుడనేరాజిక్కడ అడవుల్లో ప్రవేశించాడు.

యవక్రీతుని కొడుకు సావర్ణిమనువు సూర్యుని రథానికీ గుర్రాలకూ యిక్కడే హద్దు లేర్పాటుచేశాడు. సూర్యు డెప్పుడూ ఆహద్దులు దాటడు. రావణు డిక్కడే ఘోరతపస్సు చేసి దేవతల చేతిలో చావు తటస్థించకుండా వుండేటట్టు వరాలు సంపాదించుకున్నాడు. వృత్రాసురు డిక్కడ నివసించివుండడంవల్లనే ఇంద్రుణ్ణి కూడా గజగజలాడించగలిగినంతటి బలవంతు డైనాడు. దేహధారుల ప్రాణాలన్నీ మరణానంతరం యిక్కడ చేరుకుని, ప్రాణ అపాన వ్యాన ఉదాన సమాన — ఈవిధంగా అయిదయి మళ్ళీ దేహధారులను పొందుతాయి. పాపాలు చేసుకున్నవా రిక్కడే కఠినశిక్ష లనుభవిస్తారు. ఇక్కడే వుంది వైతరణి. వితరణం అనే నరకానికి వెళ్ళేవా రందరూ యిక్కడే మూగుతారు. ప్రాణులు సంపాదించుకున్న సుఖాలూ దుఃఖాలూ కూడా యిక్కడే పూర్తిఅయిపోతాయి. ఇక్కడ సంచరిస్తూ సూర్యుడు మిక్కిలీ రసవంతం అయిన వర్షం కురుస్తాడు. అటు వెళ్ళి ఉత్తరదిక్కు చేరి మంచున్నూ కురుస్తా డతను.

వెనకటికి, నేను, ఆకటనకనకలాడిపోతూ అన్యోన్యమూ కొట్టుకున్న గజకచ్ఛపాల నిక్కడే చంపితిన్నాను. సూర్యునివల్ల ఇక్కడే పుట్టాడు చక్రధనువు అన్న ముని. అతనే కపిలమహర్షి. అతనికోపంవల్లనే బుగ్గి అయిపోయారు సగరచక్రవర్తి కొడుకు లరవై వేలమందిన్నీ.

శివు లనే బ్రాహ్మలు, సకలవేదాలూ అభ్యసించి ఇక్కడ సిద్ధి పొందే మోక్షం సంపాదించుకున్నారు. వాసుకీ, తక్షకుడూ, ఐరావ

తుడూ అనే నాగరాజులు పాలించే భోగవతీపట్నం యిక్కడే వుంది. మరణకాలంలో సూర్యుడూ అగ్నీ కూడా ఛేదించలేనటువంటి అంధకారం – కటికిచీకటి అలుముకుంటుం దిక్కడ.

# 110

## గాలవ చరిత్ర 5

"బ్రాహ్మణోత్తమా, పగటి చివరిభాగాన సూర్యుడు తన కిరణాలిక్కడ ఉపసంహరించుకుంటాడు. అంచేత దీనికి పశ్చిమదిక్కని పేరు వచ్చింది. జలరాజయిన వరుణున కిది మిక్కిలీ ప్రియమైనది. జలాలకు రక్షణ కలిగించడానికి, జలజంతువుల కన్నిటికీ రాజుగా వరుణునకు ఇక్కడే పట్టం కట్టాడు భగవంతుడైన కశ్యపుడు. శుక్లపక్షప్రారంభంలో, చంద్రుడు, వరుణిని అధీనంలో వున్న రసాలాన్నీ పానం చేసి యిక్కడే వృద్ధిపొందుతాడు. క్రమంగా వాయుదేవు డిక్కడ దైత్యుల నెందరినో బంధించివుంచాడు. ఆపసోపాలు పడిపడి వారందరూ నిద్రపోయారు.

సూర్యుణ్ణి అస్తగిరి అనేపర్వతం యిక్కడ చేరదీసుకుంటుంది. ఆపర్వతంనుంచే బయలుదేరుతుంది సంధ్య, పగలు పూర్తికాగానే, జనుల ఆయువు సగం హరించెయ్యడానికో అన్నట్టు రాత్రీ నిద్రా యిక్కడే బయలుదేరతాయి. ఇంద్రుడు అదితిగర్భం ఇక్కడే యేడు ముక్కలు చేశాడు. ఆముక్కలే మరుత్తు లయినాయి. ఇక్కడ మందర పర్వతం వుంది సముద్రగర్భాన. హిమవత్పర్వతమూలం దానిదాకా వ్యాపించివుంది. ఎంత పరిశీలించినా దాని అంతం దొరకదెవరికీ.

ఇక్కడ బంగారుపర్వతం వుంది. దానిమీద వున్న సరస్సులో బంగారుపద్మా లున్నాయి. ఆసరస్సువొడ్డున కామధేనువు పాలు [illegible]. ఇక్కడి సముద్రంలోనే వున్నాడు రాహువు,

సూర్యచంద్రులను మింగడానికి వాడుపుగా చూస్తూ. హిరణ్యశిరసు డనే ముని మంచి యువకుడు. చాలా గొప్పవా డతను. అతని కెవరూ సాటిరారు. ఎవరికీ కనపడకుండా అదృశ్యు డయివుండి అత నిక్కడ సామగానం చేస్తూవుంటాడు, చాలా దూరం వినపడేలాగ. హరిమేధ సుని కూతురు ధ్వజవతి అని వొక యువతి. ఆగుఆగు అంటూ అదలిం చాడామెని సూర్యుడు. అంచేత ఆమె యిక్కడే వుండిపోయింది.

వాయువూ, అగ్ని, జలమూ, ఆకాశమూ తమ శీతస్పర్శా ఉష్ణ స్పర్శా యిక్కడే విడిచిపెట్టేస్తాయి. ఆస్పర్శలు చాలా బాధపెడ తాయి. జ్యోతిస్సు లన్నీ సూర్యమండలం ప్రవేశిస్తా యిక్కడ. అవి పద్దెనిమిది రాత్రులు సూర్యునితో కలిసి తిరిగి, తరవాత, చంద్రుని సంయోగంతో మళ్ళీ ఆవిర్భవిస్తాయి. నదు లన్నీ యిక్కడే సాగర సంగమం చేస్తాయి. ముల్లోకాల్లోనూ వుండే జలం అంతా వచ్చి ఈ వరుణాలయంలోనే నిలుస్తుంది. నాగరాజయిన అనంతుని నివాసమూ, ఆదిమధ్యాంతరహితు డైన శ్రీహరి నివాసమూ, అగ్నిసఖుడైన వాయుదేవుని నివాసమూ, మరీచిపుత్రుడైన కశ్యపమహర్షి నివా సమూ ఇక్కడే వున్నాయి."

## 111

### గాలవచరిత్ర 6

"పాపా లన్నీ పోయి ఉత్తీర్ణు లవుతా రందరూ యిక్కడ. స్వర్గాని కిది దారి. అంచేతే, ఉత్తరదిక్కు అని పేరు వచ్చింది దీనికి. ఇది నిధు లున్నస్థలం. పశ్చిమానికీ తూర్పునకూ మధ్యగా యిదే స్వర్గమార్గం. చాలా గొప్ప దిది. ఈదిక్కున ధూర్తులూ, క్రూరులూ, ధర్మహీ నులూ వుండలేరు. ఇక్కడి బదరికావనంలోనే వున్నారు నరనారాయ ణులు. హిమవత్పర్వతపృష్ఠభాగాన పరమేశ్వరుడు పార్వతితో నివ

సించివుండి యుగాంతాగ్నిలావెలిగిపోతూ ఈదిక్కునే వున్నాడు. ఒక్క నరనారాయణులకు తప్ప మహర్షులకూ, దేవతలకూ, గంధర్వులకూ, యక్షులకూ, సిద్ధులకూ—తుద కింద్రునకున్నూ అతను కనపడడు.

వెయ్యికాళ్లతోనూ, వెయ్యిశిరస్సులతోనూ, వెయ్యి కళ్లతోనూ యిక్కడే వుండి శ్రీమహావిష్ణువు లోకాలన్నీ వొక్కవిధంగానే చూస్తూవుంటాడు. బ్రాహ్మల కందరికీ రాజుగా చంద్రున కిక్కడే పట్టాభిషేకం జరిగింది. మహేశ్వరుడు ఆకాశంనుంచి దిగిన గంగను ఇక్కడే తన జటాజూటంలోధరించి, తరవాత భూమ్మీద ప్రవహింప జేశాడు. ఆమహేశ్వరుణ్ణి పెళ్లాడ్డానికి పార్వతి, యిక్కడే ఘోరతపస్సు చేసింది. ఈదిక్కునే పుట్టాయి కామమూ రోషమూ. ఇక్కడే వుంది కైలాసం. ఇక్కడే పుట్టింది పార్వతీదేవి.

యక్షులకూ, రాక్షసులకూ గంధర్వులకూ కుబేరు డిక్కడి కైలాసపర్వతంమీదే రాజుగా పట్టాభిషిక్తు డైనాడు. రమ్యమైన చైత్రరథమూ, వైఖానసాశ్రమమూ, మందాకినీనదీ, మందరపర్వతమూ యీదిక్కునే వున్నాయి. సౌగంధికవనం యిక్కడే వుంది రాక్షసుల కాపలాలో. కదళీవనమూ కల్పవృక్షాలూ యిక్కడే వున్నాయి.నియమనిష్ఠాగరిష్ఠు లైన సిద్ధుల విమానా లిక్కడ విహరిస్తూ వుంటాయి.

సప్తమహర్షులూ పతివ్రతల కందరికీ శిరోమణి అయిన అరుంధతీదేవీ యీదిక్కునే వున్నారు. స్వాతీనక్షత్రం యిక్కడే ఉదయిస్తుంది. బ్రహ్మదేవుడు యజ్ఞంచేసి యిక్కడే స్థిరపడివున్నాడు. సూర్యచంద్రాది జ్యోతిర్మండలాలన్నీ యిక్కడే తిరుగుతూ వుంటాయి. సత్యనిరతులైన ధాము లనే మహామునులు గంగాద్వారంరక్షిస్తూ యిక్కడే వుంటారు. వారి మూర్తిమంతాలూ, ఆకారాలూ, వారి తపశ్చర్యా యెవరికీ కనపడవు. కామభోజ్యా లైన పరివర్తనా లెన్నో జరుగుతూ వుంటా

యిక్కడ. ఇక్కడికి చేరగలిగిన మనుష్యుల రూపాలు మంచుతగిలి నశించిపోతాయి. నరుడూ నారాయణుడూ తప్ప యిక్కడికి వచ్చినవా రెవరూ లేరు. కుబేరుని రజతపర్వత మిక్కడే వుంది. దానిపేరే కైలాసం. విద్యుత్ప్రభలు అని పదిమంది అప్సరసలు. వారిక్కడే పుట్టారు.

వెనకటికి, శ్రీమహావిష్ణువు మూడులోకాలూ ఆక్రమించినప్పుడు తన కాలిక్కడే ఉంచాడు. ఆస్థలమే యిప్పుడు విష్ణుపదం అనిపిలుచు కుంటున్నది. ఇక్కడ ఉశీరబీజం అని వొక స్థలం వుంది. ఇక్కడ జాంబూనదం అని వొక సరస్సున్నూ వుంది. మరుత్తు డనేరాజు ఆ సరస్సు వొడ్డున యజ్ఞంచేశాడు. జీమూతు డనే బ్రహ్మర్షి యిక్కడ ఘోరతపస్సు చేశాడు. హిమవత్పర్వతసంబంధం అయిన బంగారం గని కనపడిం దతనికి. అందులో చాలాభాగం బ్రాహ్మల కిచ్చి తక్కిన దతను స్వాధీనంచేసుకున్నాడు.

పొద్దున్నా సాయంత్రమూ చేరి యెవ రేమి చెయ్యాలో దిక్పాలకు లందరూ యిక్కడే నిర్ణయించుకుంటారు. ఈకారణాలవల్ల యిది ఉత్తరదిక్కని పేరుపొందింది. గాలవా, అంతా విన్నావు నువ్వు. మన మిప్పు డెక్కడికి వెడదా మంటావు? ఎక్కడ ఏమి కావా లంటే, అక్కడ, అదంతా చూపిస్తా న్నేను, నామూపెక్కి కూచోవయ్యా!"

# 112

## గాలవచరిత్ర 7

"గరుత్మంతుడా, యజ్ఞపురుషుని కళ్ళక్కడ వున్నా యన్నావే నువ్వు, నన్నా తూర్పుదెసకు తీసుకువెళ్ళవయ్యా" అన్నాడు గాలవుడు. "అక్కడ దేవత లున్నారనిన్నీ చెప్పావు నువ్వు. సత్యమూ ధర్మమూ వున్నా యని కూడా చెప్పావు నువ్వక్కడ. దేవతలను కలుసుకోవా లని నాకెప్పణ్ణించో వుబలాటం. వారి దర్శనమున్నూ చేసుకోవాలి

నేను" అని కూడా చెప్పా డతను. "సరే" అన్నాడు, గాలవుణ్ణి తన మూపున యెక్కించుకుని రంయి మని బయలుదేరాడు గరుడుడు.

కాని గాలవు డావేగానికి తట్టుకోలేకపోయాడు. గరుడా, నువ్వా కాశానికి చొచ్చుకునిపోడం చూస్తే తన ప్రచండసహస్రకిరణాలతో సూర్యభగవాను డన్న ట్టున్నావు నువ్వు. నీ రెక్కల గాలివేగానికి పెల్లగిల్లి, మహామహా వృక్షాలు నీవెంట వచ్చివచ్చి కిందపడిపో తున్నాయి. నిన్ను సాగనంపడానికి వచ్చి బంధువు లొక్కొక్కడే వెనక్కి మళ్లిపోతున్న ట్టుందది. అడవులూ, పర్వతాలూ, సము ద్రాలూ — వీటితో నిండివున్న భూమండలమే నీవెంటబడి వస్తున్న ట్టనిపిస్తోంది నాకు. నీరెక్కలగాలితో, మొసళ్ళూ తిమితిమింగిలాలూ మొదలయినజలజంతువు లన్నింటితోనూ సముద్రజలం అంతా ఆకా శాని కెగిసిపోతున్నట్టున్నూ కనపడుతోంది నాకు.

తుల్యరూపాలూ, తుల్యముఖాలూ మాత్రమే కాక, ఏనుగుము ఖాలూ, గుర్రంముఖాలూ, మనిషిముఖాలూ కలవి కూడా కనపడు తున్నాయి నాకు తిమితిమింగిలాలు; కాని నీరెక్కలగాలి భరించలేక గిలగిల్లాడిపోతున్నా యవి. సముద్రపుహోరుతో నాచెవులు చిల్లులు పడిపోతున్నాయి. నాకేమీ వినపడ్డం లేదు. కనపడ్డమూ లేదు. నావొళ్లే నాకు తెలియడం లే దసలు. కనక, మెల్లిగా పదవయ్యా! లేకపోతే, బ్రహ్మహత్యామహాపాతకం చుట్టబెట్టుకుంటుంది సుమా నీకు. సూర్యబింబం కనపడ్డంలేదు నా కేమనుకున్నావో నువ్వు. దిక్కూ తెన్నూ తెలియడం లేదు. ఆకాశమున్నూ కనపడ్డం లేదు. చీకట్లలుము కుంటున్నాయి నన్ను. నువ్వుకూడా కనపడ్డంలేదు నాకు. నీశరీరమూ నాశరీరమూ కనపడ్డంలేదు, చివరికి. జాతిరత్నా లన్నట్టున్న నీకళ్లు రెండూ మాత్రమే కనపడుతున్నాయి నాకు.

మాటిమాటికీ నాశరీరంలో మంటలు పుట్టుకు వస్తున్నాయి. దాంతో కళ్లు మిరిమిట్లు కమ్మేస్తున్నాయి నాకు. అంతలో మళ్లీ తెరపిన పడుతున్నాయి మళ్లీ, వాటి కవే. కనక, నీవడి తగ్గించవయ్యా నాయనా! ఇంత వడిగా వెళ్లడంలో యేముందీ ప్రయోజనం? నీవేగం తట్టుకోలేకుండా వున్నా న్నేను. ఒక్క-చెవిమీద మాత్రమే నల్లని మచ్చగల యెనిమిదివందల వెల్లగుర్రాలు గురువుగారి కివ్వాలి నేను. అవి సంపాదించా లంటే నాకేమీా దారి కనపడ్డం లేదు. అంచేత చచ్చి పోడం వొక్క-టే కనపడుతోంది నాకు దారి. నాదగ్గిర డబ్బు లేదు. పోనీ అంటే, డబ్బున్న స్నేహితులూ లేరు నాకు. ఒక వేళ అపారమైనడబ్బు దొరుకుతుం దనుకో. దాంతో నెరవేరేది కాదయ్యో ఈ వ్యవహారం.

ఇది విసీ, చూసీ "భయపడకయ్యా బ్రాహ్మణోత్తమా" అన్నాడు గరుత్మంతుడు నవ్వుతూ. వడితగ్గించలే దతను. ఆగనేలేదు. "ఎందుకయ్యా అంతభయం? ఇంతమాత్రాని కేటయ్యా చచ్చిపోడం? కాలం అంటే—యము డంటే యేమనుకున్నావు నువ్వు? మన స్వాధీనంలో లే డతను తెలుసా? పరమేశ్వరస్వరూపమయ్యా అతను. మరి, ముందే యెందుకు చెప్పావుకాదూ నాకీ గుర్రాల సంగతి? ఇప్పుడయినా మించిపోలేదు లే, మంచి వుపాయమే వుందొకటి. చూడూ, సముద్రానికి దగ్గిరగా వొక పర్వతం వుంది కనపడుతోందా? ఋషభ పర్వతం దానిపేరు. దానిమీాద కొంచెంసేపు విశ్రమిద్దాం లేవయ్యా! భోజనం కూడా కానిచ్చుకునే వెనక్కి-పోదాం మెల్లిగా" అనిచెప్పి వూరడించా డతణ్ణి.

# 113

## గా ల వ చ రి త్ర 8

గాలవుడూ గరుత్మంతుడూ ఆపర్వతంమీాద వొక బ్రాహ్మణస్త్రీని చూశారు. శాండిలి ఆమె పేరు. తపోదీక్షలో వుంది. గరుత్మంతు డామెకి

నమస్కారం చేశాడు. గాలవు డామెని పూజించాడు. వారికి స్వాగతం పలికిం దామె. బలిమంత్రోపబృంహితం అయిన అన్నంకూడా పెట్టింది. అది భుజించి భుక్తాయాసంతో వారక్కడే కూచున్నారు. ఇంతలో నిద్ర ముంచుకువచ్చింది వారికి. కొంతసేపటికి మెళుకువా వచ్చింది; కాని కళ్లు నులుముకుంటూ చూసుకోగా రెక్కలూడిపోయీ, యెరకలున్నూ రాలిపోయీ వొట్టిమాంసంముద్దలో పడి వున్నాడు గరుత్మంతుడు. మొగమూ కాళ్లూ మాత్రమే వున్నాయతనికి.

కొయ్యాయిపోయూ డది చూసి గాలవుడు. "ఏం, నాయనా, యీ దారుణం యేమిటీ? ఇక్కడికి వచ్చి నువ్విలా అయిపోయావేం? ఇలాగ యెన్నాళ్లు పడివుంటామూ మన మిక్కడ? ధర్మవిరుద్ధమైన అకార్యం యేమయినా తలపెట్టావా మనస్సులో నువ్వు? చిన్నతప్పుచేస్తే యింత ఘోరం తటస్థించదు" మరి అన్నాడతను, చాలా విచారిస్తూ.

"అకార్యకరణం ఏమీ చెయ్యలేదయ్యా నేను?" అన్నాడు గరుత్మంతుడు. అసలు తలపెట్టిన్నీ యెరగను. బ్రహ్మా, మహేశ్వరుడూ, మహావిష్ణువూ, యజ్ఞమూ, ధర్మమూ వున్నచోటికీసిద్ధురాలిని తీసుకు వెడదా మనుకున్నాన్నేను. అక్కడ యీమె స్వేచ్ఛగా వుంటుందను కున్నాను. ఇక్కడ వొక్కత్తే వుండి యేమి చేస్తుం దీమె! "అనిన్నీ అనుకున్నా నంతే. అయితే, మించిపోయింది లేదులే. కాళ్లమీద పడి నేనీమెని ప్రార్థిస్తాను రక్షించ మని" అని గాలవునికి బదులుచెప్పి, చెబుతూనే ఆమెకాళ్లమీద వాలి "అమ్మా, నీమొకల గౌరవాద రాలూ, భయభక్తులూ వుండడంవల్లనే నేనలా అనుకున్నాను; గాని తిరస్కారభావంతో కాదు. నేను చేసింది తప్పయినా వొప్పయినా నన్ను కటాక్షించాలి నువ్వు" అంటూ వేడుకున్నాడు.

"లే, లే" అంది శాండిలి, అందుకు తృప్తిపడి. ముందు గాలవుణ్ణీ గరుత్మంతుణ్ణీ భయపడవద్దంది. "గరుడా, నన్ను నిందించావు నువ్వు.

నువ్వు చేసిన ఆలోచన నన్ను నిందించడమే, మరేమీ కాదు. సింద భరించలేన్నేను. నన్ను నిందించినవా డప్పటి కప్పుడు భ్రష్టుడయి పోతాడు. దుర్లక్షణాలు దగ్గిర చేరకుండా చూసుకుంటూ, చెడుదారి తొక్కకుండా మసులుకుంటూ సదాచారసంపత్తి విడిచిపెట్టుకోకుండా తపస్సు చేస్తూ నేనీ సిద్ధి సంపాదించుకున్నాను. నాయనా, సదాచారం చాలా గొప్పది. దానివల్ల ధర్మం ఫలిస్తుంది. డబ్బుచేరుతుంది. సిరి సంపదలు వృద్ధిఅవుతాయి. ఎలాంటి దుర్లక్షణాలూ అంటనివ్వదది. కనక, నువ్వు యథేచ్ఛగా వెళ్ళిపోయిక. నన్ను నువ్వేమీ గర్హించ వద్దు. నన్నే కాదు, నువ్వేకాను, ఏ స్త్రీనీ గర్హించగూడ దెవడూ కూడా. ఇదిగో, నువ్వు నీస్వస్వరూపం పొందావు, చూసుకో. నీబల పరాక్రమాలున్నూ నీకు సంక్రమించాయి పరకాయించుకో" అని చెప్పిం దామె, ప్రేమగా.

చూసుకోగా, గరుత్మంతుడు యథాపూర్వంగా వున్నాడు. వెంటనే, వచ్చినదారినే వెళ్ళిపోయారు వారిద్దరూ. కోరుకున్న గుర్రాలు మాత్రం దొరకలే దెక్కడా. వెళ్ళగా వెళ్ళగా విశ్వామిత్రుడు తారస పడ్డా డొకచోట. "నాయనా, గాలవా, నీకు నువ్వే గురుదక్షిణ యిస్తా నన్నావు నాకు. అది చెల్లించడాని కిది మంచి సమయం. నువ్వది తెచ్చేదాకా యెదురుచూస్తూ వుంటా న్నేను. అది నెరవేరే మార్గం చూసుకో. వెళ్ళు" అని చెబుతూనే ముందుకి సాగిపోయా డామహర్షి.

ఇదంతా విన్నాడు గరుత్మంతుడు. "విశ్వామిత్రుడు చెప్పింది విన్నాను. మరి, పోదాం. గురుధనం దొరికే విధానం నేనే చూస్తాను. బెంగపెట్టుకోకు. గురువున కిస్తా నన్నది యివ్వకుండా వూరుకోడం శ్రేయస్కరంకాదు" అని గాలవుణ్ణి ఎత్తుకుని బయలుదేరా డతను.

## గాలవచరిత్ర 9

"గాలవా, భూమ్యంతరాళంలో కొన్ని రాళ్ళున్నాయి. అవి మెత్తగా నుండకొట్టి నిప్పుమీద పెడితే వొక లోహం బయటకు వస్తుంది. గాలి వల్ల అది శుద్ధి అవుతుంది. దానిపేరే బంగారం. జగత్తంతా అది పోషిస్తుంది. బతికిస్తుంది కూడా. అంచేత ధనం అన్న పేరువచ్చింది దానికి. మూడులోకాల్లోనూ శాశ్వతం అయిపోయివుంది ధనం. పూర్వాభాద్రతోనూ, ఉత్తరాభాద్రతోనూ శుక్రవారం కలిసినప్పుడు, అగ్ని, కుబేరునకూ మనుష్యులకూ ధనం యిస్తాడు. అజుడూ, ఏకపాదుడూ, అహిర్బుధ్న్యుడూ, కుబేరుడూ — ఏమరిపాటు లేకుండా కాపలా కాస్తూ వుంటారు కనక, యోగం వుంటే గాని అయినవాడికీ కానివాడికీ డబ్బు దొరకదు. డబ్బు లేకపోతే గుర్రాలు సంపాదించడమూ సాధ్యంకాదు.

కనక, నువ్విప్పుడు చెయ్యవలసింది రాజు నెవరి నైనా ఆశ్రయించడం. వొట్టి రాజవంశంలో పుట్టినవాడైతే చాలదు రాజు రాజర్షి వంశంలో పుట్టినవాడయివుండాలి. యయాతి అని వొకరాజు. నహుషుని కొడుకతను. సత్యపరాక్రమం అతనిది. రాజర్షి వంశం కావడంతో కుబేరతో డతనిది, అతనున్నూ రాజర్షే. చాలా గొప్పవైభవం అతనిది. నేను చెప్పానంటే నీకెంత కావలసినా డబ్బిచ్చేస్తా డతను. కుబేరుణ్ణికూడా "నువ్వా నేనా?" అనగల ధనవంతు డతను. ఈవిధంగా తప్ప గురుధనం మరోవిధంగా సంపాదించలేవు నువ్వు అని చెప్పాడు గరుత్మంతుడు.

ఇలా మాట్లాడుకుంటూ వెళ్ళారు వారిద్దరూ. యయాతిని కలుసుకున్నారు. యయాతి అర్ఘ్యపాద్యాదులిచ్చి వారి నాదరించి "ఏం యిలా వచ్చా" రనడిగాడు, ఆదరంగా.

"రాజా, గాలవు డితనిపేరు. బ్రాహ్మణోత్తముడు. గొప్ప తప స్శాలి విశ్వామిత్రుని శిష్యు డితను. విద్యాభ్యాసం పూర్తిచేసుకుని "నీకు గురుదక్షిణ యిస్తా నేమి తెమ్మంటా?" వనడిగా డితను. "నువ్వు చేసిన శుశ్రూషకే చాలా సంతోషించాను. వేరే గురు దక్షిణ అక్కరలేదు నాకు" అంటూ చాలా దూరం చెప్పా డా మహర్షి; కాని యితనే "కాదూ కూడ" దన్నాడు. "నేను గురు దక్షిణ యివ్వవలసిందే, నువ్వన్నా పుచ్చుకోవలసిందే" అంటూ మంకుపట్టు పట్టుకూర్చున్నా డితను. భక్తీ, ఉద్దేశమూ, చిత్తశుద్ధీ, ఉబలాటమూ తప్ప కానీ లే దితనిదగ్గిర, అది తెలుసు మహర్షికి; కాని నిర్బంధించి విసిగించడంవల్ల "ఎనిమిదివందల గుర్రాలు తీసుకురా" అన్నా డతను. "ఇలాంటి యిలాంటి లక్షణా లుండాలి వాటికి" అని కూడా చెప్పా డతను. చాలా అసాధ్య లక్షణాలు కూడానూ అవి.

గురుదక్షిణ అంటే పుచ్చుకోక తప్ప దని నిర్బధించాడు గాని, యెక్కణ్ణుంచి తెచ్చి యిస్తా డితను? ఏదుపు మొదలుపెట్టాడు చేసేది లేక. చివరికి నిన్ను శరణుచొచ్చాడు మరో దారి కనపడక. నువ్వీ కోరిక తీరిస్తివా, గురువుకి సమర్పించేసి, కృతకృత్యుడై, తరవాత తపస్సు చేసుకుంటాడు పాపం, నిశ్చింతగా యితను. తన తపస్సు కొంత నీకున్నా ధారపోస్తాడు. సహజంగా, నీకే వుంది కావలసినంత తపోధనం, నాకు తెలుసు. రాజర్షివి కాని రాజసామాన్యుడవు కావు నువ్వు. అయినా, యితను ధారపోసే తపస్సుతో పూర్ణపురుషుడవై ప్రాణిస్తావు నువ్వు. గుర్రం దానంచేస్తే, ఆగుర్రాని కెన్నిరోమా లుం టాయో అన్నిగుర్రాలూ చివరికి అన్ని ఉత్తమలోకాలూ పొందుతాడు మనిషి. దానం పట్టడాని కితనూ, దానం చెయ్యడానికి నువ్వూ కూడా గొప్పపాత్రులు. నువ్విది చేస్తే శంఖంలో పోసిన పా లవుతుంది నీదానం"

# 115

## గాలవచరిత్ర 10

గరుత్మంతుడు చెప్పిందంతా విన్నాడు యయాతి. వందలు కాదు, వేలకు వేలే యజ్ఞాలు చేసినవాడతను. మహాదాత. బాగా ఆలోచించాడు దీనిమీద అతను. "చాలా సంతోషం" అన్నాడు ముందు. "నా ప్రియసఖుడైన గరుడుణ్ణి చూడగలిగా నివాళ. బ్రాహ్మణోత్తముడైన గాలవుణ్ణి కూడా చూడగలిగా నివాళ. తపస్సు ఉండగా అతను కోరిన భిక్ష సంగతి విన్నాను. సూర్యవంశంలో పుట్టిన గొప్ప రాజు లెందరో వుండగా, నాదగ్గిరికి రావడంలో మీరిద్దరూ కనబరిచిన బుద్ధివిశేషం కూడా గమనించాను. నేటితో నాజన్మ సఫలం అయింది. నావంశమున్నూ తరించింది. నాదేశం పరమపావనం అయిపోయింది. అయితే, మిత్రుడా, గరుత్మంతుడా, వెనక నేను గొప్పధనవంతుణ్ణే, నువ్వెరిగిందే అది; కాని యిప్పుడలా కాదు. నా డబ్బంతా వ్యయం అయిపోయింది. నీ రాక సఫలం చెయ్యడానికి లేశమూ శక్తి లేదు నాకిప్పుడు. అలా అని ఈ బ్రాహ్మణోత్తముణ్ణి వట్టిచేతులతో కూడా పంపలేను నేను. నీ కోరిక పూర్తి చెయ్యగల వస్తువొకటుంది నాదగ్గిర అది యిచ్చుకుంటాను. కోరిక సఫలం కాకుండా వెళ్ళిపోతే అతిథి, దాత వంశం అంతా బుగ్గిచేసేస్తాడు మరి. ఆశపడి వచ్చినవాణ్ణి నిరాశ కల్పించి పొమ్మనడం కంటేనూ దేహీ అంటే లేదు అనే వాడి మాట కంటేనూ పాపిష్ఠం అయినది మరేమీ లేదు, ఎక్కడా. కాక హతాశుడయిపోయినవాడూ, కోరిక తీరనివాడూ చచ్చినవాడికిందే లెక్క.

గరుడా, కనక, ఇదిగో నాకూతురు. ఈమెని చూడు. ఈమె నాలుగువంశాలకు స్థాపకురాలవుతుంది. దేవకన్యలను మించిన సుందరి యీమె. సకలధర్మాలకూ వృద్ధి కలిగిస్తుందీమె. గాలవా! ఈమె

రూపానికి ముగ్ధులై దేవతల్లోనూ, మనుష్యుల్లోనూ, అసురుల్లోనూ మొదరో వచ్చి ఈమెని కోరి వెళ్ళారు. ఈమెని చూస్తే చాలు, ఎంతెంత రాజు లయినా, ఎంతెంత లేసి శుల్కం అయినా ఇవ్వడాన్కి సిద్ధపడతారు, ఇది నేను చాలా ధైర్యంగా చెప్పగలను, చెవిమీద నల్లమచ్చ గల యెనిమిదివందల తెల్లగుర్రాలివ్వడం వొక లెక్క-టయ్యా? ఈమె పేరు మాధవి. నువ్వీమెను తీసుకువెళ్ళు. నాకు పౌత్రలాభం కూడా కలుగుతుంది. దీనివల్ల నాకిది వరప్రసాదం అవుతుంది" అని చెప్పా డతను.

ఇది విని గాలవుడు ఆమాధవిని స్వీకరించి "మరి, వెళ్ళివస్తాం" అని యయాతికి చెప్పి గరుడునితో బయలుదేరాడు. "ఈమె మూలంగా నువ్వు కోరిన గుర్రాలు దొరుకుతాయి నీకు" అని గాలవుడికి చెప్పి గరుత్మంతుడు తన యింటికి వెళ్ళిపోయాడు, కొంతదూరం కలిసివెళ్ళి.

మాధవిని వెంటబెట్టుకుని గాలవు డొక్కడే బయలుదేరాడు చివరికి. "అయితే, యీమెని పరిగ్రహించి నేను కోరే గుర్రాల రూపంగా శుల్కం యివ్వగల రాజెవరు? అని దీర్ఘంగా ఆలోచించా డతను. తటాలున హర్యశ్వుని పేరు స్ఫురించిం దతనికి. అయోధ్య యేలుతున్నా డప్పుడు హర్యశ్వుడు. ఇక్ష్వాకువంశీయు డతను. చాలా బలవంతుడు. అపార మైన చతురంగబలం వుందతనికి. రాజు లందరిలోనూ బహూ ఉత్తము డతను. అతని బొక్కసం నిండుగా వుంటుం దెప్పుడూ. అంతటి ధనధాన్యసమృద్ధిగలవాడు భూమండలంలో మరొకడు లేడు. అతనంటే జనుల కెంతో ప్రీతి. బ్రాహ్మలంటే అతనికన్న యెంతో ప్రీతి. ప్రజల హితమే కోరి మిక్కిలీ శాంతంగా పరిపాలన చేస్తున్న రాజతను. తపోనిష్ఠలో కూడా వున్నా డతను.

అతని దగ్గరికి వెళ్ళాడు గాలవుడు. "రాజా, ఈకన్య సంతానవతి అయి వంశం వృద్ధిచేస్తుంది. నాకు కావలసిన శుల్కం యిచ్చి యీ

మెని భార్యగా స్వీకరించు. ఆ శుల్కం యేమి టంటావా? చెబుతా విని, బాగా ఆలోచించుకునే స్వీకరించు" అని చెప్పా డతనికి.

# 116

## గాలవ చరిత్ర II

హర్యశ్వుడు బాగా ఆలోచించాడు. పెద్ద వేడినిట్టూర్పున్నూ విడిచాడు. సంతానకాంక్షతో వేగిపోతున్నాడు మరి. "గాలవా" అని పిలిచాడు, ఎంతో ఆదరంతో. "స్త్రీకి ఆరుస్థానా లెత్తుగా వుండాలి. ఈమె కలాగే వున్నాయి. ఏడు స్థానాలు సూక్ష్మంగా వుండాలి. ఈమె కలాగే వున్నాయి. మూడు గంభీరంగా వుండాలి. ఎర్రగా వుండా లయిదు. ఈమె కలాగే వున్నాయి. దేవకుమారులూ అసుర కుమారులూ కూడా యెందరెందరో కోరతగ్గ అందకత్తె యీమె. సర్వలక్షణసంపన్నురాలు. చాలామంది కుమాళ్లను కంటుంది. చక్రవర్తినే కంటుంది, సందేహంలేదు. అయితే, శుల్కం యెంత కావాలి నీకు? నాస్థితిగతులు పరిశీలించి అడగవయ్యా" అన్నాడు చివరికి.

దీనిమీద గుర్రాలసంగతి చెప్పాడు గాలవుడు. "నువ్వా గుర్రాలిచ్చినట్లయితే యీమెను పరిగ్రహించవచ్చు" నన్నాడు. "అరణీయందగ్నులు పుట్టేటట్టు, యీమెయందు నీకు బహువచనంమీదే పుడతారు కుమాళ్లు" అనిన్నీ చెప్పాడు.

"నీక్కావలసిన గుర్రాలు నాదగ్గిర రెండువందలే వున్నాయి మరి" అన్నాడు హర్యశ్వుడు. మాధవిని విడిచిపెట్టవలసి వస్తుందేమో అని చాలా ఆరాటంగా వుం డతనికి. చూసీచూడ్డంతోనే ఆమెయెడల మోహపాశబద్ధు డయిపోయా డతను. "బ్రాహ్మణోత్తమా, అన్నీ అలాంటివే కావాలంటే మాత్రం నావల్లకాదు; గానీ నీకిష్ట మయితే

తక్కిన ఆరువందలకూ బదులుగా ఆరువేలు — ఆరులక్షలు కావాలన్నా యిస్తాను జాతిగుర్రాలు. ఇంతే కాదు. మహామునీ నేనొక్క కొడుకునే కంటాను. దయచేసి నాకీవరం అనుగ్రహించు" అంటూ దీనంగా ప్రార్థించా డతను, దోసిలొగ్గి.

"ఒప్పుకో నన్నితని కిచ్చెయ్యి" అంది, మాధవి. "గాలవా, బ్రహ్మవాది అయిన మహాత్ము డొకడు నాకోవరం యిచ్చాడు. 'ప్రసవం చేసుకున్న వెంటనే ప్రతీసారీ కూడా — పెళ్ళికాని కన్యనే అయిపోతూవుంటా' వని ఆవరం సారం, యితనిస్తా నన్న రెండువందల గుర్రాలూ పుచ్చుకుని నన్నితని కియ్యి. ఇలాగే నన్ను ముగ్గురు రాజుల కిచ్చి తక్కిన ఆరువందల గుర్రాలూ సంపాదించుకో. నాకు నలుగురు కొడుకులే పుడతారు. [illegible] తీరుతుంది. నా ప్రజ్ఞ ఇలాంటిది. ఇక నువ్వాలోచించుకో" అంది.

"రాజా" అని పిలిచాడు గాలవుడు హర్యశ్వుణ్ణి. "మాధవి మాటలు విన్నావా? నీ కేదయినా నచ్చిందా ఆమె సంగతి? నాక్కావలసిన శుల్కంలో నాలుగోవంతే యివ్వగలనన్నావు నువ్వు. అయితే వొక్క కొడుకునే కని, తరవాత, యీమెని నాకిచ్చెయ్యి" అని చెప్పా డతను.

ఎందుకైనా అంగీకరించే స్థితిలో వున్నాడు హర్యశ్వుడు. "సరే" అని మాధవిని పరిగ్రహించాడు పొంగిపోతూ. యుక్తసమయాన కొడుకు పుట్టా డతనికి. వసువులకంటే గొప్పవా డయిపోతా డన్న లక్షణా లున్నాయి ఆ బాలుని దగ్గిర. అందుచేత, "వసుమనుడు" అని పేరుపెట్టుకున్నా డతనికి హర్యశ్వుడు.

ఆదిలో, మాధవిని అతనికిస్తూ "ప్రస్తుతం యీ రెండువందల గుర్రాలూ నీదగ్గిరే వుంచు. నీకు కొడుకు పుట్టాక వస్తా" నని చెప్పి వున్నాడు గాలవుడు. వెంటనే అతని దగ్గిరికి వెళ్ళాడు గాలవు డంచేత.

“రాజా, బాలసూర్యునివంటి కొడుకుపుట్టాడు నీకు. నాశుల్కం పూర్తికి నేను మరో రాజుదగ్గిరికి వెళ్లాలి మరి. కనక, మాధవిని నాతో పంపిం చెయ్యి” అనడిగా డతను.

హర్యశ్వుడు తనమాటమీదే వున్నాడు. తన పౌరుషానికి మచ్చ రానడం అతని కిష్టంలేదు. కాక – గాలవుడు కోరిన గుర్రా లిద్దా మంటే సాధ్యంకాని పని. మాధవి నిచ్చాశా డతను. ఇటుచూడగా పదహారేళ్ల బాలాకుమారి అయిపోయివుంది మాధవి. హర్యశ్వుని సంపద తృణప్రాయంగా కూడా భావించిందామె. వెంటనే గాలవు నితో బయలుదేరింది. “నాశుల్కం పూర్తికాలేదు. కనక, ఈగుర్రా లిప్పటికి నీదగ్గిరే వుంచు” అని హర్యశ్వునకు చెప్పి, గాలవుడు, ఆమెను వెంటబెట్టుకుని బయలుదేరాడు.

# 117

## గాలవచరిత్ర 12

“దివోదాసు డని కాశీరాజు. మహావీరు డతను. భీమసేనుని కుమా రుడు. మాధవీ, అతనిదగ్గిరికి వెడదాం, మెల్లిగా రా. మంచి ధార్మికు డతను. ఇంద్రియనిగ్రహం కలవాడు. సత్యనిరతుడు. నీకేమీ భయం లేదు. బెంగపెట్టుకోకు” అంటూ ప్రయాణం సాగించాడు గాలవుడు. కాశీచేరుకున్నాడు.

దివోదాసుడు గాలవు ణ్ణెంతో గౌరవించాడు. సంతానం విష యమై గాలవుడు చెప్పినమాట నచ్చిం దతనికి. “గాలవా, ఈసంగతి నాకిదివరకే తెలుసు, వివరించి చెప్పనక్కరలేదు నాకు. అప్పుడే నే నీమెని పరిగ్రహిద్దా మనుకున్నాను. ఎందరో రాజు లుండగా వారి నందరినీ కాదని ఇప్పటికైనా ఈమెని నాదగ్గిరికి తీసుకువచ్చావు.

తక్కిన ఆరువందలకూ బదులుగా ఆరువేలు — ఆరులక్షలు కావాలన్నా యిస్తాను జాతిగుర్రాలు. ఇంతే కాదు. ఈమె వల్ల నేనొక్క కొడుకునే కంటాను. దయచేసి నాపరం అనుగ్రహించు" అంటూ దీనంగా ప్రార్థించాడతను, దోసిలియొగ్గి.

"ఒప్పుకో నన్నితని కిచ్చెయ్యి" అంది, మాధవి. "గాలవా, బ్రహ్మవాది అయిన మహాత్ముడొకడు నాకో వరం యిచ్చాడు. "పురుడు పోసుకున్న వెంటనే ప్రతిసారీ కూడా — పెళ్ళికాని కన్యనే అయిపోతూ వుంటావు" అని ఆ వరం కనక, యితనికి నన్ను రెండువందల గుర్రాలూ పుచ్చుకుని నన్నితని కియ్యి. ఇలాగే నన్ను ముగ్గురు రాజుల కిచ్చి తక్కిన ఆరువందల గుర్రాలూ సంపాదించుకో. నాకు నలుగురు కొడుకులే పుడతారు. నీ కోరిక తీరుతుంది. నా ప్రజ్ఞ ఇలాంటిది. ఇక నువ్వాలోచించుకో" అంది.

"రాజా" అని పిలిచాడు గాలవుడు హర్యశ్వుణ్ణి. "మాధవి మాటలు విన్నావా? నీకేమయినా నచ్చిందా ఆమె సలహా? నాక్కావలసిన శుల్కంలో నాలుగోవంతే యివ్వగలనన్నావు నువ్వు. అయితే వొక్క కొడుకునే కని, తరవాత, యీమెని నాకిచ్చెయ్యి" అని చెప్పాడతను.

ఎందుకైనా అంగీకరించే స్థితిలో వున్నాడు హర్యశ్వుడు. "సరే" అని మాధవిని పరిగ్రహించాడు పొంగిపోతూ. యుక్తసమయాన కొడుకు పుట్టాడతనికి. వసువులకంటే గొప్పవాడయిపోతా డన్న లక్షణా లున్నాయి ఆబాలుని దగ్గిర. అంచేత, "వసుమనుడు" అని పేరుపెట్టుకున్నా డతనికి హర్యశ్వుడు.

ఆదిలో, మాధవిని అతనికిస్తూ "ప్రస్తుతం యీ రెండువందల గుర్రాలూ నీదగ్గిరే వుంచు. నీకు కొడుకు పుట్టాక వస్తా" నని చెప్పి వున్నాడు గాలవుడు. వెంటనే అతిని దగ్గిరికి వెళ్ళాడు గాలవుడంచేత.

"రాజా, బాలసూర్యునివంటి కొడుకుపుట్టాడు నీకు. నాశుల్కం పూర్తికి నేను మరో రాజుదగ్గిరికి వెళ్లాలి మరి. కనక, మాధవిని నాతో పంపించెయ్యి" అనడిగా డతను.

హర్యశ్వుడు తనమాటమీదే వున్నాడు. తన పౌరుషానికి మచ్చ రావడం అతని కిష్టంలేదు. కాక – గాలవుడు కోరిన గుర్రా లివ్వడం అంటే సాధ్యంకాని పని. మాధవి నిచ్చాశా డతను. ఇటుచూడగా పదహారేళ్ల బాలాకుమారి అయిపోయివుంది మాధవి. హర్యశ్వుని సంపద తృణప్రాయంగా కూడా భావించిందామె. వెంటనే గాలవునితో బయలుదేరింది. "నాశుల్కం పూర్తికాలేదు. కనక, ఈగుర్రాలిప్పటికి నీదగ్గిరే వుంచు" అని హర్యశ్వునకు చెప్పి, గాలవుడు, ఆమెను వెంటబెట్టుకుని బయలుదేరాడు.

# 117

## గాలవచరిత్ర 12

"దివోదాసు డని కాశీరాజు. మహావీరు డతను. భీమసేనుని కుమారుడు. మాధవీ, అతనిదగ్గిరికి వెడదాం, మెల్లిగా రా. మంచి ధార్మికు డతను. ఇంద్రియనిగ్రహం కలవాడు. సత్యనిరతుడు. నీకేమీ భయం లేదు. బెంగపెట్టుకోకు" అంటూ ప్రయాణం సాగించాడు గాలవుడు. కాశీచేరుకున్నాడు.

దివోదాసుడు గాలవు ణ్ణెంతో గౌరవించాడు. సంతానం విషయమై గాలవుడు చెప్పినమాట నచ్చిం దతనికి. "గాలవా, ఈసంగతి నాకిదివరకే తెలుసు, వివరించి చెప్పనక్కరలేదు నాకు. అప్పుడే నేనీమెని పరిగ్రహిద్దా మనుకున్నాను. ఎందరో రాజు లుండగా వారి నందరినీ కాదని ఇప్పటికైనా ఈమెని నాదగ్గిరికి తీసుకువచ్చావు.

చాలా సంతోషం. ఇది నాఅదృష్టం. కనక, ఇక జరగవలసిం దంతా సవ్యంగానే జరుగుతుంది తప్పకుండా. అయితే గుర్రాల ప్రస్తావన వస్తే, నాశక్తికూడా హర్యశ్వుని శక్తివంటిదే – నాదగ్గిరా రెండు వందలే వున్నాయి నువ్వు కోరిన గుర్రాలు. కనక, నేను కూడా వొక్క కొడుకునే కని యీామెని నీతో పంపించేస్తాను.'' అని చెప్పి మాధవిని స్వీకరించా డతను, యథావిధిగా.

తరవాత, అతను ఆమెతో కూడి సకలసుఖాలూ అనుభవించి, ప్రభావతియందు సూర్యునిలాగా, స్వాహాదేవియందు అగ్నిలాగా, శచీదేవియందు ఇంద్రుని లాగా, రోహిణియందు చంద్రుని లాగా, ధూమోర్ణయందు యమునిలాగా, గౌరియందు వరుణునిలాగా, ఋద్ధియందు కుబేరునిలాగా, లక్ష్మీదేవియందు శ్రీమన్నారాయణునిలాగా, గంగానదియందు సముద్రునిలాగా, పార్వతీదేవియందు మహేశ్వరునిలాగా, వేదియందు బ్రహ్మదేవునిలాగా, అదృశ్యంతియందు వసిష్ఠుని కొడుకు శక్తిలాగా, అక్షమాల అని ప్రఖ్యాతివహించిన అరుంధతియందు వసిష్ఠమహర్షిలాగా, సుకన్యయందు చ్యవనమహర్షిలాగా, సంధ్యాదేవియందు పులస్త్యునిలాగా, వైదర్భియం దగస్త్యునిలాగా, సావిత్రిదేవియందు సత్యవంతునిలాగా, పులోమయందు భృగుమహర్షిలాగా, అదితియందు కశ్యపునిలాగా, రేణుకయందు ఋచీకునిలాగా, హైమవతియదుం విశ్వామిత్రునిలాగా, తారాదేవియందు బృహస్పతిగాలా, శతపర్వయందు శుక్రునిలాగా, భూదేవియందు భూపతిలాగా, ఊర్వశియందు పురూరవునిలాగా, సత్యవతియందు ఋచకునిలాగా, సరస్వతియందు మనువులాగా, శకుంతలయందు దుష్యంతునిలాగా, ధృతియందు ధర్మునిలాగా, దమయంతీదేవియందు నలునిలాగా, సత్యవతియందు నారదునిలాగా, జరత్కారువునందు జరత్కారునిలాగా, ప్రతీచియందు పులస్తునిలాగా, మేనకయందు ఊర్ణాయువులాగా, రంభయందు తుంబు

రునిలాగా, శతశీర్ష యందు వాసకిలాగా, కుమారియందు ధనంజయుని లాగా, వైదేహియందు శ్రీరామునిలాగా, రుక్మిణీదేవియందు శ్రీకృష్ణునిలాగా, మాధవియందు ప్రతర్దను డన్న కుమారుణ్ణి కన్నాడు.

ఇది తెలిసి గాలవుడు చక్కా-వచ్చాడు. "మాధవిని నాతో పంపిం చెయ్యి. గుర్రాలు నీదగ్గిరే వుండనియ్యి. నాశుల్కం పూర్తిచేసుకోడానికి నేను మరోచోటికి వెళ్లాలిమరి." అని చెప్పా డతను. దివోదాసుడు ధర్మపరాయణుడూ, సత్యనిరతుడూను. కనక, అనుకున్న ప్రకారం మాధవిని గాలవునితో పంపించేశాడు.

# 118

## గాలవచరిత్ర 13

యథాప్రకారం పదహారేళ్ల బాలాకుమారి అయి గాలవునితో బయలు దేరింది మాధవి. గాలవుడు తన శుల్కం సంగతి బాగా ఆలోచించు కున్నాడు. రాజుల సంగతీ బాగా విమర్శించుకున్నాడు. భోజనగరం వెళ్లీ ఉశీనరమహారాజుని కలుసుకున్నాడు, వెంటనే.

"రాజా, నీవల్ల ఈమాధవి ఇద్దరు పుత్రులను కంటుంది. ఈమెని స్వీకరించి సూర్యచంద్రులవంటి కొడుకులను కని, ఇహానా పరానా సకలసుఖాలూ అనుభవించు. ఇందుకోసం నాలుగువందల వెల్లగుర్రాలు శుల్కం యివ్వాలి నాకు. ఒక చెవిమీద నల్లనిమచ్చవుండాలి వాటి కన్నిటికీ. ఇదంతా గురుదక్షిణకోసం, తెలుసా? లేకపోతే గుర్రాలతో నాకేమిపనీ? నీకిది సాధ్యం అయితే, ఆలోచనా పాలోచనా లేకుండా ఈమెని స్వీకరించు. నీ కిప్పటివరకూ సంతానంలేదు నాకు తెలుసు. ఈమెని పరిగ్రహించి ఇద్దరు కొడుకులను కనుక్కో. పరలోకాలకు వెళ్లాలంటే, నీకూ నీపితృదేవతలకూ కూడా నావ అవుతాడు నీకొడుకు. కొడుకులతో సుఖపడేవాడు స్వర్గభ్రష్టుడు కా డెప్పుడూ. నరకానికి

వెళ్లనే వెళ్లడు. కొడుకు కన్లేనివాళ్లు నరకానికి పోతారు" అంటూ చాలాదూరం చెప్పాడు గాలవుడు.

"బ్రాహ్మణోత్తమా, నువ్వు చెప్పిందంతా విన్నాను, బోధ పడింది" అన్నాడు, ఉశీనరమహారాజు. దైవయోగం తప్పించుకోడం యెవరికీ శక్యం కాదయ్యా! నామనస్సీమెయందు బాగా లగ్నం అయిపో యింది, నిజమే; కాని నాదగ్గిర నువ్వు కోరే గుర్రాలు రెండువం దలే వున్నాయి. ఇక తక్కిన రకాలంటావా, వందలూ వేలూ కాదు, లక్ష లున్నాయి. చాలాచాలా గొప్పవి అవిన్నీ. కనక, నేనున్నూ ఈమెయందొక్క కొడుకునే కంటాను. దాంతో నాకూ నాపూర్వు లకూ కూడా సుగతి యేర్పడుతుంది. నేను నీకివ్వగల మూల్యాని కంతకంటే యెక్కువ ఆశించకూడదు మరి. పోనీ, డబ్బిస్తానూ అంటే, పౌరులదీ జానపదులదీ గాని నాది కాదది. నాలాంటివాళ్లు అనుభవాల కది వెచ్చించకూడదు. దమ్మిడీ అయినా, తన కోరికలు తీర్చుకోడాని కితరుల డబ్బు వాడుకునే రాజు అధర్ముడు అవుతాడు. అప కీర్తిన్నీ పొందుతాడు చాలా. ఇది నీకిష్టమయితే మాధవిని నాకిచ్చి వెళ్లు, ఒక్క కొడుకునే కంటా న్నేను. ఈమాటకు తిరుగులేదు" అంటూ చాలా దృఢంగా చెప్పాడు రాజు. అందు కంగీకరించి మాధవి నక్కడ వుంచి గాలవుడు అడవులకు వెళ్లిపోయాడు.

బాగా పుణ్యం చేసుకున్నవాడు సకలభోగభాగ్యాలూ అనుభ వించేటట్టు మాధవితో సకలసుఖాలూ అనుభవించా డుశీనరుడు. పర్వత కందరాలూ, నదులూ, చిత్రవిచిత్రాలైన ఉద్యానవనాలూ, తోటలూ దొడ్లూ, మిద్దెలూ మేడలూ — ఇవన్నీ ఉపయోగించుకుని మాధవితో క్రీడించా డతను, మహోల్లాసంతో. యుక్తసమయాన బాలసూర్యునివంటి కొడుకు పుట్టా డతనికి. శిబి అని పేరుపెట్టుకు న్నాడురాజు, తనకొడుక్కి.

గాలవుడు వచ్చాడు పిలిచినట్టు, మాధవి కన్య అయిపోయివుంది అప్పటికే. గాలవు డామెని వెంటబెట్టుకుని బయలుదేరాడు. దారిలో గరుత్మంతుడు తారసపడ్డా డతనికి.

# 119

## గాలవచరిత్ర 14

"కృతార్థుడవై చాలా సంతోషంగా వున్నావు నువ్వు. నిన్నిస్థితిలో చూడగలిగా న్నేను, నా అదృష్టంవల్ల" అంటూ బుజం తట్టాడు గరుత్మంతుడు గాలవుణ్ణి. "లేదయ్యా బాబూ, ఇంకా నాలుగోవంతు తరవాయే వుంది నాకు" అన్నాడు గాలవుడు మొగం వేలవేసుకుని. "అయితే వొకపనిచెయ్యి" అన్నాడు గరుత్మంతుడు. "ఏమిటంటావా? నువ్వెంతప్రయత్నంచేసినా యిక లాభంలేదు. వెనకటికి, కాన్యకుబ్జరాజు గాధికి, సత్యవతి అని వొక కూతురు. ఋచీకు డనే మునికుమారుడు వచ్చి "నీకూతుర్ని నాకిచ్చి వివాహం చెయ్యి" అనడిగాడు. "అభ్యంతరం యేమీ?" అని యెదురడిగాడు రాజు. అడిగి, నిన్నిప్పుడు విశ్వామిత్రుడు తెమ్మన్నాడు చూడూ, "అలాంటివే వెయ్యి గుర్రాలు నాకు తెచ్చి యిస్తే నాకూతు ర్నిస్తా న్నీకు" అని వివరంగా నున్నా చెప్పాడతను.

ఋచీకుడు తిన్నగా వెళ్ళి వరుణు ణ్ణాశ్రయించాడు. అశ్వతీర్థంనుంచి తెప్పించి ఆవెయ్యిగుర్రాలూ ముని కిచ్చాడు వరుణుడు. ఋచీకు డాగుర్రాలు గాధికిచ్చి సత్యవతిని తీసుకుని వెళ్ళిపోయాడు, లక్షణంగా పెళ్లిచేసుకుని. గాధి పౌండరీకం అనే యజ్ఞంచేసి, ఆగుర్రా లన్నీ ఋత్విక్కుల కిచ్చేశాడు యజ్ఞదక్షిణగా. వారా గుర్రాలు తోలుకు

వెడుతూవుండగా వితస్తానదిలో కొట్టుకుపోయి నాలుగువందలు చచ్చి పోయాయి వాటిలో.

మిగిలినవి రెండేసివందల చొప్పున హార్యశ్వుడూ, దివోదాసూ, ఉశీనరుడూ కొనుక్కున్నారు. అవే ఇప్పుడు నీచేతిలో వున్న ఆరువందలున్నూ. ఈకారణంవల్ల తక్కిన రెండువందల గుర్రాలూ సంపాదించలేవు నువ్వు. నీకే కా దెవరికీ సాధ్యం కాదావని. కనక, ఆరువందల గుర్రాలతోపాటు మాధవిని విశ్వామిత్రుని కిచ్చెయ్యి నువ్వు. ఈవిధంగా తప్ప కృతకృత్యుడవు కావడానికి నీకు మరోమార్గం లేదు ” అని వివరించి చెప్పాడు గరుత్మంతుడు.

గరుడుడు చెప్పినట్టే చేశాడు గాలవుడు. “ గురువర్యా, ఇవిగో నువ్వు తెమ్మన్న రకం గుర్రా లారువందలు. తక్కిన రెండువందలూ నేనుసంపాదించలేను. ప్రపంచంలో యెక్కడా లేవు మరి అవి. నేనే కా దెవరూ సంపాదించలేరు. కనక, తక్కిన రెండువందల గుర్రాలకూ బదులుగా ఈకన్యను పుచ్చుకో. నన్ను ఋణవిముక్తుణ్ణి చెయ్యి. ముగ్గురు రాజర్షు లీమెయందు ముగ్గురు కొడుకులను కన్నారు. ఇంకొక్కణ్ణే కంటుం దీమె. ఆవొక్కణ్ణీ నువ్వు కను. ఈవిధంగా అయితే, నీయెనిమిదివందల గుర్రాలూ నీకు ముట్టిన ట్టవుతుంది. నేనున్నూ నిశ్చింతగా బతుకుతాను. పోయి తపస్సున్నూ చేసుకుంటాను ” అని విన్నవించుకున్నాడు గురువు కతను.

“ మహాబాగుంది ” అన్నాడు విశ్వామిత్రుడు. “ అయితే, ముందే నాదగ్గిర కెందుకు తీసుకువచ్చావు కాదూ ఈమెని ? వంశకర్తలైన ఆనలుగురు కొడుకులనూ నేనే కనివుందునుగదా ? ” అనిన్నీ అడిగాడతను. “ అయితే అయిందిలే. ఆవొక్క కొడుకుకోసమే పరిగ్రహిస్తా నీమె న్నేను. ఈగుర్రాలు నాఆశ్రమంలో తిరుగుతూ వుంటాయి, స్వేచ్ఛగా ” అని సిద్ధపడ్డా డందు కతను.

విశ్వామిత్రునిదగ్గిర వుండి నాలుగో కొడుకుని కూడా కన్నది మాధవి. అష్టకు డని పేరుపెట్టి, ఆగుర్రాలిచ్చి, ధర్మార్థాలున్నూ బోధించి, సమకూర్చి, రాజుని చేశాడు విశ్వామిత్రుడు తన కొడుకుని. సోమపురం అన్నట్టున్న గొప్పపట్నంలో వుండి జనులను చాలా చక్కగా పాలించా డారాజు. మాధవిని గాలవునితో పంపేసి, విశ్వామిత్రుడు తపస్సు చేసుకోడాని కడవులకు వెళ్లిపోయాడు.

గాలవుడు గరుత్మంతునితో బయలుదేరి "కన్యామణీ, నీకొక దానపతీ, వొక శూరుడూ, వొక సత్యధర్మపరాయణుడూ, వొక యజ్వా పుట్టారు. దీంతో నీతండ్రి యయాతి మహారాజు పూర్తిగా తరించాడు. ఆనలుగురు రాజులూ నేనూ కూడా ధన్యులం అయినాము" అని చెప్పాడు మాధవికి. గరుత్మంతుణ్ణి సెలవిచ్చి పంపేసి, మాధవిని యయాతి కప్పగించి, గాలవుడున్నూ తపస్సుచేసుకోడాని కడవులకు వెళ్లిపోయాడు తరవాత.

# 120

## గాలవచరిత్ర 15

యయాతిమహారాజు, మాధవికి, స్వయంవరమహోత్సవం జరిగించడానికి పూనుకున్నాడు. గంగాయమునానదులు సంగమించేచోట యేర్పాట్లన్నీ చేయించాడు. యుక్తసమయాన చేతికి పూలదండ అందించి, సోదరులు పూరుడూ యదువూ, అక్కడికి తీసుకువచ్చా రామెని రథం మెక్కించి.

నాగులూ, యక్షులూ, గంధర్వులూ, మనుష్యులూ, మృగాలూ, పక్షులూ, గిరిజనులూ, అటవికులూ — అనేకులు వచ్చా రక్కడి కామెని పెళ్లాడానికి యువకులు. రాజులూ మహర్షులూ కూడా చాలా

మంది వచ్చి ఆప్రదేశం అంతా నిండిపోయారు. ముహూర్తం దగ్గర పడింది. సభలోకి తీసుకువచ్చారు మాధవిని. ఒక్కొక్క యువకుణ్ణే వివరించి పరిచయం చేశారు మాధవికి పరిచారికలు; కాని వాళ్లలో వొక్కణ్ణీ వరించలేదామె. అడవిని మాత్రమే వరించింది తపస్సు చేసుకోడానికి. తల్లీ, తండ్రీ, సోదరులూ, చుట్టాలూ — అందరి దగ్గిరా సెలవుపుచ్చుకుని వెళ్లిపోయిందామె, అందరూ చూస్తూవుండగా.

ఉపవాసాలు ప్రారంభించిందామె. దృఢదీక్షపట్టింది. ఎన్నో నియమాలు పెట్టుకుంది. రాగద్వేషాలు విడిచిపెట్టి, మృగరూపం ధరించి, మృగాలతో కలిసిమెలిసి తిరగసాగింది. ఆహారం జలమూ కూడా విడిచిపెట్టి, వైడూర్యాల్లాగా, పచ్చల్లాగా మెరిసేగడ్డి తినసాగింది. మృగాలతోపాటు తియ్యని నదీజలాలే పుచ్చుకోసాగింది. పులీ, సింహమూ, ఎనుబోతులూ, అడవిపందులూ మొదలైన క్రూరజంతువు లేనిచోటా, దావాగ్ని లేని చోటా అడవిలో వుండిపోయింది, ప్రపంచం మరిచి.

అక్కడ యయాతి, తన పూర్వీకు లయిన రాజర్షుల్లాగే యెన్నో వేల సంవత్సరాలు ధర్మంతప్పకుండా ప్రజలను పాలించి చనిపోయాడు. తన కొడుకు లయిన పూరుడూ యదువూ రెండు రాజవంశాలకు కర్తలై భూలోకవిషయాలు చూసుకుంటూ వుండగా, యయాతి స్వర్గంలో దివ్యసుఖాలనుభవించసాగాడు.

మహర్షుల కేవిధంగానూ తీసిపోడతను. చిరకాలంగా స్వర్గంలో విహరిస్తున్నాడతను యథేచ్ఛగా. ఒకనాడొక పెద్దసమావేశం జరిగింది యింద్రసభలో. దైవవశాన, ఆసభలో, మనుష్యులనూ, దేవతలనూ, మహర్షులనూ కూడా తీవ్రంగా అవమానించాడతను. ఇంద్రు డందుకు చాలా కోప్పడ్డాడు. రాజర్షులూ, మహర్షులూ, "ధిక్, ధిక్" అంటూ చాలా యేవగించుకున్నారతణ్ణి.

"ఇతని వంశం యేమిటి? ఏరాజు కొడుకు? స్వర్గాని కెలా వచ్చాడు? ఏంపనిచేసి సిద్ధిపొందా డితను, చివరికి? తప స్సెక్కడ చేశాడు? ఇక్కడ యెవరు చెబుతా రీసంగతులు? ఇక్కడివారిలో వొక్క డయినా యెరుగునో యెరగడో యితణ్ణి?" అంటూ స్వర్గంలో విచారణ ప్రారంభం అయింది. ఎవరికి వారే యెరుగై నవారి నల్లా యితనిమాటే అడగసాగారు. వైమానికులను అడిగారు. ద్వారపాల కులనూ, చివరికి, ఇంద్రసభలో ఆసనా లేర్పాటుచేసే వారినీ కూడా అడి గారు; కాని యెవరి నడిగినా "మేం యెరగం బాబూ" అని మాత్రమే చెప్పా రందరూ. ఇది యిలావుండగా, చేసినపని గర్హించతగ్గది కావ డంవల్ల, యయాతి తనకి తానే తేజోహీను డయిపోసాగాడు.

# 121

ఉన్న ట్టుండగా యయాతికి వొణుకుపట్టుకుంది. ఆసనంమీద కూచున్న వాడు కూచున్నట్టుగానే కిందపడిపోయా డతను. అంకాపొంకాలమీాద ఏడుపువచ్చింది. మెడలో వున్న పూలదండలు, యెవరికీ యెప్పుడూ లేంది వాడివ త్తలయిపోయివున్నాయి. విజ్ఞానం అంతా నశించి తలలో కటికచీకట్లు కమ్ముకున్న ట్టయింది. కిరీటమూ, అంగదాలూ జారి పడిపోయాయి. శరీరం అంతా సూదులతో పొడుస్తున్న ట్టనిపించింది. ఆభరణాలూ కట్టుబట్టలూ కూడా దిగజారిపోయాయి. అతని కెవరూ కనపడ్డంలేదు. అతనున్నూ ఎవరికీ కనపడ్డంలేదు. ఈస్థితిలో స్వర్గంనించి భూమ్మీాద పడిపోసాగా డతను.

"ధర్మం తప్పిన పనేమీా చెయ్యలేదు నేను. చెయ్యా లన్న ఆలో చన కూడా పెట్టుకోలేదు. మరి నాకీ పతనం యెందుకు వచ్చిందీ?" అంటూ పరిపరివిధాల ఆత్రపడిపోసాగా డతను. అక్కడ వున్న రాజులూ, సిద్ధులూ, అప్సరసలూ నిరాలంబంగా అతను పడిపోవటం చూశారు.

ఇంతలో ఒక పురుషుడు వచ్చాడక్కడికి. పుణ్యం అంతా చెల్లి పోయినవాళ్ళని స్వర్గంనించి గెంటివేసే ఉద్యోగం అతనిది. "రాజా, ఇంద్రుని సెలవయిపోయింది. నువ్వు చాలా మదించిపోయివున్నావు. దురభిమానంతో కళ్ళు మూసుకుపోయాయి నీకు. ఎవరినీ లెక్కచెయ్యడం లేదు నువ్వు. ఈ దురభిమానం ఇక్కడ ఎవరూ సహించరు. స్వర్గంలో వుండటానికి నీకర్హత లేశమూ లేదు." అంటూనే కిందికి తోసేసి వెళ్ళిపోయాడతను. అలా పడిపోతూనే "నేను సత్పురుషుల మధ్యగా పడిపోతే బాగుండును" అనుకున్నాడు యయాతి మనసు మాట్లు. "ఇక ముందేమి గతి?" అనుకుంటూనూ వున్నాడు, పడిపోతూనూ వున్నాడతను.

సరిగా, ఆ సమయానికి నలుగురు రాజర్షులు ఒకచోట కూచుని వున్నారు నైమిశారణ్యంలో. వారికి మధ్యగా పడ్డాడతను. వసుమనుడు, ప్రతర్దనుడు, శిబి, అష్టకుడు అని ఆ రాజర్షుల పేర్లు. వాజపేయ యాగం చేస్తూ ఇంద్రుణ్ణి తృప్తుణ్ణి చేస్తున్నారప్పుడు వాళ్ళు. వారి యజ్ఞానికి సంబంధించిన పొగ స్వర్గద్వారందాకా పాకివుంది.

అది ఆఘ్రాణిస్తూ పడిపోయాడు యయాతి. భూమికీ స్వర్గానికీ సంబంధం కలుపుతున్న గంగానదిలా వుందా ధూమం. దాని వెంబడే పడి పోయాడతను.

అవభృథస్నానం చేసి పరమపవిత్రులయివున్నారా రాజర్షులు. లోకపాలకులన్నట్టున్నారు. ఆ నలుగురూ మాంధాత కొడుకులూ, అతని దౌహిత్రులూను. "ఎవరివయ్యా నువ్వు?" అనడిగారు వారతణ్ణి. "నీకిక్కడ చుట్టాలెవరు? ఏ దేశం నీది? ఏ నగరంలో నీనివాసం? నువ్వు యక్షుడవో, దేవకుమారుడవో, గంధర్వుడవో, రాక్షసుడవో కాని మనిషివయినట్టు లేదు. నీకేమి కావాలిప్పుడు?" అని వివరంగా కూడా అడిగారు వారతణ్ణి.

“నేను యయాతి ననే రాజర్షిని. నాపుణ్యం అంతా బుగ్గయిపోయింది. అంచేత, స్వర్గంనుంచి పడిపోయాను. “సజ్జనుల మధ్యగా పడాలి” అనుకుంటూ పడ్డంలో మీానడమ పడ్డాను.” అని బదులు చెప్పా డతను. దానిమీాద వారు “రాజర్షీ నీకోరిక సఫలం అవుగాక. మేము చేసిన యజ్ఞాలఫలమూ, మేము నడిపించిన ధర్మమూ నువ్వు పుచ్చుకో” అన్నారు వారు. “నేను బ్రాహ్మణ్ణి కాను, క్షత్రియుణ్ణి. అంచేత, వొకరివల్ల దానంపట్టడానికి నా కధికారంలేదు. ఇతరులు సంపాదించుకున్న పుణ్యాం నాశనంచెయ్యడమున్నూ నాకిష్టం లేదు” అంటూ వారి దానం నిరాకరించా డతను.

ఇంతలో, మృగరూపంతోవున్న మాధవివచ్చిం దక్కడికి. ఆరాజులు నలుగురూ లేచి నమస్కరించి “మేము నీకుమాళ్ళం. ఎందుకోసం వచ్చావూ నువ్వు? మమ్మేమి చెయ్యమంటావూ?” అనడిగారు వారామెని. ఇది వింటూనే, మాధవి, అటుచూసి, తన తండ్రే కనక యయాతికి నమస్కరించింది. తన కొడుకుల శిరస్సులు ముద్దుపెట్టుకుని “రాజేంద్రా, వీరు నీదౌహిత్రులు. నాకొడుకులు నీకు పరాయివాళ్లు కారు. వీరు నిన్ను తరింపచేస్తారు. దౌహిత్రులు మాతామహుణ్ణి తరింపచెయ్యడం లోకంలో వున్నదే. సనాతనధర్మం యిది. నేను మృగరూపంతో వున్నానే కాని, నీకూతుర్ని. మాధవిని. నేను కూడా కొంత ధర్మం సంపాదించుకున్నాను. అందులో సగం పుచ్చుకో నువ్వు. మనుష్యు లందరూ తాము కన్నబిడ్డలవల్ల సుఖపడవలసినవారు మరి. అంచేత, అందరూ నీలాగే దౌహిత్రులు కలగా లని కోరుకుంటూ వుంటారు” అని చెప్పింది.

వెంటనే ఆరాజులు నలుగురూ తమ తల్లికి సాష్టాంగనమస్కారాలు చేశారు. యయాతికిన్నీ మొక్కారు. “మేము చేసుకున్న పుణ్యాం పరిగ్రహించి నువ్వు స్వర్గానికి వెళ్లిపో మళ్లీ” అనిన్నీ అన్నారు

వారు యయాతితో. ఈసమయానికి, పిలిచినట్టు వచ్చాడు గాలవుడక్కడికి. "రాజా, నా తపస్సులో యెనిమిదో వంతుభాగం స్వీకరించి నువ్వు స్వర్గానికి వెళ్ళిపో" అన్నాడతను కూడా.

# 122

"మేము పరాయివాళ్ళం కాము, నీ దౌహిత్రులమే" అని వారు చెప్పడంతో యయాతి మళ్ళీ స్వర్గానికి వెళ్ళాలని భూమిని తాకనేలేదు. దుఃఖం మరుపువచ్చిందతనికి. దేవతలు ఘుమఘుమలాడే పూలదండలూ, వస్త్రాలూ, ఆభరణాలూ అతడి శరీరాన్ని అలంకరించారు. స్వర్గీయమైన సుగంధంతో సువాసితం అయింది అతని శరీరం.

అప్పుడు, వసుమనుడు ముందుకి వచ్చాడు మొదట. "తాతా, ఎవరినీ నిందించకుండానూ, ఎవరినీ గర్హించకుండానూ సంపాదించుకున్న సుకృతం నీకిచ్చేస్తున్నాను, స్వీకరించు. దానధర్మాలు చేసీ, ఓర్పు కనపరిచీ, యజ్ఞయాగాలు చేసీ నేనే పుణ్యం సంపాదించుకున్నానో అదంతా కూడా నీకిచ్చేస్తున్నాను. స్వీకరించి నువ్వు స్వర్గానికి వెళ్ళిపో" అని చెప్పాడతను.

"ధర్మనిరతివల్లా, యుద్ధపరాయణత్వంవల్లా, వీరకృత్యాలనూ అనేకం చేసివుండడంవల్లా — ఈవిధంగా క్షత్రియధర్మం తప్పకుండా నడుచుకుని నేను సంపాదించుకున్న పుణ్యం యావత్తూ నీకిచ్చేస్తున్నాను, స్వీకరించి నువ్వు స్వర్గానికి వెళ్ళిపో" అన్నాడు ప్రతర్దనుడున్నూ, తరవాత.

"పిల్లలవిషయమయినా, స్త్రీల విషయమయినా, పరిహాసం చెయ్యతగిన బావమరదుల విషయమయినా కూడా నేనెప్పుడూ సత్యం తప్పలేదు. ప్రతిజ్ఞలు నెరవేర్చుకోడంలోనూ, ఆపదల్లోనూ, వ్యసనాల్లోనూ కూడా నేనబద్ధం ఆడలేదెప్పుడూ. సుఖమూ, రాజ్యమూ,

చివరికి ప్రాణాలున్నా సష్టపడ్డాని కయినా సిద్ధపడ్డాను గాని నేనె ప్పుడూ అబద్ధం ఆడలేదు. ఈసత్యనిరతికి, ధర్ముడూ, అగ్నీ, ఇం ద్రుడూ ముగ్గురూ మెచ్చుకున్నారు నన్ను. ఆసత్యఫలం అంతా నీకిచ్చే స్తున్నాను స్వీకరించి స్వర్గానికి వెళ్ళిపోనువ్వు" అన్నాడు శిబి.

"తాతా, వందలకు వందలు పౌండరీకాలూ, వందలకు వందలు గోసవనాలూ, వందలకు వందలు వాజపేయాలూ చేశా న్నేను. డబ్బూ, వస్త్రాలూ, రత్నాలూ – ఇంకా యిలాంటివి ఉన్నవన్నీ యజ్ఞాల్లో అందరికీ పంచిపెట్టేశాను; గాని కొంచెమైనా మిగుల్చుకో లేదు నే నెప్పుడూ. ఆఫలం అంతా స్వీకరించి నువ్వు స్వర్గానికి వెళ్లిపో" అన్నాడు అష్టకుడు కూడా.

ధర్మనిరతు లయిన దౌహిత్రు లిలా చెప్పడంవల్ల యయాతి మళ్లీ స్వర్గానికి వెళ్లి పోయాడు.

# 123

యయాతి మళ్లీ స్వర్గంలో ప్రవేశించాడు. అతనిమీద పూలవాన కురిసింది. పుణ్యాసువాసనలతో వచ్చి పిల్లగాలిన్నీ అలుముకుం దతణ్ణి. దౌహిత్రలాభంతో యె తో తేజశ్శాలి అయినా డతను మళ్లీ. గంధ ర్వులు పాడారు. అప్సరస లాడారు. భేరీదుందుభీధ్వానాలతో అతనికి స్వాగతం నివేదించుకున్నారు దేవతలు. ఇంద్రుడు మెచ్చుకున్నాడు. రాజర్షులు పొగిడారు. చారణులు స్తోత్రంచేశారు. దేవత లందరూ అభినందించారు.

ఇలాగ మళ్లీ స్వర్గనివాసం పొందిన యయాతిదగ్గిరికివచ్చి, బ్రహ్మ "రాజ్యపాలనలో నువ్వు ధర్మం నాలుగుపాదాలా నడిపించావు. నీకీ లోకం శాశ్వతం అయిం దిప్పుడు. నీకీర్తిన్నీ అక్షయం అయింది. మొదట నీఅంతట నువ్వే యీస్వర్గంనుంచి పతనం పొందావు. నువ్వు

చేసిన తప్పు గ్రహించంగా నన్ను మన్నించిపోయారు దేవతలు. అయినా, సదాహితుల ధర్మమూ అనుసరిస్తే నువ్వూ, నీక నాగరికగాను. నువ్వు చేసుకున్న పుణ్యకర్మలవల్ల స్థిరమూ, శాశ్వతమూ, ధ్రువమూ, మహోన్నతమూ అయిన స్థానం నీకు లభించింది మళ్ళీ" అని బాగా ప్రశంసించారు.

దీనిమీద "భగవాన్! నాకో సందేహం వున్నది. సుస్పష్టంగా మరో కదు తీర్చవలెరది. ఎన్ని వేల సంవత్సరాలో ధర్మపరిపాలన చేశానన్నను. ఎన్నో యజ్ఞాలు చేశాను. దానాలున్నూ చేశాను, లెక్కలేకుండా. ఈవిధంగా నేనెంతో పుణ్యం సంపాదించుకున్నాను గదా, మరి, అదంతా ఏమయిపోయింది? నేనెందుకు స్వర్గభ్రష్టుణ్ణయిపోయానూ? నేనుత్తమలోకాలున్నూ అనేకాలు శాశ్వతంగా సంపాదించుకున్నానే, అవన్నీ ఎందుకు నష్టం అయిపోయాయి?" అడిగాడు యయాతి.

"నిజమే" అన్నాడు బ్రహ్మ. "నువ్వెన్నో ధర్మకార్యాలు చేశావు. ఎంతో న్యాయంగా పరిపాలన చేశావు. యజ్ఞాలు చేశావు, దానాలు చేశావు. సత్యం తప్పి ఎరగవు. ఈవిధంగా నువ్వెంతో పుణ్యం సంపాదించుకున్నావు; కాని, ఉన్నట్టుండి దురభిమానం కనపరుచుకున్నావు నువ్వు. దేవతలందరూ అది చూసి నిన్నేవగించుకున్నారు. అంచేతే స్వర్గభ్రష్టుడవున్నూ అయిపోయావు నువ్వు. రాజారి దురభిమానం వల్లా, బలపరాక్రమాల వల్లా, క్రూరకార్యాలవల్లా, నమ్మించి ద్రోహంచేసీ, వంచనచేసీ ఎవడూ శాశ్వతలోకాలు సంపాదించుకోలేడు. ఎదటివాడు ఉత్తముడే కానీ, మధ్యముడే కానీ, అధముడే కానీ, ఎప్పుడూ ఎవరినీ అవమానించగూడదు. దురభిమానులకు శాంతి లభించ దెప్పుడూ కూడా" అని స్పష్టంగా చెప్పాడు దివకతను.

ఇలా చెప్పి "దుర్యోధనా" అని పిలిచాడు నారదుడు. "రాజా దురభిమానంవల్ల వెనకటి కిలా కష్టపడ్డాడు యయాతి. నిర్బంధంచేసి గాలవుడున్నూ సకలకష్టాలూ అనుభవించాడు. స్నేహితు లైనవా రెప్పుడూ హితం కోరతారు. వారిమాట తీసెయ్యగూడదు. వినాలి. విని అలా నడుచుకోవాలి. ఎవరినీ నిర్బంధించగూడదు. దానివల్ల సర్వమూ నాశనం అయిపోతుంది. కనక, నువ్విక దురభిమానమూ క్రోధమూ విడిచిపెట్టెయ్యి. తొందరపడకు. పాండవులతో సంధి చేసుకో. రాజా, ఒకడు చేసిన దానధర్మాలవల్లా, శుభకార్యాలవల్లా, తపస్సువల్లా, యజ్ఞయాగాలవల్లా వచ్చిన పుణ్యం మరొకళ్ల కంటదు. అది నాశనం కాదు. తరిగిన్నీ పోదు. చేసుకున్నవాడికే గాని మరొకడి కనుభవానికి రాదది. బహువేత్తలూ, రాగద్వేషాలు విడిచినవారూ అయిన మహాత్ముల ఆఖ్యానం యిది. ఇది నువ్వు బాగా అవగాహన చేసుకో. అలా చేస్తే, అలా నడుచుకుంటే, నువ్వు మిక్కిలీ ప్రజ్ఞావంతుడవై చిరకాలం ప్రజాపాలనం చేస్తావు. సకలవైభవాలున్నూ అనుభవిస్తావు" అని హితవు చెప్పాడు, చివరికి.

## 124

"నారదా, నువ్వు చెప్పిందంతా సత్యమే. నాకూ అదేయిష్టం; కాని నేనందుకూ సమర్థుణ్ణి కాను" అన్నాడు ధృతరాష్ట్రుడు. తరవాత కృష్ణుణ్ణి సంబోధించా డతను. "నువ్వు స్వర్గం సంపాదించుకునే వుపాయం చెప్పావు. లోకానికి హితకరమూ, ధర్మబంధురమూ, న్యాయమూ అయిన దంతా చెప్పావు; కాని నేను స్వతంత్రుణ్ణి కాను. ఈజరుగుతున్న దేమీ నాకిష్టంలేదు. ఈదుర్యోధను డున్నాడే, మిక్కిలీ మూఢుడు. శాస్త్రం అంటే పెడమొగం పెడతాడు. ఇతణ్ణి మందలించి దారికి తీసుకురావయ్యా! సజ్జనులమాట వినుపించుకో

డినను. గాంధారి చెప్పింది. విదురుడు చెప్పాడు. భీష్ముడు చెప్పాడు. ద్రోణుడూ, ఇంకా వున్న పెద్దలూ చెప్పారు, సదభిప్రాయాని కూడా; కాని యెవరినీ లెక్కచెయ్యడంలేదు.

దాపరికం లేకుండా చెబుతున్నాన్నేను. పాపాత్ముడీనను. పాపపు టాలోచనలే చేస్తాడెప్పుడూ. దురభిమానం చాలా ఎక్కువ. నువ్వీ తణ్ణి మందలిస్తేనా, మిత్రకార్యం నెరవేర్చినవాడవవుతావయ్యా" అంటూ ప్రార్థించాడు. దుర్యోధనుడు కోపిష్ఠి అని తెలుసును. అయినా కృష్ణు డిలా చెప్పా డతనికి.

"నేనొకటి చెబుతాను శ్రద్ధగా విను. బాగా అర్థంచేసుకో. నీకూ నీబంధువర్గానికీ కూడా క్షేమం కోరుతున్నాన్నేను. గొప్పవంశంలో పుట్టావు నువ్వు. చాలా చదివావు. చాలా విన్నావు. సహజంగా నీస్వభావం మంచిది. నీశీలం గొప్పది. నీనడవడికూడా మంచిదే, అసలు. సుగుణాలే వున్నాయి నీదగ్గిర యెన్నో. నీచవంశంలో పుట్టినవాళ్లూ, దురభిమానం గలవాళ్లూ, క్రూరచిత్తులయినవాళ్లూ, సిగ్గుబిడియాల్లేనివాళ్లూ మాత్రమే చేస్తారు, నువ్వు చెయ్యబోతున్న పనులు. లోకం చూడు. సజ్జనుల నడవడి ధర్మార్థసంబంధంగా వుంటుంది. దుర్జనుల నడవడి ఇందుకు భిన్నంగా వుంటుంది. అదే కనపడు తోంది నీదగ్గిర. నువ్వీ పనిచేస్తే అతిఘోరాలైన పరిణామాలు సంభవిస్తాయి. ప్రాణహాని సంభవిస్తుంది సాంఘికంగా. ఇది మంచిది కాదు. దీనికి కారణమూ లేదు, పరకాయిస్తే. ఇప్పు డశ్రద్ధ చేస్తేవా, నీకున్నూ అసాధ్యం అయిపోతుంది, చివరి కిది.

నీ కేది శ్రేయస్కరమో బాగా ఆలోచించుకో. నీసోదరు లున్నారు, మిత్రు లున్నారు, భృత్యులున్నారు. ఎందరో వున్నారు వారు, కొద్దిమంది కారు. వారి శ్రేయస్సు కూడా పరకాయించుకో.

నిన్నూ వారినీ కూడా కాపాడుకో. నువ్వు చెయ్యబూనుకున్నది మిక్కిలీ అధర్మం. అపకీర్తి కలిగిస్తుంది నీకది.

అటు చూడు. పాండుపుత్రులు మిక్కిలీ ప్రాజ్ఞులు. మహాశూరులు. వారి ఉత్సాహానికి పరిమితి లేదు. ఆత్మజ్ఞానం కలవారు వారు. ఎంతో తెలిసినవారు. వారితో సంధిచేసుకో. నీతండ్రి ధృతరాష్ట్రునకూ, భీష్మునకూ, ద్రోణాచార్యునకూ, విదురునకూ, కృపాచార్యునకూ, సోమదత్తునకూ, బాహ్లికునకూ, అశ్వత్థామకూ, వికర్ణునకూ, సంజయునకూ, వివింశతికీ, నీజ్ఞాతులకూ, నీమిత్రులకూ గూడా నువ్వు సంధి చేసుకోడమే యిష్టం. అదే వారికి మంచిదిన్నీ. శాంతం వుండే, అది జగత్తుకున్నూ అంతకూ క్షేమం కలిగిస్తుంది.

నువ్వయినా సిగ్గుబిడియాలు కలవాడవు. విద్వాంసుడవు. క్రూరుడవు కావు. తల్లీతండ్రీ చెప్పినట్టు నడుచుకోవోయి నాయనా! తండ్రి చెప్పినమాట విన్నవాడు సకలశ్రేయస్సంపన్నుడవుతాడు. తండ్రి మాట వినేవాడి కాపదలు రావంటారు పెద్దలు. నీతండ్రి పాండుపుత్రులతో సంధిచేసుకోవా లనే చూస్తున్నాడు. మంత్రులకు నచ్చచెప్పుకుని నువ్వున్నూ సంధికిష్టపడ్డమే మంచిది. స్నేహితుల హితవాక్యాలు వినిపించుకోనివాడు చివరికి నాశనం అయిపోతాడు. తెగని ఆలోచన పెట్టుకునేవా డెప్పుడూ మంచిఫలాలు సంపాదించుకోలేడు. శ్రేయస్కరం అయిన మాట వినిపించుకోనివాడు పశ్చాత్తాప పడతాడు చివరికి.

తన యిష్టానిష్టా లవతలు పెట్టి, పెద్దలు చెప్పేమాట వినేవాడు సకలశుభాల్నూ, సకలసుఖాలూ అనుభవిస్తాడు. కీర్తిపొందుతాడు. తన కుపకారం చేసేవారి మాట కాదని వంచకుల మాయమాటలు వినేవాడు శత్రువుల వశం అయిపోతాడు. సజ్జనులదారి విడిచిపెట్టి దుర్జనుల దారి తొక్కేవాడు, తాను పాడయిపోడమే కాదు, మిత్రుల

కున్నా దుఃఖాలు కలిగిస్తాడు. కులపరంపరగా వచ్చిన ఉత్తమసచివుల మాట పెడచెవినిబెట్టి నీచులమాట వినేవాడు ఘోరమైన ఆపదల పాలయి అణగారిపోతాడు. మళ్లీ లేవలేడు. చెడ్డవాళ్ల చుట్టూచుట్టూ తిరుగుతూ, వ్యర్థంగా కాలం గడుపుతూ, సజ్జనుల మాట వినిపించుకోక, తనవాళ్లని నమ్మక, ఇతరులను నెత్తికెక్కించుకొనేవాడు భూమ్మీద ఆట్టేకాలం బతకడు.

మహావీరులైన పాండుపుత్రులను దూరంచేసుకుంటున్నావు నువ్వు. పైపెచ్చు మూఢులూ, అసమర్థులూ, హీనులూ అయినవాళ్లేదో వొరగబెడతారని ఆశిస్తున్నావు నువ్వు. మహారథులూ, ఇంద్రునితో సమానులూ అయిన తన జ్ఞాతులను కాదని, పరాయివాళ్ల రక్షణ కోరేవాడు నువ్వు కాక మరెవడుంటాడూ?

చిన్నప్పట్నుంచీ పాండుపుత్రులకు నువ్వపకారాలే చేస్తున్నావు. అయినా నీమీద వారికి కోపంలేదు. ధర్మాత్ములు మరి, వారు. నీయెడల అనురాగమే చూపిస్తున్నారు వారు. పాండుపుత్రులయెడలా, తక్కిన బంధువుల యెడలా నువ్వుకూడా అలా యెందుకుండరాదూ? వారిమీద నీకంత కోపం యెందుకూ? ప్రాజ్ఞులయినవారు ధర్మమూ అర్థమూ కామమూ — ఈత్రివర్గమూ ప్రధానంగా చూసుకుంటారు. ఈమూడూ మొత్తంగా సిద్ధించకపోయినా, ధర్మమూ అర్థమూ అయినా లభిస్తాయి వారికి. ధర్మమూ అర్థమూ కామమూ దేనికదేగా సిద్ధపడితే బుద్ధిమంతుడైనవాడు ధర్మమే పరిగ్రహిస్తాడు. మధ్యముడర్థం కోరతాడు. పిల్లకాయ — అంటే, అధముడు — అంటే, నీచుడు మాత్రం వొక్కకామమే పరిగ్రహిస్తాడు. అది కలహాలకు కారణం అవుతుంది; గాని శ్రేయస్కరం కాదు.

ఇంద్రియాలకు లోబడిపోయి, లోభిన్నీ అయి పామరుడు ధర్మం విడిచిపెట్టేస్తాడు; కాని అర్థమూ కామమూ మాత్రం సంపాదించుకోలే

డెప్పటికీ. నశించిన్నీపోతాడు చివరికి. అర్థమూ కామమున్నే కావాలన్నా మొదట ధర్మానికే ప్రాధాన్యం యివ్వాలి, విధిగా. ధర్మం లేదూ, అర్థమూ లేదు, కామమూ లేదు, ఎంత గింజుకున్నా త్రివర్గం — అంటే, ధర్మమూ అర్థమూ కామమూ — ఇవి సాధించుకోవా లంటే, అందు కపాయం లేని వుపాయం ధర్మమే. అది విడిచిపెట్టడం అంటే వాడిలో నిప్పులు పోసుకోడమే అవుతుంది. నువ్వా వుపాయం విడిచిపెట్టేస్తున్నావు. నీరాజ్యం, భూమండలంలో వున్న రాజ్యా లన్నిటిలో చాలా గొప్పదని చాలా పేరుపొందింది. ధర్మం అంటే వల్లమాలిన ద్వేషం చూపిస్తున్నావు నువ్వు. అది నీరాజ్యం అంతా నాశనం చేసేస్తుంది.

తనయెడల మంచిగా వున్న వారియెడల కూడా కుటిలంగానే వుంటాడొక్కొక్కడు. అలాంటి వాణ్ణి విడిచిపెట్టెయ్యవలసిందే. ప్రయత్నించి వాడిబుద్ధి మళ్లించగూడ దెనరూ. వాడికి పరాభవం జరిగితీరాలి. సద్బుద్ధిగలవా డెప్పుడూ మంచే కోరతాడు. మంచిపనులే చేస్తాడు. ఆత్మజ్ఞానం గలవాడు ఎవరికీ అపకారం చెయ్యగూడదు. పామరులకే కాదు. నీచులకున్నూ చెయ్యగూడ దపకారం. పాండుపుత్రులకు చెయ్యగూడ దని వేరే చెప్పడం యెందుకూ యిక? కోపిష్ఠి అయినవాడు మంచీ చెడ్డా గుర్తించలేడు. ఇతరులదే కాదు, తనమేలున్నూ చెరుచుకుంటాడు వాడు. నిదర్శనం కావా లంటావా, వేదంచూసుకో. అక్కడి దాకా వెళ్లనక్కర్లేదు, లోకం చూసుకో బాగా. నీచులతో సహవాసం చెయ్యడంకంటే పాండవులతో కలిసివుండడం మంచిది నీకు. వారి ప్రీతి సంపాదించుకోగలిగితే, సకలభోగభాగ్యాలూ అనుభవించుకో గలుగుతావు నువ్వు.

దుశ్శాసనుడూ, కర్ణుడూ, శకునీ — ఈముగ్గురి చేతుల్లోనూ జారవిడుచుకున్నావు సింహాసనం అంతా; [illegible] ఐశ్వర్యం మాత్రం కావా లను

కుంటున్నావు. జ్ఞానంలోనూ, ధర్మంలోనూ, అర్థంలోనూ కూడ నీకు చాలరు వారు. పోనీ బలపరాక్రమాలు చూద్దామనా అంటే, పాండవుల యెదట యెందుకూ పనికిరారు వారు. ఇంతటి రాజులు నీకు సాయం వున్నా రనుకుంటున్నావు నువ్వు. వారూ నువ్వూ కట్టకట్టుకున్నా భీమసేనుని యెదుట నిలవలేరు. పెద్దబలగం కూర్చుకుని వున్నావు నువ్వు. పైగా భీష్ముడూ, ద్రోణుడూ, కర్ణుడూ, కృపుడూ, భూరిశ్రవుడూ, అశ్వత్థామా, జయద్రథుడూ వున్నారు. కొండలవంటి వారు నీకు; కాని అర్జునుని యెదుట వీరందరూ వృథావృథా. అర్జునుణ్ణి జయించడం మనుష్యులకే కాదు, గంధర్వులకూ, సురాసురలకూ కూడా శక్యం కాదు. కనక, యుద్ధాశ విడిచిపెట్టుకో, త్వరగా.

అర్జును ణ్ణెదిరించి బతికి మళ్లీ యింటికి వెళ్లగలవా డెవడైనా వున్నా డేమో నీబలగం అంతా పరిశీలించుకో. ఒక్కటి చెబుతా విను. ఈయోధు లందరినీ నాశనం చేసుకోడం యెందుకూ? అర్జును ణ్ణొక్కణ్ణీ జయిస్తే చాలు, అందరినీ జయించినట్టే; కాని ఆమాత్రం మొనగా డెవడోయ్, నీబలగంలో? ఖాండవదహనం సంగతి యెరుగుదువా? గంధర్వులు, యక్షులు, రాక్షసులు, నాగులు — ఓః! ఎందరు వచ్చారయ్యా అప్పుడు కత్తులు దూసి? కాని యేమైపోయారు వారంతా? ఏం జరిగింది చివరికి? విరాటనగరంలో మాత్రం యేమి జరిగిందంటావు? ఎందరో వచ్చారు పేరుమోసిన యోధులు; కాని ఆవొక్కణ్ణీ మాత్రం యేమీ చెయ్యలేకపోయారు మరి.

శివు డంతటివాడు సహించలేకపోయా డర్జునుని దెబ్బ; అయితే, ప్రాజ్ఞుడు కనక ఆబలపరాక్రమాలు మెచ్చుకున్నా డతను. అలాంటి అర్జునుణ్ణి నువ్వా జయించడం? ఆ అర్జునునకు నేను తోడవుతున్నా నిప్పుడు, మరి, చూసుకో. దేవేంద్రుడున్నా యెదిరించలే డన్నుణ్ణి. శుద్ధ సత్యం వొక్కటి చెప్పనా నీకు? ఈభూమండలం అంతా తన

రెండు చేతులతోనూ యెత్తి అవతల పారెయ్యగలవా డెవడైనా వున్నాడా? కన్నెర్రజేసి ఈప్రపంచంలోవున్న జనుల నందరినీ బుగ్గి చెయ్యగలవా డెవడైనా వున్నాడా? స్వర్గంలోనుంచి దేవతలనందరినీ కింద పడగొట్టగలవా డెవడైనా వున్నాడా? ఉంటే, వెళ్లి సాయం తెచ్చుకో. వాడొక్కడే అర్జునుణ్ణి జయించగలవాడు.

నాయనా, నీకొడుకులను చూసుకో, నీతమ్ములను చూసుకో, నీజ్ఞాతులను చూసుకో, నీబంధువులనుకూడా అందరినీ చూసుకో. నీవొక్కనిమూలంగా వారందరూ నాశనం అయిపోతారోయ్! కౌరవులను బతికివుండనియ్యవోయ్! ఈమహావంశం నిర్మూలం అయిపోడం మంచిది కాదోయ్! లోకం నిన్ను కులనాశకు డంటుంది, అలా జరగనివ్వకు. ఒక్క రహస్యం చెప్పనా? పాండుపుత్రులు నిన్నే యువరాజుగా అంగీకరిస్తారు. నీతండ్రినే మహారాజుగా పూజిస్తారు. సిరి రాబోతోంది మోకాలొడ్డుకోకు నాయనా! ఉన్నరాజ్యంలో సగం పాండవుల కిచ్చి సిరీ సంపదా అనుభవించవోయి పూర్తిగా. పాండవులతో సంధిచేసుకుని, ఈవిధంగా స్నేహితుల మాట చెల్లించి, మిత్రుల నందరినీ సంతోషపెట్టి, చిరకాలం సకలభోగాలూ సకల సుఖాలూ అనుభవించవోయ్! కీర్తి ప్రతిష్ఠా సంపాదించుకోవోయ్!

## 125

ఇలా చెప్పి కృష్ణు డూరుకోగా, భీష్ము డందుకున్నాడు "దుర్యోధనా" అంటూ.

"స్నేహితుల కందరికీ శ్రేయస్సు కోరుతున్నాడు కృష్ణుడు. నీకు చెప్పవలసిం దంతా చెప్పా డతను. అతను చెప్పినట్టు నడుచుకో. పగ మాట మరిచిపో యిప్పటికి. కృష్ణునిమాట వినకపోతే క్షేమం వుండదు. సుఖంరాదు. నీకేమీ తక్కువ కూడా. ధర్మార్థాలు రెండూ

బాగా ఆలోచించి చెప్పాడతను. అది గమనించుకో. జనులందరూ నీమూలంగా నశించిపోకుండా చూడు.

ఈరాజవంశంలో అంతా కమ్ముకొనిన సభానీతి రాజ్యలక్ష్మి జాజ్వల్యమానంగా వెలుగుతోంది. నీతండ్రి కీర్తిమంతుడుగా అది నాశనంచేసుకుంటున్నావు నువ్వు. అహంకారానికి సాయం దుర్బుద్ధి కూడా అవలంబించి, నిరపరాధులనూ, పుత్రులనూ, సోదరులనూ, మిత్రులనూ మాత్రమే కాదు, నిన్నుకూడా భ్రష్టుంచేసుకుంటున్నావు నువ్వు. కృష్ణుడు చెప్పినమాటలూ, నీతండ్రి విదురుడూ చెప్పిన మాటలూ పెడచెవిని పెట్టి వంశానికి వినాశమే బుద్ధిచేసుకుంటున్నావు నువ్వు. నీతల్లినీ నీతండ్రినీ శోకసాగరంలో ముంచేస్తున్నావు నువ్వు. సన్మార్గాన్ని వదలిపోకు” అని చెప్పాడతను.

భీష్ముని మాటలు మంటలెత్తించాయి దుర్యోధనునకు. అవి భరించలేక రోజుకోనాగా డతను. ఈసమయంలో ద్రోణుడందుకున్నాడు.

“నాయనా, కృష్ణుడు చెప్పినమాట చాలా ధర్మార్థయుక్తంగావుంది. భీష్ముడూ అలాంటిదే చెప్పాడు. వారి మాట జవదాటకు. వారు చాలా ప్రాజ్ఞులు. గొప్ప మేధావులు. దాంతులు. ధర్మార్థాలయెడల మిక్కిలీ ఆస్థగలవారు. చాలాచాలా తెలిసినవారు. నీకు హితంకోరే చెప్పారు వారు. ఆమాట తీసెయ్యకు. అహంపెంచుకుని అజ్ఞానంతో కృష్ణుణ్ణి అవమానించకు. నిన్ను యుద్ధానికి రమ్మిస్తున్నారే దుశ్శాసనుడూ, కర్ణుడూ, శకునీని, పనిపట్టాటప్పటికి ఏమీ చెయ్యలేరు. పైపెచ్చు మాపీకలమీంది కూడా తెస్తున్నారు వారు. కృష్ణార్జునులజేయులు. వారికెవరూ చాలరు. కృష్ణుడూ భీష్ముడూ చెప్పింది వినకపోతే తరవాత పశ్చాత్తాప పడవలసివస్తుంది నీకు. అర్జునుని సంగతి జామదగ్న్యుడు కొంచెమే చెప్పాడు. అంతకంటే యెంతో గొప్పవాడర్జునుడు. కృష్ణుడంటావా? దేవతలు కూడా నిలవలేరతనియెదట. ఇదంతా నీసుఖం

కోరి చెప్పా న్నేను. తరవాత నీయిష్టం. నీకు చెప్పవలసిం దింకేమీా లేదు నేను" అని చాలా కచ్చితంగా చెప్పా డతను.

వెంటనే విదురు డందుకున్నా డు. "నీకోసం విచారించడం లేదు, నేను. నీతలిదండ్రులు – గాంధారీ ధృతరాష్ట్రుడూ వృద్ధు లయినారు. వీరికోసం నా బాధ. వీరికోసం విచారిస్తున్నా న్నేను. పూర్తిగా దుర్బుద్ధివి నువ్వు. నువ్విప్పుడు నాథుడవై వున్నావు వీరికి. ఇటు పుత్రులందరూ నాశనం అయి, అటు అమాత్యు లందరూ నాశనం కావడంతో, రెక్కలు తెగిన పిట్టలయి అనాథ లయిపోతారు నీమూలాన వీరు. కులనాశకుడ వైన నిన్ను కన్నందుకు ఫలంగా కర్రా చిప్పా చేతికి వచ్చి దేశాలపా లయిపోతారు వీరిక" అని చెప్పా డతను.

ధృతరాష్ట్రుడూ అందుకున్నా డూరుకోలేక. "దుర్యోధనా, శ్రీకృష్ణుడు చెప్పింది బాగా అర్థంచేసుకో. అది మంగళకరం అయిన మాట. ఒక్క మంగళకరం మాత్రమే కాదు, నీ కది క్షేమకరమున్ను. మన కీకృష్ణుని సాయంవుంటే ఈరాజు లందరిలోనూ శిరోమణుల మయి వుంటాం మనం. సంధిచేసుకో. యుధిష్ఠిరునితో కలిసిమెలిసి మసులుకో. శాంతించు. మనవాళ్ల కందరికీ శాంతంగా బతికేయోగం వుండనియ్యి. మన అదృష్టంవల్లనే యీాసన్ని వేశం తటస్థించింది. ఇది దాటబెట్టుకోకు. సంధి కోసమే కష్టపడుతున్నాడు కృష్ణుడు. నీకోసమే చెబుతున్నా డిదంతా. ఇది గుర్తించుకుంటివా, జయం నీది" అని చాలా దీనంగా చెప్పా డతను.

## 126

ధృతరాష్ట్రుని స్థితి చూసి భీష్ముడూ, ద్రోణుడూ చాలా బాధపడ్డారు. దుర్యోధను డతని మాట విన డని వా రెరుగుదురు. అయినా, వూరుకోలేకపోయారు వారు.

"దుర్యోధనా, కృష్ణార్జును లిద్దరూ యుద్ధసన్నద్ధులు కాక ముందే — గాంఢీవం సజ్యం కాకముందే — ధౌమ్యుడు యజ్ఞకుండంలో నీబలగం అంతా హోమం చెయ్యకముందే — గొప్పవిలుకాడైన యుధిష్ఠిరుడు నీయోధులమీద క్రోధోగ్ర జెయ్యకముందే యీ వైరం చల్లబడాలి. భీముడూ అర్జునుడూ తను బలగం అంతా ముగ్గురాలు తీర్చుకుని మీ కేసి చూడకముందే వైరం చల్లబడాలి. గదచేత పుచ్చుకుని, భీమసేనుడు, తాటిపళ్లన్నట్లు నీయోధుల తలపళ్లు ముక్కగొట్టుకుంటూ వీరవిహారం చేస్తూ వీధులుతిర్చుకోకముందే యీ వైరం చల్లబడాలి.

నకులుడూ, సహదేవుడూ, ధృష్టద్యుమ్నుడూ, విరటరాజూ, శిఖండీ, శిశుపాలుని కొడుకూ, సముద్రంలో గండుమొసళ్లన్నట్లు నీబలగంలో చొరబడి కలిచివెయ్యకముందే యీ వైరం చల్లబడాలి. నీకు సాయంవచ్చిన యీ రాజుల సుకుమారశరీరాల్లో వాడి కరుకు టమ్ములు దూసుకుపోకముందే యీ వైరం చల్లబడాలి.

చందనమూ, అగురూ పూసుకుని, పూలదండలు వేసుకుని, విలాసంగా ప్రవేశిస్తారు యుద్ధరంగంలో నీయోధులు. పాండవుల నిశిత భాణాలతో వారి శరీరాలు జల్లెడ లయిపోకముందే యీ వైరం చల్లబడాలి."

ఇలా చెప్పి మళ్లీ ప్రారంభించారు వారు.

"శిరస్సు వంచుకుని చెయ్యెత్తి నువ్వు నమస్కరిస్తే, రెండుచేతుల తోనూ గట్టిగా పొదివిపట్టుకుని ధర్మనందనుడు నిన్ను దగ్గిరికి తీసుకుని, ధ్వజచిహ్నాలూ, పతాకచిహ్నాలూ వున్న నీకుడిచేతిని తన బుజాన చేర్చుకోవాలి. రత్నాంగుళీయకాలతో మిక్కిలీ రమ్యమైన మెరని తన అరచేతితో కూచుని వున్న నీపృష్ఠం గారాబంగా తట్టాలి.

ఆజానుబాహువూ, మహాశూరుడూ అయిన భీమసేనుడు, నిన్ను గాఢంగా కౌగిలించుకుని నీక్షేమసమాచారా లడగాలి. అర్జునుణ్ణీ నకులసహదేవులనూ శిరస్సులు మూర్కొని యిష్టాలాపా లాడాలి నువ్వు. నువ్వూ పాండుపుత్రులూ కలిసిమెలిసివుండడం చూసి ఈరాజు లందరూ ఆనందబాష్పాలు విడవాలి. ఈరాజుల రాజధాను లన్నింటా మీసిరిసంపదలు ముక్తకంఠాలతో చెప్పుకోవాలి జను లందరూ. ఈ భూమండలం అంతా నీనూటనలుగురు అన్నదమ్ములతో నువ్వు నిశ్చింతగా అనుభవించాలి" అని కూడా ఆశీర్వదించారు వారు.

# 127

ఈమాటల్లో వొక్కటీ రుచించలేదు దుర్యోధనునకు. అన్నీ అప్రియంగానే వున్నాయి. ఫురఫుర చూస్తూ కృష్ణుణ్ణి సంబోధించా డతను.

"ఉభయుల మంచిచెడ్డలూ బాగా పరిశీలించి నిర్యోగమాటంగా మాట్లాడతగ్గవాడవు నువ్వు; కాని తప్పంతా నామీదే మోపి చాలా కఠినంగా మాట్లాడావు నువ్వు. ఎంతో గర్హించావు నన్ను. పాండుపుత్రులు భక్తితో కొలుచుకుంటున్నారు నిన్ను. అదే కనపడుతోంది నీకు. అంచేతనే గర్హిస్తున్నావు నన్ను. మాబలాబలాలు గమనించి కాదు. నువ్వేమిటి, మహారాజేమిటి, విదురు డేమిటి ద్రోణాచార్యు డేమిటి, తాతయ్య యేమిటి -- మీరందరూ నన్నే గర్హిస్తున్నారు వరసపెట్టి. ఇతరు లెవ్వరూ కూడా దుష్టు లన్నట్టు కనబడ్డం లేదు మీకు. నన్ను మీరెంత గర్హించినా, నాదగ్గిర లేశమూ దోషం కనబడ్డంలేదు నాకు.

చాలా నిశితంగా పరిశీలించుకున్నాను; కాని నలుసంతయినా తప్పిదం కనపడ్డంలేదు నాదగ్గిర. ఇష్టపడివచ్చారు పాండుపుత్రులు. మనసుపడి జూదం ఆడారు; కాని చేతకాక శకుని చేతుల్లో వోడిపో

యారు. అందులో నేను చేసిన ద్రోహం ఏముందీ ? అప్పు డోడిపోయిన డబ్బంతా వారికే యిచ్చాను మహారాజు జాలిపడి. ఆడబ్బు చూసుకుని మళ్లీ జూదం ఆడారు వారు. ఎంతో కసిగా ఆడారు. కాని మళ్లీ వోడిపోయారు. పందెంప్రకారము వారడవులకు వెళ్లారు. అందులో నాకుట్ర యేమివుందీ ? ఏదో వాళ్ల నేరం మోపుతూ నన్నెప్పుడూ శత్రువుగానే భావించుకుంటున్నారు మీరు. సృంజయులతో కలిసి మమ్మల్ని నాశనం చెయ్యడానికే చూస్తున్నారు వారు. నువ్వెరుగుదువిది. నేనేమి అపకారం తలపెట్టాను ? వారికి, ఏమి అపరాధం చేశాను ?

మావిషయమై యెవ రెంత నిష్ఠురంగా మాట్లాడినా సరే, యెంతెంత క్రౌర్యం తలపెట్టినా సరే, ఆచేసేవాడు ఇంద్రుడే కానియ్యి, భయపడిపోయి మేమెవరికీ సణ్ణాలు పెట్టం, తెలుసా ? క్షత్రియధర్మం కొంచెం అయినా తప్పకుండా నిక్కచ్చిగా మసలుకుంటున్నవా డెవడూ మామీదికి దండెత్తిరావా లని చూడ్డంలేదు, నేనిది గట్టిగా చెప్పగలను. భీష్ముడూ, ద్రోణుడూ, కృపుడూ, కర్ణుడూ — వీరిని గురించి నువ్వేమిటో అనుకుంటున్నావు, ఇంద్రుడే దిగివచ్చినా వీరి నేమీ చెయ్యలేడు. పాండుపుత్రుల లెక్కేమిటయ్యా వీరికి ?

మాస్వధర్మం యెప్పుడూ విడిచిపెట్టం మేము. యుద్ధం వస్తే కొంచెమున్నా వెనుదియ్యం. ఎదటివారి చేతిలో మేము దెబ్బతిని చచ్చిపోడమే తటస్థిస్తుందా, వీరస్వర్గానికి పోతాం, తక్కువేమిటయ్యా మాకు ? యుద్ధంలో శరతల్పంమీద వాలడం మాకు యశస్కరం కాని అపకీర్తికరం కాదు. క్షత్రియధర్మానికంతకూ నిగ్గేమిటి ? పగవాణ్ణి చంపడం. తప్పివస్తే పగవాడిచేతిలో చచ్చిపోడం. కాదంటావా, నువ్విది ? ఇందులో యెందుకైనా సిద్ధమే కాని, వాళ్లకి మేము తీసిపోమయ్యా !

మేము కాదు, క్షత్రియుడై పుట్టి, స్వధర్మం నిర్వహించుకునేవా డెవడు మాత్రం పగవాడికి దణ్ణంపెడతాడయ్యా? కొనవూపిరి వున్నంత వరకూ యుద్ధమే చెయ్యాలి క్షత్రియుడు, దాసోహం అనగూడదు. ఇదే పౌరుషం అంటే" మాతంగుని సిద్ధాంతం యిది. నావంటివాడు ధర్మానికీ బ్రాహ్మలకూ మాత్రమే నమస్కరిస్తాడు. మరెవరికీ నమస్కరించడు. మరో చూపే వుండదు, క్షత్రియుడైనవాడికి. నేనిలాగే వుంటాను, దీని కికతిరుగు లేదు.

నాతండ్రి బతికివుండినంతకాలమూ మేమూ వారూ కూడా శస్త్రాలు కిందపడేసి యెలాగో లాగలాగ బతకవలసిందే. నానిశ్చయం యిది. అప్పుడు నాకు చిన్నతనం. వ్యవహారజ్ఞానం లేశమూ లేదు నా కప్పుడు. భయంవల్లనో, అజ్ఞానంవల్లనో నాతండ్రి వారికి రాజ్యభాగం యిచ్చాడు. మళ్లీ అలా జరుగుతుం దనుకుంటున్నారేమో పాండుపుత్రులు, లాభం లేదని చెప్పు. నేను మళ్లీ చెబుతున్నాను స్పష్టంగా, బాగా విను. వాడిసూదిమొన మోసేటంతటిదైనా వారి కివ్వ న్నేను భూమి" అని చాలా ఆవేశంతో చెప్పా డతను, చెయ్యి జాడించుకుంటూ.

## 128

బాగా ఆలోచించాడు కృష్ణుడు. రోషం మహా కెల్లించిం దతనికి. నిప్పులు కక్కుతూ చూస్తూ ప్రారంభించా డతను.

"వీరమరణమే పొందుతావు నువ్వు. తొందరపడకు. నువ్వూ నీ మంత్రులూ ఆమాటమీదే వుండండి. ఇదిగో యుద్ధం వచ్చేస్తోంది. నీకోరిక తప్పకుండా తీరుతుందోయ్!

నీదగ్గిర దోషమేమీ లేదంటున్నావు నువ్వు. ఉన్నదంతా పాండుపుత్రులదగ్గిరే వుందంటున్నావు. ఎవరిదగ్గిర వుందో యీరాజు లందరూ

మొరుగుదురు. పాండవుల సిరిసంపదలు చూడలేక నువ్వూ శకునీ మాయజూదం కల్పించారు. పాండవులు శ్రేయస్కాములు. సాధువులు. మాయామర్మమూ యెరగనివారు. నయానో భయానో గెలిచావు నువ్వు వారిని.

ఈజూదం వుందే, అది, సజ్జనులకు మతి పోగొడుతుంది. సిరులను అనేకవ్యసనాల్లోకి దింపేస్తుంది. ఎక్కడికక్కడే భేదాలున్నా కల్పించేస్తుంది. దుర్మార్గులతో కలిసి పాండుపుత్రులను మహావ్యసనంలో దింపావు. సోదరుల భార్యను సభకి గొంపు వచ్చి నువ్వు తప్పు చు గెవకు కారుకూతలు కూస్తావూ ఎలాగ ? గొప్పవంశంలో పుట్టింది ద్రౌపది. శీలవంతురాలు. పాండుపుత్రులకు పట్టమహిషి. ప్రాణాలకంటేనూ వారి కామె యెక్కువ. ఆమె నెంత అవమానపరిచావో నువ్వు లోకం మరిచిపోయిందనుకున్నావా ? శత్రుసంహారం అప్పుడే చెయ్యగలిగి వుండీన్నీ మాట తప్పలేక పాండవులడవులకు వెళ్ళిపోయారు. అప్పుడు దుశ్శాసను డాడిన దుర్భాషలు నీకౌరవులందరూ వినలేదనుకున్నావా ?

లోభులు కారు వారు. ధర్మం తప్పరు వారెప్పుడూ. చెడ్డ పనులు తలపెట్టనే తలపెట్టరు. నీకు ఆత్మీయులు. వారిపిమయము మో, నువ్వు తప్ప పెద్దమనిషి అయినవా డెవడైనా అలా నడుచుకుంటాడా ? దుశ్శాసను డొక్కడే కాదు, నువ్వూ కర్ణుడూ అప్పుడు తక్కువమాట లన్నారా ? మిమ్మల్ని గర్హించనివా రెవరైనా వున్నారా అప్పు డక్కడ ? వారికి దైవానుగ్రహం పూర్తిగా వుండబట్టి నువ్వు కృతకృత్యుడవు కాలేకపోయావు ; గాని చిన్నవారయివున్నప్పుడు, వారిని, తల్లితో గూడా లక్కయింటో కాల్చెయ్యడానికి చూడలేదూ వారణావతంలో నువ్వు ? వారప్పుడు ఏకచక్రపురంలో చాలాకాలం మారు వేషాలతో బ్రాహ్మలయింట తలదాచుకోలేదూ ? వారికి విషం

పెట్టావు నువ్వు. పాములచేత కరిపించావు, కాళ్లూ చేతులూ కట్టి నీళ్లలో పారేశావు. మనిషిని నాశనం చెయ్యడాని కెన్ని వుపాయా లున్నాయో అన్నీ ప్రయోగించావు నువ్వు. దైవం రక్షించుకుంటూ వచ్చాడు గానీ, నువ్వు చెయ్యని ఘోరం వొకటయినా వుందా వారి విషయమై? మరెప్పుడు మాత్రం సద్బుద్ధి చూపించావూ వారి విష యమై నువ్వు? ఏ మొగం పెట్టుకుని చెప్పగలుగుతున్నావూ నీదగ్గిర యేమీ దోషం లేదని?

రాజ్యభాగం అడుగుతున్నారు వారు. తమకు పిత్రార్జిత మైనదే యిమ్మంటున్నారు. ఆఅడగడమున్నూ బహూ మృదువుగా అడుగు తున్నారు. అయినా, యివ్వనుకాక యివ్వ నంటున్నావు నువ్వు. తొం దరపడకోయ్. ఐశ్వర్యం అంతా పోయి, ప్రాణాలున్నూ పోయి, నీభాగంకూడా వారికే యిచ్చేస్తావులే చివరికి నువ్వు. నీతల్లిదండ్రులు చెప్పారు. భీష్ముడు చెప్పాడు. ద్రోణుడు చెప్పాడు. విదురుడు చెప్పాడు. ఒకమాటు కాదు, లక్షమాట్లు చెప్పారు సంధిచేసుకోమని. అయినా, వినిపించుకోడంలేదు నువ్వు. సంధిచేసుకోడం అంటే పాండవులకు మాత్రమే యేదో వొరుగుతుందనుకోకు, నీకూ వొరుగుతుంది వారితో సమానంగా. బుద్ధి తక్కువ కావడంవల్ల నువ్విది గుర్తించుకోలేకుండా వున్నావు. స్నేహితు లైనవారి మాటలు వినకపోతే నీకు క్షేమం లేదు. నువ్విప్పుడు చెయ్యబూనుకున్నది ధర్మదూరమే కాదు, అపకీర్తికర మున్నూ, బాగా యోచించుకో."

ఇదంతా విన్నాడు దుర్యోధనుడు. అసలే రుసరుసలాడుతున్న దుర్యోధనుణ్ణి చూసి "విన్నావా? పాండవులేది కావా లంటే అదల్లా యిచ్చి నువ్వు సంధిచేసుకోకపోతే కట్టకట్టి నిన్ను పాండవుల కప్పగిస్తా రుట కౌరవులు. నిన్నొకణ్ణేకాదు, భీష్ముడూ, ద్రోణుడూ, నాయనా

కలిసి నన్నూ కర్ణుణ్ణీ కూడా పెడరెక్కలు కట్టి పాండవుల కప్పగించేస్తారుట" అన్నాడు వెంటనే కోపంగా, దుర్యోధనుడు.

[illegible] దుర్యోధనుడు. తండ్రి ముఖం చూడలేదతను. భీష్ముణ్ణీ, ద్రోణుణ్ణీ, విదురుణ్ణీ, బాహ్లీకుణ్ణీ, కృపుణ్ణీ, సోమదత్తుణ్ణీ, కృష్ణుణ్ణీ కూడా లెక్కచెయ్యలేదు. సిగ్గుబిడియాలు విడిచిపెట్టేశాడు. సిగ్గులేదాయె, విసురున వెళ్ళిపోయాడు సభ విడిచి. అది చూసి అతని తమ్ముళ్ళూ, కర్ణుడూ, శకుని, అతనికి సాయం వచ్చిన రాజులూ కూడా అతని వెంటబడి వెళ్ళిపోయారు.

అదిచూసి భీష్ముడు "ధర్మార్థాలు విడిచిపెట్టి, స్వేచ్ఛగా, కోపానికి లోబడిపోయినవాడు దుఃఖాలపాలయిపోతాడు, త్వరలోనే. వాణ్ణి చూసి మిత్రులైనవాళ్ళే నవ్వుతారు చివరికి. ఈదుర్యోధనుడున్నాడే, పరమదురాత్ముడు. ఉపాయం ఎరగడు. దురభిమానమాత్రం వుంది కావలసినంత. దీర్ఘక్రోధి, లోభీ కూడాను. ఇంతవిశాల రాజ్యం పరిపాలించడాని కెంతమాత్రమూ అర్హుడు కాడు. ఈరాజులకున్నూ చావు మూడింది. లేకపోతే, దుర్యోధనుని వెంట లేచిపోయి వుండరు వారు" అన్నాడు.

కృష్ణుడంటున్నాడు వెంటనే. "కురువృద్ధు లందరికీ యిది తీరని అపకారం. ఇలాంటిమందుణ్ణి రాజ్యంలోనిలుపుకున్నందుకు కావలసిందే వారి కిది. ఇక యిప్పుడు చెయ్యవలసిన దొక్కటే కనపడుతోంది నాకు. శ్రేయస్సు కోరుకునేవారి కంతకంటె మరోదారి లేదు. మీకందరికీ తెలిసివున్నదే చెబుతాను, మీకు నచ్చితేనే చెయ్యండది.

కంసుణ్ణి మీరెరుగుదురు. శుద్ధమూర్ఖుడూ క్రూరుడూను వాడు. తండ్రినే చెరపట్టి సింహాసనం ఆక్రమించుకున్న నీచుడు వాడు. అందు కిష్టపడలేకపోయారు బంధువులు. వాణ్ణి విడిచిపెట్టేశారు వారందరూ.

వారి కందరికీ మేలుచెయ్యడంకోసం నేనే వాణ్ణి కడతేర్చాను. తరవాత ఉగ్రసేనుణ్ణి గద్దె యెక్కించాను. బంధువులూ జ్ఞాతులూ అందు కెంతో సంతోషించారు. సత్కరించారు కూడా అతణ్ణి. ఒక్క కంసుణ్ణి విడిచి పెట్టేసుకోడంవల్ల యాదవు లందరూ సకలభోగభాగ్యాలూ అనుభవించగలుగుతున్నా రిప్పుడు.

వెనకటికి, దేవతలకూ అసురులకూ యుద్ధం తటస్థించింది. లోకంలో అంతా అందులో యిరుక్కుంది. రెండుపక్షా లయిపోయింది వెంటనే. నరుక్కోడానికి సిద్ధపడింది చివరికి. అప్పు డన్నాడు బ్రహ్మ "అసురులూ, దైత్యులూ, దానవులూ పరాభవం పొందుతా" రనీ "ఆదిత్యులూ, వసువులూ, రుద్రులూ జయంపొంది స్వర్గం యేలుకుంటా" రనీని. దేవతలూ, అసురులూ, మనుష్యులూ, గంధర్వులూ, నాగులూ, రాక్షసులూ ఒకళ్ల నొకళ్లు నరుక్కుంటా" రనీన్నీ చెప్పాడు.

వెంటనే ధర్ముణ్ణి పిలిచి "దైత్యులనూ దానవులనూ అసురులనూ బంధించి వరుణున కప్పగించ" మన్నాడు. వరుణుడు ధర్ముడు బంధించిన పాశాలతో తృప్తిపడక తన పాశాలతో కూడా బంధించి సముద్రంలో తొక్కిపట్టివుంచాడు వారిని. మీకున్నా అదే మార్గం యిప్పుడు. దుర్యోధనుణ్ణీ, దుశ్శాసనుణ్ణీ, కర్ణుణ్ణీ, శకునినీ కట్టేసి పాండవుల కప్పగించడమే ఆదారి.

సమయం వస్తే, అంటే తప్పివస్తే, వంశం నిలవడంకోసం దుర్మార్గుడైన పురుషుణ్ణి విడిచిపెట్టెయ్యాలి. అలాగే గ్రామం బాగుపడా లంటే వొక కుటుంబం విడిచిపెట్టెయ్యాలి. రాజ్యం కోసం గ్రామం విడిచిపెట్టెయ్యాలి. తనకోసం పృథివి అంతా విడిచిపెట్టెయ్యాలి. కనక, రాజేంద్రా, ఈదుష్టులను బంధించేసి పాండవులతో సంధిచేసుకో. అలా చేస్తే, యీరాజు లందరూ బతికిపోతారు."

# గాంధారి

కృష్ణుని మాట వినడం తడవుగా, ధృతరాష్ట్రుడు, గాంధారిని తీసుకు రమ్మని విదురుణ్ణి పురమాయించాడు. "ఆమె, నీ ప్రాజ్ఞురాలామె. దూరపు చూపు గలది. ఆమే నేనూ కలిసి అతనికి నచ్చచెబుతాం. ఆమె కూడా అతణ్ణి మందలించలేకపోతే, కృష్ణుడు చెప్పిన వుపాయం వుండనే వుంది మనకి. లోభమూ, దుష్టులసహవాసమూ - ఈ రెండూ పాడుచేస్తున్నాయి దుర్యోధనుణ్ణి. అయినా గాంధారి అతణ్ణి మళ్లించ గలగవచ్చు. దుర్యోధనుని మూలంగా ఘోరమైన శోకం సంభవించేట ట్టుంది మనకి. అది సంభవించకుండా ఆమె చెయ్యగలిగితే చాలా గొప్పకార్యం అవుతుంది" అంటూ చెప్పాడతను.

వెంటనే విదురుడామెని తీసుకు వచ్చాడు. "గాంధారీ, ఇదిగో, నీ పెద్దకొడుకు, ఐశ్వర్యం అంతా తానే అనుభవించాలన్న లోభంతో, ఉన్న ఐశ్వర్యమూ, తన జీవితముకూడా నాశనంచేసుకుంటున్నాడు. స్నేహితులనేకవిధాల చెప్పారు. అయినా పాపుల సహవాసంతో పరమమూర్ఖుడయి వున్నాడు కనక, రాజసభామర్యాద లయినా పాటించకుండా దిగ్గున లేచిచక్కాపోయాడు" అని ఆమె వచ్చీ రావడంతోనే తానెందుకు రప్పించిందీ యిలా వివరించాడు ధృత రాష్ట్రుడు.

గాంధారి బాగా ఆలోచించింది. "అతణ్ణి నాయెదటికి తీసుకురండి వెంటనే" అంది, ఇంకా బాగా ఆలోచిస్తూనే; "కాని" అంటూ ప్రారంభించింది, భర్తకేసి తిరిగి.

"ధర్మార్థాలు లెక్కచెయ్యనివాడికి రాజ్యం పాలించడం సాధ్యం కాదు. నీతిలేనివాడు ఉన్నరాజ్యం అయినా దక్కించుకోలేడు. అయితే

రాజేంద్రా, పుత్రప్రీతివల్ల పెద్దబ్బాయి నింతవరకూ ముదరబెట్టిన వాడవు నువ్వు కనక, నిన్ను గర్హించాలి, ముందు. అతను పాపాత్ము డని బాగాయెరుగుదువు నువ్వు; కాని, ఆప్రజ్ఞ చూసి అతను చెప్పి నట్లల్లా అంగీకరిస్తూవచ్చావు నువ్వు. ఈలోభానికీ, ఈదురాశకీ, ఈకోపతాపాలకూ కారణం అది. నిర్బంధంచేసి యిప్పు డతణ్ణి మళ్లిం చడం యెవరికీ శక్యంకాదు. పరమమూఢు డతను. తనకా తోచదు. పోనీ అంటే, వొకరు చెబితే వినడు. పైగా, బుద్ధికూడా మంచిది కాదు. క్రూరకుంకలు సయం అతనికంటే. కనక, పాండుపుత్రుల కతని చేత రాజ్యభాగం యిప్పించడం సాధ్యం కాని పనే. దీనికంతకూ ఫలం నువ్వే అనుభవిస్తావు. కుటుంబంలో భేదభావాలు పుడుతున్నా యన్న సంగతి ఆదిలో నీకు తెలియదూ? అవి తగ్గించకుండా ఎందు కశ్రద్ధ చేశావూ? నీలోపం అందరికీ వెల్లడి అయిపోయింది. శత్రువులు నిన్ను అతిసులభంగా దెబ్బకొడతా రిప్పుడు. సామోపాయమూ, భేదో పాయమూ ప్రయోగించివుంటే వ్యవహారం సులభంగా చక్కబడివుండు నాదిలో. అది చెయ్యలేకపోయావు నువ్వు. దండోపాయం నడిపించడం నీతరమా యిప్పుడు?" అని నిష్ఠూరా లాడిందామె తనభర్తని.

రాజు తీసుకురమ్మన్నా డనీ, సభకి వచ్చి నీతల్లి కూడా నీకోసం యెదురుచూస్తోం దనీ చెప్పి, విదురుడు, దుర్యోధనుణ్ణి సభకి తీసుకు వచ్చాడు, ఇంతలో. దుర్యోధనుని కళ్లు చింతనిప్పుల్లా వున్నాయి. రోజుకుంటున్నాడు, నడుం విరిగిన తాచులాగ. అయినా, తల్లి యేమి చెబుతుందో విందా మని వచ్చాడు, సభ కతను.

"అబ్బాయీ" అని పిలిచింది గాంధారి. ఆపిలుపులో స్పష్టంగానే కనబడుతోంది, యేవగింపు. ఎలాగయినా, సంధి కతణ్ణి వొప్పిద్దా మని ఆమె ప్రయత్నం.

తనకి తానే శత్రువు మనిషి. ఇది గుర్తించుకో గలిగితేనే బుద్ధి. ఇది గుర్తించుకున్నవాడే మంత్రులనూ అదుపులో పెట్టుకోగలుగుతాడు. శత్రువులనూ జయించుకోగలుగుతాడు. ఇంద్రియాలను జయించి, మంత్రులను అదుపులో వుంచుకుని దోషులను యథోచితంగా దండిస్తూ బాగా ఆలోచించిమరీ పనిచేసే ధీరుణ్ణే సంపదలు వరిస్తాయి. వలకి కన్నాలుంటే చేపలు తప్పించుకుపోతాయి. అలాగే కామమూ క్రోధమూ వున్నవాడికి ప్రజ్ఞానం నశించిపోతుంది.

అనాసక్తుడైనవాని కూడా కామక్రోధాలుంటే స్వర్గద్వారాలు మూసుకుపోతాయి. కామమూ క్రోధమూ, లోభమూ, దంభమూ, దర్పమూ – ఇవి జయించగలవాడు భూమండలం అంతా ఏలుకోగలుగుతాడు. ధర్మార్థాలు కావాలనుకునేవాడూ, శత్రువులను జయించాలనుకునేవాడూ ఇంద్రియాలను అదుపులో పెట్టుకోవాలెప్పుడూ. కామంవల్లా, క్రోధంవల్లా శత్రువులనూ మిత్రులనూ కూడా యథోచితంగా నడిపించుకోలేనివాడికి సహాయంచెయ్యరెవరూ.

నాయనా, పాండుపుత్రు లయిదుగురూ వొక్కమాటమీద వుంటున్నారు. చాలా ప్రాజ్ఞులు వారు. శూరులు. శత్రుంజయులు. వారితో నువ్వు కలిసిమెలిసివుంటేనే రాజ్యం దక్కుతుంది నీకు. భీష్ముడూ ద్రోణుడూ చెప్పినట్టు కృష్ణుడూ అర్జునుడూ అజేయులు. ఎవరూ వారి నోడించలేరు. ఇది నిశ్చయం. కనక, కృష్ణుణ్ణే ఆశ్రయించుకో. అనుగ్రహం వచ్చిందా, నీకూ పాండుపుత్రులకూ గూడా సకలసుఖాలూ కలిగించగల డతను సమంగా.

మిత్రులూ, సంపత్కాములూ, ప్రాజ్ఞులూ, విద్వాంసులూ అయినవారి మాట తిరస్కరించేవాడు, శత్రువుల కానందం కలిగించేవాడయిపోతాడు. నాయనా, యుద్ధంలో క్షేమం లేదు. ధర్మార్థాలున్నా

"నీకోమాట చెబుతున్నాను. నీ సంగతికీ సంబంధించే చెబుతున్నాను. నీకిది విదురుడు నీకది చాలా చెప్పివుంటాడు. నీ తండ్రి నీకు చాలా చెప్పివున్నాడు. భీష్ముడూ, ద్రోణుడూ, విదురుడూ, కృపుడూ కూడా చెప్పివున్నారు దీనిగురించే. వాళ్ళన్నా, నీకు మేలుకోరేవాళ్ళ రందరూ. నువ్వు నీకున్న పాండవులతో సంధిచేసుకొంటేనే, భీష్మున్నీ, నీతండ్రినీ, నన్నూ, ద్రోణాచార్యులనూ కూడా పూజించినట్లవుతుంది. నాయనా, తన యిష్టం వచ్చినట్టుగా రాజ్యం సంపాదించడానికీ, పాలించడానికీ, అనుభవించడానికీ కూడా ఎవడికీ సాధ్యం కాదు. ఇంద్రియాలను జయించుకోలేనివాడు ఎంతోకాలం రాజ్యం పాలించ లేడు. రాజ్యం పాలించడానికి సహజంగా మేధావి అయి వుండాలి. అన్నిటికీ ఇంద్రియాలను నిగ్రహించుకొని వుండాలి. వాడే రాజు కాదగినవాడు.

కామమూ, క్రోధమూ — మనిషిని అయినా వాడినీ నిల్వా గురిపెట్టేందుకు ఆగర్భశత్రువులు. వీటినంతటినీ చేరనివ్వని వాడికే యివి. వీటిని జయించుకున్న రాజే భూమండలం అంతా పరిపాలించగలుగుతాడు. రాజ్యాధికారం అంటే యేమనుకున్నావో లోకులందరిమీదా పెత్తనం చెయ్యడానికి అనుమతి. చాలాగొప్పదది. దురాత్ముల కది లభ్యమూ కాదు, అయితే, నిలవనూ నిలవదు. అది జారిపోకుండా చూసుకోడం చాలా కష్టం.

ధర్మార్థాలు తప్పగూడ దనుకునే వాడూ, ఘనత కావా లనుకునే వాడూ ఇంద్రియాలను లోబరుచుకుని వుండాలి, మొదట. కట్టెలు వేస్తే అగ్ని ప్రజ్వలిస్తుంది. ఇంద్రియాలు స్వాధీనం అయితే, బుద్ధి వికసిస్తుంది. సారథి యేమో చేతగానివాడు. దీనికి సాయం, గుర్రాలు బహూపెంకెవి. ఇక చెప్పాలా ఆపాడభ్యం? అగుర్రాలవంటి విం(ద్రియాలు. ఓపట్టాన లొంగవు. నాశనంకూడా చెయ్యగల వవి. తనని తాను జయించుకో లేని రాజు, మంత్రులను అదుపులో పెట్టుకో లేడు. శత్రువుల నంతకం టే లొంగతియ్యలేడు. పైపెచ్చు నాశనం అయిపోతాడు, తానే.

తనకి తానే శత్రువు మనిషి. ఇది గుర్తించుకో గలిగితేనే బుద్ధి. ఇది గుర్తించుకున్నవాడే మంత్రులనూ అదుపులో పెట్టుకోగలుగుతాడు. శత్రువులనూ జయించుకోగలుగుతాడు. ఇంద్రియాలను జయించి, మంత్రులను అదుపులో వుంచుకుని దోషులను యథోచితంగా దండిస్తూ బాగా ఆలోచించిమరీ పనిచేసే ధీరుణ్ణే సంపదలు వరిస్తాయి. వలకి కన్నాలుంటే చేపలు తప్పించుకుపోతాయి. అలాగే కామమూ క్రోధమూ వున్నవాడికి ప్రజ్ఞానం నశించిపోతుంది.

అనాసక్తుడైనవాని కూడా కామక్రోధా లుంటే స్వర్గద్వారాలు మూసుకుపోతాయి. కామమూ క్రోధమూ, లోభమూ, దంభమూ, దర్పమూ — ఇవి జయించగలవాడు భూమండలం అంతా ఏలుకోగలుగుతాడు. ధర్మార్థాలు కావా లనుకునేవాడూ, శత్రువులను జయించా లనుకునేవాడూ ఇంద్రియాలను అదుపులో పెట్టుకోవాలెప్పుడూ. కామంవల్లా, క్రోధంవల్లా శత్రువులనూ మిత్రులనూ కూడా యథోచితంగా నడిపించుకో లేనివాడికి సహాయంచెయ్య రెవరూ.

నాయనా, పాండుపుత్రు లయిదుగురూ వొక్కమాటమీద వుంటున్నారు. చాలా ప్రాజ్ఞులు వారు. శూరులు. శత్రుంజయులు. వారితో నువ్వు కలిసిమెలిసివుంటేనే రాజ్యం దక్కుతుంది నీకు. భీష్ముడూ ద్రోణుడూ చెప్పినట్టు కృష్ణుడూ అర్జునుడూ అజేయులు. ఎవరూ వారి నోడించలేరు. ఇది నిశ్చయం. కనక, కృష్ణుణ్ణి ఆశ్రయించుకో. అనుగ్రహించాడా, నీకూ పాండుపుత్రులకూ గూడా సకలసుఖాలూ కలిగించగల డతను సమంగా.

మిత్రులూ, సంపత్కాములూ, ప్రాజ్ఞులూ, విద్వాంసులూ అయినవారి మాట తిరస్కరించేవాడు, శత్రువుల కానందం కలిగించేవా డయిపోతాడు. నాయనా, యుద్ధంలో క్షేమం లేదు. ధర్మార్థాలున్నా

"నీకో మాట చెబుతున్నాన్నేను. నీవారి కందరికీ హితంకోరి చెబుతున్నాను. నిజేవిమీద నీకిది చాలా వుపకరిస్తుంది. నీతండ్రి నీకు చాలా చెప్పివున్నాడు. భీష్ముడూ, ద్రోణుడూ, విదురుడూ, కృపుడూ కూడా చెప్పివున్నారలాగే. వారున్నూ నీకు హితం కోరుతున్నా రందరూ. నువ్వు కనక పాండవులతో సంధిచేసుకొంటేవా, భీష్ముణ్ణీ, నీతండ్రినీ, నన్నూ, ద్రోణాదులనూ కూడా పూజించినట్టే అవుతుంది. నాయనా, తన యిష్టంవచ్చినట్లా రాజ్యం సంపాదించడానికీ, పాలించ డానికీ, అనుభవించడానికీ కూడా ఎవడికీ సాధ్యం కాదు. ఇంద్రియాలను జయించుకోలేనివా డెంతోకాలం రాజ్యం పాలించ లేడు. రాజ్యం పాలించడానికి సహజంగా మేధావి అయి వుండాలి. ఆపైని ఇంద్రియా లను నిగ్రహించుకుని వుండాలి. వాడే రాజు కాతగినవాడు.

కామమూ, క్రోధమూ — మనిషి అయినవాడి కల్లా యివిరెండూ ఆగర్భశత్రువులు. సిరిసంపదలు చేరనివ్వ వెవరికీ యివి. వీటిని జయించు కున్న రాజే భూమండలం అంతా యేలగలుగుతాడు. రాజ్యాధికారం అంటే యేమనుకున్నావో లోకులందరిమీదా పెత్తనం చెయ్యడానికి అనుమతి. చాలాగొప్పదది. దురాత్ములకది లభ్యమూ కాదు, అయితే, నిలవనూ నిలవదు. అది జారిపోకుండా చూసుకోడం చాలా కష్టం.

ధర్మార్థాలు తప్పకూడదనుకునేవాడూ, ఘనత కావా లనుకునే వాడూ ఇంద్రియాలను లోబరుచుకుని వుండాలి, మొదట. కట్టెలు వేస్తే అగ్ని ప్రజ్వలిస్తుంది. ఇంద్రియాలు స్వాధీనం అయితే, బుద్ధి వికసిస్తుంది. సారథి యేమో చేతగానివాడు. దీనికి సాయం, గుర్రాలు బహూ పెంకెవి. ఇక చెప్పాలా ఆసౌడభ్యం? ఆగుర్రాలవంటి వింద్రియాలు. ఓపట్టాన లొంగవు. నాశనంకూడా చెయ్యగలవవి. తనని తాను జయిం చుకో లేని రాజు, మంత్రులను అదుపులో పెట్టుకో లేడు. శత్రువుల నంతకంటే లొంగతియ్యలేడు. పైపెచ్చు నాశనం అయిపోతాడు, తానే.

తనకి తానే శత్రువు మనిషి. ఇది గుర్తించుకో గలిగితేనే బుద్ధి. ఇది గుర్తించుకున్నవాడే మంత్రులనూ అదుపులో పెట్టుకోగలుగుతాడు. శత్రువులనూ జయించుకోగలుగుతాడు. ఇంద్రియాలను జయించి, మంత్రులను అదుపులో వుంచుకుని దోషులను యథోచితంగా దండిస్తూ బాగా ఆలోచించిమరీ పనిచేసే ధీరుణ్ణే సంపదలు వరిస్తాయి. వలకి కన్నాలుంటే చేపలు తప్పించుకుపోతాయి. అలాగే కామమూ క్రోధమూ వున్నవాడికి ప్రజ్ఞానం నశించిపోతుంది.

అనాసక్తుడైనవాని కూడా కామక్రోధా లుంటే స్వర్గద్వారాలు మూసుకుపోతాయి. కామమూ క్రోధమూ, లోభమూ, దంభమూ, దర్పమూ – ఇవి జయించగలవాడు భూమండలం అంతా ఏలుకోగలుగుతాడు. ధర్మార్థాలు కావా లనుకునేవాడూ, శత్రువులను జయించా లనుకునేవాడూ ఇంద్రియాలను అదుపులోపెట్టుకోవాలెప్పుడూ. కామం వల్లా, క్రోధంవల్లా శత్రువులనూ మిత్రులనూ కూడా యథోచితంగా నడిపించుకో లేనివాడికి సహాయంచెయ్య రెవరూ.

నాయనా, పాండుపుత్రు లయిదుగురూ వొక్కమాటమీద వుంటున్నారు. చాలాప్రాజ్ఞులు వారు. శూరులు. శత్రుంజయులు. వారితో నువ్వు కలిసిమెలిసివుంటేనే రాజ్యం తక్కుతుంది నీకు. భీష్ముడూ ద్రోణుడూ చెప్పినట్టు కృష్ణుడూ అర్జునుడూ అజేయులు. ఎవరూ వారి నోడించలేరు. ఇది నిశ్చయం. కనక, కృష్ణుణ్ణి ఆశ్రయించుకో. అనుగ్రహంవచ్చిందా, నీకూ పాండుపుత్రులకూ గూడా సకలసుఖాలూ కలిగించగల డతను సమంగా.

మిత్రులూ, సంపత్కాములూ, ప్రాజ్ఞులూ, విద్వాంసులూ అయినవారి మాట తిరస్కరించేవాడు, శత్రువుల కానందం కలిగించేవా డయిపోతాడు. నాయనా, యుద్ధంలో క్షేమం లేదు. ధర్మార్థాలున్నా

లేవు. ఇక సుఖం యెలా వుంటుందీ? కాక, — విజయమున్నూ యే వొకరికీ నిశ్చయం కాదు. కనక, యుద్ధంమాట మరిచిపో.

భీష్ముడూ, నీతండ్రీ బాహ్లీకుడూ, మీలో మీకు భేదభావాలు కలిగిపోతాయన్న భయంతో పాండుపుత్రులకు రాజ్యభాగం యిచ్చారు, వెనకటికి. దాని ఫలమే నువ్విప్పు డనుభవిస్తున్నావు. కనక, పాండు పుత్రులకు నువ్వున్నూ యెంతో కొంత రాజ్యభాగం ఇయ్యి. నీకూ నీమంత్రులకూ గూడా రాజ్యం ఏలుకోవా లన్న ఆశవుందా? అయితే, సగం రాజ్యమే ఇచ్చెయ్యి వారికి. నువ్వూ నీవాళ్లూ సుఖంగా బతకా లంటే, ఉన్న దాన్లో సగం రాజ్యం చాలు నీకు. పైగా, మిత్రులమాట విన్న వాడవున్నూ అవుతావు కూడా.

ఒక్కమాట చెబుతాను, బాగా జ్ఞాపకం పెట్టుకో. పాండుపుత్రులు అదృష్టవంతులు. ఆత్మజ్ఞానంగలవారు. బుద్ధిమంతులు. ఇంద్రియాలు జయించుకున్న వారు. వారితో యుద్ధం పెట్టుకుంటివా, అన్ని విధాలా భ్రష్టం అయిపోతావు నువ్వు. పాండుపుత్రులకు మొదుగా సగం రాజ్యం ఇచ్చెయ్యి. తన్మూలంగా మిత్రులకోపం చల్లార్చుకో. తరవాత నీరాజ్య భాగం నువ్వేలుకో లక్షణంగా.

పాండుపుత్రులను పదమూడేళ్లు చాలా బాధపెట్టావు వంచించి. కామ క్రోధాలవల్లఆపగ బాగా పెరిగిపోయింది. అది చల్లార్చుకో. కర్ణుడూ, దుశ్శాసనుడూ నీకోసమే అనుకో — పాండుపుత్రుల అర్ధరాజ్యమూ హరించా లని చూస్తున్నారు. అది సాధ్యం కా దెన్నటికీ.

భీష్ముడూ, ద్రోణుడూ, కృపుడూ, కర్ణుడూ, భీమసేనుడూ, అర్జునుడూ, ధృష్టద్యుమ్నుడూ — వీరు శాంతంగా వుండినంతవరకే యెవరు కిలకిల్లాడినా. వారు కళ్లెర్రజేశారా, లోకానికి లోకమే బుగ్గి అయిపో తుంది. క్రోధం పెంచుకుని నువ్వు కౌరవులకు నాశనం తెచ్చిపెట్టకు. ఈభూమండలం అంతా నీవొక్కడికోసమూ బుగ్గి అయిపోడం మంచిది

కాదు. భీష్ముడూ, ద్రోణుడూ, కృపుడూ, తక్కినవారూ నీకోసం యుద్ధంచేస్తా రనుకుంటున్నావు నువ్వు. అదెన్నటికీ జరగదు.

ఆత్మజ్ఞానసంపన్ను లైన భీష్మాదులకు, రాజ్యమూ, ప్రీతీ, ఉనికీ — వీటి సందర్భంలో పాండవు లన్నానువ్వన్నా వొకటే. పాండవులదగ్గిర ధర్మం విశేషం. అందువల్ల వారి యెక్కువ స్పష్టంగా కనపడుతోంది. భీష్మాదులు నీఅన్నం తింటున్నా రిప్పుడు. కనక, నీకోసం యుద్ధం చేస్తే చేస్తా రనుకోవారు. ప్రాణాలున్నా నీకోసం విడిచిపెట్టేస్తా రనే అనుకో; కాని యుధిష్ఠిరుణ్ణిమాత్రం తేరి చూడలే రెప్పటికీ. కాక, లోభంతో యెవడూ సిరిసంపదలు గడించుకోలేడు. కనక, యీపాటికి లోభం తగ్గించుకో. పాండుపుత్రులతో సంధిచేసుకో.”

# 130

తల్లిమాట కూడా లక్ష్యపెట్టలేదు దుర్యోధనుడు. వెనకటిలాగే మండి పడుతూ మళ్ళీ సభ విడిచి వెళ్ళిపోయా డతను, తన అమాత్యు లున్న చోటికి. అక్కడ, దుశ్శాసనుడూ, కర్ణుడూ, శకునీ యెదురుచూస్తూ కూచున్నా రతనికోసం. వారు నలుగురూ చేసిన ఆలోచన యిది.

“ధృతరాష్ట్రునితోనూ భీష్మునితోనూ కలిసి ముందుగా మనల్ని నలుగురినీ బంధించతలిచిన ట్టుంది. కనక, ఇంద్రుడు బలిచక్రవర్తినిచెరపట్టి నట్టు అంతకిముందు మనమే కృష్ణుణ్ణి బంధించేద్దాం. దీంతో, పాండవులు కోరలు పెరికిన తాచు లయిపోతారు. వారి కితనే రక్ష. ఇతనే కవచం. సాత్వతుల కందరికీ ప్రముఖుడైన కృష్ణుణ్ణి మనం బంధించేస్తే, సోమకులూ, పాండవులూ కూడా కుక్కిన పేలయిపోతారు. కనక, ధృతరాష్ట్రుడు చూస్తూవుండగా, మొత్తుకుంటూనూ వుండగా యీపని చేసేద్దాం. తరవాత, క్షణంలో నాశనం చెయ్యవచ్చు, శత్రువుల నందరినీ.”

ఇది కనిపెట్టేశాడు సాత్యకి. మంచి పండితు డతను. శకిస్న్లి. పరేం గితజ్ఞానమ్లో అంతటివాడు మరొకడు లేడు. వెంటనే బయటికి వెళ్ళిపోయి హార్ధిక్యునితో ఆలోచించా డతను. సైన్యం అంతా కూడగట్టించి సభా ద్వారంలో వుంచు. ఇదంతా నేను కృష్ణునితో చెబుతాను" అని కృతవర్మకు చెబుతూనే కృష్ణుని దగ్గిరికి వెళ్ళిపోయా డతను.

సంగతి అంతా కృష్ణునకు చెప్పేశాడు. తరవాత ధృతరాష్ట్రుణ్ణీ విదురుణ్ణీ పిలిచి "ధర్మానికీ, కామానికీ, అర్థానికీ దూరం అయిన పని చెయ్యతలుచుకున్నారు మీ వాళ్ళు; కాని చెయ్యలేరు లెండి. కామక్రోధా లకు లోబడిపోయి వున్నారు వారు. పరమమూఢులు. పాపాత్ములు. దీర్ఘ క్రోధులూ, లోభులున్నూ. వారీపని చెయ్యాలనుకోడం, పిల్లకాయలు బట్టతో నిప్పు మూటకట్టతలచిన ట్టుంది" అని చెప్పేశాడు.

ఇది విని విదురుడు "రాజేంద్రా, నీకొడుకులకు కాలం మూడింది. అపకీర్తికర మైన పని తలపెట్టారు వారు. వారీపని చెయ్యలేరనుకో. అయినా, కృష్ణుణ్ణి బంధించేద్దా మని చూస్తున్నారు. అగ్గిలో పడ్డ మిడత లేమయిపోతాయి? అలాగే అయిపోతారు కృష్ణుణ్ణి ముట్టుకుంటే! నీవాళ్ళు. తలుచుకున్నా డంటే యీ కృష్ణుడు నీవాళ్ళనందరినీ నిమిషంలో యమ లోకానికి పంపగలడు. ధర్మం తప్పిన పని చెయ్య డితను. ఇలాంటి నీచకార్యం తలపెట్టనే తలపెట్ట డితను" అన్నాడు ధృతరాష్ట్రునితో.

"రాజేంద్రా" అని పిలిచాడు కృష్ణుడు. "నీకొడుకులు నన్ను బంధించడానికి వచ్చారంటే వారిచేతిలో నేనో, నాచేతిలో వారో కడ తేరవలసిందే, మరోవిధంగా జరగదు. నిమిషంలో వారి పనిచెయ్య గలన్నేను. కాని ఇది మిక్కిలీ నీచం. కనక, నేనిది చెయ్యను. పాండు పుత్రుల ఐశ్వర్యం అంతా వేసుకుందా మని చూస్తున్నారు నీవాళ్ళు. కాని తమదే వారికి అర్పించబోతున్నారు. ఇదే మీవాళ్ళ నిశ్చయం అయితే, యుధిష్ఠిరుడు కృతకృత్యుడయిపోయా డన్నమాటే. ఈపూ

ణంలో పట్టిస్తా న్నేను. నీకొడుకులనూ వారి అనుచరులనూ పట్టి పాండవుల కప్పగించేస్తాను కూడా; కాని నీయెదట చెయ్యవలసింది కాదిది. దుర్యోధను డేది కావా లనుకుంటే అదే చెయ్యనీ. నేను మాత్రం చూస్తూ వూరుకుంటా" నన్నాడు తాను కూడా.

"మహాపాపి, ఆదుర్యోధను ణ్ణిలా తీసుకురా" అన్నాడు ధృతరాష్ట్రుడు విదురుణ్ణి పిలిచి. "రాజ్యలోభం మహాపట్టుకుం దతనికి. అతనిమిత్రులనూ, అమాత్యులనూ, సోదరులనూ, అనుచరులనూ కూడా వెంటబెట్టుకురా, మళ్లీ వొకమాటు మందలించవచ్చు" అనిన్నీ చెప్పా డతను.

"నువ్వు పరమక్రూరుడవు. పాపాల్లో మునిగిపోయి వున్నావు. నీచప్పనులకు సిద్ధపడేవాళ్లు మాత్రమే నీకు చేదోడు. వాళ్లతో కలిసి దారుణ మైన పాపం మూటగట్టుకోడానికే చూస్తున్నావు. నువ్వు తలపెట్టినపని చెయ్యడం నీతరం కాదు. చేసినా మానినా నీకపకీర్తి కట్టిపెడుతుం దది. ఎవరైనా వింటే ఛీ అంటారు నిన్ను. నీవంటి కులపాంసనుడు తప్ప మరెవడూ తలపెట్టనైనా తలపెట్ట డలాటిపని. కృష్ణుణ్ణి బంధించడాని కాలోచిస్తున్నావు కాదూ నువ్వు? దేవతలు కూడా అత ణ్ణేమీ చెయ్యలేరు తెలుసా? చంద్రుణ్ణి తన చేతికిమ్మనే కుర్రనాగమ్మలా ప్రవర్తిస్తున్నావు నువ్వు. దేవతలూ, గంధర్వులూ, మనుష్యులూ, అసురులూ, నాగులూ — వీరు ఎవరూ నిలవలేరు కృష్ణుణ్ణెదిరించి. గాలిని చేత్తో పట్టలేము. చంద్రుణ్ణిఅందుకోలేము. నెత్తిమీద పెట్టుకుని మొయ్యలే మీభూమి. అలాగే కృష్ణు ణ్ణెవరూ పట్టలేరు. బుద్ధికలిగి మసులుకో" అంటూ బాగా మందలించా డతనుకొడుకుని.

విదురుడు కూడా అందుకున్నాడు వెంటనే. "వెనకటికి, ద్వివిదుడనే వానరుడు సౌంభద్వారంలో ఈకృష్ణుణ్ణి పట్టుకుందా మని చాలా చూశాడు. రాళ్లతో ముంచెత్తాడు కూడా; కాని చివరి కేమీ చెయ్యలేకపోయాడు. ఆపని మళ్లీ యిన్నాళ్లకి నువ్వు చేద్దా మని చూస్తు

న్నావు. అర్థం అవుతోందా? ప్రాగ్జ్యోతిషనగరంలో నరకాసురు డున్నూ యిలాగే ప్రయత్నించాడు; కాని లాభం లేకపోయింది. అంత కంటే ఘనుడవు నువ్వు మరి. నరకుణ్ణి చంపడమే కాదు, వాడు చెర పట్టివున్న వేలకొద్దీ కన్యల నితను పెళ్లిచేసుకున్నాడు విడిపించి.

నిర్మోచనం అన్న నగరంలో ఆరువేలమంది దానవు లెదిరించా రితణ్ణి. ఏమీ చెయ్యలేకపోయారు చివరికి. వాళ్లని మించినవాడవు కామోసు నువ్వు. పూతనను చంపేశాడితను. గోవులను రక్షించ డానికి గోవర్ధనపర్వతం ఎత్తేశాడు. అరిష్టుడూ, ధేనుకుడూ, చాణూ రుడూ, అశ్వరాజూ, కంసుడూ నాశనం అయిపోయా రితని చేతిలో, యేదో చెయ్యబోయి. జరాసంధుడూ, దంతవక్త్రుడూ, శిశుపాలుడూ, బాణాసురుడూ, ఎందరో రాజులూ నామరూపా ల్లేకుండా పోయా రితని చేతిలో. పారిజాతాపహరణం సందర్భంలో వరుణుడూ, అగ్నీ, ఇంద్రుడూ కూడా కీచుమన్నా రితనిచేతిలో. మధుకైటభులను సంహ రించా డేకార్ణవంలో. జన్మాంతరం పొందివచ్చి హయగ్రీవుడున్నూ చచ్చిపోయా డితనిచేతిలో. సకలానికీ యితనే కర్త. చెయ్యనక్కరలే దేది తలుచుకుంటే యిత నది అయిపోతుంది. ఇత నంటే యేమిటో అర్థం చేసుకోలేకుండా వున్నావు నువ్వు. పట్టుకుందామని చూస్తు న్నావు, వద్దు, నువ్వేకాదు, నీవాళ్లతో కూడా అగ్గిలో పడ్డ మిడతలా బుగ్గి అయిపోతావు, జాగ్రత్త" అని అతనుకూడా చాలా గట్టిగా మందలించాడు.

## 131
## విశ్వరూపసందర్శనం

విదురుడు ముగించాడు, కృష్ణు డందుకున్నాడు.

"దుర్యోధనా! నే నొక్కణ్ణే అనుకుంటున్నావు నువ్వు. నన్ను పరాభవిద్దా మనుకుంటున్నావు. బంధిచేద్దామనికూడా చూస్తున్నావు;

కాని నాతోపాటు పాండవులయిదుగురూ యిక్కడేవున్నారు, తెలుసా అంధకులూ, కృష్ణులూ, ఆదిత్యులూ, రుద్రులూ, వసువులూ, మహర్షులూ కూడా వున్నారిక్కడ తెలుసా?" అంటూ వికటంగా వొక్క నవ్వు నవ్వాడతను. ప్రళయకాలపు మేఘం వురిమినట్టుందానవ్వు. వెంటనే అతని శరీరం అంతటా, అంగుష్ఠమాత్రులైన ముక్కోటిదేవతలూ పుట్టుకువచ్చారగ్నిజ్వాలలు కక్కుతూ.

అతని నొసట బ్రహ్మ, గుండెలమీద రుద్రుడూ, భుజాలమీద లోకపాలకులూ ఆవిర్భవించారు. నోటినుంచి అగ్ని పుట్టుకువచ్చాడు. రెండుచేతుల్లోనూ ఆదిత్యులూ, సాధ్యులూ, వసువులూ, అశ్వినీదేవతలూ, ఇంద్రునితో గూడా దేవతలూ, విశ్వేదేవులూ ఆవిర్భవించారు. యక్షులూ, గంధర్వులూ, రాక్షసులూ ఒక్కరూపాన పుట్టుకువచ్చారు. సంకర్షణుడూ ధనంజయుడూ కూడా పుట్టారు. ముఖ్యంగా, కుడిభుజాన, గాండీవం చేతబట్టి అర్జునుడూ, ఎడమభుజాన, ముసలం చేతబట్టుకుని బలరాముడూ ఆవిర్భవించారు.

ధర్మనందనుడూ, భీమసేనుడూ, నకులసహదేవులూ, వెనకభాగాన పుట్టుకువచ్చారు. అంధకులూ, కృష్ణులూ, ప్రద్యుమ్నాదులూ ముందుభాగాన ఆవిర్భవించారు. శంఖమూ, చక్రమూ, గదా, శక్తీ, శార్ఙ్గమూ, హలమూ, నందకమూ ఆవిర్భవించాయి. అతని చేతులన్నిటిలోనూ రకరకాల ఆయుధాలు తోచాయి.

కళ్లనుంచీ, ముక్కులనుంచీ, చెవులనుంచీ, రోమకూపాలనుంచీ మహాభయంకరమైన పొగా మంటలూ రేగాయి. అప్పుడతను సహస్రకిరణాలతో సూర్యుడన్నట్టున్నాడు. ఆరూపం చూసి బెంబేలుపడిపోయి, రాజులు అందరూ కళ్లు మూసేసుకున్నారు. ద్రోణుడూ, భీష్ముడూ, విదురుడూ, ధృతరాష్ట్రుడూ, సంజయుడూ, మహర్షులూ

మాత్రం చలించకుండా చూశారు. వారికి కృష్ణుడు దివ్యదృష్టి యిచ్చాడు. దాంతో, వారు, శ్రీకృష్ణుని నిజరూపం చూసి ఆశ్చర్య చకితులయిపోయారు. దేవదుందుభులు మోగా యప్పుడు. పూలవాన కురిసింది, ముమ్మరంగా.

అప్పుడు, ధృతరాష్ట్రుడు "కృష్ణా, జగత్తు కంతకూ నువ్వు హితు డవు. కనక, నన్ననుగ్రహించావు. ఇక యీ దృష్టి మాయం చేసెయ్యి. ఏమంటే? నిన్ను చూసిన కళ్లతో నేను మరేమీ చూడలేనిక" అంటూ ప్రార్థించాడు. "సరే" అన్నాడు కృష్ణుడు. చూపు వచ్చి సకలమూ చూస్తున్న ధృతరాష్ట్రుణ్ణి చూసి రాజు లందరూ చాలా ఆశ్చర్యపోయారు. ఆసమయాన భూమి గజగజలాడిపోయింది. అల్ల కల్లోలం అయిపోయాయి సముద్రాలు.

తరవాత, కృష్ణుడు, తన విశ్వరూపం ఉపసంహరించుకున్నాడు. హార్దిక్యుని బుజాన వొకచెయ్యీ, సాత్యకి బుజాన వొకచెయ్యీ వేసి వెంటనే బయలుదేరా డతను. అంతకి ముందే మహర్షుల సెలవు పుచ్చు కున్నా డతను. వెంటనే నారదాది మహర్షులందరూ అంతర్ధానం అయి పోయారు. కృష్ణుడు బయలుదేరడం చూసి, కౌరవులూ, రాజులూ ఆవెనకాల బయలుదేరారు.

ఇంతలో కృష్ణునిరథం వచ్చింది. దారుకుడు తోలుకువచ్చా డది. శైబ్యమూ, సుగ్రీవమూ, మేఘపుష్పమూ, బలాహకమూ — ఈనా లుగుగుర్రాలూ పూన్చి తీసుకువచ్చా డతను. రథానికి చకచకని మువ్వలు కట్టారు. రకరకాల పూలదండలు కూర్చారు. అతి తేలికగా వుం డది; కాని బయలుదేరి తే మాత్రం మేఘం ఉరుముతున్న ట్టుంది. కృష్ణుడు కూచోడానికి దానిమీద పులితోలు పరిచారు. చుట్టూ రకరకాల తీవ్రాయుధాలు ధరించిన యోధులు నిలబడివున్నారు. ఇంతలో హార్ది క్యుడూ కృతవర్మా కూడా తమ రథాలతో వచ్చారు.

కృష్ణుడు రథం యెక్కాడు. ఇక బయలుదేరుతుం దది. "కృష్ణా" అంటూ ముందుకి వచ్చాడు ధృతరాష్ట్రుడు. "మహానుభావా, నాకొడు కులమీద నాకెలాంటి పెత్తనం వుందో కళ్లారా చూశావు నువ్వు. నాదగ్గిర దాపరికం యేమీ లేదు. నీకే తెలుసు నది. నేను కౌరవులు శాంతంగా బతకా లని కోరుకుంటున్నాను. అందుకోసం ప్రయత్నిస్తు న్నాను. ఇదీ నీకు తెలుసు. నువ్వు నన్ను నుమానించవద్దు. పాండవుల విషయమై లేశమూ దుశ్చింత లేదు నాకు. దుర్యోధనునకు నేను హిత బోధ చెయ్యడమూ నువ్వు చూశావు. కౌరవులూ, ఈరాజులూ కూడా నేను సంధికోసమే ప్రయత్నిస్తున్నట్టు గుర్తించేవున్నారు" అని చెప్పాడు.

ధృతరాష్ట్రుణ్ణీ, భీష్ముణ్ణీ, ద్రోణుణ్ణీ, విదురుణ్ణీ, బాహ్లీకుణ్ణీ, కృపుణ్ణీ పిలిచి "ఈకురుసభలో జరిగిం దంతా మీరు చూసేవున్నారు. దుర్యో ధనుడు రోషంతో సభ విడిచి వెళ్లి పోయాడు. ధృతరాష్ట్రుడు తన కేమీ పెత్తనం లేదంటున్నాడు. ఇంకెందుకూ? మీరందరూ నాకు సెలవి వ్వండి" అనడిగాడు కృష్ణుడు.

రథం బయిలుదేరింది. ఆయుధపాణు లైన యోధులు కదిలారు. భీష్ముడూ, ద్రోణుడూ, విదురుడూ, ధృతరాష్ట్రుడూ, బాహ్లీకుడూ, అశ్వత్థామా, వికర్ణుడూ, యుయుత్సుడూ కొంతదూరం సాగనంపి వెనక్కి మళ్లారు. కౌరవు లందరూ చూస్తూనే వున్నారు, కృష్ణుడు కుంతియింటికి వెళ్లాడు.

## 132

## కుంతి సందేశం

కృష్ణుడు, ముందు పాదాభివందనం చేసి, కౌరవసభలో జరిగిం దంతా చెప్పాడు కుంతికి.

"అత్తయ్యా, చెప్పవలసిం దంతా చెప్పాను. సాధారణంగా చెప్పాను. వారు తప్పకుండా అంగీకరించవలసిన విధంగానే చెప్పాను. నేనేకాదు, మహర్షులు కూడా చెప్పారు, బహువిధాల; కాని దుర్యోధనుడు ససేమిరా అన్నాడు; కాని సంధి కంగీకరించ లేదు. దుర్యోధనునకూ అతని అనుయాయులకూ కాలంమూడింది. సందేహం లేదు. ఇక నేను సోదరుల దగ్గిరికి వెళ్ళాలి. మరి వారి కేమి చెబుతావో చెప్పి నన్ను పంపించెయ్యి" అని కోరా డామెని చివరి కతను.

"నాయనా, పెద్దబ్బాయితో నేనిలా చెప్పా నని చెప్పు" అంది కుంతి. "ప్రజల నేలవలసిన ధర్మం నీది. అది వెనకబడిపోతోంది. అదలా కానివ్వకు. అర్థజ్ఞానం లేని శ్రోత్రియుని బుద్ధి, వేదపఠనంలో, పదమూ, క్రమమూ, జటా, ఘనా, వల్లించడంతో నాశనం అయిపోయి ధర్మంకోసం మాత్రమే చూస్తుంది. అది తెలుసుకో లేదు. ఆచరించనూ లేదు. అలా వుంది నీస్థితి. నాయనా, బ్రహ్మదేవుని వుద్దేశం యేమిటో బాగా గుర్తించుకో. బాహువుల్లోనుంచి పుట్టారు క్షత్రియులు. బాహుబలంతోనే వారు తమ బతుకుదెరువు కల్పించుకోవాలి. అగత్యం అయితే క్రూరంగా ప్రవర్తించడానికీ, జనుల నేలడానికీ సృష్టి అయింది క్షత్రియవర్ణం. ఇక్కడ, పెద్దలు చెప్పిన ఉదాహరణ వొకటుంది, చెబుతా విను.

ముచుకుందు డని వొక రాజర్షి. చాలా గొప్పవా డతను. కుబేరుడు ఈభూమండలం అంతా అతని కిచ్చాడు, మిక్కిలీ ప్రీతితో; కాని "నాకక్కర్లేదే" దన్నాడు ముచుకుందుడు. "నా బాహుబలంతో సంపాదించుకున్నది తప్ప వొకరిచ్చింది నేను పుచ్చుకో" నన్నాడతను. అందుకు చాలా వింతపడ్డాడు కుబేరుడు. తరవాత, ముచుకుందుడు తన బాహుబలం చూపించి గొప్పరాజ్యం సంపాదించుకుని సకల భోగభాగ్యాలూ అనుభవించాడు.

ప్రజలు ధర్మంగా ప్రవర్తిస్తే, దాల్లో నాలుగోవంతు రాజుకి ముట్టుతుంది. రాజే ధర్మంగా ప్రవర్తిస్తే దేవత్వమే సిద్ధిస్తుం దతనికి. అతనధర్మంగా ప్రవర్తిస్తేమాత్రం నరకానికి పోతాడు.

నాలుగువర్ణాలవాళ్ళూ ధర్మంగా నడుచుకోవా లంటే, రాజైనవాడు, దండనీతి అవలంబించాలి, తప్పదు. అప్పుడే జనుల్లో అధర్మం అనేది లేకుండాపోతుంది. రాజు యథోచితంగా దండనీతి ప్రయోగించాడా, కృతయుగమే నడుస్తుం దక్కడ. అయితే, కాలానికి రాజు కారణమా, రాజుకి కాలం కారణమా అనే చర్చవద్దు నీకు. రాజే కాలాని క్కారణం. కృతయుగం నడవా లన్నా, త్రేతాయుగం నడవా లన్నా, ద్వాపరయుగం నడవా లన్నా, కలియుగం నడవా లన్నా దాని కంతకూ రాజే మూలం.

కృతయుగధర్మాలు నడిపించే రాజు, స్వర్గసుఖా లన్నీ అనుభవిస్తాడు, శాశ్వతంగా. త్రేతాయుగధర్మాలు నడిపిస్తే అంతకు తక్కువకాలం స్వర్గసుఖా లనుభవిస్తాడు. ద్వాపరయుగధర్మాలు నడిపించే రాజు బహూ తక్కువ స్వర్గసుఖా లనుభవిస్తాడు. కలియుగధర్మాలు నడిపించాడా. శాశ్వతంగా నరకంలో పడివుంటాడు. నకలయాతనలూ అనుభవిస్తాడు.

జగత్తు చేసిన పుణ్యాపాపాలు రాజుకీ, రాజు చేసిన పుణ్యా పాపాలు జగత్తుకీ సంక్రమిస్తాయి. నీతండ్రితాత లెలాంటి ధర్మపాలనచేశారో బాగా పరిశీలించుకో. ఇప్పుడు నువ్వున్న స్థితిమాత్రం రాజర్షు లయిన వారి కుచితమైనది కాదు. బుద్ధిచెరుచుకుని దుష్పరిపాలన చేసే రాజు రాజ్యపాలనంవల్ల పొందవలసిన సత్ఫలితా లనుభవించలేడు. నిన్నిలా వుండమని ఆశీర్వదించ లేదు నేనెప్పుడూ. నీతండ్రీ, నీతాతా, ఇంకా పూర్వులూ కూడా ఇలా వుండమని ఆశీర్వదించివుండ లేదు. నువ్వు యజ్ఞయాగాలూ, దానధర్మాలూ, జపతపాలూ చేసుకుంటూ వుండేటట్టూ, శౌర్యమూ ప్రజ్ఞా కనపరుస్తూ రాజ్యం ఏలుకునేటట్టూ

సంతానం కని ఘనతవహించేటట్టూ, బలసూ ఓజసూ నీకు కలిగే టట్టూ మాత్రమే నాఆశీర్వచనం. మనుష్యులూ దేవతలూ కూడా, నిత్యమూ నువ్వు శ్రద్ధగా పూజిస్తే, దీర్ఘాయుస్సూ, ధనధాన్యాలూ, పుత్రపౌత్రాదిసంపత్తీ అనుగ్రహిస్తారు. తల్లిదండ్రులూ దేవతలూ కూడా తమ పుత్రులు, యజ్ఞయాగాలూ, దానధర్మాలూ చేస్తూ వుండా లనీ, బాగా చదువుకోవా లనీ, ధర్మం తప్పకుండా ప్రజల నేలు కోవా లనీ మాత్రమే ఆశిస్తూ వుంటారు.

కృష్ణా, నేను చెప్పింది ధర్మమో అధర్మమో నీకే తెలుసు, కాని నాకొడుకులు గొప్పవంశంలో పుట్టారు. సకలవిద్యలూ నేర్చారు. కాని వృత్తిలేక నానాకష్టాలూ అనుభవిస్తున్నారు. ఆకట సకసకలాడుతున్న ప్రజలను సంతోషపెట్టడంకంటె రాజయినవాడు నిర్వర్తించవలసిన ధర్మం మరేమి వుందీ? ధార్మికుడైన రాజుకి, ప్రజల నేలడంలో, దానధర్మా లతో కొందరినీ, బలపరాక్రమాలు చూపించి కొందరినీ, సత్యమే పలు కుతూ కొందరినీ ఆనందపెట్టడమూ, వారిని తనస్వాధీనంలో వుంచు కోడమూ కంటే ఉత్తమధర్మం మరేమి వుందీ?

యుధిష్ఠిరా, బ్రాహ్మడు భిక్షం యెత్తుకోవాలి. క్షత్రియుడు ప్రజ లను పాలించాలి. వైశ్యుడు డబ్బు సంపాదించాలి. శూద్రుడు ఈమూడు వర్ణాలవారినీ సేవించుకోవాలి. నువ్వు క్షత్రియుడవు. నువ్వు బిచ్చం యెత్తుకోగూడదు. డబ్బు సంపాదించగూడదు. వ్యాపారాలు చెయ్య గూడదు. ఒకరిని సేవించుకోనూ గూడదు. ప్రజలకు ఆపదలు తప్పిం చడమే నీధర్మం. ప్రజలకు భయం లేకుండా చెయ్యడమే నీధర్మం. బాహుబలంతో జీవించడమే నీకులధర్మం. నీపిత్రార్జితం యితరుల భుక్తంలో వుంది, ముందది స్వాధీనపరుచుకో. సామమూ, దానమూ, భేదమూ, దండమూ — ఈనాలుగుపాయాల్లో యెప్పుడేది అగ త్యమో అప్పుడది ప్రయోగించి నీపదవి నువ్వు స్వాధీనపరుచుకో.

నాయనా, మహావీరుడవు నిన్ను కన్న తల్లి న్నేను. పరులపంచలబడి బతకడమా నేను ? నాకూ నీకూ గూడా ఇంతకంటే దుఃఖం మరేం వుందోయి ? కనక, క్షత్రియధర్మం అవలంబించు. యుద్ధం చెయిం తాతతండ్రులను నరకంలో పడెయ్యకు. నీకూ నీతమ్ములకూ పుణ్యా. నశించిపోనివ్వకు ”

# 133

## విదుల కొడుకు

ఈసందర్భంలో మరో వుపాఖ్యానం కూడా చెబుతారు పెద్దలు. “ విదుల ” అని వొక క్షత్రియస్త్రీ. యశస్విని ఆమె. దీనురాలు. చాలా కోపం ఆమెకు. మంచివంశంలో పుట్టింది. దాంతురాలే ; కాని క్షత్రియధర్మాలు విడిచిపెట్టి యెరగదు. చాలా దూరపుచూ పామెది. రాజసభల్లో చాలా పేరుం దామెకి. ఆమె మాట అంటే అందరూ శిరసావహిస్తారు. చాలా చదువుకుం దామె. పట్టాభిషిక్తురాలున్ను.

ఆమె కొడుకు పేరు సంజయుడు. సింధురాజుతో యుద్ధంచేసి, వోడిపోయి, దీనంగా పడుకునివున్నా డతను. విదుల చాలా గట్టిగా గర్హించిం దతణ్ణి, అలా అయినందుకూ, అలా వున్నందుకూను.

“ సంజయా, నేను కన్నానే కాని నాకొడుకువి కావు నువ్వు. శత్రువులకు ఆనందం కలిగిస్తున్నావు నువ్వు, నాకు కాదు. నాకూ పుట్టలేదు, నీతండ్రికీ పుట్టలేదును, వ్వొకట్టణ్ణుంచి వచ్చావో మరి. అభిమానం అంటే యేమిటో యెరుగవు నువ్వు. మనుష్యుల్లో చేర్చతగ్గవాడవున్నా కావు నువ్వు. నీచేతుల్లో శక్తిలేదు. బతికివుండినంతకాలమూ ఇలాగే పడివుంటావు నువ్వు, ఆశ అనేది లేకుండా. లే, నడుం బిగించు, సిరి సంపాదించుకో. నీకు నువ్వే అవమానం చేసుకోకు. భయం విడిచిపెట్టు.

ఓరి కాపురుషా, లే, పడుకోకు. నీ స్థితి చూసి శత్రువులు నవ్వు తున్నారు. అందుకు మిత్రులు దుఃఖిస్తున్నారు. కొద్ది నీరు తగిలితే చాలు, నిండిపోతుంది చిన్న నది. కాస్త రాలిస్తే చాలు, ఎలక చెయ్యి నిండిపోతుంది. కాస్తతో పొంగిపోతాడు కాపురుషుడు. పాముకోరలు నాశిబోయిన కుక్కలాగ చావకు నువ్వు. ప్రాణాలకు తెగించి యుద్ధం చెయ్యి. డేగ ఆకాశాన నిర్భయంగా తిరుగుతుంది, దెబ్బిట్టని కొట్ట డమూం అని చూస్తూ. అలాగే, శత్రువు లోపా లేమిటో తెలుసుకుని ఎలా కొట్టాలో మార్గాలు వెతుక్కో నువ్వు. శవం లాగ పడుకోకు, లే, లే.

వెనకబడకు. మధ్యగా వుండకు. అందరికింద కింబా కూడా వుండకు. ముందు కురుకు. గర్జించు. పరాక్రమించు. ఊక నిప్పులాగ లోపల్లోపల తగలపడ్డం మంచిది కాదు, పొగ రాజుకుంటూ. క్షణమైనా చాలు తిందుకం కొరివిలాగ భగభగ మండుతూ బతకడం. రాజయిన వాడు, సమయాసమయాలు చూసుకుని కాఠిన్యం వహించి క్రూరం గానూ ప్రవర్తించాలి, దయాళువై మృదువుగానూ ప్రవర్తించాలి. మనిషి అయినవాడు యుద్ధరంగంలో తన శక్తికొద్దీ విజృంభించాలి జయమా అపజయమా అన్న ప్రశ్నే లేదక్కడ. తన ధర్మం నిర్వర్తి చుకోడమే ప్రధానం. అలాకాకపోతే, నలుగురూ గర్హిస్తారు.

కోరిక తీరనీ తీరకపోనీ, పండితుడైన వాడు విచారిస్తూ కూచోడు తరవాత ఏమి చెయ్యాలో ఆపని అందుకుంటాడు, నిశ్చలంగా. బతుకే ప్రధానం కాదతనికి. కనక, నువ్వు, పౌరుషం తెచ్చుకుని యుద్ధం చెయ్యి పౌరుషం అయినా చూపించు, సాధ్యం కాకపోతే వీరస్వర్గాని కయినా వెళ్లిపో. నువ్వు నెరవేర్చవలసిన ధర్మం కొట్టవచ్చిన ట్టెవట మహో జ్వాలంగా కనబడుతూ వుండగా జీవచ్ఛవమై పడివుంటావేం?

నువ్విలా పడివుండడంవల్ల, నీపూర్వులు చేసిన దానధర్మాలూ, యజ్ఞయాగాలూ, ఆరామాదిప్రతిష్ఠలూ నిష్ఫలం అయిపోయాయి. కీర్తి నాశనం అయిపోయింది. నీరాజ్యమూ, నీసంపదలూ చెదిరిపో యాయి. అదంతా చూస్తూవుండికూడా జీవచ్ఛవం లాగ పడివున్నావా? శత్రువు పడగొడతాడు. లేకపోతే, కాలికింద తొక్కిపట్టి వుంచుతాడు. అయినా, వాడి పీకపట్టుకుని చప్పున లేవాలి గాని దుఃఖిస్తూ పడి వుండగూడదు.

జాతిగుర్రంలాగ విజృంభించాలి. నీభారం యేదో అది నువ్వే మోసు కోవాలి. నీపౌరుషం నువ్వు తెలుసుకో ముందు. నీసత్తా నువ్వు గమ నించుకో. నీమానాభిమానాలు నువ్వే కాపాడుకో. నీమూలంగానే నీవంశం అపకీర్తిపా లయిపోయింది. మనిషయి పుట్టిన తరవాత, వాడి ప్రజ్ఞా ప్రాభవమూ నలుగురూ చెప్పుకోవాలి. లేకపోతే, జనసంఖ్య పెరగడానికి మాత్రమే వుపయోగిస్తుంది వాడి బతుకు. ఆడదీ అనిపించు కోడు మొగవాడూ అనిపించుకోడు వాడు. మనిషి అయినవాడల్లా, దాత అనో, తపశ్శాలి అనో, సత్యనిరతు డనో, గొప్పపండితు డనో, చివరికి గొప్ప ధనవంతు డనో చెప్పుకోవాలి లోకం. విద్యలోనూ, తప స్సులోనూ, సంపదలోనూ, శౌర్యధైర్యాల్లోనూ, అందరికంటే గొప్పవా డనిపించుకునేవాడే — గొప్పవా డనిపించుకోగలిగినవాడే మనిషి.

నువ్వు బిచ్చగాడి వన్నట్టు బతకడం మంచిది కాదు. అంతకంటే అపకీర్తి కలిగించేది మరేమీ లేదు, రాచపుట్టుక పుట్టినవాడికి. నువ్వు తమ చుట్టాని వని చెప్పుకోడానికి సిగ్గుపడుతున్నారు మన బంధువు లందరూ. అన్నం లేకపోతే మేము చావనైనా చస్తాం. దేశాంతరాలు లేచయినా పోతాం. దరిద్రులం అయినా అయిపోతాం; కాని నిన్నీ స్థితిలో చూస్తూ వూరుకోలేము. తుచ్ఛపుపని చేస్తున్నావు నువ్వు. వంశం నాశనం అయే పని చేస్తున్నావు. సాక్షాత్తూ కలిపురుషుడవు

నువ్వు. నాదురదృష్టంవల్ల కొడుకు కనుకుంటూ నిన్ను కన్నా న్నేను. నీకు మానాభిమానా ల్లేవు. కసి లేదు. ఉత్సాహం లేదు. పౌరుషం అసలే లేదు. ఎంత దరిద్రురాలూ కూడా నీవంటి కొడుకుని కనకూ డదు. పచ్చికర్రలాగ రవిలిపోతూ పడివుండి యేమి లాభం నువ్వు? లే, పరాక్రమం చూపించు. శత్రువు నెదిరించి నిలు. ఒక్క ముహూర్తం — ఒక్క క్షణం అయినా నీశత్రువు శిరస్సున నీకాలుపెట్టు, చాలు. మగ వాడ వయినందుకిదే నిదర్శనం. ఇలాంటప్పుడు క్రోధం విడిచిపెట్టగూ డదు, క్షమించనూ గూడదు.

క్రోధం లేనివాడూ, క్షమ గలవాడూ మొగవాడూ కాడు, ఆడదీ కాదు. ఇటు సంతోషమూ, అటు దుఃఖమూ కూడా సిరిసంపదలు నాశనంచేస్తాయి. భయపడిపోయీ, కసిపెంచుకుని ముందు కురక లేకా ఆశలు తెంచుకునేవా డెప్పుడూ పైకి రాలేడు. పరాభవం కడిగేసుకో. నువ్వు నువ్వయి నిలబడు. గుండెలు రాయిచేసుకో. నీరాజ్యం నువ్వా క్రమించుకో. శత్రువులను సహించనివాడే పురుషు డనిపించుకుంటాడు. ఆడదానిలాగ బతికేవాణ్ణి గడ్డిపరక అన్నట్టు చూస్తారు లోకులు. శూరుడూ, ఉదాత్తగుణసంపన్నుడూ అయి విక్రమించేవాడు చనిపో యినా, వాడిబిడ్డలు చాలా గర్వించుకుంటారు. బిడ్డ లనీ, సంసారం అనీ, సుఖం అనీ చూసుకోకుండా ఉన్నతికోసమే చూసే వాణ్ణే అమాత్యులు మెచ్చుకుంటారు ”

ఇది విని సంజయుడు “అమ్మా, నేను చచ్చిపోయాక ఈభూమం డలం అంతా స్వాధీనం అయితే మాత్రం లాభం యేమిటమ్మా నీకు? నగలు దిగవేసుకుంటే యేమి సుఖము, భోగభాగ్యా లనుభావానికి వస్తే మాత్రం యేమి ఆనందమమ్మా?” అనడిగాడు. విదుల మళ్లీ అందుకుంది.

"తినతిండి లేదు, కట్టగుడ్డ లే" దంటూ యేడ్చేవా ళ్లేలోకాలకు పోతారో మన శత్రువు లాలోకాలకు పోవాలి. ఆత్మాభిమానం వున్నవా రేలోకాలకు పోతారో మన మిత్రు లాలోకాలకు పోవాలి. భృత్యులు లేక, పరుల పంచలబడి బతికే మానహీనుల దారి తొక్కకు నువ్వెప్పుడూ. ప్రాణికోటి అంతా పర్జన్యు ననుసరించి బతుకుతుంది. దేవత లందరూ ఇంద్రుణ్ణి అనుసరించి సుఖపడతారు. బ్రాహ్మలూ మిత్రులూ నిన్ననుసరించి బతకాలి. పళ్లతో నిండివున్న చెట్టుమీదికి చేరుకుంటాయి పిట్టలన్నీ. అలాగ జను లందరూ నీదగ్గిరికి చేరుకోవాలి, భోగభాగ్యాలకోసం. అదీ, బతుకంటే. అదే సఫలం అయినబతుకు. ఇంద్రుని పరాక్రమం వల్ల దేవతలు నిర్భయంగా బతుకుతున్నారు. అలాగే నీపరాక్రమంతో బంధువు లందరూ కులాసాగా బతకాలి. అదీ బతుకు. తన బాహుబలంవల్ల జీవించగలవాడికే కీర్తి అయినా, స్వర్గం అయినా"

# 134

## విదుల కొడుకు 2

"సంజయా" అంటూ పిలిచి మళ్లీ ప్రారంభించింది విదుల.

"ఈస్థితిలో కూడా నీకు పౌరుషం రాకపోతే హీనాతిహీనుడ వయిపోతావు నువ్వు. తనశక్తికొద్దీ బలపరాక్రమాలు చూపించకుండా, ఏదోవిధంగా బతికివుంటే చాలు ననుకునే క్షత్రియుడు దొంగ అనిపించుకుంటాడు. చావు మూడినవాడికి ఔషధం పనిచెయ్యదు. అలాగే, సార్థకాలూ, గుణకరాలూ అయిన మాట లెన్ని చెప్పినా నీకు రుచించడంలేదు. సింధురాజు యోధు లిప్పటికీ సంతోషం లేకుండానే వున్నారు. వాళ్ల కేమీ చేతకాదు. అంచేత తమ కాపదలమీద ఆపదలు వస్తా యనే భయపడుతున్నారు వాళ్లు. సాయసంపత్తి

కూర్చుకుని నువ్వు మళ్లీ విజృంభిస్తావేమో అని చూస్తున్నారు చాలా మంది. నువ్విలాగే పడివుంటే మాత్రం పడనిందిస్తారు నిన్ను. వాళ్లనందరినీ చేర్చుకో. గిరిదుర్గం చేసుకో. సింధురాజు లోటుపాట్లు బాగా కనిపెట్టు. వాడు ముసలితనం రానివాడు కాడు. చావు లేనివాడూ కాడు.

నీపేరు సంజయుడు. జయంమాత్రం కనపడ్డంలేదు నీదగ్గిర. కాలం గడిచిపోతోంది, నీపేరు సార్థకం చేసుకో. నువ్వు పసివాడవై వుండినప్పుడొక బ్రాహ్మడు వచ్చాడు మన యింటికి. చాలా గొప్ప పండితుడతను. సరి అయిన చూపు అతనిది. నిన్ను చూసి "ఈకుర్రవాడు మొదటమొదట చాలా కష్టపడతాడు. యిక్కట్లు హీనస్థితే అనుభవిస్తాడు; కాని, చివరికి చాలా గొప్పస్థితి సంపాదించుకుంటాడు" అని చెప్పాడాయన. ఆబ్రాహ్మడిమాట నమ్ముకుని నీవిజయంకోసం యెదురుచూస్తున్నాన్నేను. అందుచేతనే మళ్లీ మళ్లీ పోరుతున్నాన్నిన్ను యుద్ధంచెయ్యమని.

తనకు ఐశ్వర్యం వుండినందుకు ఇతరుల నానందపెట్టేవాడికి ఐశ్వర్యం వచ్చితీరుతుంది. నీతిమార్గం మాత్రం విడిచిపెట్టకూడదా మనిషి. నీకైశ్వర్యం వస్తే రానియ్యి, పోతే పోనియ్యి, అది కాదిక్కడ ముఖ్యం. యుద్ధం చెయ్యి. ఇది నీపూర్వులు నడిచిన మార్గం. నామార్గమున్నూ యిదే. యుద్ధప్రయత్నాలు మానుకోకు. రేపటికీ మాపటికీ తినతిండి లేకపోవడంకంటే మరొక దురవస్థ లేదన్నాడు శంబరుడు. భర్త చచ్చిపోడంకంటేనూ కొడుకు చచ్చిపోడంకంటేనూ యెక్కువదది. దారిద్ర్యం అంటే యేమిటో తెలుసా? మరణానికి మారుపేరు.

చాలాగొప్పవంశంలో పుట్టాన్నేను. ఒకమడుగులోనుంచి మరో మడుగులోకి వచ్చినట్టు వచ్చా నీయింటికి. మహారాణీ నయి బతికాన్నేను. సకలభోగభాగ్యాలూ అనుభవించాను. నాభర్త నెత్తిమీద పెట్టుకున్నాడు నన్ను. వెలలేని రత్నాభరణాలూ, పూలదండలూ,

బట్టలూ, పీతాంబరాలూ ధరించాను. నన్ను చూసి చెలికత్తె లెంతో ఆనందించారు.

అలాంటి నేనూ నీభార్యా కూడా యిప్పు డిలాంటి స్థితిలో వున్నాము. మమ్మల్ని చూస్తూవుండిన్నీ యిలా పడివుండడంకంటే నువ్వు చచ్చి పోడం మేలు. నీభృత్యులూ, నీపరిచారకులూ, నీగురువులూ, నీపురో హితులూ, నేనూ, నీభార్యా అన్నంలేక మాడిపోడం చూడ్డం కంటె చావు మంచిది నీకు. వెనకటికి, నువ్వు, గొప్పబలపరాక్రమాలూ, శౌర్యౌదార్యాలూ చూపించావు. మళ్లీ యిప్పుడున్నూ నువ్వలా చూపించ లేకపోతే నాహృదయానికి శాంతి యెక్కడిదీ? బ్రాహ్మడు వచ్చి చెయ్యి చాపితే లేదనడానికి గుండెలు బద్దలాసిపోతున్న ట్టుటుంది నాకు. నేనూ నాభర్తా కూడా యెప్పుడూ అలా అని యెరగం మరి. మనల్ని యితరు లాశ్రయించుకుని బతకాలి గాని, వొకరి నాశ్ర యించుకుని బతగ్గూడదు మనం. ఇతరుల నాశ్రయించవలసిన దుర్గతే, పడితే, ప్రాణాలు విడిచిపెటేస్తాను; గాని బతకలే న్నేను.

అంతూపంతూ లేని సముద్రంలో పడివున్నా న్నేను. ఒడ్డు వయి నన్నుద్ధరించాలి నువ్వు. ఈశోకసాగరంలో నావ వయి నన్ను దరి చేర్చాలి. నిలనడానికి చోటులేదు నాకు, నువ్వు చూపించాలి. చచ్చి వున్నా న్నేను, నువ్వు బతికించాలి. నీకు బతుకుమీాద ఆశలేకపోతేనే నువ్వు శత్రువులను నాశనంచెయ్యగలవు. ఇప్పటి స్థితే బాగుం దను కుంటూవా, నీకంటే నపుంసకుడు నయం. విరక్తి విడిచిపెట్టు. మళ్లీ ప్రయత్నించు. లేదూ, పాడుబతుకు బతికేం, చచ్చిపో. ఒక్క శత్రు వును చంపినా చాలు, శూరుడైనవాడికి మంచి కీర్తివస్తుంది. వృత్రా సురుణ్ణి సంహారించడంవల్ల ఇంద్రుడుగా వున్నవా డల్లా మహేంద్రు డయిపోయాడు, దేవతల రాజు. సోమపానానికి అర్హుడూ ముల్లో కాలకూ అధిపతీ కూడా అయినా డతను.

పేరు చెప్పి, రా రమ్మని తొడచరిచి శత్రువును పిలిచి ఎదట సైన్యం అంతా వికావికలు చేసి ముఖ్యశత్రువుని పోడిచేసి పేరుపొందితే, తక్కిన శత్రువులందరూ గుండెలుజారి అప్పుడే చెదిరిపోతారు. పెద్దలైనవారు రాజ్యం భ్రష్టం అయిపోతూవుంటే చూస్తూవూరుకోరు. మరణం తప్పని స్థితివచ్చినా పోరాటం మానరు. శత్రువు చేజిక్కితే బ్రతకనివ్వరు. ఇవి మహోన్నతయుద్ధధర్మాలు. రాజ్యం అంటే స్వర్గద్వారం. అమృత మున్న. వాటి ద్వారం మూసుకుపోయిందనుకో. మండుతున్న కొరివి వయి శత్రువులమీాది కురుకు. శత్రువులను నాశనం చెయ్యి. స్వధర్మం నిలుపుకో. అంతేకాని, దుఃఖిస్తూ మనవాళ్ళూ, కేరింతా లాడుతూ శత్రువర్గంవాళ్ళూ నీచుట్టూ మూగితే నేను చూడలే నికళ్ళతో.

వెనకటిలాగే సౌవీరకన్యలతో సుఖంగా వుండు నువ్వు. సైంధవ కన్యల చేతుల్లో చిక్కుకోకు. నవయవ్వనంలో వున్నావు నువ్వు. మిక్కిలీ చక్కనివాడవు. చాలాచదువుకున్నావు. గొప్ప వంశంలో పుట్టావు. అపారమైన కీర్తి సంపాదించుకున్నావు. లోకం అంతా నిన్ను గుర్తించింది. అలాంటి నువ్వు, ఎద్దులాగ, శత్రువుల పనులు చెయ్యడం కంటే చచ్చిపోడం మంచిది. నువ్వు శత్రువులను పొగడుకుంటూ వారి చుట్టూ తిరుగుతూ వుండడం చూస్తే నాకు శాంతి యెక్కడిదీ? నా వంశంలో పుట్టినవా డెవడూ శత్రువు చుట్టూ తిరగలేదింతవరకూ. శత్రువులచుట్టూ తిరగడం నీకు తప్పకపోతే నువ్వు బతకడానికివీల్లే దిక.

నేను క్షత్రియహృదయం బాగా యెరుగుదును. ప్రజాపతి నిర్మించా డది. శాశ్వతమూ అవ్యయమూనూ అది. ఒక్కటే విధంగా వుండది యెప్పుడూ. చలనమూ మార్పూ లేదు దానికి. మన పూర్వులూ, యితరుల పూర్వులూ, ఆపూర్వుల పూర్వులూకూడా బాగా కీర్తించిన దది. ఈవంశంలో పుట్టి, తన కులధర్మం తెలిసివున్న క్షత్రియు డెవ్వడూ కూడా భయపడీ, తిండిలేకా శత్రువులకు నమస్కరించడానికి వీల్లేదు.

ఎప్పుడూ ఉన్నతి సంపాదించుకోడానికి ప్రయత్నించాలేగాని శత్రువులకు నమస్కరించగూడదు. ప్రయత్నం అంటేనే పౌరుషం. ఫలం లేకపోయినా, ఉండ దని నిశ్చయమే అయినా ప్రయత్నం మాత్రం మానగూడ దెప్పుడూ. మానాభిమానాలున్నవాడు మదించిన యేనుగన్నట్టు నిర్భయంగా సంచరించా లెప్పుడూ.

సంజయా, బ్రాహ్మలకు మాత్రం నిత్యమూ, త్రికాలాలయందూ నమస్కరిస్తూ వుండాలి. ధర్మానికిన్నీ అలాగే నమస్కరిస్తూ వుండాలి. ఇతరవర్ణాల వారిని తనఅదుపాజ్ఞల్లో వుంచుకోవాలి. శిష్టులనురక్షించాలి. ముందుగా దుష్టులను శిక్షించాలి. తనకు సాయం వుండినా లేకపోయినా, క్షత్రియుడైనవాడు, బతికివున్నంతకాలమూ ఇలాగే బతకాలి.

# 135

## విదులకొడుకు 3

"అమ్మా, నీహృదయం కారినుముతో చేశా డమ్మా భగవంతుడు" అన్నాడు సంజయుడు. "క్షత్రియధర్మం చాలా నిష్ఠురం అయింది. ఎవడి తల్లో వచ్చి యెవణ్ణో అన్నట్టు, నన్ను కన్నతల్లివి, యుద్ధానికి తరుముతున్నావు నన్ను నువ్వు, నీకేకపుత్రుణ్ణి నేను. నువ్వు తప్ప మరే తల్లీ యిలా పీడించదు, కొడుకుని. అమ్మా, యుద్ధంలో నేనేదో అయిపోతా ననుకో. అప్పు డీభూమండలం అంతా నీచేతికి వస్తే మాత్రం నీకేమి లాభమూ? నేను పోయిన తరవాత నువ్వెన్ని ఆభరణాలు ధరిస్తే యేమిటి, యెన్ని భోగభాగ్యా లనుభవిస్తే మాత్రం యేమిటమ్మా?" అని కూడా అడిగా డతను.

"నాయనా, విద్వాంసు లయినవారు తమ కెలాంటి అవస్థపట్టినా ధర్మార్థాలు విడిచిపెట్టరు. నేనూ ఆధర్మార్థాలు విడిచిపెట్టలేకే యుద్ధానికి పొమ్మంటున్నాను నిన్ను. నువ్వు కులధర్మం కచ్చితంగా నిర్వర్తించ

వలసిన సమయం వచ్చిందిప్పుడు. బాగా ఆలోచించుకుని పరాక్రమించాలి నువ్వు. దేశాభిమానం చంపుకోలేక అపకీర్తికర మైన పని చేసిపోతావేమో అని పోరి నిన్నింత తొందర పెడుతున్నాను. కారణం లేని ప్రేమా, చేతకాని ప్రేమా గాడిదప్రేమ అనిపించుకుంటుంది. కనక, సజ్జనులు గర్హించేదారి విడిచిపెట్టాలి నువ్విప్పుడు. మూర్ఖత వనిపించుకోగూడదు.

లోకంలో అజ్ఞానం చాలా యెక్కువగా వుంది. దానిదగ్గిరికి పోక, గొప్పపని చేస్తివా, నాకొడుకు వనిపించుకుంటావు నువ్వు. ధర్మార్థాలే ప్రధానం అనుకోవాలి నువ్వు. సజ్జనుల కవే ప్రీతిపాత్రాలు. దేవతలకూ మనుష్యులకూ గూడా అవే ముఖ్యం. మునిమనమలు కానీ, మనుమలు కానీ, కొడుకే కానీ — ఉత్సాహం లేక, నీతిలేక, పైపెచ్చు బుద్ధిలేక దుర్నీతిపరుడున్నూ అయి నడుచుకుంటే వాణ్ణి కన్నవారికి బిడ్డలు కన్న ఫలం వుండదు. సత్కార్యాలు చెయ్యలేకపోడంతో ఆగక, చెడ్డపనులు చేసేవాడు, ఈలోకానా పరలోకానా కూడా సుఖపడలేడు.

సంజయా, క్షత్రియుడు, యుద్ధం చెయ్యడానికీ, జయం సంపాదించుకోడానికిన్నీ మాత్రమే పుట్టాడు. యజ్ఞయాగాలు చెయ్యడమున్నూ క్షత్రియధర్మమే. యుద్ధంచేస్తూ చచ్చిపోతాడా, వీరస్వర్గానికి పోతాడు క్షత్రియుడు. శత్రువులను అణిచివేసి క్షత్రియు డనుభవించే సుఖం స్వర్గంలో కూడా దొరకదు. శత్రువులవల్ల పరాభవం పొంది అవమానంతో కుళ్లిపోయేవాడు శత్రువు నైనా సంహరించాలి, తానయినా చచ్చిపోవాలి, మరోదారి లేదు వాడికి. శాంతిన్నీ కలగదు మరోవిధాన వాడికి. ప్రాజ్ఞుడైనవాడు కొద్దిపాటి హితంకలిగితే సంతుష్టి పొందడు. అలా సంతుష్టిపడేవాడి జన్మ సముద్రంలో కలిసే గంగ జన్మలాగ వ్యర్థం వ్యర్థం" అని చాలా పట్టుదలగా చెప్పింది విదుల.

"అమ్మా, నువ్విలా చెప్పగూడ" దన్నాడు సంజయుడు. "నీకొడుకు న్నేను. అంచేత నువ్వసలే చెప్పగూడ దిలాగ. కరుణే చూపించాలి నువ్వు" అనికూడా అన్నా డతను. "కాదు కా" దంది విదుల. "నువ్విలా అంటున్నావు కనకనే శ్రద్ధ ఎక్కువై మళ్లీ మళ్లీ చెబుతున్నా న్నేను. తొందరపెట్టతగ్గ మనిషినే తొందరపెడుతున్నాను కూడా. యుద్ధంచేసి సైంధవుల నందరినీ నరికేసి రా. లేకపోతే నువ్వే చచ్చి పోయి వీరస్వర్గానికి వెళ్లిపో. ఇందులో నువ్వేది చేసినా నిన్నారాధిస్తా న్నేను" అని వివరంగా చెప్పింది.

"నాకు డబ్బులే దమ్మా! సహాయం చేసేవా రసలే లేరు. ఇక నువ్వెంత తొందరపెడితే మాత్రం యేమి లాభమూ? జయం మాత్రం యెలా సాధ్యపడుతుందీ నాకు? పాపాలు చేసుకున్నవాడు స్వర్గాశ విడిచిపెట్టుకోక తప్పదు. అలాగే ఇదంతా ఆలోచించే నేను రాజ్యాశ విడిచిపెట్టుకున్నాను. నీప్రజ్ఞ చాలా గొప్పదే. ఈవిషయమై అనుభవ మున్నా నీకెక్కువగా వుంది. కనక, బాగా పరిశీలించి ఉపాయం యేమయినా వుంటే చెప్పు. నువ్వు చెప్పిం దల్లా — చెప్పినట్టల్లా చేస్తాను చూసుకో" అన్నాడు సంజయుడు చివరికి.

"అది త" ప్పంది విదుల. వెనకటికి సాధనసంపత్తి చాలిందికాదని ఇప్పు డిలా నిరుత్సాహపడిపోగూడదు. వెనకలేని సాధనసంపత్తి తర వాత రాదని సిద్ధాంతం యేమయినా వుందా? పోనీ, వెనక వున్నవన్నీ నిరుపయోగమో నాశనమో అయిపోకుండా అలాగే వుండిపోతాయా? ప్రారంభం చెయ్యవలసినచోట కసిగా చెయ్యాలి గాని యీాదురో మంటూ చెయ్యగూడదు. పనిచేస్తే లాభించా వచ్చు, లాభించకా పోవచ్చు. చెయ్యడమే ప్రధానం. లాభం రానీ, పోనీ, ధీరులయిన వారు పనిచెయ్యక మానరు. చెయ్యకపోతే యెప్పుడూ వుండదు లాభం. చేస్తే యెప్పుడయినా కలగవచ్చు.

ఫలం కలిగితీరుతుం దన్న నమ్మకంతోనే పూనుకోవాలి దేనిక యినా. ముందు మేలుకోవాలి. నడుం బిగించాలి. పని ప్రారంభించాలి. సాగించాలి. మంగళదేవతల నారాధించి, బ్రాహ్మల ఆశీర్వచనాలున్నూ పొంది ప్రయత్నించే రాజులకు ఫలం తప్పకుండా సిద్ధిస్తుంది. సూర్యుడు తూర్పున ఉదయించడం యెంత సత్యమో అలాంటివాడికి జయం సిద్ధించడమూ అంత సత్యమే.

నాయనా, నిదర్శనా లెన్నో చెప్పాను. ఉపాయాలున్నూ చూపించాను. ఎంతో ప్రోత్సాహమున్నూ చేశాను. ఇక పౌరుషం తెచ్చుకో. కసి పెంచుకో. ఉరుకు. మన క్కావలసిం దంతా సాధించుకురా. క్రోధంతో వుడికిపోతున్న వాళ్లనూ, లోభులనూ, ఆశలుడిగి పడివుండిన వాళ్లనూ, అవమానంతో కుళ్లిపోతున్న వాళ్లనూ, పగపట్టివున్న వాళ్లనూ కూర్చుకో. ఎంత దట్టంగా వున్నా మేఘమండలం అంతా వొక్కవూపున యెగరగొట్టేస్తుంది సుడిగాలి. ఇలాచేస్తివా, నువ్వున్నూ అలాగే శత్రుమూకలను పారదోలేస్తావు.

అయితే, జీతనాతాలు ముందే యివ్వాలి వారికి. అగత్యం వచ్చినప్పుడల్లా సాయంచేస్తూవుండాలి. ప్రీతిగా చూడాలి. ఆప్యాయనంగా మాట్లాడాలి. నువ్విలా మసులుకుంటే ప్రాణాలయినా యిచ్చి వారు నీపని చక్కబెడతారు. నీకు ఉన్నతి కలిగిస్తారు. విజయమున్నూ కలిగిస్తారు. శత్రువు జీవితాశ వదులుకునివుంటే, ముందే వాణ్ణి సంహరించెయ్యాలి. పరాక్రమిస్తూ చతురుపాయలూ ప్రయోగించి లోబరుచుకోవాలి. దూతలు విశ్వాసపాత్రు లయినవాళ్లయితే విజయం లభించి తీరుతుంది. ధనమూ కూడుతుంది గుట్టలుగుట్టలుగా. ధనం చేరడంతోనే నలుగురూ ఆశ్రయిస్తారు. డబ్బు లేకపోతే యెవరూ చేరరు. బంధువులున్నూ విడిచిపెట్టేస్తారు. ఏవగించుకు నిమరీ విడిచిపెట్టేస్తారు.

# 136

## విదుల కొడుకు 4

"నాయనా, ఎలాంటి ఆపద వచ్చినా, రాజయినవాడు భయపడగూడ దెప్పుడూ. భయమే కలిగినా, భయపడ్డట్టు కనపడగూడ దెవరికీ. రాజు భయపడితే అందరూ భయపడిపోతారు. జనులూ, అమాత్యులూ, సైన్యమూ — అందరూ శలోవిధంగానూ అయిపోతారు. కొందరు శత్రువులతో కలిసిపోతారు. కొందరు రాజుని విడిచిపెట్టేస్తారు, మరేమీ చెయ్యలేకపోయినా. కొందరు, తమ కదివరలో చేసిన అవమానాలు తీర్చుకోడానికి ఆరాజునే నాశనంచేసేస్తారు. ప్రాణాలయినా యివ్వడానికి సిద్ధపడే మిత్రు లుంటారు కొందరు. వారు మాత్రమే కనిపెట్టుకుని వుంటా రతణ్ణి. గోవులు తమ లేగలను విడిచి పెట్టలేవు. తామేమి చెయ్యడానికయినా సిద్ధపడతారు గాని ఆమిత్రులలాగే తమరాజును విడిచివుండలేరు. అప్పటివరకూ యేవిధంగానూ వుపకారం పొందివుండకపోయినా వారు మనసు మార్చుకోరు. నిజంగా మిత్రు లంటే వారే.

నీశక్తీ, నీబుద్ధీ, నీపౌరుషమూ తెలుసుకోడానికీ, నీశౌర్యం రెచ్చగొట్టడానికీ నేనేమి టేమిటో అన్నాన్నిన్ను. నేను చెప్పింది ధర్మబద్ధంగా వున్నట్టయితే, అది నువ్వు బోధపరుచుకుని వున్నట్టయితే, లే, మనస్సు కుదుటబరుచుకుని యుద్ధప్రయత్నాలు సాగించు. డబ్బుకోసం బెంగ వద్దు నీకు. కావలసినంత డబ్బుంది మనకి. ఈసంగతి నీకు తెలియదు. మరెవరికీ తెలియదు. అదంతా తెచ్చి నీచేతిలో పెడతా న్నేను. డబ్బే కాదు, స్నేహితులూ వున్నారు చాలామంది. నీసుఖంకోసమూ, నీఉన్నతికోసమున్నే వారు కనిపెట్టుకుని వున్నారు. ప్రాణాలు

పోయినా యుద్ధంలో వెనకంజ వెయ్యని వారు వారు. అలాంటి మిత్రులే యేరాజు కయినా నిజమైన బలం."

అంతా విన్నాడు సంజయుడు. అజ్ఞానం తొలిగిపోయిం దతనికి. "అమ్మా" అన్నా డతను. "సముద్రంలో మునిగిపోయివున్న మన రాజ్యనౌకను ఉద్ధరించి నయినా వుద్ధరిస్తాను, యుద్ధంలో ప్రాణా లయినా విడిచిపెడతాను. నాకళ్లు తెరిచావు నువ్వు. ముందుముందు నాకులభించబోయే ఐశ్వర్యమున్నా కళ్ళ యెదట పెట్టా వంతా. నీవల్ల ఎన్నో సంగతులు తెలుసుకోడానికే యెదురువాదం చేసి నిన్ను విసి గించాను. చాలా కష్టంమీద అమృతం లభిస్తే వొసట్టాన తృప్తికా దెవరికీ. నీమాటలూ అలాంటివే అయినాయి నాకు. ఇదిగో, శత్రువులను నాశనంచెయ్యడానికీ, విజయం సాధించడానికీ బయలుదేరుతున్నాను." అంటూ యెగిసపడ్డా డతను. తల్లి చెప్పినట్టల్లా చేసి పోయిన రాజ్య మున్నా మళ్లీ సంపాదించుకున్నా డతను.

"జయం" అని దీనిపేరు. గొప్ప కథయిది. శత్రువులవల్ల పీడించ బడుతున్న రాజుక అమాత్యులు వినిపించవలసిన కథ యిది. ఇది ఉత్తే జనం కలిగిస్తుంది. శౌర్యం రెచ్చగొడుతుంది. యుద్ధంలో జయం సాధించుకోవా లనుకునే రాజు వినవలసిన కథ యిది. విన్నవాడు, శత్రువుల నందరినీ సంహారించి, త్వరలోనే తనరాజ్యం తాను గెల్చు కుంటాడు మళ్లీ.

గర్భవతి అయిన స్త్రీ యిది వినాలి. పుంసవనం యిది. ఇదివిన్న స్త్రీ వీరులైన పుత్రులను కంటుంది. క్షత్రియస్త్రీకిది చాలా ముఖ్యమైనది. విద్వాంసుడూ, తపోధనుడూ, దాతా, బ్రహ్మవర్చస్వీ, సజ్జనుడూ, బల పరాక్రమశాలీ, మహారథుడూ, ధీరుడూ, అజేయుడూ, జయశీలీ, దుష్టశిక్షకుడూ, శిష్టరక్షకుడూ అయిన కొడుకును కంటుంది, ఇది విన్న క్షత్రియస్త్రీ.

# 137

## కుంతి సాగనంపు

"కృష్ణా, ఆశ్రమంలో కన్నా నద్దునుణ్ణి. నాచుట్టూ చాలామంది స్త్రీలు కూచునివున్నారు. అప్పు డాకాశవాణి యిలా చెప్పింది.

"కుంతీ, నీయీ కొడుకు దేవేంద్రునితో సమానుడు. యుద్ధంచేసి యితను, కౌరవుల నందరినీ జయిస్తాడు. భీమసేనుని సాయంతో లోకా లన్నీ అల్లకల్లోలంచేసేస్తాడు. భూమండలం అంతా జయిస్తాడు. ఇతని కీర్తి స్వర్గంలో కూడా పాకిపోతుంది. కౌరవులను సంహరించడంలో శ్రీకృష్ణుడు సాయంచేస్తా డితనికి. తండ్రిసంపాదించివుండిన రాజ్యం అంతా మళ్లీ స్వాధీనపరుచుకుంటా డితను. అన్నదమ్ములందరితోనూ కలిసిమెలిసివుంటూ మూడశ్వమేధయాగాలు చేస్తాడు"

ఆకాశవాణి మాట లివి. ఇదంతా నువ్వెరుగుదువు. ఆకాశవాణి చెప్పిం దంతా సత్యం కావా లని కోరుకుంటున్నా న్నేను. ధర్మం అంటూ వుండడమే వస్తే జరిగితీరుతుం దిది. ఈభారం అంతా నీది. ధర్మానికి నమస్కారం. లోకాల కన్నిటికీ ధర్మమే రక్ష. ఇదంతా అర్జునునకు చెప్పాలి నువ్వు. యుద్ధరంగంలో యెప్పు డురుకుతానో అంటూ యెదురుచూస్తూ వుంటాడు భీముసేను డెప్పుడూ. అతనితో గూడా చెప్పాలి నువ్విది.

"క్షత్రియస్త్రీ యెందుకోసం బిడ్డలను కంటుందో అందుకు సమయం వచ్చిం దని కూడా చెప్పాలి, వారితో నువ్వు. విరోధం వస్తే ఉత్తమ పురుషు లెప్పుడూ కంగారుపడరు. భీముని సంగతి నీకు తెలుసు. పగ తీరకుండా శాంతించ డతను. శత్రువుల నందరినీ నాశనం చేసేదాకా నిద్రపో డతను.

"తల్లీ, గొప్పవంశంలో పుట్టావు నువ్వు. నాకొడుకుల నయిదుగు రినీ వొక్కవిధంగా చూడాలి సుమా నువ్వు" అని నామాటగా నా కోడలు ద్రౌపదితో కూడా చెప్పు నాయనా! మాద్రి కొడుకు లున్నారు చిట్టినాయనలు. వారుకూడా క్షత్రియధర్మం లేశమూ తప్ప రెప్పుడూ. "మీ బాహుబలంతో సంపాదించుకుని మాత్రమే మీరు భాగ్యభోగ్యా లనుభవించాలి. మనుష్యుల కవే ఉల్లాసం కలిగిస్తాయి" అని వారితో కూడా చెప్పాలి సుమా నాయనా!

ఆవేళ, ద్రౌపదిని దుర్యోధనాదు లంత దారుణంగా పరాభవించారు. అది క్షమించతగ్గ దేనా? రాజ్యం హరించారు వారు. అందు క్కాదు నాకు దుఃఖం. మాయాజూదంలో మోసంచేసి వోడించారు. అడవులకున్నా పంపారు. అందుకూ అందుకున్నా కూడా కాదు నాకు దుఃఖం. ద్రౌపదికి జరిగిన పరాభవమే నాగుండెలు పీకేస్తోంది. అది జ్ఞాపకంవస్తే నాకడుపు చెరువయిపోతోంది చెప్పటానికి. ఆవేళ, అనాథ అయిపోయింది నిజంగా ఆమె. "ద్రౌపది పగ తీర్చు" అని అర్జును నితో గట్టిగా చెప్పవోయి నాయనా! విలుకాళ్ళలో అంతవాడు మరి లేడు మరి.

కోపంవస్తే భీముడూ అర్జునుణ్ణి మించిపోతాడు, క్రౌర్యంలో. దేవత లనుగూడా గజగజలాడించేస్తారు వారు. సభలో ద్రౌపది పొందిన అవమానం వారిది గాని ఆమెది కాదు. కౌరవు లందరూ వినేలాగ దుశ్శాసనుడు కూడా కారులు కూశా డప్పుడు. అదిన్నీ మరిచిపోవద్దని చెప్పాలి సుమా, వారిద్దరితోనూ"

నాకొడుకులనూ, ద్రౌపదినీ మనమలనూ క్షేమం అడిగా నని చెప్పు. నేనిక్కడ క్షేమం అనిన్నీ చెప్పు. ఉపప్లావ్యానికి నువ్వున్నా క్షేమంగా వెళ్లిపో. నాకొడుకులను మరిచిపోకు సుమా, కృష్ణా"

కుంతి మాట లన్నీ విన్నాడు కృష్ణుడు. ఆమెకి పాదాభివందనం చేశాడు. ప్రదక్షిణమున్నూ చేశాడు. భీష్మాదులదగ్గిర సెలవు పుచ్చు కున్నాడు. సాత్యకితో పాటు కర్ణుణ్ణి కూడా రథం యెక్కించుకుని బయలు దేరాడు చివరికి.

కృష్ణుడు వెళ్లిపోయాక, కౌరవులు, అతనుచేసిన అద్భుతకార్యాం చెప్పుకుని చెప్పుకుని ఆశ్చర్యపడ్డారు. "దుర్యోధనుని దుర్బుద్ధిమూలంగా ఈభూమండలం అంతా బుగ్గయిపోతుం" దనిన్నీ అనుకున్నారువారు.

పట్నం దాటి చాలాదూరం వెళ్లాక కృష్ణుడు కర్ణునితో చాలా సేపు మాట్లాడాడు. తరవాత, అతణ్ణి వెనక్కి పంపేసి, ముందుకి సాగా డతను. దారుకుడు చాలా వడిగా నడిపించాడు రథం. ఆకాశం తాగే స్తున్నా యన్నట్టు పరుగుతీశాయి గుర్రాలు. వేగల్లాగ అతివడిగా వెళ్లి ఉపప్లావ్యం చేరుకున్నాడు కృష్ణుడు.

# 138

కుంతిమాటలు విన్నమీదట, భీష్ముడూ, ద్రోణుడూ మళ్లీ హితబోధ చేశారు, దుర్యోధనునకు.

"కుంతి కృష్ణునితో చెప్పిన మాటలు విన్నావా?" అనడిగాడు భీష్ముడు ముందు. "మిక్కిలీ అర్థవంతంగా వున్నా యీ మాటలు. చాలా దారుణంగా కూడా వున్నాయి, ముఖ్యంగా. కృష్ణుని ప్రోత్సాహం కూడా యెక్కువగా వుంటుంది కనక, అక్షరాలా నెరవేరు స్తారు, తల్లిమాట పాండవులు. తమ రాజ్యభాగం తమకు స్వాధీనపడే దాకా వారు శాంతించడం శుద్ధకల్ల. నీమూలంగా అనేకబాధలు పడ్డారు వారు. ద్రౌపదికూడా చాలా అవమానం పొందింది. గొప్ప విలుకాడు అర్జునుడూ, ఎప్పణ్ణుంచో యుద్ధంకోసమే కనిపెట్టుకుని వున్న భీమసేనుడూ, సజ్యమైన గాండీవమూ, అక్షయతూణీరాలూ, దేవ

దత్తమైన రథమూ, అందుకుతగ్గ కపిధ్వజమూ, బలపరాక్రమసంప న్నులు నకులసహదేవులూ, తమకు సారథీ, సహాయమూ అయిన శ్రీకృష్ణుడూ – ఇలాంటి సంపత్తి తన చేతిలో వుంది కనక, యుధిష్ఠి రుడు మీదుండగా లెంతమాత్రమూ సహించ డిక.

విరాటనగరంలో మనమంతా అర్జునుని చేతిలో వోడిపోయి వున్నాము. నీకనుభూతమే అది. నివాతకవచులు చాలా క్రూరులు. వారు చెయ్యలేని ఘోరాలు లేవు. అరవై వేలున్నారు వారున్నూ తక్కువలేరు. అయినా అంతమందీ కూడా పాశుపతాస్త్రం దెబ్బకి క్షణంలో బూడిద అయిపోయారు, అర్జునుని చేతిలో. నీకిది తెలుసు. గంధర్వులు చెరపట్టినప్పుడూ నువ్వూ కర్ణుడూ కూడా విడిచేతులతో లేరు. రథారూఢులై కవచాలూ ఆయుధాలూ, ధరించే వున్నారు; కాని అర్జునుడు వచ్చి విడిపించవలసివచ్చింది మిమ్మల్ని. ఇది నీకు చెప్పనక్కరలేదు నేను.

కనక, బాగా ఆలోచించుకో. పాండుపుత్రులతో సంధిచేసుకో. ఈభూమండలం అంతా మృత్యుదేవత కోరల్లో చిక్కుకునివుంది. ఘోరమైన విపత్తు రానివ్వకు దానికి. యుధిష్ఠిరుడు ధర్మపరుడు. వాత్సల్యం గలవాడు, మృదుభాషి. కవి. ఆపురుషపుంగవుణ్ణి ఆశ్రయించి నీపాపా లన్నీ కడిగేసుకో.

విల్లూ అమ్ములూ కిందపడేసి, కోరచూపులున్నూ కట్టిపెట్టి ధర్మ నందనుని దర్శనం చేసుకుంటివా శాంతి యేర్పడుతుంది. కౌరవు లందరూ బతికిపోతారు. కులం వర్ధిల్లుతుంది. నువ్వూ నీమంత్రులూ కలిసివెళ్ళి నమస్కారాలు చెప్పుకుని ఆధర్మనందనుని కౌగిలించుకో. తప్పకుండా నిన్నతను తన గుండెల కదుముకుంటాడు, మిక్కిలీ ప్రీతితో. భీమసేనుడు సింహస్కంధుడు. ఆజానుబాహువు. ఇనపగుదియలవంటి వాచేతులు. మహాయోధు డతను. ఆచేతులతో కౌగిలించుకుంటాడు నిన్నతను.

అర్జునుడు నీకు నమస్కరిస్తాడు. నకులసహదేవులు నిన్నారాధిస్తారు. శ్రీకృష్ణుడూ తక్కిన రాజులూ ఆసన్నివేశం చూసి ఆనందబాష్పాలు విడుస్తారు.

దురభిమానం విడిచిపెట్టి ఈవిధంగా నీఅన్నదమ్ములతో కలుసుకో. వారితో కలిసి భూమండలం అంతా విలాసగా ఏలుకో. యుద్ధంమాట విడిచిపెట్టెయ్యి. స్నేహితుల మాటలు పెడచెవిని పెట్టకు. యుద్ధం తప్ప దంటావా, క్షత్రియకులానికి నాశనం తప్పదు. గ్రహాలూ నక్షత్రాలూ ప్రతికూలంగా వున్నాయి నీకు. మృగాలూ పక్షులూ దారుణంగా కూస్తున్నాయి. నాశనం తప్ప దన్నట్టు ఘోర మైన ఉత్పాతాలు చాలా కనబడుతున్నాయి. మన యింటో కూడా దుర్నిమిత్తాలెన్నో కనపడుతున్నాయి. ఉల్కలు పడి నీసేన లన్నీ చెదిరిపోతున్నాయి. గుర్రాలూ ఏనుగులూ ఏడుస్తున్నట్టు కన్నీరు కారుస్తున్నాయి. నీసేనానివేశం అంతటా గద్ద లెగురుతున్నాయి, విచ్చల విడిగా. నగరమూ, రాచనగరూ కూడా శోభ తరిగిపోయివున్నాయి. పాడుపడిపోతున్నట్టున్నూ కనపడుతున్నాయి. అన్నివైపులా ఘోరంగా కూస్తున్నాయి నక్కలు.

నీతల్లీ తండ్రీ చెప్పినమాట విను. నీశ్రేయస్సు కోరే స్నేహితులు చెప్పేదిన్నీ బాగా ఆలకించు. యుద్ధం అయినా సంధి అయినా నీ చేతిలో వున్నాయి. నువ్వు మామాట వినకపోతే, అర్జునుని చేతిలో నీసేన అంతా నాశనం అయిపోతుంది. అదంతా కళ్లారా చూసుకో వలసివస్తుంది నీకు. నామాట నిరాకరిస్తివా, భీమసేనుని సింహనాదమూ, అర్జునుని గాండీవజ్యాఘోషా విన్నప్పుడైనా నేను జ్ఞాపకం వస్తానీకు.

ఇదంతా విన్నాడు; గాని కోరచూపులు మానలేదు దుర్యోధనుడు. మాటే ఆడలేదు. మొగం వంచేసుకున్నాడు, కనుబొమ్మలు కుంచించుకుని. "అనేకవిధాల శుశ్రూషచేస్తున్నాడు. అసూయ ఎలాంటిదో యెరగనివాడు. బ్రహ్మణ్యుడు. సత్యమే గాని మాట్లాడడు. అలాంటి అర్జునునితో యుద్ధంచెయ్యవలసివస్తోంది. ఇంతకంటే దుఃఖకరమైనది మరేం వుందీ?" అంటూ మొగం చిన్నబుచ్చుకున్నాడు భీష్ముడు.

ద్రోణు డందుకున్నా డప్పుడు. "అశ్వత్థామ అంటే ఎంత పుత్రవాత్సల్యమో అర్జును డన్నా నాకంతే. అశ్వత్థామ యెడల లేంది అర్జునునియెడల ఆదరభావం విశేషం నాకు. కొడుక్కంటేనూ యెక్కువ ప్రీతిపాత్ర మైన అర్జును న్నెదిరించి యుద్ధంచెయ్యవలసివస్తోంది నాకు. ఎంత నిష్ఠురమూ క్షత్రియధర్మం? అర్జునునకు సాటివచ్చే విలుకాడు మరొకడు లేడు లోకంలో. నాఅనుగ్రహంవల్లనే అంతవాడైనా డతను. యజ్ఞయాగాల సందర్భంలో మూర్ఖుల కాదరగౌరవా లుండవు. మిత్రద్రోహికీ, దురాత్మునకూ, నాస్తికునకూ, కుటిలునకూ, తడిపాతతో గొంతుకోసేవాడికీ, అలాగే, సజ్జనమండలిలో ఆదరగౌరవా లుండవు. పాపాత్ములే వద్దంటున్నా పాపాత్ముడు పాపాలే చేస్తాడు. పాపాత్ముడు పాపాలే చెయ్యమంటున్నా పుణ్యాత్ముడైనవాడు పుణ్యాలే చేస్తాడు. తమకి నువ్వెన్ని ద్రోహాలుచేసినా పాండుపుత్రులు నీకు శ్రేయస్సే కోరుతున్నారు. నీదోషాలుమాత్రం శత్రుత్వమే పెంచుతున్నాయి నీకు.

భీష్ముడు చెప్పాడు నీకు. నేను చెప్పాను. విదురుడు చెప్పాడు. చివరికి శ్రీకృష్ణుడున్నూ చెప్పాడు. మేమందరమూ నీశ్రేయస్సు కోరే చెప్పాము. నువ్వుమాత్రం వినిపించుకోడంలేదు, కొంచెమూ గూడా,

అసలే నీటియేనుగులూ, మొసళ్లూ -- ఇలాంటి క్రూరజలజంతువులతో నిండివుంది. ఆపైని వర్షాకాలం కావడంవల్ల వొరుసుకుంటూ పారుతోంది. నాకే గదా బలం వుందని అలాంటి గంగానదిలో వురుకుతున్నావు నువ్వు, అద్దరికి చేరుకుందామని. ఒకరు కట్టివిడిచిన బట్ట కడుతున్నట్టూ, ఒకరు ధరించివిడిచిన పూలదండ మెడలో ధరిస్తున్నట్టూ వుంది, యుధిష్ఠిరుడు ఏలిన రాజ్యం నువ్వేలుకోడానికి చూడ్డం.

శస్త్రాస్త్రసంపన్నులైన తమ్ములతోనూ, ద్రౌపదితోనూ వనస్థుడై వున్నప్పుడైనా, రాజ్యస్థుడై వున్నవాడున్నూ యెవడూ జయించలేదు యుధిష్ఠిరుణ్ణి. అనేకమంది రాజులే కింకరులయివున్నారు కుబేరునకు. ఆకుబేరుణ్ణి జయించేశాడు యుధిష్ఠిరుడు. అతని భవనానికి వెళ్లి అక్కడ వున్న రత్నాలున్నూ యెన్నో తీసుకువచ్చాడతను. ఆయుధిష్ఠిరుడే యిప్పుడు నీరాజ్యం ఆక్రమించుకోబోతున్నాడు.

నేనూ భీష్ముడూ భూరిదానాలెన్నో చేసుకున్నాము. యజ్ఞాలున్నూ అనేకాలు చేసుకున్నాము. వేదవేదాంగాలన్నీ క్షుణ్ణంగా చదువుకున్నాము. మాప్రాయమున్నూ గడిచిపోయింది. భూమ్మీద పుట్టినందుకన్నివిధాలా మేము కృతకృత్యులమయి వున్నాం. యుద్ధంవల్ల మాకు పోయేదేమీ లేదు. నీది నవయౌవనం. రాజ్యమున్నూ కొత్తదే. సుఖమూ కొత్తదే నీది. ధనం బాగా చేరింది. మిత్రులెందరో ఆశతో ఆశ్రయించుకుని వున్నారు. ఈస్థితిలో నువ్వు పాండవులతో యుద్ధంపెట్టుకుంటివా యివన్నీ యెగిరిపోతాయి. పైపెచ్చు, పెద్దదుఃఖమున్నూ చుట్టబెట్టుకుంటుంది నీకు.

ద్రౌపది మిక్కిలీ సత్యనిరతురాలు. ఘోరమైన తపోవ్రతం అవలంబించివుంది. ఆమె ధర్మనందనునకు విజయం కోరుతోంది. ఇక యుధిష్ఠిరుణ్ణి నువ్వేలా జయించగలవూ? ఇటు చూస్తామా, శ్రీకృష్ణుడు మంత్రి. అటు చూస్తామా, శస్త్రాస్త్రవేత్త లందరిలోనూ మిక్కిలీ

గొప్పవాడైన అర్జునుడు తమ్ముడు. జితేంద్రియులూ, ధీరులూ అయిన బ్రాహ్మలున్నూ యెంతో మంది సహాయంగా వున్నారు. స్వయంగా మహోగ్రతపశ్శాలి అతను. అలాంటి యుధిష్ఠిరు డెక్కడ, నువ్వతణ్ణి జయించగలగడం యెక్కడ ?

చెప్పిందే మళ్లీమళ్లీ చెబుతున్నా న్నీకు. నీశ్రేయస్సు కోరుతున్నా నంచేత చెబుతున్నాను మళ్లీ. దుఃఖాల్లో మునిగిపోయేవాడికి ఇలా మళ్లీ మళ్లీ చెప్పవలసిన విధి వుంది స్నేహితులకు. అంచేత గూడా చెబుతున్నా నింతగా. యుద్ధంమాట విడిచిపెట్టెయ్యి. కౌరవులకోసం మహావీరులు పాండుపుత్రులు వాళ్లతో సంధిచేసుకో. పుత్రులతోనూ అమాత్యులతోనూ నిండింటో సుఖంగా వున్నావు, కోరి పరాభవం తెచ్చిపెట్టుకోకు.

## 140

### కర్ణ భేదం

"సంజయా, రాజపుత్రులూ భృత్యులూ వెంటరాగా, రథం యెక్కించు కుని కర్ణుణ్ణి తీసుకువెళ్లాడుగదా కృష్ణుడు, అక్కడ యేమి జరిగిందోయ్ ? కర్ణునితో యేమి చెప్పాడు కృష్ణుడు ? ఆచెప్పడం మృదువుగా చెప్పాడా, కఠినంగా చెప్పాడా ?" అనడిగాడు ధృతరాష్ట్రుడు. "సమయానసమ యాలను బట్టి సచ్చజెబుతూనూ మాట్లాడాడు, నిష్ఠురంగానూ మాట్లా డాడు కృష్ణుడు. జాగ్రత్తగా ఆలోచించుకోవలసిన ట్టున్నూ మాట్లాడా డతను" అంటూ ప్రారంభించాడు, సంజయుడు.

"రాధేయా, వేదవేదాంగవేత్తలైన బ్రాహ్మల నెందరినో సేవించు కున్నావు నువ్వు. అసూయ లేకుండా, వారు తత్వం బోధిస్తే విని చక్కగా అవగాహన చేసుకున్నావు. సనాతనమైన వేద రహస్యం బాగా తెలుసు నీకు. ధర్మసూక్ష్మాలున్నూ నువ్వు బాగా గుర్తించు కుని వున్నావు. కొడుకు లెన్ని రకాలో వున్నారు. వారిలో కానీను

డనీ, సహోఢు డనీ రెండు రకాలు. కన్యకకు పెళ్లి కాకపూర్వం పుట్టినవాడు కానీనుడు. కన్యకకు పెళ్లి కాకపూర్వమే గర్భంలో పడి మరెవడో పెళ్లిచేసుకున్నాక ఆమెకి పుట్టేవాడు సహోఢుడు. అయితే ఆకానీనునకూ, ఆసహోఢునకూ కూడా శాస్త్రోక్తంగా ఆకన్యను పెళ్లిచేసుకున్నవాడే తండ్రి అవుతాడు. ధర్మశాస్త్రం బాగా తెలిసివున్నవారి కీసంగతి చెప్పనక్కర లేదు. కనక, కౌంతేయుడవు గాని రాధేయుడవు కావు నువ్వు. అంటే, నీతండ్రి పాండురాజు గాని సూతుడైన అధిరథుడు కాడు. అంచేత, ధర్మశాస్త్రాన్ని బట్టి, పాండవుల పైతృకరాజ్యానికి నువ్వే రాజువి, యుధిష్ఠిరుడు కాడు. ఆకారణంవల్ల, తల్లివంక యాదవులూ, తండ్రివంక పాండవులూ కూడా నీకు బంధువులు.

కనక, ఉపప్లావ్యానికి వెళ్లిపోదాం, నాతో రా. నువ్వు నాతో రావడం చూశారంటే, పాండుపుత్రులు, నువ్వు కుంతి కొడుకువే అనీ, ధర్మనందనుని కంటె పెద్దవాడ వనీ గుర్తిస్తారు. వారయిదుగురూ, ద్రౌపదికొడుకులూ, అభిమన్యుడూ, వారికి సాయంగా వచ్చివున్న రాజులూ, రాజపుత్రులూ నీపాదాలు పట్టుకుంటారు. అంధకులూ వృష్ణులూ కూడా నీపాదా లాశ్రయిస్తారు. బంగారు పాత్రలతోనూ, వెండిపాత్రలతోనూ, మట్టిపాత్రలతోనూ పవిత్రజలం తెచ్చి, ఓషధులూ, రత్నాలూ, వీరుధాలూ, సర్వబీజాలూ అందులో కలిపి, రాజులూ, రాచకన్నెలూ నీకభిషేకంచేస్తారు. ఆరోవంతు ఏర్పాటు చేసుకుని ద్రౌపదికూడా నిన్ను పరిగ్రహిస్తుంది. ధౌమ్యుడు నీపక్షంగా కూడా అగ్నిహోత్రాలు చేస్తూ వుంటాడు. చతుర్వేదాలూ శాస్త్రాలూ చదువుకున్న ద్విజులున్నూ నీకభిషేకం చేస్తారు. యజనయాజనాధ్యయనాధ్యాపనదానప్రతిగ్రహషట్కర్మనిరతు డైన ధౌమ్యుడూ, యుధిష్ఠిరాదు లయిదుగురూ, ద్రౌపదికొడుకులూ, పాంచాలరాజులూ, చేదిరాజులూ నేనూ కూడా మహారాజుగా నీకభిషేకంచేస్తాము.

ధర్మనందనుడు యువరాజయి, వెల్లవింజామర చేతబట్టి నిన్ను సేవించుకుంటూవుంటాడు, నీవెనకనే రథంయెక్కి. వెలలేని శ్వేతచ్ఛత్రం పడతాడు నీకు భీమసేనుడు. రథానికి వెల్లగుర్రాలుపూన్చి నీకు సారథ్యం చేస్తా డర్జునుడు. అభిమన్యుడు నీసన్నిధిలో వుంటా డెప్పుడూ. నకుల సహదేవులూ, ద్రౌపది కొడుకు లయిదుగురూ, పాంచాలరాజూ, శిఖండీ, అంధకులూ, వృష్ణులూ, నేనూ నీకు అనుయాయులమై వుంటాము. దాశార్హులూ, దాశార్ణులూ నీకు పరివారం అయివుంటారు. మహాబాహూ, యుధిష్ఠిరాదు లయిదుగురితో కూడి జపాలూ, హోమాలూ, మంగళకార్యాలూ నిర్వర్తించుకుంటూ పితృపితామహ క్రమంగా వచ్చిన రాజ్యం పాలించుకుంటూ సుఖంగా వుండు.

ద్రవిడులూ, కుంతలులూ, ఆంధ్రులూ, తాళచరులూ, చూచుపులూ, వేణుపులూ నీకు పురోగాము లయివుంటా రెప్పుడూ. సూతులూ మాగధులూ బహువిధాల నిన్ను స్తుతిస్తూవుంటారు. యుధిష్ఠిరాదులు నీవిజయం చాటుతూ వుంటా రెప్పుడూ. చంద్రుని చుట్టూ చుక్కల్లాగ, రాజు లందరూ నీచుట్టూ పరివేష్టించివుంటారు. కనక, నాతో రా. రాజ్యం ఏలుకో. కుంతిని సంతోషపెట్టు. నీస్నేహితు లందరూ సంతోషిస్తారు. శత్రువు లందరూ దుఃఖిస్తారు. పంచపాండవులతోనూ నీకు సౌభ్రాత్రం సిద్ధిస్తుంది, శాశ్వతంగా ”

# 141

## కర్ణ భేదం 2

“కృష్ణా, నామెడలగల స్నేహంవల్లా, అనురాగంవల్లా, సఖ్యభావంవల్లా, నాశ్రేయస్సు కోరుతున్నావు కనకనూ నువ్విలా చెబుతున్నావు, నాకు తెలుసు. ధర్మాన్ని పట్టి చూస్తే నేను పాండురాజు కొడుకునే, అదీ తెలుసు నాకు, ధర్మశాస్త్రాలున్నూ ఇలాగే చెబుతాయి,

సందేహం లేదు. కుంతి సూర్యునివల్ల నన్ను కన్నది. సూర్యభగవానుని మాటని పట్టి నన్ను విడిచిపెట్టేసిం దామె. ఎటు చూసినా నేను పాండురాజు కొడుకునే కాని, నన్ను కన్న కుంతే నన్ను విడిచిపెట్టేసింది.

సూతుడైన అధిరథుడు నన్ను తన యింటికి తీసుకువెళ్ళాడు. రాధ కిచ్చాడు. ఇదంతా ప్రేమతో చేశా డతను. నన్ను చూడగానే రాధ కప్పటికప్పుడు పాలుచేపాయి. నామలమూత్రా లెత్తిం దామె. మరి, నావంటివా డామెకి పిండప్రదానం చెయ్యకుండా వుండగలడా? నేను ధర్మశాస్త్రా లెప్పుడూ చూస్తూ వుంటాను. ధర్మం నాకు బాగా తెలుసు. ధర్మం అంటే నాకు చాలా యిష్టమున్ను. మరి, నేనా ఆపని చెయ్యడం?

నేను తన కొడుకు ననే అనుకుంటున్నాడు సూతుడు. అలాంటి అనుబంధంవల్ల నేను కూడా అతను నాతండ్రే అనుకుంటున్నాను. జాత కర్మ మొదలైన సంస్కారా లన్నీ నాకతనే చేశాడు. వేడుకకోసం కాదు, పుత్రప్రీతితో యథాశాస్త్రంగా చేశా డత నవన్నీ. బ్రాహ్మలు వసుషేణు డని పేరుపెట్టారు నాకప్పుడు, అతని కోరికమీద. నన్ను తను పెంచుకోడంవల్లనే నాకు పెళ్ళయింది. మంచిభార్యలు దొరికారు నాకు. వారియందు కొడుకులనూ మనమలనూ కూడా కన్నా న్నేను. నాహృదయం వారిమీద హత్తుకుపోయివుంది. అంచేత ఈభూమండలం అంతా నాకు కట్టబెట్టినా సరే, నాయింటో బంగారం గుట్టలుపెట్టినా సరే, నన్నెంత సంతోషపెట్టినా సరే, చివరికి భయపెట్టినా సరే నేను వారికి — నాబిడ్డలకు — నాభార్యలకు — రాధాధిరథులకు — నాతల్లి దండ్రులకు ద్రోహం చెయ్యలే న్నేను.

దుర్యోధనునితో కలిసి, ధృతరాష్ట్రుని యింటో వుండి పదమూడేళ్ళ నుంచి నేను రాజభోగా లన్నీ యథేచ్ఛగా అనుభవిస్తున్నాను. నాసూత కులస్థులతో కలిసి యజ్ఞాలూ యాగాలూ చేశా నెన్నోమాట్లు.

సూతుల కులధర్మా లన్నీ అనుష్ఠించా న్నేను. వారిపిల్లలను చేసుకు న్నాను. వారితో వియ్యా లందాను. దుర్యోధనుడు నన్ను చూసుకునే పాండవులతో యుద్ధం తలపెట్టి సర్వమూ సిద్ధంచేసుకున్నాడు. అర్జును ణ్ణెదిరించి యుద్ధంచెయ్యడం బాధ్యత అంతా నామీదే పెట్టి నన్నే నమ్ముకుని వున్నాడు.

దుర్యోధనుణ్ణే అన్నివిధాలా నమ్మించి వున్నా న్నేను. నాకు లోభం కలగనీ, దారుణ మైన భయం కలగనీ, చెర తటస్థించనీ, నాప్రాణాలే పోనీ — ఏమయినా ఎందు కయినా సిద్ధమే; కాని దుర్యోధనునకున్నూ ద్రోహంచెయ్యలే న్నేను. అర్జునునితో నేనిప్పుడు కలిసిపోతే నాకే కాదు, అతనికీ అపకీర్తే. నువ్వు నామీద ప్రేమతోనే చెబుతున్నా విదంతా. సర్వానికీ నిన్నే నమ్ముకుని వున్నారు కనక, పాండుపుత్రులు నీమాట శిరసావహిస్తారు.

కనక, కృష్ణా, నేను కుంతీపుత్రు ణ్ణన్నమాట నువ్వు చాలా రహ స్యంగా వుంచాలి. ఎంతమాత్రమూ పైకి పొక్కనివ్వగూడదు. వారికీ నాకూ గూడా అలా అయితేనే శ్రేయస్సు. నేను కుంతికి పెద్దకొడుకు నన్న సంగతి గుర్తించాడా, ధర్మనందను డిక రాజ్యం వొల్లడు. నేనే గెలుస్తా ననీ, ఆరాజ్యం అంతా నాకే స్వాధీనం అవుతుం దనీ అనుకో. అదంతా దుర్యోధనున కిచ్చేస్తాను; గాని నేను స్వీకరించను. యుధిష్ఠిరుడే గెలుచుకుంటాడా, అతనే రాజు కావాలి, శాశ్వతంగా. అతనికి నువ్వు నేతవు. అర్జునుడే యోధుడు. కనక, ఈభూమండలం అంతా అతనికే తక్కాలి. రాజ్యమున్నూ అతనికే స్వాధీనం కావాలి. ఇదే ధర్మం.

మహారథు లైన భీమసేనుడూ, నకులుడూ, సహదేవుడూ, ద్రౌపది కొడుకులూ, పాంచాలరాజూ, ధృష్టద్యుమ్నుడూ, సాత్యకీ, ఉత్తమౌ జుడూ, యుధామన్యుడూ, సోమకుని కొడుకూ, చేకితానుడూ, చైద్యుడూ, శిఖండీ, ఇంద్రగోపప్పురుగంత ఎఱ్ఱనివారు కేకయ సోద

రులూ, కుంతిభోజుడూ, శ్యేనజిత్తూ, శంఖుడూ, అందరిపైనీ నువ్వూ—ఇదంతా వాళకవర్గం. కష్టపడి యిదంతా కూర్చుకున్నాడు యుధిష్ఠిరుడు. దుర్యోధనునిపక్షంగా శస్త్రయజ్ఞం జరగాలి.

ఈయజ్ఞం విషయం సకలమూ నీకు తెలుసు. దీనికి ఆధ్వర్యవమే నీది. అర్జునుడు హోత. గాండీవమే స్రుక్కు. రాజుల శౌర్యవీర్యాలే నెయ్యి. ఇంద్రాస్త్రమూ, పాశుపతాస్త్రమూ, బ్రహ్మాస్త్రమూ—ఇవన్నీ మంత్రాలు. అభిమన్యుడు ఉద్గాత. భీమసేనుడు ప్రస్తోత. ధర్మరాజు బ్రహ్మ. భేరీభాంకరణాలూ, శంఖారావాలూ — ఇలాంటి వన్నీ సుబ్రహ్మణ్యం. నకులసహదేవులు శామిత్రం. రథాలు యూపస్తంభాలు. కర్ణినాళీకాద్యాయుధాలు చమసలు. తోమరాలూ ధనుస్సులూ కపాలాలు. శిరస్సులే పురోడాశం. రక్తమే హవిస్సు. శక్త్యాయుధాలూ గదలూ పరిఘలు. ద్రోణశిష్యులూ, కృపుని శిష్యులూ సదస్యులు. బాణాలు సోమచమసాదులు. సాత్యకి ప్రతిప్రస్థాత. యజ్ఞదీక్షితుడు దుర్యోధనుడు. చతురంగబలం పత్ని. అతిరాత్రం అనే ఈయజ్ఞంలో ఘటోత్కచుడు శామిత్రం చేస్తాడు. యజ్ఞవేదికలో పుట్టిన ధృష్టద్యుమ్నుడు యజ్ఞదక్షిణ.

కృష్ణా, దుర్యోధనునకు ప్రీతి కలగడానికి యుధిష్ఠిరాదుల న్నేనెంతో పరుషంగా దూషించాను. అందు కిప్పుడు చాలా విచారిస్తున్నాను. అర్జునుని చేతిలో నేను చచ్చిపోయినప్పు డీయజ్ఞానికి పునశ్చితి అవుతుంది. దుశ్శాసనుని రక్తం భీముడు గడగడ తాగేస్తాడు. అదే సుత్యం. ధృష్టద్యుమ్నుడూ, శిఖండీ ద్రోణుణ్ణీ భీష్ముణ్ణీ సంహరిస్తారు. అదే అవసానం దీనికి. భీమసేనుడు దుర్యోధనుణ్ణీ చంపేస్తాడు. దాంతో పూర్తి అవుతుం దీయజ్ఞం. గాంధారితో కూడా కోడళ్లూ, కూతుళ్లూ, కుక్కలూ నక్కలూ గద్దలూ రాబందులూ మూగివున్న యుద్ధభూ

మిలో పడి పోర్లుతూ భర్తలనూ కొడుకులనూ తలుచుకుని గోలపెడ తారు. అదే అవభృథస్నానం.

విద్యావృద్ధులూ, వయోవృద్ధులూ అయినవా రనేకు లీయుద్ధంలో చచ్చిపోతారు. నీఅనుగ్రహంవల్ల దిక్కుమాలిన చావు కాక, వారి కందరికీ వీరమరణం తటస్థపడుతుంది. పుణ్యక్షేత్రం అయిన యీకురు క్షేత్రంలో వారందరూ శస్త్రమరణం పొందుతారు. ఇది యిలా జర గాలి. మరోవిధంగా జరగనివ్వకు నువ్వు. ఈభూమిమ్మీద పర్వతాలూ సముద్రాలూ వున్నంతకాలమూ ఈగాథ శాశ్వతంగా వుంటుంది. క్షత్రియులు కూడినచోట నల్లా బ్రాహ్మ లీమహాభారతయుద్ధం గానం చేస్తూ వుంటారు. కనక, కృష్ణా, సన్నాహం అంతా పూర్తిచేసి యుధి ష్ఠిరుణ్ణి తీసుకురా యుద్ధానికి. నాజన్మరహస్యం మాత్రం యెప్పుడూ — యెవరికీ తెలియనివ్వకు.

## 142

"కర్ణా" అంటూ ప్రారంభించాడు కృష్ణుడు, చిరునవ్వు నవ్వుతూ.

"రాజ్యప్రాప్తి లేదు నీకు. అంచేతే యీభూమండలం అంతా కట్ట బెడతా నన్నా వద్దంటున్నావు నువ్వు. పాండవులకు విజయం తప్పదు. ఇందులో లేశమూ సందేహం లేదు. పాండుపుత్రుల జెండా జయం ప్రకటిస్తోంది. కపిరాజు చాలా ఉగ్రు డయిపోతున్నాడు. విశ్వకర్మ మాయ అంతా ఆరథంలో రూపొందివుంది. భయానకా లయిన భూతా లెన్నో కనపడుతున్నాయి, విజయం చెయ్యెత్తి చూపుతూ.

ఎటు చూసినా — పైనీ పక్కలా కూడా ఆమడమేర చెట్లూ పర్వతాలూ కూడా అడ్డురాలే వారథానికి. అర్జునుని జెండా అగ్ని లాగ దేదీప్యమానంగా వుంది. అతని రథానికి వెల్లగుర్రాలు పూన్చి స్వయంగా నేను సారథ్యం చేస్తాను. అర్జునుడు ఐంద్రాస్త్రం ప్రయోగిస్తాడు.

గాండీవధ్వని పిడుగుపాటుని మించుతుంది. అప్పుడిక కృతయుగమూ వుండదు, త్రేతాయుగమూ, వుండదు, ద్వాపరయుగమూ వుండదు.

జపహోమసమాయుక్తుడై, యుధిష్ఠిరుడు, తన సైన్యం రక్షించుకుంటూ వుంటాడు. శత్రుసైన్యం అంతా నాశనంచేస్తూ, సూర్యభగవానుడా అన్నట్టుంటూ డతను, చూడశక్యం కాకుండా. అప్పుడిక కృతయుగమూ వుండదు, త్రేతాయుగమూ వుండదు, ద్వాపరయుగమూ వుండదు. రొమ్ము పగలదన్ని భీమసేనుడు దుశ్శాసనుని వేడిరక్తం తాగి నృత్యంచేస్తూ మదించిన యేనుగులా పరవళ్లు తొక్కుతూ, దుర్యోధనుని యేనుగులను పీనుగుపెంటలుచేస్తాడు. అప్పుడిక కృతయుగమూ వుండదు, త్రేతాయుగమూ వుండదు, ద్వాపరయుగమూ వుండదు.

ద్రోణుడూ, భీష్ముడూ, కృపుడూ, దుర్యోధనుడూ, జయద్రథుడూ కళ్లుమూసుకుని మీదపడ్డానికి వస్తారు యుద్ధరంగంలోకి. వస్తారంతే. ఆగిపోతారు. అర్జునుడు ముందు కడుగువెయ్యనివ్వడు వారిని. అప్పుడిక కృతయుగమూ వుండదు, త్రేతాయుగమూ వుండదు, ద్వాపరయుగమూ వుండదు. నకులసహదేవులు వాళ్లు తెలియని ఆవేశంతో వురుకుతారు. మదపుటేనుగుల్లాగ విజృంభించి మీసేన అంతా చిందరవందరచేసేస్తారు. శస్త్రాలు — అస్త్రాలు — గదలు — ముసలాలు — తోమరాలు — కత్తులు — ఇలాంటి ఆయుధాలతో మీవీరులను కూల్చి పారేస్తారు. రథాలు కూలగొట్టేస్తారు. అప్పుడిక కృతయుగమూ వుండదు. త్రేతాయుగమూ వుండదు, ద్వాపరయుగమూ వుండదు.

కర్ణా, ఇక్కణ్ణుంచి వెళ్లాక నువ్వు, ద్రోణుడితోనూ, భీష్మునితోనూ, కృపునితోనూ చెప్పవోయ్! నిండారువెన్నెలతో యీకాలం చాలా బాగా వుంది. తృణకాష్ఠజలాలున్నూ బాగా సమృద్ధిగా వున్నాయి. ఓషధు లన్నీ చాలా యేపుగా పెరిగివున్నాయి. ఎక్కడ చూసినా కొల్లలుగా వున్నాయి రకరకాల పళ్లు. ఈగలు తగ్గిపోయాయి బాడీ

బందా లేకుండా మార్గాలన్నీ చాలా చక్కగా వున్నాయి. నీరు చాలా రుచిగా వుంది. చలీ లేకుండా ఉక్కా లేకుండా శిశిరం చాలా హాయిగా వుంది. నేటి కేడో దినం అమావాస్య. ఇంద్ర దేవతాకం అది. ఆవేళ యుద్ధం ప్రారంభించడానికి చాలామంచిది. దుర్యోధనుని పక్షంగా యుద్ధంచెయ్యడానికి వచ్చిన రాజు లందరితోనూ కూడా చెప్పాలి సుమా యీమాట. వారి క్కావలసిం దంతా నేను సమకూరుస్తానుటే. వారందరూ దుర్యోధనుని పేరుగా యిక్కడ సెగ్గసుద్దరపోతారు. అయితే, వీరస్వర్గానికి మాత్రం పోతారు, తప్పకుండా"

# 143

"నాసంగతి తెలిసిన్నీ యిలా నూట్లాడతా వేమిటయ్యా?" అని ముదలకిస్తూ అందుకున్నాడు కర్ణుడు.

"కృష్ణా, ఈభూమండలం అంతా బుగ్గయిపోయే కాలం వచ్చింది. దుర్యోధనుడూ, దుశ్శాసనుడూ, శకుని, నేనూ నీమిత్త మాత్రులం కురుపాండవుల కిప్పుడు దారుణ మైన యుద్ధం జరుగుతుంది, తప్పదు. దుర్యోధనపక్షంగా వచ్చిన రాజులూ, రాజపుత్రులూ బాణాగ్నిలోపడి నుసి అయిపోయి యమలోకానికి పోతారు, తప్పదు. రకరకా లైన ఘోరదుస్వప్నాలు వస్తున్నాయి. ఈయుద్ధంలో, దుర్యోధనున కప జయమూ, యుధిష్ఠిరునకు విజయమూ తప్పదన్నట్టు సూచనలు ఉత్పాతాలు కనపడుతున్నాయి, ఘోరాలూ దారుణాలూను.

శని రోహిణీశకటం పీడిస్తున్నాడు. ఇది ప్రాణనాశనానికి సూచన. కుజుడు జ్యేష్ఠానక్షత్రంలో వక్రించి మైత్రికోసం అన్నట్టు, అనూరాధతో కూడుతున్నాడు. కౌరవులకు గొప్ప విపత్తు సంభవిస్తుం దనడాని కిది సూచన. మహాపాతం అనే గ్రహం చిత్తా నక్షత్రాన్ని పీడిస్తోంది. చంద్రమండలంలో మచ్చ కనపడుతోంది. రాహువు సూర్యుణ్ణి మింగేట

ట్టున్నాడు. భూమి గజగజలాడేటట్టుల్కలు రాలుతున్నాయి. వాయు ఘట్టనంతో భయంకరా లయిన ధ్వనులు పుట్టుకు వస్తున్నాయి ఆకాశాన. భూమికంపిస్తోంది దాంతో. ఏనుగులు గీపెడుతున్నాయి, పిచ్చెత్తినట్టు. గుర్రాలు కన్నీరుకారుస్తున్నాయి. మేతా నీరూ కూడా ముట్టడం లేదవి. ఇలాంటివి తటస్థపడితే దారుణమైన భయం కలుగుతుం దనీ, ప్రాణనాశనమున్నూ ఎక్కువగా అవుతుం దనీ చెబుతారు పెద్దలు.

మనుష్యులూ, ఏనుగులూ, గుర్రాలూ కూడా తినేది తక్కువ అయినా, మలమూత్రవిసర్జన మాత్రం యెక్కువగా కనపడుతోంది. దుర్యోధనుని సైన్యం అంతటా వుం దిది. పరాభవం తప్ప దనడాని కిది సూచన అంటారు పెద్దలు. మృగా లన్నీ అపసవ్యంగా తిరుగుతున్నాయి. ఏమిటేమిటో అశరీరవాక్కులు వినబడుతున్నాయి, తరుచు. ఇదిన్నీ అపజయం కలుగుతుం దనడానికే సూచన. దీనికి సాయం, పాండవుల సైన్యంలో గుర్రాలూ, ఏనుగులూ, వృషభాలూ చాలా వుల్లాసంగా వున్నాయిట. మృగా లన్నీ ప్రదక్షిణంగా తిరుగుతున్నాయిట. ఇది వారికి విజయం కలుగుతుం దనడానికి సూచన.

నెమళ్లూ, కోళ్లూ, జీవంజీవకాలూ, హంసలూ, సారసపక్షులూ, చాతకపక్షులూ పాండవుల వెంటవెంట తిరుగుతున్నాయిట. కౌరవుల వెంటవెంటా తిరుగుతున్నాయి, అయితే, అవి, గద్దలూ కొంగలూ డేగలూ తోడేళ్లూ భూతపిశాచాలూ ఈగతుట్టెలూను. దుర్యోధనుని సేనలో, ఎంతవాయించినా భేరీలు మోగడం లేదు. పాండవుల సైన్యంలో వాయించకుండానే మోగుతున్నాయిట. నూతుల్లోనుంచి ఎడ్లూ ఆవులూ అరుస్తున్నట్టు వినపడుతోంది. ఇదిన్నీ పరాభవం తప్ప దనడానికి సూచన.

మాంసమూ రక్తమూ కురుస్తున్నాయి కౌరవసైన్యంలో. ఆకాశాన గంధర్వనగరం కనపడుతోంది. దానికి ప్రాకారం వుందిట. అగడ్త

వుందిట. తోరణా లున్నాయిట. సూర్యునిచుట్టూ నల్లని గుడి కనపడు తోంది. ఉదయసంధ్యా, సాయంసంధ్యా కూడా మహాభయంకరంగా వుంటున్నాయి. నక్కలు చాలా ఘోరంగా వూళ పెడుతున్నాయి. ఇదంతా పరాభవం తప్పదనడానికే సూచన. ఒకటే రెక్కా, వొకటే కాలూ, వొకటే కన్నూ — ఇలా కనపడుతున్నాయి పక్షులు. ఈవికార రూపానికి తోడు మలమూత్రాలున్నూ యెక్కువగా విడుస్తున్నాయి సైనికులమీద. నల్లని మెడలూ, యెర్రనికాళ్లూ – ఇలాంటి పిట్ట లున్నూ యెగురుతున్నాయి సంధ్య కభిముఖంగా. అవి చాలా భయంక రంగా వున్నాయి కూడా. మొదట బ్రాహ్మణద్వేషం ప్రారంభం అయింది. తరవాత గురువులంటే ద్వేషం పట్టుకుంది. ఎంత భయభక్తు లతో పనిచేస్తున్నా భృత్యులయెడల కూడా ద్వేషం ప్రారంభం అయి పోయింది, చివరికి. ఇవన్నీ ఆదినాని కాదినం పెరిగిన్నీ పోతున్నాయి. ఇదంతా పరాభవమూ, నాశనమూ తప్ప దనడానికే సూచన.

తూర్పుదిక్కు రంగెరుపు. దక్షిణదిక్కు కత్తివాయిరంగుది. పడ మటిదిక్కు పచ్చికుండ రంగుగా వుంటుంది. ఉత్తరపుదిక్కు శంఖంలా వుంటుంది, మిక్కిలీ తెల్లగా. పెద్దలు నిర్ణయించిన రంగులు ఇవి; కాని, దుర్యోధనున కన్నిదిక్కులూ ధగధగ మండిపోతున్నట్టు కనబడుతు న్నాయి. ఇదంతా గొప్ప భయం సూచిస్తోంది, స్పష్టంగా.

నాకో కల వచ్చింది. తమ్ములతో కూడా ధర్మనందనుడు వెయ్యి స్తంభాల మేడ యెక్కుతున్నాడు. తెల్లని బట్టలు కట్టుకుని వున్నారు వారయిదుగురూ. తెల్లని పాగాలు చుట్టుకున్నారు. వెళ్లివెళ్లి తెల్లని ఆసనాలమీద కూచున్నారు వారు. నువ్వున్నూ అలాంటి బట్టలే కట్టు కుని, అలాంటి పాగాయే చుట్టుకుని, అలాంటి ఆసనంమీదే కూచుని వున్నట్టు కనపడ్డావు. ఇటు చూశాను. భూమండలం అంతా పీనుగుల తోనూ రక్తంతోనూ నిండివుంది. ఎముకల గుట్టమీద కూచుని, ధర్మ

నందనుడు, బంగారపుపళ్లెంలో నెయ్యికలిపిన పాయసం తింటున్నాడు. నువ్విచ్చిన యీభూమండలం అంతా ఆక్రమించి ఏలుకుంటున్నట్టునూ్నా కనపడ్డా డతను.

ఎత్తయిన పర్వతంమీాద వున్నాడు భీమసేనుడు. గదచేత పుచ్చుకుని భూమి అంతా మింగేస్తున్నట్టు చూస్తూ మమ్మల్నందరినీ నాశనం చేస్తున్నాడు. దీన్నిబట్టి చూస్తే "యతోధర్మ స్తతో జయః" అన్న మాట సత్యం అన్నట్టు తోస్తోంది నాకు. అర్జునుడున్నూ వెల్లయేను గెక్కి వున్నాడు. నువ్వున్నా వతని దగ్గిర. ఇద్దరూ అపూర్వ తేజస్సుతో మెరిసిపోతున్నారు మీారు. అర్జునుని చేతిలో గాండీవం వుంది. దుర్యోధనుని పక్షంగా వచ్చిన రాజుల నందరినీ మీారు సంహారించేస్తారు, సందేహం లేదయ్యా!

నకులుడూ సహదేవుడూ సాత్యకీ, తెల్లని కేయూరాలూ, తెల్లని కంఠత్రాలూ ధరించి, నరవాహనా లెక్కి వున్నారు. వెల్లగొడుగులు వేసుకున్నారు వారు. తెల్లని బట్టలు కట్టుకుని తెల్లని పాగాలు చుట్టుకున్నారు. కౌరవసైన్యంలో, అశ్వత్థామా, కృపాచార్యుడూ, కృతవర్మా — ఈముగ్గురూ మాత్రం బట్టలూ పాగాలూ తెల్లనివే ధరించి వున్నారు. తక్కినవాళ్లం మేమందరమూ యెర్రని బట్టకట్టుకుని యెర్రని పాగాలు చుట్టుకుని వున్నాం. లొట్టిపిట్ట లెక్కి కూచునివున్నాం. మేమంటే, దుర్యోధనుడూ, ద్రోణుడూ, భీష్ముడూ, నేనూ కూడా అనుకో. దక్షిణంగా కూడా వెళ్లిపోయాం మేము. ఇదంతా చూస్తే, మేము త్వరలోనే యమలోకానికి పోతాం, తప్పదు. నేనూ తక్కినరాజులూకూడా గాండీవాగ్నిలోపడి బూడిదఅయిపోతాం, ఇదిన్నీతప్పదు.

"కర్ణా, నామాట నువ్వెప్పుడు వినలేదో అప్పుడే అనుకున్నాను. ఈభూమండలానికి వినాశం తప్ప దనీ, దగ్గిరా పడిం దనీని. ప్రళయం సమీాపించినప్పుడుదుర్నీతే నీతిలాకనపడుతుంది,మరి" అన్నాడుకృష్ణుడు.

"కృష్ణా" అన్నాడు కర్ణుడు. "క్షత్రియవీరు లందరూ నాశనం అయిపోకుండా వుంటే – మేము బతికివుంటే మళ్లీ చూస్తా న్నిన్ను. లేదూ, స్వర్గంలో తప్పకుండా కలుసుకుంటాం మనం" అని బదులు చెప్పాడు కర్ణుడు, దీనికి.

ఇలా చెప్పి, అతను, కృష్ణుణ్ణి గట్టిగా కౌగిలించుకున్నాడు. కృష్ణుడు సెలవియ్యగా, కర్ణుడు, తన బంగారపురథం యెక్కి మాతోపాటు వెనక్కి బయలుదేరాడు. "పోనియ్యి, పోనియ్యి, రథం త్వరగా పోనియ్యి" అని దారుకుణ్ణి తొందరపెడుతూ సాత్యకిని వెంటబెట్టుకుని కృష్ణుడున్నూ వెళ్లిపోయా డుపప్లావ్యానికి.

# 144

## ఇన్నాళ్లకి తల్లీ కొడుకూను

"జీవపుత్రీ, యుద్ధం అంటే నాకెంత మాత్రమూ యిష్టంలే దెప్పుడూ కూడా. నువ్వే యెరుగుదు విది; కాని నేనెంత మొత్తుకుంటున్నా దుర్యోధనుడు నా మాట వినిపించుకోడం లేదు" అంటూ వచ్చాడు, బిక్కమొగం వేసుకుని విదురుడు.

భీమార్జునులూ, నకులసహదేవులూ, కృష్ణుడూ, చేదిపాంచాల కేకయరాజులూ, యుయుధానుడూ – ఇంతమందినీ చేర్చుకుని యుద్ధానికి సర్వసిద్ధంగా వుండికూడా, యుధిష్ఠిరుడు ధర్మం మాత్రం విడిచిపెట్టలేక పోతున్నాడు. తాను మహాశక్తిమంతు డయ్యుండికూడా, శక్తిహీను డన్నట్టు, జ్ఞాతులతో కలిసిమెలిసివుండడానికే చూస్తున్నా డతను.

వయోవృద్ధు డయ్యుండికూడా ధృతరాష్ట్రుడు "శాంతంగా బతుకుదాం" అనుకోలేకపోతున్నాడు. కొడుకులను చూసుకుని మదించి ధర్మం తప్పి నడుచుకోడానికే నిశ్చయించుకుని వున్నా డతను. జయద్రథుడూ, కర్ణుడూ, దుశ్శాసనుడూ, శకునీ – వీరి దుర్బోధతో భేద

భావంతోనే చూస్తున్నాడు నీకొడుకుల నతను. అధర్మం అవలంబించి, వారు, ధర్మం అయిన రాజ్యం హరించబూనుకోడం చాలా దారుణంగా వుంది. కాని కౌరవులు బలవంతంగా అదే చెయ్యబోతున్నారు.

సంధి పొసగక కృష్ణుడు వెళ్లిపోయాడు. దీంతో నీకొడుకులు యుద్ధ ప్రయత్నాలు చేస్తారు తప్పదు. కౌరవులవలంబించిన దుర్నీతివల్ల వీరు లందరూ నశించిపోతారు. ఈ విచారంవల్ల రాత్రీ పగలూ కూడా నిద్ర లేకుండా బాధపడుతున్నా న్నేను"

ఇదంతా వింది కుంతి. విదురుడు కేవలమూ ఆర్థికదృష్టితోనే వున్నందు కామె చాలా చింతించింది. చాలా ఆలోచనా చేసింది. "దిక్కుమాలిన సంపద, దానికోసం బంధువుల నందరినీ చంపుకోడమా? దగ్గిరి బంధువులకున్నూ ఈయుద్ధంవల్ల పరాభవం కలుగుతుంది. చేది పాంచాలయాదవరాజులతో కలిసి నాకొడుకులు తమ భరతవంశీయుల తోనే తగువు పెట్టుకున్నారు. ఇంతకంటే దుఃఖకారణం మరేమి వుందీ? యుద్ధం చేస్తే దోషం పట్టుకుంటుంది, నిజమే. మరి యుద్ధం చెయ్యక పోతే? పరాభవం తప్పదు. డబ్బులేకపోతే చచ్చిపోడం మంచిది; కాని జ్ఞాతుల నందరినీ సంహరించి తన్మూలంగా విజయం సంపాదించుకోడం మంచిది కాదు. ఇలా ఆలోచించినకొద్దీ నాకు దుఃఖం కలుగుతోంది.

భీష్ముడూ యోధాగ్రేసరు డైన ద్రోణుడూ, కర్ణుడూ దుర్యోధనుని విషయమై నాకు చాలా భయం కలిగిస్తున్నారు. వారికీ వీరికీ గూడా ధనుర్వేదం నేర్పిన గురువు తానే కనక, ద్రోణుడు శిష్యులతో యుద్ధం యేమిటని మానుకుంటే మానుకోవచ్చు. భీష్మునకు నా కొడుకులు రక్తంలో రక్తమూ, కండలో కండా, బతుకులో బతుకూను. మరి, అతను నాకొడుకులయెడల ఆత్మీయత కనపరచకుండా వుంటాడా? ఎటొచ్చీ కర్ణుని విషయమే చిక్కుగా వుంది. బుద్ధిలేక దుర్యోధనుని వెనకాల తిరుగుతూ అత నొక్కడే నాకొడుకులను ద్వేషిస్తున్నాడు.

అపకారం చెయ్యడానికి – ప్రాణాలే తియ్యడానికి ప్రయత్నిస్తున్నాడు. బలవంతు డతను. ఇదే నన్ను కాల్చేస్తోంది.

కనక, ముకుందుణ్ణి కలుసుకోవాలి నేను. జరిగిం దంతా చెప్పి బతిమాలితే, అతణ్ణి నాకొడుకులతో కూర్చవచ్చు ననుకుంటాను.

చిన్నతనాన, నేను నాతండ్రి యింటో వున్నప్పుడు, నేను చేసిన సేవలకు మెచ్చి, మంత్రయుక్తంగా నేనెవరిని ధ్యానిస్తే ఆదేవత అప్పటికప్పుడు సాక్షాత్కరించి నాకోరిక తీర్చేటట్టు దూర్వాసుడు నాకు వరం యిచ్చివున్నాడు, నాచెలికత్తెలు నాకు పెట్టని కోటలుగా వుండేవారప్పుడు. సహజంగా స్త్రీత్వం. ఆపైని చిన్నతనం. దీంతో, మంత్రాల ప్రభావమూ, బ్రాహ్మల శక్తీ తెలుసుకోవా లనుకున్నా న్నేను. వెంటనే సూర్యభగవాన్ణి ధ్యానించాను. ఆయన వచ్చి నాకు గర్భం ప్రసాదించాడు. ఆగర్భం నేను కొడుకుని కాపాడుకున్నట్టే కాపాడుకున్నాను. ఇదంతా చెబుతాను కర్ణునితో. ఇది చాలా మంచిమాట. ఆపైని, సోదరులకు ప్రీతి కలిగించేది. కర్ణుడు నామాట వినకపోతాడా ?" అనుకుం దామె. వెంటనే గంగాతీరానికి బయలుదేరిం దామె.

తూర్పుగా తిరిగివుండి, చేతులు పైకెత్తుకుని కర్ణు డప్పటికి వేద మంత్రా లుచ్చరిస్తున్నాడు. ఆయెండలో అతని వెనకనే నుంచుం దామె. ఆజపం పూర్తి అయేదాకా నుంచుంది. తామరగింజల దండ శుష్కించేటట్టు తన శరీరం శుష్కిస్తున్నా లక్ష్యపెట్టలే దామె. తన వీపు వేడెక్కేదాకా జపంచేశాడు కర్ణుడు. తరవాత యిటు తిరిగాడు. చూడగా, కుంతీదేవి. వెంటనే నమస్కరించా డామె కతను. ఆశ్చర్యం కలిగిం దతని కామెని చూశాటప్పటికి. మహాతేజస్వినీ, మానీ, ధర్మవేత్తా కనక, కర్ణు డామెతో మర్యాదగా ప్రస్తావన ప్రారంభించాడు.

## 145

## "నువ్వు నా పెద్ద కొడుకువి"

"రాధకూ అధిరథునకూ కొడుకు న్నేను. నాపేరు కర్ణుడు. మహా రాణీ, నమస్కారం. నువ్విక్కడి కెందుకు వచ్చావూ? నన్నిప్పు డేమి చెయ్యమంటావూ?" అనడిగాడు కర్ణుడు. "నాయనా, నువ్వు నాకొడు కువి కాని రాధకొడుకువి కావు" అందామె మొదట.

"అధిరథుని కొడుకువిన్నీ కావు నువ్వు. నువ్వు సూతకులంలోనే పుట్టలే దసలు, నామాట నమ్ము. నేను కన్యగా వున్నప్పుడు నాకు పుట్టావు నువ్వు. నాకడుపున మోశా న్నిన్ను. నేను కుంతిభోజుని యింటో వున్నప్పుడు జరిగిం దిది. నువ్వు పార్థుడివి. నాకొడుకువి. అదిగో, ఆదేవదేవుడు – లోకాని కంతకూ వెలుగిస్తున్న ఆసూర్యభగ వానుడు నాయందు కన్నాడు నిన్ను. అందువల్లనే శస్త్రాస్త్రవేదుల్లో సాటిలేనివాడి వైనావు నువ్వు. సహజకవచకుండలాలతో పుట్టావు నాతండ్రి యింటో నువ్వు. అజ్ఞానంవల్ల నీతమ్ముల్లను విడిచి దుర్యోధనా దుల్లో కలిశావు నువ్వు. అది మంచిది కాదు. మనుష్యుడు చేసే ధర్మానికి తల్లీ తండ్రీ ఆనందించడమే ఫలం. కొడుకే ముఖ్యం తల్లికి. ప్రాణాలు తరవాతివే. ఏకదర్శిని అని పేరుంది తల్లికి. అంచేత, ఆతల్లి ఆనందించడం అన్నింటికంటే ముఖ్యం కొడుక్కి.

లోభులను జయించి యీరాజ్యం అంతా అర్జునుడు సంపాదించాడు వెనక. దుర్యోధనుడు హరించా డది. మళ్లీ అది స్వాధీనపరుచుకుని యుధిష్ఠిరునకు బదులు నువ్వనుభవించు నాయనా! కర్ణుడూ అర్జునుడూ ఏకంకావడం చూసుకోవాలి కౌరవు లిప్పుడు. మీరిద్దరూ సౌభ్రాత్రం నెరుపుకోడం చూసి దుష్టు లందరూ మొగాలు వెలవేసుకోవాలి. బల రాముడూ కృష్ణుడూ లాగ, కర్ణుడూ అర్జునుడూ వొక్కమాటమీద

వుండాలిప్పుడు. మీరిద్దరూ కలిస్తే అసాధ్యం ఏమి వుంటుందీ లోకంలో? యజ్ఞవేదికమీద, దేవతలందరూ పరివేష్టించివుంటే బ్రహ్మదేవు డెలా వెలిగిపోతాడో ఆ అయిదుగురు సోదరులూ పరివేష్టించివుంటే అలా శోభిస్తావు నువ్వు. సుగుణాలన్నీ వున్నాయి నీదగ్గిర. నువ్వే నాపెద్దకొడుకువి. మన బంధువులందరిలోనూ గొప్పో బహు ఉత్తముడవు. సూతపుత్రుడ ననిపించుకోవద్దిక, పాండుపుత్రుడవు నువ్వు."

# 146

## "నీ కొడుకు లయిదుగురు"

సూర్యమండలంనుంచి వొకమాట వినవచ్చిందికర్ణున కీసమయాన. ప్రేమతొణికిసలాడిపోతోం దామాటలో. జవదాటరాని మాట అది. "నాయనా, ఈపృథాదేవి చెప్పిం దంతా సత్యం. కనుక, నువ్వు కుంతి చెప్పినట్టు నడుచుకో. అక్షరమైనా తప్పకుండా అలా నడుచుకుంటే గొప్పశ్రేయస్సు కలుగుతుంది నీకు" అని ఆమాట.

కర్ణుడు సత్యనిరతుడు. నిక్కమైన ధీరుడున్నూ. అంచేత, తల్లి కుంతి చెప్పినా, తండ్రి సూర్యభగవానుడే చెప్పినా అతని బుద్ధి చలించ లేదు. "క్షత్రియరమణీ! నువ్వు చెప్పిన మాట ధర్మద్వారమే. అయినా నే నంగీకరించ లేనది" అంటూ ప్రారంభించా డతను.

"నువ్వు చెప్పినట్టు చెయ్యడం నాకెంతమాత్రమూ ధర్మం కాదు. నావిషయమై చాలా ఘోరమైన పాపంచేశావు నువ్వు. నన్ను గంగలో విడిచిపెట్టేవు నువ్వు. దాంతో నాయశఃకీర్తులు నాశనం అయిపోయాయి. క్షత్రియుణ్ణయి పుట్టివుండిన్నీ క్షత్రియసంస్కారాలకు దూరం అయిపోయా న్నేను. దీని కంతకూ కారణం నువ్వు. ఎంతపాపాత్ముడైనా శత్రువుకూడా చెయ్యలేదు నాకిలాంటి ద్రోహం. నాకు సంస్కారాలు జరగవలసిన సమయాన దయ అన్నది లేకుండా విడిచిపెట్టి హీనకుల

సంస్కారాలు పొంది హీనసంప్రదాయంలో పడివున్నప్పుడు శాసించ డానికి వచ్చావు నువ్వు.

నన్ను తల్లి వన్నట్టు చూడ లేదు నువ్వింతవరకూ. కేవలం స్వార్థం కోసం బెల్లించి మాట్లాడుతున్నా విప్పుడు. కృష్ణుని సాయం వుండి అర్జునునకు. అత న్నెదిరించి బతకలే డెవడూ. నీమాటమీద నేనిప్పుడు పాండవులతో కలిస్తే యేమయినా వుందా? భయపడిపోయా నని లోకం దుయ్యబట్టదూ నన్ను? నాకన్నలూ తమ్ములూ లేరని లోకం అంతా యెరుగును. యుద్ధం పొసగివున్న యీసమయాన పాండవులను నాతమ్ములని చెప్పుకుంటే క్షాత్రం నన్నేమంటుందో యెరుగుదువా?

కౌరవులు నేనేమి కావా లంటే అది చేస్తున్నారు. దేవు డన్నట్టు పూజిస్తున్నారు నన్ను. అదంతా నేనిప్పుడు వ్యర్థంచెయ్యడం యెలాగా? నన్ను నమ్ముకుని వారు బలవంతులతో వైరంపెట్టుకున్నారు. దేవత లందరూ యింద్రున కెలా నమస్కరిస్తారో అలా నమస్కరిస్తున్నారు వారు నాకు. నాసాయంతో తాము తమ శత్రువులను జయించగల మని నమ్ముకుని వున్నారు. నాప్రాణాలమీద ఆశపెట్టుకునివున్నారు. అలాంటి వారి ఆశ లిప్పుడు నేను కోసెయ్యగలనా? ఈయుద్ధం వొక సముద్రం. అపారం కావడంతో కుదరలేదిది దాటశక్యం కానిదిన్నీ; అయినా, దాటా లని దీక్షపట్టుకున్నారు వారు. నేనే తమకిప్పుడు నావ అని నమ్ముకునివున్నారు. వారి న్నేనెలా విడిచిపెట్టగలనూ ఇప్పుడు?

కౌరవులు నాశ్రయించుకుని బతికేవాళ్లకి, వారియెడల తమ విశ్వాసం చూపించవలసిన సమయం. ప్రాణాలు విడిచిపెట్టయినా నేను వారి రుణం తీర్చుకోవా లిప్పుడు. ఏఅలజడీ లేనప్పుడు వొకళ్ల డబ్బు కమ్మగా తిని కల్లోలం వచ్చినప్పుడు ఆమేలు మరిచి తప్పించుకుని తిరిగేవాళ్లకంటే పాపాత్ములు మరి లేరు. భర్తృపిండాపహారు లని లోకం గర్హిస్తుంది కలకాలం వాళ్లని. వాళ్ల కిహంలేదు. పరమూ లేదు. నేనెప్పుడూ

అబద్ధం ఆడను. నీదగ్గిర అసలే ఆడను. ధృతరాష్ట్రుని కొడుకులకోసం నాశక్తికొద్దీ నీకొడుకులతో యుద్ధమే చేస్తానన్నాను. సజ్జను డయినవాడు చెయ్యవలసిం దింతే. మనిషి అయినవాడన్నా చెయ్యవలసిం దింతకంటే మరి లేదు. నీమాట చాలా లాభకరమే నాకు. కాని అలా చెయ్యనన్నాను.

అయితే, చాలా ఆశపడివచ్చావు నువ్వు ఆ ఆశమాత్రం భగ్నం చెయ్యనన్నాను పూర్తిగా. ధర్మంచూస్తే నీకొడుకుల నయిదుగుర్నీ చంపవలసిన విధివుంది నాకు; కాని వొక్క అర్జునుణ్ణి తప్పించి తక్కిన నలుగురినీ—యుధిష్ఠిరుణ్ణీ, భీమసేనుణ్ణీ, నకులసహదేవులనూ విడిచిపెట్టేస్తాను. యుధిష్ఠిరుని బలగంలో నే నెదిరించి పోరదగినవా డర్జును డొక్కడే. అతణ్ణి చంపితే చాలు, నాజీవితం సఫలం అవుతుంది. అర్జునుని చేతిలో నేనే చచ్చిపోతానా? అంతకంటే కీర్తిలేదు నాకు. అమ్మా, నీకొడుకు లయిదుగురు. ఆసంఖ్య తరగ దెప్పుడూ. నువ్వంతే చూసుకో. అర్జునుడు చస్తాడా, నాతో నీకయిదుగురు కొడుకులు. నేనే చస్తానా, అర్జునునితో నీకయిదుగురు కొడుకులు" అని చాలా స్పష్టంగా చెప్పా డతను.

ఇది విని కుంతి, గడగడ వొణికిపోయింది, దుఃఖాతిరేకంతో. మేరునగధీరు డైన అతణ్ణి కౌగిలించుకుంది ముందు. "నాయనా, ఇది యిలా జరిగితీరవలసిందే. కౌరవులకు నాశనం తప్పదు. నువ్వే అన్న మాట యిది. దైవయోగం దాటశక్యంకా దెవరికీ. నాకొడుకుల్లో నలుగురి కభయం యిచ్చావు నువ్వు. వారిని విడిచిపెట్టాలి సుమా. ఇదిమాత్రం మరిచిపోకు. నీకు క్షేమం కలగాలి." అంది తరవాత. కర్ణుడున్నూ "నీకు క్షేమం కలగా" లన్నా డామెతో. ఎవరి దారిని వారు వెళ్లిపోయారు తరవాత.

## 147

## కౌంతేయులదీ రాజ్యం

హస్తినాపురం విడిచి, ఉపప్లావ్యం చేరుకుని, జరిగిందంతా పాండవులకు

చెప్పి, చాలా సేపు మాట్టాడి, కొంత సేపు ఆలోచనకూడా సాగించి, బడలిక తీర్చుకోడానికి తన బసకి వెళ్లిపోయాడు కృష్ణుడు.

రాజులకందరికీ బసలకు వెళ్లిపోడానికి సెలవిచ్చి, సూర్యాస్తమయం కాగానే సంధ్యావందనం మొదలైన విధులు నిర్వర్తించుకుని, రాయబారం విషయమే ముఖ్యం కావడంవల్ల కృష్ణుణ్ణి మళ్లీ రప్పించుకున్నారు పాండవులు. "కృష్ణా, నీమాటలకు దుర్యోధను డేమని బదులు చెప్పాడూ ?" అని యుధిష్ఠిరు డడగ్గా "నేనెంతో చెప్పాను ; కాని వినిపించుకోలే దతను" అని బదులు చెప్పాడు కృష్ణుడు. "అయితే, కురువృద్ధు డైన భీష్ము డందు కేమన్నాడూ ? ద్రోణుడు కూడా ఏమన్నాడూ ? గాంధారీ ధృతరాష్ట్రుడున్నూ ఏమన్నారూ ? మాకూ వారికీ పినతండ్రీ, ధర్మజ్ఞుల్లో ఉత్తముడూ అయిన విదురుడున్నూ ఏమన్నాడూ ? సభలో వుండిన రాజులుకూడా ఏమన్నారో అదిన్నీ చెప్పు. దుర్యోధనుడు వినిపించుకోనేలే దన్నావు. కావచ్చు, అది ప్రధానం కాదు నాకు, తక్కిన పెద్దలన్నదే కావాలి" అని మళ్లీ అడిగాడు యుధిష్ఠిరుడు. "అంతా చెబుతాను, విను" అంటూ ప్రారంభించాడు కృష్ణుడు.

"నేను చెప్పిందంతా విని వాక్కు వెలికినవ్వు నవ్వాడు దుర్యోధనుడు. దానిమీద చాలా కోపం వచ్చింది భీష్ముడికి. "దుర్యోధనా" అంటూ దురుసుగా అందుకున్నాడు, వెంటనే అతను.

"నేను చెప్పేది విను. వంశంకోసం చెబుతున్నాన్నేను. నువ్వున్నూ వంశంకోసమే చూసుకోవాలి. నాతండ్రి శంతనుమహారాజు లోకప్రఖ్యాతివహించినవాడు. అతని నేనొక్కణ్ణే కుమారుణ్ణి. "ఒక్క కొడుకే వున్నవాడు కొడుకు లేనివాడి కిందే లెక్క. కనక, ఇంకొక కొడుకున్నూ కావాలి నాకు. ఉపాయం యేమిటి ?" అంటూ ఆలోచనలో పడ్డాడు మానాయన. ఆయన కోరిక నాకు తెలిసింది. అర్థమూ అయింది. వెంటనే తండ్రికోసమూ వంశంకోసమూ ఘోర మైన శపథం

పట్టి నేను సత్యవతీదేవిని తీసుకువచ్చాను. "నాకు రాజ్యం అక్కర్లే" దన్నాను. "వివాహమే చేసుకోను. ఊర్ధ్వరేతస్కుడ నై వుంటా" నని శపథంపట్టాను. బలవంతాన కాదు, ఇష్టాపూర్తిగానే ఈశపథం పట్టా న్నేను. ఆశపథంమీదే వుండిపోయాను.

ఆసత్యవతీదేవియందు మానాయనవల్ల నాకొక్క తమ్ముడు పుట్టాడు. విచిత్రవీర్యు డతని పేరు. మానాయన స్వర్గానికి వెళ్లాక మాతమ్ముడికే నేను పట్టం కట్టాను. అతనికి భృత్యుణ్ణయి అతని చేతికిందివా ణ్ణయి మసులుకున్నాను. రాజుల నెందరినో జయించి అతనికి తగిన భార్యలను కూడా సంపాదించుకువచ్చాను. నీకిది తెలిసే వుంటుంది బాగా. ఆసంద ర్భంలో పరశురామునితో కూడా ద్వంద్వయుద్ధం చెయ్యవలసివచ్చింది నాకు; ఆపరశురాముణ్ణి గెలుచుకుని పౌరులు భయపడిపోయారు. అంచేత, వారు, విచిత్రవీర్యుణ్ణి ప్రవాసానికి పంపేశారు. దీనికి సాయం, నాతమ్ముడు, స్త్రీవ్యాసంగం ఎక్కువ అయి క్షయరోగం అంకురించి అకాలమరణం పొందాడు.

రాజ్యం అరాజకం అయిపోయింది. వానలు వెనకపట్టాయి. అన్నం లేక మాడిపోసాగారు ప్రజలు. చివరికి, వారు, నాదగ్గిరికి వచ్చి "ప్రజలు నాశనం అయిపోతున్నారు. మాకోసం రాజ్యాధిపత్యం స్వీకరించు మాకుక్షేమం కలిగించు" అంటూ ప్రార్థించారు నన్ను. "ఇటు అనావృష్టి వల్ల పంటల్లేక అన్నం దొరకడం లేదు. అటు రోగాలు ప్రారంభం అయి, ఆబిక్క ప్రాణా లయినా నిలవడంలేదు. జనం చాలాకొద్దిమంది మాత్రమే బతికివున్నారు. రాజ్యం ఏలుకో. మమ్మల్ని కాపాడు. నువ్వు బతికి వుండగా కౌరవరాజ్యం నాశనం కాగూడదు" అంటూ చాలా గోలపెట్టారు హతశేషులు.

వారెంతగోలపెట్టినా నామనస్సు చలించ లేదు. నాశపథం నిలుపు కోడానికే నిశ్చయించుకున్నా న్నేను. సత్ప్రవర్తన చెరుచుకోగూడ

దనిన్నీ నిరుకుచేసుకున్నాను. దానిమీద, పౌరులూ మాఅమ్మ సత్యవతీ భృత్యులూ, పురోహితులూ, గురువులూ, బహుశ్రుతు లయిన బ్రాహ్మలూ "నువ్వు రాజ్యాధికారం స్వీకరిస్తేగాని వల్లకా" దంటూ కూచున్నారు నన్ను. ప్రతీపమహారాజు రక్షించిన రాజ్యం యిది. నీమూలంగా నశించిపోయేట ట్టుంది. మాకోస మైనా నువ్వు రాజువి కాకతప్ప" దంటూ చాలా వొత్తిడిచేశారు వారు నన్ను. "నన్ను బాధపెట్టవ" ద్దని చేతులు జోడించుకుని ప్రార్థించా న్నేను వారిని. "నాతండ్రియెడల నాకున్న గౌరవం అలాంటిది. కనక, ఈభారం నామీద పెట్టకు. నేను శంతనునకు పుట్టాను. వంశం రక్షించడానికే కంకణం కట్టుకున్నాను. విశేషించి నీకోసం పట్టా నీశపథం నేను. మరి, మాటతప్పడం యెలాగా? అమ్మా, నేను నీ భృత్యుణ్ణి. నీఆజ్ఞ చెల్లించడాని కెప్పుడూ సిద్ధమే; కాని ఇది మాత్రం నావల్లకాదు" అంటూ సత్యవతీదేవిని బతిమాలుకున్నాను. ప్రజలనూ వేడుకున్నాను.

తరవాత, మాఅమ్మతో ఆలోచించి, ఆమె సెలవు పొంది "నాతమ్ముని భార్యలయందు కొడుకులను కనవలసిం" దని వ్యాసుణ్ణి ప్రార్థించాను. సంతానంకోసమే అనుగ్రహించా డతను. ముగ్గురు కొడుకులను కన్నా డతను. నీతండ్రి ధృతరాష్ట్రుడు జ్యేష్ఠుడు; కాని అంధుడయి పుట్టా డతను. నేత్రాంగహీనుడు కావడంవల్ల నీతండ్రికి రాజ్యార్హత లేకపోయింది. తరవాత పాండురాజు పుట్టాడు. లోకప్రఖ్యాతి పొందా డతను. అతనే రాజయినాడు. కనక, అతని కొడుకులు కౌంతేయుల దీరాజ్యం యిప్పుడు.

వారితో తగువుపడకు. రాజ్యంలో వారికి సగం ఇచ్చెయ్యి. నేను బతికివుండగా నన్ను కాదని యెవ డిది పాలించగలడూ? నామాట కొట్టెయ్యకు. మీకందరికీ శాంతి కోరుతున్నా న్నేనెప్పుడూ. నీయెడలా వారియెడలా కూడా నాకు పక్షపాతం లేదు. మీరుభయులూ

నాకు సమానమే. మీఉభయుల విషయమయినా నీతల్లి గాంధారి అభిప్రాయమూ, నీతండ్రి ధృతరాష్ట్రుని అభిప్రాయమూ, విదురుని అభిప్రాయమూ కూడా యిదే. పెద్దలమాట వినడం శ్రేయస్కరం. నామీద అనుమానంపెట్టుకోకు. నిన్ను నాశనంచేసుకోకు. భూమండలం నాశనం కానివ్వకు" అంటూ చాలా గట్టిగా చెప్పా డతను.

# 148

## ఈ దు ర్యో ధ ను డె వ డు ?

భీష్ముడు చెప్పాక, రాజు లందరూ వినేటట్టు ద్రోణుడున్నూ చెప్పాడు. "దుర్యోధనా, ప్రతీపుడూ, శంతనుడూ యెలా వుద్ధరించారో, దేవవ్రతుడైన యీభీష్ముడున్నూ యెలా వుద్ధరించాడో సత్యసంధుడూ, జితేంద్రియుడూ అయిన పాండురాజూ అలాగే వుద్ధరించా డీవంశం. అతనే కౌరవులకు రాజు. అయితే, వనవాసం చెయ్యడానికి నిశ్చయించుకున్నా డతను. అంచేత, రాజ్యభారం అంతా నీతండ్రిమీదా, విదురునిమీదా న్యాసంచేశాడు. నీతండ్రిని సింహాసనం యెక్కించి యిద్దరు భార్యలనూ వెంటబెట్టుకుని అడవులకు వెళ్లిపోయా డతను. విదురుడు వింజామరలు వీస్తూ నీతండ్రిచేతికింద పనిచేస్తున్నాడు. దీంతో ప్రజలు, పాండురాజుని లాగే నీతండ్రిని కూడా రాజుగా అంగీకరించారు.

ఇలాగ నీతండ్రికీ, విదురునకూ రాజ్యం అంతా అప్పగించి పోయి, భూమండలం అంతా తిరిగాడు పాండురాజు. బొక్కసంమీది అధికారమూ, దానధర్మాలు చెయ్యడమూ, భృత్యులకు జీతనాతా లివ్వడమూ, రాజ్యం క్షేమమూ విదురుడు చూసుకుంటున్నా డప్పణ్ణుంచీ. సంధులూ, యుద్ధాలూ, రాజులదగ్గిరనుంచి కప్పాలు పుచ్చుకోడమూ— ఇవన్నీ భీష్ముడు చూసుకుంటున్నాడు. అడుగడుక్కీ విదురుని ఆలోచనలు వింటూ నీతండ్రి సింహాసనమాత్రమే అధిష్ఠించివున్నాడు.

అతని కొడుకివి నువ్వు. ఈకులభేదం యెందుకు తెచ్చిపెడతావ్వా? పాండవులు నీకన్నదమ్ములు. వారితో కలిసి నువ్వున్నూ భోగభాగా లనుభవించుకో.

యుద్ధం అంటే భయపడి చెప్పడంలేదు నేనిది. డబ్బుకోసమున్నూ చెప్పడం లేదు. డబ్బు కావా లంటే భీష్ముడిస్తాడు, నువ్వు కాదు. జీవనోపాధివిషయమై కూడా నిన్నేమీ అడగన్నేను. భీష్ము డెక్కడ వుంటే ద్రోణు డక్కడ వుంటాడు. కనక, భీష్ముడు చెప్పినట్టు చెయ్యి. అశ్వత్థామ అంటే యెంతో, అర్జును డన్నా నాకంతే. ఇన్నిమాట లెందుకూ? ధర్మం యెక్కడో జయం అక్కడ" అంటూ అతనున్నూ చాలా దృఢంగా చెప్పాడు.

"దేవవ్రతా" అంటూ భీష్ముణ్ణిచూసి విదురు డందుకున్నాడు. "కురువంశం నాశనం అయిపోయిందే; కాని నువ్వుద్ధరించావు మళ్లీ; కాని నేనెంత మొత్తుకుంటున్నా నామాట లక్ష్యపెట్టడం లేదు నువ్వు. ఈవంశక్రమం ఆలోచిస్తే యీదుర్యోధను డెవడయ్యా? అనార్యు డితను. కృతఘ్నుడు. లోభి. ఇతనిమాటమీద నడుచుకుంటున్నావు నువ్వు. ఇతను శాస్త్రాలు తృణీకరిస్తున్నాడు. ధర్మార్థాలు పరిగణించే తండ్రిమాట తీసేస్తున్నాడు. దుర్యోధనుని మూలంగా కౌరవు లందరూ నశించిపోయే స్థితివచ్చింది. అది తప్పే వుపాయం చూడాలి నువ్వు. పటంలో బొమ్మలు రాసి నిలబెడతాడు చిత్రకారుడు. నన్నూ ధృత రాష్ట్రుణ్ణీ అలా నిలబెట్టావు నువ్వు. బ్రహ్మ, తానే ప్రజలను సృష్టించి తానే నాశనంచేస్తాడు. అలావుంది నీపని.

వినాశం స్పష్టంగా కనుపడుతూ వుండడంవల్ల నీమతి చెడ్డట్టుంది. చూస్తూచూస్తూ వంశక్షయం కానివ్వకయ్యా! ధృతరాష్ట్రుడూ, నువ్వూ నేనూ కలిసి అడవులకు పోదాం రా. కాదంటావా? దుర్బుద్ధి అయిన యీదుర్యోధను ణ్ణొకచోట కట్టిపడేసి, బాధ్యత అంతా పాండవుల

మీాద పెట్టి నువ్వే పాలించీ రాజ్యం. పాండవులకూ, కౌరవులకూ యీారాజులకూ వినాశం కలక్కుండా శ్రద్ధపెయ్యి" అన్నా డతను చాలా నిష్ఠూరంగా. పెద్దపెద్ద వేడినిట్టూర్పులు విడుస్తూ మరి మాట్లాడ లేకపోయాడు కూడా.

వెంటనే అందుకుంది గాంధారి. "దుర్యోధనా" అని పిలిచిం దామె చాలా కోపంగా. "నువ్వూ నీభృత్యులూ నీఅమాత్యులూ చేసిన అప రాధా లన్నీ చెప్పేస్తాను. ఈసభలోవున్న రాజులూ, బ్రహ్మర్షులూ తక్కిన సభాసదులూ వింటారు. పితృపితామహక్రమంగా వస్తోం దీకౌరవ రాజ్యం. ఒకరి తరవాత వొక రనుభవించా లిది. నీతితప్పి క్రూరుడవై నువ్విది నాశనం చేసేస్తున్నావు. నీతండ్రి ధృతరాష్ట్రుడు రాజ్యం పాలి స్తున్నా డిప్పుడు. దీర్ఘదర్శి అయిన విదురు డతని కంగరక్షుగా వున్నాడు. వారిని కాదని నువ్వు రాజ్యాధికారం చెలాయిద్దా మనుకుంటున్నావు బుద్ధిలేక.

రాజయివున్న నీతండ్రి విదురుడు కూడా భీష్ము డున్నంతకాలమూ పరాధీనులే, స్వతంత్రులు కారు. ధర్మపరుడు కనక, ఈభీష్ముడు తన శపథం మనస్సులో వుంచుకుని రాజ్యంమీాద ఆశపెట్టుకోకుండా వున్నాడు. చూడశక్యం కాని యీారాజ్యం అంతా పాండురాజుది. అతని కొడుకు లున్నా రయిదుగురు. దీని కధికారులు వారు, మరె వరూకారు. పితృపితామహక్రమంగా పాండవు లనుభవించాలిది. కురు కులాని కంతకీ ముఖ్యు డిప్పుడు భీష్ము డొక్కడే. మహాత్ము డతను, సామాన్యుడు కాడు. సత్యసంధుడు. గొప్పప్రతిభాశాలి. స్వధర్మాలూ రాజ్యమూ భద్రంగా చూసుకుంటూ అత నెలా చెబితే అలా చెయ్య వలసినవాళ్లం మనం. ఆమహావ్రతుని ఆజ్ఞప్రకారమే చెబుతారు నీతండ్రీ, విదురుడూను. ధర్మం పురస్కరించుకుని మనం అలా చెయ్యవలసిందే. మరోగతి లేదు. పితృపితామహక్రమబద్ధమైన యీకౌరవరాజ్యం,

నీతండ్రి అనుజ్ఞపొంది, భీష్ముని ఆలోచనమీాద ధర్మపుత్రుడైన యుధిష్ఠిరు డేలుకోవాలి" అందామె, గట్టిగా.

# 149

## "రా జు కొ డు కు వి కా వు ను వ్వు"

గాంధారి తరవాత ధృతరాష్ట్రు డందుకున్నాడు కొడుకుని పిలిచి "నాయనా, నేను చెప్పేది విను. నీతండ్రిమీాద నీకేమయినా ఆదరగౌరవా లుంటే అలా నడుచుకో.

ప్రజాపతి అయిన చంద్రుడు మన వంశానికి మూలపురుషుడు. అతనికి ఆరోతరంవాడు యయాతి. ఈయయాతి నహుషుని కొడుకు. యయాతి కయిదుగురు కొడుకులు. వారిలో యదువు పెద్దవాడు. చివరివాడు పూరుడు. అతనే మనకోవకు మూలం. అందచేతనే మనం పౌరవులం. వృషపర్వుని కూతు రైన శర్మిష్ఠయందు యయాతికి పుట్టినవాడతను. యదువు దేవయాని కొడుకు, శుక్రుని దౌహిత్రు డతను. దేవయాని శుక్రుని కూతురు మరి. ఆయదువు మిక్కిలీ పలబరాక్రమవంతుడు. యాదవుల కతనే మూలపురుషుడు. గర్విష్ఠి అయి క్షత్రియుల నవమానించా డతను. బలగర్వంతో తండ్రిమాట కూడా లక్ష్యపెట్టలే దతను. తండ్రినీ సోదరులనూ కూడా అవమానించాడు. నాలుగు సముద్రాలకూ మధ్యస్థం అయిన భూమండలంలో అంత బలవంతుడు మరొకడు లేడు మరి. రాజుల నందరినీ స్వాధీనపరుచుకుని అత నీహాస్తినాపురంలోనే రాజ్యం పాలించాడు.

యయాతి యదువును శపించి రాజ్యంలోనుంచి వెళ్లగొట్టాడు. అతని తరవాతి కొడుకులున్నూ అత ణ్ణనుసరించే మసులుకోడంవల్ల వారిని కూడా శపించి వెళ్లగొట్టేశాడు యయాతి. మన పూర్వుడైన పూరుడు మాత్రం తండ్రి చెప్పుచేతల్లో వుండేవాడు. అందచేత, యయాతిఅతనికే

రాజ్యం ఇచ్చాడు. దీన్నిపట్టి, జ్యేష్ఠుడైనా శ్రేష్ఠుడు కాకపోతే రాజ్యానికర్హుడు కాడనీ, కనిష్ఠుడైనా మంచివాడైతే రాజ్యానికర్హుడనీ తేలుతోంది గుర్తించావా?

ఆపూరుడు లాగే, నాతండ్రి పితామహుడైన ప్రతీపమహారాజు ముల్లోకాల్లోనూ గొప్పకీర్తి గడించాడు. అతనికి ముగ్గురు కొడుకులు. దేవతలకు సర్వవిధాలా సాటివచ్చేవారు వారు ముగ్గురున్నూ. వారిలో జ్యేష్ఠుడు దేవాపి. రెండోవాడు బాహ్లీకుడు. మూడోవాడు శంతనుడు. అతనే నాపితామహుడు. గొప్పధీరుడతను.

దేవాపి మహాతేజశ్శాలి. ధార్మికుడు సత్యభాషి. తండ్రి అంటే చాలా భక్తీ భయమూను అతనికి. పరమసాధు వతను. రాజ్యంలో యావన్మందికీ మిక్కిలీ యిష్టం అతనంటే. భూతదయ చాలా యెక్కువతనికి. గొప్పదాతకూడాను. బాలురూ వృద్ధులూ కూడా అతణ్ణెంతో ప్రేమించేవారు. తండ్రిమాట అతనికి వేదవాక్యం. బ్రాహ్మణులమాట అంతకంటే యెక్కువతనికి. అన్నదమ్ములు ముగ్గురూ చాలా అన్యోన్యంగా వుండేవారు; కాని వారిలో జ్యేష్ఠుడైన దేవాపి ఆరోగ్యం మంచిది కాదు. కుష్ఠురోగి అతను.

కాలక్రమాన ప్రతీపమహారాజు వృద్ధుడైనాడు. దేవాపికి పట్టాభిషేకం చేద్దామని సర్వప్రయత్నాలూ చేశాడతను; కాని, యుక్తసమయాన, బ్రాహ్మణులూ, వృద్ధులూ, పౌరులూ, జానపదులూ కూడా వచ్చి వల్లకాదన్నారు. కుష్ఠురోగికి రాజ్యాధికారం లేదని చాలా గట్టిగా ప్రతిఘటించారు వారు. అందుకు చాలా దుఃఖించాడు ప్రతీపమహారాజు. అంగవైకల్యం వున్నవాడు రాజు కావడానికి దేవతలు కూడా అంగీకరించరు. బ్రాహ్మణులు ముఖ్యంగా యీకారణం చెప్పి నిషేధించారు. తండ్రి అవస్థచూసి దేవాపి అడవులకు వెళ్ళిపోయాడు.

ఇక బాహ్లీకు డున్నాడు. అతను, తనకి తానే విడిచిపెట్టేశాడు రాజ్యాధికారం. మేనమామగారి యింటికి వెళ్లిపోయా డతను. ఈరా జ్యం కంటే పెద్ద ఐశ్వర్యం లభించిం దతని కక్కడ. అతను అనుమతి యివ్వగా శంతనుడు రాజయినాడు. ప్రతీపుడే అతనికి పట్టాభిషేకం చేశాడు. ఇదే సూత్రం యిక్కడాను. నేను స్పష్టంగా అంగవిహీనుణ్ణి. జ్యేష్ఠుణ్ణయినా అంచేత రాజ్యాధికారం లేకపోయింది నాకు. పాండు రాజు కనిష్ఠు డయినా సర్వవిధాలా సమర్థుడు కావడంవల్ల రాజయి నాడు. అతను చనిపోగానే ఈరాజ్యం అతని కొడుకుల దయిపోయింది. నాకే రాజ్యాధికారం లేనప్పుడు నువ్వెలా రాజు వవుతావ్రా? రాజ్యాధి కారివా, కావు నువ్వు. రాజు కొడుకువే కావు. పరద్రవ్యం హరించడా నికి చూస్తున్నావు నువ్వు. అర్థం అవుతోందా ?

యుధిష్ఠిరుడే రాజు కొడుకు. వంశక్రమం అనుసరించి అతనే యిప్పుడు రాజు. ఈకౌరవకులాని కంతకూ, ఈరాజ్యానికిన్నీ అంతకూ అతనే ప్రభువు. అతను సత్యసంధుడు. అప్రమత్తుడు. శాస్త్రప్రకారం నడుచుకుంటున్నాడు. బంధువుల కందరికీ అత నంటే చాలా యిష్టం. ప్రజలున్నూ నెత్తిమీద పెట్టుకుంటున్నా రతణ్ణి. స్నేహితు లంటే యెంతో ఆదరం అతనికి. ఇంద్రియాలు జయించిన సాధు వతను. క్షమా, తితిక్షా, దమమూ, ఋజుభావమూ, సత్యనిరతీ, విద్వత్తా, అప్రమ త్తతా, భూతదయా, ప్రభుశక్తీ — ఇవి రాజయినవాడి కుండవలసిన ముఖ్యలక్షణాలు. యుధిష్ఠిరునిదగ్గిర యివన్నీ వున్నాయి. ఇక నీసంగతి. నువ్వు రాజు కొడుకువి కావు. ఆర్యుల నడవడి యేమీ లేదు నీదగ్గిర. లుబ్ధుడవు. బంధుద్రోహివి. మరి, ఇతరులకు క్రమాగతమైన యీరా జ్యం నువ్వెలా భుక్తపరుచుకోగలవ్రా; కనక, బుద్ధి తెచ్చుకో. సగం రాజ్యం పాండుపుత్రుల కిచ్చెయ్యి. రాజ్యమే కాదు, చరస్థిరా లన్నీ

కూడా సగం రాజ్యం ఇచ్చెయ్యి వారికి. పోగా మిగిలింది నువ్వూ నీతమ్ముళ్లూ అనుభవించండి, లక్షణంగా.

# 150

## దండోపాయం వొక్కటే గతి

"ధర్మనందనా, భీష్ముడూ, ద్రోణుడూ, విదురుడూ, గాంధారీ, ధృతరాష్ట్రుడూ ఇంత చెప్పినా వినిపించుకోలేదు దుర్యోధనుడు. బుస్సుమంటూ లేచి సభవిడిచి వెళ్లిపోయాడు. చావు మూడింది వాళ్లకి, అంచేత రాజులున్నూ అతనివెంట వెళ్లిపోయారు. ఇవాళ పుష్యనక్షత్రం కనక, మీరంతా కురుక్షేత్రానికి బయలుదేరండి" అంటూ మళ్లీ మళ్లీ చెప్పాడు దుర్యోధనుడా రాజులకు. అందుకు మిక్కిలీ సంతోషించి భీష్ముణ్ణి నాయకుడుగా ఎన్నుకుని, తమతమ సైన్యాలతో వారందరూ కురుక్షేత్రానికి దారితీశారు.

కౌరవుల సైన్యం పదకొండు అక్షౌహిణులు. తాళధ్వజుడైన భీష్ముడు సర్వసేనాధిపతి. యిక ఇక్కడ నీకేది బాగుంటుందని తోస్తే అది చెయ్యి. భీష్ముడూ, ద్రోణుడూ, విదురుడూ, గాంధారీ, ధృతరాష్ట్రుడూ నాయెదట అన్నమాట లివి. ఈవంశం ఛిన్నాభిన్నం అయిపోకుండా వుండడానికీ, జనులకు అభ్యుదయపరంపర కలగడానికీ, సౌభ్రాత్రం చెడకుండా వుండడానికీ సామోపాయమే అవలంబించాను మొదట నేను; కాని లాభం లేకపోయింది.

అప్పుడు భేదం ప్రయోగించాను. రాజుల కందరికీ భేదభావం పుట్టించాను. అద్భుతాలూ, ఘోరాలూ, దారుణాలూ, అమానుషాలూ అయిన పనులున్నూ చూపించా నక్కడ కొన్ని. రాజుల నందరినీ తర్జనభర్జనచేశాను. దుర్యోధనుణ్ణి తీసిపారేశాను. కర్ణుణ్ణి భయపెట్టాను. శకునిని చాలా గట్టిగా మందలించాను, మళ్లీమళ్లీ. మాయజూదంపేరు

చెప్పి దుర్యోధనాదుల నందరినీ అనేకవిధాల గర్హించాను. అంతలో సామం అవలంబించి రాజ్యభాగం యిమ్మన్నాను. కురువంశం నాశనం కాకూడదు కనకా, కార్యగతి అలావుంది కనకా పాండవులు శూరులై వుండిన్నీ, ధృతరాష్ట్రుడూ, భీష్ముడూ, విదురుడూ చెప్పిన ట్లల్లా వినయ విధేయతలతో నడుచుకుంటూ రన్నాను.

"పాండుపుత్రుల కయిదువూ" ళ్లిమ్మన్నాను చివరికి. "నీతండ్రికి వారిని పోషించవలసిన బాధ్యత వుం" దన్నాను. అయినా, యివ్వను గాక యివ్వ ననేశాడు దుర్యోధనుడు. దండోపాయం వొక్కటే మిగిలి వుం దిక. వారందరూ కురుక్షేత్రానికి వెళ్లిపోయా రప్పుడే. యుద్ధం కాకుండా రాజ్యభాగం యివ్వరు వారు. నాశనం కాక తప్ప దిక. ఒక్కళ్లకే కాదు, అందరికీ కరాళమృత్యువు కనిపెట్టుకునివుంది వాళ్లకి.

# 151

## సర్వసేనాధిపతి

"కౌరవసభలో జరిగిం దంతా విన్నారు మీరు. ఇక మనం సేనావిభాగం చేసుకోవాలి. ఏడక్షౌహిణుల సేన వుంది మనకి. ఆయే డక్షౌహిణులకూ ఏడుగురు నాయకులను చూసుకోవాలి ముందు. నావుద్దేశం యేమి టంటే? ద్రుపదుడూ, విరటుడూ, ధృష్టద్యుమ్నుడూ, శిఖండీ, సాత్యకీ, చేకితానుడూ, భీమసేనుడూ — వీరందుకు తగినవారు. యుద్ధతంత్రం బాగా తెలిసినవారు వీరు. వీరాధివీరులు. ప్రాణాలకు లెక్కచెయ్యనివారు. వేదవేత్తలు. శూరులు. మంచి చరిత్రసంపద కలవారు. సిగ్గుబిడియా లున్నవారు. నీతిమంతులు. శస్త్రాస్త్రనిపుణులు. ఏఅస్త్రం దొరికితే దాంతోనే గొప్పగా యుద్ధంచెయ్యగలవారు. మరి ఈయేడుగురిమీాదా వొక పెద్దవుండాలి. సేనావిభాగపద్ధతులు బాగా తెలిసినవాడు కావా లతను. అక్కడివారు భీష్ముణ్ణి సర్వసేనాధిపతిగా

ఎన్నుకుని వున్నారు. ఆభీష్ముణ్ణెదిరించి నిలవగలవాడు కావాలి మనకి. అగ్నివంటివాడు భీష్ముడు, సామాన్యుడు కాడు. సహదేవా, ముందు నీవుద్దేశం చెప్పు" అన్నాడు ధర్మరాజు.

"విరటుడందుకు తగ్గవా డని నావుద్దేశం" అన్నాడు సహదేవుడు. మనబంధువుల్లో ముఖ్యు డతను. అతనికీ మనకూ కూడా సుఖదుఃఖాలు సమానమే. మహావీరు డతను. అతణ్ణాశ్రయించే మన రాజ్యభాగం సంపాదించుకోవా లనుకుంటున్నాం మనం. యుద్ధం అంటే చాలా సంబరం అతనికి. భీష్ముణ్ణీ తక్కిన మహారథులనూ కూడా విలాసగా అడ్డగించగల డతను" అంటూ కారణాలున్నూ చెప్పా డతను.

"మన మామ ద్రుపదమహారా జందుకు తగ్గవాడు. వయస్సూ, శాస్త్రపరిజ్ఞానమూ, ధైర్యమూ, వంశమర్యాదా, జనస్తోమతూ — వీటినిబట్టి చూస్తే ముందు చెప్పతగ్గవా డతను. సిగ్గుబిడియా లున్నవాడు. ద్రోణునికంటే ఘనుడు. ఎవడూ చెనకలే డతణ్ణి. ద్రోణు డన్నా భీష్మ డన్నా మహాకసి అతనికి. కొడుకులూ, మనమలూ — అదో పెద్దబలగం అతనిది. ధర్మపత్నితో కలిసి ఉగ్రతపస్సు చేసినవాడు. ద్రోణుణ్ణి సంహారించా లన్న కసితోనే అంత తపస్సూ చేశా డతను. తండ్రివంటివాడు మనకు. ద్రోణుడూ, భీష్ముడూ కలిసే మీదపడ్డా లెక్కచెయ్య డతను" అని చెప్పాడు నకులుడు.

"ధృష్టద్యుమ్ను డొక్కడే యిందుకు తగ్గవా డని నావుద్దేశం" అంటూ మొదలుపెట్టా డర్జునుడు. "తపఃప్రభావంవల్లా, ఋషులను సంతోషపెట్టివుండడంవల్లా కవచీ, ఖడ్గీ, ధన్వీ అయి, దివ్యాశ్త్రాలు పూన్చిన రథం యెక్కివుండి అగ్నిజ్వాలలా మెరిసిపోతూ అగ్నికుండంలో పుట్టినవా డతను. అతని రథం బయలుదేరితే మేఘం వురుముతున్నట్టుంటుంది. సింహానికి పోలిక చెప్పతగ్గవా డత నొక్కడే. రంకె వేస్తే సింహం గర్జించినట్టుంటుం డతను. సింహపరాక్రమం అతని పథా

క్రమంనుుం దెందుకూ చాలదు. ఎలాంటి గొప్పశస్త్రాలూ కూడా నాట వతనికి. అతని పుట్టుకే ద్రోణుణ్ణి సంహరించడానికి. సత్యనిరతుడు. ఇంద్రియాలు జయించిన ధీరుడు. భీష్ముని బాణాలు తట్టుకోడం అంటే మాటలుకాదు. అవి తగిలితే వజ్రాయుధం తగిలిన ట్టుంటుంది. పాము కోర ల్లాంటి వవి. యమదూతల వేగంవాటిది. అగ్గిపడ్డ ట్టుంటుంది మీాదపడితే అవి. పరశురాముడు తప్ప వాటిని తట్టుకున్న వా డింత వరకూ లేడు. వజ్రనిష్పేషా లవి. మహాదారుణాలు. భీష్మ్మ ణ్ణెదిరించా లంటే అతను తప్ప మరొకడు లేడని నానమ్మకం. అతని వేగం సాటి లేనిది. చిత్రవిచిత్రంగా యుద్ధంచెయ్యడంలో అతనికి సాటి అయిన వాడు పృథివిమీాద మరొకడు లేడు. అతని కవచం యెవరూ బద్దలు కొట్టలేరు ” అని కూడా చెప్పా డతను.

“ భీష్మ్మణ్ణి సంహరించడానికే పుట్టా డన్నారు శిఖండిని సిద్ధులూ మహర్షులూను. “ యుద్ధరంగంలో నిలిచి అతను అస్త్రాలు ప్రయోగిస్తూ వుంటే సాక్షాత్తుగా పరశురాముడే అన్న ట్టుంటా ” డనిన్నీ చెప్పా రెందరో పెద్దలు. అతణ్ణి జయించగలవాణ్ణి చూడలేదు నేనెక్కడా. ఎదిరించి, దెబ్బకి దెబ్బకొట్టి సంహరిస్తే శిఖండే సంహరించాలి భీష్మ్మణ్ణి. అతను సర్వసేనాధిపతి కావడం నాఅభిప్రాయం” అన్నాడు భీమసేనుడు.

అంతా విన్నాడు యుధిష్ఠిరుడు. “అయితే ” అంటూ ప్రారంభించా డతను. “జగత్తంతా యెరుగును కృష్ణుడు. ఎవరి సారాసారాలూ, ఎవరి బలాబలాలూ, ఎవరి అభిప్రాయాలూ ఎలాంటివో కూడా అత నొక్కడే యెరుగును. కనక, అతనెవరిని చెబితే వారినే సర్వసేనాధిపతిగా చేసుకోడం మంచి దని నాఅభిప్రాయం. ఆసర్వసేనాధిపతి సమర్థుడు కానివ్వండి, అసమర్థుడు కానివ్వండి — యువకుడు కానివ్వండి, వృద్ధుడు కానివ్వండి మన కేమీా భయంలేదు. ఏమంటే ? తుదకు జయం అయినా అపజయం అయినా అదంతా కృష్ణుని చేతిలో

వుంది. మన భావాభావాలూ, మన సుఖాలూ, మన రాజ్యమూ, మన ప్రాణాలూ కూడా అతని చేతిలో వున్నాయి. ధాత అయినా విధాత అయినా అతనే మనకి. సిద్ధిమాత్రం అతని అధీనంలో వుంది.

రాత్రి గడిచిపోవచ్చింది. కనక, త్వరగా చెప్పు మని కోరుతున్నా నతణ్ణి. అతనికి వశవర్తి అయివుండేవాణ్ణి సర్వసేనాధిపతిగా చేసుకుని, ఆయుధాలకు పూజచేసి రక్షాబంధనం కట్టుకుని బ్రాహ్మల ఆశీర్వచనాలు పొంది తెల్లవారడం తడవుగా యుద్ధరంగానికి వెళ్లిపోదాం మనం" అన్నా డతను.

ఒక్కమాటు అర్జునునికేసి చూసి అందుకున్నాడు కృష్ణుడు. "మీరు చెప్పినవా రందరూ సర్వసేనాధిపతిగా వుండతగ్గవారే, సందేహం లేదు. గొప్ప యోధులే వారు. నీశత్రువులను సంహారించడానికి వారందరూ సమర్థులే. ఇంద్రుణ్ణి కూడా గడగడలాడించగలవారు వారు. పరమలుబ్ధులూ, పాపాత్ములూ అయిన దుర్యోధనాదు లొక లెక్కా వారికి? నేను కూడా చాలా ప్రయత్నంచేశా నక్కడ, యుద్ధం తప్పిద్దా మనీ, యెలాగయినా సంధిచేద్దా మనీని. ధర్మానికి రుణం తీర్చుకుంటున్నాం మనం. మన లెవ్వరూ నిందించ లేరిక. పిల్లకాయల్లో లెక్క దుర్యోధనుడు, ఏమీ తెలియ దతనికి. తనకి చాలా బలం వుందనీ, తనంత యోధు మరి లేడనీ అనుకుంటున్నా డతను. ఏమయినా, సైన్యం సిద్ధంచేసుకోవాలి మనం. ఆకౌరవయోధులను అతి సుళువుగా కొట్టెయ్యవచ్చు మనం. అర్జునుణ్ణి సాక్షాత్కరంటేనే చాలు నిలవలేరు, పారిపోతారు వారు. భీమసేనుడూ, నకులసహదేవులూ, యుయుధానుడూ, ధృష్టద్యుమ్నుడూ, అభిమన్యుడూ, ద్రౌపదేయులూ, విరాటద్రుపదులూ, — వీరినికూడా చూస్తే యింకేమన్నా వుందా? మన బలం మిక్కిలీ సారంగలది. చెనకడాని కెవరికీ సాధ్యం కానిది. దుర్యోధనుని బలగం నాశనంచెయ్యడానికింతకంటె అక్క

స్లేదు మనకి. కనక, ధృష్టద్యుమ్నుణ్ణి సర్వసేనాధిపతిగా చేసుకుంటే బాగుంటు దని నావుద్దేశం” అని తేల్చాడు చివరి కతను.

ఇది విన్నారు, ఉబ్బిపోయి రాజు లందరూ సింహనాదాలు చేశారు. “లేవండి. పదండి. పోడిచెయ్యండి. నరికెయ్యండి. కుమ్మెయ్యండి—” ఇలా బొబ్బలు వేడుతూ సైనికు లందరూ ఉరకడమూ, దుమకడమూ, పరుగెత్తడమూ ప్రారంభించారు. అది చూసి యేనుగులు గీపెట్టాయి. గుర్రాలు సకిలించాయి. దిక్కులు బద్దలయిపోయేటట్టు. ఉరుముతు న్నట్టు రథాలున్నూ కదిలాయి. శంఖా లురిమాయి. దుందుభులు మోగాయి. ఆసైనికసమాగమనం చూడగా — రథాలూ, గుర్రాలూ, ఏనుగులూ, కాల్బంట్లూ — ఈఅడావుడిన్నీ చూడగా అల్లకల్లోలం అయిపోయివున్న మహాసముద్రంలా వుంది. కొందరు కవచాలు తొడు క్కోసాగారు. కొందరు పరుగెత్తసాగారు. “రండి, రండి” అంటూ కొందరు వారినీ వారినీ తొందరపెట్టసాగారు.

ఆసేన బయలుదేరడం గంగా ప్రవాహం లాగ చూడశక్యం కాకండా వుంది. భీమసేనుడూ, నకులసహదేవులూ, అభిమన్యుడూ, ద్రౌపది కొడుకులూ, ధృష్టద్యుమ్నుడూ, పాంచాలురూ సేన కంతకూ ముందున్నారు. అప్పుడా సైన్యఘోష పర్వకాలంలో పొంగిన సము ద్రం ఘోషలావుంది. స్వర్గానికిన్నీ తాకింది వెళ్లి.

సేన కంతకూ మధ్యగా వున్నాడు యుధిష్ఠిరుడు. సామగ్రితో నిండి వున్న బళ్లూ, అంగడి సరుకులు బళ్లమీద వేసుకుని వైశ్యులూ, భోగంపడుచుల బళ్లూ, డేరాల బళ్లూ, రథాలూ, బొక్కసమూ, శత ఘ్నులూ మొదలయిన యంత్రాలూ, రణవైద్యులూ — వీరంతా అతనివెనక బయలుదేరారు. ఆడవాళ్లందరితోనూ ద్రౌపది ఉపప్లావ్యం లోనే వుండిపోయింది. అక్కడ స్థావరగుల్మాలూ దాసదాసీజనులూకూడా వున్నారు.తక్కినసైన్యంఅంతా తరలించుకునివెళ్లిపోయాడు పాండవులు.

పాండవులూ, రాజులూ, యోధు లందరూకూడా బ్రాహ్మణులకు ఆవులూ, భూములూ, బంగారమూ, రత్నాలూ సత్కరించి వారి ఆశీర్వచనాలు పొందే బయలుదేరారు. కేకయసోదరులూ, ధృష్టకేతువూ, వసుదానుడూ, శిఖండీ కవచాలూ, అస్త్రశస్త్రాలూ ధరించి యుధిష్ఠిరుని తరవాత బయలుదేరారు, సింహనాదాలు చేసుకుంటూ. విరటరాజూ, యాజ్ఞసేనుడూ, సుధర్ముడూ, కుంతిభోజుడూ, ధృష్టద్యుమ్నుని కొడుకులూ, నలభై వేలరథాలూ, రెండులక్షల గుర్రాలూ, అయిదులక్షల కాల్బంట్లూ, అరవై వేల ఏనుగులూ వెంటబెట్టుకుని చేకితానుడూ. సాత్యకీ, కృష్ణుడూ, అర్జునుడూ ఆతరవాత వెళ్ళారు.

కురుక్షేత్రం చేరుకున్నాక, పాండవులూ, తక్కిన యోధులూ రంకెలువేసుకుంటూ పరుగు లెత్తే ఆబోతుల్లా వున్నారు. శంఖాలూదారు వారు. కృష్ణుడూ అర్జునుడూ కూడా శంఖాలు పూరించారు. పిడుగులు కురుస్తున్నట్టువున్న పాంచజన్యం కూతలు విని యోధు లందరూ యెగిరి గంతులువేశారు. దుందుభిధ్వానాలూ, శంఖారావాలూ, సింహనాదాలూ — వీటితో ఆకాశం బూరటిల్లిపోయింది. భూమి జవజవలాడిపోయింది. సముద్రా లల్లకల్లోలం అయిపోయాయి.

# 152

## శిబిరనిర్మాణం

యుధిష్ఠిరుడు, కురుక్షేత్రాన, చక్కని ప్రదేశాన దండువిడియించాడు. సమంగా వుండా ప్రదేశం, మిట్టపల్లా ల్లేకుండా. శ్మశానాలూ, దేవాలయాలూ, మహర్షుల ఆశ్రమాలూ, తీర్థాలూ, చైత్యాలూ — ఇలాంటి వేవీ ఆచుట్టుపట్ల లేకుండా చూసి ఆప్రదేశం ఏరుకున్నాడతను. చాలా సారవంతమైన ప్రదేశం అది. కొంతసే పొకచోట విశ్రమించి ఆప్రదేశం అంతా పరిశీలనగా చూడ్డానికి బయలుదేరా

డతను. రాజు లందరూ బయలుదేరా రతనితో. కృష్ణుణ్ణి కూడా వెంట బెట్టుకునే బయలుదేరా రందరూ. అక్కడక్కడ దుర్యోధనుని సైనికు లున్నారు; కాని వారి నవతలికి సాగనంపేసి, పరిశీలించారు వారు.

సాత్యకీ, ధృష్టద్యుమ్నుడూ, యుయుధానుడూ, ఒక్కొక్క గుడా రాని కింత అని స్థలాలు కొలిచి నిర్ణయించారు. అక్కడ హిరణ్వతి అని వొక నది ప్రవహిస్తోంది. నీరు బహూశుచిగానూ, మధురం గానూ వుంది. బాడీబందా, రాయీరప్పా లేని రేవు లున్నా యెన్నో. అవతలిగట్టూ యివతలిగట్టూ కూడా తీర్చిదిద్దిన ట్టున్నాయి. కృష్ణు డక్కడ మిక్కిలీ గంభీరమైన కందకం తవ్వించాడు. దాని కాపలా కూడా పెట్టాడు మంచియోధులను చూసి.

పాండవుల కయిదుగురికీ చాలా చక్కని డేరా లేర్పాటుచేశారు మొదట. రాజులకున్నూ వాటికి తీసిపోనివే సిద్ధంచేయించాడు ధర్మనం దనుడు. ఒక్కొక్కరాజు కొక్కొక్కడేరా, ఎక్కడికక్కడే భక్ష్యాలూ భోజ్యాలూ సమృద్ధిగా చేర్చివుంచారు.

దూరాన వుండి చూస్తే, దేవతల విమానాల్లా వున్నా యా డేరాలు. ఎందరో శిల్పులున్నూ ప్రవేశించా రక్కడ. శాస్త్రం బాగా చదువుకుని మంచి అనుభవం గడించివున్నవారు వారందరూ. పెద్దపెద్ద జీతాలు ఏర్పాటయివున్నాయి మొదణ్ణుంచీ వారికి. సర్వోపకరణాల తోనూ వచ్చారు వారు. శాస్త్రపరిజ్ఞానంతోపాటు అనుభవమున్నూ విశేషంగా సంపాదించివున్న వైద్యులకున్నూ లెక్కలే దక్కడ. రణ రంగంలో కావలసిన ఔషధాలూ, శస్త్రాలూ, పరికరాలూ చాలా యెక్కువగా వున్నాయి వారి దగ్గిర.

ధనుస్సులూ, అల్లెత్రాళ్లూ, బాణాలూ, అమ్ములపొదులూ, గద లూ, కత్తులూ, కుంతలాలూ, తోమరాలూ, పరిఘలూ, ముసలాలూ మొదలైన ఆయుధాలు గుట్టలు గుట్టలుగా చేర్చారక్కడ. తేనే

నెయ్యీ మొదలయినవిన్నీ ముమ్మరంగా చేర్చారు. ప్రతీ డేరాలోనూ ఊకనెగళ్ళూ, మంచినీరూ, ఆహారపదార్థాలూ, శయ్యలూ, ఆసనాలూ విశేషంగా వున్నాయి.

ఏనుగులకు లెక్కలేదు. వాటికన్నిటికీ దృఢమైన కవచాలున్నాయి. కొన్ని కవచాలకు పదునైన మేకులు బిగించారు. శత్రువుల యేనుగులు దగ్గిరికివచ్చాయా, ఆమేకులు గుచ్చుకుని యమబాధ పడ్డాయన్నమాటే.

పాండవు లక్కడ ప్రవేశించా రని విని యెందరో రాజులు వచ్చారు వారిని చూడ్డానికి. రకరకాల వాహనాలమీద వచ్చారు వారు. తమ తమ సైన్యాలునూ వెంటబెట్టుకు వచ్చారు. భూరిదక్షిణ లిచ్చి యెన్నో యజ్ఞాలుచేసినవారున్నూ వున్నా రారాజులలో. వారందరూ పాండవులకు జయం చేకూర్చడానికి వచ్చారు.

# 153

## కౌరవుల సేనా సన్నాహం

"మహాత్మా, యుద్ధమే స్థిరపరుచుకుని, యుధిష్ఠిరుడు, కురుక్షేత్రంలో విడిదిచేశా డని చెప్పావు. శ్రీకృష్ణు డతనికి పెట్టనికోట. విరటుడూ, ద్రుపదుడూ, కేకయులూ, యాదవులూ అతణ్ణి పరివేష్టించి వున్నా రనీ, దేవతలు పరివేష్టించివున్న ఇంద్రుడా అన్నట్టున్నా డనీ చెప్పావు. మరి, యిదంతా తెలుసుకుని దుర్యోధను డేమిచేశాడూ? ఆకురుజాంగలప్రదేశంలో యుద్ధం యెలా జరిగిందీ? వారూ వీరూ గూడా ఇంద్రుణ్ణి జయించగలవారే మరి. కనక, యిదంతా నాకు వివరంగా చెప్పవయ్యా" అనడిగాడు జనమేజయుడు. విన మని వైశంపాయనుడు ప్రారంభించాడు.

కృష్ణుడు వెళ్ళిపోయాక, దుర్యోధనుడు, కర్ణుణ్ణీ, దుశ్శాసనుణ్ణీ, శకునినీ పిలిచాడు. "వచ్చినపని కాకుండానే వెళ్ళిపోయాడు కృష్ణు డిక్క-

ణ్ణుంచి. సొంతానికి అతనికే మనమీద చాలాకోపం. అంచేత, పాండు పుత్రులను బాగా ప్రోత్సహిస్తా డతను. మనతో యుద్ధం చెయ్యడానికే అతని పూనిక. భీమసేనునకూ అర్జునునకూ కృష్ణుడు చెప్పిందే వేదం. ధర్మనందను డందామా, భీమసేనుడు గీసినగీటు దాటడు. కాక, — వారి నందరినీ మన మిదివరలో బాగా అవమానపరిచే వున్నాం.

దీనికి సాయం, విరాటుడూ ద్రుపదుడూ కూడా యిదివరకే మనతో విరోధపడివున్నారు. వారిప్పు డక్కడ సేనాధిపతులు. విశేషించి, వారున్నూ కృష్ణుడు చెప్పినట్టే నడుచుకుంటారు. కనక, పాండుపుత్రులకూ మనకూ సంకులసమరమే జరుగుతుంది. కొంచెమున్నూ సందేహం లేదు.

మీరు దీక్షగా యుద్ధప్రయత్నాలు సాగించాలి. వచ్చిన రాజుల కందరికీ, కురుక్షేత్రంలో మంచిమంచి గుడారా లేర్పాటుచేయించండి మొదట. ఎక్కడి కక్కడే సకలసమపాయాలూ వుండాలి వాటిలో. ఏవిధంగానూ శత్రువు లాక్రమించుకోగలిగేట ట్టుండగూడ దవి. నీరు సమృద్ధిగా వుండాలి. ఆహారపదార్థాలున్నూ సమృద్ధిగా వస్తూవుండాలి. అవి శత్రువులకు చిక్కకుండా వుండేటట్టున్నూ చూడాలి.

ఆయుధసామగ్రి కొండలంతేసి గుట్టలు పెట్టించండి. పతాకాలూ ధ్వజాలూ కొల్లలుగా వుండాలి. హస్తినాపురంనుంచి కురుక్షేత్రం దాకా మార్గం సరిచేయించండి. తెల్లవారితే కురుక్షేత్రానికి వెళ్లిపోవాలని సైనికులకున్నూ అందరికీ చాటింపుచేయించండి'' అని చెప్పాడతను.

ఇది విని పొంగిపోయారు రాజులూ యోధులూను. కూచున్న వారు కూచున్నట్టుగా ఎగిసిపడి లేచి జబ్బచరుచుకుంటూ సింహనాదాలున్నూ చేశారు వారు. విలవగల బట్టలు కట్టుకున్నారు. పాగాలు చుట్టుకున్నారు. రత్నాభరణాలు ధరించారు. చందనమూ అగురూ పూసుకున్నారు. అంగదాలూ కేయూరాలూ కూడా ధరించారు.

దతను. భీష్ముడు చెప్పినా లాభం లేకపోయింది. విదురుడు చెప్పినా ప్రయోజనం లేకపోయింది. నేను చెప్పినా ఉపయోగం లేకపోయింది, అందరినీ కాదనేశా డతను, నిర్భాగమాటంగా. అతనికి ధర్మం అక్కర లేదు. పరువూ ప్రతిష్ఠా అక్కర్లేదు. కర్ణునిమాట ఆసరాచూసుకుని తాను జయించేసినట్టే అనుకుంటున్నా డతను. చివరి కేమీ చెయ్య లేకపోయా ననుకో; కానీ నన్ను బంధించడానికిన్నీ చూశా డతను. నిజానికి, భీష్ముడూ ద్రోణుడూ కూడా చెప్పవలసినట్లు చెప్పలేక పోయా రతనికి. ఒక్క విదురుడు మాత్రమే కచ్చితంగా చెప్పగలిగాడు. ఒకవిధంగా చూస్తే, భీష్ముడూ ద్రోణుడూ కూడా దుర్యోధనునకు పక్క తాళం వేస్తున్నట్టే లెక్క. మూఢు లైన కర్ణుడూ, దుశ్శాసనుడూ, శకునీ కూడా నీవిషయమై నీచంగానే మాట్లాడారు. క్లుప్తంగా చెబుతున్నాను, దురుక్తులే పలికాడు దుర్యోధనుడు. ఈ రాజుల దగ్గిరా, సైనికుల దగ్గిరా కూడా లేని సద్గుణా లున్నా యతని దగ్గిర, సమృద్ధిగా. వాటిదగ్గిరనుంచి యేమీ పుచ్చుకోకుండా మనం సంధిచేసుకోము గదా? అపుచ్చుకోతలిచింది యుద్ధం చేస్తేనేవస్తుంది మనకి" అని స్పష్టంగా చెప్పాడు చివరికి.

ఈమాట విన్నారు రాజులు. మాట్లాడకుండా ధర్మనందనుని కేసి చూసి వూరుకున్నారు. అది గుర్తించా డతను. వెంటనే భీమార్జున నకులసహదేవులతో కలిసి "యుద్ధం చెయ్యవలసిందే" అనేశాడు, దృఢంగా. అది విని కిలకిల్లాడారు సైనికులందరూ. యుద్ధం అంటే అంతసంబరంగా వుంటుందని, వారికి.

చుట్టాలనీ వారిని చంపాలి యుద్ధం చేస్తే. ఇదీ ధర్మనందనుని బాధ. భీమసేనుణ్ణీ అర్జునుణ్ణీ పిలిచా డతను. "ఏపని చెయ్యవలసివస్తుం దని జంక అడవులకు వెళ్లి నానాదుఃఖాలూ అనుభవించామో అదే చెయ్యవలసివస్తోం దిప్పుడు. యుద్ధంకోసం మనం ప్రయత్నం చెయ్యనేలే

రథాలు సిద్ధంచేశారు సారథులు. ఏనుగులను ఆయత్తపరిచారు మావటివాళ్లు. గుర్రాలను సిద్ధపరిచారు అశ్వారోహకులు. కవచాలూ ఆయుధాలూ కూడా సిద్ధపరిచారు. రకరకాల ఆయుధాలు చేతపట్టి చక్కావచ్చారు కాల్బంట్లు. యోధులే కాక పౌరులున్నూ ఉత్సాహభరితు లయిపోయారు. హాస్తినాపురం అంతా సముద్రంలా ఉన్నట్టుంది. జనుల గుంపులే సుడిగుండాలు. రథాలూ, గుర్రాలూ, ఏనుగులూ — ఇవి రకరకాల చేపలు. శంఖదుందుభిధ్వానం సాగరఘోష. ఖడ్గాలే రత్నాలు. చిత్రవిచిత్రాలైన కవచాలూ ఆభరణాలూ — ఇవి పగడాలు. శస్త్రాలే నురగ. మేడలే పర్వతాలు. ముగ్గులతో నిండివున్న వీధులే మడుగులు. యోధులే చంద్రోదయం. దుర్యోధనుడే మహాసముద్రం. ఉత్తుంగతరంగాలతో ఆకాశం అంటుతున్న సముద్రంలా ఉన్నట్టుంది.

# 154

## దృ ఢ ని శ్చ యం

ధర్మనందనునకు, కృష్ణుడు చెప్పిన దుర్యోధనుని మాటలు జ్ఞాపకం వచ్చాయి. "కృష్ణా" అన్నాడతను. "దుర్యోధనుడు యుద్ధాని కెలా సిద్ధపడుతున్నాడయ్యా? కులక్షయం చేస్తుంటే గానీ యుద్ధం? సరే, మన మిప్పు డేమిటీ చెయ్యడం? మనం స్వధర్మం తప్పకూడదు. అందు కుపాయం చూసుకోవాలి. మావు ఉద్దేశాలూ దుర్యోధనుని ఉద్దేశాలూ నీకు బాగా తెలుసు. భీష్ముడూ విదురుడూ చెప్పిందీ విన్నావు నువ్వు. కుంతి సందేశమున్నూ నువ్వు చెప్పిందే మాకు. ఇదంతా బాగా ఆలోచించి మన మిప్పుడు చెయ్యవలసింది దేమిటో నిర్ధారణ చెయ్యి మరి" అన్నాడతను.

"సకలమూ విప్పి చెప్పేవున్నానే" నన్నాడు కృష్ణుడు. "ధర్మార్థాలకు భంగం లేకుండా చూసి మరీ చెప్పాను. అయినా విపులంగా కొత్త

దతను. భీష్ముడు చెప్పినా లాభం లేకపోయింది. విదురుడు చెప్పినా ప్రయోజనం లేకపోయింది. నేను చెప్పినా ఉపయోగం లేకపోయింది, అందరినీ కాదనేశా డతను, నిర్మొగమాటంగా. అతనికి ధర్మం అక్కర లేదు. పరువూ ప్రతిష్ఠా అక్కర్లేదు. కర్ణుని మాట ఆసరాచూసుకుని తాను జయించేసినట్టే అనుకుంటున్నా డతను. చివరి కేమీ చెయ్య లేకపోయా డనుకో; కాని నన్ను బంధించడానికిన్నీ చూశా డతను. నిజానికి, భీష్ముడూ ద్రోణుడూ కూడా చెప్పవలసినట్టు చెప్పలేక పోయా రతనికి. ఒక్క విదురుడు మాత్రమే కచ్చితంగా చెప్పగలిగాడు. ఒకవిధంగా చూస్తే, భీష్ముడూ ద్రోణుడూ కూడా దుర్యోధనునకు పక్కతాళం వేస్తున్నట్టే లెక్క. మూఢులైన కర్ణుడూ, దుశ్శాసనుడూ, శకునీ కూడా నీవిషయమై నీచంగానే మాట్లాడారు. స్పష్టంగా చెబుతున్నాను, దురుక్తులే పలికాడు దుర్యోధనుడు. ఈ రాజుల దగ్గిరా, నీ సైనికుల దగ్గిరా కూడా లేని సైన్యాలు లున్నా యతని దగ్గిర, సమృద్ధిగా. వాడిదగ్గిరనుంచి యేమీ పుచ్చుకోకుండా మనం సంధిచేసుకోము గదా? అపుచ్చుకోతలిచింది యుద్ధం చేస్తే నేవస్తుంది మనకి" అని స్పష్టంగా చెప్పాడు చివరికి.

ఈమాట విన్నారు రాజులు. మాట్లాడకుండా ధర్మనందనుని కేసి చూసి ఊరుకున్నారు. అది గుర్తించా డతను. వెంటనే భీమార్జున నకులసహదేవులతో కలిసి "యుద్ధం చెయ్యవలసిందే" అనేశాడు, దృఢంగా. అది విని కిలకిల్లాడారు సైనికులందరూ. యుద్ధం అంటే అంతసంబరంగా వుంటుంది, వారికి.

చంపకూడని వారిని చంపాలి యుద్ధం చేస్తే. ఇదీ ధర్మనందనుని బాధ. శ్రీకృష్ణుణ్ణీ అర్జునుణ్ణీ పిలిచా డతను. "ఏపని చెయ్యవలసివస్తుం దని జలక ఉపపులకు వెళ్ళి నానాదుఃఖాలూ అనుభవించామో అదే చెయ్యవలసివస్తోం దిప్పుడు. యుద్ధంకోసం మనం ప్రయత్నం చెయ్యనేలే

## 155

## కౌరవసేనావిభాగం

ఆరాత్రి గడిచిపోయింది. వెంటనే తన పదకొండు అక్షౌహిణుల బలమూ చక్కగా విభజన చేశాడు దుర్యోధనుడు. కాల్బంట్లూ, ఏనుగుల బలగమూ, రథాలబలగమూ, గుర్రాలబలగమూ విడతీసి కొంతకొంత కలిసి — మొత్తం మూడుభాగాలు చేసి, ఒకభాగం ముందూ, ఒకభాగం మధ్యా, ఒకభాగం వెనకా వుండమన్నాడతను.

రథభాగా లేవయినా చెడిపోతే బాగుచేసుకోడానికి తగ్గ కర్రలు ప్రతీరథంతోనూ జాగ్రత్తచేసుకున్నారు రథికులు. రథాలు కప్పే వరూథాలూ రథాలకు కట్టే తూణీరాలూ కూడా సమృద్ధిగా జాగ్రత్త పెట్టుకున్నారు.

రథికులూ, గజయోధులూ, అశ్వికులూ కూడా ఎవరి కభిమానపాత్రాలయిన ఆయుధాలు వారు పుచ్చుకున్నారు. వాటిలో తోమరాలున్నాయి. శక్తులూ, ఋష్టులూ, కత్తులూ, ఖడ్గాలూ, [illegible]లూ,

శూలాలూ, ముద్గరాలూ, కుఠారాలూ, ధనుస్సులూ, బాణాలూ, గదలూ, చక్రాలూ, కుద్దాలాలూ, భిందిపాలాలూ, శూర్పపిటకాలూ, ఇలాంటివీ, యింకా యెన్నో రకాలూ వున్నాయి. పొంగులువారేలా కాచి శత్రువులమీద చల్లడానికి నూనెలూ, బెల్లప్పానకాలూ పుచ్చుకున్నారు. తాచుపాములతో నిండిన కుండలున్నూ పుచ్చుకున్నారెన్నో. సంకులసమరం జరిగేటప్పుడు మూతలు విప్పి ఆపాములను శత్రువులమీదికి విసురుతారు. పాశాలు పుచ్చుకున్నారెన్నో, జనపనారపగ్గాలూ, గోనునారపగ్గాలూనూ అవి. విసిరి శత్రువుల మెడలకు వేసి లాగి పడగొడతారు వాటితో.

ఒక్కొక్క ఏనుగుమీద ఏడుగురేసి యోధులు. వారిలో యిద్దరు అంకుశధారులు. ఇద్దరు ఖడ్గధారులు. ఇద్దరు ధనుర్ధారులు. శక్తిధరు డొకడు, రథాలమీద కూడా ఏడుగురేసి ఉంటారు. ఒకడు సారథి. గుర్రాలమీద ఒకడు. పార్శ్వగ్రాహు లిద్దరు. రథికు లిద్దరు. వెనకవైపున వొకడు. గుర్రాలకు నాలి కాక మరో నలుగు రుంటారు వెనక.

ఒక్కొక్క రథానికి పదిమంది గజయోధులు. ఒక్కొక్క ఏనుగుకు నలుగురేసి అశ్వికులు. ఒక్కొక్క గుర్రానికి పదిమంది కాల్బంట్లు. అయిదువందల యేనుగులూ అయిదువందల రథాలూ — ఇది వొక సేన. మూడు సేన లొక గుల్మం. మూడుగుల్మా లొకగణం. పదిసేన లొక పృతన. పది పృతన లొక వాహిని. సేనా, వాహినీ, పృతనా, ధ్వజినీ, చమువూ, అక్షౌహిణీ — ఇవన్నీ సేనాసమూహాల పేర్లు.

ఇలాంటి అక్షౌహిణులు కౌరవులవి పదకొండూ, పాండవులవి ఏడున్నూ. దుర్యోధనుడు, కృపుణ్ణీ, ద్రోణుణ్ణీ, శల్యుణ్ణీ, జయద్రథుణ్ణీ, సుదక్షిణుణ్ణీ, కృతవర్మనూ, అశ్వత్థామనూ, కర్ణుణ్ణీ, భూరిశ్రవుణ్ణీ, శకునినీ, బాహ్లికుణ్ణీ ఒక్కొక్క అక్షౌహిణికి నాయకులుగా ఏర్పాటు

చేస్తాము. మీరు మాత్రం అలా కాదు. మీరందరూ యెవరికి వారే. వొకరితో కలియరు. ఎవరికి వారు తమకి తోచినట్టే చేస్తారు మరి" అని వారికి బదులు చెప్పారు క్షత్రియులు, తాము ధర్మపరులూ, ధర్మ రక్షకులూను కనుక. ఇది అర్థంచేసుకుని, బ్రాహ్మలు, తమలో, నీతి విశారదుడూ, మహాశూరుడూ అయిన వొక బ్రాహ్మణ్ణి నాయకునిగా ఎన్నుకున్నారు. దాంతో, వారే జయించారు, చివరికి.

తమకు విజయము కావాలనుకునేవారెవరయినా చెయ్యవలసిందింతే. బలగం యెంత వుండినా దాని కొక నాయకు డుండాలి. ఆనాయకుడు నీతికోవిదుడయి వుండాలి. శూరుడయి వుండాలి. అందరి శ్రేయస్సూ కోరేవాడయి వుండాలి. ముఖ్యంగా నిష్కల్మషహృదయుడయి వుండాలి. ఇటు చూస్తే, నీతిలో శుక్రాచార్యునకు నువ్వొక్కడవే సాటి. నా శ్రేయస్సునూ కోరుతున్నావు నువ్వెప్పుడూ. ధర్మపరుడవు. నీ యెదుట యెవరూ నిలవలేరు. కనక, సర్వసేనాధిపత్యం వహించి నువ్వు మమ్మల్ని నడిపించవలసింది. తేజశ్శాలులకు సూర్యుడూ, వీరుధాలకు చంద్రుడూ, యక్షులకు కుబేరుడూ, దేవతల కింద్రుడూ, పర్వతాలకు మహామేరువూ, పక్షిజాతుల కన్నిటికీ గరుత్మంతుడూ, దేవసేనలకు కుమారస్వామీ, వసువులకు అగ్నీ లాగ నువ్వే మాకు రక్షా గతిన్నీ. నువ్వనుగ్రహిస్తే దేవతలున్నూ మమ్మల్నేమీ చెయ్యలేరు. దేవతల కందరికీ ముందుంటా డగ్ని. అలాగే మాకు నువ్వు ముందుండు. ఆవులన్నీ ఆబోతు వెంట వుంటాయి. అలాగే మేము నిన్ననుసరించి నడుచుకుంటూ యుద్ధం చేస్తాము." అంటూ ప్రార్థించాడు దుర్యోధనుడు.

"ఏమీ అభ్యంతరం లేదు నా" కన్నాడు భీష్ముడు. "అయితే, నాకు, మీ రెంతో పాండవులూ అంతే. వారి శ్రేయస్సునూ కోరవలసినవాణ్ణి నేను. అయినా, నేను చేసుకున్న నియమం అనుసరించి

నేను నీపక్షంగా యుద్ధం చెయ్యవలసివుంది. నిజానికి నన్నెదిరించగల యోధుడు ఈపృథివిమీద లేడు. ఒక్క అర్జునుడి విషయం మాత్రం అలా కాదు. మిక్కిలీ బుద్ధిమంతు డతను. దివ్యాస్త్రా లెన్నో వున్నా యతనిచేతిలో; కాని, నాయెదటమాత్రం పడ డతనెప్పుడూ యుద్ధంలో. నేనయినా, నాశస్త్రబలంతో జగత్తంతా, మనిషిపుట్టుకన్నది లేకుండా చెయ్యగలను, క్షణంలో; కాని, పాండుపుత్రులను మాత్రం యేమీ చెయ్యలేను. వారిని విడిచి తక్కిన యోధులను లెక్కాపత్రమూ లేకుండా సంహరించేస్తాను. వారు ముందే నన్ను సంహరించకపోతేనే జరుగుతుం దిది. ఇందుకు నువ్వంగీకరిస్తానంటే, సర్వసేనాధిపత్యం వహించడానికి నాకేమీ అభ్యంతరం లేదు. ఇంకొకటి కూడా వుంది. ముందు నేను యుద్ధం చేస్తాను. కర్ణుణ్ణి వెనకుండిపొమ్మను. లేదూ, నేనే వెనకుండిపోతాను, కర్ణుణ్ణే యుద్ధంచెయ్యమను ముందు. "నీలెక్కేమిటంటూ వుంటాడు మరి, నన్నతను" అని కచ్చితంగా చెప్పా డతను.

ఈమాట పూర్తి కావడం తడువుగా "ఏమయినా, భీష్ముడు బతికి వుండగా నేను యుద్ధంచెయ్యను. అతను చచ్చిపోయాకే అర్జునుణ్ణెదిరించి పోరతా న్నేను" అనేశాడు కర్ణుడు, స్పష్టంగా.

వెంటనే, భీష్ముణ్ణి సర్వసేనాధిపతిగా అభిషేకించాడు దుర్యోధనుడు. ఆసందర్భంలో బ్రాహ్మలకు భూరిదక్షిణ లిచ్చా డతను. అతని సెలవు చొప్పున వాద్యకులు శంఖాలూదారు. భేరీలు వాయించారు. యోధులు సింహనాదాలు చేశారు. ఏనుగులూ గుర్రాలూ ఆకాశం బద్దలయ్యేట ట్టరిచాయి.

ఎక్కడా మబ్బు లేదు ; కాని రక్తమాంసాలు కురిశాయి, ఆకాశం నుంచి. పిడుగులు పడ్డాయి భూమి జవజవలాడిపోయింది. యోధులకు మూర్ఛవచ్చినంత పనయింది. అశరీరవాణి ఏమిటేమిటో అంది అప్ప

ష్టంగా. ఉల్కలు రాలాయి. అపాయసూచకంగా నక్కలరిచాయి. ఇంకా రకరకాల ఉగ్రరూపా లనేకం కనపడ్డాయి.

తరవాత, దుర్యోధనుడు, తాను సర్వసేనాధిపతి అయిన భీష్ముణ్ణి అనుసరించి, సైన్యం అంతా వెంటబెట్టుకుని కురుక్షేత్రం చేరుకున్నాడు. చక్కని ప్రదేశం చూసి అక్కడ శిబిరా లేర్పాటు చేయించాడు. ఇక్కడ హస్తినాపురంలో మిద్దెలూ మేడలూ యెలా వున్నాయో, అచ్చంగా అలా వున్నా యిక్కడ శిబిరాలు.

# 157

## బ ల రా ము ని తీ ర్థ యా త్ర.

ఈవార్త తెలిసిం దక్కడ ధర్మరాజుకి. భీష్ముడు సర్వసేనాధిపతి అయినప్పు డూరుకుంటే యెలాగ ? కౌరవులకూ పాండవులకూ పితామహు డతను. రాజులందరికీ జెండావంటివాడు. బుద్ధిలో బృహస్పతి వొక్కడే సాటి అతనికి. క్షమలో భూదేవీ, గాంభీర్యంలో సముద్రమూ, స్థైర్యంలో హిమవంతమూ, ఔదార్యంలో ప్రజాపతీ, తేజస్సులో సూర్యుడూ మాత్రమే పోల్తా రతనికి. శత్రువులను దేవేంద్రుడా అన్నట్టు శరవర్షంతో ముంచెత్తేస్తా డతను. భయంకర మైన రణయజ్ఞాని కతను దీక్షపట్టా డన్న వార్త రాత్రి చాలా పొద్దుపోయాక తెలిసిం దక్కడ.

వెంటనే కృష్ణుణ్ణీ తమ్ముళ్లనూ సమావేశపరిచాడు ధర్మనందనుడు.

"ఇక మీరు పరాక్రమించాలి. సర్వసిద్ధంగా వుండండి. అంతా సిద్ధంచేసుకుని కనుగలిగిస్నీ వుండండి. ముందుగా మనకు తాతయ్యతోనే పడింది కయ్యం. కనక, మన ఏడక్షౌహిణులకూ సేనాధిపతులను చూడండి" అన్నా డతను. "బాగుంది, అది నువ్వే యేర్పాటుచెయ్యి" అన్నాడు కృష్ణుడు.

ద్రుపదుణ్ణీ, విరటుణ్ణీ, సాత్యకినీ, ధృష్టద్యుమ్నుణ్ణీ, ధృష్టకేతువునీ, శిఖండినీ, మగధ రాజయిన సహదేవుణ్ణీ, — ఈ యేడుగురినీ రప్పించి ఒక్కొక్క అక్షౌహిణికి సేనానాయకులుగా అభిషేకించాడు ధర్మరాజు. ధృష్టద్యుమ్నునకు సర్వసేనాధిపత్యం యిచ్చాడు. ద్రోణుణ్ణి సంహరించడానికే పుట్టాడు మరి, అతను. ఉన్న అందరిమీదా అర్జునుణ్ణి అభిషేకించాడు. ఆ అర్జునునకూ, అతని గుర్రాలకూ కృష్ణుణ్ణి అధిపతిగా నిర్ణయించాడు.

ఇలాగ సర్వమూ సిద్ధం అయివున్న సమయాన బలరాముడు వచ్చాడక్కడికి. అక్రూరుడూ, గదుడూ, సాంబుడూ, ఉద్ధవుడూ, ప్రద్యుమ్నుడూ, చారుదేష్ణుడూ మొదలైన యాదవకుమారులను వెంటబెట్టుకువచ్చాడతను. నీలాంబరాలు కట్టుకున్నాడు. కైలాసశిఖరం లా వున్నాడు. సింహం లా నడిచివచ్చాడు. బాగా కైపెక్కివుండడంవల్ల రక్తంముద్దల్లా వున్నాయతని కళ్లు.

ధర్మనందనుడూ, కృష్ణుడూ, భీమార్జునులూ — తక్కిన అందరున్నూ కూడా యెదురువెళ్లి, సాదరంగా తీసుకువచ్చి, చాలా గొప్పగా పూజించారతణ్ణి. తరవాత అతనిచేతులు తన చేతుల్లోకి తీసుకుని ప్రీతి నెరిపాడు ధర్మనందనుడు. అందరూ అతనికి నమస్కరించారు. ద్రుపదునకూ విరటునకూ బలరాముడు నమస్కరించాడు. అందరూ కూచున్నారు.

ఒకమాటు కృష్ణునికేసి చూసి ప్రారంభించాడు బలరాముడు. "అతిదారుణమైన జననాశం అవుతుం దిప్పుడు. ఇది తప్పే వుపాయం లేదు. ఎవరున్నూ ఏమీ చేసేది లేదిక్కడ. మీరు క్షేమంగా వుంటారు. వీసమెత్తయినా దెబ్బతగలదు మీకెవరికీ. అందరూ ఉల్లాసంగా వుంటారు. మిమ్మల్ని మళ్లీ నేనీ స్థితిలోనే చూస్తానని నమ్ముతున్నాను. క్షత్రియజాతికి మాత్రం తీరని దెబ్బ తగులుతుంది. మహాయుద్ధమే జరుగుతుంది.

"బంధువుల నందరినీ సమానంగా చూడ మని చెప్పా నేకాంతంగా తమ్మునికి నే నెన్నో మాట్లు. మాకు పాండవు లెలాంటివారో దుర్యోధనుడూ ఆలాంటివాడే. కనక, అతనికిన్నీ సాయం చెయ్యమని చాలా దూరం చెప్పాను; కాని తమ్ముడు నామాట వినిపించుకోలేదు. అతని చూపంతా మీామీాదే వుంది. త్రికరణయూ అర్జునునితో మమేకం అయిపోయి వున్నా డతను.

ఏమయినా "పాండవులకే జయం కలుగుతుం" దని నానిశ్చయం. కృష్ణుని దీక్ష అలాంటిది. నాకు కృష్ణుడే ప్రధానం. కనక, అత నేమి చేసినా నేను వ్యతిరేకం చెప్పలేను. అయితే, భీమసేనుడూ దుర్యోధనుడూ కూడా నాకు శిష్యులే. గదాయుద్ధరహస్యా లెన్నో తెలుసుకున్నారు నాదగ్గిర వారు. భీమసేను డంటె యెంత స్నేహమో దుర్యోధను డన్నా అంతే స్నేహం నాకు. కౌరవులు నశించిపోడం నేను చూడలేను. కనక, నేనిదే తీర్థయాత్రకు వెళ్లిపోతున్నాను" అని నిర్మొగమాటంగా చెప్పా డతను. పాండవుల సెలవు పుచ్చుకుని, అందరినీ వుండి పొమ్మని చెప్పి, వెళ్లిన్నీ పోయాడు, ఉత్తరక్షణంలో.

## 158

## రుక్మిణీదేవి అన్న

సరిగా ఈసమయాన రుక్మి అనే రాజు చక్కావచ్చాడు, పాండవుల దగ్గిరికి. దక్షిణదేశంలో వున్న కుండినసగరం రాజు భీష్మకుని పెద్దకొడుకతను. ఆభీష్మునకూ దేవేంద్రునకూ చాలా స్నేహం. మిక్కిలీ యశశ్శాలి భీష్మకుడు. గంధమాదనపర్వతంమీాద వున్న వొక కింపురుషుని దగ్గిర ధనుర్వేదం నాలుగుపాదాలూ క్షుణ్ణంగా నేర్చుకున్నాడు రుక్మి. అతని ధనుస్సు పేరు విజయం. అది, అటు, శార్ఙానికీ యిటు, గాండీవానికీ సమాన మైనది.

గాండీవం వారుణం. విజయం మాహేంద్రం. శార్ఙ్గం వైష్ణవం. ఇవి మూడే దేవతలకు ప్రీతిపాత్రాలు. అగ్ని, ఖాండవదహన సమయాన, అర్జునునకు గాండీవం యిచ్చాడు. విజయం ద్రుముడనేవాడిచ్చాడు రుక్మికి. మురాసురుణ్ణీ నరకాసురుణ్ణీ సంహరించి, మణికుండలాలూ, పదహారువేలమంది కన్యకలూ, రకరకాల రత్నాలూ, శార్ఙ్గమూ స్వాధీన పరుచుకున్నాడు కృష్ణుడు.

ఆవిజయం చేతబుచ్చుకువచ్చాడు రుక్మి. వెనకటికి కృష్ణుడు, రుక్మిణీ దేవిని ఎత్తుకువచ్చినప్పుడు ఈరుక్మి చాలా కోప్పడ్డాడు. ఇతను పెద్దన్న యితను. "కృష్ణుణ్ణి సంహరించకుండా వెనక్కిరాను" అని శపథంపట్టి అత ణ్ణెదిరించాడప్పుడు. చతురంగబలాలూ వెంటబెట్టుకువెళ్ళి మరీ యెదిరించాడు. చాలా గొప్ప సేన అది. చిత్రవిచిత్రాలైన కవచాలూ, ఆయుధాలూ ధరించి గంగాప్రవాహం అన్నట్టు వచ్చి కృష్ణుడిమీద పడిం దది; కాని రుక్మి వోడిపోయాడు. కిక్కురుమనకుండా కుండినపురా నికికిన్నీ వెళ్ళిపోయాడు మొగంవేలవేసుకుని.

రుక్మి వోడిపోయినచోట భోజకటం అన్న నగరం వెలిసింది. అక్కడ గుర్రాలూ ఏనుగులూ యెన్నో వున్నాయి, చాలా గొప్పవి. అదిగో, ఆభోజరాజు — ఆరుక్మే వచ్చినవాడు పాండవుల దగ్గిరికి, అక్షౌహిణి సేన వెంటబెట్టుకుని. కవచం తొడుక్కున్నాడతను. ధనుస్సూ చేత పట్టాడు. తలత్రాణాలు కట్టుకున్నాడు చేతులకు. మొలలో ఖడ్గం ధరించాడు. బాణాలతో నిండివున్న అమ్ములపొదలు కట్టుకున్నాడు భుజాలకు. కృష్ణుడు, తన సాహసానికీ, సహాయానికీ మెచ్చుకుంటాడను కుంటూ వచ్చాడతను, సూర్యుడన్నట్టు మెరిసిపోతున్న జెండా వేసుకుని.

పాండుపుత్రులు యథోచితంగా ఆదరించా రతణ్ణి. కొంచెంసేపు విశ్రమించినట్టే విశ్రమించి పాండవుల మధ్యకి వచ్చి కూచున్నాడు,

ముందతను. "అర్జునుణ్ణి పిలిచి ప్రారంభించాడు తరవాత." ఈయుద్ధం మహాఘోరంగా జరుగుతుంది. నీకేమయినా భయంగా వుంటే చెప్పు, నీకు సాయంచెయ్యడానికి వచ్చా న్నేను. అందరున్నారు; కాని వొక్కడూ కూడా నాప్రతాపం సహించలేరు నీశత్రువులు. మూడు లోకాల్లోనూ కూడా నాకు చాలిన పరాక్రమశాలి లేడసలు. నీశత్రువుల్లో నాకెవరితో వుజ్జీవేస్తావో చెప్పు. నిమిషంలో వాళ్ల నందరినీ చంపేసి చక్కావస్తాను. ఇటు ద్రోణుడూ కృపుడూ — అటు భీష్ముడూ కర్ణుడూ కూడా - వారందరూ కలిసినా కూడా - అందరినీ సంహారించేసి భూమండలం అంతా నీకు కట్టబెట్టేస్తాను" అని చెప్పాడు చివరికి.

ధర్మనందనుడూ కృష్ణుడూ కూడా వున్నా రప్పు డక్కడ. రాజులున్నూ వున్నా రందరూ. అర్జునునకు నవ్వు వచ్చింది. అయినా, ప్రీతి కనపరుస్తూనే అందుకున్నా డతను.

"రాజా, కురువంశంలో పుట్టా న్నేను. అందులోనూ పాండురాజు కొడుకు న్నేను. ద్రోణాచార్యుని శిష్యుణ్ణి. కృష్ణుడు నాకు సర్వసాహాయ్యం. దీనికి తోడు గాండీవం చేతబట్టి వున్నా న్నేను. భయం అంటే యేమిటయ్యా నాకు? కాక, — ఘోషయాత్రలో మహాబలపరాక్రమవంతు లయిన గంధర్వులతో యుద్ధంచేశాను చూడూ, అప్పుడు నాకెవరు సాయంచేశా రంటావ్? ఖాండవదహనం సందర్భంలో దేవదానవు లందరూ వచ్చి మీదపడ్డారు. దొమ్మి అయిపోయిం దప్పుడు. అప్పుడు మాత్రం నాకెవరు సాయంచే శారంటావ్? నివాతకవచులతో యుద్ధంచేశాను. కాలకేయులతోనూ చేశాను యుద్ధం. అప్పుడు మాత్రం నాకేం వుందీ సాయం? ఉత్తరగోగ్రహణం సంగతి జ్ఞాపకం వుంది కాదూ? కౌరవ పెద్ద లందరూ కట్టకట్టుకువచ్చి మీదపడ్డారు విరాటనగరంలో. అప్పుడు మాత్రం యేదీ నాకు సాయం? రుద్రుణ్ణి ఆరాధించి, ఇంద్రుణ్ణీ, కుబేరుణ్ణీ, యముణ్ణీ, వరుణుణ్ణీ అగ్నినీ, కృష్ణుణ్ణి

కూడా పూజించి గాండీవం చేతబట్టి బయలుదేరతా న్నేను. నిజా యుధమే వస్తుం దనుకో, మీదికి. భయపడతానా? భయంగా వుందని నేను చెప్పడమా? రాజా, నాకేమీ భయం లేదు. నా కెవరిసాయమూ అక్కరలేదిక. కనక, నీయిష్టంవచ్చినచోటికి దయచెయ్యి. కాదంటావా? చూస్తూవుండిపో యిక్కడే" అని చెప్పాడు దృఢంగా అతను.

రుక్మి బయలుదేరాడు సేన అంతా వెంటబెట్టుకొని. తిన్నగా దుర్యోధనుని దగ్గిరికి వెళ్లాడు; కాని దుర్యోధనుడున్నూ "నీసాయం నాకక్కర్లేదు పో" అనేశాడు.

మొత్తాని కామహాయుద్ధంలో కలగజేసుకోని వీరులిద్దరే. ఒకడుబలరాముడూ, రెండోవాడు రుక్మిన్నీ. బలరాముడు తీర్థయాత్రకు బయలుదేరి వెళ్లిపోయాడు, ఇల్లువిడిచి. రుక్మి, ఇంటికి వెళ్లిపోయాడు, ఆశ లుడిగి.

పాండవులు మళ్లీ ఆలోచన కూర్చున్నారు.

## 159

సంజయుణ్ణి పిలిచి "ఇలా రా; కూచో" అన్నాడు ధృతరాష్ట్రుడు. "కురుపాండవసేనలు కురుక్షేత్రంలో చేరాక అక్కడ యేమి జరిగిందో చెప్పవోయ్! దైవమే బలీయ మనీ, పౌరుషం వ్యర్థ మనీ నాకు నమ్మకం. యుద్ధంవల్ల చాలా కష్టాలూ నష్టాలూ వస్తా యని తెలుసు నాకు; కాని మాయజూదంలో నిపుణు డైన నాకొడుకుని మళ్లించలేకుండా వున్నా న్నేను. ఇంకోటి కూడా వుంది. దుర్యోధను డన్నీ చెడ్డపనులే చేస్తున్నాడు, నాకు తెలియంది కాదు. అయినా, మొగం మొదటపడా టప్పటి కేమీ అనలేకుండా వున్నాను. ఇలాంటప్పుడు, ఏమి జరగవలసివుందో అది జరిగిపోతుంది. ఏమి చేస్తాం మరి? ఇంతకీ— యుద్ధంలో ప్రాణాలు విడిచిపెట్టడమే క్షత్రియధర్మం కదా?" అని తేల్చాడు చివరికి.

"రాజేంద్రా" అన్నాడు సంజయుడు. "ఈప్రశ్న నీకు తగ్గట్టే వుంది" అంటూ ప్రారంభించాడు. "దోషం అంతా దుర్యోధనుని మీాదే ఆరోపించకు మరి" అంటూ మందలించాడు. "ఏమంటావా? నేను చెప్పేది పూర్తిగా వినిపించుకో. తన దుర్నడతవల్ల వచ్చిన కష్టాలూ నష్టాలూ కాలంమీాదా, దైవంమీాదా నోపడం ధర్మం కాదు. ఎప్పుడూ చెడ్డఆలోచనలే చేస్తారు, అన్నీ చెడ్డపనులే చేస్తారు కొందరు. సంహరించడం తప్ప వాళ్లకి మరో శిక్ష లే దంటారు పెద్దలు. నికృష్టు లైన నీకొడుకులూ, నీకొడుకుల అమాత్యులూ తమ కెన్ని తిరస్కారాలు చేసినా, ముందుముందు నువ్వేదో వారగబెడతావన్న ఆశతో అన్నీ పడివూరుకున్నారు పాండుపుత్రులు. గుర్రాలక్నూ, ఏను గులకూ, తేజోనిధు లైన రాజులకూ వినాశకాలం దాపరించింది. సర్వ లోకాలనూ నాశనం చేసే యుద్ధం యెలాయెలా జరిగిందో అదంతా నేను తరవాత చెబుతా న్నీకు. "మంచిపని చేసినా చెడ్డపనిచేసినా మనిషి కర్త కాడు. అస్వతంత్రు డతను. కర్రబొమ్మ ఆడిస్తాం చూడూ, ఆబొమ్మవంటివాడు మనిషి. దైవయోగం అంటారు కొందరు. ఏదో యాదాలాభంగా జరిగిపోయిం దంటారు కొందరు. పురాకృతం యిలా వుంది, జరిగిపోయిం దంటారు కొందరు. లోకం పోకడ యిలా వుంది, మూడు విధాలుగా. అంచేతనే వచ్చిందీ పుట్టిమునక. అదంతా చెబు తాను బాగా విను" అని చెప్పా డతను చివరికి.

## 160

### ఉలూకదౌత్యం

పాండవులు, హిరణ్వతీనదీతీరాన ప్రవేశించాక, కౌరవు లున్నూ చేరుకున్నా రక్కడికి. శిబిరాలు అతివడిగా సిద్ధం అయిపోయాయి.

సకలసమపాయాలూ ఏర్పాటుచేయించి, దుర్యోధనుసు, రాజుల నంద రినీ చాలా ఆదరించాడు.

తరవాత, అతను, దుశ్శాసనుణ్ణీ, కర్ణుణ్ణీ, శకునినీ రప్పించుకుని, వారితో బాగా ఆలోచించి "పాండవులతో నామాటలుగా యిలా చెప్పు" అని ఉలూకుణ్ణి పంపించాడు.

"ధర్మనందనా చాలా కాలంగా అనుకుంటున్న కురుపాండవయుద్ధం యిదిగో వచ్చేసింది. సంజయుడు మిమ్మల్నెంతో పొగిడాడు. కృష్ణు నితో ఆలోచించి నువ్వూ నీతమ్ముళ్లూ అన్నమాటలున్నా అన్నీ చెప్పాడిక్కడ. మీరేదో చేసేస్తా మని శపథంచేసుకున్నారు కాదూ? రండి, చెయ్యండి, ఆలస్యం యెందుకూ? ధార్మికుడివట నువ్వు. మరి, యిలా అధర్మానికి పూనుకున్నా వేం? సర్వభూతాలకూ అభయం యిస్తావనుకున్నాను నువ్వు. ఇదేమిటి జగత్తంతా నశింపచెయ్యడానికి పూనుకున్నావు?

వెనకటికి దేవతలు ప్రహ్లాదుని రాజ్యం హరించారు. "ధర్మధ్వజం చాటున కల్లుకుండ ధ్వజం యెత్తుకుని రహస్యంగా పాపాలు చెయ్యడం బైడాలవ్రతం కాదూ?" అనడిగా డప్పుడు ప్రహ్లాదుడు.

ఇక్కడో కథ వుంది. ఒకమాటు నారదుడు చెప్పాడు మానాయన కది. ఒకపిల్లి వుంది. ముసిలి దయిపోయిం దది. కాలూ చెయ్యీ ఆడని స్థితి వచ్చింది. దానికి. అప్పు డది గంగాతీరం చేరుకుని చేతులు పైకెత్తు కూర్చుని "నేనిక ధర్మమే చేస్తా" నంటూ ఎలుగెత్తి చెప్పడం మొదలుపెట్టింది. జంతువు లన్నీ నమ్మడానికే ఆసటన. ఇలా జరగ్గా జరగ్గా, ఆమాట నమ్మి, దాని దగ్గిర చేరి, పిట్టలు దాన్ని మెచ్చుకో సాగాయి. తాను వేసిన యెత్తు ఫలించినందుకూ, తన కోరిక కూడా తీ రే టట్టున్నందుకూ అదిన్నీ మిక్కిలీ సంతోషించసాగింది.

మరికొంతకాలానికి ఎలకలున్నూ దాని దగ్గిరికి చేరసాగాయి. "ఇది మనకు మేనమామ. మనలో పిన్నలనూ పెద్దలనూ రక్షిస్తుం దిది" అనుకున్నాయి. "నీఅనుగ్రహం కోరి వచ్చాము. ఇక్కడ సుఖంగా వుందా మనుకుంటున్నాము. నువ్వు ధర్మాత్ముడవు. నువ్వే మాకు గతి. నువ్వే మాకు స్నేహితుడవు. నువ్వే మాకు శరణ్యుడవు. దేవేంద్రుడు దేవతల నందరినీ రక్షిస్తాడు. అలాగే నువ్వూ మమ్మల్ని రక్షించాలి" అంటూ కాళ్లావేళ్లా పడ్డాయి చివరికి.

"ఓ, యింతకంటేనా?" అంది పిల్లి, "అయితే, ఇటు నేను తపస్సు చేసుకోడమూ, అటు మిమ్మల్ని రక్షించడమూ – రెండుభారాలు పడుతున్నాయి నామీద. కఠిననియమా లవలంబించి ఘోరతపస్సు చేశాన్నేను. అంచేత, చాలా బడలిపోయి వున్నా నిప్పుడు. ఏమయినా, మిమ్మల్ని రక్షించడం తప్పదు నాకు. నామాట వినడం మీకున్నూ తప్పదు. ఉన్నదల్లా యేమిటంటే? కొంచెం దూరమున్నూ నడవలేన్నేను. అంచేత, దినమ్మూ నన్ను నదికి తీసుకువెళ్లడమూ, మళ్లీ యిక్కడికి తీసుకురావడమూ – ఇంతే – మరో శ్రమ వుండదుమీకు" అని చెప్పిం దది మెల్లిగా.

"అలాగే" అన్నా యెలకలు. అది మొదలు కష్టం యేమీ లేకుండా ఎలకలను తినడం మొదలుపెట్టింది పిల్లి. దానికి రక్తమాంసాలు పెరిగాయి. శరీరం నిగనిగలాడసాగింది. మిక్కిలీ బలమూ దర్పమూ కలిగాయి. దీనికి మారుగా ఎలకల సంఖ్య క్షీణించసాగింది. వాటి కనుమానం కలిగింది. "ఏమిటిది?" అంటూ ఆలోచన ప్రారంభించాయవి.

వాటిలో డిండికం అని మాంచి వయసులో వుంది వొక యెలక. చాలా తెలివితేట లున్నాయి దానికి. "మీరందరూ ముందు నదికి వెళ్లండి. తరవాత మామయ్యతో కలిసి వస్తాన్నేను" అని చెప్పిం దది. బాగుం దంటే బాగుం దనుకున్నా యెలకలు. తక్కినవన్నీ ముందు

వెళ్లాయి. యథాప్రకారం నదికి వెళ్లాక వాడుకేసినట్టుగాని డిండికాన్ని
తినేసింది పిల్లి, యెలకల పన్నాగం తెలియక.

కోలికం అని మరో యెలక. తెలివితేటలకు డిండికం తరవాతిదే
గాని తక్కినవాటిలో గొప్ప దది. "బుద్ధిలేక మనం ఇలా అనుకున్నాం.
మామయ్య ధర్మపరుడు కాడు. ఆపిలక చూసి మనం కామోసు నను
కున్నాం. అదంతా పచ్చిదగా. దుంపలూ పళ్లూ తినే జంతువుల
మలంలో వెంట్రుకలుండవు. దినదినమూ బలిసిపోతున్నాడు మామయ్య,
పోనీ అంటే మన సంఖ్య తగ్గిపోతోంది. మనవాళ్లు మాయం అయిపో
తున్నారు. ఏడెనిమిది దినాలయింది డిండికం అయిపు లేదు, గుర్తిం
చారా?" అనడిగిం దది. అవు నంటే అవు ననుకుని ఎలక లన్నీ పారి
పోయాయి. పిల్లి కూడా తనదారిని తాను వెళ్లిపోయింది, బాగా బలిసి
వుంది కనక, స్వేచ్ఛగా.

ధర్మనందనా, జ్ఞాతుల విషయమై సరిగా నువ్వా పిల్లిలా ప్రవర్తిస్తు
న్నావు. నీమాట వొకలాగా, నీపని వొకలాగా వుంటోంది స్పష్టంగా.
వేదా లంటావు, శాంతి అంటావు గాని అదంతా శుద్ధమోసం. ఇది
చాలించి, యీపాటికి క్షాత్రం అవలంబించు. సత్కార్యాలు చెయ్యి.
ధార్మికుడ వనిపించుకో, బలపరాక్రమాలు చూపించి రాజ్యం సంపా
దించుకో, అప్పుడు చెయ్యి బ్రాహ్మలకు దానాలూ, పితృదేవతలకు
అర్చనలున్ను.

తల్లిఅంటే భక్తి వుందా నీకు? చిరకాలంగా బాధపడుతోం దామె,
కనపడుతోందా? యుద్ధంచేసి, జయించి, ఆమె దుఃఖాలు పోగొట్టు.
అదీ నీకు సమ్మానం అంటే. అయిదూళ్లయినా యిమ్మన్నావు నువ్వు.
నేనివ్వనన్నాను. కోపం తెప్పించి మిమ్మల్ని యుద్ధంలో దింపడానికే
నేనలా చేశాను. నీమూలాన విదురుణ్ణి విడిచిపెట్టేశా న్నేను. లక్క
యిల్లు కాల్పించేశా నది కూడా జ్ఞాపకంచేసుకో. పౌరుషం తెచ్చుకో.

"సంధి కొప్పుకుంటూరా, యుద్ధంచేస్తారా" అనడగమని పంపించావు కృష్ణుణ్ణి మాసభకి నువ్వు. ఇదిగో యుద్ధానికే తగిన సమయం వచ్చింది కాసుకో. యుద్ధం రావా లనే నేసలా చేశా నవన్నీ. క్షత్రియు డైన వాడికి యుద్ధం తటస్థించడం కంటే గొప్పలాభం మరేం వుందీ? క్షత్రియ కులంలో పుట్టావు నువ్వు. పేరుప్రతిష్ఠలు సంపాదించుకున్నావు. కృపా చార్యునిదగ్గిరా, ద్రోణాచార్యునిదగ్గిరా శస్త్రాస్త్రవిద్య సంపాదించావు. అది చాలదన్నట్టు కృష్ణు ణ్ణాశ్రయించావు చివరికి. అతని జన్మానీజన్మా వొకటే రకం. అతని బలమూ నీబలమూ కూడావొక్కటే.

తరవాత కృష్ణునితో యిలా చెప్పు. పాండుపుత్రులు వినేటట్టు మరీ చెప్పు. "కృష్ణా, పాండవులకోసమే కాదు, నీకోసమున్నూ రావయ్యా యుద్ధంచేద్దాం. మాయచేసి మాసభలో నువ్వేమిటేమిటో వేషాలు వేశావు కాదూ; ఆవేషంతోనే రా, నాయెదటికి. అర్జునుణ్ణి వెంటబెట్టు కుని మరీ రా. మాయావు లయినవాళ్లు ఇంద్రజాలం చేస్తే శస్త్రధా రులకు కోపంవస్తుంది; గాని ఆశ్చర్యం కలగదు తెలుసా?

మేమూ మాయచెయ్యగలం కావాలంటే. మేమాకాశానికూడా యెగరగలం. పాతాళానికీ స్వర్గపట్నానికీ కూడా వెళ్లగలం. మేమూ చూపించగలం రకరకాలవేషాలూ, రకరకాల రూపాలున్ను; కాని భయంకరప్రదర్శనాలు చెయ్యడంవల్ల చేసేవాడికీ యెదటివాడికీ గూడా లాభంలేదు. సర్వేశ్వరునికొక్కనికే మేము నమ్రుల మవుతాం గాని, నీవంటి మాయకాళ్లకు కాదు.

"యుద్ధంచేసి, దుర్యోధనాదుల నందరినీ సంహరించి, రాజ్యం అంతా పాండవుల కొట్టబెడతా నన్నావుట కాదూ నువ్వు? సంజ యుడు చెప్పాడు లే. మే మర్జునుడితో విరోధం పెట్టుకోడం కూడా పెద్దనేరమే అన్నావుట నువ్వు. సరి, రా, నీమగతనం యేమిటో చూద్దాం. మాట తప్పకు. మేము సిద్ధంగా వున్నాం, యుద్ధానికి.

పౌరుషం వుంటే, యెదటబడి కయ్యంపొడిచి శత్రువులకు దుఃఖాలు కలిగించాలి. అలా చెయ్యగలవాడి జీవితమే జీవితం. లోకంలో నీకు చాలా యెక్కువగానే వుందికీర్తి, తెలుసు; కాని దానికి తగిన కారణం లేదు. గడ్డాలూ మీసాలూ వున్న నపుంసకులు చాలామందే వున్నారు లోకంలో; అయితే, నావంటిరాజన్యుడు నీవంటివాడితో చెయ్యా చెయ్యా కలపడం సిగ్గుచేటు. విశేషించి కంసుని భృత్యుడవు నువ్వు. నీతో యుద్ధానికి సిద్ధపడ్డం మాకు మరీ అమర్యాద.

ఉలూకా, పరమమూఢు డున్నాడు చూడూ, తిండిపోతు భీమసేనుడు. అతనితో కూడా చెప్పు. "భీమసేనా, వల్లవుడని పేరుపెట్టుకుని నువ్విదివరలో విరటుని నగరిలో వంటలు చేశావు, తెలుసు. దాని క్కారణం నాశౌర్యసాహసా లని తెలుసా నీకు? ఆవేళ నిండుకొలువులో యేదో ప్రతిజ్ఞ చేశావు జ్ఞాపకం వుందా? నీతరం అయితే, రా, దుశ్శాసనుని రక్తం తాగుదువుగాని. మమ్మల్నందరినీ కూడా సంహరించేస్తా నన్నా వప్పుడు, రా, అదేమిటో చూద్దాం. తినడందగ్గిరా, తాగడం దగ్గిరా, చప్పరించడందగ్గిరా చెప్పు నీపరాక్రమం. యుద్ధం యెక్కడ, తిండెక్కడ? కాదంటావా, రా, మగతనం చూపించు. సభలో నువ్వు పేలినవన్నీ వొట్టికోతలు. వచ్చావుసుమా, చచ్చి గద కౌగిలించుకుని పెద్దనిద్దరపోతావు యుద్ధరంగంలో."

"రా, మడమతిప్పకుండా యెదట నిలిచి యుద్ధంచెయ్యి నీపౌరుషం యేమిటో చూస్తాను. ధర్మరా జంటే అనురాగమూ నేనంటే ద్వేషమూను నీకు. మీద్రౌపది పడ్డ పాట్లున్నూ జ్ఞాపకంచేసుకో" అని నకులునితోనూ, పనిలో పని సహదేవునితోనూ కూడా చెప్పు.

ఉలూకా, ద్రుపదుడూ, విరటుడూ వున్నారు. "భృత్యులు గుణవంతు లయితే రాజులు గుణవంతు లయివుండడమూ, రాజులు గుణవంతు లయితే భృత్యులు గుణవంతు లయి వుండడమూ ఎక్కడా

వినా లేదు, చూడా లేదు. ధృతరాష్ట్రుడు మీకు తగినవాడు కాడు. కనక, ధృతరాష్ట్రుణ్ణీ నన్నూ సంహారించడానికీ, మీకూ మీపాండవు లకూ గూడా మేలు చేకూర్చుకోడానికీ రండి" అనిచెప్పు వారితో.

ద్రుపదుని కొడుకు ధృష్టద్యుమ్ను డున్నాడు. "ఇదిగో, నీకు తగ్గ సమయం వచ్చింది, దాటబెట్టుకోకు. ద్రోణు ణ్ణెదిరించి నిలిచినప్పుడు తెలుస్తుంది నీకు, హితం యేమిటో అహితం యేమిటో. ఏదో పాపం చెయ్యా లని కాదూ వచ్చావూ? కాని య్యేదేమిటో చూద్దాం" అని చెప్పు అతనితో. శిఖండి కూడా వున్నా డక్కడ. "నువ్వు ఆడదానవు, కనక, భీష్ముడు నిన్ను చంపడులే. కనక, నిర్భయంగా రా, నిశ్చింతగా యుద్ధంచెయ్యి" అని చెప్పు, అతనితో.

అర్జును డున్నా డక్కడ. కృష్ణుడూ అతనూ కట్టకట్టుకునే వుంటా రెప్పుడూ. మమ్మల్ని వోడించి రాజ్యం ఆక్రమించుకోమను. లేదూ, మాతో యుద్ధంచేసి చచ్చిపొమ్మను. మరో మార్గం లేదని చెప్పు. అర్జునా, నీకు ప్రవాసశిక్ష విధించాము మేము. అడవుల్లో నానా బాధలూ పడ్డావు నువ్వు. ద్రౌపది పడ్డపాట్లున్నూ జ్ఞాపకంచేసుకో. మగ వాడవై నిలబడు. క్షత్రియస్త్రీ కొడుకు నెందు కంటుందో అందుకు సమయంవచ్చిం దిప్పుడు. యుద్ధరంగంలో నిలిచి, బలపరాక్రమాలూ, వీర్యవిక్రమాలూ, శౌర్యధైర్యాలూ, అస్త్రలాఘవమూ, మానాభి మానాలూ మగతనమూ చూపించి, నీకేదో కోపం కలిగిందే, దానికి ప్రతీకారం చేసుకో. శస్త్రాస్త్రాలకు నీరాజనం యివ్వడం అయింది. బాడీ బందా లేకుండా, ఈకురుక్షేత్రం అంతా యుద్ధంచెయ్యడానికి చాలా అనుకూలంగా వుంది. నీగుర్రాలు బాగా బలిసివున్నాయి. నీయోధు లున్నూ చాలా వుల్లాసంగా వున్నా రందరూ. కనక, రేపే యుద్ధం, సిద్ధంగా వుండు.

గంధమాదనపర్వతం యెక్కుకుండానే డాబులు కొట్టేనావిలాగ, భీష్మునితో సువ్యక్తంగా కలుసుకోనే లేదు. అప్పుడే యెందుకా కోతలు? తేరిచూడరాని కర్ణుడూ, మహాబలశాలి శల్యుడూ, ఇంద్రునకు సాటి వచ్చే ద్రోణుడూ — వీరిని జయించనే లేదింకా, రాజ్యంకోసం అప్పుడే అర్రులు చాస్తావేం? ద్రోణుని సంగతి నీకు కొత్త కాదు. వేదంలోనూ ధనుర్వేదంలోనూ పారం చూశాడతను. ఆచార్యుడున్నా నిర్వహించు కుంటున్నాడందులో. యుద్ధధురంధరుడు. అజేయుడు. అతణ్ణి జయిద్దామనుకుంటున్నావు నీతరమా?

మేరుపర్వతం గాలి కొట్టుకుపోలేదు. అది విరిగిప్డి పడిపోలేదు. ఆకాశం కిందపడ్డమూ, యుగం మారిపోవడమూ జరగలేదు. ఎందుకోయీ, ద్రోణుణ్ణి గురించి అంతచులకనగా భావిస్తావూ? అతణ్ణెదిరించి బతికిబట్టబట్టగలవాడెవడూ? నాసేన దేవతలసేన కాదునా తీసిపోదు. దాన్నెవరూ చెనకలేరు. ఎందరో రాజులు కాపలా వున్నారు దానికి. కూపమండూకంవతుగా వున్నావు నువ్వు. దాని చేవ నీకేం తెలుసునూ?

ప్రాచ్యులూ, ప్రతీచ్యులూ, దాక్షిణాత్యులూ, ఉదీచ్యులూ, కాంభోజులూ, శకులూ, ఖశులూ, సాల్వులూ, మత్స్యులూ, కౌరవులూ, మధ్యదేశీయులూ, మ్లేచ్ఛులూ, పుళిందులూ, ద్రవిడులూ, ఆంధ్రులూ, కాంచీపురీయులూ — ఇలాంటి — ఇందరు రాజన్యుల సేనలు చుట్టివున్నాయి నన్ను. ఏనుగుల బలమున్నా నాకు బలమైన ప్రాకారంగా వుంది. ఎలాతోచిందో యీ నన్ను జయించగలనని నీకు?

నీ అమ్ములపొదులు అక్షయాలనీ, నీరథం అగ్నిదత్తమనీ, నీజెండా కూడా దేవత లిచ్చిందనీ నాకు తెలుసు. మరి, యుద్ధంచేసి చూపించాలి గాని యెందు కలా డాబులుకొడతావూ? వంశపారంపర్యానికిక్కడ చెల్లుబడి లేదు. రాజ్యం కావాలంటే డాబులూ పనిచెయ్యవు.

పౌరుషం చూపించు, చేతనైతే. డాబులు కొడితేనే యీరాజ్యం నీకు తక్కేటట్టయితే, యిక లేని దేమిటీ?

కృష్ణుడు నీకు సాయం అని తెలుసు. నీగాండీవం తాడిచెట్టంతవుంది, అదీ యెరుగుదును. నిజానికి, నువ్వున్నూ వోపాటి యోధుడవే. కనకనే యీరాజ్యం అంతా నేనాక్రమించుకున్నాను. నువ్వు మొత్తుకుంటున్నా, పదమూడేళ్లుగా యీరాజ్యం పరిపాలిస్తున్నా న్నేను. నిన్నూ నీబంధువుల నందరినీ సంహరించి, యింకా యింకా పరిపాలిస్తా న్నేనిది.

ఒరేయ్, భృత్యుడా, నువ్వు పందెం వోడిపోయినప్పుడు నీగాండీవం యేమయిందిరా? భీమసేనుని బలమున్నూ యేమయిపోయిందీ? గద చేతబట్టి భీముడూ, గాండీవం చేతబుచ్చుకుని నువ్వూ అప్పు డేమీ చెయ్యలేకపోయూ రేం? ద్రౌపది విడిపించవలసివచ్చింది మిమ్మల్ని బానిసతనంనుంచి. "షండతిల" లని పిలిచాను మిమ్మల్ని నే నప్పుడు. మీకు తగిన పే రది.

విరాట నగరంలో జడఅల్లుకుని కూచున్నావు నువ్వు. భీమసేనుడు విరటుని వంటలవా డయి కాలం గడిపాడు. నా పౌరుషం అలా చేసింది మిమ్మల్ని. క్షత్రియు డైనవాడు క్షత్రియు డైనవాడికి విధించే శిక్ష లివి.

నీకూ నీకృష్ణునకూ జంకి నీకు రాజ్యం యివ్వ న్నేను. చేతనైతే యుద్ధం చెయ్యి. కృష్ణుణ్ణి సాయం తెచ్చుకో. వెయ్యిమంది కృష్ణు లయినా, నూరుగు రర్జును లయినా, యుద్ధరంగంలో—బరిమీద నన్ను చూస్తే నే చాలు దిక్కు తెలియకుండా పారిపోతారు.

నాసేన వొక మహాసముద్రం. కృపాచార్యుడూ, శలుడూ, శల్యుడూ పెద్దచేప లందులో. వివింశతి పెద్దతాచు. బృహద్బలుడూ దుశ్శాసనుడూ పొంగు. సోమదత్తుని కొడుకు తిమింగిలం. భీష్ముడు వేగం. ద్రోణుడూ, సుషేణుడూ. చిత్రాయుధుడూ మొసళ్లు. కర్ణుడూ శల్యు

డూ చేపలతో నిండిన సుడిగుండం. జయద్రథుడు పర్వతం. పురుమిత్రుడు లోతు. దుశ్శాసనుడు జలం. శకుని జలపాతం. దీన్లో పడ్డావంటే మిత్రులతోనూ బంధువులతోనూ నాశనం అయిపోతావు నువ్వు. అశుచి అయినవాడు స్వర్గాని కర్హుడు కాడు. అలాగే నువ్వున్నూ కౌరవరాజ్యాని కర్హుడవు కావు."

## 161

### ఉలూకదౌత్యం 2

ఉలూకుడు పాండవశిబిరం చేరుకున్నాడు. పాండవుల దర్శనమూ చేసుకున్నాడు. "దూతల సంగతి నీకు తెలుసు. దుర్యోధను డేమి చెప్పమన్నాడో అదే చెబుతున్నా న్నేనిక్కడ. అది వినిపించుకో. కోపం మాత్రం వద్దు నామీద" అంటూ ధర్మనందనునితో మనవిన్నీ చేసుకున్నాడు.

"నీ కేమీ భయం లే" దన్నాడు ధర్మనందనుడు. "దుర్యోధనుడు పరమలుబ్ధుడు. దూరపుచూపు లేనివాడు. అత నేమి చెప్పాడో అదంతా చెప్పు" అని కూడా అన్నాడు. పాండవులు మాత్రమే కాదు, సృంజయులూ, మత్స్యులూ, కృష్ణుడూ, ద్రుపదుడూ, అతని కొడుకులూ, విరటుడూ, అందరు రాజులూ కూడా అక్కడే వున్నా రప్పుడు.

"కౌరవు లందరూ వింటూ వుండగా దుర్యోధనుడు మీకిలా చెప్పమన్నాడు" అంటూ తాను మోసుకువచ్చిం దంతా ఉన్నదున్నట్టు చెప్పా డులూకుడు.

## 162

### ఉలూకదౌత్యం 3

ఉలూకుడు మళ్ళీమళ్ళీ 'చెప్పా డీమాటలు, అర్జునుణ్ణి మళ్ళీమళ్ళీ పొడుస్తున్నట్టు. అందుకు పాండవుల కందరికీ చాలా కోపం వచ్చింది.

కూచునే వున్నారు వారు; కాని చేతులు జాడించుకుంటూ మండిపో యారు. భీమసేనుడు మొగం వంచుకున్నాడు. కాని కృష్ణుని కేసి కోర చూపులు చూశాడు. అది గుర్తించాడు కృష్ణుడు. "ఉలూకా, దుర్యో ధనుడు చెప్పమన్న దంతా మాకు చెప్పావు నువ్వు. కనక, నువ్వింక వెళ్లిపోవచ్చు. "నీమాట లందాయి. నీవుద్దేశం తెలిసింది. నీకోరిక తీరుతుంది" అని నామాటలుగా మీదుర్యోధనునితో చెప్పి వెళ్లిపో" అన్నాడు కృష్ణుడు. అని ధర్మనందనుని కేసి చూశాడు.

ఉలూకుడు కదల్లేదు. మళ్లీ మళ్లీ ఆమాటలే చెప్పా డర్జునునకు. కృష్ణునకుకూడా అదే చెప్పాడు. పొడుస్తున్నట్టూ — గిల్లుతున్నట్టూ, రక్కుతున్నట్టూ చెప్పా డూరికే కాదు. రాజు లది సహించలేకపో యారు. దానిమీద, ధృష్టద్యుమ్నుడూ, శిఖండీ, సాత్యకీ, కేకయ సోదరులూ, ఘటోత్కచుడూ, ద్రౌపదేయులూ, అభిమన్యుడూ, ధృష్టకేతుడూ, భీమసేనుడూ, నకులసహదేవులూ — అందరూ ఎగిరి పడ్డారు మండిపోతూ.

పళ్లు పటపట్టాడిస్తూ భీమసేను డందుకున్నాడు, వెంటనే. "మూర్ఖా శక్తిలేనివాళ్లని రెచ్చగొడుతున్న ట్టున్నాయి నీమాటలు. అయినా నీచేత దుర్యోధనుడు చెప్పించిన మాట లన్నీ విన్నాను. ఇక నేను చెబు తాను విను. రాజులూ, కర్ణుడూ, ధృతరాష్ట్రుడూ కూడా వినేటట్టు చెప్పు, దుర్యోధనునితో యీమాటలు. "ఓరీ, దురాచారుడా, నువ్వు పెట్టినబాధ లన్నీ మాఅన్న మొగంచూసి భరించాం మేము. ఇది నీకు బోధపడలేదు. కులం నశించగూడ దన్న తపనతో, సంధికోసం మాఅన్న కృష్ణుణ్ణి పంపాడు మీదగ్గిరికి; కాని చావు మూడ్డంవల్ల నువ్వది వినిపించుకో లేదు. యుద్ధానికే సిద్ధపడుతున్నావు నువ్వు. తొం దరపడకు, రేపే జరుగుతుం దది.

సముద్రం హద్దుదాటి పొంగుకురావచ్చు. పర్వతాలున్నా బద్ద లయిపోవచ్చు; కాని నామాటమాత్రం తప్పు చెప్పడూ. యముడూ, కుబేరుడూ, రుద్రుడూ కూడా నీకు సాయంవచ్చినా మేము మాప్రతిజ్ఞ నెరవేర్చుకుంటాం. తొందరపడకు. దుశ్శాసనుని వేడిరక్తం నేను తాగే స్తాను. ఎవ డడ్డువచ్చినా, భీష్ముడే వచ్చినా అది మానను. ఆవచ్చిన వాణ్ణి చంపేస్తాను. ఈక్షత్రియబృందం విటుండగా నేనన్న మాటలు అసత్యా లయేటట్టయితే, నాకు నేనే యీశరీరం విడిచిపెట్టేస్తాను" అన్నా డతను, మిక్కిలీ రోషంగా.

"దుర్యోధనా, నీకూ ధృతరాష్ట్రునకూ సంబంధం లేకపోయినట్ట యితే మాకీభేదభావం పుట్టివుండకపోవును. లోకాలూ, కురువంశమూ నాశనం చెయ్యడానికి పుట్టావు నువ్వు. పుట్టింది మొదలు పాపబుద్ధితో మాకపకారాలే చేస్తున్నావు నువ్వు. తొందరపడకు, నిన్ను సంహరించి ఈవిరోధం తుదముట్టించేస్తాను. నువ్వు నమ్ముకుని వున్న శకునినిగూడా సంహరించేస్తా" నన్నారు నకులసహదేవులు కూడా ఎవరికివారు.

అర్జును డందుకున్నా డప్పుడు చిరునవ్వునవ్వుతూ. "భీమసేనా, నీతో విరోధంపెట్టుకున్న వా డిక లేనివాడికిందే లెక్క. ఉలూకుణ్ణి నువ్వేమీ అనవద్దు. ఏమంటే? దూతలు తమ సొంతమాటలు చెప్పరు. తమ ప్రభువులు చెప్పమన్నవే చెబుతారు" అన్నాడు ముందు. తర వాత, ధృష్టద్యుమ్నాదులకేసి చూసి "పాపాత్ముడైన దుర్యోధనుని మాటలు విన్నారు మీరు. కృష్ణుణ్ణీ నన్నూ అన్నమాటలు విని చాలా వుద్రిక్తులూ అయినారు. అయితే, కృష్ణుని ప్రభావంవల్లా, మీఅందరి సాయమూ వుంది కనకా ఎందరు క్షత్రియు లెత్తివచ్చినా నేను లెక్క చెయ్యను. మీరంతా అంగీకరిస్తే నే నులూకున కొక్కటే మాట చెబుతాను, తన ప్రభువు దుర్యోధనునితో చెప్పుకో మని. మాటకి

మాట చెప్పడం నపుంసకుల పని. తెల్లవారిందా, దుర్యోధనునకు నా గాండీవంతో బదులుచెబుతాను" అన్నా డతను.

అందుకు, రాజు లందరూ మొదట ఆశ్చర్యపడి, తరవాత, మిక్కిలీ మెచ్చుకున్నా రతణ్ణి. అతనుకూడా వయఃక్రమం అనుసరించి వారి నందరినీ ప్రశంసించి ధర్మనందనుణ్ణి చూసి "రాజా, తనని తా నవమా నించుకునేవాడు రాజు కాలేడు. నీకు శుశ్రూష చేసివున్నాను కనక, దుర్యోధనునకు నేనే ప్రత్యుత్తరం చెప్పిపంపుతాను" అంటూ వొక్క మాటు ఉలూకుని కేసిన్నీ చూశాడతను. అతనికళ్లు చింతనిప్పు లయి పోయాయి. కోడెతాచు లా రోజుకుంటూ, సెలవులున్నా నాకుకుంటూ ఇటు కృష్ణుణ్ణీ అటు అన్నతమ్ములనూ చూసి ఉలూకుని బుజంతట్టి అందుకున్నా డతను.

"వెంటనే నువ్వు హస్తినాపురానికి వెళ్లిపో. దుర్యోధనుడు మిక్కిలీ కృతఘ్నుడు. విరోధమే అలా పుట్టుకువచ్చింది. మిక్కిలీ దుష్టమైనది వాడి బుద్ధి. కులం నాశనం చెయ్య డానికే పుట్టాడు వాడు. పాండవుల యెడల వాడు పన్నని కుట్రా, చెయ్యని పాపమూ లేవు. తన భుజబలం నమ్మకుని యుద్ధానికి రమ్మని జబ్బచరిచి శత్రువులను రంకెవేసి పిలిచే వాడే క్షత్రియుడు. ఆపాపాత్ముడు తాను క్షత్రియు డయ్యుండిన్నీ, ఇతరుల బలపరాక్రమాలు నమ్ముకుని మమ్మల్ని యుద్ధానికి పిలుస్తు న్నాడు. "దుర్యోధనా, నీభుజబలం నమ్ముకో. నీభృత్యులబలమున్నా నమ్ముకో. మమ్మల్ని పిలు. క్షత్రియుడవై నిలబడు. ఇతరుల బలపరా క్రమాలు నమ్ముకుని శత్రువులను యుద్ధానికి పిలిచేవాడు నపుంస కుడు. అక్షరాలా నువ్వలాంటివాడివి. మమ్మ ల్నెందుకుపిలుస్తావూ?" అనడిగా నని చెప్పమన్నా డత నులూకుణ్ణి.

"నేను కూడా చెబుతా" నంటూ ప్రారంభించాడు కృష్ణుడు. దుర్మతీ, మగవాడవై నిలబడు. రేపీపాటికి నీకన్నీ బోధపడతాయి.

నేను పాండవుల పక్షంగా యుద్ధంచెయ్య ననీ, వారికి సారథ్యం మాత్రమే చేస్తా ననీ కామోసు నీకీ నిర్భయమూ, ఈధైర్యమూను. ఎండుగడ్డి బుగ్గి చెయ్యడాని కగ్ని దేవున కెంతకావాలీ? అలాగే, రాజుల నందరినీ క్షణంలో బుగ్గిచేసేస్తా న్నేను. ధర్మనందనుని ఆజ్ఞవల్ల నేనర్జునునకు సారథ్యం చెయ్యబోతున్నాను. నువ్వు భూమి లోపలికి వెళ్లు; ఆకాశానికి వెళ్లు, రేపు తెల్లవారిం దంటే, నువ్వెక్కడ వుంటే అక్కడే కనపడుతుంది అర్జునుని రథం నీకు. భీమసేనుని మాటలమీద నమ్మకం లేదు కామోసు నీకు. దుశ్శాసనుని రక్తం అతను తాగేశా డనే అనుకో. ఇలా కారులు పేలుతున్నందుకు, నిన్ను, ధర్మనందనుడూ, భీమార్జునులూ, నకులసహదేవులూ — వీరిలో వొక్కరూకూడా విడిచి పెట్టరు” అన్నా డతను, ఉలూకుణ్ణి చూస్తూ.

## 163

### ఉ లూ క దౌ త్యం 4

అర్జును డూరుకోలేకపోయాడు, “ఉలూకా, నీరాజు, ఇతరుల భుజ బలం నమ్ముకుని యుద్ధం తలపెడుతున్నాడు. అది మగతనం కాదని చెప్పు. నేనన్నా నని నలుగురిలోనూ చెప్పు, చాటుగా కాదు. ‘మూఢా, నువ్వు కాపురుషుడవు. భీష్ముణ్ణి చావుకుసిద్ధంచేస్తున్నావు నువ్వు. రాజు లందరిలోనూ వృద్ధు డతను. అందరికీ హితమేకోరే ఉదారహృదయు డతను. ఇంద్రియాలు జయించినవాడు. అతణ్ణి చూసుకుని వేస్తున్నావు రంకెలు. “పాండవులు బంధుత్వం పురస్కరించుకొని భీష్ముణ్ణి చంప డానికి సాహసించలే” రని అనుకుంటున్నావు నువ్వు, మాకు తెలుసు; కాని రాజు లందరూ చూస్తూవుండగా, మొదట మేమతణ్ణే సంహారిం చేస్తాం, చూసుకో’ మని చెప్పు. ఇంతే కాదు, తెల్లవారడం తడువుగా యుద్ధం ప్రారంభం అయిపోతుం” దనినీ్న చెప్పు. ఒకవిధంగా భీష్ముడే

నమ్మించాడు వాణ్ణి. తానే సృంజయులనూ మమ్మల్నీ సంహారించేస్తా డుట భీష్ముడు. ద్రోణుడు లేకపోయినా తానీపని చెయ్యగలడుట. కనక, "పాండవులను తలుచుకుని నువ్వేమీ భయపడవ" ద్దని కూడా చెప్పా డతను. అదీ ధైర్యం మీరాజుకి. "దుర్యోధనా, ఆభీష్మునివల్లనే నీకీరాజ్యం వచ్చింది. పాండవులు నిశించిపోతా రనుకుంటున్నావే గాని నీకే వినాశం కనిపెట్టుకునివుందని గుర్తించుకోలేకుండా వున్నావు. రేపు — సూర్యోదయం కాగానే, మీరందరూ చూస్తూవుండగానే భీష్ముణ్ణి చంపేస్తా న్నేను. చేతనైతే మీరతణ్ణి కాపాడుకోండి" అని కూడా చెప్పు.

భీష్ముణ్ణి నేను శరవర్షంతో ముంచెత్తినప్పుడు తెలిసివస్తుంది దుర్యోధనునకు తన కోతల బండారం. దుశ్శాసనుడు దూరపుచూపు లేనివాడు. ధర్మం లేశమూ తెలియదు వాడికి. ఎవరితో పడితే వారితో విరోధం పెట్టుకోడం వొక్కటే తెలుసు వాడికి. పాపసంకల్పాలే చేస్తా డెప్పూ డూ. మాభీమసేనుడు ఆవేళ కోపంతో సభలో అన్నమాటలు జరిపి తీరతా డని త్వరలోనే తెలుస్తుంది నీకు" అని కూడా చెప్పు.

మీదుర్యోధనుని దగ్గిర ఉండవలసిన దుర్గుణా లన్నీ వున్నాయి. తానే మిక్కిలీ ఉత్తము ణ్ణనుకుంటున్నాడు వాడు. ఎలాంటివాళ్ళనైనా జయించేస్తా నన్న నమ్మకంతో వున్నాడు. కటువుగానూ దురుసుగానూ మాట్లాడ్డమూ, మాట్లాడితే మండిపడ్డమూ బాగా చేతనవును వాడికి. స్నేహం అంటే యేమిటో యెరగనే యెరగడు. ఇతరుల నెంతెంతవా రినీ కూడా చాలా చులకనచేస్తాడు. తానే జ్ఞానీ, తానే శూరుడూ అన్న దురభిమానంతో యేమీ తెలుసుకోలేకుండా వున్నాడు. స్నేహం వొక్కటే కాదు, దయా యెరగడు. ఎవర్నైనా సరే విషం పెట్టి చంపడానికి జంకడు. ధర్మం అంటే మహాద్వేషం వాడికి. అన్న మాట చెల్లించుకోవా లన్న నీతిలేనివాడు. వితండవాదానికి జంకడు.

పెద్దలమాట మన్నించడు. చేతకానివాళ్లని నమ్ముకుంటాడు గుడ్డిగా. తన బలగం పదకొండక్షౌహిణు లుండడమే చూసుకుంటున్నాడు. సత్తా కాదు. మమ్మల్ని దగ్గిర చేరకుండా కొట్టడమే వ్రతంవాడికి. వీటి కన్నిటికీ ఫలం త్వరలోనే అనుభవిస్తాడు. ఈమాట కూడా చెప్పు.

"ఓరీ నరాధమా! నాకోపం వచ్చిం దంటే — నేనూ కృష్ణుడూ కలిసి బయలుదేరా మంటే, నీకు రాజ్యం యెక్కడిది, జీవితాశ మాత్రం యెక్కడిది రా? భీష్ము డస్తమించాక — ద్రోణుడూ కర్ణుడూ పడిపోయాక గాని నీకీదురాశ పోదు. భీమసేనుని చేతిలో నీతమ్ములు చచ్చిపోయాక — నీకొడుకులు వినాశం పొందాక — భీమసేనుని గదా ఘాతానికి తొడలు విరిగి స్వయంగా నువ్వన్నా పడిపోయాక నువ్వు చేసిన పాపాలు జ్ఞాపకంవస్తాయి నీకు. నీచుడా, మళ్లీమళ్లీ ప్రతిజ్ఞ మార్చు కోడం నాకు చేతకాదు. నేను సత్యమే చెబుతా నెప్పుడూ, కనక, ఇదంతా జరిగితీరుతుం" దనిన్నీ నేవన్నా నని చెప్పు వాడితో.

"ఉలూకా" అంటూ ధర్మనందను డందుకున్నాడు మళ్లీ. "ఓరీ, దుర్యోధనా, ధర్మప్రవర్తనలో నన్నెప్పుడూ మించిపోలేవురా నువ్వు. నీకూ నాకూ వుండుకున్న అంతరమూ సత్యానికీ అసత్యానికీ వున్న తేడా నేనెరుగుదును. చలిచీమలూ, పాములూ — ఇలాంటివాటి విషయమై కూడా నేనెప్పుడూ పాపం చెయ్యలేను, ఇక జ్ఞాతులను చంపాలని నాకు సంకల్పం లే దని వేరే చెప్పడం యెందుకూ? నీచావు చూడ్డం యిష్టం లేకే అయిదూళ్లయినా చాలు నిమ్మన్నా న్నేను. నీకు గొప్ప అపాయం కనిపెట్టుకుని వుంది, నువ్వది తెలుసుకోలేకుండా వున్నావు. మూఢుడవు కనక, నీహితం కోరే చెప్పినా కృష్ణుని మాట అర్థం చేసుకోలేకపోయావు నువ్వు. మరి, యిప్పు డెందుకూ పదిమాటలు? బంధువులను అందరినీ కూర్చుకుని, రా, యుద్ధంచెయ్యి. నువ్వు

పంపిన రాయబారం అందింది. నీవుద్దేశం తెలిసింది. అది అలాగే జరుగుతుంది లే" అని కూడా చెప్పు మీరాజుకి" అన్నా డతను.

భీముడు కూడా అందుకున్నాడు మళ్లీ. "ఉలూకా, మీదుర్యోధనుడు లోపల్లోపల గొంతుకులు కోసేరకం. వారికీ వీరికీ అనిలేదు, అందరికీ శూన్యమే పెడతాడు వాడు. పాపప్పనులే చేస్తా డెప్పుడూ. దురాచారా లంటే బహూ యిష్టం వాడికి. ఓరీ నరాధమా, నేను చచ్చిపోతానా, హస్తినాపురంలో వుండి నువ్వు రాజ్య మేలుకుంటావు. నేను బతికే వుంటానా, కాకులపాలూ, గద్దలపాలూ అవుతావు నువ్వు" అని చెప్పాను, సభలో నే నావేళ. ఇది నాశపథం. నేనిది జరిగించి తీరతాను. దుశ్శాసనుని గుండెలు పగలదన్ని వాడిరక్తమున్నూ తాగేస్తాను. నీతొడలు విరగ్గొడతాను. నీసోదరుల నందరినీ చంపేస్తాను. కౌరవులపాలిటి మృత్యుదేవత న్నేను. రాజులకున్నూ అందరికీ మృత్యుదేవతనే నేను. ఇంకొకటి చెబుతున్నా నిప్పుడు విను. నీతొడలు విరగ్గొట్టి, ధర్మనందనుడు చూస్తూవుండగా నీతల గూడా తన్నేస్తానురా నేను" అని చెప్పు, మీదుర్యోధనునితో" అన్నా డతను నిష్ఠురంగా.

నకులసహదేవులున్నూ చెప్పారు "ఇంతవరకూ మాబాధలు చూసి పొంగిపోయావు నువ్వు. ఇక నీపాట్లు చూసుకుంటావు" అని చెప్పమని. "సత్పురుషుల కందరికీ మేమెప్పుడూ దాసులమే. మేమెరికి దాసాను దాసులమో, నీపౌరుషం యేపాటిదో అది రేపే తెలిసిపోతుం దని చెప్పు మీ దుర్యోధనునితో" అన్నారు విరటుడూ ద్రుపదుడూను. "ఉలూకా, మీరాజు కెప్పుడూ పాపులంటేనే యిష్టం. "భీష్మున్ణి నమ్ముకుని నువ్వీయుద్ధానికి సిద్ధపడుతున్నావు. ఆభీష్మున్ణి నేను సంహరించి రథంమీదినుంచి కిందికీడ్చేస్తాను, చూసుకో. భీష్మున్ణి సంహారించడానికే నన్ను పుట్టించాడు బ్రహ్మ. విలుకాళ్లందరూ చూస్తూవుండగా నేనాపనే చేస్తా" నని చెప్పు మీరాజుతో" అని చెప్పాడు శిఖండి.

"నేను ద్రోణుణ్ణి సంహరించేస్తాను. ద్రోణుణ్ణి మాత్రమే కాదు, అతనివారి నందరినీ కూడా నాశనంచేసేస్తాను. పాతపగ లున్నాయి మాకు. అవి తీర్చుడానికే పుట్టాన్నేను. ఎవరూ చెయ్యలేనిది చేస్తాన్నేను. ఈమాటలే చెప్పు మీ దుర్యోధనునితో" అన్నాడు ధృష్టద్యుమ్నుడు.

ధర్మరాజు మళ్లీ అందుకున్నాడు. "ఉలూకా, మీరాజులతో ఇంకోమాటు చెప్పు నామాటలు." దుర్యోధనా, జ్ఞాతులను నాశనం చెయ్యా లన్న కోరికా, ఉద్దేశమూ కూడా లేవు నాకెప్పుడూ. నువ్వు చేసిన పాపాలకు ప్రతీకారం చెయ్యడమే నావుద్దేశం. ఇందులో యెవ రికీ తెలియం దేమీ లేదు. ఉలూకా, కనక, నువ్వేక వెళ్లిపో. లేదూ, ఇక్కడే వుండిపో, నీకేమీ భయంలేదు. మేము నీకు బంధువులం" అని చెప్పా డతను.

ధర్మనందనుని సెలవుపొంది ఉలూకుడు వెళ్లిపోయాడు. వెళ్లి యిక్కడ జరిగిం దంతా, వొక్క అక్షర మయినా మిగిలిపోకుండా చెప్పా డక్కడ. అందరు చెప్పమన్నవిన్నీ పేరుపేరువరసన చెప్పుకునివచ్చాడు. అదంతా విని దుర్యోధనుడు "సూర్యోదయం కాకముందే మనసేన లనూ రాజులనూ నడిపించండి" అని చెప్పాడు దుశ్శాసనునకూ, కర్ణ నకూ, శకునికీని. కర్ణుడు చెప్పగా, రథాలమీద కొందరూ, యేనుగుల మీద కొందరూ, గుర్రాలమీద కొందరూ, లొట్టిపిట్టలమీద కూడా కొందరూ వెళ్లి భృత్యులు "తెల్లవారడం తడవుగా యుద్ధానికి బయలు దేరాలి" అని సైనికులకూ రాజులకూ గూడా చెప్పేశారు.

# 164

## ఉ జ్జీ లు

ఉలూకుడు వెళ్లిపోయాడు. "బయలుదేరాలి" అన్నాడు ధర్మరాజు. ధృష్టద్యుమ్నుడు వెంటనే బయలుదేరాడు. రథాలు, ఏనుగులు,

గుర్రాలు, కాల్బంట్లు— ఇలాగ నాలుగు విధాలుగా వున్న ఆమహాసేన అతని వెంటబయిలుదేరింది. చాలా భయంకరంగా వుందది. మహాసముద్రంలా వుంది. " ఎవరికయినా అజేయమే యిది " అన్నట్టున్నా వుంది.

దాని కంతకీ ముందున్నాడు ధృష్టద్యుమ్నుడు. యుద్ధోన్మత్తుడై ద్రోణుణ్ణి సంహరించడం విషయమే ఆలోచించుకుంటున్నా డతను.

అర్జునునకు కర్ణుణ్ణి ఉజ్జీవేశా డతను. భీమసేనునకు దుర్యోధనుణ్ణీ, ధృష్టకేతునకు శల్యుణ్ణీ, ఉత్తమౌజునకు కృపుణ్ణీ, నకులునకు అశ్వత్థామనూ శైబ్యునకు కృతవర్మనూ, యుయుధానునకు సైంధవుణ్ణీ, శిఖండికి భీష్ముణ్ణీ, సహదేవునకు శకునినీ, చేకితానునకు శలుణ్ణీ, ద్రాపదేయులకు త్రిగర్తులనూ, అభిమన్యునకు వృషసేనుణ్ణీ, తక్కినరాజులనూ ఉజ్జీ వేశాడు. అభిమన్యుడు అర్జునునికంటే గొప్పవా డని అతని నమ్మకం. తనకి ద్రోణుణ్ణి వేసుకున్నా డుజ్జీ.

యథాశాస్త్రంగా వ్యూహాలు పన్ని, సేనాపతిపతి అయిన ఆధృష్టద్యుమ్నుడు పాండవులకు జయం సంపాదించిపెట్టడానికి ప్రచండ మైన ఆసైన్యం అంతా తరలించుకుని బయలుదేరాడు.

# 165

## కౌరవుల్లో రథులూ, అతిరథులూను

" సంజయా, నాకొడుకులు చాలా మందులు. బొత్తిగా బుద్ధిలేదు వాళ్లకి. మరి, భీష్ముణ్ణి చంపేస్తా నని అర్జునుడు ప్రతిజ్ఞ పట్టాడు గదా, దానిమీంద నాకొడుకు లేమిచేశారోయ్ ? అర్జునునకు కృష్ణుని సాయం వుంది. కనక, అతని చేతిలో భీష్ముడు చచ్చిపోయినట్టే నేను లెక్క వేసుకుంటున్నాను. భీష్ముడు సామాన్యుడు కాడు. అతని ప్రజ్ఞకు పరిమితి అంటూ లేదు. అదీ బుద్ధీ, పరాక్రమమూ కూడా హద్దులేనివి. అంతటి విలుకాడున్నా మరొకడు కనపడడు. మరి, అర్జునుని శపథం

తెలిసి అత నేమన్నాడూ ? సర్వసేనాధిపత్యం వహించి అతను చేసిందిన్నీ యేమిటీ ?" అనడిగాడు ధృతరాష్ట్రుడు. దానిమీాద, సంజయుడు, భీష్ముడు చెప్పిం దంతా వివరంగా చెప్పాడు.

"రాజేంద్రా సర్వసేనాధిపత్యం వహించి భీష్ముడు ముందు దుర్యోధనుణ్ణి పిలిచాడు. దేవసేనాధిపతి అయిన కుమారస్వామికి నమస్కారాలు విన్నవించుకుని మెల్లిగా ప్రారంభించాడు.

"దుర్యోధనా, నేనిప్పుడు నీకు సర్వసేనాధిపతిని. సేనలకు సంబంధించిన ఏర్పాట్లన్నీ నాకు బాగా తెలుసు. మన సొంతయోధులనూ, మనకు సాయంచెయ్యడానికి వచ్చిన రాజులనూ కూడా నేను బాగా నడపగలను. జైత్రయాత్రకు బయలుదేరడమూ, యుద్ధం నిర్వహించడమూ, శత్రువుల దాడులు తట్టుకోడమూ — ఇవన్నీ కూడా బాగా తెలుసు నాకు. ఈవిషయమై బృహస్పతి తరవాత నన్నే చెప్పుకోవాలి. దైవికవ్యూహాలూ, గాంధర్వవ్యూహాలూ, మానుషవ్యూహాలూ పన్నడమూ, నడిపించడమూ కూడా నాకు బాగా తెలుసు. ఈవిషయమై నీకేమీా కంగా రక్కర్లేదిక. నీసేన అంతా సరిగా నడిపిస్తూ పాండవులతో యుద్ధం కూడా చేస్తాన్నేను. ఏలోటూ రానివ్వను కూడా. కనక, నువ్వు నిశ్చింతగా వుండు" అని చెప్పాడు.

దీనిమీాద, నీకొడుకు "తాతా, దేవతలు దండెత్తివచ్చినా, దానవులూ మీాద పడ్డా — వారిద్దరూ కలిసివచ్చినా నాకు భయంలేదు. ఎవరూ కూడా నన్నేమీా చెయ్యలేరు. మరి, నువ్వు సర్వసేనాధిపత్యం వహిస్తున్నప్పుడూ, నాకు ద్రోణుడు ముఖ్యయోధుడయి వుండినప్పుడూ చెప్పడాని కేంవుందీ ? మీారిద్దరూ పూనుకోడంవల్ల నాకు విజయం నిశ్చయమే. దేవరాజ్యం సాధించుకోడం కూడా నాకేమంత కష్టం కాదు.

అయితే, నీకు సమస్తమూ తెలుసు. పాండుపుత్రుల బలాబలాలూ తెలుసు, మన బలాబలాలూ తెలుసు. కనక, మన సేనలోనూ, వారి

సేనలోనూ రథు లెవరో, మహారథు లెవరో అతిరథు లెవరో బాగా వివరించి చెప్పాలి నువ్వు. మనకి సాయం వచ్చిన రాజుల విషయం కూడా చెప్పాలి నువ్వు" అనడిగాడు దుర్యోధనుడు.

"అయితే, చెబుతా విన" మన్నాడప్పుడు భీష్ముడు. "మన సేనలో రథులూ, మహారథులూ, అతిరథులూ లక్షలమీద వున్నారు. వారి నందరినీ వివరించి చెప్పడం అంటే ఇప్పుడు తేలే పని కాదు. కనక, ముఖ్యుల విషయం చెబుతాను" అంటూ ప్రారంభించా డతను.

"దుర్యోధనా, నువ్వూ నీతమ్ములు నూరుగురూ రథులు. మీారందరూ శస్త్రాస్త్రాలు బాగా తెలిసినవారు. శత్రువులను సంహరించడమూ, విడగొట్టి వోడించడమూ కూడా చాలా బాగా తెలుసు మీాకు. రథం యెక్కీ, యేనుగెక్కీ కూడా మీారు సమంగా యుద్ధం చెయ్యగలరు. గదలూ, ఖడ్గాలూ, కత్తులూ, తోమరాలూ పుచ్చుకుని చాలా భయంకరంగానూ విజృంభించగలరు. శత్రువులను అడుగు కదలకుండా నిలిపి వెయ్యగలరు. చంపెయ్యగలరు. యుద్ధంలో మీారుపయోగించలేని సాధనా లంటూ యేమీా లేవు లోకంలో. ధనుర్వేదం అంతా మీారు కృపాచార్యుని దగ్గిరా ద్రోణాచార్యుని దగ్గిరా క్షుణ్ణంగా నేర్చుకున్నారు. మీారందరూ కూడా యుద్ధోన్మత్తు లయి వున్న పాంచాలురను జయించగలరు. మీాకహంకారం యెక్కువ. పాండవు లంటే ద్వేషమున్నూ యెక్కువే మీాకు.

ఇక నావిషయం. పాండవుల నన్నివిధాలా కష్టపెడతా న్నేను. శత్రువుల నందరినీ నాశనమున్నూ చేసేస్తాను. భోజు లందరిలోనూ కృతవర్మ అతిరథుడు. యుద్ధంలో నీకోరిక సాధిస్తా డతను. ఏలాంటి వాళ్లూ కూడా యెదిరించి నిలవలే రతణ్ణి. బాణా లెంత దూరానికయినా వేసి లక్ష్యం కొట్టడంలో మిక్కిలీ సమర్థు డతను. మహేంద్రుడు

దానవులను సంహరించే టట్టు, నీశత్రువులను సంహరిస్తా డతను, నీకను మానం అక్కర లేదు.

మద్రరా జయిన శల్యుడున్నూ అతిరథుడే. యుద్ధంవచ్చిం దంటే కృష్ణు న్నెదిరిస్తాడు ముందతను. కృష్ణు డంటే మహాపగా, మహా కసీని అతనికి. నకులసహదేవుల్లు సాక్షాత్తూ మేనల్లు ళ్లతనికి. అయినా,వారిని కాదని — వారికి వ్యతిరేకంగా నీపక్షంగా యుద్ధంచెయ్యడానికి వచ్చా డంటే, అతని పగా, అతని కసీ యెంతటివో నీకు వేరే చెప్పనక్కర లేదుగదా? సముద్రంలో కెరటాల్లాగ, వొక బాణం తరవాత మరో బాణం వేస్తూ పాండవులను కంగారుపెట్టేస్తా డనను, సందేహంలేదు.

సోమదత్తుని కొడుకు భూరిశ్రవుడు శస్త్రాస్త్రాలు బాగా నేర్చినవాడు. నువ్వంటే చాలా యిష్టం అతనికి. నీకు మిక్కిలీ స్నేహితుడు. గొప్ప విలుకాళ్లలో వొకడు. అతిరథు డతను. నీశత్రువుల సేనలో చాలా భాగం నాశనం చేస్తా డతను. సింధురా జయిన జయద్రథుడు ద్వైర థుడు. చాలా కసిగా యుద్ధంచేస్తా డతను. ఒకప్పుడు ద్రౌపదిని హరించి పాండవుల చేతిలో చాలా పరాభవం పొందివున్నా డతను. అదంతా మనస్సులో వుందతనికి. పిడుగులా పడతా డిప్పుడు వారిమీద. ఆపరా భవం జరిగాక, గొప్ప తపస్సు చేసి పాండవులతో యుద్ధంచెయ్యడానికి గొప్ప వరం సంపాదించుకునివున్నా డతను. ప్రాణా లయినా విడిచిపెడ తాడు గాని పాండుపుత్రులను విడిచిపెట్టడు "

## 166

### కౌ ర వు ల్లో ర థు లూ, అ తి ర థు లు న్నూ.

కాంభోజదేశాధీశు డైన సుదక్షిణుడు ఏకరథుడు. నీకు జయం సంపా దించిపెట్టా లన్న దీక్షతో యుద్ధంచేస్తా డతను. ఇంద్రునికంటే యెక్కువ పరాక్రమం చూపిస్తాడు. అతని వేగం చాలా గొప్పది.

మిడతల్లా వెళ్లి శత్రువుల రథాలు కమ్మేస్తా యతని బాణాలు. మాహిష్మతీపురాధిపతి నీలవర్మ రథి. అతనూ కసిగానే శత్రువులమీద పడతాడు. సహదేవునితో పూర్వ విరోధం వుండతనికి. అతనున్నూ మనస్ఫూర్తిగా యుద్ధంచేస్తాడు నీకోసం.

అవంతినాథులు విందుడూ అనువిందుడూ కూడా రథులే. వారి బల పరాక్రమాలున్నూ సామాన్య మైనవి కావు. ఎంతటి శత్రుసైన్యం అయినా కలిచిపారేస్తారు వారు. గదలూ, కత్తులూ, ఖడ్గాలూ, బాణాలూ, తోమరాలూ—ఇలాంటి ఆయుధాలతో శత్రువులను చిందర వందరచేస్తూ యుద్ధభూమిలో తాండవంచేస్తారు. మనుష్యు లన్నట్టు కాదు, యము లన్న ట్టురుకుతారు శత్రువులమీద.

త్రిగర్తు లయిదుగు రన్నదమ్ములూ కూడా రథులే. విరాటనగరాన, దక్షిణగోగ్రహణసమయంలో పాండుపుత్రులతో బాగా విరోధపడి వున్నారు వారు. పెద్దపెద్దకెరటాలు రేపుతూ గండుమొసళ్లు గంగానది నెలా అల్లకల్లోలం చేస్తాయో, పాండవుల సైన్యం అంతా అలా కలిచే స్తారు. వారయిదుగురిలోనూ ముఖ్యుడు సత్యరథుడు. అర్జును డంటే వారికి చాలా కసి. ఆవెనకటి పగా, కసీ తలుచుకుంటూ యుద్ధంచేస్తారు వారు. ఏరియేరిన్నీ కొడతారు వారు గొప్పగొప్ప క్షత్రియవీరులను.

నీకొడుకు లక్ష్మణుడూ దుశ్శాసనుని కొడుకూ గూడా రథులు. సుకుమారులు వారు; కాని యుద్ధం అంటే మహాసరదా వారికి. వారి వేగం చాలా గొప్పది. యుద్ధమర్మా లనీ తెలుసు వారికి. ఎలాంటి శూరులనూ గూడా నిర్లక్ష్యంగా యెదురుకుంటారు, వారు. యుద్ధ మున్నూ సింహాలన్నట్టు చాలా భయంకరంగా చేస్తారు. క్షత్రియధర్మం తప్పరు. గొప్పకార్యా లెన్నో చేస్తారు, ముందుముందు. దండధారు డేకరథుడు. నీకోసం తన సైన్యం అంతా వెంటబెట్టుకువచ్చా డతను. కోసలాధిపతి అయిన బృహద్బలుడుకూడా రథి. అతని వేగమూ పరా

క్రమమూ గూడా చాలా గొప్పవి. తన బంధువులను మిక్కిలి సంతోష పెడుతూ గొప్పగా యుద్ధంచేస్తా డతను.

కృపాచార్యు డతిరథుడు. ప్రాణాలయినా విడిచిపెట్టడానికి సిద్ధపడి శత్రువులను చిందరవందర చేసేస్తా డతను. గౌతమసగోత్రుడూ, మహర్షుల్లో మిక్కిలీ తేజశ్శాలీ, ఆచార్యుడూ అయిన శరద్వంతుని కొడుకతను. కుమారస్వామిలాగే రెల్లుదుబ్బుల్లో పుట్టిన మహావీరుడు. దావానలం అన్నట్టు విజృంభించి శత్రుసైన్యం అంతా కాల్చేసి విడిచిపెడతా డతను.

# 167

## కౌరవుల్లో రథులూ అతిరథులూను 3

“నీ మేనమామ శకుని ఏకరథి. పాండవులతో బహూ కసిగా పోరతా రతను, సందేహం లేదు. అతనిసేన చూడ్డానికే చాలా భయంకరం. ఆసైనికుల ఆయుధా లన్నీ రకరకాలు. వారి వేగం వాయువేగాని కేమాత్రమూ తీసిపోదు.

ద్రోణపుత్రు డున్నా డశ్వత్థామ, మహారథు డతను. అతణ్ణి పోలిన విలుకాడు మరి లేడు. చిత్రవిచిత్రయుద్ధాల్లో ఆరి తేరినవా డతను. అతని ఆయుధాలు చాలా దృఢమైనవి. అర్జునుని బాణాల్లాగే అతని బాణాలున్నూ పుంఖానుపుంఖాలుగా వెళ్లిపడతాయి శత్రువులమీద. అతని సత్తా పూర్తిగా వివరించడం నాకు శక్యంకాదు. బుద్ధి పుట్టిం దంటే ముల్లోకాలూ బుగ్గిచేసెయ్యగల డతను. ఆశ్రమాల్లో వుండే మహర్షుల క్రోధమూ, తేజస్సూ ఘోరతపస్సుచేసి సంపాదించా డతను. తండ్రి అయిన ద్రోణు డతని కెన్నో దివ్యాస్త్రాలు ప్రసాదించాడు. చాలా బుద్ధిమంతుడే కా దతను, గొప్పబుద్ధిమంతుడున్నూ. అతని దగ్గర వొక్కటే వుంది పెద్దదోషం. అంచేతనే అతిరథు డని చెప్పవలసివుం

డినా, మహారథు డని మాత్రమే చెబుతున్నా న్నేను. ప్రాణా లంటే మహాతీపి ఆ బ్రాహ్మడికి. దీర్ఘాయువు అనుభవించాలన్న కోరిక అతనిది. అయినా, అతణ్ణి పోలినవాడు మనసేనలోనూ పాండవసేనలోనూ కూడా లేడు. దేవతలే వచ్చి మీదపడనీ. అతనొక్కడే జయించగలడు. గొప్ప వర్చస్వి. సరదాగా చప్పట్లు కొడితేనే చాలతను, గొప్పగొప్ప పర్వతాలున్నా బద్దలయిపోతాయి. యము డన్నట్టు విజృంభిస్తా డతను, యుద్ధరంగంలో. అతణ్ణి చూస్తే చాలు, సింహాన్ని వేరే చూడనక్కరలేదు. ప్రళయాగ్ని వొక్కటే అతనికి సాటి. భారత యుద్ధంలో అతను శేషం లేకుండా చేసేస్తాడు.

అతని తండ్రి ద్రోణుడున్నాడు. మహా తేజశ్శాలి అతను. వయస్సుకి వృద్ధుడే; కాని యువకులున్నూ చాల రతనికి. యుద్ధరంగంలో అతను చూపించే విశేషా లెవరూ చూపించలేరు. అతని బాణాగ్ని పాండవ సైన్యాలన్నీ బూడిదచేసేస్తుంది. రథికుల కందరికీ రథికు డతను. అతను నీకు చేసే మేలు పరిమితి కట్టలేము. ఇప్పుడు మూర్ధాభిషిక్తు లయివున్న రాజుల కందరికీ అతను శస్త్రగురువు. సృంజయులను నాశనంచేసిగాని వెనక్కిమళ్ళ డతను. అర్జును డంటే చాలా యిష్టం అతనికి. ఆమహాధా నుష్కుడు తన గురుత్వం తెలుచుకుని సన్మార్గరతుడైన అర్జునుణ్ణి ఎలాంటి సందర్భంలోనూ కూడా చంపసాహసించడు. అర్జునుని సుగు ణాలే పొగడుతూ వుంటా డెప్పుడూ అతను. కొడుకుని కంటే యెక్కు వగా చూసుకుంటా డతణ్ణి. ప్రతాపమహితుడు కావడంవల్ల, దేవ తలూ, గంధర్వులూ, మనుష్యులూ — విడివిడిగా వచ్చినా, కలిసే వచ్చినా అత నొక్కడే సంహరించేస్తా డందరినీ.

పౌరవుడున్నూ మహారథుడు. తన సైన్యం అంతా కూర్చుకుని, శత్రుసైన్యం అంతా చిందరవందర చేసేస్తూ పాంచాలయోధుల నంద రినీ సంహరించేస్తా డతను. సత్యశ్రవసుడు రథి. నీ శత్రుసైన్యాని

కంతకూ యము డవుతా డతను. అతని యోధుల కవచాలూ ఆయుధాలూ చిత్రవిచిత్రాలు. వారున్నూ నీశత్రువుల సందరినీ సంహరిస్తారు. కర్ణుని కొడుకు వృషసేను డొక రథి. అతను కూడా పాండవుల బలగం చీకాకుపరిచేస్తాడు. జలసంధు డొకరథి. మహాతేజశ్శాలి అతను. తన ప్రాణా లయినా విడిచిపెడతాడు; గాని నీశత్రువులను విడిచిపెట్ట డతను. రథంయెక్కి ఏనుగెక్కి కూడా చాలా గొప్పగా యుద్ధంచేస్తాడు. నీకోసం ప్రాణా లయినా విడిచిపెట్టడానికి సిద్ధంగా వచ్చాడు. చిత్రయుద్ధం చెయ్యడంలో చాలా సమర్థుడు. భయం అంటే ఏమిటో యెరుగ డతను.

బాహ్లికు డతిరథుడు. వెనుకంజ యెరుగని యోధు డతను. సూర్యభగవానుని తీక్ష్ణత కంటే అతని శౌర్యం మిక్కిలీ దుస్సహం. వాయువేగం మించిన వేగం అతనిది. నీసేనాపతుల్లో వొకడైన సత్యవంతుడు మహారథుడు. యుద్ధరంగంలో యెన్నో అద్భుతాలు చేస్తా డతను. అతను యుద్ధంచేస్తూవుంటే చూడ్డానికి చాలాముచ్చటగా వుంటుంది. తన రథమార్గంలోకి వచ్చినవాళ్లమీద నవ్వుతూ పడతా డతను. రాక్షసవీరు డైన అలంబుషుడు మహారథుడు. నీశత్రువు లందరితోనూ పాతపగ లున్నా యతనికి. అవి మరిచిపోలే తడను. తన కసి అంతా తీర్చుకుంటా డత నిప్పుడు. బహుమాయలు తెలిసినవాడు. పాముపగ లతనిది.

ప్రాగ్జ్యోతిషపురాధిపతి భగదత్తుడు గొప్పప్రతాపశాలి. రథి అతను. నారాయణాస్త్రం అతని కభిమానం. అతనికీ అర్జునునకూ వెనకటి కొకమాటు గొప్పయుద్ధం జరిగింది. జయంకోసం యిద్దరూ కూడా చాలా పోటీపడ్డారు. కాని తనకు స్నేహితు డైన యింద్రుని మొగం చూసి అర్జునునితో మైత్రిచేసుకున్నాడు. ఏనుగెక్కి అతను యుద్ధం చేస్తూవుంటే ఐరావతం యెక్కివచ్చి యింద్రుడే యుద్ధం చేస్తున్నట్టుంటుంది.

# 168

## కర్ణుడర్ధరథుడు

అచలుడూ, వృషకుడూ — వారిద్దరూ సోదరులు. రథికులు వారు. వారి నెవరూ తేరిచూడలేరు. నీశత్రువులను నాశనం చేసేస్తారు వారు. మిక్కిలీ బలవంతులు. దృఢక్రోధులు. గాంధారుల్లో ముఖ్యులు, చూడ ముచ్చటగా వుంటారు వారు.

ఇక నీసఖు డున్నాడు కర్ణుడు. యజమానికంటేనూ ఎక్కువ నీ కతను. నిజాని కతను రణకర్కశుడే. నిన్ను పాండవులమీదికి కవ్విస్తూ వుంటా డెప్పుడూ. పరుషభాషి. డాబులరాయుడు. నీచుడు. నీకు మంత్రీ. నాయకుడూ, బంధువూ కూడానూ. దురభిమానమూ గర్వమూ ఎక్కువతనికి. అతిరథుడూ, మహారథుడూ కాడు. రథీ కాడు చివరి కతను. సహజమైన కవచం పోగొట్టుకున్నాడు. సహజాలైన కుండలాలున్నూ పోగొట్టుకున్నాడు. ఆత్మస్తుతీ పరనిందా ఎక్కువతనికి. పరశురాముని శాపమూ, బ్రాహ్మడి మాటా, కవచకుండలాల లేమీ — వీటివల్లనే నర్ధరథి అని నిర్ణయిస్తున్నా నతణ్ణి. అర్జునుని యెదట పడితే బతికి వెనక్కి రాలే డతను."

భీష్ము డిలా అన్నాడు "ఔనౌ" నంటూ అందుకున్నాడు ద్రోణుడు. "నువ్వు సరిగా చెప్పావు. అందులో అసత్యం యేమీ లేదు. యుద్ధం వచ్చినప్పుడల్లా ముందు కురుకుతాడు; గాని ప్రతీయుద్ధంలోనూ వెనకంజవెయ్యడమే జరుగుతోం దతను. పరనిందలో మాత్రమే మహాఘటికుడు. ప్రమాది. అంచేత, అత నర్ధరథు డనే నానిశ్చయమున్నూ" అన్నా డతను దృఢంగా.

ఇది విన్నాడు, మండిపడ్డాడు కర్ణుడు. కళ్లెర్రజేసి "నువ్వెప్పుడూ యింతే" అంటూ చించుకున్నాడు భీష్మునిమీద. "పితామహా,

సరపరాధి న్నేను ; కాని, నువ్వెప్పుడూ నన్నిలాగే తీసిపారేస్తున్నావు. నేనంటే ద్వేషమే నిన్నిలా చేస్తోంది. అయితే, దుర్యోధనుని మొగం చూసి అదంతా సహిస్తున్నా న్నేను. నేను బుద్ధిహీను ణ్ణయినట్టూ, కాపురుషు ణ్ణయినట్టూ భావిస్తున్నావు నువ్వు. నువ్వాబద్ధం ఆడవన్న గుడ్డినమ్మకంతో లోకం కూడా నే నర్ధరథు ణ్ణనే భావిస్తుంది. కౌరవు లంటే నీకెప్పుడూ ద్వేషమే; కాని రాజిది గుర్తించలేకుండావున్నాడు. యుద్ధసమయాన భేదభావాలు పుట్టించడాని క్కాకపోతే, ఉదారు లైన యిందరు రాజుల యెదట ఇలాగ యోధుల నెందుకు దిగతీ స్తావూ నువ్వు ? నామహోత్కృష్టయోగ్యతలు చూసి సహించలేకే నువ్విలా ద్వేషిస్తున్నావు నన్ను. క్షత్రియుడైనవాడికి, మహారథు డన్నపేరు వయోవృద్ధత్వంవల్ల రాదు. జుట్టునెరియడంవల్లా రాదు. డబ్బుండడంవల్లా పెద్దబంధువర్గం వున్నందువల్లా కూడా రాదు. మంత్రాలవల్ల బ్రాహ్మలకూ, డబ్బువల్ల వైశ్యులకూ, వయస్సునిబట్టి శూద్రులకూ పెత్తనం వస్తుంది. బలపరాక్రమాలను బట్టే క్షత్రియు నకు పెత్తనం. రాగద్వేషాలు పోలేదు నీకు. జ్ఞానం లేదు నీకు. అంచేతే నోటికి వచ్చినట్లల్లా మాట్లాడుతున్నావు, వీను రథి అనీ, వీ డతిరథు డనీ, నీ దర్ధరథి అనీని. రాజేంద్రా, నువ్వు బాగా ఆలోచించుకో. భీష్ముని బుద్ధి మంచిది కాదు. నీకెప్పుడూ అపకారమే తలపెడుతున్నా డితను. కనక, ఇతణ్ణి విడిచిపెట్టెయ్యి. సైనికుల్లో భేదభావాలు పుట్టా యంటే మళ్లీ సరిదిద్దడం సాధ్యం కాదు. మూలబలాల్లోనే — సొంత బలాల్లోనే యిది సాధ్యం కానప్పుడు, తాత్కాలికంగా, అక్కణ్ణుంచీ ఇక్కణ్ణుంచీ వచ్చిన సైన్యాల్లో అయితే యెలా సాధ్యం అవుతుందీ ? ఈయోధులకు మనస్సులు విరిగాయంటే, తీరా యుద్ధం ప్రారంభం అయాక జీవచ్ఛవాలం అయిపోతాం మనం. అల్పబుద్ధి అయిన భీష్ము డెక్కడ, రథాతిరథనిర్ణయశక్తి యెక్కడ ? పాండవుల సేన లన్నీ

నేనొక్కణ్ణే వెనక్కి మళ్లిస్తాను, నువ్వు బెంగపెట్టుకోకు. నాయెదట పడితేనే చాలు, పాండవులూ, పాంచాలీయులూ కూడా దిక్కు తెలియకుండా పారిపోతారు. యుద్ధమూ మంత్రాలోచనా యెక్కడ, ముసలి వగ్గయి కాలం మూడిన మూర్ఖుడు యీభీష్ము డెక్కడ? తానొక్కడే మహామొనగా డన్నట్టు లోకం అంతా తీసిపారేస్తూవుంటా డితను. ఎంత వాణ్ణి కూడా మరొకణ్ణి గౌరవించ డితను. వయసు మళ్లినవారి ఆలోచనలు వినాలి; గాని వయసు చెల్లినవారివి వినగూడదు. మూడుకాళ్ల ముసలి అంటే మళ్లీ శిశువయిపోయినవా డనికదా పెద్దల నిర్ణయం? నే నొక్కణ్ణే పాండవులను నాశనం చేసేస్తాను; కాని అఘనత యీ భీష్మునకు తక్కిపోతుంది. నువ్వు సర్వసేనాపతిని చేశావితణ్ణి మరి. విడివిడిగా యోధు లెందరు సాధించినా అఘనత సేనాపతికే సంక్రమిస్తుంది. కనక, భీష్ముడు బతికివుండినంతకాలమూ నేను యుద్ధం చెయ్యను, ఇతను చచ్చిపోయాకే అందరినీ యెదిరించి నాశనమున్నూ చేస్తాను"

"కర్ణా" అంటూ అందుకున్నాడు భీష్ముడు. "సముద్రం అంత భారం నామీద వుందిప్పుడు. ఎన్నో యేళ్లుగా తప్ప దనుకుంటున్న కౌరవ మహాయుద్ధం వచ్చిపడిం దిప్పుడు. క్లిష్ట మైన యిలాంటి సమయానసమలో మనకు భేదభావాలు పుట్టనివ్వగూడదు నేను. అంచేతనే బతికివున్నావు నువ్వు. నేను వృద్ధుణ్ణే, సందేహం లేదు; కాని పూనుకున్నా నంటే, నీయుద్ధశ్రద్ధా, నీజీవితశ్రద్ధా కూడా తుంచెయ్యగలను. పరశురాము డంతటి మహామహాఅస్త్రాలు ప్రయోగించి నన్నేమీ చెయ్యలేకపోయాడు, నీవల్ల యేమవుతుందోయ్? ఆత్మస్తుతి చేసుకోడం సజ్జన లక్షణం కాదు. హీనకులుడవు నువ్వు. అంచేత, నీకు తెలియాలి కనకే యీసంగతులు చెబుతున్నాను. ఎందరో రాజులు గుంపులుగుంపులుగా వచ్చి మీదపడ్డా లెక్కచెయ్యకుండా నేనొక్కణ్ణే కాశిరాజు కూతుళ్లను

హరించి తీసుకువచ్చాను. ఇప్పటి యీ సైన్యం లెక్కా- దానిముందు? అన్నీ నాశనం చేసివచ్చా న్నేను. నీమూలాన కౌరవుల కిప్పుడు వినాశ కాలం వచ్చింది. మగవాడ వైతే యెదురొడ్డినిలిచి యిది తప్పించు. మాట్లాడితే అర్జునుణ్ణి తీసిపారేస్తూ వుంటావు, ఏదీ, వస్తున్నా డతను, ఎదిరించి బతికిబయటపడు చూస్తాను" అన్నా డతను, చాలా నిష్ఠురంగా.

"తాతా, తాతా" అంటూ ఆత్రపడ్డాడు దుర్యోధనుడు. "నా మొగంచూసి శాంతించు. ముందున్నది పెద్దపని. నా శ్రేయస్సు వొక్కటే ఆలోచించాలి ఏకాగ్రంగా నువ్విప్పుడు. నువ్వూ కర్ణుడూ కూడా నాకు చాలామేలుచేస్తారు, సందేహం లేదు. అయితే, పాండవుల్లో రథాతిరథు లెవరెవరో అవి కావాలి, నాకిప్పుడు. తెల్లవారితే కలపటం అయిపోతుంది, కనక, ముందు వారి బలాబలాలు చెప్పు" అంటూ ప్రార్థించా డతను, చేతులు జోడించుకుని.

# 169

## పాండవుల్లో రథులూ, అతిరథులూను

"దుర్యోధనా, ఇక్కడి రథుల సంగతీ, మహారథుల సంగతీ, అతిరథుల సంగతీ, అర్ధరథుల సంగతీ విన్నావు. రాజులందరూ యిక్కడే వున్నారు. ఇక పాండవపక్షం సంగతి చెబుతా విను.

ధర్మనందనుడు రథుల్లో చాలా గొప్పవాడు. యుద్ధరంగం ప్రవేశించడం అంటేనే అతనికిష్టంలేదు; గాని, ప్రవేశించాడా అగ్గి అయి విజృంభిస్తాడు. భీమసేను డున్నాడు. ఏకరథి కాడతను. ద్వైరథీ కాడు. త్రైరథి కూడా కాడు. అష్టరథి అతను. ఒక్క రథి శక్తి యెంతటిదో దాని కెనిమిది రెట్ల శక్తి అతనిది. వేయేనుగుల బలం అతనిది. అభిమానం చాలా యెక్కువతనికి. తేజస్సు పట్టిచూస్తే మనిషి అనడానికి వీల్లే దతను. గదచేతబట్టీ, ధను స్సందుకునీ కూడా అత ణ్ణెదిరించగల

మొనగాడు భూమ్మీద లేడు. నకులుడూ సహదేవుడూ కూడా రథులే. వారందరూ, తామనుభవించిన కష్టాలు జ్ఞాపకంచేసుకుంటూ అపర రుద్రు లన్నట్టు విజృంభిస్తారు యుద్ధభూమిలో.

వారందరూ ఆజానుబాహువులు. ఇతరు లందరికంటేనూ వా రయిదుగురూ కూడా బోడి తెడేసి పొడుగెక్కువగా వుంటారు. వారందరూ సింహవిక్రములు. బ్రహ్మచర్యం అంత చక్కగా — అంతనిష్ఠగా అనుష్ఠించినవారు మరి లేరు. వారందరూ తపోనిధులు. సిగ్గుబిడియా లున్నవారు. పులులు వారియెదట ఎందుకూ చాలవు. వేగమూ, దెబ్బకొట్టడమూ, పోమిగ్మ — వీటిలో మనుష్యశక్తికి మించినది వారి శక్తి. దిగ్విజయం చేసినప్పు డెందరినో రాజులను జయించివున్నారు వారు. ఎంతెంతలేసివారూ కూడా వారి ధనుస్సు లెక్కుపెట్టలేరు. వారి గదలూ ఎత్తలేరు. వారి బాణాలున్నూ ప్రయోగించ లేరు. వారు చిన్నవారయివున్నప్పుడే మీరంతా కలిసిన్నీ వారి నేమీ చెయ్యలేకపోయారు, జ్ఞాపకం వుందా? నీసైన్యం అంతా కలిసి వారిలో వొక్కరికిన్నీ చాలదు. నువ్వు మాత్రం వారి యెదటపడ కెప్పుడూ.

వారొక్కరే యీరాజుల నందరినీ సంహరించగలరు. వారు రాజసూయంచేసినప్పుడు గుర్తించేవుంటావు నువ్వీ సంగతి. ద్రౌపది పడ్డ కష్టాలు మరిచిపో లేదు వారు. సభలో మీరు కూసిన కూతలూ మరిచిపో లేదు. అదంతా తొకారిస్తూనే ప్రళయరుద్రు లన్నట్టు విజృంభిస్తారు యుద్ధభూమిలో వారు.

అర్జును డున్నాడు. కృష్ణు డతనికి సాయం. వారిసేనలోనూ మన సేనలోనూ కూడా అంతవాడు మరి లేడు. దేవతల్లోనూ, నాగుల్లోనూ, రాక్షసుల్లోనూ, యక్షుల్లోనూ కూడా అంతటివాడు లేనప్పుడు మనుష్యుల్లో యెలా వుంటాడూ? వెనకటి కాలంలోనూ లేడు, ముందుకాలంలో పుట్టబోడు అంతటి అతిరథుడు. ఆరథానికి దివ్యాశ్వాలు పూను

స్తారు. సారథి కృష్ణుడు. యోధుడు స్వయం అర్జునుడు. ధనుస్సు గాండీవం. కవచం ఎవరూ బద్దలుకొట్టలేనిది. అమ్ములపొదుల్లో తరుగంటూ వుండదు బాణాల కెప్పుడూ. ఇక అస్త్రాలా, మాహేంద్రం, రౌద్రం, కౌబేరం, యామ్యం, వారుణం — ఇలాంటివి కాని సామాన్యాలు కావు. అతని గద చూస్తేనే గుండెలదిరిపోతాయి. ఇంకా అనేకరకాల ఆయుధాలు వాడతాడతను.

హిరణ్యపురవాసులైన అరవై వేలమంది రాక్షసులనూ అతనొక్కడే కాదుటోయ్, సంహరించాడూ? తన సైన్యం చక్కబెట్టుకుంటూనే నీసైన్యం అంతా నాశనంచేసేస్తాడతను. అతనియెదటబడి బతగ్గలవాళ్లం నేనూ ద్రోణాచార్యుడూ తప్ప మరి మూడోవాడు లేడు. అతనా, పడుచువాడు. మేమూ వృద్ధులం. మావల్ల యేమవుతూందీ గనక?"

ఇదంతా విన్నారు రాజులు. వారి మనస్సులే కాదు, రత్నాభరణాలతో తళతళ మెరిసిపోతున్న వారి చేతులున్నూ వడవడవణికిపోయాయి. పాండవు లెప్పుడో చేసిన వీరకృత్యాలన్నీ అప్పుడు తమ యెదట జరుగుతున్నట్టే అనిపించింది వారికందరికీ.

# 170

## పాండవుల్లో రథులూ అతిరథులూను 2

"దుర్యోధనా, ద్రౌపది కొడుకు లయిదుగురూ కూడా మహారథులే. విరటుని కొడుకు ఉత్తరుడు రథి. అభిమన్యుడతిరథుడు. సమయం వచ్చిందంటే, తండ్రితోనూ కృష్ణునితోనూ సమంగా శత్రుసంహారం చేస్తాడతను. గొప్ప అస్త్రాలన్నీ సంపాదించుకుని వున్నాడు. చిత్రవిచిత్రంగా యుద్ధం చేస్తాడు. అభిమానమూ, వేగమూ మహాయెక్కువ వతనికి. అనుకున్నాడంటే చాలా దృఢమైన వ్రతం అతనది. తనతండ్రి పడ్డ బాధలన్నీ యెరుగు నతను. అవి తలుచుకుంటూనే విక్రమిస్తాడతను.

సాత్యకి కూడా అతిరథుడే. వృష్ణివీరుల్లో అంత వేగంగలవాడూ అంత పట్టుదలగలవాడూ మరి లేడు. భయం అంటే కూడా ఏమిటో ఎరగడతను. ఉత్తమౌజుడూ, యుధామన్యుడూ రథులు. వారందరూ ఎలా గయినా పాండవులకు విజయం చేకూర్చాలని తమ ప్రాణాలకున్నా ఆశవదులుకుని యుద్ధంచేస్తారు. రథాలూ, ఏనుగులూ, గుర్రాలూ లక్షలున్నాయి వారిదగ్గిర. నీసేనలో చొరుచుకుపోయి, వొకళ్ళనొకళ్లు హెచ్చరించుకుంటూనూ, పిలుచుకుంటూనూ అగ్గిలాగా, వాయువులాగా చెలరేగిపోతారు వారు.

విరటుడూ ద్రుపదుడూ వయస్సుకి వృద్ధులే; కాని వారిని జయించడం మాటలు కాదు. మహారథులు వారు. ముదిమి అలుముకున్నా క్షత్రియజాతికి సహజమైన పట్టుదలతో తమ శక్తి అంతా ధారపోస్తూ యుద్ధంచేస్తారు వారు. సహజంగా వారి వంశాలు బలపరాక్రమాలకు ప్రఖ్యాతిపొందినవి. ఆర్యవృత్తం తప్పనివారు వారు. గొప్ప విలుకాళ్లు. శౌర్యధైర్యాల్లోనూ, బలపరాక్రమాల్లోనూ ఎవరికీ తీసిపోరు. ఆపైని యిద్దరూ కూడా పాండవులకు దగ్గిర చుట్టాలు. దాంతో, పాండవులకంటే యెక్కువ పూనికతో యుద్ధంచేస్తారు.

వీరులు, సాధారణంగా, కార్యకారణసంబంధాలను బట్టి ఒక్కొక్కప్పుడు అసాధారణమైన శౌర్యమూ కనపరుస్తారు. మరొక్కొక్కప్పుడు వల్లమాలిన పిరికితనమూ కనబరుస్తారు. కాని విరటుడూ ద్రుపదుడూ మాత్రం అలా కారు. వారిద్దరికీ వొకటే మార్గం. తమ ప్రాణాలయినా విడిచిపెడతారు గాని శత్రువులను మాత్రం విడిచిపెట్టరు వారు ప్రాణాలతో. ఒక్కొక్క రొక్కొక్క అక్షౌహిణి సేనతో వచ్చారు. తమ చుట్టరికం చెడకుండా చూసుకుంటూ అద్భుతవీరకృత్యాలు చేస్తారు సామాన్యులు కారు వారు, లోకవీరులు.

## 171

### పాండవుల్లో రథులూ, అతిరథులూను 3

పాంచాలరాజు కొడుకు శిఖండి రథి. మొదట తానాడదయివుండిన మాట అందరూ మరిచిపోయేటట్టు చాలా కసిగా యుద్ధంచేస్తాడతను. పైపెచ్చు, మహావీరుడన్న పేరుగూడా సంపాదించుకుంటాడు నీసేనలో విక్రమించి. అతని సేనలో పాంచాలురూ ప్రభద్రకులూ — మంచి సమర్థులున్నారు. రథయోధులు వారందరూ. వారితో కలిసి వీర కృత్యాలెన్నో చేస్తాడతను.

ద్రోణశిష్యుడైన ధృష్టద్యుమ్నుడతిరథుడు. ప్రళయకాలంలో క్రోధఘూర్ణితుడైన రుద్రుడుగా అన్నట్టు యుద్ధం చేస్తాడతను. అతని రథసైన్యం చాలా గొప్పది కావడంవల్ల దేవసైన్యం మించివుంటుం దని చెబుతారు యుద్ధప్రియులు. ధృష్టద్యుమ్నుని కొడుకు శూరుడే; కాని పిల్లకాయ. శస్త్రాస్త్రసాధన కూడా తక్కువే అతనిది కనక, అర్థ రథుడని చెప్పాలతణ్ణి. శిశుపాలుని కొడుకు ధృష్టకేతుడు మహారథుడు. పాండవులకు దగ్గిరిచుట్టం. తన కొడుకులతో కూడా అతనూ వీరకృత్యాలు చేస్తాడు. క్షత్రదేవుడు రథి. పాండవసైన్యంలో అతనికీ మంచిపేరుంది.

పాంచాలవీరులైన జయంతుడూ, అమితౌజుడూ, సత్యజిత్తూ మహారథులు. మదించి పశంతప్పివున్న యేనుగులన్నట్టు విక్రమిస్తారు వారు, యుద్ధభూమిలో. అజుడూ, భోజుడూ మహారథులు. వారున్నూ పాండవుల శ్రేయస్సుకోరి తమ శక్తికి మించి యుద్ధంచేస్తారు. కేకయసోదరు లయిదుగురూ చిత్రయోధులు. వారి వేగం చాలా గొప్పది. దృఢవిక్రములు వారు. వారు రథులు. కాశికుడూ, సుకుమారుడూ, నీలుడూ, సూర్యదత్తుడూ, శంఖుడూ, మదిరాశ్వుడూ — వీరందరూ

రథులు. గొప్పవిలుకాళ్లు. యుద్ధరహస్యాలన్నీ బాగా తెలిసినవారు. వార్ధక్షేమి మహారథుడు. చిత్రాయుధుడు రథి. అర్జును డంటే అతని కతిభక్తి. యుద్ధరంగంలో గొప్పసామర్థ్యం కనపరుస్తా డతను.

చేకితానుడూ, సత్యధృతీ రథులు. వ్యాఘ్రదత్తుడూ, చంద్రసేనుడూ, సేనాబిందుడూ, క్రోధహంత కూడా రథులే. ఈక్రోధహంత కృష్ణునకూ భీమునకూ సాటిఅయినవాడు. నన్నూ ద్రోణుణ్ణీ, కృపుణ్ణీ నువ్వే మనుకుంటావో అతణ్ణీ అదే అనుకోవాలి. కాశ్యుడు ఏకరథి. ఎన్న తగ్గ వీరుడు. యుద్ధభూమిలో ప్రవేశిస్తాడా, అష్టరథు డన్నట్టు విజృంభిస్తా డతను. సత్యజిత్తు ద్రుపదుని కొడుకుల్లో వొకడు. మంచి వయస్సులో వున్నాడు. ధృష్టద్యుమ్ననకు తీసిపోడు. అతిరథుడు. పాండవుల అభ్యుదయం కోరి చాలా గొప్పపనులు చేస్తాడు.

పాండ్యరాజు మహావీరుడు. పాండవు లంటే యెంతో యిష్టం అతనికి. శూరుడు. గొప్పవిలుకాడు. అతను రథి. శ్రేణిమంతుడూ, వసుదానుడూ అతిరథులు.

# 172

## పాండవుల్లో రథులూ, అతిరథులూను 4

రోచమానుడు మహారథుడు. దేవకుమారుడా అన్నట్టు శత్రుసైన్యాలు చీకాకుపరుస్తా డతను. కుంతిభోజుడు అతిరథుడు. పాండవుల మేనమామ అతను. క్రోధంలో భీమసేనునకు సాటివస్తాడు. చిత్రయుద్ధంలో మంచి నిపుణుడు. అతని యోధులున్నూ చాలా పేరుపడ్డవారు. మేనల్లుళ్ల కోసం యెంత సాహసం అయినా చేస్తా డతను. భీమసేనుని కొడుకు ఘటోత్కచు డతిరథుడు. మాయావుల్లో మహామాయావి అతను. అతని యోధులున్నూ మిక్కిలీ సమర్థులు.

వీరు కాక, యింకా యెందరో రాజు లున్నారు పాండవ సేనలో. కృష్ణునివెంటబడి యెంతెంత లయినా చెయ్యగలవారు వారు. వారి నందరినీ నేనెదిరించిపోరతాను. లేదా, చచ్చిపోతాను. చక్రం చేతబట్టి కృష్ణుడూ, గాండీవం చేతబుచ్చుకుని అర్జునుడూ సంధ్యాకాలంలో సూర్యచంద్రు లన్నట్టు యుద్ధరంగానికి వస్తారు. వారితో గూడా రథాతిరథు లయిన రాజులూ యోధులూ కూడా యెందరో వస్తారు. వారి నందరినీ యెదిరించి నిలబడతా న్నేను.

ఇటూ అటూ వున్న రథులనూ, మహారథులనూ, అతిరథులనూ, అర్ధరథులనూ నీకు వివరించి చెప్పాను. అర్జునుణ్ణీ కృష్ణుణ్ణీ కూడా నేనెదిరిస్తాను; కాని యెదటబడి నన్ను చంపడానికే చూస్తున్నా శిఖండిని మాత్రం నేనేమీ చెయ్యను. మా తండ్రికి సంతోషం కలిగించడానికి చేతి కందిన రాజ్యం అంతా విడిచిపెట్టి నేను శాశ్వతబ్రహ్మచర్యం అవలంబించడం లోకం అంతా యెరుగును. తరవాత, కౌరవ రాజ్యానికి చిత్రాంగదుణ్ణి, రాజునీ, విచిత్రవీర్యుణ్ణి, యువరాజునీ చేశా న్నేను. దేవవ్రతు ణ్ణయి, స్త్రీనీ, మొదట స్త్రీ అయివుండి కొంత కాలానికి పురుషు డైనవాణ్ణీ సంహరించ ననీ, కొట్టనే కొట్ట ననీ నేను శపథం పట్టాను. శిఖండి కన్య అయిపుట్టి, తరవాత పురుషు డైనాడు. అంచేత వాడితో నేను యుద్ధం చెయ్యను. ఒక్క పాండుపుత్రులను తప్పించి, తక్కినవా రెవరు నాయెదట పడ్డా అందరినీ నిస్సంకోచంగా నేను సంహరిస్తాను"

# 173

## అం బ క థ 1

"తాతా, విల్లెత్తి చంపడానికే పూనుకున్నా శిఖండిని చంపనన్నావే, దాని క్కారణం యేమిటీ? సోమకులతో కలిపి పాంచాలుర నందరినీ చంపేస్తా నన్నావుగదా యిదివరలో" అనడిగాడు దుర్యోధనుడు.

"చెబుతా విన" మన్నాడు భీష్ముడు. "రాజు లందరూ యిక్కడే వున్నారు, వారూ వినవలసిందే" అంటూ ప్రారంభించా డతను.

"లోకప్రఖ్యాతివహించిన నాతండ్రి, చిరకాలం రాజ్యం ఏలి, సకల సుఖాలూ అనుభవించి స్వర్గస్థు డైనాడు. ఆకారణంవల్ల నాశపథం మరిచిపోకుండా నాతమ్ముడై న చిత్రాంగదునకు పట్టంకట్టాను. అతను కూడా దివంగతుడు కాగా నాతల్లి నత్యవతి సెలవుపొంది విచిత్రవీర్యునకు పట్టంకట్టాను. అయితే, వయసువా డయ్యిండినీ అతను సకలానికీ నాసహాయం కోరాడు. అతనికి పెళ్లి చెయ్యవలసిన భారం నామీద పడింది. సంప్రదాయసిద్ధ మైన కుటుంబంలో అతనికి తగిన కన్య యెక్కడ వుందా అని పరిశీలన ప్రారంభించాను, దాంతో.

సరిగా యీసమయాన, కాశీరాజుకి ముగ్గురు కూతుళ్లనీ, వారికి, అంబా, అంబికా, అంబాలికా అని పేళ్లనీ, ముగ్గురూ సాటిలేని అందగత్తె లనీ, వారినిమిత్తం తండ్రి స్వయంవరం చాటించా డనీ, రాజుల నందరినీ పిలిచా డనీ వార్త అందింది నాకు. అంబ పెద్దపిల్ల. అంబిక రెండోది. అంబాలిక కడసారం. వెంటనే రథం యెక్కి నేనొక్కణ్ణే బయలుదేరివెళ్లాను. అప్పటికి కాకన్యలు చక్కగా అలంకరించుకుని వున్నారు. రాజులున్నూ వచ్చివున్నారు చాలామంది, ఆకన్యలకోసం.

మరి, చూడ లేదు నేను. ఆకన్యలను ముగ్గురినీ బలవంతాన నారథం యెక్కించుకున్నాను. చేతనై తే యుద్ధానికి రండని రాజుల నందరినీ పదిమా ట్లయినా పిలిచాను. ఆకన్యలు ముగ్గురూ వీర్యశుల్క లని తెలిసింది నాకప్పటికి. "నేను శంతను మహారాజు కుమారుణ్ణి. నాపేరు భీష్ముడు. మీరంతా చూస్తున్నారు. నేనీ కన్యలను బలవంతాన తీసుకుపోతున్నాను. శక్తివుంటే వచ్చి వీరిని విడిపించుకోం" డని మళ్లీ మళ్లీ పిలిచాను గొంతెత్తి.

"యుద్ధం యుద్ధం" అంటూ రాజు లందరూ మొగిసిపడ్డారు. ఎవరి ఆయుధం వారు దూశారు. ఏనుగు లెక్కి కొందరూ, గుర్రా లెక్కి కొందరూ, రథా లెక్కి కొందరూ వచ్చి నన్ను ముట్టడించారు; కాని నేనెవరినీ లక్ష్యపెట్టలేదు. దేవేంద్రుడు దానవులను పారదోలేటట్టు, చావగొట్టి నేనా రాజుల నందరినీ పారదోలేశాను. వారి జెండాలు పడగొట్టాను ముందు. వారి సారథులనూ మావటీలనూ సంహరించాను. గుర్రాలనూ ఏనుగులనూ కూల్చేశాను. రథాలు విరగ్గొట్టాను. నాలాఘవం చూసి తెల్లపోయి, ఓడిపోయి, పారిపోయారు, చివరికి వా రందరూ.

వెంటనే ఆముగ్గురు కన్యలనూ తీసుకుని హస్తినాపురానికి వచ్చేశాన్నేను. జరిగిం దంతా మాఅమ్మకీ చెప్పాను.

## 174

### అంబకథ 2

"అమ్మా, ఈముగ్గురు కన్యలూ కాశిరాజు కూతుళ్లు. స్వయంవరం కోసం వచ్చిన రాజుల నందరినీ వోడించి, తమ్ముడికోసం తీసుకువచ్చాను వీరిని" అని చెప్పగా నాతల్లి చాలా సంతోషించింది. ప్రీతిగా శిరస్సు మూర్కొని "నాయనా, గొప్ప కార్యం సాధించా" వని నన్ను చాలా మెచ్చుకుంది కూడా.

వెంటనే పెళ్లిప్రయత్నాలు ప్రారంభించాము. అది గుర్తించి, ఆ కన్యల్లో అంబ అనే పెద్దామె "భీష్మా, సర్వశాస్త్రాలూ చదివిన ధర్మజ్ఞుడవు నువ్వు. ధర్మబంధుర మైన మాటొకటి చెబుతున్నా నువ్విది వినాలి. నేను సాల్వపతిని ప్రేమించివున్నాను. అతనూ నన్ను ప్రేమించాడు గాఢంగా. ఇది మాతండ్రికి తెలియదు. నువ్వు కేవలమూ పండితుడవు మాత్రమే కావు, కురువంశీయుడవున్నూ. ఒకణ్ణి ప్రేమించి

వుండి, ఆవొకడికి ప్రీతిపాత్రురాలునూ్నా అయివుండిన కన్యను, నీయింటో నిర్బంధించివుంచడం ధర్మమేనా నీకు? ఆలోచించి మరీ సాగించు పెళ్ళి ప్రయత్నాలు. సాల్వపతి నాకోసం యెదురుతెన్నులు చూస్తున్నాడు, ఆత్రంగా. కనక, నన్ను విడిచిపెట్టు. నాకు సెలవిచ్చెయ్యి, నామీద దయవుంచు" అని కోరింది నన్ను. "నువ్వు బ్రహ్మచారి వంటోంది లోకం మరి" అనిన్నీ అందామె.

# 175

## అంబకథ 3

"నాతల్లి సత్యవతితోనూ, మంత్రులతోనూ, ఋత్విక్కులతోనూ, పురోహితులతోనూ ఆలోచించాను. "నువ్వు వెళ్ళిపోవచ్చు" అని ఆమెకి సెలవున్నూ్నా యిచ్చేశాను. వృద్ధబ్రాహ్మణులనూ, వొక దాదినీ, కొందరు పరిచారికలనూ, భృత్యులనూ తోడిచ్చి పంపిన్నీ వేశానామెని.

సాల్వపతి దగ్గిరికి వెళ్ళిం దామె. "రాజా, నీకోసం వచ్చా న్నే" నని చెప్పింది. దానిమీద వికటంగా నవ్వా డతను. "నిన్నొకడెత్తుకుపోయాడు. అంచేత శుద్ధకన్యవు కావు నువ్వు. నిన్ను భార్యగా స్వీకరించలే న్నేను. కనక, మళ్ళీ భీష్ముడిదగ్గిరికే వెళ్ళిపో. బలవంతాన తీసుకుపోయాడు నిన్నతను. రాజుల నందరినీ జయించి మరీ తీసుకుపోయాడు. నువ్వునూ్నా ప్రీతితోనే వెళ్ళా వతనితో. అంచేత, నువ్వు నాకక్కరలేదు, నేను ధర్మాలు తెలిసినవాణ్ణి. ఒకరికి చెబుతున్నవాణ్ణి. దేశంలో ధర్మం నడిపిస్తున్నవాణ్ణి. మరి, యిలాంటి అధర్మానికి నేనొడిగట్టగలనా? కనక, యథేచ్ఛగా వెళ్ళిపో నువ్వు. ఇప్పటికే అలస్యం అయిపోయింది" అని నిక్కచ్చిగా చెప్పేశా డతను.

"కాదు కా" దంది అంబ. అతనికోసం తపించిపోతోంది, మరి. "రాజా, నువ్విలా చెప్పవద్దు. నువ్వనుకుంటున్నట్టకార్యం యేమీ

జరగలేదు. భీష్ముడు నన్ను బలవంతాన తీసుకుపోయాడు, నిజమే. నేను మాత్రం ప్రీతిగా వెళ్లలేదతనితో. నేనేడ్చాను. మొత్తుకున్నాను; కాని అడ్డంవచ్చిన రాజుల నందరినీ విదళించి కొట్టి నన్ను తీసుకుపోయాడతను. రాజా, నీమీదే లగ్నం అయివుంది నామనస్సు. నేనే పాపమూ యెరగను. నన్ను పెళ్లిచేసుకో. భక్తులను విడిచిపెట్టడం ధర్మం అనిపించుకోదు. నేను నాసంగతి అంతా చెప్పాను. నిన్ను గాఢంగా ప్రేమించివున్నానని చెప్పాను. భీష్ముడు నన్ను నీదగ్గిరికి పంపేశాడు. దయతో సెల విచ్చి యీసాయమున్నూ యిచ్చి పంపాడతను. అంచేతే, నిన్ను వెతుక్కుంటూ వచ్చాను. భీష్ముడు నన్ను కోరలేదు. తన తమ్ముడికోసమే ఇదంతా చేశాడతను. ఎందరో చెప్పారీసంగతి. నాసంగతి విన్నాక, భీష్ముడు, నాచెల్లెళ్లు అంబికనూ, అంబాలికనూ మాత్రమే తన తమ్ముడికి పెళ్లిచేశాడు. రాజా, నాతోడు, నిన్ను తప్ప నేనెవణ్ణీ పతిగా భావించుకో లేదు నేనెప్పుడూ. నామాట నమ్ము. ఒకడు తాకినదాన్ని కాను నేను. కాదంటే, నాప్రాణాలయినా విడిచిపెట్టేస్తాను నీకళ్లయెదట. వెతుక్కుంటూ వచ్చానిన్నన్ను. నీప్రేమ నమ్ముకుని వచ్చాను, నన్ను స్వీకరించు" అంటూ అనేక విధాల చెప్పింది. ప్రార్థించింది.

అయినా, అత నంగీకరించలేదు. తాచుపాము కూసం విడిచేపెట్టేసి వెళ్లిపోతుంది. అతనున్నూ ఆమె నలాగే విడిచిపెట్టేశాడు నిశ్చింతగా. అతని కామెయెడల లేశమూ శ్రద్ధ లేకపోయింది.

దీంతో, చాలా కోపం వచ్చిం దామెకి. కళ్లల్లో నీళ్లు నిండాయి. కంఠం గద్గదిక మయింది. "రాజా; నిర్దాక్షిణ్యంగా విడిచిపెట్టావు నన్ను నువ్వు. కనక నేను వెళ్లిపోతున్నాను. సత్యం యెంత నిశ్చయమో నన్ను రక్షించేవారు ఉండడమున్నూ అంతే నిశ్చయం యెక్కడో పోకక్కడ." అంటూ చాలా దీనంగా యేడ్చిం దామె; అయినా,

"షోషో" అనే అన్నాడతను. ఆమె నను(గహించలేదతను. "ఎంచేత నంటావా? నిన్ను బలవంతాన తీసుకువెళ్లినవాడు భీష్ముడు. భీష్ముడంటే నాకు భయం మరి" అని చెప్పేశాడతను. కొంచెమయినా దూరాలోచన లేకపోయిందతనికి.

చేసేది లేక ఏడుస్తూ బయలుదేరిందామె. ఆయేడుపులోనే ఆలోచన తట్టిందొకటామెకి. "నాకంటే దౌర్భాగ్యురాలు మరొకతె లేదు భూమ్మీద. నేనా, బంధువులను విడిచిపెట్టేశాను. ప్రియుడా, నన్ను నిరాకరించాడు. ఏమయినా, నేనిక హస్తినాపురం వెళ్లడం మాత్రం పనికిరాదు. సాల్వుణ్ణి మనసారా వరించానని చెప్పి, భీష్ముని సెలవుపొందే వచ్చేశాను మరి. నాతండ్రి, మూఢుడై నాకు స్వయంవరం చాటాడు. కనక, అక్కడికి వెళ్లడానికీ వీల్లేదు. ఇదంతా నా స్వయంకృతాపరాధం. యుద్ధం జరుగుతున్నప్పుడు భీష్ముని రథంనుంచి వురికేసి, ఆదారినే నేను సాల్వపతిదగ్గిరికి వెళ్లిపోయి వుండవలసింది. అప్పుడలా చెయ్యనందుకిప్పుడిదీ ఫలం. ఛీ, ఏమి భీష్ముడు! "వీర్యశుల్క" అని నాకు పేరుపెట్టి, వేశ్యనన్నట్టు స్వయంవరం అంటూ కల్పించాడు, నాతండ్రి మాత్రం ఏమంత తెలివయినవాడు? కాక, — మనిషి చేసుకున్నది, అనుభవించక తీరదు. కాని దీనికంతకూ మూలం మాత్రం భీష్ముడు. నిజంగా నాకింత అపకారమూ చేసినవాడు భీష్ముడు. తపస్సు చేసో, యుద్ధమే చేసో బదులుతీర్చుకోవాలి నేనతనికి; కాని, భీష్మునితో యుద్ధం చెయ్యడానికి సాహసించే రాజేడీ?" ఇలా చర్చించుకుని, ఆమె, పట్నం విడిచి వొక మున్యా(శమం చేరుకుంది. ఆరాత్రి అక్కడే గడిపిందామె, వారి రక్షణలో. తనకి వచ్చిన ఆపద సంగతి అంతా వారికి చెప్పుకుంది.

శైఖావత్యుడని వొక బ్రాహ్మణోత్తముడున్నాడక్కడ. మహాతపోధనుడతను. బ్రహ్మవేత్త. "అమ్మా, నీస్థితిగతులు తెలిశాయి;

కాని ఆశ్రమవాసులం నీకేమి చెయ్యగలుగుతామూ మేము? తపస్సు చేసుకోడం తప్ప మరేమీ చేతకాదుగదా మాకు?" అనడిగాడతను. "మహాత్మా, మీరనుకుంటున్నవీ, మీరు చెయ్యలేనివీ అక్కర్లేదు నాకు. నేను సన్యసిస్తాను. తపస్సు చేసుకుంటాను. పూర్వజన్మలో నేను చేసుకున్న పాపా లన్నీ యిప్పు డిలా పండాయి. కనక, మళ్లీ మావాళ్ల యింటికి వెళ్లా లని లేదు నాకు. పోపొమ్మన్న సాల్వపతిదగ్గిరికీ వెళ్ల లేను. తపస్సుకి సంబంధించిన క్రియాకలాపం అంతా నా కుపదేశిస్తే అదే చాలు నాకు. మీకూ దేవతలకూ భేదంలేదు. మీరిది అనుగ్రహిస్తే నా కింకేమీ అక్కర్లేదు." అని వేడుకుం దామె. మనస్సు కరిగిపోగా ముందామె నూరడించా డతను. తరవాత, అక్కడి బ్రాహ్మలతో ఆవిషయమై ఆలోచన ప్రారంభించాడు.

## 176

### అంబకథ 4

అందరూ కలిసి ఆలోచించా రాబ్రాహ్మలు. "ఈమెని తీసుకువెళ్లి తండ్రిదగ్గర విడిచిపెట్టడం వొక్కటే కర్తవ్యం" అన్నారు కొందరు. నన్ను నిందించారు కొందరు, చాలా తొందరపడ్డానని. "ఎలాగయినా వొప్పించి సాల్వపతి యీామెని స్వీకరించేటట్టు చెయ్యా" లన్నారు కొందరు. "అత నీమెని కచ్చితంగా తిరస్కరించాడుగదా!" అనడిగారు కొందరు. "అమ్మాయీ, ఈబ్రాహ్మలు నీకేమి సాయంచెయ్యగలరమ్మా" అనడిగా రామెనే కొందరు.

"చూడూ" అన్నారు తరవాత మళ్లీ. "సన్యాసంమాట మరిచిపో. దానివల్ల కొంచెమూ కూడా లాభంలేదు. కనక, నీతండ్రిదగ్గిరికే వెళ్లు. ఇక నీకోసం చెయ్యవలసిం దేమిటో అతనే చూస్తా డంతా. అక్కడ వుంటేనే సర్వవిధాలా నీకు క్షేమం. మరో గతి లేదు నీకు.

సరిగా వున్నంతకాలమూ ఆడదానికి భర్తే గతి. విషమిస్తేమాత్రం తండ్రి గతి." ఇది సనాతనధర్మం. ఆడదానికి సన్యాసం తగదు. విశేషించిపరమ సుకుమారురాలవు నువ్వు. నీకసలే క్షేమకరం కాదది. నువ్వు తపస్సు ప్రారంభిస్తే చాలా కష్టా లున్నాయి. రాజపుత్రివికావడంవల్ల ఆకష్టాలు మరీ యెక్కువ వుంటాయి నీకు. నీతండ్రిదగ్గిరవుంటే మాత్రం నీకేమీ యిబ్బంది లుండవు." అని చెప్పారు వారనేకవిధాల.

"అమ్మాయీ, నువ్వు జనశూన్యం అయిన యీకీకారణ్యంలో వుంటే, రాజపుత్రులు వచ్చి నిన్ను పెళ్లిచేసుకుంటా మంటూ కూచుంటారు. కనక, తపస్సు మాట మరిచిపో" అంటూ చాలా గట్టిగా చెప్పారు కొందరామెకి.

"ఊహూ" అనేసింది అంబ. "కాశీనగరం వెళ్లి నేను నాతండ్రి యింటికి చేరుకోడం జరిగే పని కా" దనేసిం దామె. "నేనక్కడికి వెడితే బంధువు లందరూ నాగుట్టు పీకేస్తారు. చిన్నతనాన వున్నా న్నాతండ్రి యింట నేను; కాని యిప్పు డక్కడ వుండాలేను, అస లక్కడికి వెళ్లాలేను. మీకు సేవచేసుకుంటూ, మీదయ సంపాదించుకుంటూ యిక్కడే వుండి నేను తపస్సు చేసుకుంటాను. నాకిప్పుడు సంభవించివున్న దుస్థితి, యెప్పుడూ యేలోకంలోనూ కూడా నాకు మళ్లీ సంభవించకూడదు. అందుకోసమే నేను తపస్సు చేసుకోడానికే నిశ్చయించుకోడం" అని దృఢంగా చెప్పిం దామె.

అంబా మహర్షులూ యిలా చర్చించుకుంటూ వుండగా, హోత్రవాహను డనే వొక రాజర్షి చక్కావచ్చా డక్కడికి. స్వాగతం చెప్పి, అర్ఘ్యమూ, పాద్యమూ, పధుపర్కమూ యిచ్చి ఆమహర్షు లతణ్ణెంతో గౌరవించారు. అతను విశ్రమించాక అంబసంగతే యెత్తుకున్నారు మళ్లీ వారు. ఇటు అంబసంగతీ, అటు కాశీరాజు సంగతీ వినేటప్పటికి కా రాజర్షి మనస్సు గుబగుబలాడిపోయింది.

వెంటనే అంబని తనతొడమీద కూచోపెట్టుకుని, ఓదార్చి, సంగతి అంతా చెప్ప మని అడిగాడు. జరిగిం దంతా చెప్పిం దామె. అది విని చాలా దుఃఖించా డా రాజర్షి. కొంతసేపటి కొకవిధంగా నిశ్చయించు కున్నాడు. ఆమె స్థితి తలుచుకుని వొణికిపోయా డతను. "అమ్మా, నువ్వు నీతండ్రిదగ్గిరికి వెళ్లవ" ద్దన్నాడు ముందు. "నీతల్లి నాకూతురు. నీదుఃఖం పోయే వుపాయం చూస్తాను, నాదగ్గిర వుండిపో. నువ్వు చాలా చిక్కిపోయినట్టు కనపడుతున్నావు. ఏమయినా, తపస్సుమాట మరిచిపో. నామాట విని నువ్వు పరశురాముని దగ్గిరికి వెళ్లు. అతను నీదుఃఖం అంతా పోగొడతాడు. నీమాట వినకపోతే భీష్ముణ్ణి నరికి పారేస్తాడు కూడా అతను. ప్రళయాగ్నికీ అతనికీ తేడా యేమీ లేదు. నీకతనే దారి చూపించగలవాడు" అని చెప్పాడు.

"సరే" అందామె, యేడుస్తూనే. మళ్లీ వొకమా టతనికి నమస్కారం చేసి "నువ్వు చెప్పినట్టే చేస్తాను. అతణ్ణెక్కడ కలుసుకోగలనో అది చెప్పు" అనడిగింది. "అరణ్యాలలో తపస్సు చేసుకుంటూ వుంటా డతను. మహేంద్రగిరిమీద వుంటాడు. మహర్షులూ, దేవతలూ, గంధర్వులూ అప్సరసలూ చాలామంది వుంటా రక్కడ, అదే నీకానవాలు. అక్కడికి వెళ్లి అతణ్ణి కలుసుకో. నమస్కారం చేసి నీ మనస్సులో వున్న దంతా అతనితో మనవిచేసుకో. నాపేరు చెబితే చాలు, పరశురాముడు నీకేమి కావా లంటే అదంతా చేస్తాడు. నాకతను ప్రాణస్నేహితుడు. నేనంటే చాలా యిష్టం అతనికి" అని వివరాలన్నీ చెప్పా డతను.

హోత్రవాహను డిలా చెబుతూనే వుండగా అకృతవ్రణుడని మరో మహర్షి వచ్చా డక్కడికి. పరశురాముని కూడాకూడా తిరుగుతూవుంటా డతను. మహర్షులూ, హోత్రవాహనుడూ కూడా స్వాగతం చెప్పా రతనికి. మహర్షులు అర్ఘ్యం యిచ్చారు. పాద్యం యిచ్చారు. మధుపర్క-

మున్నా యిచ్చారు. చివరికందరూ అతనిచుట్టూ కూచున్నారు. కొంచెంసేపు దివ్యమైన కథ లెన్నో చెప్పుకుని ఆనందించారు వారు.

తరవాత "పరశురాము డిప్పు డెక్కడ వున్నా డయ్యా?" అడిగాడు హోత్రవాహనుడు. "అతణ్ణి చూడ్డానికి వీలవుతుందా?" అని కూడా అడిగాడు. "నిన్నే తలుచుకుంటూవుంటా డతె నెప్పుడూ, చూడ్డానికి వీలవుతుందా అంటా వేమిటి?" అని యెదు రడిగా డకృత వ్రణుడు ముందు.

తరవాత "సృంజయుడైన హోత్రవాహనుడు నాకు ప్రాణస్నేహితు డని చెబుతూ వుంటా డతను. తెల్లవారితే అత నిక్కడికే వస్తా డని నావూహ. అయితే, రాజర్షీ ఈకన్య యెవరు? ఎందుకు వచ్చినట్టూ అడవుల్లోకి? ఎవరి పిల్ల? నీకేమవుతుంది" అడిగాడు రాముని సంగతి చెప్పి అతను.

హోత్రవాహనుడు జరిగిందంతా చెప్పా డతనికి. "అంచేత, తపస్సు చేసుకుందా మని వచ్చిం దిక్కడికి. తన వంశం చెప్తిం దీమె, దాంతో నేనీమెని గుర్తించాను. తన దుఃఖాని కంతకూ కారణం భీష్ముడే అని నిశ్చయించుకునివుం దీమె" అనిన్నీ చెప్పాడు. "అవు" నంది అంబ. "మాతాత సరిగా చెప్పాడు. నేను నాతండ్రి యింటికి వెళ్ల లేకుండావున్నాను. అటు, అవమానం జరుగుతుం దన్న భయమూ, ఇటు, వారి మొగం చూడ్డం యెలాగా అన్న సిగ్గూ కాల్చేస్తున్నాయి నన్ను. అంచేత పరశురాము డేమి చెయ్యమంటే అది చేద్దా మని స్థిర పరుచుకుని వున్నా" ననిన్నీ చెప్పిం దామె.

## 177

### అం బ క థ 5

"అయితే, అమ్మాయీ, ఈరెండు దుఃఖాలూ నీకొకరిమూలంగా కలిగా యంటా వమ్మా నువ్వు? ఎవరికి ప్రతిక్రియ చెయ్యా లని నీకసి?

సాల్వుణ్ణి మందలించమంటావా? అయితే, పరశురాముడు తప్పకుండా చేస్తాడది. భీష్ముణ్ణి శిక్షించాలని నీవుద్దేశమా? అదీ చేస్తాడా మహానుభావుడు. మీ తాతా నువ్వూ యేది కావాలంటే అదే చేస్తాడతను, అదేదో మాత్రం స్థిరపరుచుకుని వుండు నువ్వు" అన్నాడకృతవ్రణుడు.

"భీష్ముడు నన్ను తీసుకుపోయాడు నిజమే; కాని తెలియక చేశాడాపని. నేను సాల్వపతిని వరించివున్నా ననే సంగతి యెరగ డతను. ఏమయినా, ఇదంతా నువ్వే బాగా ఆలోచించి, శిక్షార్హు లెవరో నువ్వే నిర్ణయించు. భీష్ముడా దోషి, సాల్వపతా? లేక, ఇద్దరూనా? నువ్వే తేల్చాలిది. జరిగిం దేమో చెప్పాన్నేను. ఇక జరుగవలసింది నువ్వు చెప్పాలి" అంది అంబ.

ఇది విని అకృతవ్రణుడు చాలా సంతోషించాడు. "నువ్వు ధర్మంగా చెప్పావు. ఇక నేను చెబుతా విను. భీష్ముడు నిన్ను హాస్తినాపురం తీసుకునివెళ్ళి వుండకపోతే, పరశురాముని మాటమీద సాల్వపతి నిన్ను నెత్తిమీద పెట్టుకుని వుండును. భీష్ముడు నిన్ను బలవంతాన తీసుకుపోయాడు. అందుచేత సాల్వపతి నిన్ను నవమానిస్తున్నాడు. భీష్ముడకు, తాను, మహాబలపరాక్రమశాలి నని గర్వం. అందుచేత అతణ్ణి శిక్షించడానికే నువ్వు చూడాలి" అని నిర్ణయించా డతను.

"భీష్ముణ్ణి కొట్టాలనే వుంది మొదణ్ణుంచీ నాకున్నూ; కాని నిర్ణయించుకో లేకుండా వున్నాన్నేను. నాకీ దుఃఖం యెవరివల్ల కలిగిందో అది నువ్వే నిశ్చయించా లంది మళ్ళీ అంబ. ఆదినం అంతా వా రిలా చర్చించుకుంటూనే వుండిపోయారు. రాత్రి కూడా యీచర్చలోనే గడిచిపోయింది. తెల్లవారాటప్పటికి పరశురాముడు వచ్చా డక్కడికి. ఎందరో శిష్యులున్నూ వచ్చా రతనివెంట. అఖండ తేజస్సుతో వెలిగి

పోతున్నా డతను. జడలూ నారచీరలూ ధరించివున్నాడు. ఇటు ధనుస్సూ ఖడ్గమూ అటు గండ్రగొడ్డలీ వున్నాయి చేతుల్లో.

మహర్షులూ, హోత్రవాహనుడూ, అకృతవ్రణుడూ సకలమర్యాదలూ చేశా రతనికి. అంబా వారూ అతని చుట్టూ కూచున్నారు. పరశురాముడూ, హోత్రవాహనుడూ వెనకటి సంగతు లేవో చెప్పుకున్నారు కొంతసేపు. తరవాత, హోత్రవాహనుడు తన మనమరాలి సంగతి కదిపాడు మెల్లిగా. "ఈమె నామనమరాలు. కాశీరాజు కూతురు. అంటే నాకు కూతురి కూతురు. దీనిసంగతి వినాలి నువ్వు" అనాటప్పటికి అంబ వెళ్ళి పరశురాముని కాళ్ళు పట్టుకుంది. గోలుగోలునయేడ్చి "నువ్వే నాకు శరణ్యం" అంటూ అతని కాళ్ళదగ్గిర కూచుంది చివరికి.

"అమ్మాయీ, హోత్రవాహనుడు నీకు తాత అయితే నేనూ తాతనే, సందేహించకు. నీదుఃఖం యేమిటో చెప్పు. దాని కేం చెయ్యాలో అది చేస్తాన్నేను." అన్నాడు పరశురాముడు, ఆదరంగా; కాని ఆమె చక్కదనమూ, సౌకుమార్యమూ, శరీరలావణ్యమూ చూసి ఏమి చెబుతుం దీమె ?" అంటూ ఆలోచనలో పడ్డాడు. అలోచించాడు గాఢంగా. "సరే, చెప్పు" మన్నాడు చివరికి.

జరిగిం దంతా చెప్పిం దామె. సంగతంతా గ్రహించి వొక నిశ్చయమున్నూ చేసుకున్నాడు పరశురాముడు. "నిన్నిప్పుడు భీష్ముని దగ్గిరికి పంపుతాను. కురుశ్రేష్ఠు డతను. నామాట తప్పకుండా మన్నిస్తాడు. మన్నించకపోతే, అతణ్ణీ అతని మంత్రులనూ కూడా కాల్చేస్తాను. కాదంటావా, సాల్వపతికే చెబుతాను, నిన్ను స్వీకరించ మని. కనక, నీయిష్టం యేమిటో స్పష్టంగా చెప్పు" అన్నా డతను.

"నేను సాల్వపతిని ప్రేమించివున్నా నని చెప్పా టప్పటికి భీష్ముడు నన్ను విడిచిపెట్టేశాడు. సాల్వపతి దగ్గిరికి వెడితే నాశీలం అనుమానించి పోపొమ్మన్నా డతను. ఇదంతా బాగా ఆలోచించి కర్తవ్యం నువ్వే

నిశ్చయించాలి; కాని నాకు మాత్రం మొదణ్ణుంచీ భీష్ముడే దీనికి మూలం అని కసిగా వుంది. బలవంతాన నన్ను తీసుకుపోయా డతను మరి. అతను లుబ్ధుడు. నీచుడు. జితకాశి. అందుచేత అతణ్ణే నువ్వు శిక్షించాలి. అతను నన్ను తీసుకుపోయేటప్పుడే అనుకున్నా నేను "వీణ్ణి చంపెయ్యా" లని. ఇంద్రుడు వృత్రాసురుణ్ణి సంహరించాడు. మహాత్మా, నువ్వున్నా అలాగే భీష్ముణ్ణి సంహరించాలి" అని ప్రార్థించిందామె.

# 178

## అంబకథ 6

"భీష్ముణ్ణి చంపు. అదే నాక్కావలసింది, మరేమీ అక్కర్లేదు" ఇదొక్కటే మాట అంబ ఎంతసేపు మాట్లాడినా; కాని పరశురాము డందు కంగీకరించ లేకపోయాడు. "అమ్మాయీ, బ్రహ్మవేత్తలయిన బ్రాహ్మల కాపదలు వస్తేనే ఆయుధం పుచ్చుకుంటా నేను. కనక, యుద్ధం తప్పించి మరేం కావాలో చెప్పు" అన్నా డతను. "భీష్ముడూ, సాల్వుడూ కూడా నామాట వింటారు. కనక, నేనా పని చేస్తాను, దుఃఖించకు" అని కూడా అన్నా డతను. "బ్రహ్మవేత్త లాజ్ఞాపించాలి మరి, నేనాయుధం పట్టా లంటే" అని కచ్చితంగా చెప్పేశాడతను.

"మహాత్మా, నాదుఃఖం పోవడమే నాక్కావాలి. భీష్ముని మూలంగానే కలిగిం దది కనక, అతణ్ణే చంపితీరాలి వెంటనే నువ్వు" అని అంది అంబ. "అమ్మాయీ, భీష్ముడు నీకు వంద్యుడు. అయినా, నీ పాదాలు పట్టుకుంటా డతను. నేను పట్టిస్తాను సరా?" అన్నాడు పరశురాముడు మళ్లీ.

"అదేమీ పనికిరాదు. రాక్షసుడు గర్జించే ట్టు గర్జించా డావేళ భీష్ముడు యుద్ధంలో. కనక, జబ్బ చరిచి పిలిచి మరీ సంహరించాలి

వాణ్ణి నువ్వు. మాట యిచ్చావు నువ్వు. అది యథార్థం చేసుకో"
అంది అంబ, మళ్లీ మళ్లీ.

ఈ వాదాని కంతం లేకపోయింది. అప్పు డక్కడ వున్న మహర్షుల్లో ఒకడు "రామా, నీకు శరణాగతురా లీమె. నువ్వీమెని విడిచిపెట్టడం ధర్మం కాదు. నీపిలుపుమీద భీష్ముడు నీతో యుద్ధంచేసి వోడిపోయా నని వొప్పుకోవాలి. లేదా, నువ్వు చెప్పిన ట్టయినా చెయ్యాలి, మరో మార్గం లేదిప్పుడు. ఇలా అయితేనే నువ్వీమె కిచ్చినమాట చెల్లించు కున్నవాడ వనిపించుకుంటావు. నువ్వు సత్యనిరతుడ వనిన్నీ అనిపించు కుంటావు. "వాడు బ్రాహ్మడు కానీ, క్షత్రియుడు కానీ, వైశ్యుడు కానీ, శూద్రుడు కానీ, బ్రాహ్మలను ద్వేషించాడా, వాణ్ణి నరికేస్తా" నని వున్నావు నువ్విదివరలో వొకమాటు. క్షత్రియులనందరినీ వోడించి మరీ అన్నా విది బ్రాహ్మలతో. "నన్ను శరణు పొందినవారిని నాకంఠంలో ప్రాణా లున్నంతవరకూ నేను విడిచిపెట్ట" ననిన్నీ శపథం పట్టావు నువ్వు. "భూమ్మీద వున్న క్షత్రియుల నందరినీ జయించినవాణ్ణి కూడా నేను విడిచిపెట్ట" ననికూడా వ్రతం పట్టావు నువ్వు. భీష్ము డిప్పు డాపని చేశాడు. స్వయంవరానికి వచ్చిన రాజుల నందరినీ వోడించా డతను. ఈకారణం వల్ల నైనా నువ్వు భీష్మునితో యుద్ధం చెయ్యాలి, తప్పదు" అని గట్టిగా చెప్పాడు.

"ఔనౌను, జ్ఞాపకం వచ్చిం" దన్నాడు పరశురాముడు. "సామం గానే ప్రయత్నిస్తా నీవిషయమై నేను. ఈమె కోరిక నెరవేర్చడం బాధ్యత వుంది నాకు. కనక, ఈమెని వెంటబెట్టుకుని వెడతా న్నేను నామాట వినకపోతే, భీష్ముడు యుద్ధప్రియుడే కనక, అతణ్ణి సంహారిం చేస్తాను. నేనింతవరకూ ఎన్నో యుద్ధాలు చేసివున్నాను. ఎదటివాణ్ణి చంపకుండా నాబాణా లెప్పుడూ వూరికే పోలేదు. మీరందరూ బాగా

యెరుగుదు రిది” అని చెప్పి ప్రయాణం నిశ్చయించుకుని ఆరాత్రి కక్కడ వుండిపోయా డతను.

తెల్లవారింది. కాల్యాలూ జపహోమాదికాలూ నిర్వర్తించుకుని ఆబ్రాహ్మలను వెంటబెట్టుకుని నన్ను చంపడానికి బయలుదేరాడు పరశురాముడు. అంబను కూడా వెంటబెట్టుకునే బయలుదేరా డతను. కురుక్షేత్రంలో విడిదిచేశాడు వచ్చివచ్చి. సరస్వతీనదీతీరాన బసచేశారు వారు. మూడోనాడు వర్తమానంచేశాడు రాముడు “నేనిక్కడ ప్రవేశించివున్నాను. వచ్చి నాకోరిక తీర్చవలసిం” దని. అదివిని నేనున్నా ప్రీతితో వెళ్లి ఆ తేజోనిధి దర్శనంచేసుకున్నాను. బ్రాహ్మలూ, ఋత్విక్కులూ పురోహితులూ వెంటరాగా ఆవుని కూడా వెంటబెట్టుకువెళ్లే అతని దర్శనంచేసుకున్నా న్నేను. అతనున్నా ప్రీతితోనే నాపూజ లంగీకరించాడు.

“భీష్మా, కాశిరాజు కూతురు ఈఅంబని నువ్వెప్పుడో ఏ వుద్దేశంతో తీసుకువచ్చావూ? మళ్లీ యెందుచేత విడిచిపెట్టేశావూ? చాలా మంచిపిల్ల యీయామె; కాని నీమూలంగా ధర్మభ్రష్టురా లయిపోయింది. నీవల్ల అలాంటి పరాభవం పొందింది గదా, మరి యీయామను నెవడు స్వీకరిస్తాడూ యిప్పుడు? బలాత్కారంగా నువ్వు తీసుకుపోయా వన్న కారణం చెప్పి సాల్వపతి పొమ్మన్నా డీమెని. కనక, నేను చెబుతున్నాను నువ్వు స్వీకరించు. ఈవిధంగా అయితేనే యీరాజపుత్రి తనధర్మం నిర్వర్తించుకో గలదు. స్వయంగా రాజవు నువ్వు. ఒక రాజపుత్రికను నువ్వో అవమానించడం చాలా గర్హించవలసిన పని” అని మందలించాడు నన్నతను.

అప్పు డతను చాలా వుద్రిక్తు డయివుండడం గుర్తించా న్నేను. అయినా, నే నామాట అంగీకరించలేకపోయాను. “మహాత్మా, నాతమ్ముని కోసం ఏవిధంగానూ కూడా ఈమెని మళ్లీ స్వీకరించలే న్నేను. “నేను సాల్వపతిదాన్ని” అని యీయామె అప్పుడే చెప్పింది

నాకు ఖండితంగా. అంచేతనే నేనీమెని పంపేశాను. భయంవల్లా, అనుతాపంవల్లా, ధనలోభంవల్లా, కామంవల్లా కూడా నేనెప్పుడూ క్షత్రియధర్మం తప్పను. నాశపథం యిది" అని వినయంగా చెప్పా న్నేను. "నేను చెబుతున్నాను, వినవలసిందే నువ్వు. లేకపోతే, నిన్నూ నీమంత్రులనూ కూడా నాశనంచేసేస్తా న్నే" నంటూ మళ్లీమళ్లీ రంకె వేసి చెప్పా డతను. నేననేకవిధాల స్తుతించా నతణ్ణి. అనేకవిధాల ప్రార్థించాను. మళ్లీమళ్లీ శిరస్సు వంచి నమస్కరించాను. "మహాత్మా, యుద్ధానికి రమ్మని మళ్లీమళ్లీ నన్ను నిర్బంధించడం నీకు ధర్మమా? కుర్రవాణ్ణయి వుండినప్పుడు నాలుగువిధా లయిన అస్త్రవిద్యా నువ్వే అనుగ్రహించావు నాకు. నేను నీశిష్యుణ్ణి" అని విన్నవించుకున్నాను. అయినా, శాంతించలే దతను. "భీష్మా, నువ్వు నాశిష్యు ణ్ణంటున్నావు. కాని నేను పరిగ్రహించమంటే యీఅంబని వల్లకా దంటున్నావు. పరిగ్రహించకపోతే నీకు శాంతి వుండదు. నామాట విను. ఈమెని స్వీకరించు. నీవంశం రక్షించుకో. నీమూలాన భర్త లభించని దుర్యోగం వచ్చిందీమెకి" అని చాలా గట్టిగా చెప్పాడు మళ్లీ అతను.

"బ్రహ్మర్షీ, నువ్వెందు కింత శ్రమపడతావూ?" అనడిగా న్నేను. "ఇది మళ్లీ జరిగే పని కాదు" అని స్పష్టంగా చెప్పాను. "భగవన్, నువ్వునాకు గురుదేవుడవు. అంచేత యింతగా ప్రార్థిస్తున్నా న్నేను. నేనొకమాటీమెని విడిచిపెట్టేశాను. మరొకణ్ణి ప్రేమించివున్న ఆడదాన్ని ఎవడు స్వీకరించగలడూ? అది పామున్న యింటో నివసించడం కాదూ? స్త్రీల దోషాలు నీకు తెలియని వేమున్నాయీ? ఇంద్రుడే రానీ, భయపడి నేను ధర్మం విడిచిపెట్టను. నాయెడల దయవుంచు. లేదూ, నీ యిష్టంవచ్చినట్టు చేసుకో. వెనకటి కొక శ్లోకం చెప్పాడు మరుత్తు. "గర్వించి చెడుమార్గం తొక్కి చెయ్యతగిందేదో, చెయ్యరానిదేదో గుర్తించలేకపోతే వాడు గురు వయినాసరే, విడిచిపెట్టెయ్యవలసిందే"

అని దాని అర్థం. నువ్వు నాకు గురుదేవుడ వన్న భక్తితో యింతగా గౌరవిస్తున్నా న్నేను; కాని గురువుదగ్గిర వుండవలసిన యోగ్యత లేదు నీదగ్గిర. కనక, తప్పదంటావా, రా, యుద్ధమే చేస్తా న్నీతో. నేను గురువుని సంహరించను. బ్రాహ్మణుడైన గురువును, విశేషించి తపోవృద్ధుడున్నూ అయిన గురువుని ఎప్పుడూ సంహరించను. ఈకారణం వల్లనే నిన్నింతవరకూ క్షమించాను. క్షత్రబంధువు లాగ కత్తియెత్తి వెనకంజ లేకుండా నరకడానికి మీదికి వచ్చే బ్రాహ్మణ్ణి చంపితే బ్రహ్మ హత్యాదోషం లేదని చెబుతున్నాయి ధర్మశాస్త్రాలు. నేను క్షత్రియుణ్ణి. క్షత్రియధర్మమే అవలంబించివున్నాను. ఎవ డేధర్మం అనుసరించి ప్రవర్తిస్తే, వాణ్ణి, ఆధర్మం అనుసరించే నడిపిస్తా న్నేను. అలాచేస్తే ధర్మ హాని లేదు. శ్రేయస్సున్నూ చెడదు. అర్థమూ, ధర్మమూ అన్న సంశయం కలిగినప్పుడు ధర్మమే అనుసరించాలి, అర్థం కాదు. నువ్విది గుర్తించడం లేదు; కనక, నీతో యుద్ధమే చేస్తా న్నేను. నాబాహు బలమూ, నాపరాక్రమమూ నువ్వే చూస్తావు. కనక, కురుక్షేత్రంలో యుద్ధంచేద్దాం రా. ద్వంద్వయుద్ధానికే సిద్ధంగా వున్నా న్నేను. నువ్వున్నూ సిద్ధంగా వుండు. అప్పుడు నువ్వు నాచేతిలో చనిపోతావా, నువ్వు సంపాదించుకుని వున్న ఉత్తమలోకా లుండనే వున్నాయి నీకు. వెనకటికి శత్రువులను సంహరించి నువ్వెక్కడ పితృతర్పణం చేశావో అక్కడే నేనున్నూ నిన్ను సంహరించి నాపితృదేవతలను తృప్తిపరుస్తాను. నీగర్వం అంతా అక్కడ వొదిలిస్తాను. "నేను క్షత్రియుల నెందరినో మెన్నోమాట్లు చంపేశా నని" డాబులుకొడుతున్నావు నువ్వు; కాని అప్పుడు భీష్ముడు పుట్టలేదు మరి. నావంటివాడు మరొకడయినా పుట్టి వుండలేదు మరి. నువ్వప్పుడు కాల్చేశావే గడ్డిపరకలు, వాటిలోనే మహాతేజస్సులు పుట్టుకువచ్చా యిప్పుడు. నీదర్పం అణగ్గొట్టడానికే

పుట్టా న్నేను. మరి, సిద్ధంగా వుండు” అని చెప్పేశా న్నేను, నిర్మొగ మాటంగా.

దీనిమీాద వెడనవ్వు నవ్వాడు రాముడు. “భీష్మా, అదృష్టంవల్ల నాతో యుద్ధంచెయ్యడానికి చూస్తున్నావు నువ్వు. కురుక్షేత్రానికి వెడుతున్నా న్నేను. నువ్వు చెప్పినట్టే చేస్తా నక్కడికి రా. నాచేతిలో చచ్చిపోయి కాకులూ గద్దలూ ముసురుకుని వున్న నిన్ను నీతల్లి గంగాదేవి చూడాలి. నాచేతిలో నువ్వు చచ్చిపోడంచూసి సిద్ధచారణ సేవితురా లైన నీతల్లి గోలపెట్టాలి. నిజాని కలాంటి బాధపడవలసింది కా దామె; కాని యుద్ధం అంటే యెగిసిపడే మూర్ఖుణ్ణి నిన్ను కన్నందు కామె కది తప్పదు. ఇప్పటికి వెళ్లిపో. సకలసన్నాహాలూ చేసుకురా” అన్నా డతను.. “అలాగే కానియ్య” మన్నా న్నేను. అంటూనే శిరసా నమస్కరించి వచ్చేశా న్నేను. అతను వెళ్లిపోయాడు.

వచ్చి జరిగిం దంతా మా అమ్మకి చెప్పాను. నన్ను అభినందించి ఆశీర్వదించిం దామె. బ్రాహ్మలు పుణ్యాహవాచనం చేశారు. చక్కగా అలంకరించి, సారథి, నావెండిరథం తీసుకువచ్చాడు. మంచివీరు డతను. కులీనుడు. అశ్వశాస్త్రం క్షుణ్ణంగా తెలిసినవాడు. చాలా అనుభవముున్నా వున్నవాడు. సారథు లందరిలోనూ మిక్కిలి శిష్టున్నూ. రథం కూడా చాలా గొప్పది. వెల్లగుర్రాలు పూన్చారు దానికి. మంచి ఆసనం యేర్పాటుచేసి పులితోలు కప్పారు దానిమీాద. శస్త్రాలున్నూ వుంచారు దానిమీాద. నేను తెల్లని కవచం తొడుక్కున్నాను. తెల్లని ధనుస్సు చేతబట్టాను. వెల్లగొడుగు వేశారు నాకు. తెల్లని వింజామరలతో వీచారు. తెల్లని బట్టలు కట్టుకుని, తెల్లని ఆభరణాలు ధరించి, తెల్లని పాగా చుట్టుకున్నాను. సూతులూ వందులూ మాగధులూ స్తుతిచేస్తూ వెంటరాగా కురుక్షేత్రం చేరుకున్నాను. సారథి అచలించగా గుర్రాలు వాయువేగమనోవేగాలమీాద చేరుకున్నా యక్కడికి.

అప్పటికి రాముడు సిద్ధంగా వున్నా డక్కడ. ఇద్దరమూ కలుసుకున్నాం. అంతకి ముందే నేను శంఖం పూరించాను. బ్రాహ్మలూ మునులూ అడవుల్లోనుంచి మహర్షులూ దేవతలూ మూగా రక్కడ, యుద్ధం చూడ్డానికి. దేవతలు పూలవాన కురిశా రాకాశాన. దేవదుందుభినిర్ఘోషాలున్నూ వినవచ్చాయి. రాముని అనుచరు లైన మునులున్నూ యుద్ధరంగం చుట్టూ బారులుతీరి నుంచున్నారు.

నన్ను కన్నతల్లి గంగాదేవి వచ్చిం దప్పు డక్కడికి. "నీకిదేం పని నాయనా?" అనడిగింది నన్ను. "నేను వెళ్లి రాముణ్ణి ప్రార్థిస్తాను. భీష్ముడు నీకు శిష్యుడు. అతనితో యుద్ధంచెయ్యవద్దని వేడుకుంటాను. నాయనా, ఆబ్రాహ్మడితో తగువుపెట్టుకోకు నువ్వు. క్షత్రియుల నందరినీ నాశనంచేసినవా డతను. బలపరాక్రమాల్లో మహేశ్వరునకు సాటి అయినవాడు. నీకంతా తెలుసు. అతనితో యుద్ధానికెందుకు సిద్ధపడతావూ?" అనడిగింది నన్ను.

"అమ్మా, నీకు నమస్కారం" అన్నా న్నేను. అంబ స్వయంవరం మొదలు ఆక్షణందాకా జరిగిం దంతా చెప్పా నామెకి. వెంటనే నాతల్లి రామునిదగ్గిరికి వెళ్లి "నాకొడుకుని క్షమించ" మని కోరింది. "భీష్ముడు నీశిష్యుడు. అతనితో యుద్ధంచెయ్యవ" ద్దని వేడుకుంది. "నీకొడుకుని వెనక్కి తప్పుకోమను" అన్నా డతను. నాతల్లి మళ్లీ వచ్చింది నాదగ్గిరికి; కాని ఆమె మాట వినిపించుకోలేదు నేను. అప్పటికప్పుడే నాకు బాగా క్రోధం పెరిగిపోయివుంది. ఇంతలో రాముడు నాయెదటికి వచ్చి "రా, ర" మ్మన్నాడు యుద్ధానికి.

## 179

## అంబకథ 7

"మహానుభావా, నేను రథంమీద వున్నాను. భూమ్మీదే వున్న నీతో యుద్ధం చెయ్యడానికి సంకోచిస్తున్నాను. కనక, నువ్వున్నూ రథం

యెక్కరా. కవచమున్నూ తొడుక్కో" అని కోరా న్నేను; కాని "అక్కర్లే" దన్నాడు రాముడు. "భూమే నాకు రథం. వేదాలే గుర్రాలు. వాయువే నాకు సారథి. సావిత్రీ గాయత్రీ సరస్వతులే నాకు కవచం" అని చెబుతూనే శరవర్షంతో ముంచెత్తేశాడు నన్నతను.

చూస్తునుగదా, రథంమీదే వున్నాడు రాముడు. సకలాయుధాలూ వున్నాయి రథం నిండా. ఒక నగరం అంత వుందది. దేవలోకానికి సంబంధించిన గుర్రాలు లాగుతున్నా యవి. బంగారంతో చేశారది. కవచమున్నూ తొడుక్కుని వున్నా డతను. సూర్యచంద్రచిత్రాలతో చాలా ప్రకాశమానంగా వుందది. అకృతవ్రణుడు సారథ్యం చేస్తున్నాడు. "రా, రా" అంటూ మళ్లీ మళ్లీ పిలుస్తూ మీదిమీదికి వచ్చేశా డతను.

అసలే క్షత్రియులను నాశనం చెయ్యడానికి కంకణం కట్టుకునివున్నవా డతను. పైగా ఆసమయాన ప్రచండసూర్యు డున్నట్టున్నాడు. అయితే, అటు, అతనూ వొక్కడే, ఇటు, నేనూ వొక్కణ్ణే. ఇద్దరమూ యెదురుకున్నాం వొకర్నొకరం; కాని అతని రథం మూడు ధనుస్సుల దూరాన వుందనగా నారథం ఆపించి, దిగి, పాదచారి నయి అతని దగ్గిరికి వెళ్లా న్నేను. యథావిధిగా పూజించాను. "మహాత్మా, నువ్వు నాకు సమానుడివో అధికుడవో అదక్కర్లేదు నాకు. గురుదేవుడవు నువ్వు. ధర్మశీలుడవున్నూ. కనక, నాకు జయం కలిగేటట్టు దీవించి పంపు" అంటూ ప్రార్థించాను వినయంగా.

పరమానందభరితు డైనాడు రాము డందుకు. "భీష్మా, తన కభ్యుదయం కోరుకునేవాడు చెయ్యవలసిన పని యిది. పెద్దలతో యుద్ధం తప్పనప్పు డిలా చెయ్యడం సనాతనధర్మం. నువ్విలా వచ్చి నన్ను గౌరవించివుండకపోతే నిన్ను శపించి వుందు న్నేను. ధైర్యం చిక్కబట్టుకుని యుద్ధంచెయ్యి. నిన్ను జయించడానికి పూనుకున్నా న్నేను. కనక, నీకు

జయం కలగా లని దీవించను. నీసడవడితో నేను ప్రీతు ణ్ణాయినాను. వెళ్లు. ధర్మంగా యుద్ధంచెయ్యి” అని సెలవిచ్చాడు.

మళ్లీ అతనికి నమస్కరించి వచ్చి నారథం యెక్కి బంగారు పనిచేసిన నాశంఖం వొత్తాను. ఒకరి నొకరు గెలుచుకోవా లని తరవాత చాలా దినాలు యుద్ధంచేశాం మేము. రెండువందల యాభై బాణాలతో అతనే నన్ను కొట్టాడు ముందు. నాగుర్రాలు నాలుగూ, నాసారథీ, నేనూ కూడా కప్పడిపోయాం ఆబాణాలతో. వెంటనే నేను దేవతలకూ బ్రాహ్మలకూ నమస్కరించాను. “గురుదేవా” అంటూ రాముణ్ణి పిలిచి “నువ్వు హద్దుమీరి నడుచుకుంటున్నావు. అయినా, నువ్వు నా కాచార్యుడవు కనక నిన్ను పూజిస్తున్నాను. నాధర్మదృష్టి గుర్తించాలి నువ్వు. నీలో వేదాలున్నాయి. గొప్ప బ్రాహ్మణ్యమున్నూ వుంది నీదగ్గిర. గొప్ప తపస్సున్నూ చేశావు నువ్వు; కాని నేను, ఆవేదాలూ ఆబ్రాహ్మణ్యమూ ఆతపస్సూ కూడా కొట్టను. నువ్వు క్షత్రియధర్మం అవలంబించివున్నావు. శస్త్రాలు చేపడితే బ్రాహ్మడు క్షత్రియుడే అయిపోతాడు. కనక, ఇప్పుడు నాధనుశ్శక్తి చూసుకో. నాబాహుబలమున్నూ చూసుకో. ఇదిగో, నీధనుస్సు విరగ్గొట్టేస్తున్నాను.” అంటూనే వొక్కబాణం వేసి చెప్పినట్టు చేసి చూపించాను. వందలకొద్దీ బాణాలతో అతని రథం కప్పేశాను. దాంతో అతని శరీరాన రక్తం ధారలుకట్టింది. ధాతువులు వెలిగక్కే మేరుపర్వతంలాగా, వసంతంలో ఎర్రని పూగుత్తులతో నిండివున్న అశోకవృక్షంలాగా విరగబూసివున్న మోదుగుచెట్టులాగా అయిపోయాడు.

అయినా, మరో ధను స్సందుకుని ఎన్నో బాణాలతో కొట్టాడు నన్నతను. కోడెతాచుల్లాగా, అగ్నికీలల్లాగా, విషంలాగా చాలా క్రూరంగా వున్నా యవి. మర్మాలు నాటుకుని చాలా బాధపెట్టాయి నన్నవి. అయినా, నేనున్నూ కొట్టా నతణ్ణి వందలకొద్దీబాణాలతో.

ఆదెబ్బల కతను మూర్ఛిల్లినట్టు పడిపోయాడు. అది చూసి చాలా ఖేద పడ్డా న్నేను. "ఛీ, నాబతు కెందు కిక ?" అని నన్ను నేనే నిందించు కున్నాను. క్షత్రియధర్మమున్నూ నిరసించాను. "గురుదేవుడు — బ్రాహ్మణోత్తముడు — ధర్మాత్ముడు — అలాంటివాణ్ణి నేనిలా పీడించా" నని చాలా నొచ్చుకున్నాను. అప్పటికి అతనిమీద మరి బాణం వెయ్యలేదు నేను. ఇంతలో సూర్యాస్తమయమున్నూ అయింది. నాటికి యుద్ధం మానేశాం.

## 180

### అంబకథ 8

నాసారథి మిక్కిలీ నేర్పరి కనక, నాకూ తనకూ గుర్రాలకూ నాటుకున్న బాణా లన్నీ తీసేశాడు. గుర్రాలను కడిగి, మేతపెట్టి, నీళ్లున్నూ తాగించాడు. దాంతో బాగా తేరుకున్నా యవి. మళ్లీ సూర్యోదయం అయింది. యుద్ధమున్నూ మళ్లీ ప్రారంభించాం మేము.

ముందు, ధనుస్సొకచోట పెట్టి, రథందిగి వెళ్లి నమస్కారంచేసి మళ్లీ రథంయెక్కి నిశ్చలంగా యుద్ధం ప్రారంభించా న్నేను. అతనిమీద నేనూ, నామీద అతనూ వేసుకున్న బాణాలకు లెక్కలేదు. చాలా కోపం వచ్చిం దతనికి. తీక్ష్ణా లైన శస్త్రాలు ప్రయోగించాడు నామీద. వందలూ వేలూ బాణాలు గుప్పించి నేనవన్నీ అంతరిక్షంలోనే ముక్కలుచేశాను. మళ్లీ గొప్పశస్త్రాలు వేశా డతను. అతని కంటె యెక్కువ నేర్పు చూపించా లని అవిన్నీ ముక్కలుచేశా న్నేను. దాంతో గొప్పకలకలం పుట్టింది ఆకాశాన.

అప్పుడు నే నతనిమీద వాయవ్యాస్త్రం ప్రయోగించాను. గుహ్యకాస్త్రం వేసి అతనది పడగొట్టాడు. నేనాగ్నేయాస్త్రం వేశాను. వారుణాస్త్రం వేసి అది చల్లబరిచా డతను. తరవాత, రాముడు, నాకు

సవ్యంగా తిరిగివచ్చి నాగుండెలు పగలగొట్టాడు. దాంతో, రథంమీదే మూర్ఛపడిపోయాన్నేను. వెంటనే నారథం పక్కకి తీసుకువెళ్ళాడు నాసారథి. చైతన్యం లేకుండా నేనలా పక్కకి వెళ్ళిపోడం చూసి రాముని అనుచరులు ఆనందధ్వానాలు చేశారు. ఆ చేసినవారిలో అకృతవ్రణుడూ, అంబా కూడా వున్నారు.

కొంతసేపటికి తెలివివచ్చింది నాకు. "పద, రామునియెదటకే నడిపించు రథం, నాకేమీ బాధలే" దన్నాను నేను, తొందరపెడుతూ. సారథి వెంటనే అలా చేశాడు. ఇద్దరమూ బాణాలు గుప్పుకున్నాం. ఒక్కొక్కటి మూడేసి బాణాలతో నాబాణా లన్నీ ముక్కలుచేసి పడగొట్టాడు రాముడు. అభిమానం ముంచుకువచ్చింది నాకు. యమునితో సాటివచ్చే బాణంవేసి కొట్టాన్నేనతణ్ణి. దాంతో తెలివితప్పి అతనున్నూ కిందపడిపోయాడు. అది చూసి అక్కడ వుండినవా రందరూ సూర్యబింబం కిందపడిపోయిం దన్నంత ఆత్రపడిపోయారు. ఆమునులూ అంబా కూడా వెంటనే అతనిదగ్గిర కూలబడి నీళ్లలోముంచిన చేతులతో అతని మొగం నిమిరి, జయధ్వానాలున్నూ చేసి అతణ్ణి మేలుకొలిపారు.

కోడెతాచులా లేచా డతను. "భీష్మా, నిలునిలు" అంటూనే బాణం తొడిగి, లాగి, విడిచాడు నాగుండెలమీద. నాకళ్లు తిరిగిపోయాయి. మొదలు నరికిన చెట్టులాగ రథాన పడిపోయాను కూడా. అది చూసి రాముడు నాగుర్రాలను కూల్చేశాడు. మళ్లీ బాణాలతో ముంచిన్నీ వేశాడు నన్ను. తెలివి వచ్చింది. నేనూ వేశా సంతకంటే యెక్కువబాణా లతనిమీద. మాబాణాలతో ఆకాశం నిండిపోయింది. సూర్యబింబం మరుగుపడిపోయింది దాంతో. ఇంతలో పెద్దగాలి వీచింది. ఆవాయుఘట్టనకూ సూర్యకిరణాల తీక్ష్ణతకూ అగ్గిపుట్టింది. విజృంభించింది. దాంతో ఆబాణాలన్నీ భస్మం అయిపోయాయి.

రాముడు, నామీద, వేలు – లక్షలు బాణాలు గుప్పించాడు. అవన్నీ పడగొట్టేశా న్నేను. ఇంతలో సూర్యు డ_స్తమించాడు. చీకట్లు తరుముకువచ్చాయి. మేము యుద్ధం ఆపుచేశాం.

# 181

## అం బ క థ 9

మర్నాడు మళ్లీ యుద్ధం ప్రారంభించాం. దినదినమూ అత నెన్నో ఘోరాస్త్రాలు ప్రయోగించాడు. అన్నీ ముక్కలు చేశా న్నేను. అంమకు చాలా కోపం వచ్చిం దతనికి. ప్రాణాలమీద ఆశవదులుకున్నాడు. వెంటనే పెద్దశక్తి వొకటి ప్రయోగించాడు నామీద. ప్రళయకాలంలో మృత్యుదేవతలా వుందది. ఉల్కలాగ భగభగ మండిపోతోంది. లోకం అంతా దాని తేజస్సుతో ధగద్ధగితం అయిపోయింది. మీదికి వచ్చేస్తోంది. నేనున్నూ ప్రాణాలమీద ఆశవొదులుకున్నాను. లాగి మూడు బాణాలు వేశాను. దాంతో ముక్కలూ చెక్కలూ అయి కిందపడిపోయిం దది.

మరీ కోపం వచ్చిం దతనికి. వెంటనే పన్నెండు శక్తులు ప్రయోగించా డొక్కమాటు నామీద. వాటి తేజస్సు భరించరానిదిగా వుంది. అతిలాఘవంగా మీదికి వచ్చేస్తున్నాయి. తెల్లపోయాను మొదట వాటి వుద్ధృతంచూసి; కాని దిటవుతెచ్చుకున్నా నంతలో. తీక్ష్ణబాణాలు వేసి ఆపన్నెండు శక్తులనూ అటూ యిటూ చెదరకొట్టేశాను మొదట. తరవాత పన్నెండుబాణాలతో తుక్కుతుక్కుచేసి కింద కూలగొట్టాను వాటిని.

హేమదండం ప్రయోగించా డత సది చూసి; కాని నేనది చర్మం (డాలు) తో ఆపుచేసి ఖడ్గంతో నరికేశాను. అతని గుర్రాలున్నూ కప్పెట్టేశాను, బాణంమీద బాణంవేసి. కార్తవీర్యార్జునుణ్ణి సంహరిం

చినవా డతను. సామాన్యుడు కాడు మరి. వెంటనే మళ్లీ మండిపడ్డా డతను. బాణంమీద బాణం విడిచాడు, తెరిపిలేకుండా. మిడతలదం డులా వచ్చిపడ్డా యవి. నేనూ, నాసారథీ, నాగుర్రాలూ ముంచేశాయవి. రథం విరిగిన్నీ పోయింది. కిందకురికి అంతకంటే యెక్కువ బాణాలు వేశా న్నేను. అతని శరీరం అంతా గాయాలయిపోయింది. రక్తధారలు కాలవలు కట్టాయి. నన్నూ అత నలాగే కొట్టాడు తిరగబడి, అలా అయిపోయినాకూడా. ఇంతలో మళ్లీ పొద్దుగూకింది. యుద్ధం ఆపుచేశాం.

# 182

## అ ం బ క థ 10

తెల్లవారింది. మళ్లీ యుద్ధం ప్రారంభించాం మేము. పర్వతంమీద దబాటువాన కురుస్తుంది చూడూ, అలా కురిసిపోయా యతని బాణాలు నామీద. అందుకు తాళలేక కిందికురికి పారిపోయాడు నాసారథి. అందుకు చాలా విచారించా న్నేను. ఇంతలో పారిపోతున్న వాడల్లా మూర్ఛవచ్చి కిందపడిపోయాడు నాసారథి. తేరిచూడగా ప్రాణాలే విడిచిపెట్టేశాడు. నాకు మహాభయం పట్టుకుంది. అంతటితో పూరుకోలేదు రాముడు. లాగిలాగి కొట్టాడు నన్ను కూడా. వాటిలో వొక బాణం నాగుండెలు దూసుకుపోయి కిందపడిపోయింది. నేనూ పడిపోయాను.

నేను చచ్చిపోయా ననుకున్నాడు రాముడు. వికటాట్టహాసం చేస్తూ పరవళ్లు తొక్కా డత నావూహాతో; అతని అనుచరులున్నూ చాలా కిలకిల్లాడారు. నాపక్షంగా వచ్చివున్న కౌరవు లందరూ నాస్థితిచూసి కొయ్యాయిపోయారు. అలా పడివుండగానే యెనమండుగురు బ్రాహ్మ ణోత్తములు వచ్చి, కనపడ్డారు నాకు. అగ్నిహోత్రు ల్లాగా, సూర్య భగవానుల్లాగా వెలిగిపోతున్నారు వారు. నాచుట్టూ మూగారు.

తమచేతుల్లోకి తీసుకున్నారు నన్ను. అప్పుడు నేనూ వారూ కూడా భూమి తాకకుండా అంతరిక్షాన వున్నాం. నాకు చాలా ఆయాసంగా వుందప్పటికి; కాని వారు నా మొగాన నీళ్లు చల్లి "భయపడకు. నీకు క్షేమం గలుగుతుంది" అని చెప్పారు. వారి ననేకవిధాల స్తుతించా న్నేను. నాకప్పటికి జవసత్వాలు వచ్చాయి. వెంటనే నుంచున్నాను. చూడగా, నాతల్లి గంగాదేవి నారథంమీద నుంచునివుంది. పగ్గాలు పట్టుకుని గుర్రా లాపుచేసిన్నీ వుందామె. ఆమె పాదాలకూ నాపితృ దేవతలకూ మొక్కి నేను రథం యెక్కాను. అనేకవిధాల నన్ను రక్షించివుందామె. ఒక్క నమస్కారంచేసి ఆమెని పంపేసి, గుర్రాలు నేనే నడుపుకుంటూ మళ్లీ యుద్ధంసాగించాను.

చూసిచూసి నే నోబాణం విడిచాను. చాలా దృఢమైన బాణం అది. చాలావేగం గలది. గుండెలు బద్దలుకొట్టగలదిన్ని. ఆబాణం దెబ్బ తాళలేక, రాముడు, ధనుస్సువిడిచిపెట్టేసి, నేలమీద బోర్లా పడిపోయాడు. వేలూ లక్షలూ కోట్లూ స్వర్ణదానంచేసిన మహాను భావు డతను. అత నలా పడిపోగానే మేఘాలు రక్తవర్షం కురిశాయి. వందలకొద్దీ ఉల్కలు రాలాయి. ఉరుములకూ మెరుపులకూ అంతమే లేకపోయింది. సుళ్లుతిరిగితిరిగి కొట్టింది గాలి. రాహువు సూర్యుణ్ణాక్ర మించుకున్నాడు. భూమి వొణికింది. కాకులూ గద్దలూ బలాకపక్షులూ యుద్ధభూమి అంతా నిండిపోయాయి. దిక్కులు భయంకరంగా అయిపో యాయి. నక్క లరిచాయి దారుణంగా. వాయించకుండానే దుందుభులు భీకరంగా మోగాయి. ఇలాగ దారుణాలైన ఉత్పాతా లెన్నోపుట్టాయి.

ఇంతలో గభీమని లేచాడు రాముడు. వ్యాకులపడిపోయివుండిన్నీ మండిపడుతూ నామీదికిన్నీ వురికాడు. గొప్ప ధనుస్సు చేతబుచ్చుకుని మరీ వురికాడు. నేనూ చేబట్టాను ధనుర్బాణాలు; కాని "వద్దువ" ద్దని

మహర్షులు వారించారు నన్ను. రాముడున్నూ ప్రళయాగ్ని వంటి ఆశరం వుపసంహరించు కున్నాడు. ఇంతలో పొద్దుగూకింది.

మళ్లీ తెల్లవారింది. మళ్లీ పొద్దుగూకింది. మళ్లీమళ్లీ సూర్యోదయమూ, మళ్లీమళ్లీ సూర్యాస్తమయమూ అయింది. ఇరవైనాలుగు దినాలిలాగ ఘోరయుద్ధం చేశాం మేము.

# 183

## అం బ క థ 11

ఆరాత్రి, నేను, ఏకాంతంగా పడుకుని బ్రాహ్మలకూ, పితృదేవతలకూ, దేవతలకూ, నిశాచరులైన భూతాలకూ, రాజులకూ మొక్కి ఆలోచించాను. "పరశురామునితో దారుణమైన యుద్ధం తటస్థించింది నాకు. అపాయకరమైన మహాయుద్ధం యిది. బ్రాహ్మణోత్తముడైన రాముణ్ణి నేను జయించలేకుండావున్నాను. నేనతణ్ణి జయించేటట్టుంటే, దేవతలీ రాత్రి సాక్షాత్కరించి నాకు ప్రసన్నులు కావాలి మరి" అనుకున్నాను.

ఇలా అనుకుని బాణాలబాధతోనే పడుకున్నాన్నేను. యుద్ధరంగంలో నన్ననుగ్రహించిన బ్రాహ్మలెనమండుగురూ వచ్చి నా కుడివైపున కనపడ్డారు. నన్ను లేపి, తమచేతుల్లోకిన్నీ తీసుకుని "భయపడకు" అని ధైర్యంచెప్పారు. "లే, పరాక్రమించు. నీకు వచ్చిన భయమేమీ లేదు. మేమే నువ్వు. కనక, మేము, నిన్ను రక్షిస్తాం. పరశురాముడు నిన్నెప్పుడూ జయించలేడు. అతణ్ణి నువ్వే జయించేస్తావు, నిస్సందేహంగా. ఇదిగో, ఈఅస్త్రం పుచ్చుకో. పూర్వజన్మలో నీకిది బాగా చేతనయిందే, కనక, అగత్యం అయినప్పుడిది నీకు స్ఫురిస్తుంది. దీనిపేరు ప్రస్వాపనాస్త్రం. ఇది ప్రాజాపత్యం. పరశురాముడూ యెరగడు, భూమ్మీద మరెవడూ యెరగడిది. యుద్ధంలో తలుచుకో,

దానికదే వచ్చి నీకు స్వాధీనం అవుతుం దిది. దీంతో మహామహుల సందరినీ జయించగలవు నువ్వు. అయినా, ఈఅస్త్రం ప్రయోగించినా పరశురాముడు చచ్చిపోడు. దీని దెబ్బకు గాఢనిద్ర వచ్చి పడిపోతా డంతే. దీనిమూలంగా నీకెప్పుడూ యేపాపమూ అంటదు. నువ్వే వోడించి మళ్లీ నువ్వే అతణ్ణి లేవతీస్తావు. ఉదయం కాగానే యుద్ధ భూమికి వెళ్లి మేము చెప్పినట్టు చెయ్యి. అతను నిద్రపోయినా చచ్చి పోయినట్టే లెక్క మాకు. అతను చచ్చిపోడానికి వీల్లే దసలు ”

ఇలా చెప్పి వారు మాయం అయిపోయారు. వొక కరువున పోసిన ట్టున్నారు వారెనమండుగురూ. బ్రహ్మవర్చస్సుతో వెలిగిపోతున్నారు కూడా.

# 184

## అం బ క థ 12

తెల్లవారింది. నేను లేచి ఆస్వప్నం సంగతి ఆలోచించుకున్నాను. నాకెంతో ఆనందం కలిగింది దాంతో. తరవాత, రామునకూ నాకూ యుద్ధం జరిగింది. ప్రాణికోటి అంతా చకితం అయిపోయిం దాయుద్ధం చూసి. రాముడు బాణవర్షంలో ముంచెత్తేశాడు నన్ను. అనేకబాణాలు వేసి నేనది ఆపుచేశాను. తోలీనాటికోపంతో నామీద శక్తిని ప్రయో గించా డతను. యమదండం లా వుందది. పిడుగుపడ్డట్టు పడుతుం దది మీద. నాలుకలు చాపుతున్న అగ్నిలా వుంది. ఆకాశంనుంచి నక్ష త్రం పడిపోతున్నట్టు రివ్వున వచ్చి నాజత్రుభాగాన పడిం దది. పర్వతం నుంచి గైరికధాతువు ల్లాగ నాశరీరంనుంచి రక్తం వొలికింది, దాంతో. చాలా కోపం వచ్చింది నాకు. వెంటనే, మృత్యుదేవతకు సాటి అయిన బాణం వేశా నతని మీద. అతని నొసట గుచ్చుకుం దది.

అతనున్నూ వొక బాణం వేశాడు. కాలసర్పంలా వచ్చి నాగుండెలు నాటుకుం దది. రక్తంవోడుకుంటూ దాంతో, భూమ్మీద పడిపోయా

న్నేను. కొంత సేపటికి తెలివి తెచ్చుకుని అతనిమీద ఒక శక్తి ప్రయో గించా న్నేను. అతనికిన్నీ గుండెలమీద పడిం దది వెళ్లి. వాణికిపో యాడు దాంతో. కళ్లున్నూ తేల వేసుకున్నాడు. అకృతవ్రణు డతనికనేక విధాల ఉపచారాలు చేశాడు. దాంతో కోలుకుని రాముడు బ్రహ్మాస్త్రం ప్రయోగించాడు నామీద. నేనున్నూ బ్రహ్మాస్త్రమే ప్రయోగించాను వెంటనే. అయితే, అతని అస్త్రం నామీదా పడలేదు, నాఅస్త్రం అతని మీదా పడలేదు, అంతరిక్షాన కలుసుకున్నా యవిరెండూ.

బ్రహ్మాండ మైన తేజ స్సొకటి కమ్ముకుంది ఆకాశం అంతా. భూత కోటి అంతా భయభ్రాంతం అయిపోయింది. విశేషించి, దేవతలూ, గంధర్వులూ, మహర్షులూ చాలా బాధపడిపోయారు. పర్వతాల తోనూ, సముద్రాలతోనూ, అడవులతోనూ భూమి వాణికిపోయింది. దిక్కు లన్నీ పొగలుకమ్మేశాయి. ఆకాశంలో సంచరించేవా రెవరూ కూడా అక్కడ వుండలేకపోయారు. లోకం అంతటా హాహాకారాలు నిండిపోయాయి. బ్రాహ్మణోత్తములు సూచించిన ప్రస్వాపనాస్త్రం ప్రయోగించడాని కిదే సమయం అనుకున్నా న్నేను. అప్పటికప్పుడే ఆవిచిత్రాస్త్రం స్ఫురించేసింది నాకు.

# 185

## అంబకథ 13

వెంటనే పెద్ద కలకలం పుట్టింది ఆకాశాన, "భీష్మా, వద్దు, ప్రస్వాప నాస్త్రం ప్రయోగించవద్దు" అని. అప్పటికప్పుడే ధనుస్సున సంధించా న్నేనది; కాని "వద్దు వ" ద్దంటూ నారదుడు నాయెదట ప్రత్యక్షం అయినాడు. "భీష్మా, అదిగో చూడు, ప్రస్వాపనం ప్రయోగించవ ద్దని నిన్ను వారిస్తూ ఆకాశం నిండిపోయివున్నారు దేవతలు. పరశు రాముడు మిహాతపశ్శాలి. బ్రహ్మణ్యుడు. విశేషించి బ్రాహ్మడు.

ఆపైని నీకు గురువు. అతనికి నువ్వవమానం చెయ్యడం ఏవిధంగానూ మంచిది కాదు " అని వివరంగానున్నూ చెప్పా డతను.

మళ్లీ చూడగా, ఆకాశాన, ఆబ్రాహ్మ లెనమండుగురూ కన పడ్డారు నాకు. "నాయనా, నారదుడు చెప్పినట్టు చెయ్యి " అన్నారు మెల్లిగా. "లోకాల కన్నిటికీ శ్రేయస్కర మైన మాట అతనిది " అని కూడా అన్నారు వారు. వెంటనే ఆప్రయత్నం మానుకున్నా న్నేను; కాని బ్రహ్మాస్త్రం తీశాను వేద్దా మని.

రాముడు నేను ప్రస్థాపనం ఉపసంహరించుకోడం చూశాడు. "మందు ణ్ణయిన నేను భీష్ముని చేతిలో వోడిపోయా " నన్నాడు వెం టనే. ఆమాటమీద అతని తండ్రీ, తాతా, ముత్తాతా సాక్షాత్క రించి అతణ్ణి చుట్టుకున్నారు. "నాయనా, నువ్వెప్పుడూ ఇలాంటి సాహ సం చెయ్యవ " ద్దన్నారు వా రతణ్ణి. "భీష్మునితో యుద్ధంచెయ్యడం-క్షత్రియు డైన భీష్మునితో యుద్ధంచెయ్యడం క్షత్రియు డైనవాడికే చెల్లుతుంది. మనబ్రాహ్మలకు, వేదం చదువుకోడమూ, తపస్సు చేసు కోడమూ — ఇదే ఉత్తమధనం. ఒక సందర్భంలో నీతో మేమిది చెప్పే వున్నాం యిదివరలో. ఆయుధాలు వాడ్డం మిక్కిలీ క్రూరకృత్యం. మన కది తగదు. భీష్మునితో యుద్ధం కట్టిపెట్టు. ఇక నువ్వెక్కడి కయినా వెళ్లిపో. ఆయుధాలు విడిచిపెట్టెయ్యి. తపస్సు చేసుకో " అని చాలా చెప్పారు వారతనికి.

"యుద్ధం మానెయ్య" మని భీష్ముణ్ణి కూడా నివారించారు దేవ తలు. "పరశురాముడు నీకు గురుదేవుడు. నువ్వెప్పుడూ అతనితో యుద్ధం తలబెట్టవద్దు" అంటూ మళ్లీ మళ్లీ చెప్పారు వారతనికి. "రాము ణ్ణోడించడం నీకు ధర్మమున్నూ కాదు. బ్రాహ్మణ్ణి నువ్వారాధించాలి. మేము నీకున్నూ గురువులం. అంచేత, నిన్నిలా నివారిస్తున్నాము"అనిన్నీ చాలాదూరం చెప్పారు వారు. ఇంతకీ, — భీష్ముడు మనుష్యమాత్రుడు

కాడోయ్! శంతనుమహారాజు గంగాదేవియందు కన్న యీభీష్ముడు వసువు. అతణ్ణి జయించడం నీకు సాధ్యం కాదు, వెనక్కితగ్గిపో. అర్జును డున్నాడు చూడూ పాండవుల్లో? అత నింద్రుని కుమారుడు. నరనా రాయణు లిద్దరిలోనూ నరు డతను. సవ్యసాచి అని ముల్లోకాల్లోనూ ప్రఖ్యాతిపొందివున్నా డతను. అతణ్ణి భీష్మునకు మృత్యుదేవతగా యేర్పాటుచేశాడు బ్రహ్మ. ఆసమయం ముందు వస్తుంది" అనిన్నీ చెప్పా రతనికి ఆపితృపితామహప్రపితామహులు.

కాని రాము డందు కంగీకరించలేదు. "నేనెప్పుడూ యుద్ధం విడిచి పెట్ట నని నాకు వ్రతం. ఇంతవరకూ నే నెక్కడా చెయ్యలేదా పని. మీరు వెళ్లి భీష్మునిచేత చేయించం డాపని" అన్నాడు దృఢంగా. ఋచీకుడు మొదలైన మునులు వెంటనే నారదునితో కలిసివచ్చి "నాయనా, యుద్ధం కట్టిపెట్టు. ఆబ్రాహ్మణోత్తముణ్ణి ఆరాధించుకో" అన్నారు నాతో; కాని నేను కూడా "యుద్ధం మాననుగాక మాన" నన్నాను. "వెనకాల నన్నొకళ్లు కొడుతూవుంటే యుద్ధం మానడం నావల్లకాదు. నాకది వ్రతం. లోభంవల్లా, దీను ణ్ణయీ, భయపడీ, డబ్బుకోసమూ నే నెప్పుడూ క్షత్రియధర్మం విడిచిపెట్టను" అని గట్టిగా చెప్పేశాను.

అప్పు డామహర్షులూ, నాతల్లి గంగాదేవీ రణరంగం మధ్యకి వెళ్లారు. నేనలాగే నుంచున్నాను. ధనుర్బాణాలు నాచేతిలోనే వున్నాయి. యుద్ధం చెయ్యడానికే నిశ్చయించుకుని వున్నా న్నేను. వారందరూ వెళ్లి పరశురాముణ్ణే తగ్గిపొమ్మన్నారు. "నాయనా, బ్రాహ్మల హృదయం వెన్నవంటిది. కనక, శాంతించవయ్యా! యుద్ధం కట్టిపెట్టు. నువ్వు భీష్ముణ్ణి చంపలేవు. భీష్ముడు నిన్నూ చంపలేడు. అత నికీ నువ్వూ నీకతనూ అవధ్యులు" ఇలా చెప్పి వా రతనిచేత శస్త్రం విడిచిపెట్టించారు.

నేను ఆకాశంకేసి చూశాటప్పటి కా బ్రహ్మవేత్త లెనమందుగురూ మళ్లీ కనపడ్డారు నాకు. ఆనందభరితు లయి వున్నారు వారు. గ్రహాలన్నట్టు వెలిగిపోతున్నా రఖండ తేజస్సుతో ఆకాశాన. వారు మళ్లీ నాదగ్గిరికి వచ్చి "మహాబాహూ, పరశురాముడు లోకాని కంతకూ గురువు. అత ణ్ణారాధించుకో" అన్నారు. వారి మాటమీద రాముడు యుద్ధం మానుకోడం చూశాన్నేను, వెంటనే వెళ్లి అతని పాదాలు పట్టుకున్నాను. రాముడన్నా. "భీష్మా, నీకు సాటి అయిన క్షత్రియుడు పృథివిమీద లేడు. నీవల్ల చాలా ఆనందం కలిగిందినాకు. ఇక వెళ్లిపో" అన్నాడు ప్రేమతో నన్ను. వారందరూ వినేట ట్టంబతోనన్నా చెప్పాడత నిలాగ.

# 186

## అంబకథ 14

"అమ్మాయీ, నాశక్తికొద్దీ నేను యుద్ధంచేశాను. లోకా లన్నీ ప్రత్యక్షంగా చూశా యిది. ఎంతెంతలేసి అస్త్రాలో ప్రయోగించా న్నేను; కాని భీష్ము ణ్ణోడించ లేకపోయాను. నాపరమబలమూ పరమశక్తీ యింతే. కనక, నీయిష్టంవచ్చినట్టు వెళ్లిపో యిక. కాదంటావా. యుద్ధం తప్పించి మరేమి కావా లంటావో చెప్పు. నిజం చెబుతున్నా న్నేను. భీష్మణ్ణే ఆశ్రయించు వెళ్లి. మరోదారి లేదు నీకు. నేను భీష్ముని చేతిలో వోడిపోయాను మరి" అని చెప్పి వూరుకున్నా డతను.

"మహాత్మా, నువ్వు చెప్పిం దంతా సత్యమే" అంది ఆమెకూడా. "గొప్ప ప్రజ్ఞావంతుడు భీష్ముడు. దేవతలున్నా అత ణ్ణేమీ చెయ్యలేరు. నీశక్తికొద్దీ. నీఉత్సాహంకొద్దీన్నీ నాకోసం పాటుపడ్డావు నువ్వు. ఎవరూ ఎదిరించరాని పరాక్రమం నీది. అస్త్రాలున్నా ఎవరికీ అందనివే నీవి; కాని లాభం లేకపోయింది. ఇక నాసంగతి. ఏది యేమయి

పోయినా సరే, నేను మాత్రం మళ్లీ భీష్ముని దగ్గిరికి వెళ్లను. ఎక్కడికి వెడితే నేను స్వయంగా భీష్ముణ్ణి సంహారించగలనో అక్కడికి వెడతాను" అని స్పష్టంగా చెప్పేసిం దామె. చాలా రోషంగా కూడా వెళ్లిపో యింది. పులుకూ పులుకూ చూస్తూ. తపస్సు చేసుకోడానికి వెళ్లిపో యింది. నన్ను చంపడమే ఆతపస్సుకి ఫలం.

తరవాత, పరశురాముడు, నాకు సెలవిచ్చేసి మునులతో కలిసి మహేంద్రపర్వతానికి వెళ్లిపోయాడు. నేనుహస్తినాపురానికి వచ్చాను. బ్రాహ్మ లనేకవిధాల స్తుతించారు నన్ను. జరిగిం దంతా నాతల్లికి చెప్పాను. చాలా ఆనందించిం దామె. అలా వెళ్లిన అంబ ఎప్పు డే మంటుందో, ఏమిచేస్తుందో, ఎక్కడికి వెడుతుందో తెలుసుకుంటూ వుండమని కొందరు పురుషులను నియోగించా న్నేను. వారున్నా ఎలాంటి కష్టా లయినా సహించి ఆమె సంగతులు తెలుసుకుని ఎప్పటి కప్పుడే నాకందజెయ్యసాగారు. తపస్సు చేసుకోడాని కామె అడవులకు వెళ్లిం దని దృఢంగా తెలిసింది నాకు. అందుకు చాలా బాధపడ్డా న్నేను.

నాయనా, తపోనిష్ఠు డైన బ్రాహ్మడు తప్ప క్షత్రియు డెవడూ నన్నోడించ లేడు. నేనీ సంగతి నారదమహార్షికీ వ్యాసమహార్షికీ కూడా చెప్పాను. "భీష్మా, అంబవిషయమై నువ్వేమీ విచారించనక్కరలేదు. పురుషకారంతో దైవాన్ని జయించగలవా డెవడూ లేడు ముల్లోకా ల్లోనూ కూడా" అన్నారు వారు.

యమునాతీరానికి వెళ్లి ఋషుల ఆశ్రమంలో ప్రవేశించి గాఢమైన తపస్సు చేసింది, అంబ. అన్నం తినడం మానేసింది. చిక్కిపోయింది. శరీరం అంతా మార్దవం కోల్పోయి రూక్షం (గరుకు) అయిపోయింది. జడలుపెరిగిపోయాయి. వొళ్లంతా దుమ్ముకొట్టుకుంది. ఆరుమాసాల పాటు గాలే ఆహారం ఆమెకి. యమునానదిలో కంఠంలోతున నుంచుని నిరాహార అయి మరో సంవత్సరం తపస్సుచేసింది. తరవాత, రాలిపో

యిన ఆకు వొక్కటి మాత్రం తిని మరో సంవత్సరంపాటు మహోగ్ర తపస్సు చేసింది. చాలా కోపంతో చేసింది. కాలిబొటనవేలిమీద నుంచుని మరీచేసింది. ఇలాగ పన్నెండు సంవత్సరాలు చేసిందామె ఘోర తపస్సు. భూమ్యంతరిక్షాలు ఉడికిపోయాయి దాంతో. బంధువు లెందరో వచ్చి పట్టుపట్టారు వద్దుగాక వద్దని. జ్ఞాతులున్నూ చాలా చెప్పారు తపస్సు చాలించమని; కాని వినిపించుకోలే దామె.

తరవాత, సిద్ధులూ చారణులూ సంచరించే వత్సభూమి చేరుకుందామె. పుణ్యమూర్తులైన మహర్షుల ఆశ్రమాలెన్నో వున్నాయక్కడ. అక్కడి తీర్థక్షేత్రా లన్నిటిలోనూ రాత్రీపగలూ అన్న వివక్షత లేకుండా స్నానాలు చేస్తూ సంచరించిందామె. నందాశ్రమమూ, ఉలూకాశ్రమమూ, చ్యవనాశ్రమమూ, బ్రహ్మస్థానమూ, ప్రయాగా, దేవయజనమూ, దేవారణ్యమూ, భోగవతీ, కౌశికాశ్రమమూ, మాండవ్యాశ్రమమూ, దిలీపాశ్రమమూ, రామగుండమూ, పైలగర్గాశ్రమమూ — ఇవన్నీ తిరిగిందామె.

కనపడ్డతీర్థంలో నల్లా ఆమె యిలా మునుగుతూ వుండడం చూసి, నాతల్లి గంగాదేవి "భద్రా, నువ్వెందుకోసం యిలా అవస్థపడుతున్నావో నాకు యథార్థం చెప్పవే" అనడిగింది. దానికి, అంబ, చేతులు దోయిలించుకుని "పరశురాముడు భీష్ముని చేతిలో వోడిపోయాడు. ఆభీష్ముణ్ణి జయించడానికి సిద్ధపడే రాజెవ డున్నాడూ యిక ? కనక, నేనే ఆపనిచేద్దా మని యీఘోరతపస్సు చేస్తున్నాను. ఈశక్తి నాకెక్కడ లభిస్తుందో అని యిలా తిరుగుతున్నాను" అని బదులు చెప్పింది దాపరికం లేకుండా.

"వంకరదారి తొక్కావమ్మా" అంది నాతల్లి దానిమీద. "నీకోరిక తీరేది కాదు" అనిన్నీ స్పష్టంగా చెప్పేసింది. "భీష్ముణ్ణి చంపడానికే నువ్వీ వ్రతం అవలంబించివుంటే — ఈవ్రతం నిర్వహించడం

లోనే నువ్వీశరీరం విడిచిపెట్టడం జరిగితే నువ్వొక నదివయి పుడతావు మళ్లీ జన్మలో. నదివైనా వంకరటింకరగా ప్రవహిస్తావు. వానలు కురిస్తే ప్రవహించే నదివవుతావు. దాని రేవులన్నీ చాలా కష్టంగా వుంటాయి. వర్షాలు కురిస్తేనే ప్రవహించే నది యెనిమిదిమాసాలు ఎండిపోయి వుంటుంది. పైగా, ఆనీరు ప్రవహించేటప్పుడైనా, క్రూరాలైన గండుమొసళ్లతో నిండి అందరికీ భయంకరం అయిపోతుంది" అని కూడా చెప్పేసింది.

ఇలా చెప్పి నవ్వుకుంటూ వెళ్లిపోయింది నాతల్లి. అంబ, ఆవ్రతం సాగించుకుంటూనే వుండిపోయింది. ఎనిమిది మాసాలకోమాటో, పది మాసాలకోమాటో యిన్ని మంచినీళ్లు మాత్రమే తాగుతూ సాగించుకుం దీవ్రతం ఆమె. తీర్థాలకోసమూ, క్షేత్రాలకోసమూ వత్సభూమి అంతా తిరిగింది. పరిగెత్తుతూ పరిగెత్తుతూ వొకనాడొకచోట పడి పోయి ప్రాణాలు విడిచిందామె.

ఆమె పడిపోయినచోట వెంటనే వొక నది యేర్పడింది. దానిపేరు అంబ. వంకరటింకర అయిపోయిందది. నాలుగు మాసాలే నీరుంటుం దందులో. పెద్దపెద్ద మొసళ్లపుట్ట అది. రేవులన్నీ కష్టంగా వుంటా యెప్పుడూ; గాని అంత తపస్సు చేసింది కనక, సగం శరీరంతో ఆవత్స భూమిలో నది అయీ, తక్కిన సగంశరీరంతోనూ మళ్లీ కన్య అయీ పుట్టిందామె.

## 187

### అంబకథ 14

"అమ్మా, నువ్వెందుకోసం తపస్సుచేస్తున్నా ?" వనడిగారు మునులు అంబని. ఆమె నిశ్చయం మార్పించాలని పూనుకున్నారు వారు; కాని అది వినిపించుకోలేదామె. "మహాత్ములారా, భీష్ముడు నన్ను నిరాక

రించాడు. అంచేత నేను మగనాలిని కాలేకపోయాను. పతిని సేవించు కునే భాగ్యం లేకుండాపోయింది నాకు. అంచేత అతణ్ణి నేను స్వయంగా సంహరించా లని నిశ్చయించుకున్నాను. అందుకోసం యీతపస్సు, పుణ్యలోకాలకోసం కాదు. ఎవనిమూలాన నేనీదురవస్థపా లయినానో ఆ భీష్ముణ్ణి సంహరించి తరవాత శాంతించడం — ఇదీ నానిశ్చయం. పతిలోకాలు నాకందని వయిపోయాయి. నేనిప్పు డాడదాన్నీ కాను, మగవాణ్ణీ కాను. భీష్ముణ్ణి చంపాలి, నేను వెనక్కి మళ్లాలి. ఇంతకంటే మరో సంకల్పం లేదు నాకు. స్త్రీజన్మ అంటే నాకు చాలా అసహ్యభావం పుట్టింది. మగవా ణ్ణయితీరా లని నిశ్చయించుకున్నాను. భీష్ముణ్ణి చంపా లెలాగయినా. కనక, మీరు నన్ను నివారించవద్దు" అని దృఢంగా చెప్పేసిం దామె.

కొన్నాళ్ళకి శూలపాణి అయిన అర్థనారీశ్వరుడు ప్రత్యక్ష మయినా డామెకి. ఆమహర్షు లందరూ చూస్తూ వుండగానే ఆమెకి దర్శనం యిచ్చాడు. "నేను భీష్ముణ్ణి చంపా" లని కోరిం దామె. "తప్ప కుండా చంపుతా" వన్నాడు మహేశ్వరుడు. "మహాదేవా, నేనాడ దాన్ని కదా? ఆడదాన్ని కావడంవల్ల నామనస్సు శాంతంగా వుందే కాని క్రూరంగా లేదు. మరి, యుద్ధంలో నేను భీష్ముణ్ణి జయించడం సంభవమా? భీష్ముణ్ణి నేను చంపేస్తా నన్నావే, అది జరుగుతుందా? నీమాట సత్యం అయేటట్టు చూడు" అని మళ్లీ కోరిం దామె. "నా మాట యెన్నడూ అసత్యం కా" దన్నాడు మహేశ్వరుడు. "నేను జరిగేదే చెప్పాను. నువ్వు భీష్ముణ్ణి చంపుతావు. మగతనమూ పొందు తావు. మరోజన్మ యెత్తాక కూడా నీకీ సంగతి అంతా జ్ఞాపకం వుం టుంది. ద్రుపదుని యింట్లో పుడతావు నువ్వు. చిత్రయుద్ధాలు చేస్తావు. నీబాణాల వేగం చాలా హెచ్చుగా వుంటుంది. నేను చెప్పిం దంతా జరిగితీరుతుంది. ముందు ఆడపిల్ల వయి పుడతావు; కాని కొన్నాళ్లకి

మగవాడ వవుతావు" అని చెప్పి మహేశ్వరుడు ఆమునులు చూస్తూనే వుండగా మాయం అయిపోయాడు.

అంబ, వారందరూ చూస్తూ వుండగా ఆకర్రా ఆకంపా తెచ్చి చితి పేర్చుకుంది. దానికి నిప్పుపెట్టింది. అది భగభగ మండేటప్పుడు "భీష్ముణ్ణి చంపడంకోసం" అంటూ అందులో వురికింది. ఇదంతా యమునానది కెదురుగా జరిగింది.

# 188

## శిఖండికథ 1

"తాతా, శిఖండి సంగతి అంతా చెప్ప" మనడిగాడు దుర్యోధనుడు. "నాయనా" అంటూ ప్రారంభించాడు భీష్ముడు.

"ద్రుపదుని పట్టపుదేవికి సంతానం కలగలేదు. అంచేత, ద్రుపదుడు మహేశ్వరుణ్ణి తలుచుకుని కఠోరతపస్సు చేశాడు. నన్ను చంపగల కొడుకు కావా లన్న కోరికతో చేశాడు ద్రుపదుడాతపస్సు. మహేశ్వరుడు ప్రత్యక్ష మైనా డతనికి. "భగవన్, భీష్ముణ్ణి చంపగల కొడుకుని దయచెయ్యి" అని ప్రార్థించా డతను. "రాజా, నీకాడ కొడుకు పుడతాడు. కనక; తపస్సు చాలించు. నామాట జరిగి తీరుతుం" దన్నాడు మహేశ్వరుడు. మళ్లీ మళ్లీ ప్రార్థించాడు ద్రుపదుడు కొడుకు నిమ్మని; కాని "ఇది యిలా జరిగితీరుతుం" దని మళ్లీ చెప్పాడు మహేశ్వరుడు.

కొన్నాళ్లకి అతని పట్టమహిషి గర్భవతి అయింది. ద్రుపదు డామెకి సకలోపచారాలూ చేయించాడు. ఆమె యేమి కాలా లంటే అదల్లా సమకూర్చాడు, ఉత్తరక్షణంలో. యుక్తసమయాన ప్రసవించిం దామె. కూతురు పుట్టింది. అయితే, ఆకూతురు మామూలు ఆడశిశువుల్లా కాక విలక్షణంగా వుంది. పురుషు డన్నట్టుంది. ద్రుపదుడు కొడుక్కో-

సం తపించిపోతున్నాడు. అంచేత, పట్టమహిషి తనకి కొడుకు పుట్టా డని చెప్పిం దతనికి. ద్రుపదుడు ఆకూతురికి కొడుక్కి చేసినట్టే జాతకర్మ మొదలైన వన్నీ జరిగించాడు. ఈరహస్యం బయటపడకుండా చాలా జాగ్రత్తపడింది పట్టమహిషి. ద్రుపదుడు తప్ప ఆబిడ్డ ఆడపిల్ల అని ఆనగరంలో మరెవరూ యెరగరు. రాజు కూడా మహేశ్వరునిమాట తలుచుకుని కొడు కనే వ్యవహారం నడిపించా డన్నివిషయాల్లోనూ. శిఖండి అని పేరుపెట్టాడు. ఒక చారునివల్లా, నారదునివల్లా తెలిసింది నా కిది. మహేశ్వరుని మాటని పట్టీ, అంబ తపస్సుని బట్టీ కూడా నేనిది గుర్తించాను.

# 189

## శి ఖ ం డి క థ 2

ద్రుపదుడు, తన కొడుకు మంచి పండితుడు కావా లని అందుకు తగ్గ ప్రయత్నా లన్నీ చేశాడు. చిత్రలేఖనం నేర్పించాడు. శిల్పా లన్నీ నేర్పించాడు. ద్రోణాచార్యుని దగ్గిరికి పంపి ధనుర్వేదమున్నూ పూర్తిగా నేర్పించాడు. కొన్నాళ్లకి "ఇక పెళ్లి చెయ్యాలి. అబ్బాయికి తగిన పిల్లని తీసుకుర" మ్మంది పట్టమహిషి ద్రుపదుణ్ణి.

అయితే, శిఖండి స్త్రీగాని పురుషుడు కాడని ద్రుపదు డెరుగును. అంచేత, భార్యమాట విని చాలా విచారించా డతను. "అమ్మాయికి యౌవనం అంకురించింది. నాకు శోకమున్నూ పెరిగిపోయింది. మహే శ్వరుని మాటమీద కొడు కనే వ్యవహరించుకుంటూ వస్తున్నాను" అని చాలా దుఃఖించా డతను; కాని భయపడవ ద్దంది, పట్టమహిషి. "మహేశ్వరుని మాట మరోవిధంగా కాదు. త్రిలోకకర్త అయిన ఆమహానుభావుడు మన కబద్ధం యెందుకు చెబుతాడూ? నేనొక మాట చెబుతాను, విని, బాగా ఆలోచించు. అది నీకు నచ్చితేనే నీకు నచ్చి

నట్టు చెయ్యి. ముందు కూతు రయి పుట్టి తరవాత కొడు కవుతుం దని మహేశ్వరుడు చెప్పా డన్నావు గదా? అది జరిగితీరుతుం దని నా ధైర్యం" అని చాలా గట్టిగా చెప్పిం దామె.

వారిద్దరూ బాగా ఆలోచించారు. తరవాత, ద్రుపదుడు తన ఆత్మ బంధువులతో కూడా ఆలోచించి దాశార్ణ రాజు హిరణ్యవర్మ కూతుర్ని తన కొడుక్కి చేసుకోవా లని నిశ్చయించుకున్నాడు. అతనున్నూ తన కూతుర్ని శిఖండి కిచ్చి పెళ్ళిచేశాడు. అతను చాలా గొప్పవాడు. ఎంతటివాడూ జయించ లే దతణ్ణి. అసలు, ఎదిరించ నేలే డతణ్ణి. అతని సేన సామాన్యం కాదు. చాలా గొప్పది. వివాహం అయినతరవాత అతని కూతురు యుక్తవయస్కురా లయింది. శిఖండి ఆమెని వెంట బెట్టుకుని తన కాంపిల్యనగరానికి వచ్చేశాడు.

వచ్చింది, తన భర్త అన్న వ్యక్తి ఆడదే గాని మగవాడు కా డని గుర్తించేసింది, హిరణ్యవర్మకూతురు. చాలా సిగ్గుపడిపోయిం దామె. ఆ సిగ్గుతో కుమిలిపోతూ తన దాదికీ, చెలికత్తెలకూ చెప్పేసిం దాసం గతి. వాళ్ళున్నూ మొదట చాలా బాధపడి చివరికీసంగతి హిరణ్య వర్మకు తెలియజేశారు, మనుష్యులను పంపి.

అంతా విన్నాడు హిరణ్యవర్మ. చాలా విచారించా డతనుకూడా. ఇది ఇలా జరుగుతూనే వుంది, శిఖండి, తన ఆడతనం యెవరికీ తెలియ కుండా జాగ్రత్తపడుతూ "మగరాజు" లాగే సంచరిస్తున్నాడు పొంగి పోతూ. హిరణ్యవర్మ చాలా బాధపడ్డాడు జరిగిపోయింది తలుచుకుని. చివరికి మండిపడ్డాడు జరగవలసింది తలుచుకుంటూ. ద్రుపదుని దగ్గిరికి తన దూతను పంపాడు కూడా ఆత్రపడుతూ.

"రాజా, మారాజు నీకు చెప్పమన్న మాటలు చెబుతున్నాను. నువ్వు మోసంచేశావు. పరాభవమున్నూ చేశావు. చాలా అవమానం కూడా చేశావు. తెలియకా పొరపాటునా కాదు, దుర్బుద్ధితో

చేశా విదంతా. నాకూతుర్ని నీకూతురికి పెళ్ళిచేసుకున్నావు. కనక, ఆమోసానికి ఫలం అనుభవిస్తావు. ఇదే దండెత్తివచ్చి నిన్నూ నీవాళ్ళనీ నీఅమాత్యులనూ నాశనం చేసేస్తాను, సిద్ధంగా వుండు" అని కచ్చితంగా చెప్పాడాదూత, ద్రుపదునకు.

# 190

## శి ఖ ం డి క థ 3

దొరికిపోయిన దొంగ అయిపోయాడు ద్రుపదుడు. మాటరాలే దతనికి; కాని పొందికగా మాటలాడనేర్చిన దూతలను మాత్రం పంపాడు, వియ్యంకుని దగ్గిరికి. "అదంతా అబద్ధం" అని కూడా చెప్పించాడు; కాని హిరణ్యవర్మ వినిపించుకోలే దది. "మళ్ళీ మోసంచేస్తున్నా" డను కున్నాడు కూడా అతను. ఈసంగతి తన అంతరంగమిత్రులకు చెప్పాడు. బలాలు కూర్చుకున్నాడు. దండెత్తడానికి సర్వమూ సిద్ధం చేసుకున్నాడు.

"తొందరపడవ" ద్దన్నారు హిరణ్యవర్మని అతనిమిత్రులు. "శిఖండి ఆడపిల్ల కావడమే నిశ్చయం అయితే, ముందు పాంచాలరాజ్యం మరొకడికి కట్టబెట్టి, శిఖండినీ ద్రుపదుణ్ణీ కూడా సంహరించేస్తాం తరవాత. అంతకిముందు పెడరెక్కలు కట్టి ద్రుపదుణ్ణిక్కడికి తీసుకువస్తాం"అనిన్నీ చెప్పారు వారు. అప్పటికీ ద్రుపదుడు చెప్పించింది అబద్ధ మనే స్థిరపరచు కున్నాడు హిరణ్యవర్మ. అయినా, మిత్రులమాట మీద మళ్లీ దూతలను పంపాడు "నరికేస్తాను, సిద్ధంగా వుండ" మని, దండెత్తడానికి బదులు.

ద్రుపదుడు సహజంగానే భయస్థుడు. ఆపైని తప్పుచేసినవాడు. దీంతో, గడగడలాడిపోయా డత నీవార్త విని. సద్దిచెప్పి ఆదూతలను పంపేసి తన పట్టమహిషి దగ్గిరికి వెళ్ళా డతను. ఆమె నేకాంతానికి తీసుకువెళ్ళి "వియ్యంకుడు చాలా కోపంగా వున్నాడు. దండెత్తికూడా వస్తున్నాడు. అసలే బలవంతు డతను. ఆపైని మోసం జరిగిం దన్న

వృక్రోషం. గొప్ప సేన వెంటబెట్టుకువస్తున్నా డతను. అమ్మాయి సంగతి యేమి చెయ్యాలో నాకేమీ తోచడంలేదు. శిఖండి ఆడపిల్ల అని నిశ్చ యించుకున్నారు వారు. ఇందులో సత్యాసత్యా లేమిటో నువ్వు చెప్పాలి. నీమాట విని ఇప్పుడు చెయ్యవలసిం దేమిటో ఆలోచిస్తా న్నేను. నా మట్టుకి శిఖండి ఆడపిల్ల అనే అనుమానం. నాకే కాదు, నీకూ చిక్కే వచ్చిందిప్పుడు. కనక, నువ్వు గనక ఉన్న దున్నట్టు చెబితే యీచిక్కు తప్పించుకోవచ్చు మనం" అన్నా డతను.

శిఖండిని పిలిచాడు. "నువ్వేమీ భయపడకు. నువ్వు కొడుకు వను కుని నేను దగాపడ్డాను. నేను దగాపడి నీమామగారిని దగాచేశాను, ఆవరసనే. కనక, నిజం చెప్పు, ఏమి చెయ్యాలో ఆలోచిస్తా" నని శిఖండితోకూడా అన్నా డతను. తనకు తెలిసేవుండినా యితరులను నమ్మించడాని కత నిలా అడిగాడు. పట్టమహిషి అందుకుంది.

# 191

## శిఖండి కథ 4

"మన బిడ్డ ఆడపిల్లే" అని చెప్పేసింది పట్టమహిషి. "ఆడపిల్లని కన్నం దుకు సవతు లందరూ దెప్పుతా రని మగపిల్లవా డని చెప్పా న్నేను. నామీది ప్రీతితో నువ్వున్నూ నమ్మా వది. మగపిల్లవాడికి చెయ్య వలసిన సంస్కారాలే చేశావు కూడా నువ్వు. దశార్ణపతి కూతుర్ని కూడా పెళ్ళిచేశావు. "ఆడపిల్ల పుట్టి తరవాత అది మగపిల్లవా డవుతుం దన్న మహేశ్వరుని మాట జరక్కపోదన్న ధైర్యంతో చెప్పా న్నేనామాట." అని వివరాలున్నూ చెప్పిం దామె.

ఇదంతా మంత్రులతో చెప్పాడు ద్రుపదుడు. వారితో కలిసి బాగా ఆలోచించాడు. ప్రజలకు రక్షణ యేర్పా ట్లన్నీ చేశాడు. వియ్యంకుణ్ణి మళ్లీ సముదాయించా లని భావించి వొక నిశ్చయమున్నూ చేసుకు

న్నాడు. అసలు కాంపిల్యమే దృఢమైన నగరం. స్వాభావసిద్ధా లైన రక్షణ లున్నాయి దానికి. మరిన్ని కట్టుదిట్టాలు చేయించా డీసంద ర్భంలో; కాని హిరణ్యవర్మతో విరోధం వచ్చినందుకు మాత్రం పట్ట మహిషీ తానూకూడా చాలా పశ్చాత్తాపపడ్డారు. "రక్షించ" మని దేవతలను ప్రార్థించాడు ద్రుపదుడు.

"మహారాజా, సజ్జను లెప్పుడూ దేవతలను నమ్ముకుని వుంటారు. దుఃఖాలు వచ్చినప్పుడు మరీ నమ్ముకుని వుండాలి. కనక, నువ్వు దేవ తల నారాధించుకో. భూరిదక్షిణ లిచ్చి బ్రాహ్మలచేత కూడా దైవా రాధన చేయించు. హోమాలున్నూ చేయించు, యథాశాస్త్రంగా. యుద్ధం కాకుండా వుండేటట్టూ, ఈవిపత్తు తప్పిపోయేటట్టూ చెయ్య మని దేవతలను వేడుకో. దేవతల కనుగ్రహం వచ్చే దాకానే చిక్కు లయినా, దుఃఖా లయినాను. మనుష్యప్రయత్నం జరిగితే దైవం అను కూలించకపోడు. దైవానికీ పురుషకారానికీ పొంతన లేకపోతేనే బాధలు కలుగుతాయి." అని చాలాదూరం చెప్పింది పట్టమహిషి.

తల్లీ తండ్రీ యిలా మాట్టాడుకోడం విని, సిగ్గుపడిపోయీ "మన మూలాన వీరి కీచిక్కులు వచ్చాయి" అని నిశ్చయించుకునీ, తాను చచ్చిపోతే బాగుంటుం దని స్థిరపరుచుకునీ యిల్లు విడిచి కీకారణ్యాలకు వెళ్లిపోయింది శిఖండిని.

ఒక అడవిచేరుకుం దామె. స్థూణాకర్ణు డనే వొక యక్షుడి దావనం. అతనికి భయపడి జను లక్కడికి వెళ్లడం మానుకున్నారు. గొప్ప మేడ అతనిది. అడవి మధ్యగా వుంది. చాలా యెత్తయిన దది. మంచి ప్రాకారమూ, గొప్పగొప్ప తోరణాలూ వున్నాయి దానికి. సున్న పూతలతో తెల్లగా వుంది. తిండీ తిప్పలూ మానుకుని ఆఅడవిలో తిరకసాగింది శిఖండిని, కంప అయిపోయి.

ఒకనాడా స్థూణాకర్ణుడామెని కలుసుకున్నాడు. చాలా ఆదరంగా చూశాడామెని. "ఉపవాసా లెందుకోసం చేస్తున్నావు నువ్వు?" అనడిగా డతను. "నీకు సాయంచేస్తా" నన్నాడు. "నేను కుబేరుని అనుచరుణ్ణి. నువ్వంటే నాకెంతో ప్రీతికలిగింది. నీకేంకావాలో చెప్పు, ఇవ్వగూడని దైనా యిచ్చేస్తాను." అనిన్నీ నిర్బంధించాడు. అందుమీద, జరిగిం దంతా చెప్పిం దామె.

"అయ్యా, నాతండ్రికి కొడుకుల్లేరు. త్వరలోనే అతను నాశనం అయిపోయే స్థితివచ్చింది. దశార్ణాధిపతి మానాయనమీదికి దండెత్తి వస్తున్నాడు. చాలా బలవంతు డతను. గొప్ప శూరుడు. కనక, నువ్వు నన్ను రక్షించాలి. నాతల్లినీతండ్రినీకూడా రక్షించాలినువ్వు. నాదుఃఖం పోగొడతా నని ప్రతిజ్ఞచేశావు మరి. నీకు దయవుంటే నేను పురుషుణ్ణవుతాను. ఆరాజు మామీదికి దండెత్తిరాకపూర్వమే నువ్వీ సాయం చెయ్యాలి" అని కోరిం దామె చివరికి.

# 192

## శి ఖ ం డి క థ 5

స్థూణాకర్ణునకు పెద్దకుచ్చీవచ్చిపడింది. "ఇది దైవయోగం" అనుకున్నా డతను. "అయినా. నీకోరిక తీరుస్తా" నన్నా డతను. "అయితే, యిందుకో నియమంమాత్రం వుంది, చెబుతా విను. కొంతకాలంపాటు నాపురుషత్వం నీకిస్తాను. నీస్త్రీత్వం నేను పుచ్చుకుంటాను; కాని గడువు దాటకుండా నువ్విక్కడికి రావాలి మళ్ళీ. వస్తావా? నిజం చెప్పు. నేనాకాశాన సంచరించగలను. సంకల్పసిద్ధి వుంది నాకు. నేను నాయిష్టంవచ్చిన రూపం ధరించగలను. కనక, నాదయవల్ల నువ్వు నిన్నూ నీపట్నాన్నీ నీతల్లిదండ్రులనూ, నీబంధువులనూ రక్షించుకో. నేనాడిన మాట తప్పను. నీకోరిక తీరుస్తా" నన్నాడు.

"సరే" అంది శిఖండిని. "కొద్దికాలంలోనే నీపురుషత్వం నీకిచ్చే స్తాను. ఇప్పటికి నా స్త్రీత్వం నువ్వు పుచ్చుకో. హిరణ్యవర్మ ముట్టడి మానుకుని వెళ్ళిపోగానే వచ్చి నీపురుషత్వం నీకిచ్చి నా స్త్రీత్వం నేను పుచ్చుకుంటాను" అని మాట యిచ్చేసింది. "సంయే అంటే సంయ్యే" అనుకున్నా రిద్దరూ. తన పురుషత్వం ఆమె కిచ్చి, ఆమె స్త్రీత్వం తాను పుచ్చుకున్నాడు స్థూణాకర్ణుడు. యక్షుని తేజ స్సంతా యిలాగ తనకి సంక్రమించగా, శిఖండి, మిలమిల మెరిసిపోయాడు. వెంటనే తన పట్నం చేరుకుని తండ్రిని కలుసుకున్నాడు. జరిగిందంతా విని ద్రుపదుడూ అతని పట్టమహిషీ కూడా చాలా సంతోషించారు. "మహేశ్వరుని మాట యిప్పటికి నిజం అయిం దని సంతోషించి "వచ్చి నాకొడుకుని నీయిష్టంవచ్చినట్టు పరీక్షచేసుకో" అని వియ్యంకునకు వర్తమానం పంపాడు ద్రుపదుడు.

వెంటనే వచ్చేశాడు హిరణ్యవర్మ, కాంపిల్యనగరానికి. కూతురి స్థితి అలా అయిపోయినందుకు చాలా దుఃఖిస్తున్నాడు మరి. వచ్చిన వెంటనే ద్రుపదుని దగ్గిరి కొక బ్రహ్మవేత్తని పంపించా డతను. "నీకూ తురికోసం నాకూతుర్ని మోసంచేశావు. అందుకు తగినఫలం అనుభ విస్తా విప్పుడు" అని చెప్పించా డాబ్రాహ్మడిచేత.

ద్రుపదు డా బ్రాహ్మణ్ణి చాలా ఆదరించాడు. అర్ఘ్యపాద్యా లిచ్చాడు. ఆవు నిచ్చాడు. మధుపర్కమున్నూ యిచ్చాడు. శిఖండి చేత చేయించా డత నిదంతా; కాని ఆబ్రాహ్మ డవన్నీ తిరస్కరించే శాడు. "నేనిందుకోసం రాలే" దన్నా డతను. తన రాజు చెప్పమన్న దంతా చెప్పేశాడు నిర్లక్ష్యంగా. మంత్రులు విన్నా రీమాటలు. దానికి ద్రుపదుడు క్షమాపణ చెప్పుకున్నాడు. "బ్రాహ్మణోత్తమా నువ్వు వెళ్ళిపో. నాదూత వచ్చి నీరాజుతో మాట్లాడతా" డన్నాడు.

తరవాత, వేదవేదాంగవేత్త అయిన వొక బ్రాహ్మణ్ణి హిరణ్యవర్మ దగ్గిరికి పంపేశాడు కూడా అప్పటి కప్పుడే.

"రాజా, వచ్చి పరీక్ష చేసుకో" అన్నాడు ద్రుపదుని దూత హిరణ్యవర్మదగ్గిరికి వెళ్లి, "ఎవడో నీకబద్ధాలు చెప్పాడు. ఆమాట పట్టుకూర్చోడం ధర్మం కాదు నీకు." అంటూ చాలా దూరం చెప్పాడు. దానిమీద హిరణ్యవర్మ చక్కనిచుక్కలను పంపించాడదేమిటో చూసిరమ్మని. చాలా ప్రతిభావంతురాళ్లా స్త్రీలు. అనేకవిధాల పరీక్షచేశారు శిఖండిని. చివరికి పురుషుడే అని తృప్తిపడి వెళ్లిపోయారు.

వాళ్లు వెళ్లి చెప్పగా తానున్నూ తృప్తిపడి ద్రుపదుని యింటికి వచ్చాడు హిరణ్యవర్మ. అందరూ సంతోషించారు. ద్రుపదుడు వియ్యాంకునకు సకలగౌరవాలూ చేశాడు. హిరణ్యవర్మ అల్లుడు శిఖండికి లెక్కలేనంత డబ్బూ, రత్నాలూ, రత్నాభరణాలూ, ఆవులూ, గుర్రాలూ, ఏనుగులూ, రథాలూ యిచ్చాడు. చక్కనిచుక్కలైన దాసీలను కూడా ఎందరినో యిచ్చాడు. తాను సంతోషించడమే కాదు, కూతుర్ని చాలా చీవాట్లుపెట్టి తన పట్నానికి వెళ్లిపోయాడు. శిఖండి చాలా ఆనందించాడిదంతా యిలా జరిగినందుకు.

ఇక్కడ యిదిలా జరుగుతుండగా, అక్కడ, కుబేరుడు చక్కా వచ్చాడు స్థూణాకర్ణుడున్న అడవికి. లోకాలన్నీ తిరుగుతూ వచ్చాడక్కడికి. ఆకాశంనుంచే చూశాడతను స్థూణాకర్ణుని మేడచక్కదనం. జెండాలతోనూ, మణిరత్నమాలికలతోనూ, వితానాలతోనూ, చాలా రమ్యంగా వుందది. లాజలు చల్లారక్కడ. ధూపాలు వేశారు. భక్ష్యాలూ భోజ్యాలూ సమృద్ధిగా వున్నా యాభవనంలో.

భృత్యులే కాని స్థూణాకర్ణుడు కనపడలేదు కుబేరునకు. "ఏ" మనడి గాడు వాళ్లనతను. "నేను వచ్చానని తెలిసివుండిన్నీ నాయెదటికి రావడంలేదు వాడు. కనక, కఠినంగా శిక్షించవలసివుంటుంది" అన్నా

డతను. “ ప్రభూ ” అంటూ వినయవిధేయులైనారు భృత్యులు. “ ద్రుప దునకు శిఖండిని అని వొక కూతురు. ఒక కారణంవల్ల స్థూణాకర్ణుడు, తన పురుషత్వం ఆమె కిచ్చి, ఆమె స్త్రీత్వం తాన స్వీకరించాడు. ఈవిధంగా అత నాడ దయి వున్నా డిప్పుడు. మరేమీ లేదు, సిగ్గుపడి పోయి నీయెదటికి రాలేకుండా వున్నా, డంతే” అని చెప్పారు వాళ్లు.

“ వాణ్ణిలా తీసుకురం “ డన్నాడు కుబేరుడు. స్థూణాకర్ణుణ్ణి చూశా టప్పటికి చాలా కోపంవచ్చింది కుబేరునకు. “ఆడదానివై నువ్విలాగే వుండిపో” అని శపించేశాడు వెంటనే అతను. “ఇది యక్షుల కందరికీ అవమానకరం. నీపురుషత్వం ఆమె కిచ్చి, ఆమె స్త్రీత్వం నువ్వు స్వీక రించవలసిన అగత్యం యేమి వచ్చిందీ నీకు? లోకంలో యెవరూ యిలాంటి పని చెయ్యరు. కనక, నువ్వు స్త్రీవయివుండిపో ” అన్నా డతను, చాలా దృఢంగా.

దాని కక్కడ వుండిన యక్షు లందరూ చాలా దుఃఖించారు. “ప్రభూ, పొరపాటు జరిగింది. దయవుంచి స్థూణాకర్ణునకు శాపాంతం సెలవియ్యి ” అని ప్రార్థించారు వారు. కుబేరునకు దయవచ్చింది. “సరే, శిఖండి బతికివుండినంతకాలమూ స్త్రీ అయివుండి, తరవాత, వీడు, పురుషు డవుతాడు. కనక, ఇక విచారించవ ద్దని చెప్పండి ” అన్నాడు. తన అనుచరుల నందరినీ వెంటబెట్టుకుని విమానం యెక్కి వెళ్లిన్నీ పోయా డతడు.

తరవాత, శిఖండి వచ్చా డక్కడికి. “ అన్నప్రకారం నేనిదిగో వచ్చా ” నన్నా డతను. “ చాలా సంతోషం ” అన్నాడు స్థూణా కర్ణుడు. శిఖండి అన్నమాట జరిపినందుకు చాలా మెచ్చుకున్నా డతను. జరిగిందిన్నీ అంతా చెప్పాడు. “ నీమూలాన కుబేరుడు నన్ను శపిం చాడు. ఇప్పటికి వెళ్లిపో. యథేచ్ఛగా వుండు. నాకిది పురాకృతం. తప్పించుకోడం సాధ్యంకాదిది ” అనిన్నీ చెప్పా డతను.

శిఖండి పరమానందపడిపోయాడు. ఇంటికి వచ్చి దేవతలనూ బ్రాహ్మ లనూ బాగా పూజించా డానందంకొద్దీ. కొడుకుతోపాటు ద్రుపదుడూ, పట్టమహిషీ, వారితోపాటు బంధువులూ చాలా సంతోషించారు. ద్రుపదుడు, అప్పుడు పంపించాడు శిఖండిని ద్రోణుని దగ్గిరికి. యుద్ధవిద్య సాంతం నేర్చుకోడానికే పంపాడు, శాశ్వతంగా కొడుకయిపోయాడు కనక. శ్రద్ధగా అభ్యసించి శిఖండి ధనుర్వేదం నాలుగుపాదాలూ నేర్చుకున్నాడు. ధృష్టద్యుమ్నునితోనూ మిగిలిన అన్నదమ్ములందరితోనూ కలిసే నేర్చుకున్నా డతను, నీకిది తెలిసిందే.

ఇలాగ మొదట ఆడదై తరవాత పురుషు డయినాడు శిఖండి. కాశిపతి పెద్దకూతురు అంబే యిలా శిఖండి అయినాడు. వాడు నన్ను కొట్టడానికి వచ్చినా, కొట్టినా నేనేమీ చెయ్యను వాణ్ణి. చూడనే చూడ నసలు వాణ్ణి. నాకిది దృఢమైన వ్రతం. లోకాని కంతకూ తెలుసు ఇది. స్త్రీనీ, స్త్రీఅయి పుట్టి తరవాత పురుషుడైనవాణ్ణీ, స్త్రీల పేరు పెట్టుకున్నవాణ్ణీ, స్త్రీరూపినీ నేను చూడను. బాణమున్నా వెయ్యను. ఈకారణంవల్ల శిఖండిని సంహారించ న్నేను. శిఖండి సంగతి అంతా నాకు బాగా తెలుసు. నేను వాణ్ణి చంపినట్టయితే "భీష్ము డాడదాన్ని చంపా" డని లోకం నన్ను దుయ్యబట్టుకుంటుంది మరి" అని వివరా లన్నీ చెప్పాడు భీష్ముడు. దుర్యోధను డొక్క—క్షణం ఆలో చించి "భీష్ముని వ్రతం ధర్మబద్ధమే'' అనుకున్నాడు.

## 193

### "ఎన్నాళ్లపడుతుందంటారు?"

ఆరాత్రి గడిచింది. తెల్లవారింది. సర్వసైన్యాలకూ మధ్యగా వున్నారు పెద్ద లందరూ. "తాతా" అంటూ భీష్ముని దగ్గిరికి వచ్చాడు దుర్యోధనుడు.

"పాండవుల సైన్యం చూస్తున్నావు నువ్వు. ఏనుగులూ, గుర్రాలూ, రథాలూ, కాలిబలాలూ — వీటితో బాగా సంపన్నం అయివుం దది. భీముడూ, అర్జునుడూ, ధృష్టద్యుమ్నుడూ — ఇంకా యిలాంటివారూ నడుపుతున్నా రది. గొప్పవిలుకాళ్లు వారు. గొప్పపరాక్రమవంతులు. లోకపాలకులకే సాటివస్తారు వారు. ఆసైన్యం చెనకా లంటే కష్టం లోనే లెక్క. మహాసముద్రంలా వుందది. దాన్ని అడ్డుకోడమూ కష్టమే. దేవతలున్నూ ఏమీ చెయ్యలే రన్నట్టుం దది. ఆసైన్యం అంతా నువ్వెన్నాళ్లలో నాశనం చేస్తావూ? ద్రోణుడూ, కృపుడూ, కర్ణుడూ, అశ్వత్థామా — వీరున్నూ ఎన్నాళ్లలోఅదంతా నాశనం చెయ్యగలుగుతారూ? మీరందరూ సామాన్యులు కారు. దివ్యాస్త్రాలన్నీ తెలుసు మీకు. ఈసంగతి తెలుసుకోవాలని వుందయ్యా నాకు" అనడిగా డతను.

"నీకు తగిన జిజ్ఞాస యిది" అన్నాడు భీష్ముడు మెప్పుగా. "ఏమంటావా? శత్రువుల బలాబలాలు నీవంటివాడు తప్పకుండా తెలుసుకోవాలి. మరి, నాశస్త్రశక్తీ భుజబలమూ చెబుతా నిను. ఎదటివారు ఋజుమార్గాన యుద్ధం చేస్తే తానూ అలాగే చెయ్యాలి. ఎదటివాడు మాయలుపన్నుతూ యుద్ధంచేస్తే తానూ అలాగే చెయ్యాలి. ధర్మపద్ధతి యిది. పదివేలమంది యోధులూ, వెయ్యిమంది రథికులూ— ఇదొక భాగం అనుకో. నేను దినాని కొకభాగం సంహరిస్తా నిలాంటిది. మధ్యాహ్నానికే పూర్తిచేస్తా నాపని. పాండవుల సైన్యం అంతా నేనిలాగే నాశనంచేస్తాను. గొప్పగొప్ప అస్త్రాలు ప్రయోగించవలసి వుంటుంది. అయినా, ఒక్క నెలకి గాని పూర్తిచెయ్యలే నిది" అని నిక్కచ్చిగా చెప్పా డతను.

"నేను ముసలివా ణ్ణయిపోయా" నన్నాడు ద్రోణుడు. "నాబలం బాగా వుడిగింది. నానరాల్లో పటుత్వమున్నూ తగ్గింది. అయినా పాం

డవసైన్యం అంతా భీష్ముణిలాగే నేనూ వొక్కనెలలో కడతేర్చేస్తాను" అన్నా డతను. "నాశక్తీ, బలమూ ఇంతే" అని కూడా అన్నా డతను. "నాకు రెండుమాసాలు పడుతుం" దన్నాడు కృపాచార్యుడు. "పదిదినాల్లో నాశనం చేసేస్తా" నన్నా డశ్వత్థామ. మహాస్త్రాలెన్నో తెలిసివున్న కర్ణుడు "అయిదోరాత్రి గడవనివ్వ" నన్నాడు.

పకా ల్మన్నాడు భీష్ము డది విని. "కర్ణా, బాణాలూ శంఖమూ గాండీవమూ ధరించి, కృష్ణుణ్ణి సాయంచేసుకుని అర్జునుడు యుద్ధరంగానికి వచ్చేదాకా నువ్వేమయినా అనుకుంటావు. ఏమిటేమిటో కోతలున్నా కోస్తావు, యథేచ్ఛగా" అన్నాడు నవ్వుతూనే.

## 194

## "మనకెన్నాళ్లు పడుతుందీ!"

చారుల మూలంగా యిదంతా తెలుసుకున్నాడు ధర్మరాజు. ఈసంగతి తమ్ములకు చెప్పి "కౌరవసైన్యం అంతా సంహరించడానికి మనకెన్నాళ్లుపడుతుందీ?" అనడిగాడు రహస్యంగా, అర్జునుణ్ణి. ఒక్కమాటు కృష్ణునికేసి చూసి అందుకున్నా డర్జునుడు.

"రాజేంద్రా, మన యోధు లందరూ మహాత్ములు. అస్త్రవిద్య క్షుణ్ణంగా నేర్చినవారు. చిత్రయుద్ధాలు చెయ్యడంలో కూడా చాలా నిపుణులు. వీరే సంహరించేస్తారు కౌరవసైన్యం అంతా, నువ్వేమీ బెంగపెట్టుకోనక్కరలేదు. సత్యం చెబుతున్నాను. కృష్ణుని సాయంతో నేనొక్కణ్ణే వెళ్లి నిమిషంలో నాశనం చేసేస్తా నంతా. అంతా అంటే, స్థావరజంగమాత్మకా లైన లోకా లన్నీని, కౌరవసైన్యం మాత్రమే కాదు. శాంభరీభిల్లుడై వచ్చి మెచ్చి మహేశ్వరు డిచ్చిన పాశుపతాస్త్రం వుంది నాదగ్గిర. ప్రళయకాలంలో దాంతోనే నాశనంచేస్తాడు లోకా లన్నీ అతను. భీష్ము డది యెరగడు. ద్రోణున కది తెలియదు

కృపుడూ అశ్వత్థామా కూడా యెరగరంటే కర్ణుని మాట చెప్పే దేంవుందీ?

దివ్యాస్త్రాలు పుచ్చుకుని, యుద్ధంలో, వొక్కొక్కణ్ణే యేరి సంహారించడం మంచిది కాదు. ఋజుమార్గం తోక్కే జయిద్దాం మనం శత్రువులను. మన కీవిషయమై యెందరిదో కూడా వుంది సాయం. వీరందరూ దివ్యాస్త్రాలన్నీ బాగా తెలిసినవారు. అందరూ కూడా యుద్ధంచెయ్యా లనే ఆత్రంగా వున్నారు. అందరూ యజ్ఞావభృథ స్నాతులు. అందరూ పరాజయం అంటే యేమిటో యెరగనివారు. నువ్వా నేనా అని ఢీకుని దేవతలనుకూడా జయించగలవారు. శిఖండీ, యుయుధానుడూ, ధృష్టద్యుమ్నుడూ, భీమసేనుడూ, నకులసహదేవులూ, యుధామన్యుడూ, ఉత్తమౌజుడూ, విరటుడూ, ద్రుపదుడూ, శంఖుడూ, ఘటోత్కచుడూ, అంజనపర్వుడూ, సాత్యకీ, అభిమన్యుడూ, ద్రౌపదేయు లయిదుగురూ — వీరందరూ ముల్లోకాలూ నలిపి పారెయ్యగలవారు. నీమట్టుకి నువ్వుమాత్రం సామాన్యుడవా, కళ్లెర్రజేసి చూస్తేనే చాలు నువ్వు. అవతలివాడు భస్మం అయిపోతారుకుంటాడు" అని చెప్పాడు.

## 195

### అటు కౌరవులు

తెల్లవారింది. "బయలుదేరా" లన్నాడు దుర్యోధనుడు. అందరూ స్నానాలు చేశారు. తెల్లనిబట్టలు కట్టుకున్నారు. పూలదండలు వేసుకున్నారు. ఆయుధాలూ, జెండాలూ పుచ్చుకున్నారు. స్వస్తివాచనం చేయించుకున్నారు. హోమాలు చేసుకున్నారు. వారందరూ బ్రహ్మవేత్తలు. శూరులు. సుచరిత్రులు. అందరూ యుద్ధమేకోరి వచ్చారు. అందరూ యుద్ధరహస్యా లన్నీ బాగా తెలిసినవారు. యుద్ధంచేసి పరలోకాలు సాధించుకుందా మని వున్నా రందరూ. అందరికీ యుద్ధం

మీ దే వుంది చూపు. ఒకరియెడల వొకరు చాలా శ్రద్ధచూపించుకుంటున్నారు, వారిలో వారు.

ద్రోణుణ్ణి అనుసరించి విందానువిందులూ కేకయులూ ముందు నడిచారు. అశ్వత్థామా, భీష్ముడూ, సైంధవుడూ, దక్షిణదేశరాజులూ, ఉత్తరదేశరాజులూ, పడమటి రాజులూ, పార్వతీయరాజులూ, శకునీ, శకులూ, కిరాతులూ, యవనులూ, శిబులూ వసాతులూ, తమతమ సేనలు వెంటబెట్టుకుని తరవాత బయలుదేరారు మహారథుని వెంట. రెండో జట్టిది.

కృతవర్మా, త్రిగర్తులూ, శలుడూ, భూరిశ్రవుడూ, శల్యుడూ, బృహద్రథుడూ దుశ్శాసనాదిసోదరులు తోంబై తొమ్మండుగురూ – వీరందరూ మూడో జట్టుగా బయలుదేరారు దుర్యోధనుని వెంట.

అందరూ కలిసి, చివరికి, కురుక్షేత్రాన పడమటిభాగాన దిగారు. దుర్యోధనుడు శ్రద్ధపట్టి హస్తినాపురమే అన్నట్టు సిద్ధంచేయించాడాశిబిరం. ఎంతటి నిపుణులూ కూడా, అది హస్తినాపురమా సైనిక శిబిరమా గుర్తించలేకపోయారు.

రాజుల కందరికీ ఏర్పాటయిన గుడారాలన్నీ వొకటే రకంగా వున్నాయి. వందలూ వేలూ వున్నాయలాంటివి. యుద్ధరంగంకోసం అయిదామడల స్థలం విడిచిపెట్టి దానికి పడమటగా విడిదిచేశాడు దుర్యోధనుడు. రాజు లందరూ తమ పరివారంతో ఆశిబిరాలు ప్రవేశించారు.

వారికీ వారి సైనికులకూ గూడా అన్నపానాల విషయమై చాలా గొప్పయేర్పాట్లు చేయించాడు దుర్యోధనుడు. ఏనుగులకూ, గుర్రాలకూ, కాల్బంట్లకూ, శిల్పులకూ, వారి పనివాళ్లకూ, సూతులకూ, వందులకూ, మాగధులకూ – అందరి పరివారాలకూ, వర్తకులకూ, వేశ్యలకూ, చారులకూ, యుద్ధంచూడ్డానికి వచ్చినవారికీ – అందరికీ,

చాలా గొప్పగా, వొక్కటే విధంగా, బహూఆదర గౌరవాలతో యీయేర్పాట్లన్నీ చేయించా డతను.

## 196

### ఇటు పాండవులు

అక్కడ, ధర్మనందనుడున్నూ ధృష్టద్యుమ్నాదులను తొందరపెట్టాడు. ధృష్టకేతుని కూడా తొందరపెట్టా డతను. విరటరాజూ, ద్రుపదుడూ, యుయుధానుడూ, శిఖండీ, యుధామన్యుడూ, ఉత్తమౌజుడూ — వీరందరూ చిత్రవిచిత్రాలైన కవచాలు తొడుక్కునీ రత్నాలు తాపిన కుండలాలు పెట్టుకునీ నెయ్యిపోసిన అగ్నిలాగా, ఆకాశాన గ్రహాల్లాగా తేజరిల్లుతూ సిద్ధం అయినారు.

తరవాత సైనికుల నందరినీ బాగా ఆదరించి బయలుదేరడాని కనుజ్ఞ యిచ్చా డతను. వారికీ వారి అనుచరులకూ గుర్రాలకూ, ఏనుగులకూ, కాల్బంట్లకూ, శిల్పులకూ భక్ష్యభోజ్యాల కేలాంటి లోటూ రాకుండా చక్కని కట్టుదిట్టాలు చేయించాడు. అభిమన్యుణ్ణీ, ద్రౌపదేయులనూ, ధృష్టద్యుమ్నుని వెంట మొదటి జట్టుగా పంపించాడు. భీముడూ, యుయుధానుడూ, అర్జునుడూ — ఇది రెండో జట్టు.

యుద్ధసామగ్రి బళ్లకెక్కిస్తూ భృత్యులూ, అలాగా యిలాగా తిరుగుతూ పరిగెత్తుతూ వొకరినొకరు పిలుచుకుంటూ — ఈవిధంగా బయలుదేరిన ధ్వని ఆకాశం ముఖరితం చేసింది.

విరటుణ్ణీ, ద్రుపదుణ్ణీ, మరికొందరు రాజులనూ వెంటబెట్టుకుని తరవాత బయలుదేరాడు ధర్మనందనుడు. గొప్పగొప్ప యోధులతో నిండి ధృష్టద్యుమ్నుని చేతికింద నడుస్తున్న ఆసేన గట్టూరుసుకుంటూ ప్రవహించే గంగానదిలా వుంది. తరవాత మరికొందరు యోధులను బయలుదేరదీశా డతను, కౌరవుల చూపు చెదిరిపోయేటట్టు.

పదివేలగుర్రాలూ, రెండువేల యేనుగులూ, లెక్కలేనంతమంది కాల్బంట్లూ అయిదువందల రథాలూ వున్న సేన యిచ్చి ద్రౌపది కొడుకులనూ, అభిమన్యుణ్ణీ, నకులుణ్ణీ, సహదేవుణ్ణీ, ప్రభద్రకుల నందరినీ, భీమసేనుణ్ణీ ముందు పంపాడు. విరటుణ్ణీ జయత్సేనుణ్ణీ, యుధామన్యుణ్ణీ, ఉత్తమౌజుణ్ణీ, కృష్ణుణ్ణీ, అర్జునుణ్ణీ మధ్యగా నడిపించాడు. వారికి ముందూ వెనకా యిరవై వేలగుర్రాలూ, అయిదువేల యేనుగులూ, ఎన్నో రథాలూ, ఎందరో కాల్బంట్లూ బయలుదేరారు.

ధర్మనందను డున్నచోటే వున్నారు తక్కిన రాజు లందరూ. వేల కొద్దీ యేనుగులూ, లక్షలకొద్దీ గుర్రాలూ, రథాలూ, కాల్బంట్లూ వెంటబెట్టుకుని చేకితానుడు నడిచాడు తరవాత. అతని తరవాత సాత్యకి వున్నాడు. లక్షల రథాలు నడిచా యతని వెంట. క్షత్రదేవుడూ, బ్రహ్మదేవుడూ వెనకభాగం కాపాడుకుంటూ నడిచారు. యుద్ధసామగ్రితో నిండిన బళ్లూ, వర్తకుల సామగ్రితో నిండిన బళ్లూ, వేశ్యాస్త్రీలున్న బళ్లూ, యుద్ధంలో వుపయోగించే వాహనాలూ, పిల్లలూ, స్త్రీలూ, బొక్కసమూ, ఆహారసామగ్రీ యేనుగులమీద పంపించాడు తరవాత.

అతని వెనక, సత్యధృతీ, సౌచిత్తీ, శ్రేణిమంతుడూ, వసుదానుడూ నడిచారు. ఇరవై వేల రథాలూ, పదికోట్ల గుర్రాలూ, ఇరవై వేల యేనుగులూ తీసుకువెళ్లారు వారు. ఎన్నో యేనుగులు వర్షాకాలపుమేఘాల్లాగా, నడగొండల్లాగా తరవాత బయలుదేరాయి.

ఆసేనలో వేలకొద్దీ వున్నాయి భేరీలు. లెక్కలేనన్ని శంఖాలున్నాయి. అవి మోగించుకుంటూ నడిచా రెందరో. ఇలాంటి అపార సేనతో దుర్యోధనునిమీదికి దండెత్తి బయలుదేరాడు, ధర్మనందనుడు.

---